





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# నాటికా పంచ వింశతి





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061688

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నాటికా పంచవింశతి

సంపాదకుడు

డా॥ కొర్రపాటి గంగాధరరావు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు



# తొలి పలుకులు

పాఠకుడులేని పుస్తకం అన్నా, ప్రేక్షకుడు లేని నాటకం అన్నా, చంద్రుడు లేని వెన్నెల అన్నా, ఒక్కటే. సాహిత్య ప్రక్రియగా రూపకం అత్యున్నత స్థానాన్ని సంపాదించుకున్నది. నాటకం, ప్రహసనం, నాటిక, యక్షగానం, ఇంకా మరిందెన్నో రూపాలలో రూపకం అవతరించింది.' విభిన్న అభిరుచులు కల్గిన ప్రజలకు ఆదరపాత్రమైనది. ఇతర సాహిత్య ప్రక్రియలవలెకాక,' రూపకానికి, నాణెమునకున్నట్లు రెండువైపులున్నవి. ఒకటి సాహిత్యం,, రెండవది ప్రయోగం (ప్రదర్శనం). రూపకమర్యాదలు అధ్యయన పరులకు ఎంత ఆవశ్యకములో సామాజికులకు అంటే ప్రేక్షకులకు అంతే ఆనంద దాయకములు. రూపకం సమాహార కళ. సంగీతం, సాహిత్యం, శిల్పం, చిత్రలేఖనం, నాట్యం, ఇత్యాదికళలన్నీ రూపకనిర్మాణంలో పాలుపంచుకుంటాయి.

అధ్యయనానికీ ప్రయోగానికీ ఉపయోగపడాలనే ఉద్దేశ్యంతో సాహిత్య అకాడమి ఆంధ్ర నాటకకళాపరిషత్తు బహుమతినందుకున్న 25 నాటికలను ఏరుకొని వాటిని ఒక సంపుటిగా మలచి అందిస్తున్నది. ఈ నాటికల్లో సాహితీదృష్టితో ఎంపిక చేసినవి కొన్ని ఉన్నవి; మరికొన్ని నటనావైదుష్యంతో సహృదయులను అలరించినవి కొన్ని ఉన్నవి. 1947 మొదలుకొని 1979 వరకు ఆంధ్ర నాటక కళా పరిషత్తులో, సర్వోత్తమంగా ప్రయోగింపబడిన నాటికలను శ్రీ కొర్రపాటి గంగాధరరావుగారు సేకరించి చక్కని పీఠికను సమకూర్చి, నాటికా రచయితలను పరిచయము చేసి "నాటికా పంచవింశతి"గా తీర్చిదిద్దినారు. శ్రీ గంగాధర రావుగారు నాటికా రచయితలే కాక రూపక ప్రయోగదక్షులుకూడ. ఎందరో మనీషుల నాటికలు ఈ సంపుటిలో ఉన్నవి. ఆ రచయితల సౌజన్యానికి పాండిత్యానికి అభివందనములు. ఈ సంపుటిని సిద్ధంచేసిన శ్రీ కొర్రపాటి గంగాధర రావుగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నాను.

హైదరాబాదు
తేది 1-1-1982

ఇరివెంటి. కృష్ణమూర్తి
కార్యదర్శి

## 'నాటికా పంచవింశతి'

# విషయ సూచిక

సుల్తానీ

# ఈ సంకలనాన్ని గూర్చి

ఈ సంకలనంలో, ఆంధ్ర నాటక కళా పరిషత్ నిర్వహించిన పోటీలలో రచనకూ ప్రదర్శనకూ బహుమతులందిన నాటికలను మాత్రమే చేర్చగలిగాను. వాటిలోనూ లభ్యమైనవి మాత్రమే, అనుమతి సందినవి మాత్రమే చేర్చటం జరిగింది.

1965 తరువాత నాటక కళా పరిషత్ సభలు ఎక్కువగా జరగలేదు. అందువల్ల తదనంతరం ప్రసిద్ధికి వచ్చిన రచనలు కొన్నింటిని [పరిషత్ పోటీలలో పాల్గొనకపోవటం వల్ల] ఈ సంకలనంలో చేర్చటానికి వీలుకాలేదు. నిజానికి నాటక కళా పరిషత్ పోటీలలో పాల్గొనకపోయినా ఆ తరువాత కాలంలో చాలా మంచి రచనలు వెలువడినాయి. ప్రదర్శనలో అత్యుత్తమంగా పరిగణించబడినాయి కూడా. ముందు ముందు అవి వేరే సంకలనంగా ఆశిద్దాం.

అయితే—ఆంధ్రదేశంలో నాటికారచన ప్రారంభ దశలోనే, తెలుగు నాటికా రచయితలు రకరకాల ప్రయోగాలు చేశారని, ఈ సంపుటిలో నాటికలను చూచినప్పుడు ఒప్పుకోక తప్పదు. "ఎవరు దొంగ"—"దిష్టి బొమ్మలు"—"ప్రార్థన"—"కళ్ళు" మొదలైనవి ఎన్నో ఇందుకు ఉదాహరణలు.

నిజానికి రచన + ప్రదర్శనకు కాక, వేరు వేరు బహుమతులందిన నాటికలుకూడా ఇదే కాలంలో వచ్చాయి. వాటిలో పరిగణించదగినవి కూడా ఉన్నాయి. కాని —

కొన్ని నాటికల విషయంలో- "వీటికానాడు బహుమతి ఎట్లా వచ్చిందా?" అన్న సందేహం రావచ్చునేమో! కాని ఆ విషయంలో చెప్పదగ్గది ఒక్కటే ఉన్నది. కొన్ని రచనలు చదవటానికి పేలవంగా ఉండవచ్చు. కొన్ని రచనలు చదవటానికీ ప్రదర్శనకూ బాగుండవచ్చు. కాని అసలు సిసలైన నాటకాలు లేక నాటికలు చదివినప్పుడెల్లా ఉన్నా, ప్రదర్శన సమయంలో నటుల సమర్థత వల్ల

'రభస'గా ప్రవర్తించే ప్రదర్శకులు. కాని పరిషత్ ప్రదర్శనలు మాత్రం-తమ శక్తి సామర్థ్యాల ప్రదర్శనగా రక్తిగట్టేవని మాత్రం చెప్పక తప్పదు. సభలు మాత్రం నిష్ప్రయోజనంగానే వుండేవి.

1948లో పరిషత్ ప్రదర్శనలలో ఒక కొత్తమలుపు వచ్చింది. అప్పటి నుంచీ పరిషత్ సభలు ఔత్సాహిక నటవర్గాలను ప్రోత్సహించటానికీ, తద్వారా నాటకరంగాన్ని తీర్చిదిద్దటానికీ కృషి చేయ నారంభించాయి. పెద్దలు, పూజ్యులు శ్రీ రాజా రంగయ్యప్పారావుగారి అధ్యక్షతన, శ్రీ కాజ వెంకట్రామయ్యగారూ, శ్రీ యర్రోజు మాధవాచార్యులుగారూ, శ్రీ దుక్కిపాటి మధుసూదనరావుగారూ, ప్రసాదరావుగారూ, పసల సూర్యచంద్రరావుగారు లాంటి ప్రసిద్ధులూ, సమర్థులూ పూనుకున్నారు. ఆంధ్ర నాటక కళాపరిషత్‌ను ప్రజాస్వామ్య పద్ధతిలో నడిపారు. ఒక నిబంధనావళి ఏర్పడింది. సభ్యత్వం ఏర్పడింది. అధ్యక్షులు ఎన్నుకున్న కార్యవర్గం ఏర్పడింది. ముఖ్యంగా పోటీలు నడిపే విధానం రూపు దిద్దుకుంది.

ఒక్కొక్క సంవత్సరం—ఒక్కొక్క ఊళ్ళో-పరిషత్ సభలు జరిగేవి. ఇతర సన్మానాది కార్యక్రమాలతో బాటు - పోటీలు జరిగేవి. ఏ ఊరివారు ఆహ్వానిస్తే-ఆ వూరిలో పోటీలు జరగటంవల్ల, ఔత్సాహికులకు తమ స్వంత వూరిలోనే కాకుండా—పలు ప్రాంతాలలో తమ నైపుణ్యం ప్రదర్శించటానికి 'మంచి వేదిక' ఏర్పడింది. స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించవలెనన్న నిబంధనవల్ల-స్త్రీలు కొందరన్నా - ఇదొక వృత్తి చేసుకున్నారు. ప్రదర్శనా యోగ్యమైన నాటకాలను రచయితలు రాయ నారంభించారు. వెలుగులోకి వచ్చారు. రంగాలంకరణ పద్ధతులు మారిపోయాయి. మంచి రంగస్థల సౌకర్యాలేవీ లేని ఆంధ్ర దేశంలో, మంచి 'టీం' వర్కుతో—చక్కని రిహార్సల్సుతో— శాస్త్రీయమైన పద్ధతులలో ప్రదర్శన లివ్వసాగారు. ఇంకా తృప్తికరమైన అభివృద్ధి లేదంటే అది ఔత్సాహికుల తప్పుగాదు. నాటక ప్రదర్శనకు కావాల్సిన అన్ని హంగులూ గల 'హాలులు' ఆంధ్ర దేశంలోనే లేవు. అటువంటి హాలులూ, తెరలూ లైటింగ్ పరికరాలు కూడా ఔత్సాహికులే ఏర్పరుచుకోవాలనటం వారి తాహత్తుకు మించిన గొంతెమ్మ కోరిక.

ఆంధ్ర నాటక కళాపరిషత్ ప్రారంభించటానికి పూర్వమే మనదేశంలో పోటీలుండేవి. కాని ఈ పద్ధతినగాదు. ఒకే నాటకాన్ని పోటీకి పెట్టేవారు. దాని లోనే ఒకరికి బహుమతు లిచ్చేవారు. ఏ సమాజానికా సమాజం—తమకు నచ్చిన నాటకాన్ని ప్రదర్శించవచ్చునన్న పద్ధతి ప్రవేశపెట్టినవారు-1931లో- సర్వేపల్లి రాధాకృష్ణ—విక్రమదేవ్ మొదలగు వారట.

మొత్తం మీద పరిషత్ పోటీలు నిర్వహించటం వల్ల, ఔత్సాహిక నాటక రంగం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లిందనటం నిర్వివాదాంశం. ఈ ఒక్క దశాబ్దంలో సాధించిన అభివృద్ధినే సాధించటానికి—ఇతర దేశాంలో దశాబ్దాలూ, శతాబ్దాలూ పట్టింది. ఇది గర్వించదగినదే. అయినా - సరియైన 'న్యాయనిర్ణయ పద్ధతి' ఇంతవరకూ ఏర్పడలేదు. పెద్దలూ అనుభవజ్ఞులూ అయిన శ్రీ కీ॥శే॥ మాధవపెద్ది మొదలైన వారు - న్యాయనిర్ణేతలుగా వుండగా ఏ పేచీలు వచ్చేవికావు. అటువంటి వారు లోపించిన కొద్దీ, ఔత్సాహికుల్లో అశాంతి ఏర్పడింది. పేచీలు ఎక్కువయినాయి. నిర్వాహకులలో గూడా నిరుత్సాహం ఏర్పడింది.

మొత్తం మీద పోటీలను ప్రవేశ పెట్టింది ఆంధ్ర నాటక కళా పరిషత్తు- దానికొక విధానం ఏర్పరచింది పరిషత్తు. ఇతరత్రా అనేక పోటీల నిర్వాహకులకు మార్గం చూపింది పరిషత్తు. నేడు ఆంధ్రదేశంలో నాటక కళాభివృద్ధి కంతటికీ మాతృ సంస్థ పరిషత్తే.

ఆంధ్ర నాటక కళా పరిషత్ నాటక పోటీలు ప్రారంభించిన దశనుండే 'నాటికల పోటీలు' కూడా ప్రారంభించినదనుకుంటాను. పరిషత్‌కు ఒక ఆఫీసంటూ లేకపోవటం వల్ల సరియైన రికార్డు లేకుండా పోయింది. లభ్యమయినంత వరకే ఈ సంకలనంలో సేకరించటం జరిగింది. పరిషత్ సభలు ప్రతి సంవత్సరం తప్పకుండా జరగలేదు. అయినా, అధికారికమైన రికార్డు దొరకకపోయినా, సాధ్యమైనంతలో - ఈ సంకలనం చేశాను. క్షంతవ్యుణ్ణి.

ఆంధ్ర నాటక కళా పరిషత్ పోటీలు నిర్వహించటం ప్రారంభించింది- 1944 లో. అంటే ఈనాటికి (1981 నాటికి) 37 వార్షికోత్సవాలు జరిగి

వుండాలి. కాని ప్రతి సంవత్సరమూ పోటీలు జరగక పోవటంవల్ల, ఇప్పటికి 25 పరిషత్ పోటీలే జరిగాయి. ఈ ఇరవై అయిదు సంవత్సరాలలో గెలుపొందిన నాటికల 'లిస్టు' కూడా సమగ్రంగా, అధికార పూర్వకంగా దొరకలేదు. ఎకాడమీ వారు ఈ సంకలనంలో 25 నాటికల వరకే ప్రచురించ తలపెట్టారు. కనక రచనా-ప్రదర్శనలకు బహుమతి నందిన వాటినే ఇందులో చేర్చగలుగుతున్నాను. ఇందులో కూడా కొన్ని ముద్రణ కాలేదు. అయినవన్నీ కూడా సేకరించటం కష్టమయింది. ఒకటి రెండు పోటీలలో ఏది గెలుపొందిన నాటికో భోగట్టాకూడా ఎక్కడా దొరకలేదు. ఉదాహరణకు 1944 తర్వాత ఏ సంవత్సరం ఏ ఊరిలో-తమ నాటికకు బహుమతి లభించిందో రచయితలు గూడా, తమ అచ్చయిన పుస్తకాలలో ఉదాహరించలేదు. "సుల్తానీ", "చరమాంకం" మొదలైవి కొన్ని-అచ్చు కాలేదనే తెలిసింది. పోనీ వ్రాత ప్రతుల కోసం ప్రయత్నిస్తే- అవి దొరకగలిగిన వారి ఎడ్రస్సులు తెలియటం కష్టమయింది. కనక ఈ సంకలనం అసమగ్రంగా వుండక తప్పలేదు.

దాదాపు పది పన్నెండు సంవత్సరాలుగా పరిషత్ వార్షికోత్సవాలు ప్రతి ఏటా జరగటం లేదు. కాని 10-12 ఏళ్ళల్లో రచించబడిన చక్కని నాటికలు అనేకం వున్నాయి. పరిషత్‌లు జరిగి వుంటే - ఇవి పోటీలకు వెళ్ళేవే. విజయం పొందేవే. అదొక దురదృష్టం-వాటికి ఈ సంకలనంలో స్థానంలేదు.

ఆంధ్ర నాటక కళా పరిషత్ పుట్టుపూర్వోత్తరాలు, పొందిన ఆదరాభిమానాలూ-చేసిన కృషినీ గూర్చి చాలామంది పెద్దలు అనేక వ్యాసాలు వ్రాశారు. విషయ విస్తరణ భీతితోను, చర్విత చర్వణం కాకుండానూ చాలావరకూ నా ప్రమేయంతో నేను ఎరిగివున్న విషయాలే ఇందులో పొందుపరిచాను.

ఏమైనా పరిషత్ చరిత్ర - "ఆంధ్ర నాటక చరిత్రలోనే" అత్యంత ప్రాముఖ్యం వహించినది. నేడు ఆంధ్ర దేశంలో తెలుగు నాటకం తలఎత్తుకోవటానికీ-నిలబడవానికీ-పరిషత్ చేసిన కృషే ముఖ్యకారణం.

10-15 సంవత్సరాలుగా పరిషత్ కృషి మందగించినా-తిరిగి పునరుద్ధరించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అది అత్యంత ముదావహం.

*కొర్రపాటి గంగాధరరావు.*
సంకలనకర్త

# ఏకాంకిక

"One Act Play" అన్న ఇంగ్లీషు పదాలను బట్టి తెలుగులో "ఏకాంకిక" అన్న పదం వాడుకలోనికి వచ్చింది. పాశ్చాత్య దేశాలలో ఈ ఏకాంకిక ఏనాడు ఆరంభమయిందో గట్టిగా తెలియదుగాని అతి పూర్వకాలం లోనిది మాత్రం కాదు.

నాటక ప్రదర్శనకు వచ్చే "ముఖ్యమైన ప్రేక్షకులు", వారి వారికున్న కార్యభారం వల్ల నాటక ప్రదర్శనకు రాదలచినా, ఆలస్యంగా వస్తూ వుండే వారట! ముందుసీట్ల నాక్రమించటానికి కాబోలు సామాన్య ప్రేక్షకులు, ముందే వచ్చి-ఆసీనులయి వుంటారు. వీరికి వేరే కాలక్షేపం లేకపోతే — అసలు నాటక ప్రదర్శన కాలానికి విసిగిపోతారు. ప్రదర్శన రక్తికి ఈలా జనించిన "విసుగు" దోహదకారికాదు. కనక వారి కాలక్షేపానికి-చిన్న ప్రదర్శన ఏదో ఒకటి-ఏర్పాటు చేయటం అవసరమనిపించిందిట! — కొంత మంది నాటక నిర్వాహకులు-ఏదో ఒకటి రెండు హాస్య పాత్రల్ని ప్రవేశపెట్టి—ఏదో తోచినట్లు నటిస్తూ, తోచినట్లు మాట్లాడుతూ ఆ ప్రేక్షకులకు విసుగు జనించనీయకుండా చేయటమే వీటి ముఖ్యోద్దేశం. ప్రారంభ దశలో వీటిని 'Curtain Raisers అనేవారు.

ఇల్లా ప్రారంభమయిన ఏకాంకిక మొదట్లో కేవలం కాలక్షేపానికిగాను పూర్తిగా హాస్యభరితంగా వినోద ప్రధానంగా మాత్రమే వుండేది. ఆశువుగానే సంభాషణలు నడిచేవి. కథగూడా అప్పటికప్పుడు అనుకున్నదే సరిపోయేవి. రాను రాను అవి అక్షర రూపం దాల్చింది. ప్రక్రియలో వున్న శక్తివల్ల వేరైన తన స్వరూపాన్ని తను కల్పించుకున్నది. ఈనాటికి— పుష్టినొంది తన 'విశిష్టతను' తనే నిరూపించుకున్నది. పాశ్చాత్యదేశాల కంటే సుమారుగా 200 సంవత్సరాలన్నా వెనకబడి-ప్రారంభమయిన ఆధునిక ఆంధ్రనాటకంలో గూడా సుమారు అంత వెనకగానే ఈ విశిష్ట నాటక రచనా ప్రక్రియ రూపు దిద్దుకున్నది.

ఏకాంకికను- "నాటిక" అనటం అంత భావ్యం కాదేమో! భరతముని చెప్పిన "దశరూపకాల" తర్వాత "నాటిక" అనేది ఒకటి వుంది. దాని లక్ష ణాలు ఇవి:- ఇతివృత్తం—ఉత్పాద్యము. నాయకుడు — రాజు; అంకములు నాలుగు; సంధులు-౪, వృత్తి— కైశికి; రసము-శృంగారము, ప్రకరణ

నాటకముల సమ్మేళనముల వలన కలిగినది. నాయిక అంతఃపుర కన్య లేదా సంగీతశాలా కన్య.

దీనిని అనుసరించి—నేటి మన ఏకాంకికలను నాటికలనరాదు. అంతే కాక దశరూపకాలలోని (1) వ్యాయోగము (2) అంకము (3) ప్రహసనములు (4) భాణము (5) వీధి అనేవి ఏకాంకికలు. [ఒకే అంకము గలవి] కనక ఒకే అంక పరిమితి గలిగి వుండటం అనే ఒక్క భేదం రూపకాల జాతి విభాగానికి కారణంగాదు.

ఈ వివాదానికి మనం దిగకుండానే, "నాటిక'' అంటే ఏకాంకిక అని— మన వాడుకలో రూఢి అయిపోయింది గనక మనం గూడా నాటిక - ఏకాంకిక అనే పదాలను Synonyms గా వాడుకోవటం మంచిది.

నేడు మనం అలవాటు పడిన అర్థంలోనే, అదే టెక్నిక్‌లతోనూ—ఎంతో ఆశ్చర్యవంతంగానూ-మనకు "భాసుని'' రచనలలో కొన్ని ఉదాహరణలు కనిపిస్తాయి. ఇంగ్లీషు వారికి షేక్స్పియర్-రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంకంటే గర్వకారణమైతే—భారతీయులకు "భాసుని'' రచనలు మరింత గర్వకారణం అనవచ్చు.

పూర్వం సంగతెట్లా వున్నా, తెలుగుదేశంలో మాత్రం - నాటికా రచన 1939 కి ముందుగానే ప్రారంభమయిందనవచ్చు. విశ్వనాథ కవిరాజుగారూ, రాజమన్నారు గారూ వంటి ప్రముఖులు ఈ పద్ధతికి వొరవడి పెట్టారు. అవి చాలా ప్రజాదరణ పొందినవి గూడా. రంగస్థల సౌకర్యాలేవీ లేని ఆంధ్ర దేశంలో, అనేక నాటికా రచనలు మొదట వెలువడినాయి. పాశ్చాత్య నాటికా రచనలలో వెలువడిన రకరకాల మార్గాలతోనూ (Different Schools Like-'Realism' 'Surrealism'; 'Symbolism'; Expressionism వగైరా) రచనలు సాగినవి. అయితే ప్రదర్శనావకాశాలు దేశంలో లేక, అవి ఎక్కువభాగం- "చదువుకొని సంతోషించటానికి మాత్రమే'' ఉపయోగపడినాయి. [చలం, విశ్వనాథ మొ॥వారి రచనలు. 1930-40 ప్రాంతం].

తర్వాత కాలంలో పరిషత్ పోటీలు ప్రారంభమయిన తర్వాత, ఈ ప్రక్రియకు పూర్తి ప్రాముఖ్యం రావటమే కాక— ప్రదర్శన సౌలభ్యమే ప్రధానంగా భావించనారంభించారు. పాశ్చాత్యదేశ పద్ధతులు—కొన్ని అనుసరణలు లేకపోలేదు గాని— అవే ఇతర రచయితలకు మార్గదర్శకాలైనాయి కూడా,

ఆంధ్ర నాటక కళాపరిషత్ వారి పోటీంలో కొన్ని నిబంధనలకు తగినట్లుగా, తెలుగు నాటకా రచన మొదట తన రూపుదిద్దుకున్నదని కూడా చెప్పక తప్పదు. అందులో ఒకటి ఒక గంట కాలపరిమితి. నిజానికి నాటిక 5 నిమిషాల నుండి—రెండు గంటల వరకు కూడా వుండవచ్చు. ఈ కాల పరిమితి ఉత్సవ నిర్వహణకు ఉపయోగించేదేగాని, నాటికా లక్షణాన్ని నిశ్చయించేది కాదు. నిర్వాహకుల సౌకర్యం కోసం ఇది ఏర్పడింది. దీనిని జడ్జీలు పరిగణించాల్సినది కాదు. అయినా కొన్ని నాటికా ప్రదర్శనల కాలం గంట పరిమితికి మించి వుండటం వల్లా, ఆ కారణంగా బహుమతి నివ్వక పోవటం వల్లా - నాటిక ప్రదర్శన కాలం గంటకు ఏమాత్రం మించరాదన్న దురభిప్రాయం ఏర్పడింది.

పరిషత్ ప్రదర్శనా పోటీలకు పూర్వం - 'నాటిక' అంటే ఏదో చిన్న ప్రహసనం అన్నదే బహు జనాభిప్రాయం. విశ్వనాథ కవిరాజు, భమిడిపాటి కామేశ్వర రావుగార్ల రచనలు ఎక్కువ ప్రచారంలోనికి రావటమే దీనికి కారణం కావచ్చును. పరిషత్ ప్రదర్శనలవల్ల ఈ దురభిప్రాయం తొలగిపోయి-మంచి వరవడి ఏర్పడింది.

నటీమణుల కొరతవల్లా, నాటికకు చాలా సమాజాలు ఎక్కువ ఖర్చు పెట్టలేకపోవడం వల్లా—'స్త్రీ పాత్రలులేని' నాటికా రచనలు ఎక్కువగా వచ్చాయి. ఇందులో పొరపాటేమీ లేదు. కథలో కావాల్సిన పాత్రలు మాత్రమే ప్రవేశ పెట్టటం అవసరం గూడా. ఈ సౌలభ్యం వల్ల ఔత్సాహికుల్లో పెరిగిన ఉత్సాహం అంతా ఇంతా అని చెప్పలేము. ఈ ఒక్క సౌలభ్యం వుండటం వల్ల వందలాదిగా నటులు ఉద్భవించి, రాణించారనటం గూడా సత్య దూరంగాదు.

రచనా కాలం 5 సంవత్సరాల వెనకటిదై వుండకూడదు, అనేది మరొక నిబంధన. దీనివల్ల చాలా సమాజాల వారు ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం 'నాటిక' రాయించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. అంటే కొత్త రచయితలకు ప్రోత్సాహం లభించినదన్నమాట. నేను—నటకుణ్ణి—రచయిత కావటానికి ముఖ్య కారణం ఇదే—నిజానికి నాలాంటి వారే ఇంకెంతమందో—ఈ కారణం వల్లనే వెలుగులోనికి వచ్చారు - వస్తున్నారు. పరిషత్ పౌరాణిక నాటికలను ప్రోత్సహించక పోలేదు. "చేసిన పాపం"; "ఆ నాడు" మొదలైనవి పౌరాణికాలే, కాని ఔత్సాహికు లెక్కువగా సాంఘిక ఇతివృత్తాల్నే చేపట్టటం వల్లనూ,

పౌరాణిక నటులు ఉత్సాహం చూపకపోవటం వల్లనూ ఆ విధమైన నాటిక నాటి లు పోటీలకు ఎక్కువగా రాలేదు.

కనుక ఒక విధంగా — పరిషత్ నిబంధనలే, నేటి మన నాటిక స్వరూపాన్ని ఈ విధంగా తీర్చిదిద్దాయి—అనటం అతిశయోక్తి కాదు. ఈ కాల పరిమితి నాటికకు ఒక గంటా, నాటకానికి రెండు గంటలకూ పరిమితం చేయటం వల్ల చాలా వరకూ ఇప్పుడు వస్తున్న మన 'నాటకాలు' నిజానికి - నాటికలే - కథా వస్తువు దృష్ట్యా. దీనికి - ఈ రెండింటికీ - తేడా సామాన్య రచయితకూ—ప్రేక్షకులకూ తెలియక పోవటమే. ఇది ఒక్క తెలుగు నాటకా నాటికల విషయంలోనే కాదు; ప్రపంచంలో అన్ని భాషా ప్రాంతాలకు వర్తిస్తుంది.

**ఏకాంకికల విశిష్టత**

నాటక ప్రక్రియలోంచే నాటిక పుట్టినా — నాటిక తనొక విశిష్ట ప్రక్రియగా ఈనాడు రూపొందింది. రచయితలూ, నటీ నటులు, దర్శకులూ, ఇతర కార్యకర్తలూ గూడా దీనిని గుర్తుంచుకోవాలి.

నాటికలో కాలపరిమితి తక్కువ. సుమారు 40-60 నిమిషాలలో - రచయిత-తన అభిప్రాయాన్ని స్పష్టంగా వ్యక్తం చెయ్యాలి. అందే నాటికా రచయిత-ఒక్క నిమిషంగాని, ఒక్క మాటగాని వృథా చేయగూడదు. అల్లా అన్నాంగదా అని, ఏదో ఒక చిన్న సన్నివేశమో—అల్పమైన సందేశమో- తీసుకుని- సరిపుచ్చుకోగూడదు. నాటిక ప్రధానోద్దేశ్యం ఎంత తీవ్రమైన సన్నివేశమైనా కావచ్చు. ఉదా :- ''ప్రగతి'', ''ప్రార్థన''. ఈ నాటికలలో చాలా పెద్ద విషయాలే చర్చించబడ్డాయి. కాని రచయితలు ఆ పెద్ద విషయాన్నే తమ అదుపులోనికి తెచ్చుకున్నారు. తమ ముఖ్యోద్దేశాన్ని ఒక చిన్న జీవిత సంఘటనలోనికి తెచ్చుకున్నారు. ఒక సంపూర్ణ జీవితాన్ని నాటికగా వ్రాయటం అసాధ్యమే. నిజానికి —నాటికలో వున్న సన్నివేశం ఒక గంట కాలంలో జరిగితే—సుమారుగా అంతే కాలంలో నిజ జీవితంలోనూ, అదే సన్నివేశం జరగటానికి పట్టాలి.

నాటకంలో ఎక్కువ రంగాలు వుండవచ్చును. రంగం మారినప్పుడల్లా— తెర జారినప్పుడల్లా రక్తి భంగం జరుగుతుంది. ఈ రోజుల్లో ''Lights off

and on''తో కూడా-ఈ రక్తి భంగం జరిగి తీరుతుంది. ఎక్కడో స్వల్ప కాల వ్యవధి సూచించటానికి తప్ప—తెర వాలటం గాని, Lights ఆరటంగాని జరగకూడదు. 'నా బాబు', 'కళ్ళు' రెండు రంగాల నాటికలయినా నాటికలుగానే పరిగణించబడినాయి. ఇది తప్పనిసరి అయినప్పుడు కూడా, తెరవేసి ఎంత తొందరగా తెర తీయగలిగితే అంత మంచిది. తెరవాలినప్పుడల్లా-రక్తి భంగం కథా క్రమ భంగం జరుగుతుంది. ప్రేక్షకులు అన్యాసక్తు లవుతారు. నాటక వాతావరణం మారిపోవాల్సి వస్తుంది. ఇవన్నీ జరగకుండా కాల వ్యవధి కావల్సి వస్తే—మరేదో సన్నివేశాన్ని కల్పించి—ప్రేక్షకుల శ్రద్ధా సక్తుల్ని నిలిపి వుంచటం మంచిది.

'నాటికల పోటీల'లోనే గాదు—ఎక్కడ ఎప్పుడైనా, నాటికలను మరి 2-3 ఇతర నాటికల ప్రదర్శనతో కలిపి ప్రదర్శిస్తారు. అంటే పెద్ద పెద్ద సెట్లు కట్టే రంగాలంకరణలకు కాల వ్యవధి చాలినంత వుండదు. ఇది కూడా రచయిత తన దృష్టిలో వుంచుకుని, కాలహరణ లేకుండా, రంగస్థల నిర్మాణం చేసుకునేట్లు-అతి సామాన్యపు 'సెట్' మీద జరగ గలిగే ఇతి వృత్తాన్నే తీసుకోవటం మంచిది.[ఉదాహరణకు బంగారు సంకెళ్ళు] సెట్స్‌గాని—ఇతర టెక్నిక్‌గాని — స్పాట్‌లైట్ వగైరాలు గాని-ఇతివృత్తానికీ రక్తికీ అవసరమైనంతవరకే ఉపయోగించాలి—ఏ ప్రదర్శలోనైనా, నాటికలో-దీనిని మరింత తేలికగా నిర్వహించవచ్చు. ఉదా:- రైల్వేస్టేషన్ చూపటానికి బదులు— "రైల్వేస్టేషన్" అన్న బోర్డుతో సరిపుచ్చవచ్చు. బ్రిటిష్ డ్రామా లీగ్ నాటికల పోటీలో-అన్ని ప్రదర్శనలూ "వేలాడే తెరల" మీదే గాని, 'సెట్స్‌ను' ను Prohibit చేశారు-ఈ కాలహరణం జరగకుండానే.

నాటికల రచనలోనేగాదు—నాటక రచనలో గూడా కొందరు రచయితలీ మధ్య రాజకీయ సిద్ధాంతాల ప్రచారం చొప్పిస్తున్నారు. అసలు నాటక ప్రదర్శనే ఒక ప్రచార సాధనం— అది పౌరాణికమైనా సరే. కనక దీనిలో తప్పు పట్టటానికి ఏంలేదు. కాని ఆ ప్రచార భాగం ప్రదర్శనలో గల [Drama] నాటకీయతగల సన్నివేశాలను మింగివేయగూడదు. నాటికలో గూడా నాటకీయతే ప్రధానం.

నాటకంలో గూడా 'క్లుప్తత' ముఖ్యమే. కాని నాటికలో ఇది మరీ ముఖ్యం. ఆ భాగం ఎంత చిన్నది అయినా సరే— నేరుగా— ఇతర

అనవసర విషయాలు చొప్పించకుండా — చిలవలూ పలవలూ అల్లకుండా వుంచి తీరాలి నాటికలో. నాటకానికీ— నాటికకూ వున్న భేదాలలో ఇదే అతి ముఖ్యమైనది. నాటకంలో ప్రధానోద్దేశ్యానికి తోడ్పడుతూ, కథ ఎన్నో మలుపులు తిరుగుతూ కథ గమ్యానికి చేరుతుంది. నాటికలో నేరుగా— చెప్పదలుచుకున్న విషయాన్ని నిర్మొహమాటంగా-మొహం మీద విసిరికొట్టినట్లు వుంటుంది. కనకనే నాటిక మరింత శక్తివంతమైనది. ప్రేక్షకులకు అనాసక్తి కలగ నివ్వదు. ఆలోచనను ప్రధానోద్దేశ్యన్నుంచి చెదరనివ్వదు.

ఒక్కమాటలో చెప్పాలంటే-

'నాటిక'-కుదించిన 'నాటకం' గాదు.

నాటికలో గూడా ''విషయం''— ప్రధానోద్దేశ్యం-ఏదైనా కావచ్చు. చరిత్ర కావచ్చు. సాంఘిక కథా సన్నివేశం కావచ్చు. మరేదైనా కావచ్చు. ప్రేక్షకులు ప్రదర్శన చూసి లేచి వెళ్ళేటప్పుడు, తామొక మంచి ప్రదర్శన— సమగ్రమైన దాన్ని-చూశామన్న "తృప్తి" కలగటం ముఖ్యం.

నాటికలో-"కథ"—"సన్నివేశాలూ" చక చక నడవాలి. ఏ ఒక్క విషయాన్ని—ఒక్కసారి కంటే ఎక్కువసార్లు నొక్కి చెప్పక్కరలేదు. సంభాషణలు చిన్న చిన్నవిగా వుండాలి. పాత్రపోషణా చిత్రణలు కూడా-ఏ మాత్రం సందేహాస్పదంగా వుండగూడదు. ఒక్క [మొదటి] వాక్యంలోనే ఆ పాత్ర తీరు తెన్నులు అర్థమయిపోవటం మంచిది. ప్రతి పాత్రా— ఎంత చిన్నదైనా— వచ్చిన కాసేపట్లోనే ప్రాముఖ్యం వహించాలి. ప్రేక్షకులు గుర్తు పెట్టుకోగలిగేట్లుండాలి. అనవసరంగా ఏ పాత్రా రాగూడదూ—పోకూడదు. ప్రదర్శనలో కదలికలు వడివడిగా వుండాలి. వేషధారణ ఆకర్షణీయంగా వుండాలి. నాటకంలో ఒక్కొక్క రంగంలో క్రమంగా శక్తి పెరిగి-అంతిమ రంగంలో పతాకస్థాయికి చేరుకుంటూ పోతే, నాటికలో-ముందు రంగాలన్నింటి వివరాలు మొదటి కొలది నిముషాలలోనే ఇమిడి-కేవలం పతాక సన్నివేశం ప్రధానంగానే మిగతా భాగం నడుస్తుంది.

నాటిక చిన్నది గనుక—క్లుప్తంగా వుంటుంది గనక, కొందరి అభిప్రాయంలో కేవలం హాస్యప్రధానం గనక, మనం చిన్న చూపు చూడనక్కరలేదు. చిన్నదైనా వజ్రాన్ని మనం భద్రంగా కాపాడుకుంటాంగానీ - పారవేసుకోంగదా?

సాహిత్యంలో కథానిక లాగా, 'ఏకాంకిక' నాటకాలలో తన సుస్థిరమైన స్థానం తానే సంపాదించుకుంది.

*కొర్రపాటి గంగాధరరావు*
సంకలన కర్త

## ఈ నాటికలూ-నాటికా రచయితలనుగూర్చి-

**చేసిన పాపం:**—[1947]

కీ॥ శే॥ కొప్పవరపు సుబ్బారావుగారి రచన. ప్రదర్శన ఆంధ్ర ప్రజా నాట్యమండలి, విజయవాడ. విశ్వవిఖ్యాత నటులు శ్రీ ఎన్. టి. రామారావుగారు ఈ ప్రదర్శనలో పాల్గొని, ఉత్తమ నటులుగా ఎన్నికయినారు. పరిషత్‌లో ఇది ప్రథమ ప్రదర్శనగా ఎన్నికయినది.

కీ॥ శే॥ సుబ్బారావుగారి జననం 29-4-1890. మరణం 3-5-1959. సుబ్బారావుగారికి చిన్ననాటి నుండియు నాటక కళపై అభిమానము. పాశ్చాత్య దేశములను గూడా పర్యటించి, అక్కడి అధునాతన మార్గములను నేర్చి, ఆంధ్రదేశమున గూడా వానిని ప్రవేశపెట్టినవారు. అనేక పౌరాణిక నాటకము లను, సాంఘిక నాటకములను రచించినారు. ఆధునిక తెలుగు నాటకానికి వీరే ఆద్యులని చెప్పక తప్పదు.

**తుపాను:**—[1947]

15-1-1948 — 14 వ ఆంధ్ర నాటక కళా పరిషత్ పోటీలో రచనకు బహుమతి నందిన నాటిక ఇది. రచయిత-శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్యగారు. జననం 5-5-1911. మంచి సంస్కృత పండితులు. నెల్లూరు వి.ఆర్. కాలేజి— హైస్కూలులో ఉపాధ్యాయులు. తుపాను నాటికను ప్రదర్శించిన నెల్లూరు ఆంధ్ర సభలో ప్రముఖ సభ్యులు.

**తారాబలం:**—[1949]

ఏలూరులో జరిగిన పరిషత్‌లో ప్రదర్శనకూ, రచనకూ బహుమతి పొందిన నాటిక. ప్రదర్శన జాతీయ కళామందిర్, బాపట్ల. రచయిత శ్రీ పడ్లమూడి సీతారామారావుగారు. ఈ ప్రదర్శనలో నేనూ పాల్గొన్నాను.

శ్రీ పడ్లమూడి సీతారామారావుగారి జననం కృష్ణాజిల్లా ఉయ్యూరు గ్రామంలో. బాపట్ల స్థిరనివాసం. ప్రముఖ న్యాయవాది. జాతీయ కళామందిర్ సంస్థ నెలకొల్పి, రచయితగానూ, నటుడుగానూ-ఆంధ్రదేశపు దృష్టిని సాంఘిక నాటకాల మీదకు మరలేటట్లు చేసినవారిలో వీరు ఒకరు. విజ్ఞానం, వినోదం వీరి నాటకాలలో రెండు ముఖ్య లక్షణాలు.

**ప్రగతి:**—[1950]

శ్రీ ఆచార్య ఆత్రేయగారి రచన ఇది. ప్రసిద్ధ సినీనటులు శ్రీ సి. నాగభూషణంగారు నటించగా, కాకినాడలో ప్రథమ బహుమతి నందుకున్నది.

శ్రీ ఆచార్య ఆత్రేయగారు సుప్రసిద్ధ సినిమా రచయితలు. అనేక నాటికా నాటక రచయితలు. స్వయంగా దర్శకులు. వీరి నాటకాలన్నీ స్వభావ వాదమునకు ప్రతినిధులై, ఆంధ్ర నాటక రంగంలోనే ఒక నూతన సంచలనమును లేవదీసినవి. వాస్తవిక జీవిత చిత్రణమే వీరి రచనలలో ముఖ్యంగా కానవస్తుంది. అనేకమైన ఇతర ప్రయోగములను చేసినవారిలో వీరు ఒకరు.

**ఆడది:**—[1950]

ప్రసిద్ధ సినీ రచయిత శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తిగారి రచన ఇది. ఇది కూడా రచనకు కాకినాడలోనే బహుమతి నందినది. దీనిలో సినీ నటులు శ్రీ చలంగారు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు నటించినట్లు జ్ఞాపకం.

**ఎవరు దొంగ?:**—[1951]

శ్రీ ఆచార్య ఆత్రేయగారి రచన. ప్రదర్శన ప్రభాకర నాట్యమండలి, గుడివాడ వారిది. తెనాలి పరిషత్‌లో ప్రథమ బహుమతి నందుకున్నది.

**మనిషి చావకూడదు:**— రచన శ్రీ ఎన్. ఆర్. నంది.

**నా బాబు:**—[1954]

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు రచన. విజయవాడ లలితకళాసమితి ప్రదర్శన. మచిలీపట్నం పరిషత్ ప్రదర్శనలలో ఉత్తమ రచనకు బహుమతి నందుకున్నది. కీ॥ శే॥ శ్రీ కె. వెంకటేశ్వరరావుగారికి నటనకు బహుమతి లభించింది. కీ॥ శే॥ శ్రీ వెంకటేశ్వరరావు అనేకసార్లు ఈ నాటకాన్ని ప్రదర్శించి, వారి ప్రథమ దశలో ఉత్తమ నటులుగా ప్రసిద్ధులయ్యారు.

**బంగారు సంకెళ్ళు:**—[1954]

మచిలీపట్నంలో అదే సంవత్సరములో రచనకు బహుమతి నందుకున్నది. ప్రదర్శన కళాదర్శి, బాపట్ల. గంగాధరరావుగారి జననం 10.5.1922.

**దిష్టిబొమ్మలు:-**

శ్రీ సి. వేణుగారి రచన. 1955 సం॥ములో హైదరాబాదులో జరిగిన పరిషత్ ప్రదర్శనలలో ప్రథమ బహుమతి నందుకున్నది.

**ప్రార్థన:-** [1955]

1955 లో రచనకు బహుమతి నందిన నాటిక. డాక్టర్ కొర్రపాటి గంగాధరరావుగారి రచన. కళాపని, బాపట్ల వారి ప్రదర్శన.

**వెంకన్న కాపురం:-** [1958] లేక [1959]

సుప్రసిద్ధ సినీనటులు కీ. శే. ముదిగొండ లింగమూర్తిగారి రచన. మొదటగా వారిని నాటక రచనకు పురిగొల్పినది ఇది.

**మన స్వత్వాలు:-** (1958)

సుప్రసిద్ధ సినీరచయిత, బహునాటక గ్రంథకర్త శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారి రచన.— రచనకు బహుమతి నందుకున్నది.

**దంతవేదాంతం:-** [1959]

హైదరాబాదులో జరిగిన పరిషత్ పోటీలలో ప్రథమ ప్రదర్శనకూ, రచనకూ కూడా బహుమతి పొందిన నాటిక. శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారి రచన.

శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారి జననం 14-11-1931 రాజమహేంద్రవరంలో. కీ॥శే॥ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి పుత్రులు. తండ్రి ఎంతటి ప్రఖ్యాత పురుషుడో, ఎంతటి ప్రతిభావంతుడో రాధాకృష్ణగారున్నూ అంతటి ప్రతిభా ప్రఖ్యాతులను ఆర్జించారు.

**చావకూడదు:-**

రచన శ్రీ ఆచార్య ఆత్రేయ. గుడివాడ పరిషత్‌లో ప్రదర్శనకు బహుమతి నందిన నాటిక. ఈ నాటికలో అన్నీ స్త్రీ పాత్రలే.

**కుక్కపిల్ల దొరికింది:-** [1961]

శ్రీ రావి కొండలరావుగారి రచన. తణుకులో జరిగిన పరిషత్‌లో ఉత్తమ రచనకు బహుమతి నందినది.

**చరమాంకం:-** [1961] ముద్రణ కాలేదని తెలిసినది.

**పుణ్యస్థలి:-**

రచన శ్రీ ఎన్. ఆర్. నంది. 13-1-1962 తేదీన పరిషత్ ప్రదర్శనంలో (22 సెషన్) గుడివాడలో జరిగినపుడు, విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్ వారు ప్రదర్శించగా, ఉత్తమ రచనకు బహుమతి నందినది.

**సుల్తానీ:-** [1962]

వేలూరి శివరామశాస్త్రిగారి రచన. గుడివాడలో జరిగిన పరిషత్‌లో ప్రథమ ప్రదర్శనకు బహుమతి నందినది. ప్రఖ్యాత నటులు పామర్తి సుబ్బారావు గారు ఇందులో నటించి, నాటికకు వన్నె తెచ్చారు. అచ్చయినట్లు తోచదు.

**వాన వెలిసింది:-** [1963]

రచన శ్రీ ఎన్. ఆర్. నంది. జనవరి 1963 లో పరిషత్ ప్రదర్శనంలో (23 సెషన్) హైదరాబాదులో ఉత్తమ ప్రదర్శనకు బహుమతి పొందిన నాటిక.

**చీకటి తెరలు:-** [1963]

అదే పరిషత్‌లో రచనకు బహుమతి పొందిన నాటిక. శ్రీ గన్నిశెట్టి వెంకటేశ్వరరావుగారి రచన.

**జ్వలితజ్వాల:-** [1962] ?

కీ॥ శే॥ చింతపల్లి హనుమంతరావుగారి రచన. అనంతపురంలో జరిగిన పరిషత్‌లో బహుమతి నందినది.

**శిరోమణి:-**

అదే సంవత్సరము రచనకు బహుమతి నందిన నాటిక. రచయిత దివ్య ప్రభాకర్, విజయవాడ.

**ఊలిపికట్టె:-**

రచన:- శ్రీ ఆవుల శ్రీనివాసరావుగారు. 1965 లో పరిషత్ పోటీలలో ప్రదర్శనకు బహుమతి నందిన నాటిక.

**కళ్ళు:-** [1979]

ప్రఖ్యాత నాటికా నాటక సినీ రచయిత శ్రీ గొల్లపూడి మారుతీరావుగారి రచన. 8-9-1979 పరిషత్ పోటీలలో ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శనకూ, రచనకూ, ఇతర ప్రత్యేక బహుమతులనూ పొందిన నాటిక. 1975 లో సాహిత్య అకాడమీ బహుమతి పొందిన నాటిక గూడా.



# పాత్రలు

ఒక బౌద్ధ భిక్షువు

ఒక దేశ దిమ్మరి

రాజ కుమారుడు-నలందా పాలకుడు

మాయ-ఒక పూజారిణి

ప్రదేశం—నలందా శిథిలాలు

గమనిక—ఈ నాటికలో వచ్చే పాత్రల వేష ధారణం
అజంతా శిల్పాన్ని అనుకరించాలి.

ప్రదేశం—నలందా శిథిలాలు

నలందా శిధిలాల్లో ఒక పడిపోయిన గోడ. ఆ గోడలో సగం విరిగిన ఒక స్తంభం. బౌద్ధభిక్షువు ఆ పడిపోయిన గోడమీద కూర్చొని ఆ స్తంభ శేషానికి వీపు ఆనించి ఏదో ధ్యానంలో వున్న సమయంలో మాయ నిశ్శబ్దంగా ప్రవేశించి మోకరించి అంజలి నిబద్ధయై తలవంచుకుంటుంది. దూరంగా పిల్లంగోరు గానం విని పిస్తూ వుంది. కొంత సేపటికి భిక్షువు కలవరంతో లేస్తాడు-వింటాడు-చూస్తాడు.

భిక్షు:- మళ్ళీ వచ్చావా నన్ను పీడించటానికి?—ముందు ఆ గానం ఆపించు.

మాయ:- (గానం వినిపిస్తున్న వైపుకు చేతితో సైగ చేస్తుంది. గానం ఆగి పోతుంది) ఇందాక చాలా విసుగుతో ఉన్నావు. ఈసారైనా ప్రసన్నుడవౌతావేమో అని ఆశతో వచ్చాను. తథాగతా!

భిక్షు:- తథాగతుడూ లేడు,-యధాగతుడూ లేడు! పో!

మాయ:- నీవు భగవంతుడవనీ, మా తొమ్మిదో అవతారమైన బుద్ధుడవనీ—

భిక్షు:- ఆగు!—నేను బుద్ధుణ్ణా? అదిదాలక భగవంతుణ్ణా! ఎవరు చెప్పారు నీకు?

మాయ:- లోకమంతా చెబుతూవుంది.

భిక్షు:- చెప్పుకోనియ్. నేను బుద్ధుణ్ణికాదు-భగవంతుణ్ణికాదు. దారినిపొయ్యే బికారుల్లో వొకణ్ణి. తెలిసిందా? ఇకపో!

మాయ:- సిద్ధార్థా! భగవంతుడు తన నిజ వృత్తాంతాన్ని నిజమైన భక్తులకు తప్ప ఇతరులకు చెప్పడనీ—

భిక్షు:- ఆగు! నేనున్న ఈ ప్రదేశం పేరు ఏమిటి?

మాయ:- ఇది వొకప్పుడు విశ్వవిఖ్యాతమైన నలందా బౌద్ధవిహారం. ఇప్పుడు దారుణ శిథిలావస్థలో వుంది. కాని సర్వజ్ఞా! అగతా నాగత వేదివైన నీవు ఏమీ తెలియనట్లు నన్ను ప్రశ్నలు వేస్తున్నావు. ఇది కూడా భగవంతుడి లీలావినోదాల్లో వొకటా? !

భిక్షు:- ఈ నందా శిథిలాలు ఎందాకా విస్తరించివున్నయ్యో చెప్పగలవా?

మాయ:- కొంచెం హెచ్చు తగ్గుగా నాలుగు కోసులదాకా.

భిక్షు.- (లేచి జోలిసర్దుకుంటూ) అయితే, ఈ గాఢాంధకారం కూడా నాలుగు కోసులదాకా విస్తరించిఉంటుంది. సాయంత్రానికైనా దాటగలిగితే ధన్యుణ్ణి—

మాయ:- సుగతా! నన్ను తప్పించుకుపోవాలనుకుంటున్నావు. నేచేసిన నేరం ఏమిటి?

భిక్షు:- నేరం? యువతీ! 'తథాగతా' అనీ, 'సిద్ధార్థా' అనీ సంబోధించి ఎర్రగా కాచిన సీసాన్ని నా చెవుల్లో చుక్క చుక్కగా నిక్షేపించడానికి నే చేసిన నేరం ఏమిటో చెప్తావా?

మాయ:- నన్ను పరీక్ష చేస్తున్నావా! పోనీ. భగవాన్! నేను వచ్చిన పని సఫలంచేసి నన్ను పంపివెయ్

భిక్షు:- సరే. ఏమిటాపని? (మళ్ళీ కూర్చుంటాడు)

మాయ:- (తల వంచుకుని) సుగతా! నేను ఒక దారుణ పాపం చేశాను.

భిక్షు.- (ఆవలిస్తూ) నీవంటి పడుచులకు అది అసామాన్య విషయం కాదు.

మాయ:- చేసిన పాపం చెప్పుకుని పాప పరిహారం పొందాలని వచ్చాను.

భిక్షు:- ఎక్కడ నేర్చుకున్నావు ఈ నీతిరాజం?

మాయ:- ''యద్రాత్ర్యాత్ కురుతే పాపమ్, తద్రాత్ర్యాత్ ప్రతిముచ్యతే'' అంటూ దిన దినం నా భర్తగారు సంధ్య వారుస్తుండగా వింటూ వుంటాను.

భిక్షు.- ఓహో? నీకు ఒక భర్త ఉన్నాడా? అందువల్లనే పాపం చేసి వుంటావు.

మాయ:- నేను మనస్ఫూర్తిగా చేసిన పాపం కాదది. ఆ పరపురుషుని ఉదంతం మొదట నాకు ఏమీ తెలియదు. ఆయన —

భిక్షు:- వర్ణనలు వద్దు. సంగ్రహంగా చెప్పు.

మాయ:- ఆ పురుషుడు ఒక మహాక్షాత్ర తేజస్వి. సుకుమార సుందరుడు. నేనో ఒంటరిదాన్ని. సమయమా రాకాచంద్రి చంద్రికా పులకితం. ప్రదేశమా మనోహర సురభినిశ్శ్వసితమైన వకుళోద్యానం. అతడు మెల్లగా నా వద్ద చేరి చెవిలో "మాయా! జగదేక సుందరీ! ప్రియే!"—

భిక్షు:- ఆగు! ఆ కలుషభాషను మా వద్ద ఏకరు పెట్టవద్దు.

మాయ:- క్షమించు తథాగతా!—

భిక్షు:- కాబట్టి నీ అనంతర కథా భాగం సులభ గ్రాహ్యం.

మాయ:- ఔను సర్వజ్ఞా!

భిక్షు:- సరే. ఇక పో.

మాయ:- ఆ పాపంనుంచి నాకు విమోచనం అనుగ్రహించావా?

భిక్షు:- ఆ విషయం నాకు తెలియదు.

మాయ:- ఆ పాపానికి నేను పొందిన పశ్చాత్తాపం ఎంతో నా హృదయ సాక్షికి తెలుసు. సర్వ సాక్షివైన నీకు తెలుసు.

భిక్షు:- నాకు ఏమీ తెలియదు. పో యిక!

మాయ:- తథాగతా! నీ ఉపదేశ సుధా రసాన్ని కొంచెమైనా చెవులార తాగకుండా—

భిక్షు:- ఆపు నీ కవితా ధార! పో! పోయి, పాపం అని నీకు తోచిన కార్యాన్ని ఇక మీద చెయ్యకు.

మాయ:- సుభాషితం, సుభాషితం.

(వయ్యారంగా లేస్తుంది మోహిరీలు వున్న ఒక పట్టుజల్తారు సంచిని తన కంచుకంలోనుంచి బయటికి తీస్తూ)

మాయ:- తథాగతా! ఏ కానుక నీకు తృప్తి ఘటిస్తుందో నాకు తెలియదు. అయినా—

భిక్షు:- కానుక!—లంచానికి ఎంత చక్కటి పేరు!

మాయ:- సర్వజ్ఞా! భగవంతుడికి యథాశక్తి కానుక లివ్వడం భక్తుల ధర్మం కాదా?

భిక్షు:- నీ ధర్మగీతాలాపం చాలించి యిక పో!

మాయ:- తథాగతా! నీకు తెలియని విషయాలు ఉండవు. పూరీ క్షేత్రంలో జగన్నాథస్వామికి ఏటేటా భక్తులు చెల్లించే మొక్కుబళ్ళు మూడు లక్షల వరహాలకు తక్కువఉండవు. అతడో సామాన్య దైవం. నీవో తొమ్మిదో అవతారం. కాబట్టి నేను చెల్లించుకునేకానుక చాలా స్వల్పం అని తెలిసికూడా—

భిక్షు:- ఆపు నీ వాచాలత. నీ క్షుద్రకాంచనంతో నాకు పని లేదు.

మాయ:- (ఉబ్బిస్తే పుచ్చుకుంటాడేమో !) సిద్ధార్థా ! ఈ ధనం నీ చేతుల్లో చాలా సద్వినియోగం పొందగలదని నా విశ్వాసం. ఏ విహారమో స్తూపమో, తటాకమో, సత్రమో-

భిక్షు:- యువతీ ! నీ పొగడ్తల కుబ్బి నీ విచ్చే లంచాలు తీసుకునే దేవుళ్ళు చాలామంది ఉన్నట్లున్నారు. వారివద్దకేపోయి నీ అభీష్టం నెరవేర్చుకో. పో ! నన్నుమాత్రం బాధించకు.

మాయ:- భగవాన్ ! మీకు నావల్ల అంత బాధగా వుందా ?

భిక్షు :- బాధ ? 'తథాగతా' 'సిద్ధార్థా' 'సర్వజ్ఞా' అను నీ భట్టు పొగడ్తలతో నా చెవుల్నీ, అత్తరు గమగమల వెదజల్లుతూన్న నీ పైట చెరగుతో నా ఘ్రాణాన్నీ, బంగారు నాణాల మిలమిలలతో ప్రతిఫలిస్తున్న ఆ సంచితో నా కన్నుల్నీ దారుణదారుణంగా హింసిస్తూ బాధ యేమని ఇంకా అడుగుతున్నావా ? నారీ ! పో ! పో ! నీ జగన్నాథుడి దగ్గరకు పో ! లేక మరే నాథుడి వద్దకైనా పో !

మాయ:- (ఘాటుగా తగిలినట్టే అయినా భక్తులకు ఇవో లెక్కా ?) సర్వజ్ఞా జగన్నాథ క్షేత్రం ఇక్కడికి చాలా దూరం. అందుచేత వ్యయ మధికం-ప్రయాస మెందు.

భిక్షు:- కాబట్టే నన్ను పట్టుకున్నావు

మాయ:- కాదు, నీ మహిమను ఎందరో చెప్పుకోగా వినివిని నీ దర్శనానికై పరితపించి వచ్చాను. (చిరునవ్వు తొలకరిస్తూన్న పెదవులతో) భగవాన్ ! అదే ఆ వకుళోద్యానంలో ఆ కాళీగుడిని ఆనివున్న సౌధమే నాది. నా పేరు మాయాదేవి నా భర్త ఆ గుడి పూజారి. వస్తు సంభార సంగ్రహణార్థం ఆయన ప్రతిరోజూ పాటలీపుత్రం వెడుతూ వుంటాడు. ఆయన లేని సమయంలో నేను తమ సన్నిధికి వస్తూ పోతూ (అంటూ భిక్షు భుజంమీద చనువుగా వేలు పెడుతుంది).

భిక్షు:- (విసిరి కొట్టి) పో శాకినీ ! పో ఢాకినీ ! పోతావా, లేక నేనే పోవలెనా ? (చివాలున లేస్తాడు)

మాయ:- సరే. భగవాన్ ! మీకు మనశ్శాంతి కుదిరినపుడే మళ్ళీ దర్శనం చేసుకుంటా. సెలవు. (అంటూ భిక్షువుకు తెలియకుండా మొహిరీల సంచిని గోడమూల జారవిడిచి వయ్యారంగా నమస్కారం చేసి కులుకునడకతో వెళ్ళిపోతుంది.)

భిక్షు:- (కూర్చుంటూ) ఈ భక్తులతు మెదడు ఊసర క్షేత్రం—చర్మం మందం. అబ్బబ్బ ! ఒక్క స్త్రీతో ఇంత బాధపడ్డానే ? ఓ జగన్నాథా! నీవు పాషాణివి కాబట్టి బ్రతికిపోయావు. లేకపోతే ఈ భక్తజనం నిన్ను ఏకాహుతిగా భక్షించి వుండేది. (జోలి అందుకుని, ఒక అరిటిపండు తీసి తింటూ వుంటాడు.)

(అపుడు కూనరాగం తీసుకుంటూ దేశదిమ్మరి ప్రవేశం )

దిమ్మ:- (భిక్షువును హఠాత్తుగా చూసి) ఏమిటీ వేషధారణం ? భాయీ ! ఎవరండీ మనం ? నమస్తే ! నమస్తే !

భిక్షు:- నమస్తే !

దిమ్మ:- (స్నేహం కలిపేస్తున్నాడు) చూడు భాయీ! ఇవాళ అంతగా యెండ లేదు; వడగాడ్పులేదు. మంచి హాయిగా వుంది సుమా!

భిక్షు:- ఏ ప్రాంతం నుంచి నీ రాక ?

దిమ్మ:- నేనా ? ప్రపంచంలోకల్లా బ్రహ్మాండమైన పట్నం యేదో, అక్కణ్ణుంచి వస్తున్నా. (ఛాతీ విరుస్తూ) దాని పేరు కాశీ - మహాకాశీ - వారణాసీ- మణికర్ణిక - హరిశ్చంద్ర ఘాట్ !

భిక్షు:- ఓహో ! యాత్రికుడవా నీవు !

దిమ్మ:- (చక్కటి ఊహే!) ఔను. ఔను. యాత్రికుణ్ణి. మరి-గురూజీ! మన జోలిలో ఏమైనా తినుబండారాలున్నయ్యా ?

భిక్షు:- (జోలిలో చెయి పెట్టి) అరిటి పళ్లున్నయ్. (రెండు పళ్ళు యిస్తాడు.)

దిమ్మ:- పాపం - నీకో ?

భిక్షు:- ఇంకా ఉన్నయ్.

దిమ్మ:- అన్నదాతా సుఖీభవ ! (వొలిచి ఆత్రంతో తింటాడు)

భిక్షు:- నీది దిగులు లేని బ్రతుకు.

దిమ్మ:- నీకు దిగుళ్లున్నయ్యా యేమిటి భాయీ ?

భిక్షు:- (మౌనం)

దిమ్మ:- పోష్! ఎటువంటి చల్లటి రోజు ఇవ్వాళ్ల ! ఎంత మనోహరంగా వుంది ?

భిక్షు:- అల్లదిగో !- ఆ గుడి వంక పోయే దారి మీద దృష్టి సారించి చూడు ! నా శోక హేతు వొకటి కాళ్లతో నడచి పోతూ వుంది.

దిమ్మ:- (అటు చూస్తూ) ఎవరు? - ఓహో ! స్త్రీ అనుకుంటా! కాదు-లొట్టి పిట్టేమో ! - కాదు. కాదు. స్త్రీయే.

భిక్షు:- అందుకనే నా బాధ.

దిమ్మ:- (ఇందులో ఏదో కథ ఉంటదన్న మాటే! కన్ను గీటుతూ) అయితే-భాయీ! మనకీ ఆ స్త్రీకి ఏమిటి సంబంధం ? ఆత్మా పరమాత్మా సంబంధమా ? హహ్హహ్హ !

భిక్షు:- సోదరా ! వెంత వల్ల సుఖాన్ని అపేక్షించడం, నీళ్లులేని బావిలో చేద వెయ్యడం సుమా !

దిమ్మ:- హి హి హి ! వేదాంతం ! హి హి హి ! (నవ్వుతూ వుండగా గోడ మూల పడి వున్న సంచి కంట పడుతుంది) బలే ! బలే ! భాయీ ! ఇవ్వాళ మన రొట్టె నిజంగా నేతిలో పడ్డది. జై ! గంగామాయికీ జై (ఆ సంచిని అందుకుంటాడు)

భిక్షు:- ఆ యువతి ఎంత గసనరి ! ఆ పాపసంచితాన్ని ఇక్కడ దారి విడిచి పోయిందా !

దిమ్మ:- ఓహో ! ఆ మహానుభావురాలిదా యీ సంచి ? వాసన గుమ గుమ. ఆహాహా ! ఎంత సుఖంగా వుంది ఈ పరిమళం?

భిక్షు:- భ్రష్టుడా ! నీ ఆత్మ నైర్మల్యాన్ని కాపాడుకోవాలంటే దాన్ని దూరంగా పారవెయ్.

దిమ్మ:- ఓహో ! నేను పారేస్తే నువ్వు తీసుకోవచ్చుననా ఉపాయం ?

భిక్షు:- బుద్ధిహీనుడా ! ఆ సొత్తు నీదీ కాదు - నాదీ కాదు - ఆ యువతిది.

దిమ్మ:- కొంపతీసి ఆమె మళ్ళీవస్తే దీన్ని ఇచ్చెయ్యమనవుకదా ?

భిక్షు:- మరి? దానిని నా వద్ద నుంచుకొని నా అంతరాత్మను శాశ్వతంగా కలుషం చేసుకో మంటావా ?

దిమ్మ:- వద్దులే. నీ బదులు ఆ అంతరాత్మ బాధంతా నేనే పడతా ! (సంచి విప్పి చూస్తాడు. బంగారు నాణ్యాలు కనిపిస్తయ్. కదిలిస్తాడు. శ్రవణానందం. పకపకిలిస్తూ భిక్షువు కేసి చూస్తాడు.)

భిక్షు:- (చాలా రోతతో) ఛీ ! భ్రష్టా ! పో ! దూరంగా పో ! పుణ్య క్షేత్ర సమీక్షా కుతూహలుడ నగు యాత్రికుడ నంటివే ! అబద్ధం ! యాత్రి కుడవు కావు. గజ దొంగవు. కలి బిడ్డవు. కాంచన దాసుడవు.

దిమ్మ:- ఏమిటీ ఛాందసం ?

భిక్షు:- పో! నా సన్నిధినుంచి పో ! ఊఁ !

దిమ్మ:- అదికాదు భాయీ! అంత కంగారు పడతావెందుకూ అంట ? చూడు ! మన స్నేహం ఇప్పుడిప్పుడే గంగాయమునల్లాగా కలిసిపోతూ వుంది. స్నేహధర్మమంటే ఎంత పవిత్రం ! ఎంత అమూల్యం !—

భిక్షు:- (చివాలున లేచి) పాపీ! నీవు పోకపోతే నేనే పోవకతప్పదు. అంత రాత్మ అనేది నీకువుంటే, దానికి నీవే సమాధానం చెప్పుకో ! (గోడ దిగి అదే పాటున నిష్క్రమణం.)

దిమ్మ:- (భిక్షువుకేసి చూస్తూ పకపక నవ్వుకుంటాడు. అనంతరం-భిక్షువు కూర్చున్నచోటు మీదికి దృష్టి మరలుతుంది.) కూర్చోడానికి మొండి గోడ, ఆనుకోడానికి స్తంభం. భలే! ఇదీ ఒక కొత్త అనుభవమే! కాని, కూర్చొని చూద్దాం...(ఎక్కుతాడు. సరిగ్గా ఆ భిక్షువు కూర్చున్న చోటులో అతడిలాగే తిష్ఠవేస్తాడు. చేతిలోని మొహిరీల సంచిని గబగబా మళ్ళీ కదిలిస్తాడు.) ఎంత మధురంగా వుంది ఆ నాదం! (ముసి ముసి నవ్వులు నవ్వుతూ) పిచ్చుకలండీ! బంగారు పిచ్చుకలు! (ఒక్కొక్క పిచ్చుకనే గూటినుండి లాగుతూ) ఒకటి- రెండు - మూడు - నాలుగు (సంచి దులుపుతాడు). నాలుగేనా?! కానియ్! తృప్తి కంటే పరమరహస్యం లేదని శాస్త్రకారుడు చెప్పాడు (ఆ నాలుగు జేబులో వేసుకున్నాడు), బ్రహ్మానందం కాని, ఇప్పుడు మనకు చచ్చేటంత దాహం అవుతున్నది. ఏమిటుపాయం? ......బలే! ఆ భిక్షువు తన జోలి సొరకాయబుర్రా ఇక్కడే దిగ బెట్టి వెళ్ళాడు. ఇంకేం (దిగి బుర్రను అందుకుంటాడు. కదిపి చూస్తాడు. లొటలొట. ఆనందం. బుర్రయెత్తి నోట్లోకి ధారను పంపుతాడు. తృప్తి. ఇక జోలిని పరామర్శిస్తాడు) బైరాగుల జోలిలో గంజాయి చిలుముగాక మరేముంటుంది? అయినా చూద్దాం. (గోచీ వస్తుంది.) ఛీ ఛీ! (పారేస్తాడు. ఈసారి తాటాకుల గ్రంధం వస్తుంది) ఓహో! ఇదేదో వేదాంత సరుకు కాబోలు? (సంచిలో మరేమీ కనబడవు.) కానీ పెద్దమనిషి లాగా కాసేపు గ్రంథావలోకనం చేద్దాం. (సరిగ్గా ఆ భిక్షువు స్థానంలో అతడిలాగే కూర్చొని గ్రంథావలోకనం చేస్తూ వుంటాడు.)

(కొంతసేపటికి రాజకుమారుడు నిశ్శబ్దంగా ప్రవేశం. ఆరడుగుల పొడవు-ఆపాదమస్తకం మేలిపట్టు ముసుగు-ముఖం మాత్రమే కని పిస్తున్నది - క్షాత్రతేజస్సు. దిమ్మరి అతణ్ణి చూడలేదు. ఎందుకంటే, తన వెనుకనుండి అతడి ప్రవేశం. ఆ రాజకుమారుడు దిమ్మరి వెనకనే నిలబడి అతడి వీపును తన భక్తి వీక్షణాలతో అభిషేకిస్తూ)

రాజ:- వం—దే!

దిమ్మ:- (ఉలికిపడి) ఎవరు ?

రాజు:- (నమస్కరిస్తూ) తమ యేకాగ్రతకు భంగ మొనర్చితిని కాబోలు భగవాన్ !

దిమ్మ:- (భగవాన్ ఏమిటి) నా యేకాగ్రతకా ? భంగమా ? ఒష్ ! ఇంత మాత్రానికేనా ? పిడుగులు పడితే అనుకోవలసినమాట అది.

రాజు:- మరి - ఈ దీనుని సౌద నొక్కింత యాలింతురా ?

దిమ్మ:- సౌద ! పోష్ ! మగపురుషుడికి సౌద యేమిటి ?

రాజు:- భగవాన్ ! నీ సంభాషణలు నీ ప్రశ్నలు నీ లీలలు మిగుల దురవగాహము లని పెక్కురు చెప్పగా వింటిని.

దిమ్మ:- (ఆ భిక్షువే తానని ఈతడు భ్రమ పడుతున్నట్లు గ్రహించాడు. బలే ఘట్టం ! కానీ-మళ్ళీ లభిస్తుందేమో పిచ్చుకల వేట) అయితే - నన్ను గూర్చి ప్రజలంతా యేమనుకుంటున్నారు ?

రాజు:- సర్వజ్ఞా ! నీ వెరుంగని విషయము లుండునా ? ఈ కలిమానవులను తరింపజేయుటకై ఈ నలందాశిథిలములలో ఈ బికారి వేషమున ఆ బుద్ధపరమాత్ముడే యవతరించెనని లోకమెల్ల ఏకగ్రీవముగ వాకొను చున్నది.

దిమ్మ:- బలే ! బలే ! మీ మానవులు ఇంత కుశాగ్రబుద్ధులా ?

రాజు:- భగవాన్ ! చివికి చినిగిపోయిన నీ చేలము, దానిపై దట్టముగ నంటు కొని యున్న దేశ దేశముల మార్గధూళీ, నీవు సిద్ధార్థుడవని చెప్పక చెప్పుచున్నవి.

దిమ్మ:- అబ్బెబ్బే ! అంత వికారంగా వుందా మనవాలకం !

రాజు:- తథాగతా ! భక్తులను కఠినపరీక్ష సేయకుండ, నీవు సుప్రసన్నుడవు కావని లోక మెరుంగును. పెక్కు తెరంగుల నన్నుకూడ పరీక్ష సేయుదువని యెరింగియే వచ్చితిని.

దిమ్మ:- కాని, (దగ్గుతూ) నా పరీక్షకు నీవు పూర్తిగా నిలబడ్డావు సుమా !

రాజ:- సుగతా ! యుక్తాయుక్త వివేచన నాకు వెన్నతో బెట్టిన సుగుణము. నన్ను భ్రమింపజేయుటకు ఎందరెందరో నీవలెనే యత్నించి విఫలులైరి. భగవాన్ ! వేయి మాటలేల ? నిన్ను చూచిన నా తొలి చూపు నందే నీవు సర్వార్థసిద్ధుడవని సూటిగా గ్రహించితిని.

దిమ్మ:- (పొంగివస్తున్న నవ్వును దబాయించుకుంటూ) అంత సులభంగా గ్రహించావా ? అయితే, నావీపులో కూడా ఏదో మహత్తు ఉందన్న మాటే. దాన్నెగా నీవు మొదట చూసింది ?

రాజ:- మరల నన్ను పరిశోధించుచున్నావా ? తథాగతా ! వీపైన నేమి ? ముఖమైననేమి ? వస్తుతత్త్వపరిజ్ఞానమునకు వస్తువు నామూలాగ్రముగ బరిశీలింపవలెనా ? అందలి ఒక్క యణువును బరీక్షించిన జాలదా భగవాన్ ! నేను వచ్చిన పనిని గూర్చి ఇక విన్నవించుకొందును. ఆజ్ఞయా ?

దిమ్మ:- ఓ. కానియ్ !

రాజ:- నేను సామాన్య మానవుడను కాను.

దిమ్మ:- నీది గొప్ప విగ్రహం. (కొద్ది బుద్ధి !)

రాజ:- ధన్యోస్మి. నేను క్షత్రియాగ్రేసరుడను. ఈ నలందా ప్రజలెల్లరు నా కఠోర శాసనమునకు బద్ధులు. నే జేసిన పాపమును సామాన్య మానవులతో జెప్పుకొనుట అగౌరవకరమని నీతో చెప్పుకొనుటకై వచ్చితిని.

దిమ్మ:- (బాగా బోధపడలేదు) అయితే వుండు - మొదటి సంగతి, నువ్వో పాపం చేశానంటున్నావు. రెండో సంగతి, ఆ పాపం చెప్పుకోడానికి వచ్చానంటున్నావు అంతేకదూ ?

రాజ:- చిత్తము.

దిమ్మ:- మంచిది. అంతవరకూ అర్థమైంది. మరి- నువు చేసిన పాపాన్ని ఎందుకు చెప్పదలచుకున్నావ్ ? అంత ప్రమాదం ఏమొచ్చింది ?

రాజ:- మరల పరీక్షయా భగవాన్ ! చేసిన పాపము జెప్పుకొన్నచో బరిహారమగునని కదా పెద్దల సూక్తి ? అందువలన నావంటి

అసామాన్య వ్యక్తి నీవంటి యుత్తమోత్తమునితో జెప్పుకొనుటే సమంజసమని నిశ్చయించితిని.

దిమ్మ:- (అయితే, తాను కూడా వ్యాకరణయుక్తంగా మాటలాడుట సమంజసం. భగీరథ యత్నంతో) సరియ, సరియ. నా బిడ్డా! నీ పాపమును మాకు దప్ప కెరింగించుకొని రంగత్తుంగ తరంగ శృంగ భంగుదవు గమ్ము. (ఏమైనాసరే అని సమాసాన్ని వదిలేశాడు.)

రాజ:- భగవాన్! మరల బరీక్షయా? నీ లీల యెంతో నీ వాక్కును అంతియ. అగాధము! అచింత్యము! (నమస్కారము చేస్తాడు.)

దిమ్మ:- (నవ్వును ఆపుకోడానికి దగ్గు తెచ్చుకుంటున్నాడు.)

రాజ:- నా పాపమును గూర్చి ఇక మొర వెట్టుకొందునా?

దిమ్మ:- అవశ్యము బిడ్డా! అవశ్యము.

రాజ:- మీ పవిత్రచరణ పద్మముల ముందు మోకరింతునా?

దిమ్మ:- ఓ.

(రాజకుమారుడు మోకరిస్తాడు. దిమ్మరికి నవ్వు ఆగేటట్టు లేదు. మరి నవ్వితే కథ అంతం కాబట్టి, కప్పి పుచ్చడానికి చివాలున లేచి ఆ మొండిగోడమీద నిలుచుంటాడు.)

రాజ:- తథాగతా! నే జేసిన ఘోర పాతకము నిక నాలింపుము.

దిమ్మ:- ఆలించుచున్నాను. పుత్రా! ఆలించుచున్నాను.

రాజ:- నిన్న రాత్రి - ఇచటికి సమీపమందున్న ఆ కాళీ దేవాలయములో - సర్వజ్ఞా! నీవు చూచియే యుందువు-

దిమ్మ:- నేనా! అబ్బే! కాళీగుడికి నే నెప్పు డొచ్చాను?

రాజ:- నీవు దివ్యదృష్టి విభాసితుడవు.

దిమ్మ:- (ఔను సుమీ! ఎంత పొరపాటు!) ఔను. ఔను. కాని-మరి-బిడ్డా! మానవుల పాపకృత్యముల నరయుటకై మా దివ్యదృష్టిని ఉపయోగించం సుమా!

రాజ:- క్షమించుడు. క్షమించుడు. అజ్ఞానమున నట్లంటిని.

దిమ్మ:- ఇహ కానియ్ నీకథ. మాకు సమాధి వేళ అయింది. (భిక్షువు మళ్ళీ వస్తాడేమో అని అసలు దిగులు)

రాజ:- సర్వజ్ఞా! నిన్నరాత్రి - ఆ కాళీ దేవ్యాలయములో ఆ మనోహర వకుళోద్యానములో, ఆ మంజు మంజుల కుసుమ గంధ గంధిల వాతావరణములో, ఆ రాకాచంద్ర చంద్రికా పులకిత విభావరిలో, నేను-కాళీదర్శనార్థమై పోయిన నేను - కించిన్మధుపానమత్త చిత్తావస్థయందున్న నేను-ఒక యువతిని, పూజారిణిని, నవనవోన్మేష యౌవన ప్రాదుర్భావను, నా యున్మత్త నేత్రములతో జూచి యొడలు పులకించి-సర్వజ్ఞా! సర్వజ్ఞా! అనంతర కథాభాగమును జెప్పుటకు నోరు వెనుదీయుచున్నది.

దిమ్మ:- ఇంత చాటభారతం వినడానికి నా చెవులుకూడా అవస్థపడుతున్నయ్.

రాజ:- ఆ యువతి పేరు మీవద్ద దాచుటేల? సర్వజ్ఞా! ఆమె ఆ గుడిపూజారి భార్య. పేరు మాయ-మాయాదేవి.

(అంటూ ఉండగానే మాయ ప్రవేశం.)

మాయ:- రాజకుమారా! ఇక్కడికి వచ్చి ఇదా మీరు చేస్తున్న పని?

రాజ:- మాయా? చేసిన పాపము చెప్పవలదా?

మాయ:- వీడితోనా?! ఎవడీ వాలం లేని వానరం?

రాజ:- (లేచి మాయను కొంచెం దూరంగా తీసుకొనిపోయి చెవిలో) ప్రియా! నీ పేరు బయలు పెట్టలేదు సుమా!

మాయ:- అబద్ధం. నా చెవులతో విన్నాను.

రాజ:- అనగా-మరి-అంటే-అది-నీ పేరుకాదు. మరొక మాయాదేవి పేరు.

మాయ:- (కోపం. ప్రణయం.) నావంటి మాయ మరొక రున్నారా మీకు? పురుషు లెంత వంచకులు! ఈ సంగతి నాకు మొదటనే ఎందుకు చెప్పలేదు?

రాజ:- కాదు-మరి- మాయా!—మాటవరుసకు అట్లంటిని. క్షమించు. చూడు. ఈయన మహాత్ముడు. అగాధలీలా సముద్రుడు.

మాయ:- వీడా! వీడు! హాస్యాస్పదం. ఎవడో నిర్భాగ్యవేషధారి.

దిమ్మ:- నారీ! ఆ భక్తుని ధర్మాచరణానికి అలా ఆటంకం కలిగించ వచ్చునా?

మాయ:- నోరు ముయ్.

రాజ:- ఎంత మాటంటివి? (దిమ్మరితో) భగవాన్! క్షమించు. మాయా! భగవన్నింద నరక హేతువు సుమా!

మాయ:- ఇంత మౌఢ్యమా! రాజకుమారా! వీడెవ్వడో మూటల దొంగ. (పై సంభాషణ జరుగుతున్న సందర్భంలో ఇక కాలికిబుద్ధి చెప్పటం సమంజసమని నిశ్చయించుకొని దిమ్మరి మొండిగోడనుండి మెల్లన దిగి చల్లగా పారిపోతున్న సమయంలో)—

రాజ:- (అతడికి అడ్డంతగిలి మోకరించి) భగవాన్! నా పాపము పరిహార మైనదా!

దిమ్మ:- అయింది, అయింది. ఇక నేను పోవాలి, పాపం! ఒక నిరుపేద-బహుకుటుంబీకుడు - నా సాయం అర్థించి నాకోసం కనిపెట్టుకొని వున్నాడు. ఆ సంగతే మరిచిపోయా. ఇక తొందరగా పోవాలి.

మాయ:- పో! వంచకా! పో!

రాజ:- మాయా! ఏమి నీ ధూర్తత్వము. భగవాన్! క్షమించు. నాయొసంగు స్వల్పనివేదనమును స్వీకరించి నన్ను బునీతు నొనరించుము. (ఒక చిన్న మొహరీల సంచిని రొండినుంచి తీస్తాడు.)

మాయ:- రాజకుమారా! మీకు పూర్తిగా మతిపోతున్నట్లున్నది. వీడెవ్వడో జేబు కత్తెరదొంగ. నా మాట వినండి.

దిమ్మ:- కుమారా! నీవిచ్చే కానుకను ప్రతిఫలాపేక్ష రహితముగ నిష్కామ కర్మబుద్ధితో శ్రీకృష్ణార్పితంగా ఇస్తే స్వీకరించటానికి మాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు.

రాజ:- (సంచి ఇస్తూ) శ్రీకృష్ణార్పణమస్తు.

దిమ్మ:- (తీసుకుంటూ) తథాస్తు. (నిష్క్రమణం)

మాయ:- ఎంత మోసం? ఎంత వంచకత్వం?

రాజు:- ప్రియా ! అతడు వంచకుడని నీ అభిప్రాయము. మహాత్ముడని నా నిశ్చితము. చూచిన చూపు వెంబడినే ఏ మానవు దేవర్గమునకు జెందునో నిర్ణయింపగల సూక్ష్మ విచక్షణజ్ఞానము నాకు జన్మతో వచ్చిన సుగుణము. నన్ను వంచింప గల్గిన వ్యక్తి నేటివర కెందును బొడగట్ట లేదు. (నాటకంలో శృంగార నాయకుడిలాగ భంగిమ పెడుతూ) అనగా - ప్రియే ! నీ వాక్కు తెవు తప్పు-

(అంటూ వుండగా భిక్షువు ప్రవేశం.)

మాయ:- చూడండి రాజకుమారా ! ఈయనే నిజమైన మహాత్ముడు. గమనించండి. ఈ బ్రహ్మ తేజ మెక్కడ ! ఆ వానర వాలకం ఎక్కడ ?

రాజు:- బ్రహ్మ తేజము ? బోడితల, బూదియొడలు, కాషాయవసనము. ఇవి యేనా బ్రహ్మ తేజమునకు చిహ్నములు? హిహిహి ! ప్రియా ! మీ స్త్రీలు ఇట్టి వేషధారులను చూచి ఎంత సులభముగా మోసపోవు చుందురు.

మాయ:- వేషధారికాదు. ఈయనే నిజమైన మహాత్ముడు.

రాజు:- నీకెట్లు తెలియును ?

మాయ:- నే చేసిన పాపం ఈయనకే చెప్పుకున్నా.

రాజు:- వీనికా ? నా పేరుకూడ వెల్లడించితివా యేమి ?

మాయ:- ఔను.

రాజు:- ఇకనేమి ? ఈ దేశదిమ్మరి వాడవాడలా దండోరా వేసి నా పరువును నట్టేట కలుపక మానడు.

(ఇంతలో ఆ భిక్షువు మాయయొక్క మొహిరీలసంచిని మొండి గోడ మీదనుంచి అందుకొని)

భిక్షు:- యువతీ! ఇదిగో, నీ పాపసంచితం. ఆ బికారియెవడో దీనిలోనాణాల్ని దొంగిలించి పారిపోతుంటే తోవలో పట్టుకొని మళ్ళీ తీసుకున్నా. (అంటూ నాల్గు మొహిరీలు సంచిలో పెట్టి మాయకు అప్పగిస్తాడు.)

మాయ:- (తీసుకుని) ధన్యవాదాలు. భగవాన్ ! మీ మహిమ తెలుసుకోలేక ఈ రాజకుమారుడు కొంచెం పరుషంగా భాషించాడు. క్షమించాలి.

భిక్షు:- బొత్తుగా అనవసరం. అతడు నన్ను గూర్చి చెప్పినదంతా సత్యం. ధ్రువం. (అంటూ గోడ యెక్కి యథాస్థానములో యథారీతిగా కూర్చుంటాడు.)

రాజ:- వింటివా ? మాయ ? తాను మహాత్ముడను గానని తానే యొప్పుకొను చున్నాడు.

మాయ:- అదే మహాత్ముల లక్షణం.

రాజ:- (మాయ ఇంకొకర్ని మెచ్చుకోవడం చాలా దుస్సహంగా ఉంది.) ఏయ్ ! నీవు వేషధారి వగునా, కాదా ? నిక్కము వచింపుము.

భిక్షు:- వేషధారి కాని మహాత్ముడు యుగానికి ఒకడైనా ఉండవచ్చు. కానీ బుద్ధిహీనులు గాని యువకులు మచ్చుకైనా కనిపించరు.

రాజ:- ఏమీ, నన్ను బుద్ధిహీను డంటివా?

భిక్షు:- కాదని నీవు నిరూపించుకొనేదాకా అనక తప్పదు.

రాజ:- ఎవరితో భాషించుచున్నావో తెలియునా ?

భిక్షు:- వీనులుండీ వినజాలని, కనులుండీ కనజాలని ఒక నరాకృతి యంత్రంతో.

(రాజకుమారుడు తాను కప్పుకున్న అవకుంఠాన్ని గభాలున తీసేస్తాడు. నెత్తిమీద నవరత్న ఖచిత కిరీటంతో- మెడలో అమూల్య మణి ముక్తాహారాలతో - ఒరలో కత్తితో - కనిపిస్తాడు. అజంతా శిల్పాల్లో నుంచి ఒక బొమ్మ నడచివచ్చిందా అన్నట్లు ఉంది అతని విగ్రహం.)

రాజ:- ఓ గర్వితుడా ! ఇక తెలిసికొనుము. ఈ నలందా మండలమును శాసించు హిందూ ప్రభుదను నేను. నా కరవాలము అరివీర మత్తేభ ములకు సింహ స్వప్నము. అపరాధీ! సుక్షత్రియు నవమానించితివి. ఫలితము సత్వరమే నీ కనుభావ్యమగుగాక. (ఒరలో కత్తిమీద చెయ్యివేస్తాడు.)

మాయ - (చెయ్యిపట్టుకుని) ఏమిటిది రాజకుమారా? ఇలాటి అవతార పురుషులను వధించి మహా పాతకాన్ని మూటగట్టుకుంటారా?

రాజ:- తాను అవతారపురుషుడు కానని తానే ఒప్పుకొనెను. నీవు వినలేదా? (ఇంతలో భిక్షువు చివాలున లేచి ఆ మొండిగోడమీద నిలబడతాడు. ఆ గోడ, దానిమీద అతని అజానుబాహు విగ్రహం, ఆ అలౌకిక తేజస్సు, ఆ పురాతన శిథిల పరిసరాలు, అవన్నీ ఒక దానిలో ఒకటి లీనమైపోయి ఆ దృశ్యానికి ఒక అనిర్వాచ్య గంభీరతను ఆపాదిస్తున్నాయి.)

భిక్షు:- క్షత్రియా! నన్ను వధించు. కాని, హెచ్చరిక! నేను వధింపబడిన మరునాటి నుండి నా పేరుతో గుళ్లు, గోపురాలు ఊరూరా నిర్మించడం, అక్కడికి నీకన్న బుద్ధిహీనులేగాక నీకన్న బుద్ధిమంతులు కూడా భక్తినిబద్ధాంజలులై రావడం సంభవిస్తుంది. ఆ మందలో నీ వొకడవు!—

రాజ:- ఏమీ? మందలో నొకడనా? నేను! నలందా రాజ్య—

భిక్షు:- జీర్ణ శిథిల—

రాజ:- సింహాసనాధిష్ఠాతను, మందలో నొకడందువా?

భిక్షు:- కొంచెపు బుద్ధులకే అలాటి పదవుల గొప్ప. దొడ్డ బుద్ధికి అవి యెడారిలో ఎండ మావులు.

మాయ:- సుభాషితం! సుభాషితం!

రాజ:- (మాయతో) భట్టువలె పొగడుచున్నావు. నీవెంత? నీ జ్ఞానమెంత?

భిక్షు:- వేదాంతీ! జ్ఞానమంటే యేమిటో కొంచెం నీవే చెప్పు, చెప్పవేం? (రాజకుమారుడు తెల్లబోయి సమాధానం కోసం మాయ వంక చూస్తాడు. మాయ పక్కున నవ్వగా అతడు తలవంచుకుంటాడు.)

మాయ:- రాజకుమారా! ఇహరండి! శృంగభంగానికి నాందీ ప్రస్తావన అయింది.

భిక్షు:- సరే జ్ఞానమంటే ఏమిటో నేనే చెబుతా. యువకుడా! తలయెత్తి ఒక్కసారి నా ముఖంకేసి చూడు!

(రాజకుమారుడు యిప్పటికే పరాజితు డయ్యాడు. దిగజారిన గుండెతో తలయెత్తి భిక్షువు ముఖంకేసి చూస్తాడు.)

భిక్షు:- నేరస్తుడా! మాటవరసకు, ఈ యువతి భర్తను నేనే యనుకో.

(రాజకుమారుడి మొహాన్ని నెత్తురుచుక్క లేదు.)

భిక్షు:- ఈ భిక్షువు యెదుట ఎంత ధైర్యంతో నీ పాపాన్ని వెల్లడించావో, అదే ధైర్యంతో ఈమె భర్త ముందు వెల్లడించగలవా?

రాజ:- (అర్థమయింది. తల వంచుకుంటాడు.)

భిక్షు:- అదే-జ్ఞానం! పో! పోయి ఆమెభర్తను వెతకి పట్టుకొని అతడికి నీ పాపాన్ని చెప్పుకొని ఆ విధంగా పరిహారం పొందు. అది జ్ఞానం. ధీరుడా ! అరివీర మత్తేభ సింహ స్వపమా! వణుకుతున్నా వెందుకు? పో! పో!

(రాకుమారుడు వణికిపోతూ మాయను ఒక చేత్తో పట్టుకుని వంచినతల ఎత్తకుండా ఒక్కొక్క అడుగేస్తాడు. మాయకూడా తల వంచుకుని ఉంది. వణికిపోతున్నది. ఆ విధంగా యిద్దరూ వెళ్ళిపోతున్న సమయంలో)

భిక్షు:- (మేఘగర్జాగాంభీర్యంతో) చేసిన పాపమట! చెప్పుకొనుటకు వచ్చిరట! జ్ఞానుల లక్షణమట! ప్రాపంచిక సంగము లేని బైరాగుల ముందు, నోరులేని పాషాణ ప్రతిమలముందు, వంక వంక దండము లిడి లెంపలు వైచుకొని లంచము లర్పించుకొని ధన్యోస్మి యని తృప్తినొందజూచు ఓ మదమత్త యువతీ యువకులారా! పొండు. మీకు కావలసినవి బైరాగుల యాశీస్సులు కావు - భగవంతుని యనుగ్రహమూ కాదు- ఎవనిశయ్యను మీరు కలుషిత మొనర్చిరో, ఆ మగడు మీ మొగములమీద ఉమ్మియు నిష్ఠీవనం - వాని కశాఘాతం-వాని పాదతాడనం,ఇదే పరిహారమార్గం. పొండు!పొండు!

(భిక్షువు ఈ విధంగా గర్జిస్తుండగా తెర నెమ్మదిగా దిగుతుంది.)



## భూమికలు

రాఘవరెడ్డి
కుప్పుస్వామిరెడ్డి
భద్రయ్య
గోపాలరెడ్డి
రమాదేవి

స్థలం: త్యాగరాయ నగరు-రాఘవరెడ్డి మేడ-హాల్లో ఒక పేము మంచము, ఒక నవారా మంచము వున్నాయి. పేము మంచము వాల్చి వుంది. చుట్టిన పరుపులు, దిండ్లు కొన్ని విడిగా పేము మంచముమీద చిందరవందరగా వున్నవి. రోజు వారి, ఆసామివారి లెక్క పుస్తకాలు వాటిమీద పెట్టి వున్నాయి. ఒకటి-రెండు లెక్క పుస్తకాలు తెఱచిపెట్టి వున్నాయి. మంచానికి సమీపంగా మూడు కొయ్య కుర్చీలు, వాటిమధ్య పేముసోఫా-ప్రక్కనే ఒక బెంచి-బెంచిమీద ట్రంకుపెట్టె-చలవమడతలు-స్టూలుమీద భారతము-భాగవతము పెట్టి వున్నాయి. క్రింద చిరిచాప పఱచివుంది. వ్రాతబల్లపై లెక్కపుస్తకాలు పెట్టివున్నాయి-కోటుస్టాండు దానిమీద విప్పిన చొక్కాలు-పై పంచలు-కట్టుపంచలు-యింకా కొన్ని చలవ మడతలు కూడా వేసివున్నాయి.

కాలం: ఉదయం 10 గంటలు ఆ ప్రాంతం.

భద్రయ్య:- (రాఘవరెడ్డిగారి గుమాస్తా—వ్రాతబల్లదగ్గర కూర్చొని లెక్కలు వెతుకతూ వ్రాస్తున్నాడు—ఏదో అనుమానంగా లెక్కపుస్తకం చూచి మంచంమీద తెఱచివుంచిన పుస్తకం దగ్గఱికి తను వ్రాస్తున్న పుస్తకంతో వెళ్తున్నాడు—

వ్రాస్తూన్నప్పుడు చేతికందిన సిరాను తలకు రుద్దుకొంటున్నాడు-ఉనికి అంతా పల్లెటూరిరకం-ఎత్తు-అందుకు తగ్గ లావు-మాటల్లో నిదానం)

రాఘవరెడ్డి:- (వచ్చాడు. ఎఱ్ఱగా ఒడ్డు పొడుగు మనిషి- మంచి మీసకట్టు-వయస్సు 60 ఏండ్లు ఆ ప్రాంతం. పెద్ద తెల్లటి సరిగ పేటు తలపాగా-తెల్లటిచొక్కా పైన సరిగ అంగవస్త్రం-మల్లు కట్టుపంచ-చేతిలో కర్ర-కాళ్ళకు చెప్పులు. ఉనికి అంతా పల్లెటూరి రకం-కానీ, గంభీరమయిన రూపం-మాటల్లో చేతల్లో గాంభీర్యం వ్యక్తమౌతూ ఉంటుంది. తన మాటకు ఎవరూ అడ్డు చెప్పరాదు. పట్టుదల-కొంచెం తుస్సుకోపం వచ్చినా—వెంటనే సర్దుకోడానికి ప్రయత్నిస్తాడు—గోపాలపురం అగ్రహారీకుడు—సంపన్నుడు)

రెడ్డి:- అరణాలిస్తే జాలదంటేన్న ? రూపాయలిస్తా, తీసుకొందువులే... మనగోడివి.

భద్రయ్య:- ఎవరాతడు ?

రెడ్డి:- ఎవరో—రిక్షావాళ్ళగదో—యింకెవరో ? బండ్లో ఎక్కిందాక బతిఁవాలేది, ఎక్కింది మొదలుకొని ఒకటే గిరుడు. పేగుల్లో తీటం. అణా యీమని, బేడీమని ఒకటే నస. తీరా దిగినపాట బిడికోలు. యీళ్ళతో, గుజ్జాబ్బందోళ్ళతో ఒకటేపీడ. [రిక్షావాడి వంకదిరిగి] ఏందబ్బయ్యా నీ వనడం? అర్ధరూపాయ గావాలా ?...ఎందుకూ ? అరణాల కొప్పుకోని ఎక్కమంటివే ? తీరా దిగినపాట ఎందుకూ రెండణాలుజాస్తి—నీ బండ్లో ఎక్కిందానికి అపరాధం ఏవన్నా ఉడదిగనేం ?... [రిక్షావాడు ఏదో అంటుంటే వింటున్నట్టుగా వున్నాడు] శానాదూరం లాగినా ? బేడిచ్చినపాట నీవు లాగిన దూరంగాని దగ్గరి కొస్తదిగనేం ? అందుగ్గాదూ?......అందుగ్గాకి పోతే ఎందుకన్నా అవద్దిలే. మాకు పందిరాలా పో రూపాయలు—మేఁవిస్తే తీసుకొనేవాళ్ళు శానామందుండారు, పో-యీడ, రూపాయలు కోళ్ళు కొక్కరాయలు ఏరకతినటంలా, పో. [తలగుడ్డ-పై పంచ-కోటుస్టాండుకు తగిలించాడు. భద్రయ్య చేతికఱ్ఱవతల బెట్టాడు.] పోలేదంటయ్యా రిక్షాయన ? పయిటాలదాకా కూకున్నా నీ వనుకున్న దానికంటే అదనం అణాగూడా యియ్యనుపో చెప్తుండా—బండెక్కిందాక ఆట్టా-దిగినపాట యిట్నా, దరువు ? అమ్మా! బలే మన గోడివే...సామిలేదు —గీమీలేదు ఎల్లు. ఎందుకు పని పంచెరువు—ఇంకెవర్నన్నా అడుగుపో—ఇస్తారు. ఆ...ఏంది?—యీయకపోతే నన్నేం జేయమంటావు ? అదీ నా తప్పేనా ?

భద్రయ్య:- పోనీ పారేస్తే పోతుంది. బేడ్డబ్బులు—పేదవాళ్ళు.

రెడ్డి:- పారేస్తే పోవూ; దబ్బులుంటాయా ? అవి నువ్వొఁజెప్పాలా ?

భద్రయ్య:- రెండణాలు ఎక్కడరాలా-ఎక్కడబోలా ?

రెడ్డి:- నీవీ,-షావుకారివి — నీవిస్తే నే నొద్దంటుంటానా? మారాజుగా యియ్యి—ఏఁవీ—ఆచ్చాపణ ఏవుందదీ? బలే తెంపుజేసినావే— యియ్యమంటుండావే నీదేం బోద్ది?

భద్రయ్య:- పేదవాళ్ళని అన్నా.

రెడ్డి:- నాకు దెలీదూ ఆమాత్రం? అప్పటికి నీవు బలే తెంపయనోడివని, నేను పనికిమాలినోణ్ణని గాఁవాల నీవనడం? మొండికేస్తే యిస్తా రనిగదో, యిట్ట దిరుక్కునేది? ఒక్కసారి ఎగనాఁవంబెడ్తే బదే రావ్. మళ్ళదగతారా? యాడికన్నా ఓ పెద్దమాసింటికి పోతే ఆద, పోయిన పనొాదులుకొని, యీళ్ళతో యిది రంపు, పీద. పర్వవు బోగడ్తారు పెద్దమ్మలు.

భద్రయ్య:- వెళ్ళాళ్ళేంది.

రెడ్డి:- ఊఁ...యెళ్ళకపోతే భోజనఁవో అబ్బయ్యకు? ఎక్కింది మొదలు కొని ఒకే గిరుడు. దూరఁవనీ గిరఁవనీ...ఎండనీ, వాననీ..నాకు బలే తలనొప్పి పీడ—ఎక్కకుంటే జరగదు. భద్రయ్యా!

భద్రయ్య:- అయ్యా!

రెడ్డి:- కాఫీ ఉందాయేఁవో చిన్నోణ్ణి అడిగి యిట్టదెమ్మను.

(భద్రయ్య లోనికివెళ్ళి వచ్చాడు)

భద్రయ్య:- కాఫీ అయిపోయినాయట. మళ్ళీ కాశ్ని పెట్టమంటారా?

రెడ్డి:- ఎందుకో? అయ్యి అయిపోవడానికా? పిల్లిమెళ్ళో రొయ్యలు గట్టి నట్టేగదో, చిన్నోణ్ణి వంటయింట్లో బెట్టడం-అన్ని నగదిగిం చేయడఁవే గదో...

భద్రయ్య:- కుప్పుస్వామిరెడ్డిగారు వస్తున్నారు.

రెడ్డి:- అవునే...

(లేచి ఇంకో కుర్చీ దగ్గరికి పోయాడు)

(కుప్పుస్వామిరెడ్డి వచ్చాడు. ఎఱ్ఱగా పొట్టిగా వుంటాడు. బుఱ్ఱమీసాలు. మంచి వస్త్రధారణ-వయస్సు 60 సం॥ లు పైబడ్డవాడు-మాటల్లో చేతల్లో నిదానం. ఉనికి, మాటలంతా అరవ సాంప్రదాయం.)

(భద్రయ్యలోనికి వెళ్ళాడు. రెడ్డితో ఎవరన్నా సంప్రతించటానికి వచ్చినపుడు లోనికివెళ్ళే ఆచారము.)

రెడ్డి:- దండంబెడతా కుప్పయ్యగోరికి (నమస్కరించాడు యీ కుర్చీ మీద గూకోవాల...

కుప్పయ్య:- ఎక్కడ కూర్చున్నా అంతా ఓటిదానే—మరేమి తేడా వుండాది?

రెడ్డి:- అట్టగాదులే—వారుండక బోతే నేనంటానా?

కుప్పయ్య:-ఊర్కోదా మీరంట్రు—మీరుకూర్చోండి.

రెడ్డి:- నేను గూకోనయితే— యీడ గూకుంటాలే— వారలేకబోతే పేము సోపామీద కూకోమంటానా నిన్ను? పట్నమాసపోళ్ళు మీరు మా సున్నితంగదో? మాదేంది. ఎండనా గాలినా తిరిగేవాళ్ళం.

కుప్పయ్య:-మాకేం— గోషా వుండాదని తలిస్తిరా?

రెడ్డి:- కార్లేంది మీరు కాలు బయటపెడ్తారంటయ్యా? మాదేంది, ఎట్టబడ్తే అట్ట బోయ్యేదేగదో—గుంటన, మిట్టనబడి...

కుప్పయ్య:- మీరంతా సౌఖ్యందానే?

రెడ్డి:- ఇట్టావుండాం—అయితే, కుప్పయ్యా! నా జాబు జేర్గా?

కుప్పయ్య:- మీ జాబు చూచిదా, నా ప్రయాణం మానేస్తిని. లేకుంటే మన గ్రామం వచ్చేస్తామాని చూస్తిని. ప్రయాణంకూడా కట్టిని—జాబు చూచి మానేస్తిని—ఏమి? చూస్తిరా?

రెడ్డి:- మంచిపని చేశ్నావులే— మళ్ళీ వృధా కర్చులుగదో!

కుప్పయ్య:- ఊ ఊ—అంతదానే—ఇంట్లో ఆడవాళ్ళు, అమ్మాయి, మనబిడ్డ పెళ్ళికి నిండా తొందరచేస్తురు. పోయివచ్చేయి — అని నిండా గొడవపెట్రి—

రెడ్డి:- అవునులే. చెప్తినే—ఒకపని– ఆసుకున్నపాట అదయిపోతే, ఇంకో పని ఎతుక్కోవచ్చుగదో— నేనొకపని ఎత్తుకున్నపాట— రెక్కా ముక్కాడకుండా — ఆ పని చరామసిగా పూర్తిజేయంది నే నిద్రబోను.

కుప్పయ్య:- అద్దానే మంచిది—

రెడ్డి:- అబ్బయ్య, గోపాళయ్యగూడ సెలవలకు బెంగుళూరునుంచి యీడకే వచ్చుండా — అన్నివైజాలు యీడనే మాట్లాడుకోవచ్చని — మీ జాబు చూడగానే, అప్పుడే పోస్టునుంచి కవరు దెప్పించి, భద్రయ్య చేత జాబు రాయిస్తినే—

కుప్పయ్య:- బిడ్డ లోపలవుండారా అని అడుగుతాను.

రెడ్డి:- ఉన్నట్టులా, భద్రయ్యా!—

భద్రయ్య:- (లోపలనుంచి వచ్చాడు) అయ్యా!

రెడ్డి:- అబ్బయ్య, గోపాళయ్య వుండాడేఁవో చూడు.

భద్రయ్య:- చీకట్లో ఎక్కడికో వెళ్ళాడు—

రెడ్డి:- చెప్తినే—యిప్పటికి వాణ్ణి నేను చూదానాంట!

కుప్పయ్య:- సరిదా— నిండా బాగుండాది—

రెడ్డి:- రాత్రి యాణ్ణుంచో పొద్దుబోయి వచ్చాడంట— మళ్ళి తెల్లారే టప్ప టికి యాడికెళ్ళాడో యెళ్ళాడు— మీరు చూచిళ్ళా గోపాళయ్యను?

కుప్పయ్య:- ఇప్పుడు చూళ్ళా. యింతకుముందు చూస్తిని. సాపాటుకు యిప్పుడు వస్తురుదానే— అప్పుడు చూస్తాను.

రెడ్డి:- రాడో— యాశికి బోతాడు? అయినా ఏఁవో? యాడన్నా స్నేహి తులయింటికి బోతాడేఁవో— మనకేందెలుసు—

కుప్పయ్య:- అప్పుడుదా మూడు ఘంటలకు చూస్తాను— ఇప్పుడేమి అంత మునిగింది?

రెడ్డి:- అట్టగేలే, ఏఁవంత తినబోయే కూరాకు కొసరికోసరం తొందర?

కుప్పయ్య:- మీ ప్రయాణం నిండా సౌకర్యందానే ?

రెడ్డి:- బలేసౌకర్యం! చెప్తేతీరదు. ఒళ్లు మొగం కదుఁవుబగద్నే—తన్నులు, పొడుపుర్దిని—

కుప్పయ్య:- అయ్యో, అంత కష్టపడ్తిరా!

రెడ్డి:- తిన్నగా అంటావంటయ్యా, ఒక్కటే తొక్కుడు గదంటయ్యా! యాడ అడుగు పెట్టబోయినా, రైల్లో—మూతులు, ముక్కులూ బొడుసు కోటఁవేగదో! పైన పడుకొన్నోళ్లు కాళ్ళతో దన్నిరి, కిందోళ్ళు మోచేతుల్తో, మోకాళ్ళతో బొడిచిరి. అడుగెత్తి పెట్టడానికి— సొఁవాన్లు తొసుగుపడ-యెంపలికయ్యాలో నుసుగులున్నట్లు-బండలు బడ్డ అడ్డాలు. సొవాఁన్లు బెట్టేచోట పండుకొనిరి, కూకునేచోట పండుకొనిరి. పడుకొన్న పెద్దమాసుల కదిలిస్తే, కాంద్రిస్తా పెద్ద పులులు పైనబడ్డట్టు చంపబోయేది, లేకుంటే ఎత్తుబడ్డ గొడ్డోల ఈడి గిలబడి మెడలు బాచేది. దోవలో సొవాఁన్లు అడ్డాలు బెట్టిరి- ఇంక యాడ కదిలేది, మెదిలేది? అసలు మనోళ్ళకు మాసిమీద మాసికి నిఘావుంటేగదో? మొదటమనోళ్ళు మొరటోళ్లు గదంటయ్యా— ఎద టోడి కష్టసుకాలు ఎరిగినోళ్ళయితే యింత యెతలాడది? ఇంక యాడ మనదేశం బాగుపడేది?

కుప్పయ్య:- నిందా మొరటుదా, చూస్తామే జనాలు—

రెడ్డి:- అదేందో పెట్టికాడికి ఎవుడన్నా ఎక్కాలనొస్తే - పెట్టెల్లోవాళ్ళ మొగాలు— తుమ్మల్లో అస్తమానమయినట్టు— నల్లగ చీకటిబడ బెట్టుకొంటా రెందుకో! వాళ్ళబ్బసొత్తుగ్గాని వస్తుందాఁవా? లోపల గూకున్నపాట— బలే మొనగోళ్లగాఁవాల వాళ్లు? ఎదటోణ్ణిజూస్తే బలేతుస్కారం అబ్బయ్యలకు.

కుప్పయ్య:-మన జనాలకే మట్టు, మర్యాద తెలిస్తే దానే—

రెడ్డి:- అసలు ఎంత మంచోడిగ్గూడ బండిలోకి ఎక్కతేపరి, పుడ్తాదిలేవయ్యా తెగులో!

కుప్పయ్య:-నిజందా!

రెడ్డి:- నిజవేంది-నేనుజూస్తునే వుండా, గూడూరుకాడ బండ్లో వాళ్ళను— కాళ్ళు ఏళ్ళుపట్టుకొని బతిఁవాలి బఁడ్లోకి ఎక్కాడు ఓ పెద్దమాసి లోపలకొచ్చినపాట, తిరుక్కున్నాడయ్యా దరువుకో!—ఎవడు పెట్టి కాడికొచ్చినా ''పో, యింకోపెట్టికెళ్ళు- యీడ చోటులే'' దని దబా యిస్తుండాడు.

కుప్పయ్య:- అద్దా - మనవాళ్ళు - ఏరుదాటి తెప్పపగులంగొట్టేకి దానే. వాడుదా దాటినాడు- ఎవరు ఎట్టపూడిస్తే వాడికేమి ?

రెడ్డి:- ఆమయిన—జవిర్నా అబ్బయ్యను- ఆడ ఎక్కిందాక బతిమాలి, పని అయినపాట మొనదేలినావే మనగోడివి. సంసారి బిడ్డవు ఆట్ట జెయ్యొచ్చంటయ్యాని అడిగిన పాట మొఖం నల్లగ బెట్టుకొన్నాడు.

కుప్పయ్య - మంచిపనిజేస్తిరి-

రెడ్డి:- తప్పుజేస్తే, చెప్పకపోతే వాడికి తప్పొప్పు ఎట్టా దెంసేది—ఆట్టా చూస్తుండేవాళ్ళంతా తాత్సారం మాసులు... ఒకరి కష్టసుఖాలు ఎరిగినోళ్ళుగాదో ! ఆవదం వుండేచోట—పురుదుబోసుకొనేవాళ్ళు- నా కిష్టంలా అపన్లు—

కుప్పయ్య:- ఇంటికి టాక్సీ మోటారులో వస్తిరా ?

రెడ్డి:- ఎవరో—మేవా - ఎందుకో ? అర్ధ రూపాయతో బొయ్యేదానికి ఐదులు-అర్లు-

కుప్పయ్య:- మీరు ఎప్పుడొచ్చేది రాస్తే—నేను కారు పంపేవాణ్ణేదా-

రెడ్డి:- ఎప్పుడొచ్చేది నాకు తెలిస్తేగదో—అణ్ణుంచి యీడికి కాలుపెరుక్కోని వచ్చేటప్పటికి దావుదంపులయింది.

కుప్పయ్య:- ట్రాంలోదా వస్తిరి ?

రెడ్డి:- ఏం ట్రాంవులో, బస్సులో పో—ఆడ అడుగుపెట్టేటట్టుండదా ?

కుప్పయ్య:- ఎందుకు చెప్తురు—ఏది చూడండి, నిండుదా. హోటలు నిండుదా- రైలు నిండుదా - బస్సు నిండుదా - ఒక్క మనిషికిదా కడుపు నిండేదిలేదు. ఎప్పుడు ఆకలిదా యీ పొట్టకోసందానే .యింత కష్ట పడుదు.

రెడ్డి:- నిజవే—అసలు మాసులకు ఆకలుజాస్తి అయినాయిలే అయ్యా ! యింక యాడుటంది స్థివితవో ? ఎంత ఉప్పుదింటే అంత దాహంవే గదో ! లేకుంటే యీవంతన మాసులు యిసుళ్ళపుట్ట పిగిలినట్టు ఏందిది ? ట్రాంబండి కిక్కిరిసి వుండది. ఆడ నలగటా ఆడోళ్ళు— యీళ్ళకు మగోళ్ళకు మించిన పనుల్లే ! ఇంకేంది కుప్పయ్యా ! ట్రిప్లికేనులో కొంచెం పనుంటేనూ జూచుకొనే. ఆడనుంచి మాంబళానికి

బస్సుఎక్కుదాంవని భద్రయ్య, నేను ట్రాంలో ఎక్కినాంవు...సూది మోపడానికి సందులేదు...మాసికి మాసికి అతికిచ్చినట్టుందది... భద్రయ్య సళ్ళుగా గాంవాల నిలుచుకొని వుండాడు—ట్రాంబండి గబక్కున కదిలేటప్పటికి—ఆమయిన మా భద్రయ్య బిళ్ళపాటుగ ఎదాళం కూకోనున్న ఓ ఆడకూతురిమీద బడ్డాడు. ఆమయిన ఆగం, జాతర—ఏం భద్రయ్యా ! ఆమాయన బిళ్ళపాటుగా బడ్డవే !

భద్రయ్య:- ఏంజేసేది—గభక్కున కదిలింది—

రెడ్డి:- చేసినమటుకు జాల్లే—మళ్ళీ యింకా పడాలనా ? [అందరూ నవ్వు కొన్నారు] అబ్బా- పయాణం బలేయెతలు, పీడ.

కుప్పయ్య:- అందుకుదా, మీరు కారుకొంటే... నిండా మంచిది. వచ్చేదానికి, పోయేదానికి నిండా సౌకర్యం. కారుకుకూడా కంటోర్లు పూడ్చింది. సీఘ్రం కొనండి. మీకుదా, ఎప్పుడు తిరిగేపని...చేతిలో కారుంటే ...నిండా మేలుదా...

రెడ్డి:- ఏంమేలో...యిప్పుడే పిల్లగోళ్ళు చెప్పినమాట యినదంలే. యింకా కారుకొంటే దాంట్లో కూకొని వాళ్ళెళ్ళుతుంటే వాళ్ళ పరుగంటు కొనేది ఎవరో ? కారొద్దులే - యిట్టుంటే చాల్లేయ్యా... లేకుంటే నీ బిడ్డ నియ్యాలనుకొంటుండావ్- నీవే ఒక కారుకొని...ఆలుమొగుడు దాంట్లోగూకొని యెల్తుంటే నీవు లగుదోల్దువ్...నన్నించేవోంగాదో... నిలబడిపోయినా...

కుప్పయ్య:- మీరు దుడ్డు దాస్తుతు- ఖర్చుపెట్టురా...

రెడ్డి:- ఖర్చుపెట్టడానికి మళ్ళె కొండైనా తరిగేదేగదో...ఆస్తులు జాల్తాయా ఖర్చులకు కుప్పయ్యా ?

కుప్పయ్య:- మీకుదా ఆస్తిలేదు-

రెడ్డి:- ఉంటేఉంటదిలే... ఉంటే ఖర్చుపెడ్తే కొడుకులకు రేపు జవాబు చెప్పొద్దు?...

కుప్పయ్య:- మరి...మనందా వియ్యం అందవాల...నాకోరిక చెప్పివుండానే !

రెడ్డి:- అచ్చొపణే వుండది- చెప్తినే- మాటిస్తినే-

కుప్పయ్య.- పై నెల్లో ముహూర్తం వుండాది-జోస్యులు చెప్పిరి - అమ్మాయిని గోపాలుకుయిచ్చి కళ్యాణంచేస్తే నా భారం తీరిపోతాది- ఏమో, వాళ్ళు గంజో, అంబలో తాగుతురు- మన జబాబుదారి పోను...అంతదా...

రెడ్డి:- యాడకి నీ జవాబు పోయేది ! ఆ మూడుముళ్లు పడ్డబాట తప్పించు కొందావనుకుంటుండా'... అమ్మా దక్షిణాదోళ్ళు చిక్కటారా- మాటల్లో మనగోళ్లగదో...

కుప్పయ్య - ఏమో, ఓ బిడ్డదా- కొడుకు కూతురు- అంత ఆమెదానె-మీచేతుల్లో పెడ్తే నాభారం తీరును- ఎదిగిన బిడ్డను యింట్లో పెట్టుకొనివుండేది నిప్పులు ఒళ్ళోకట్టుకున్న మాదిరిదా...

రెడ్డి:- అచ్చొపణేఁవుండడ ' మాసుల్లో—యిప్పుడు యివేకంకంటే ఉద్రేకం జాస్తి. సిలకడ తక్కువ. ఎనకా ముందు జూచేదిలా—నెత్తికొచ్చిన పాట-అప్పుడు దారి ఎతకడానికి ఆరంభంజేస్తారు. సఁవిష్టిమీద మంచి శబ్బర్లు చూచేదిలా—అదంత మంచిదిగాదు. ఏఁవయినాగానీ, పై నెల్లో ముడిబెడ్తేపోద్దిపో.

కుప్పయ్య:-అద్దా – నేను తీర్మానం చేస్తిని — మీరు సమ్మతిస్తిరి — నిండా సంతోషం.

రెడ్డి:- అయితే...మా కోడలు...అయ్యో' పెండ్లిగాకముందే మా కోడలం టుండా. పరసిలేదుగదో...

కుప్పయ్య:-మీకోడలుదానే—మీ గోపాల్ భార్యదానే—

రెడ్డి.- గదైతే–బెంగుళూరు నుంచి ఎప్పుడొచ్చింది?—

కుప్పయ్య.-రెండారోజుల్దా అయింది.

రెడ్డి:- నేను జూళ్ళేదులే—యిప్పటికి మీ అమ్మాయిని.

కుప్పయ్య-రండి సాయంత్రం— చూడండి. అచ్చొపణేవుందీ అంటాను.

రెడ్డి - అచ్చొపణేవుం దయితే—అసలిప్పుడేం తొందర—నిదానంగా చూడ గూడదో...

కుప్పయ్య:-అబ్బాయిని కూడా పిల్చుకొనిరండి—చూడండి.

రెడ్డి:- ఎందుకూ అబ్బాయి ? ఏంబన్నా పో—సంసార్ని ఏంది జూచేది. మే వేం సినిమాలు తియ్యడం లేదులే — మూతులు ముక్కులు వైణాలు జూడ్డానికి.

కుప్పయ్య:-అది సరిదా—మీరు, అబ్బాయి—రమాను చూస్తేదా మంచిది— ఉభయులకు తృప్తిదానే.

రెడ్డి:- చెప్తినే...ఎందుకు చూసేది—ఏంబన్నా—అమ్మాయికేం బంగారొంటి బిడ్డ—నాకు తెలుసుపో.

కుప్పయ్య:-అంతా వాళ్ళ తల్లినోట్లో వూడిపడినట్టుంణ్ణు.

రెడ్డి:- అచ్చాపణేవుండది-నిన్ను జూస్తే తెలుస్తుళ్ళేదంటయ్యా మీ అమ్మాయి ఎట్టుండేది? నాకు జెప్పాలా? ఎట్టున్నా జేసుకొనేదే—యింకేంవి— ఎవురు నన్నడిగేది?

కుప్పయ్య:-అంతా వాళ్ళ తల్లిదా—

రెడ్డి:- అవునూ - మీ సంబంధానికేంవి - దరిమాల్న ఆస్తి—చదువు, నగ నట్రా, వైనంతైనం—యింకేంకావాల? బంగారం వంటి సంబంధం గదంటయ్యా...బంగారు వాసనగొట్టే యిల్లూ, సంసారంగదో నీది- చూడాలంట్నే...పిల్లను. అబ్బయ్యా...ఎంబన్నాపో...చేసుకొనేది— చేసుకొనేదే...పో...

కుప్పయ్య:-ఇప్పుడు పది వేల రూపాయల నగకట్టుండాది - పెళ్ళినాటికి పాతిక వేలు భర్తీచేస్తును—

రెడ్డి.- చెయ్యకపైతే? నాప తెలీదు? యింకా పది వేలు-అధనవే బెడ్తావులే- ఎంవుకలేని చెయ్యిగదో నీది? నాకు తెలవదో...

కుప్పయ్య:-కళ్యాణవప్పుడు మద్రాసులో టవున్లో గోవిందప్ప నాయకర్ వీధిలో మూడిళ్లు ఆమె పేరిట చదివిస్తును-నెలకు ఎనిమిది వందలు బాడుగ వచ్చును—

రెడ్డి:- ఆస్తంతా ఆ బిడ్డదయితే - యియ్యంతా నాకెందుకూ చెప్పడం? నీ తెంపు నాకు తెలవదో...ఫీజు తీసుకోకుండా నా యవ్వారాలంతా

జక్క పెడ్తివే...సందెదు గుండె వుండే వోడివిగదో, న కు తెలువదో ...నా కెంతపని జక్కపెట్టుండావు! మరచిపోతానా? కుప్పయ్యా-

కుప్పయ్య:- స్నేహితందానే...

రెడ్డి:- పాణవన్నా యియ్యవంటయ్యా? నీతో యియ్యం అందుకోదవంటే నా మనసు కెట్టుండా దనుకొంటుండావు? మా గోపాలయ్యకు నీ బిడ్డను పెళ్ళిజేసేది ఖాయం ... ఇటు సూర్యుడు అటు బొడిచినా తప్పదు - నీవు గాదంటే కూద ఆ అమ్మాయిని దొంగిలించుకొని ఎత్తకపోయి మా పిల్లోడికి పెళ్ళిజేసేది ఖాయం, జెప్తుండా...

కుప్పయ్య:- ఆట్టచేస్తేదా దుద్దు మిగుల్తాది నాకు—ఏఁ మునిగింది? ఎట్టా — అమ్మాయిని మీ అబ్బాయికి పెళ్ళిచేస్తురు-అంతదానే-నాకేం కావాలి. యిప్పుడే ఎత్తుకొని పూదవండి-నేను సిద్ధందా.

రెడ్డి:- అమ్మా! ఖర్చులేకుండా పెళ్ళిచేస్తా ననుకుంటుండా - ఎట్టనో ఒకట్ట వద్దిలే పెళ్ళి-పొద్దుబోయిందిలే, భోంచేస్తాం. ఒరే చిన్నోడా-పీటలై.

కుప్పయ్య:- క్షమించండి-యింటికిపోవాల-అమ్మాయి కాసుకొని వుండును. మీరు రాండి-మా యింట్లో భోంచేస్తాము,..

రెడ్డి:- నేను పిలిచినపాట పిలుస్తుండా వేగానీ-ముందు పిలిచినా? అమ్మా కుప్పయ్యా! ముందు మాటమిగిల్చిస్తాదేవోఁ చూచినా? చూడ్డానికి ఏంతెలీనోడున్నట్టుంటావుగాని, లోపల యింకంతమాసీ వుళ్ళే దంటయ్యా-అవుఁ-సంసారి ఆట్టనే వుండాల్లె. పైకి పొంగగూడదు. చేసి చెప్పాలగాని, చెప్పి చేయగూడదు-లే, భోంచేస్తాం.

కుప్పయ్య:- ఏమి అనుకోవద్దు-యింకా అంతా మనయిల్లుదానే-ఎప్పుడు ఇక్కణ్ణే భోంచేస్తుము-తృప్తిదానే-

రెడ్డి:- పట్నమాసపోళ్లతో మేఁవు మాట్లాడి గెలవగలవో, అయ్యా! అందులో వకీలయిపోతివి...కాలికేస్తే మెడకు, మెడకేస్తే కాలికి అందిస్తుండేదే గదో...మీకు మేఁవేంది మాటలు జెప్పేది ... బాపకు యీత నేరిపి నట్టేగదో!...

కుప్పయ్య:- మరి నేను పూడుస్తానా? — అందరూ రావాల.. గోపాలును మళ్ళీ మూడు గంటలకు చూస్తాను...మీరు చెప్పండి — రాత్రికి మనింట్లో విందుదా...అందరూ రావాల...వస్తునా?

రెడ్డి.- ఈ రోజుల్లో పిలిస్తే రాకుండా వదలడం యాడదీ? నీకేం అనుమా నంబన్లా వో...పీటలు పగల్తాయి పో...

కుప్పయ్య:- వస్తునా?...

రెడ్డి:- మంచిది...దణ్ణంబెడ్తా...

కుప్పయ్య - శుభం...నమస్కారం...

(వెళ్ళారు)

రెడ్డి:- భద్రయ్యా...

భద్రయ్య - అయ్యా...(వచ్చారు...చేతిలో లెక్కపుస్తకం, పేనా ఉన్నాయి)

రెడ్డి:- ఆ చెల్లుల ఇవరాలు కనబడ్డాయుంటయ్యా!

భద్రయ్య:- కనబళ్ళా. వెతుకుతున్నాను...

రెడ్డి:- ఎందుకూ ఎతికేది...రాస్తేగదంటయ్యా కనబడేది? నేను నూరు మార్లు చెప్పంగా... తపిసీళ్ల బాడిలో, యివరంగా శుద్దంగా-రాయం డయ్యాని. రాస్తేగదంటయ్యా? నే జెప్పలా భద్రయ్యా?...

భద్రయ్య - చెప్పారు...

రెడ్డి.- ఎప్పుడూ?

భద్రయ్య:- ఎన్నోసార్లు చెప్పారులెండి...

రెడ్డి:- చెపితే ఏం లాభం? నీ అవకతవక పని నూవు జేస్తూనే వుంటివే! ఏంపీ...తవుడులింటా అంత ఒయ్యారం? చేసే పనిమీద నిగావుంటే గదో. ఉత్తపద్దులు రాస్తివే, యేదైనా యివరం గావాలంటే మళ్ళీ ఆసామికాడికి, బత్తెఖర్చులు పెట్టుకొని తిరగతుంటా? ఎగుడు దిగుడుగా రాసేది. ఇన్కంటాక్సు ఆఫీసర్లచేత మాటలు బడతుంటా? ఇంక జెప్తుండా, అంతా కరకటుగా వుండాల... మనకు బన్నా దొంగకూళ్ళ.

భద్రయ్య:- చిత్రం, అదేదో పొరపాటయింది.

రెడ్డి:- యాడ? అదేనా పొరపాటు? ఇంక నీ రాతలో పొంపాట్లు లేవనా నీ వనేది? నీ వంటే ఏం లాభం? నేనుగదో చెప్పాల. ఏం లెక్కలయ్యా, పొద్దస్తమానం...రాయను తుడవను సరిపాయె. పనేంది జరిగేది? లెక్కలేఁవో వగదిగదు. ఒక్క మొహము ఆవంతన సిరామాత్రం పూసుకొంటావు... మానుదోలిన ఎద్దులు బురదపూసు కున్నట్టు. అదేందయ్యా యింతమదుగు? పీద... యెంతసేపటికి యెనకదండెమీ దుంటావే గాని ముందుకు నడవ్వే! అసలు నీవు కూకున్నచోట ముద్దీ మరచిపొయ్యేవాడివే...నీ కేంది పని జరిగేది? ఎత్కుకోను సరిపాయనే పొద్దస్తమానం...

భద్రయ్య:- ఇంక పది పద్దులుంటాయి...వగదిగిస్తాను...

రెడ్డి:- వగదిగించు...యీడ పని పూర్తిచేసుకో పోవాల. గోపాళయ్య పెళ్లి వస్తుందది. ఇంక మనకు తీరదు. మొత్తాలు ఒవరంగా ధాన్యానికి ధాన్యం...రొఖ్ఖానికి రొఖ్ఖం...ఇవరంగా వుండాల. చెప్తుండా, ఎగుడుదిగుడుగ రాయబాక. గోపాలయ్య వచ్చిండే, ఇట్రమ్మని చెప్పు.

భద్రయ్య:- అట్లాగేలెండి... (లెక్కపుస్తకాలతో లోనికెళ్ళాడు)

గోపాలరెడ్డి:- (వచ్చాడు. వయస్సు 22. మంచిరూపం, ఒడ్డుపొడుగు, చలాకి మనిషి, మాటల్లో నిదానం వుంది. మెత్తటి హృదయం. తండ్రిని జూస్తే గౌరవం భయంకూడా కద్దు. తండ్రి కోప్పడ్డప్పుడు తగ్గి మాట్లాడ్తాడు. మొత్తంమీద సరదామనిషి.)

రెడ్డి:- భద్రయ్య నీతో ఏఁవన్నా జెప్పినాడా మందల?

గోపి:- నాతో యేం చెప్పలేదు. యేం విశేషం? చెప్పండి...

రెడ్డి:- మనోళ్ళేలే...పెళ్ళి విషయంగా వచ్చారు. నీతోజెప్పి నాడేఁవోనని...

గోపి:- ఎవరిపెళ్ళి?

రెడ్డి:- యేందా అడగడఁవా! నీ పెళ్ళికేగదో...ఇంక మనింట్లో ఎంత మందుండారు. పెళ్లి కావాల్సినోళ్ళు? నీకు దెలవదో?

గోపి - నా పెళ్లికా?

రెడ్డి:- అంటె...నీకు పిల్లనిస్తానని ఎవరూ మనింటికి రాగూడదు గనేం?... నాకు తెలీలేదులే...

గోపి - ఎవరండి వాళ్లు?

రెడ్డి.- మనోళ్ళేనని జెప్పిళ్లా!

గోపి:- మీరు జెప్పేది అర్థం కావటంలేదు...

రెడ్డి:- నీకు పిల్లనిస్తాఁవని వచ్చారు. పెళ్లిచేసుకోఁవని చెప్తుళ్ళా... అంత అర్థంగాకుండా చిక్కుగా యేఁవుండది? నే నేం మలయాళం గాని మాట్లాడ్తుండానా?

గోపి·- నేను పెళ్ళిచేసుకోదల్చుకోలేదు...

రెడ్డి:- ఇప్పుడేనా? యింకెప్పటికూ్కడానాని?...

గోపి:- ఇప్పుడల్లా అక్కర్లేదు. ఇంకెప్పటి విషయమో ఇప్పుడు జెప్పలేను.

రెడ్డి:- ఎట్లా ' !

గోపి.- నాకు పెండ్లక్కరలేదు...ఏం?...

రెడ్డి - ఎందుకూని?

గోపి:- నా కిష్టంలేదు.

రెడ్డి:- ఏఁవో అంత యిష్టం లేకపోవడం? యీ కాలపు పిల్లకాయలు పెళ్ళి జేసుకోమన్నప్పుడు ఒద్దని నీలిగేది... తీరా, పెద్దోళ్ళు ఎట్నో పెళ్ళి జేస్తే పెళ్ళాంమాటలు యిని, అమ్మ అబ్బలగ్గూడా కూడుపెట్టకుండా తిరుక్కొంటుండార్లే...నీది అదే దరువుగా వుండదే జూస్తే...

గోపి:- నేను చదువు పూర్తిజేసుకోవాల.

రెడ్డి:- పెళ్ళిచేసుకొని చతకరాదో ఆ చదువులు...

గోపి - చదువు పూర్తిగాంది నా కిష్టంలేదు. అంతే...

రెడ్డి·- అయితే నా యిష్టం దొంగలకు దోల్నా?

గోపి.- నా అభిప్రాయం జెప్పాను. మీ యిష్టం...

రెడ్డి:- మంచిసంబంధం వచ్చినపుడు కాదంటే అవతల మనకిష్టబడ్డ సంబంధం వస్తదా ? ఇట్ల జూడవయ్యో...దొరా ?

గోపి:- ఇంతకూ వాళ్ళెవరో జెప్పకూడదాని

రెడ్డి:- అదెందుకూ నీకు? నీవు పెళ్ళిచేసుకుంటావా? లేదా?

గోపి:- మీరేం జెప్పందే ఎట్లా?

రెడ్డి:- నీ కేం జెప్పాల? వాళ్ళను నీ వెరగవు...

గోపి:- మీకు నచ్చిన సంబంధం నాకు నచ్చకపోవచ్చు. ఏం?

రెడ్డి:- ఎట్లా !!

గోపి:- అసలు పెళ్ళికి మీ నిర్బంధం యెందుకు?

రెడ్డి:- ఎందుకంటే నేను బతకలాక. యింకెందుకయ్యా?

గోపి:- నా పెళ్ళిగురించి మీకు ఆందోళ నక్కర్లేదు...

రెడ్డి:- పెద్దచదువులు చదివినోళ్ళకు అమ్మఅబ్బలు పెళ్ళికుదిరిస్తే చేసుకో కూడదుగాఁవాల...

గోపి:- ఇంతకూ మీ రిప్పుడు కుదిర్చారా ఏఁవిటి కొంపదీసి ?

రెడ్డి:- కుదిరిస్తే చేసుకోగూడదని, మీ చదువుల్లో వుందదాని? తెలీక అడగతాలే...

గోపి - దాంపత్యం ఒకరు కుదిర్చేది గాదులెండి. ఎవరెవరి చిత్తసంస్కారా న్ననుసరించి వాళ్ళే భార్యను ఏర్పరచుకొంటారు. అలాగే స్త్రీ భర్తను ఏర్పరచుకొంటుంది. అదే నిజఁవయిన దాంపత్యం. ఆ దంపతులు తమ జీవితాన్ని సార్థకం జేసుకొంటారు.

రెడ్డి:- కవనం జెప్తుండావే! నాకు మా అబ్బ, అమ్మ కవనం జెప్పినా ... లేకుంటే నేను జెప్పనూ యింత పొడగని? అయితే నీ కుండే వూహ నాకు లేదనా నీవనేది? అంతేగదో?

గోపి:- ఏమో మీరే ఆలోచించండి...

రెడ్డి:- ఆలోచించినా...ఆలోచించగుండా చెయ్యడంలా .. బాగా ఆలోచించే కుల,,, గోత్రం,,,ఘాతు...జోడు, నాణ్యం..., నవ్వుడూ, మంచి

సెబ్బరా... ముందెనకలుజూచుకొనే, మాట జెప్పినా, నీయాల గుడ్డెద్దు చేలో బడ్డట్టు గుంటామిట్టా జూడకుండా పోవడంలా...

గోపి:- నేను నా హృదయంలో రాసుకొన్న చిత్రంలాంటి స్త్రీ దొరకంది నేను పెండ్లాడదలచుకోలేదు...

రెడ్డి:- అబ్బో! పూరాగా వుండిందే... యవ్వారం? ఎట్టా? అంతకంటె యింకా మెరుగైనబొమ్మ కనబడ్తే...అప్పుడు యీ బొమ్మను తుడి పేది, యింకోటి రాసుకొనేదిగదో? యింకోటి కనబడ్డపాట మళ్ళీ తుడిపేది, మళ్ళీ రాశేది. తుడవను రాయను. రాయను తుడవను సరిప్పాయనే కాలంవంతా. యింకేంది పని జరిగేది? వొళ్ళంతా నీ బొమ్మలన్నట్టు...ఏంవో జెప్పినశాస్త్రంగా... లోకంలో నీవను కొన్నబొమ్మ ఒక్కటయితేసరే, యెతల్లా. అంతకుమించి యింకా మేలురకం బొమ్మలెన్ని యుండాయోనే ... ఎప్పుడు నీవు ఖాయంజేసేది ?

గోపి:- అందరికీ ఒకే అభిప్రాయముండవు...

రెడ్డి:- ఎందుకుండవో? నీవేనా యిట్ట ఆలోచనజేసేది...యిప్పుడు అందరూ నీ దరువే ఏసేది.

గోపి:- అప్పుడు మీ తత్వంగూడా తప్పే అవుద్ది.

రెడ్డి:- పోనీలే... అయితే అవద్దిలే...అంతేగదో...

గోపి:- అందుకే యెవరికివారు నిర్ణయించుకొంటారు...

రెడ్డి:- ఆదోళ్లుగూడా నీ వనుకున్నట్టు అనుకుంటే ...అప్పుడు నిన్ను పెండ్లాడే ఆడకూతు రెవరూ? వాళ్లు వాళ్ళ కిష్టంవచ్చిన బొమ్మల్ను వాళ్లు రాసి తుడపనూ, మీకిష్టంవచ్చిన బొమ్మల్ను మీరు రాసి తుడపను మళ్ళితే యింకేంది సంసారాలు ముందుకొచ్చేటి?

గోపి:- కాబట్టి ఆ బాధ్యత యిరువురి యందుంటుంది. ఇరువురు నిర్ణ యించుకొంటారు

రెడ్డి:- యాడ నీవు నిర్ణయించుకొనేది? నీవు రాసిన బొమ్మ ఖాయంవయితే గదో నిర్ణయించేది? యింకో బొమ్మను చూచి చూడక ముందే దాన్ని

తుడిపితివే ! ఎవర్నో ఒకర్ని పెళ్ళిచేసుకొని ఒకరి కష్టసుఖాలు ఒకరు అనుకొని'కాడిగొర్ల'మోస్తరిగా సంసారాన్ని గుంజి బయటపడకుండా, బొమ్మరాసినావంటే బొమ్మను ! రాస్తే తుడిపేయి, చించేయి, బోద్ది, పీడొద. టి యీవంతన యెరికి గట్టు చేరే దెప్పటికి? యప్పటికైనా ఆలు, మొగుడు ఒకర్ని కనిపెట్టి ఒకరు, మంచి సెబ్బర్లు చూచుకుంటూ ఒకరి కొకరు లొంగిపోయి సంసారాలు యెగదోసుకోకపోతే యాడ నిగ్గేది ? యియ్యేన్ని వల్ల గాదనే ఎవర్నో ఒకర్ని మెడగట్టుకొని ఊరేగమనింది, చిక్కున బిడ్డారనేవయ్యో...తెలీకగాదు, మాసి అను కునే వన్ని అవతాయ ? యాడకాడ సరిపుచ్చుకోని, ఎదటోడికి యతల్లేకుండా, వుండే దాంట్లోనే సుఖం జూచుకొని, సంసారం గుట్టుగా ఎల్లదోసుకునోడు, వాడు మనగోడు...తెలిసిందా ?

గోపి:- ఏఁవైనగానీండి. మీ ప్రయత్నం మానేయండి. లాభంలేదు. నా కీ పెళ్ళొద్దు.

రెడ్డి:- (కోపంవచ్చింది) ఎవర్తో జెప్పేది ఆ మాట ! తెలిసి అంటుంటా వాని!... తీరు దినుసు లేకుండా మాట్లాడున్నా వే...

గోపి:- ఏం ? ...

రెడ్డి - మాలుగు మీ దుండావే మాసివి ఏఁవో !

గోపి - నా కిష్టంలేదు చెప్తే తప్పా ఏఁవిటి ?

రెడ్డి - మళ్ళీజూడు... ఒక పని నేను గావాల అనుకున్నవాట వదులు కొన్నది ఎప్పుడైనా జూదినా ?

గోపి:- కాజట్టి ?...

రెడ్డి:- పెళ్ళిజేసుకోవలసి దేగదో, మళ్ళి తిరగేసది ?

గోపి - ఏఁవిటండీ యీ మొండిచట్టం ? మీరు నా-పెండ్లికు కూటె యిచ్చారు, నా మాట లేకుండా ?

రెడ్డి - బలే క్రాసు జేస్తుండావే జడ్జివి.... నేను మాటజెప్పటానికే నిన్నింకి అడిగేది, బలే పెత్తనదారువి... నిన్నడగద్దొమరి !

గోపి:- మీ రెవర్నో మీ యిష్టంవచ్చిన వాళ్ళనుజూచి, న్నన్ను నిర్బంధ పెట్టడం ఏఁవిటి, అర్థంలేదు. అసలు మీ యిష్టం వచ్చినవాళ్ళను నేను పెండ్లాట్టం ఏఁవిటి ?...

రెడ్డి:- నే నెంతమందినో జూశ్నా... పరాయిపిల్లల్ని వూరికే జూస్తుంటే వూర్కుంటారా ? ముఖంమీద కొడ్తారు.

గోపి:- మీరు ఎవర్నో... కోతినో, కొండముచ్చునో తెచ్చి కట్టిపెట్టాలను కున్నా రేఁవిటి ?

రెడ్డి:- ఏఁవీ కోతైతే జేసుకోగూడదా ?

గోపి:- అబ్బా ఏఁవిటీహింస ?

రెడ్డి :- కోతినైనా జేసుకోవాల, కొండముచ్చునయినా జేసుకోవాల. సంసారికి 'యిల్లు యిరకటం, ఆలు మరకటం' అన్నారు పెద్దోళ్ళు.

గోపి:- మీ తత్వంవేరు, మా తత్వంవేరు. మానేయండి ధాలు.

రెడ్డి:- చాల్లే నిలుపుదువూ. ఏఁవో ఐలేతిరుక్కుంటుండావే అబ్బియ్యేవు ఎట్టా ? అంతా గోవగొడ్డు లైనుగా వుండదే! మేతకుమాత్రం వచ్చేది, పనికి పట్టుకోబోయినపాట అరిచేది, తన్నేది, పొడిచేది...అట్టుండదే నీ యవ్వారం ! మీ యిష్టపకారం బోతే సరి, లేకుంటే తిరగబడేదా?

గోపి:- మీతో నేను వాదించలేదు.

రెడ్డి:- ఇంకా జవాబు చెప్తుండావే ! చెప్తుండా, ఏఁవయినా ఆ పిల్లను జేసుకోవాల్సిందే.

గోపి:- ఏఁవయినా కానీండి, నేను చేసుకోను. అంతే.

రెడ్డి:- ఎంతయినాగాని ఆ పిల్లను నీవు జేసుకోవాల్పిందే...చెప్తుండా.

గోపి:- ఆఁ...

రెడ్డి:- ఆఁ లేదు, గీఁ లేదు. మళ్ళీ జెప్తుండా, ఆపిల్లకు పళ్ల పొడుగు, మూతొంకర, అవిటికాలు...

గోపి:- చాల్లేండి, మానేయండి.

రెడ్డి:- కళ్ళులేవు, గుడ్డిది; నెత్తి ఊసిపొయ్యిందాది. నేను వాళ్ళకు మాటజెప్పా. చెప్పినా, చెప్పకపోయినా యిప్పుడు జెప్తుండా, చేసు కోవాల...కావాల. చెప్పు, కాని పొద్దుబోతుందది.

గోపి:- [తండ్రివంక తీక్షంగా చూచాడు]

రెడ్డి:- చూస్తే చూచినావులే! కోపం వచ్చినపాట పొదస్తావుగనేం? కొమ్మల్లేవులే మంచిచెప్తేగూడ బలే కష్టంగా వుండదే. ఆఁవదం బిడ్డకు ఉగ్గుపెడ్తుంటె వద్దని ఏడుస్తుళ్ళా? ఏఁవన్నా, వదులుకొనే టట్టుందదా...ఏడుస్తుందది బిడ్డ పాపవని? మంచిదిగాబట్టి ఏడి పించన్నా బోస్తుళ్ళా? అంతేగదో.

గోపి:- అయితే యిప్పు డేంచేయమంటారు?...

రెడ్డి:- ఒప్పుకోమనగదో చెప్తుండేది. చెవులు మధ్యంగానేం?

గోపి:- ఆ అమ్మాయిని చూచి చెప్తాను ... చేసుకోటఁవో, మానేయ టఁవో...

రెడ్డి:- నీ వెందుకూ చూచేది? నేం జెప్తుళ్ళా? అసలు నీవు ఆ పిల్ల బాగున్నా బాగలేదంటే, అప్పుడు నీ పరు గంటుకొనేదెవరూ? అసలు యింత దూరం వచ్చినపాట నీవు బాగలేదని ఎగనావం బెట్టవాని? ఆమాత్రం నాకు తెలవదో. నాకు కవసలోడే చెవులు కుట్టింది; నాగేళ్ళసే నన్నేసాహెబుగాదు.

గోపి:- మీరు బాగుందంటే నాకేం కావాల? నాకు నచ్చాల అంతేగా.

రెడ్డి:- అందుకే జెప్తినే.... పళ్ళుపొడుగు, ఒక్కన్ను, నెత్తూసిపో యుందది... ఆ పిల్లకని. దాపరికం ఏవుందది?

గోపి:- ఆ అమ్మాయి యెంత అనాకారయినా నన్నంగీకరించకపోవచ్చు. అప్పుడు మీ ప్రయత్నవంతా వ్యర్థమవుతుందేఁవో?

రెడ్డి:- ఆ యవ్వారం నీ కెందుకూ? అదెందుకూ నీకూంట?

గోపి:- ఇంతకూ ఓమారు చూణ్ణివ్వండి, తప్పేం?

రెడ్డి:- నీ పెళ్ళాంఁ వనిపించుకొని చూడు, నాకేం ఆచ్చాపణలా

గోపి:- పెళ్ళయినతర్వాత యింకేఁవిటి జూట్టం, అంగీకరించటవున్న?

రెడ్డి:- అదిగదో నే ననేది !

గోపి:- ఏఁవిటండీ, యీ గొడవ ?

రెడ్డి:- పరాయిబిడ్డను నీవేంది జూసేది ? చూచి బాగలేదంటే ఆ బిడ్డకు అదొక వొరకా ! అసలు నీ కెందుకో నే చెప్తున్నా ? మేఁవంతా అమ్మా అబ్బ చూచి పెళ్ళిచేస్తే చెడిపోతిమి... అందు గ్గావాల భయ పడ్డం పాపం? నీ కంటె పెద్దాస్తి; నీతోపాటు చదువుకొన్నది; బంగా రంలాంటిపిల్ల.... దరిమాల్ని ఆస్తితోగూడ మనింటికి వస్తుంటె వద్దటనే, ఆ పిల్లను జూడాలట్నే; ఏందో బలే పోలా అవతలబడ.

గోపి:- అయితే......

[ఏమో అనబోయి మానేశాడు. మాటరాలేదు. కళ్లు ఎఱ్ఱనైనాయి.]

రెడ్డి:- ఏఁవయితే... బలే మిటకరిస్తుండావే.

గోపి:- ఏఁవయినా కానీండి. ఈ బలవంతపు పెళ్ళి నాకక్కర్లేదు.

రెడ్డి:- ఎట్లా ! !

గోపి:- మీ వాగ్దానాలతో నాకు ప్రమేయం లేదు. చెప్తున్నాను.

రెడ్డి:- మళ్ళీ జెప్పూ ?

గోపి:- నూరుసార్లంటాను, అక్కర్లేదని...గంభయినా నాకక్కర్లేదు, మానే యండి. [వెళ్తున్నాడు]

రెడ్డి:- ఎట్లచేసుకోవో జూస్తానుగా ! యగటాయించి యాడకి బోతావో మాణ్ణో ? అల్లా సినిమాల్లో, నాటకాల్లో నాయనను కున్నావుగనేం నన్ను ? నేను వొమలుకొనేవణ్ణి గాదు వాళ్ళలా...వాళ్ళు కొంచెం సేపు పొంగేసి, చల్లారేది... అయిన కొడుకులు నే నెల్తాననో, చస్తాననో అని చెప్పినపూట, అబ్బాయిలను బతివాలి తీసికొచ్చి సరసాలాడ్తుంటార్లే ! అట్టనుకున్నావేమో నన్ను నీవు ? ఏం ఉపయో గంలా. చెప్తుండా, కళ్లు రెండు మూసుకొని తాళిబొట్టు కట్టాల్సిందే... ఏవయినాగాని...

గోపి:- నే నంగీకరించను, ఏమవుతుందో చూస్తాను... [రెండడుగులు నడిచాడు.]

రెడ్డి:- ఎగటాయించి ఎల్తుండావే.... యాడి కెళ్ళేది నీవు ? ఎళ్ళదా నికిలా...

గోపి:- [నిలిచాడు] ఏఁవిటీఘోరం ! వెళ్లానికిగూడ మీ యిష్టవేఁవిటి ?

రెడ్డి:- నా యిష్టం గద్దైతే... నీ యిష్టఁవా ? నా మాట గాదన్నపాట యిం కాడ నీ వుండేది ? మద్దాం భోజనం యాడన్నా యెతుక్కోపో...

గోపి:- అలాగే లెండి... [మళ్ళీ రెండడుగులు నడిచాడు]

రెడ్డి:- ఎల్లా అయితే... ఏఁవిరా గోపయ్యా ! ఎళ్లావాఅంట ! చెప్పరాదో? నా మాట గాదన్నపాట నిన్ను నేను మయిట్ చేస్తావనుకొన్నా ? యింక పయికం బంపుతాలే... బొంగుళూరులో ఖర్చు బెడ్డువు. ఎద్దునోటికి చొప్పందించినట్టు అందిస్తుంటె రూపాయలు నీ యిష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టి... యిదా, నీవు జదివింది ? యీడ నీవు సంపాదించిపెట్టింది లేదుపో.

గోపి:- మీ సంపాద్యం నా కక్కర్లేదు. ఎట్లాగో బతుకుతానులెండి.

రెడ్డి:- బతకవోమరి!... మూడు లోకాల్లో యాదున్నా నిన్ను వదల్ను; జెప్తుండా... తప్పించుకుందా వనుకుంటుండావుగావాలం.

గోపి:- ఏఁవిటండీ యీ హింస ?

రెడ్డి:- నీకు ఆ పిల్లను గట్టిపెట్టకపోతే నేను రాఘవరెడ్డిని గాననుకో. ఏఁవో ఎగతాళి అనుకుంటుండావు గాఁవాల, యిప్పుడేబోయి పిల్చుకొస్తా వాళ్ళను... ఎట్ట తాళిబొట్టు కట్టవో జూస్తా. ఒరే చిన్నోడా! పీడై, వస్తుండా... నీదొక అలస్యవంటరా. [వెళ్తున్నాడు... లోనికి వెళ్తూ మళ్ళీ వెనక్కి తిరిగాడు.] నేను మళ్ళీ కోర్టుకు పొయ్యే లోపల నాకు ఏమందలా చెప్పాల. ఎగతాళని అనుకుంటుండా వేఁవో... [రెడ్డి లోనికి వెళ్ళాడు.]

[గోపాలరెడ్డి ఏమీ తోచక అటు ఇటు ఓమారు పచారుచేశాడు... ఓ నిమిషం అంతా నిశ్శబ్దం... రెడ్డికి వినబడకుండా గుమాస్తాను పిలిచాడు ]

గోపి:- భద్రయ్యగారూ !

భద్రయ్య:- (వచ్చాడు) అయ్యా !

గోపి:- ఇట్లా రండి.

భద్రయ్య:- ఏం ?

గోపి:- వినలా యీ గొడవంతాను ?

భద్రయ్య:- నేను లోపల వేరేపనిలో వున్నాను.

గోపి:- ఎవరో నా పెళ్ళి విషయం మాట్లాడ్డానికి వచ్చారట. మీకు తెలుసాండీ?

భద్రయ్య:- తెలుసండి.

గోపి:- ఎవరూ? నాయ న్నడిగితే చెప్పరూ... కోప్పడతారు.

భద్రయ్య:- కుప్పుస్వామిరెడ్డి గారు.

గోపి:- ఏ వూరు ?

భద్రయ్య:- ఈ ఊరే.

గోపి:- వారేంజేస్తున్నారు ?

భద్రయ్య:- వకీలుగా వున్నారు. యిప్పుడు మానుకొన్నారులెండి.

గోపి:- ఎప్పుడొచ్చారు ?

భద్రయ్య:- మీరు యింటికి వచ్చేదానికి ముందు.

గోపి:- యీ వూళ్ళో వాళ్ళ యిల్లెక్కడో తెలుసా మీకు ?

భద్రయ్య:- తెలుసండి.

గోపి:- ఎక్కడ, చెప్పండి

భద్రయ్య:- మాంబళంలో...

గోపి:- ఎక్కడ ? వీధి పేరు ?

భద్రయ్య:- నెహ్రూ రోడ్డు...

గోపి:- ఆ క్రొత్తమిద్దేనా ? వీధి తిరుగుళ్ళోనే మొదటి యిల్లు.

భద్రయ్య:- అవునండి.

గోపి:- వారేనని మీకు బాగా తెలుసా ?

భద్రయ్య:- తెలుసండి. మనకు కొన్నాళ్ళు వకీలుగా కేసులు చూస్తుండేవారు...

గోపి:- అయితే ఆ అమ్మాయి పేరుగూడా తెలుసా మీకు ?

భద్రయ్య:- తెలీదండి...

గోపి:- యింతకు మా నాయన చూచారా అమ్మాయిని ?

భద్రయ్య:- చూచినట్టులా.

గోపి:- ఏడ్చినట్టుంది. పోనీలే... మళ్ళీ కుప్పుస్వామిరెడ్డిగా రొస్తారా ?

భద్రయ్య:- సాయంత్రం వస్తానన్నారు.

గోపి:- మా నాయన వస్తున్నారు...

భద్రయ్య:- నేను వెళ్తాను... (భద్రయ్య వెళ్ళాడు).
(రెడ్డి వేరే దుస్తులు ధరించి, తలపాగతో కోర్టుకెళ్ళటానికి తయారయి వచ్చాడు. గోపి తండ్రినిచూచి చాలా నమ్రతగా వున్నాడు.)

రెడ్డి:- భద్రయ్యా !

గోపి:- భద్రయ్యగారు, నాయన పిలుస్తున్నారు, త్వరగా రండి.

భద్రయ్య:- (వచ్చాడు.) అయ్యా !

రెడ్డి - నేను బోతుండా... కాని మరి... పోదాం... కజ్జ యిట్టీ...

గోపి:- మీరు పోండి, నేను యిస్తాను. (కజ్జ నమ్రతగా యిచ్చాడు)

రెడ్డి:- (తీసికొన్నాడు) ఏంజేసినావు మందల ?

గోపి:- మీ యిష్టంవొచ్చినట్లే కానివ్వండి

రెడ్డి:- వాళ్ళిప్పుడొస్తారు...

గోపి:- ఎవరండి ?

రెడ్డి:- పెళ్ళోళ్ళుగదో రాత్రికి వాళ్ళింట్లో...

గోపి:- ఏం ?

రెడ్డి:- ఏం బలే గత్తరబడ్తూండావే! ఏఁవో రైను మార్చుకొన్నట్టుండావే! రాత్రికి వాళ్ళింట్లో మనకంతా యిందు.

గోపి:- ఎన్నిగంటలకండీ?...

రెడ్డి:- ఎన్నిగంటల కంటుండావు...యాడికన్నా పోయిరావాలగనేం ?

గోపి:- మీరు వెళ్ళముందె వెళ్తాను...

రెడ్డి:- యాడికి బోవద్దు...

గోపి:- పెళ్ళి యీ రోజేనాండి?

రెడ్డి:- యియ్యాల గాకపోతే నెలరోజుల కవద్దిలే ! పెళ్ళయిన పాట తిరుక్కుంటావుగనేం? అమ్మాయియిని జూడబన్లేదుగదాని?

గోపి:- అక్కర్లేదు, మీరు చూస్తేచాలు. యింతకూ మీరు చూచారా ?

రెడ్డి:- నేను చూస్తాలే. నువు జూడకుండా ఒప్పుకొనేదేగదాని?

గోపి:- తప్పుతుందా?

రెడ్డి:- తీరా, వాళ్ళొచ్చినపాట కోతని, కొండముచ్చని, నలుపని, తెలుపని, పళ్లూచ్చాయని, ఉన్నపళ్ళు మిట్టని, పల్లఁవనీ అనవే?...

గోపి:- ఎట్టున్నాసరే... కుంటిదైనా, గుడ్డిదైనా సరే...మీకు బాగుంటే చాలు.

రెడ్డి:- సరేపో... (గోపి రెండడుగులు నడిచాడు) మళ్ళీ అనికలు బెట్టవే ?...

గోపి:- ఊఁహూ.

రెడ్డి:- తెలీదు? నేను యాడకి బోతా, నీవాడికి బోతావు? భద్రయ్యా!
[భద్రయ్య వచ్చాడు].

రెడ్డి:- ఓ రిక్షా పిలవయ్యా...రాఘవయ్య యింటికి బోయి రావాల.

భద్రయ్య:- అట్లగే.

రెడ్డి:- ఎంత బాడిగ...అరణాలకు పైన యివ్వనని జెప్పు. కరకటుగా మాట్లాడు. నీళ్ళు నవల్తా రాబాక...

భద్రయ్య:- అరణాలకు రాకబోతే...

రెడ్డి - రిక్షావాణ్ణి ఆడ వుండమని నీవు రిక్షా లాక్కో(రా, యింకేం(వి? యీదకే దగ్గిర కేగదో...వస్తారు పో...యిందాకొచ్చిళ్ళా; భద్రయ్యా! పరమానందయ్య శిష్యులరకానికి తిరుగుతుందవే! రేటుగాని చెరిచేవయ్యో! అరణాలపైన దువ్వమీద దమ్మిగూడ లా.

(భద్రయ్య వెళ్ళాడు)

రెడ్డి:- ఆ తలగుడ్డ యిట్టి దేవోయ్ గోపయ్య !

(గోపి తెచ్చియిచ్చాడు. భద్రయ్యవచ్చి) రిక్షా వచ్చింది.

రెడ్డి:- బాడుగెంత ?

భద్రయ్య:- అరణాలు.

రెడ్డి - రారంటివే అరణాలకు' బలే పాలుమాలినోడివయ్యా నీవు.

భద్రయ్య:- అర్ధరూపాయ అడిగి ఆరణాలకు వచ్చాడు.

రెడ్డి:- వా డెంత అడిగితే మనకేం. మనం ఇచ్చేది అరణాలుగదో! నే నిప్పుడేవస్తా. నీవు కోర్టుకుపోయి, వాయిదా మందల కను క్కో(రా... (యిద్దరు వెళ్ళుతారు)
(గోపాలరెడ్డి తన చేతిలో వున్న పుస్తకాన్ని చదువుతూ, అప్పుడప్పుడు కాగితాలు తిరగవేస్తున్నాడు. ఓ అరనిమిషం అట్లా జరిగింది. అంతా నిశ్శబ్దం. ఎవరో వస్తున్నట్టు గమనించాడు. రమాదేవి వస్తుంది. చూచాడు. కాని ఏం ఎరగనట్టు పుటలు తిరగవేస్తూ చదువుతున్నాడు.)

రమ:- (వయసు 18 ఆ ప్రాంతం. మంచి రూపం, చలాకి మనిషి, మంచి వస్త్రధారణ, ఆడంబరం లేదు, నాగరికత ఉట్టిపడుతూంది, పట్టుదల జాస్తి, ముఖంలో నిస్సహాయత, ఆందోళన కనబడుతున్నవి. వచ్చి నిలచింది, గోపి గమనించనట్టున్నాడు. రమ గోపిని హెచ్చరించ లేదు, గోపి మౌనం.)

రమ:- క్షమించండి.

గోపి:- (చూచాడు) రమా !

రమ:- గొప్ప ఆదర్శపురుషులని లోకం అంతా అనుకొంటూంది.

గోపి:- అందుకు మీ అభ్యంతరం ఏఁవీ లేదనుకొంటాను.

రమ:- ఎప్పుడూ చదువుతప్ప లోకంలో యింకేం మీకక్కర్లేదూ?

గోపి:- చదువంతా పూర్తిగాంది యింకేం చేయదల్చుకోలేదు.

రమ:- అలాగా...నాకు తెలీదులేండి...క్షమిస్తారా? ...

గోపి:- ఆలోచిస్తాను... మరి అక్కడ నిలుచుకోడఁ వేఁవిటి ?...

రమ :- ఇప్పటికైనా కనుక్కున్నారు సంతోషం.

గోపి:- అసలు యీ అపరాహ్నంలో మీ ఆగమనానికి కారణం అవగాహన కావటం లేదు.

రమ:- ఆపదలొస్తే అర్ధరాత్రయినా, అపరాహ్నమయినా రాక తప్పదుగా.

గోపి:- ఏవంతవసరం.

రమ:- (మౌనం. గోపి 'రమా!' అంటూ సమీపించాడు. రమ మాటలాడదు.)

గోపి:- ఏఁవిటాపద? చెప్పేయి...ఏఁవయినా చేయదగుంటే చేస్తాను.

రమ:- చెప్తే విన్నారా ? నెత్తిన నోరుపెట్టుకొని కొట్టుకుంటే విన్నారా ?

గోపి:- ఏంచెప్పావ్, వినకుండా పోటానికి ?

రమ:- మీకు నిజంగా ప్రేముంటే ఎలా మరుపొస్తుంది?

గోపి:- నాకర్థం కాలేదు...

రమ:- అవును ... అర్థంకాదు. నా స్థితిలో మీరుంటె అపుడు అర్థఁవయి వుండేది...మీ కేం ?...

గోపి:- ఏఁవిటి నిష్ఠూరం ?

రమ:- నిజవాఁద్తే నిష్ఠూరం తప్పదు. నా కంఠానికి ఉరి వచ్చిందాక మీరు తెవల్లేదు...

గోపి:- ఏంజేశావేం...అంత అపరాధం !

రమ:- ఈ సంఘంలో స్త్రీజన్మ ఎత్తటం వే, యింకేంకావాలి ?

గోపి:- "అదృష్టబతుకే మధురం" అన్నారు. వినలా ఆ పాటను?

రమ:- చాల్లెండి...పరియాచికాలు.

గోపి:- మీ నాన్న చదువు మానేయమన్నాడా ఏం?

రమ:- తర్వాత మెట్టు అదే అవుతుంది. మీకు సంతోషం వేనా?

గోపి:- మొదటి మెట్టేంవిటి?

రమ:- ఏంవుంది?

గోపి:- ఆం...

రమ:- పెండ్లి !...

గోపి:- ఎవరికి?...

రమ:- ...యింకెవరికి?...

గోపి:- నీకే !...

రమ:- (మౌనం. తలవాల్చేసింది)

గోపి:- రమా!...

రమ:- గోపీ!...(కన్నీళ్లు)

గోపి:- ఏంవిటీ అవాంతరం! (రమ మాట్లాడదు). ఎక్కడ సంబంధం?

రమ:- ఎక్కడో ఎవరో పల్లెటూరట, మా నాన్న స్నేహితులట. నాతో చెప్పాడు. నేనేం జవాబు చెప్పకుండా యిక్కడికి వచ్చేశాను. వాళ్ళకు విందుకూడ మా యింట్లో రాత్రికి...(గోపి ఏమో ఆలోచిస్తున్నాడు) ఏంవిటా ఆలోచన?

గోపి:- రాత్రి మీ యింట్లో విందుకు నీవు పిలుస్తావో లేదోని, అధవా పిలిస్తే రాకుండా ఉండటం బాగుంటుందాని ఆలోచిస్తున్నాను.

రమ:- ఈ మాటల్తోనే యిలా అయింది.

గోపి:- మరి ఏంచేయమంటావ్?

రమ:- ఏ౯విటా ప్రశ్న?

గోపి:- అంటే?

రమ:- మనపెళ్ళి యిప్పుడే అయిపోవాలి...

గోపి:- (ఓ నిట్టూర్పుతో వెళ్ళి సోఫాలో కూర్చొని పుస్తకం చదువుతున్నాడు.)

రమ:- (కోపం వచ్చింది) తర్వాత చదవొచ్చు, ఇంకా కాలముంది. (పుస్తకం లాక్కొని చేతిలో వుంచుకొంది.)

గోపి:- ఇలా యిచ్చేయి...ఇంకా యెంతో చదవాలి...

రమ:- ఇప్పుడు చదివిన చదువుకు జ్ఞానం వృద్ధికాకుంటె...యింకగాదు. చదువు మానేయొచ్చు.

గోపి:- ఓ...అలాగా...నాకు తెలియదు.

రమ:- ఎలాగయినా యీ రోజు మన పెండ్లి కావాలి.

గోపి:- నాకు యిప్పుడు పెండ్లే౯విటి?

రమ:- ఈ మాటలతో లాభంలేదు...నేను యిప్పుడు పెండ్లాట్టానికే వచ్చాను. లేకుంటె నాకిప్పుడు పనే౯వుంది?... ఎందుకొస్తాను.?

గోపి:- నా చదువు భంగమవుతుంది. నేను వెళ్లాలి...(లేచి రెండడుగులు నడిచాడు,)

రమ:- ఎక్కడికి?

గోపి:- మిద్దెమీదికి...

రమ:- నేనూ వస్తాను...(గోపిని సమీపించింది)

గోపి:- పుస్తకం యిలా యిచ్చేయి...

రమ:- ఇవ్వను.

గోపి:- ఏ౯వన్నావ్?

రమ:- నేను మీతో వస్తాను...

గోపి:- (నిట్టూర్పు) ఇంకేం...చదువు సాగినట్టే. ఇంక మిద్దెమీది కెందుకు? యిక్కడే ఉండొచ్చు. (వెళ్లి కూర్చున్నాడు సోఫాలో.)

రమ:- నేనుంటె చదవటానికేం?...ఇదిగో తీసికోండి మీ పుస్తకం.

గోపి:- (తీసుకుని) ఇంక మీరు వెళ్లితే నేను చదువుకుంటాను (పుస్తకంలో చదువుకుంటున్నాడు...ఇరువురు క్షణం నిశ్శబ్దం.)

రమ:- మరి పెళ్లిమాట ఏఁవిటి?

గోపి:- ఆ విషయాన్ని గూర్చి ఈ గ్రంథకర్త యిక్కడేం సమాధానం ఇవ్వలేదు. కాని ఓ ఉపాయం తోస్తుంది, మీ నాన్న యేర్పాటు చేసిన అబ్బాయిని నీవు పెండ్లాడు. మా నాన్న యేర్పాటు చేసిన అమ్మాయిని నేను పెళ్ళాడుతాను.

రమ:- (కోపం వచ్చింది...వెళ్ళబోయింది)

గోపి:- రమా! (ఆపాడు) మన పెళ్లికి మా నాన్న అంగీకరించడేఁవో! యేం చేయటం?

రమ:- మీ నాన్న అంగీకారం ఎవరిక్కావాలి?

గోపి:- మరి నా ఇష్టంతో లాభంలేదు. నేను ఆయనకు మాటిచ్చాను.

రమ:- (మ్రాన్పడింది) ఏఁవన్నారు?...

గోపి:- ఆయన ఎక్కడో సంబంధం చెప్పారు... కానీ... యిప్పుడు మానేయమన్నాను...

రమ:- ఆఁ...

గోపి:- మా నాన్న మాటలేంది నేనేం చేయలేను.

రమ:- మరి నన్నేం చేస్తారు ?...

గోపి:- (మౌనం)

రమ:- ఉరి వేయండి...ఇద్దరి పీడ వదలిపోతుంది...

గోపి:- (మౌనం)

రమ:- ఎవరో దౌర్భాగ్యుడికి, ఓ పల్లెటూరి మొరటు మొద్దుకు కట్టిపెడ్తుంటే చూస్తూ ఊరుకొంటారా?

గోపి:- మరి నన్నేంచేయమంటావ్? నేనేం సామాన్యిట్టునా, నాకు చతురంగ బలాలున్నాయా... వాణ్ణి ఏ చెట్టుకో పుట్టకో కట్టి నిన్ను రాక్షస వివాహం చేసుకోటానికి?

రమ:- మరి నన్నెందులో దూకమంటారు ?
(రెడ్డి మాటలు వినవచ్చాయి)

గోపి:- అదుగో ! మా నాన్న వస్తున్నాడు. ఇంక నీవు వెళ్ళిపో... తర్వాత మాట్లాడుకుందాం.

రమ:- నేను వెళ్ళను...మీ నాన్ననే అడుగుతాను...

గోపి:- ఏఁవిటి! (వెలవెల బోతాడు)

రమ:- తమ కిష్టంవచ్చినవాళ్ళకు మిమ్మల్ని ఎలా కట్టిపెడతారో...అడుగుతాను...

గోపి:- వద్దు, మానేయ్...

రమ:- ఏం, భయఁవా?

గోపి:- ఆయన సహించరు.

రమ:- ఆయన ఇష్టం ఏఁవిటి ? అడుగుతాను చూడండి...మీ ఎదటే అడుగుతాను.

గోపి:- నీ యిష్టం... నే వెళ్తాను... (రెండడుగులు నడిచాడు)

రమ:- ఎందుకంత భయం?

గోపి:- ఆయన సమాచారం నీకు తెలీదు. (వెళ్ళాడు)

రమ:- అది తెలుసుకొంటాను.
(రెడ్డి వచ్చాడు...వింటున్నాడు. రమ గమనించక మాట్లాడుతూ వుంది.)

రమ:- మన పెండ్లి ఇప్పుడే కావాలి. మీ నాన్న ఎవరు మన పెండ్లి అడ్డు పెట్టడానికి? వారికేం హక్కుంది? మనం ప్రేమించుకొన్నాం. మన ఇష్టం. మీ నాన్న కిందులో జోక్యం లేదు. రానీండి. ఏరీ మీ నాన్న? నాకేం భయంలేదు.

రెడ్డి:- అవును. నీకు భయంవుంటె యీడ కెందుకొస్తావో? అంతా యింటానేవుండా. నే నీద్నే వుణ్ణా!

రమ:- మీరేనాండి రాఘవరెడ్డిగారు?...

రెడ్డి:- ఏం కత? ఏఁవో ఐలే ఆగాయిత్యం జేస్తుండావే...పడుగు పీదికి ఎద్దల దోలినట్లు రంపులు గొంపులు జేస్తుండావే! ఏఁవిరా అబ్బయ్యా! ఐలేవై ణం నేర్పుకొన్నావే?

రమ:- మీ అబ్బాయిని మీ యిష్టంవచ్చినోళ్ళకు కట్టిపెట్టడానికి మీకేం హక్కుంది? చెప్పండి.

రెడ్డి:- ఆ మాట అడగడానికి నీకు హక్కుందే... నాకు వాడికి పెళ్ళి జేయ డానికి హక్కులేదంటా?

రమ:- అవును, మీకు హక్కు లేదు.

రెడ్డి:- ఏందీ అడగటం! నాకు తెలవడం లేదే! అసలు మా గోపయ్యను నీ కెట్ట తెలుసు?

రమ:- మేఁవు ఒకే క్లాసులో చదువుకుంటున్నాం

రెడ్డి:- అట్టగా......అయితే......నీవు?

రమ:- మేమిద్దరం ప్రేమించుకొన్నాఁ, పెండ్లాడదలచాం

రెడ్డి:- అదా కత? నీ మాటల్లోనే నా కనుమానం దగిలిల్లా...

రమ:- దాపరికం ఏఁవీలే దిందులో.

రెడ్డి:- యింకేంవుండది? నిజం బయటబడ్నె...

రమ:- మా పెండ్లికి మీరు అంగీకరించక తప్పదు.

రెడ్డి:- అయినా్నీ యీలుపడవు, చెప్తుండా... (వికటంగా నవ్వాడు)

రమ:- ఏం ?

రెడ్డి:- ఏఁవంటె? ఏవో కారణాలు. నీకు చెప్పడానికి మాకు తీరికలుండ బన్లా ?

రమ:- కాస్త తీరిక జేసుకొండి. మమ్మల్ని అడ్డ పెట్టేది అంత తేలిక గాదు.

రెడ్డి:- తేలిగ్గాపోతే బరువవద్దిలే...ఏమీ ?

రమ:- నాకా భయంలేదు...

రెడ్డి:- అది తెలుస్తూనే వున్నా. మళ్ళీ చెప్పాల నీవు ? అమ్మా...... యిదంతా బలే బరువుగా వుందదే. మా గోపయ్య వుఁడాడా యింట్లో... ?

రమ:- ఉన్నారు పిలవండి... అంతా వారే జెప్తారు...

రెడ్డి:- ఏందీ ఆయన జెప్పేది... నీవే జెప్తివే అంతా... ఒరే గోపాలా! ఒరేయి... యిట్టొచ్చిపోవోయ్... బలే మనగోడివి... దాలో్... ఇప్పటిదాకా మీరిద్దరు యిాణ్ణే ఉన్నారా ?

రమ:- యిక్కడ్జె వున్నాం. ఏం ?

రెడ్డి:- ఏఁవుందది ? యేఁవీ లేదులే... ఊరికే అడిగినాలే...
(గోపి చాల భయంగా వినమ్రుడై వచ్చాడు)

రెడ్డి:- ఈ అమ్మాయి ఏంది ? నీ పెళ్ళి విషయం మాట్లాడ్డం ఏంది ?... ఏంది యీ యవ్వారం ? నాకేం తెలవటం లేదే ? నన్ను మోసం జేసి, నీ యిష్టం వచ్చినట్లు పరాయిపిల్లను తీసుకొచ్చి... తందనా లాడ్తుండా ? ఎవరుజెప్పారీ బుద్ధి నీకు ? మన యింట వంట లేని పని జేశావే ?...

గోపి:- నాకేం తెలీదండి...

రమ:- అబ్బ ఎంత మంచివారండి ! ఎంత వినయం!...

రెడ్డి.- అయితే నీవాలు తాటాకు మడిదొక్కినట్లు మాట్లాళ్ళేదనా నీవనేది ? నీ కేఁవైన భయం వుందాంట ?

రమ:- నాకేం భయం ? నేనేం అబద్ధం చెప్పడం లేదు.

రెడ్డి:- అయితే మావాడికేం తెలీదంటుండాదే మరి!

రమ:- నిజం చెప్పడానికి భయపడ్తున్నారెందుకు ? చెప్పండి... ఏఁవిటా కపటం ? చెప్పండి.

రెడ్డి:- మళ్ళీ ఏందో తెచ్చినావే రంపు ?

గోపి:- నాకేం తెలీదండి... నేను మీకు మాట యిచ్చానుగా.

రెడ్డి:- ఏఁవిచ్చావో...అసలేందిది ? నీవేఁవో దక్షిణాది సంగీత పాట కుడున్నట్టు కటక్కన బిగదీసుకొని నిలబడితివి... యీ అమ్మా యేఁవో రేగి మాట్లాడ్తుండా... ఏంది కుమ్మక్కు ! ఇద్దరూ తోడు దొంగలుగా వుండారే ? ఒరే గోపయ్యా ? ఈఁవెను పెండ్లి జేసు కుంటానన్నా ?

గోపి:- ఈఁవేవో నన్ను పెండ్లాడదలచిందట! నాకేం తెలీదు.

రమ:- మన మిరువురం పెండ్లాడదలచుకోలేదూ?

గోపి:- నాకు జ్ఞాపకం లేదు.

రమ:- నిజం చెప్పండి.

గోపి:- అబద్ధం చెప్పటంలేదు.

రమ:- ప్రమాణం చేయండి.

గోపి:- అవసరం లేదు.

రమ:- అయితే ..

గోపి:- ఇంక నన్ను నమ్మికొని లాభంలేదు. వెళ్ళిపోతే మంచిది.

రమ:- నేను వెళ్ళను...వెళ్ళకావాలి...వెళ్ళాలి...

రెడ్డి:- ఏందబ్బా యీ చెలగాటం! ఏఁవమ్మో చెప్తుండా,...నాకు ఇలే కోపం వస్తుండది.

రమ:- రానీయండి...

రెడ్డి:- ఎట్టా?..,

రమ:- ఏం?...

రెడ్డి:- నీవు మొండికేస్తే నేనూ జంకేవాణ్ణినా? ఎందుకు పిచ్చికమీద బ్రహ్మాస్త్రఁవని జూస్తుండా...

రమ:- అంతకంటె నేనూను...

రెడ్డి:- ఏంది?

రమ:- ముందు నాకు మాటిచ్చి మీకిచ్చారు.

రెడ్డి:- ఇస్తే యిచ్చినాళ్ళు...ఆయంతా ఏఁవీ యీలుపడవు.

రమ:- మీ కుమారుడు ముందు నా మాట నెరవేర్చాలి...

రెడ్డి:- ఇదేందిరా యీ రంపు?...అంతా యేర్పాటు జేసుకొని వాళ్ళు ఇప్పుడు రాబోతుంటె...యిట్టజేసినావే?...యేంపన్లుయియ్యి?...నేను జెప్పిన పిల్లను జేసుకుంటానని జెప్తివే...మళ్ళీ యీ అమ్మాయిని కొంప మీదికి దెచ్చినా?...నీవు చాల్చు బోవమ్మా! నీవల్ల మాకు బలే రంపు అయిందే! ఏవో యీగలు కుట్టిన పసరఁవాల చిర్రుబుర్రు లాడ్తుం డావే?

గోపి:- (మౌనం)

రెడ్డి:- ఏఁవిరా పలకవు?

గోపి:- నేను మీ యిష్టప్రకారం జేస్తాను. ఈమెతో నాకేం పూచీలేదు...

రమ:- ఈ మాటల్తో లాభంలేదు. మీరు నన్ను పెళ్ళాడక తప్పదు. మీ ఇష్టం వచ్చినట్లు భార్యల్ను కొన్నగొడ్లలా మార్చటం ఎవరు చెప్పారు యీ ధర్మం? మీరు పెండ్లాడాలి, కావాలి ... ఏఁవయినా సరే ... నేను వెళ్ళను. (ధైర్యంగా కూర్చుంది)

రెడ్డి:- ఎల్లకుంటె జేసుకోవా పెళ్ళి...నేను జూడ్తో...
(కూర్చున్నాడు)

రమ:- నేను ఎలా పెళ్ళిజేసుకోనో చూస్తాను.

గోపి:- రమా...ఏఁవిటి?...నీ విలా వొచ్చేయి.

రమ:- నేను రాను...

రెడ్డి:- మా యతలు నూ రుంటాయి ... మా కిష్టపడ్డపిల్లను మేం జేసుకుంటాం. నిన్ను జేసుకోవాలని యాధన్నా రాసుందదాని?

గోపి:- రమా! నీకు నేను మాట యిచ్చింటె ఉపసంహరించుకొంటున్నాను. ఇక ప్రయోజనం లేదు.

రమ:- నేను ఒప్పుకోటంలేదు.

గోపి:- నా అంగీకారము లేనిది యింక పెండ్లేమిటి?

రమ:- ఇంక మీ యిష్టంలో లేదు...

గోపి:- మా నాన్నొప్పుకోరు.

రమ:- వారితో నాకు ప్రమేయం లేదు.

గోపి:- గడిచింది.

రమ:- కాబట్టే పెండ్లాడ్డానికి ఒప్పుకోండి.

గోపి:- నేను యిప్పుడు అస్వతంత్రుణ్ణి.

రమ:- స్వతంత్రించండి.

గోపి:- తంద్రిమాట తప్పటం తప్పు!

రమ:- అంతకంటె పాపం మమ్మల్నిట్లా ఏడ్పించటం.

రెడ్డి:- యింత జఁవాబుర్చులేకుండా ఆర్గ్యుమెంటు జేస్తుండావే...లాయరువి- నీకు భయఁవేమైనా వుండదాంట?

రమ:- నేనేం దొంగనుకాను...భయపడ్డానికి...

రెడ్డి:- ఎందుగ్గాదో?

రమ:- నేనేం మీ యింట్లో దొంగిలించలేదు.

రెడ్డి:- నేను లేనప్పుడు నా యింట్లో జొరబడి మావాణ్ణి ఎత్తకెళ్ళా లను కొనిళ్ళా... యింకేం గావాల? దొంగ దొరక్కుంటే దొరేగదో? ...దొరికితేగదో పళ్ళతెరిచేది అబ్బాయ్య!... నేను యింకాసేపు

రాకుంటె యిప్పుడు నీ వుండే వూపులో ఎత్తుకెళ్ళేదానివే గదో... సందేహంగూడానాంట.

రమ:- నా సొత్తును మీరు ఎగవేస్తున్నారు

రెడ్డి:- నే నేం బాకీ లేదువో...యెగవెయడానికి. బలే షావుకారివిలే.

రమ:- ఏం కాక? మీకంటె మాకు పెద్దాస్తి వుందిలేండి...అన్న పేదలయిన మహారాజును పెండ్లాడై బాగా బ్రతకొచ్చని ప్రాధేయపట్టంలా...

గోపి:- రమా !...నా మాట వినవూ ?...

రమ:- యింకేం చేయదలచారో చెప్పండి...

గోపి:- నీ విలా రా. చెప్తాను.

రమ:- ఏ నూతిలోనో, గోతిలోనో తోయండి... మీ పీడ వదలిపోతుంది .

రెడ్డి:- అమ్మా, యిదేగావాల్నోయ్ ఆడోళ్ళు ఆగాయిత్యవంటెనో ! ఇదా చదువుకొన్నందుక్కు గుర్తు ? బలే నేర్చుకున్నారే ? బళ్ళో యియ్యా మీకు నేర్పిన పాఠాలు ? అడగతా తాళు మీ అయ్యోర్లను.

రమ:- ఏం, అడగండి... మా ప్రేమ గాదంటారా ?

రెడ్డి:- ఏఁవిరా...యిందుకా వందలు యేలు ఖర్చుపెట్టి నీవు చదవటం ? చదివినమటుకు చాల్లే నాగేళ్ళకాడికి పా... అసలు యిదేంది యీ యికారఁవు ? యాడన్నా అమ్మా అబ్బలు పెళ్ళిళ్ళు కుదురుస్తారు గాని... యిదేంది పెళ్ళికూతుళ్ళే పెళ్ళిళ్ళు ఏర్పాటు జేసుకోడఁవు ! శాస్త్రాల్లో, పురాణాల్లో ఆడోళ్ళను మగోళ్లు ఎత్తుకపోవడం చూడాఁవు, యిన్నాం గాని, యీవంతన ఆడోళ్లు మగోళ్లను ఎత్తుకపోవడం నేను యాడ జూళ్ళా, యిన్లా.

రమ:- ఏం తప్పా ? మీ కెంత హక్కుందో మాకు అంతే... ఏమో మా కిష్టపడ్డవాళ్లనే మేమూ పెండ్లాడ్తాం... తప్పేఁవిటి ?

రెడ్డి:- మీకు ఏం లోకానుభవం వుందని మీరు మాట్లాడేది ?

రమ:- లోకానుభవంచేతే ప్రేమించి పెండ్లాట్టం మంచిదని తెలిసింది...

రెడ్డి:- పెండ్లాడి ప్రేమించటం నాజ్ఞంగాదు గావాల ! ఈవంతన పెండ్లిగాక ముందే ఏం దరువులియ్యి ? మేఁవంతా పనికిమాలినోళ్ళవయినా వనా నీ వనేది ? మాకు అమ్మబ్బాలు పెళ్ళిచేస్తే కాపరాలు నిగ్గించు కోడంలా ? మీరే మనగోళ్లు !

రమ:- కాలానుగుణ్యంగా ధర్మాలు, తత్వాలు మార్చుకోవాలి...

రెడ్డి:- మాకేం బన్లాపో... మాకు పెద్దోళ్ళ లైనువల్ల యేం యిబ్బందులు రాలేదులే...వస్తే అప్పుడు జూస్తా.

గోపి:- పోనీండి, యింత ప్రాధేయపడుతోంది... అంగీకరించండి ... పెండ్లాడ్తాం.

రెడ్డి:- యాద పెండ్లాడేది ! వాళ్ళకు మాటజెప్పి, మళ్ళి ఎవరో దోవన బొయ్యేవాళ్లు పెళ్ళిజేసుకోమన్నపాట... యిప్పుడు యీ దరువుకు తిరిగినా ? యీలుపడదు. జెప్తుండా. ఏం పెళ్ళంటె ఏవో ఎగ తాళిగా వుండదే. కులం తీరుగాని బన్లా ? యెయ్యేళ్ళ పంటయి పోయనే... ఏ వనుకున్నావు ?...యీలుపడదో ! నీవు లోవన్మూ. చాల్నో... యిప్పటికి జరిగింది.

రమ:- నేను వెళ్లను.

రెడ్డి:- ఏందో బలే యికాలాలుగా వుండాయే...ఎవర్నో ఒకరిని పెండ్లిజేస్కు కోరాదో ? యీన ఒక్కడేనా మగోడు లోకంలో ? అందరు నీయాల ప్రేమించి పెళ్ళి జేసుకుంటుండారు గాఁవాల ? పెద్దోళ్ళు ఎవర్నోకర్ని కట్టిబెత్తే కాలం ఎళ్ళదోసుకుంటుళ్ళా ? ... ఏఁవో బలే గట్టి పట్టు పట్టావుండావే ! ఎవర్నొ ఒకర్ని కట్టుకుంటే కాలం ఎల్లిపొయ్యే దానికి. మా యతలు మేము బడ్తాం ... వాణ్ణె గావాలంటె...మాకు కులం, గోత్రంగాని బన్లా? ... వా డిష్టఁవా ?

రమ:- మేఁవూ రెడ్లఁవేలెండి !

రెడ్డి - యట్లా ! ...

రమ:- మేమూ మీలాగే రెడ్లం...

రెడ్డి:- ఏం రెడ్లు ?

రమ:- పంటకాపులం.

రెడ్డి:- పంటకాపులా ?

రమ:- అవును. పంటకాపులయితే పెండ్లికంగీకరించరా ఏం ?

రెడ్డి:- ఏ వ్వూరు ?

రమ:- ఈవ్వూరే లెండి...

రెడ్డి:- యాడ వుండేదమ్మా ?

రమ:- మాంబళంలో.

రెడ్డి:- మీ తండ్రిగారి పేరేంవో?

రమ:- ఎందుకూ, అక్కర్లేదులెండి.

రెడ్డి:- చెప్తే తప్పా?

రమ:- పోలీసుకు పట్టిస్తారా ఏం?

గోపి:- చెప్పేయి పరవాలేదు...రమా! చెప్పేయ్.

రెడ్డి:- నీకు తెలుసంట్రా? తెలిస్తే జెప్పరాదో? ఏందా దాపరికం?

గోపి:- నాకు తెలీదండి. పోనీ...

రమ:- మా పెళ్లి కంగీకరిస్తారా?...

రెడ్డి:- ఓహో! నీవు ఒదులుకొనేటట్టు లేదే...కదుగునీళ్ళు బోసినా ఉట్టొంక జూస్తుండావే?...

గోపి:- రమా! చెప్తే వినవూ?...ఆయన యిష్టప్రకారం ప్రవర్తించు, తనిక రిస్తారు.

రమ:- మీరే చెప్పండి.

రెడ్డి:- యీడికి తెలిసినట్టుండదే...యేందో యీళ్ళిద్దరి సందన రవంత దాపరికం వుండదే!

గోపి:- అబ్బె, నాకు తెలీదండి.

రమ:- మా నాన్న పేరు కుప్పుస్వామిరెడ్డిగారు.

రెడ్డి:- ఏ కుప్పుస్వామిరెడ్డి?...

రమ:- కుప్పుస్వామిరెడ్డి— అడ్వకేటు...

రెడ్డి:- యట్టా! మా కుప్పయ్య కూతురివంటమ్మా?

రమ:- మీ కుప్పయ్య ఎవరు?

రెడ్డి:- కుప్పుస్వామిరెడ్డి మా కుప్పయ్యగదో! ఎవురనుకున్నావ్? కుప్పయ్య కూతురివంటమ్మా? నే నెవరో పరాయివాళ్ళనుకున్నా... అమ్మా, పొరపాటె...ఏఁవనుకోబాకమ్మా...

గోపి:- ఇంతకూ యీ అమ్మాయిని మీరు చూళ్ళేదన్నమాట!

రెడ్డి:- నేను యాడ జూచాను...నేను జూచేలోపల యింతజరిగెనే...

గోపి:- చూడకుండానే మీరు వర్ణించారే...

రెడ్డి:- యిప్పుడు మాత్రం అంటుళ్ళా...కులం తీరు జూడాలగాని పిల్లనేంటి జూచేదని!

గోపి:- యిప్పుడింతకు మా పెళ్ళికి అంగీకరించినట్లేనా?

రెడ్డి:- అభ్యాపణ ఏంవుండది... కుప్పయ్య కూతుర్ని జేసుకోవాలనే గదంటోయ్...యింతదూరం నేను గట్టిపట్టు పట్టింది? ఎవరో పరా యోళ్ళ పాడుపీడ యింతసేపు మందల తెలీకుండా మాట్లాడుకో వలసి వచ్చిందే,..పొరపాటే... కుప్పయ్య కూతురివంటమ్మా... ఏవఁనుకో బాకమ్మా...

రమ:- లేదులెండి...

రెడ్డి:- ఏఁ వుండదిలే అనుకోటానికి... నే నేం పొరపాటుగ ఏవనలేదు... పెద్దోళ్ళమాట యినమన్నా...అంతేగదో. ఒరే గోపయ్యా-లే, మీరు బోయి కాపీ తీసికో బోండి. పలారాలు, కాపీ తీసుకో బోండి... నీవుకూడా బోరా ... కొత్తోళ్ళగదో... చిన్నోళ్ళదా! వాళ్ళకు ఏం గావాల్నో బాగా యిచారించరా. నేను వస్తుండా... పదండి పొద్దు బోయింది. [రమ మెల్లగా పోతుంది... గోపికూడా వెళ్తున్నారు] ఒరే! కూడాబోయి యిచారించరా. ఏ వో యెనక దండెమీద కార

ట్లాడ్తావే? గడ్డిమీద గొడ్లోంతొక్కలాడ్తావే! అంతా మీ తాత పోలి కరా నీకో... [గోపికూడా వెళ్ళాడు]

(రెడ్డి యేమో సర్దుతూ ఉండగా కుప్పుస్వామి రెడ్డి వచ్చాడు...చాలా కంగారుగా వున్నాడు...మాటలు తొట్రుపాటు కూడా వున్నాయి... కొంచెం కొంచెంగా తేరుకొంటున్నాడు...)

రెడ్డి:- [గమనించాడు] ఏఁవయ్యో కుప్పయ్యా, దండంబెడతా...రా... కూర్చో...మేవేఁవో పెళ్ళికి సిద్ధం...పూరాగా వస్తాం జనం .. మరి ఎంతమందికి బోజనం బెడ్తావో...ఎట్ట యిదారిస్తావో...ఏంకతో...

కుప్పయ్య:- నన్ను మీరు మన్నించాలదా...

రెడ్డి:- యిదేంది యీ అనడం...

కుప్పయ్య:- ఏందా చేస్తును...

రెడ్డి:- మా బలగం పూరాగా వుండారు...అందుకు ముందు జెప్తే మంచిదని చెప్పినా... అంతేగదో...భయపడ్తుండావే...

కుప్పయ్య:- అంత నోముదా నోయలేదని...ఏడుస్తావుండాను. ఏం చెప్పుదును మీకు మూతి జూపేదానికిదా సిగ్గుతో చస్తాను... ఏమి చేస్తును... మాటదా వినేదిలేదు...

రెడ్డి:- ఎందుకు గత్తర పడ్తుండావే?

కుప్పయ్య:-ఆమె ఎవర్నో తనతో చదివేవాణ్ణిదా పెండ్లిచేసుకోవాలని మొండి చేస్తావుండది.

రెడ్డి:- పెండ్లిగాకముందే ఏందీ యతలంట?

కుప్పయ్య:-కాలందా!...

రెడ్డి:- ఎవురేం జేస్తారు? ఆడోళ్ళు మొగోళ్లు ఒక్కచోట కూడుతుండిరి... అడ్డగింపు లాకపాయ...యింక వూర్కో వుండమంటే, యీలవద్దా? ఏఁవన్నా కరగోడలు ఏసేటట్టయితే ఏఁవో అడ్డగింపు చేయొచ్చు! యాడ యీలవద్ది? మంచి సెబ్బర్లు వాళ్ళకు వాళ్ళు తీర్మానం జేసు కోవాల్సిందేగాని! ఎవరు కావళ్లగాస్తారా? కుప్పయ్యా, అయితే యింతా ఏఁవయింది?

కుప్పయ్య:-ఏమి అయింది...వాణ్ణిదా చేసుకోవాలని మొండిదాచేస్తుంది...వాడు ఎవడో పనికిమాలినవాడుదా...దీనికి దాపరించి వుండాడు...కమ్మి నాటి ముండావాడు.

రెడ్డి:- మంచోడేఁవోలే...లాకుంటే మీ అమ్మాయి అట్టంటదా?

కుప్పయ్య:-ఏమో మంచో సెబ్బరో నేనుదా చూస్తినా? నిండా అవమానందా... ఏమో నా మాట వినకపోనాని తలిస్తిని, ఎంత బతిమాలితిని ... ''వాళ్లనిండా గొప్పవాళ్లు...వాళ్ల బిడ్డా నిండా పెద్ద చదువు చదివిన వాడు...పాడి పంటా అంతా లక్ష్మీకటాక్షంతో తులతూగుతారు... ఇట్లాచేస్తే మన పరువుపోను...మంచి సంసారం ఒప్పుకో అమ్మా''ని బతిమాలితిని...

రెడ్డి:- ఏహో ఒప్పుకోక పోవడం? వాణ్ణి ప్రేమించింది గాఁవాల పాపం... అయినా పెద్దోళ్ళమాట లేకుండా యింత పని జరిగిందే! పోనీ వాడు మంచోడయితే వదిలై, మళ్ళీ యాడ యతకతావు...యతలుపనిగదో?

కుప్పయ్య:-నా కిష్టం లేదు...

రెడ్డి:- అయితే యిప్పుడేం జేయాలని?

కుప్పయ్య:-మీతో సలహాపడ్తామాని వస్తిని...

రెడ్డి:- వకీలు వయితివే...నీ కేంది నేను సలహాజెప్పేది? అమ్మాయి యింటి కాడుండదా?

కుప్పయ్య:-నామీద కోపంవచ్చి వెళ్ళిందిదా...

రెడ్డి:- అయితే యింకేంది మనం జేసేది...యాడ దాగురుమూత లాడు తుండదో...యాదని యెతికేది?

కుప్పయ్య:- పోలీసుకు రిపోర్టు చేస్తామని ఆలోచిస్తాను.

రెడ్డి:- రిపోర్టా?

కుప్పయ్య:- ఎంత నగా నట్రా వుండది! ఎవరో షోదావాణ్ణి కట్టుకుంటె నే నొప్పుదునా?... వాడుదా కంటికి కనబడ్తే కాల్చేస్తును. గూండా...

రెడ్డి:- తొందర పడబాక. అవతల పోలీసోళ్ళతో కలదెలుపుకునేది బలే గడుసు. ఊరికే పీక్కతింటారు, వందలీమని... యేలీమని. యాడిస్తావ్?

కుప్పయ్య:- రెడ్డిగారూ క్షమించండి. మీ రేమి అనుకోవద్దు. అమ్మాయిని పట్టుకొంటె నిదానంగా పెళ్ళి ఆలోచిస్తాము.

రెడ్డి:- కారు కొనమంటివే! యిప్పదే వాళ్ళ పరుగంటుకునేది గడుసైతే యింక దాంట్లో కూకోని ఎల్తుంటే ఎవురు వాళ్ళ పరుగంటుకునేది... చెప్తినే అప్పదే...

కుప్పయ్య:- నిజం చెప్తిరి, అబ్బాయిని చూచి క్షమాపణ చెప్పిపోతాను... కాస్త పిలుస్తురా.

రెడ్డి:- ఒరే గోపయ్యా! యిట్టొచ్చిపో.

కుప్పయ్య:- బంగారంలాంటి సంబంధందా... పాడుజేసింది అమ్మాయి.... పోలీసుకు రిపోర్టుచేస్తే వాళ్లుదా రోగం కుదురుస్తారు... [గోపి వచ్చాడు]

రెడ్డి:- కుప్పయ్య కూతురు యాడికో పలాయనం చిత్తగించిందంటనే...

గోపి:- ఎక్కడకి వెళ్ళిందేం ?

రెడ్డి:- నీకు వాళ్ళమ్మాయిని యిస్తాంవని తీర్మానం జేసుకొని యింటికిబోయి, అమందల వాళ్ళ పిల్లకుజెప్తే ఒప్పుకోక తిరగబడి యాడికో యెళ్లిందంట.

కుప్పయ్య:- క్షమించండి... తప్పుజేస్తిని.

గోపి:- పోనీండి...ఆమె యిష్టం...ఆమె పెళ్లికి మీ నిర్బంధం ఎందుకు ?

రెడ్డి:- ఈడు...తక్కువయినోడాంట. నేను యింటికొచ్చేటప్పటికి ఎవర్నో పెళ్ళిజేసుకొని వందింట్లో కారపం బెట్టాడు... యింకెట్ట తరింవేది... ఒప్పుకొని నోరుమూసుకొని వుండా... దొంగకు తేలుగుట్టినట్టు...

కుప్పయ్య:- అయితే ఎట్టచేస్తురు ?

రెడ్డి:- మీ అమ్మాయి ఎగటాయించి ఎత్తే నీవేం జేశావు ? అంతేగదూ ... నేనుగూడ జేసేది. పోనీ మా కోడల్ను జూచిపో. గోపయ్యా! పిలు ... [గోపి వెళ్ళాడు]

కుప్పయ్య:- పిలవండి చూస్తాను. ఎవురో అదృష్టవంతురాలుదా. మా బిడ్డదా దరిద్రురాలు అయిపూడ్చింది.

రెడ్డి:- ఎవురి అదృష్టం వాళ్ళదిలే... మనమేం జేస్తావుఁ...

కుప్పయ్య:- ఎంత బతిఁవాల్తిని...మంచి సంబంధందా పూడ్చింది...

రెడ్డి:- ఇప్పుడేం మునిగిపోలేదులే.

కుప్పయ్య:- మీ వాడికి పెళ్ళిదా అయింది... యింకేమిదా చేసేది ?
[గోపి వచ్చాడు]

రెడ్డి:- అమ్మాయి ఏదీ ?

గోపి:- వస్తూంది.

రెడ్డి:- రమ్మను...

గోపి:- చపలా !

రెడ్డి:- ఆమె ఎవరు ? యింకోర్ని గాని కొంపమీదికి దెచ్చినావుగనేం ? మనగోడివి !

గోపి:- నేను ఆమెను అలా పిల్చే వాడుకలెండి.

రెడ్డి:- ఏఁవమ్మా... మీ నాయన పిలుస్తుండారు-రా...

కుప్పయ్య:- మా అమ్మాయి యిక్కడ వుండదా ?... [ఆశ్చర్యం]

రెడ్డి:- వాళ్ళ నాయనగూడా కుప్పయ్యలే- అందుకని అట్టన్నా. పరాయి బిడ్డలు ఎవరయినా మన బిడ్డలొంటోళ్ళేగదో!...

కుప్పయ్య:- ఆ బిడ్డ మా అమ్మాయి కాదని కనుక్కొంటిరా ? మీకుదా మా అమ్మాయిని తెలుసునే...

రెడ్డి - నాకేం తెలుసు! మీ అమ్మాయిని నేను జూచుండానా? తెలీదానికి యింత బలే మనగోడివే! మీ అమ్మాయి ఎల్తుంటే మావాడు పట్టు కొచ్చి ముడేసుకొన్నాడు...

కుప్పయ్య:- [చకితుడై నాడు] ఏమిదా చెప్తారు రెడ్డిగారూ?

రెడ్డి:- ఇంకేంటి జెప్పేది... యెప్పుడో పెళ్ళయిపోయిందిపో... మనం పెళ్ళిజేసిందాక కనిపెట్టుకొని ఉన్నారనుకొంటుండా...

కుప్పయ్య:-రమాను...మీ అబ్బయ్య పెండ్లాడినాడా?

రెడ్డి:- ఓహో! యాడ నీ వినేదీ? గత్తర్లో వుండావే...

కుప్పయ్య:-చచ్చిదా బతికితిని...

రెడ్డి:- నిజంవేలే...

కుప్పయ్య:-మా అమ్మాయిని గోపికి యెట్ట తెలుసు?

రెడ్డి.- బెంగుళూరులో యిద్దరు ఒక్కచోటంటనే జదివేది....

కుప్పయ్య:-అమ్మా! రమా! రమా!...ఏవమ్మా నిండా కష్టపెడ్తివి? నీవు కోపంతో బైటవస్తివి...నేను యేమో భయబడి చస్తిని—తల్లి...
[రమ నాయన కాళ్ళమీద పడింది—కన్నీళ్ళు]

కుప్పయ్య:-(లేవదీశాడు) అమ్మా, యిది యేమి ఏడుస్తావు? మంచి పనిదా చేసి నావు. నాకుదా సంతోషం. రమా!...రమా!...

రమ:- క్షమించండి...

కుప్పయ్య:-అమ్మా! ఏద్వవద్దు ... నాకుదా యిష్టమయిన పనిజేశావు. సంతోషందా...రెడ్డిగారికి దణ్ణంబెట్టు.

రెడ్డి:- ఎందుకూ? ఏంబన్లాపో. నీకు దణ్ణంబెడ్తె చాలదూ. ఏవో చెప్పిన సాంవితగా వుండే లందుకో పఘ్యాడాయంట. నీ బిడ్డ, వాడి పెళ్ళాము...మధ్య నాదేంది?
(రమ సమీపిస్తుంది)

కుప్పయ్య:-పెద్దవాళ్లుదా.

రెడ్డి:- ఏంబన్లాపో; ఎందుకాబిడ్డను లేవను వంగను యతలఆబెట్టేవి.

కుప్పయ్య:-రమా! దణ్ణంబెట్టమ్మా.
(రమ కాళ్ళమీద వాలింది)

కుప్పయ్య:-ఆశీర్వదించండి...

రెడ్డి:- నేనేం మంత్రాలు జదివుండనా కుప్పయ్యా?

కుప్పయ్య:-"సుఖీభవ" అనండి...అంతదా...

రెడ్డి:- సరే...కుప్పయ్య ఒదులుకునేవాడేనా అనకుంటే...మొండిపట్టు, కోతి పిడికిలి. అమ్మా! మీరు ఆలుమొగుడు కలకాలం కాపురం నెగ్గించుకొంటూ, కట్టుకొన్నోడు కాస్త ఎతలుబెట్టినా ఎగసందోసు కుంటూ, యెవరైనా యింటి కొచ్చినోళ్ళకుఁ చేయి జాచినోళ్ళకు, మనతోపాటు గంజో ... అంబలో పోస్తా కష్ట సుఖాలు, మంచి సెబ్బర్లు మన కెట్టనో ఎదటోళ్ళకుగూడా అట్టనే ననుకొంటూ, మీ పుట్టింటోళ్ళకు ... యిట్టా మాకు మంచి పేరుదెచ్చి లచ్చణంగా యెయ్యేళ్ళు కాపరం నిగ్గించుకో బోమ్మా...లే తల్లీ లే.

కుప్పయ్య:- గోపీ... రమా... మీరిద్దరు నాయన కాళ్ళమీద నమస్కారం జేయండి (రమ, గోపి ఇద్దరు జేశారు.)

రెడ్డి:- ఆలుమొగుడు ఒకరి కష్టసుఖాలు ఒకరు యిచారించుకొంటా కాపరం నిగ్గించుకో బోండోయ్.

కుప్పయ్య:- అమ్మా...రమా! గోపి కాళ్ళమీదబడి దణ్ణంబెట్టు... భర్తదానే...
(రమ అలా చేస్తుంది)

రెడ్డి:- చాల్లే కుప్పయ్యా! ఆయనకు దణ్ణాలుబెట్టడానికి గాని యింక కాలం లేదుగనేం? వంగను లేవను...లేవను వంగను...మాతో సంబంధం జేసిందానిగనేం...యీ శిక్ష...
(రమ గోపి కాళ్ళమీద బడింది... గోపి లేవదీశాడు)

రెడ్డి:- దేవుడు పెట్టిన ముహూర్తం యిదిగదంటయ్యా... మనం నెలరోజుల నాటికి పెళ్ళి చేయాలనుకొంటిఁవేఁ.

కుప్పయ్య:- అంతా దేవుడి దయదా.

రెడ్డి:- కుప్పయ్యా! ఇంక వాళ్ళయతలు నూరుంటాయి... మనం జోదాం పా... మనం యీడుండగూడదు... రా... నీకు ఖరవ లేదులే... కూతురు ఎప్పటికయినా మా నాయనే... మంచి సెబ్బతే అనుకుంటుందిగాని, కొడుక్కు పెళ్ళాం వచ్చినపాట... యింక నాయనకు నాఁవాలేగదో. మనం యింక వెళ్దాంరా.

(ఇద్దరు వెళ్ళారు. గోపి రమా ఉన్నారు. రమ సిగ్గుతో తలవంచుకొనివుంది.)

గోపి:- రమా!... ఏమిటీసిగ్గు... (రమ యింకా అలాగేవుంది) దేవతలు పూలవర్షం కురిపించలేదనా కొరవపడ్తున్నావ్?

రమ:- కనుక్కొన్నారు...యింకేం. నారదుడు తన సంతోషాన్ని వెలిబుచ్చడానికి రాలేదేఁవాని ఆలోచిస్తున్నాను.

గోపి:- అదా! యింతకూ మన యిరువురి హృదయాలు ఒకటైనప్పుడు ఆ ఆశీర్వచనాలు అట్టె మనమీద ఏంపని చెయ్యవు.

రమ:- ఎలాగో యీ "తుపాను" లోంచి గట్టు ఎక్కాం...యింక రండి... మళ్ళీ మీ నాన్నొస్తున్నారు.

(ఇద్దరూ లోనికి వెళ్లతూంటే తెర)

సమాప్తం



# పాత్రలు

దొంగ

చౌదరి

కానిస్టేబుల్

సబ్ ఇన్స్పెక్టరు

వార్డెన్

డి. యస్. పీ

మునసబు

డాక్టరు

పత్రికా విలేఖరి

ఇద్దరు ఖైదీలు, కుర్రవాడు

[తెర ఎత్తకుండానే నాటకము మొదలవుతుంది. మొట్ట మొదట నాటకము మొదలు పెడుతున్నారని ప్రేక్షకులకు తెలియడానికి మైక్‌లో ఫలానావారు – ఫలానా వారు రచించిన "ఎవరు దొంగ" అన్న ఏకాంకిక ప్రదర్శిస్తారు, అని ప్రకటన చేయబడుతుంది. తరువాత బెల్ అయిన వెంటనే పోలీసు విజిల్స్ నాలుగైదు వరుసగా గోలగా వూదబడతాయి. నలుగురైదుగురు బూట్ల కాళ్లతో పరుగెత్తుతున్న ధ్వని. రాను రాను దగ్గరవుతుంది. కాసేపటిలో తెరముందునుంచి ఒకతను వాయువేగముతో పరుగెత్తుకొచ్చి స్టేజీ దిగి కూర్చుంటాడు. ఆ తరువాత ఒకతను పరుగెత్తుకువచ్చి ఆగి అటు ఇటు చూచి, స్టేజీ దిగి, ప్రేక్షకుల దగ్గరకొచ్చి ప్రేక్షకులనంతా కలియచూచి, ముందు వరసలో వున్న వాళ్ళను చూచి-]

**అతడు:-** అరె. ఇలా ఒకతను పరుగెత్తుకొచ్చాడు చూచారండి మీరు? ఇప్పుడే వచ్చాడు. అరె! ఇంతలో ఎలా వెళ్ళాడు? దొంగవెధవ. మీరెవరూ చూడలేదాండి? వాడు దొంగండీ. మనమంతా ఇక్కడున్నామని తెలిసి ఎలా వచ్చాడో వచ్చాడు హాస్టల్లోకి. మెల్లగా అటు ఇటు చూచి స్టోర్సు తాళం పగులగొట్టి లోపల దూరాడు సార్. రాస్కెల్. నేను కనపడేటప్పటికల్లా పరారయ్యాడు. కాస్త చూడండయ్యా చూడండి.

[ప్రేక్షకులలోంచి ఒక కుర్రాడు లేచి]

**కుర్రాడు:-** అరె! హాస్టల్‌లో దొంగ దూరాడా? ఏం పట్టుకెళ్ళాడో? ఇప్పుడే ఇలా ఎవరో పరుగెత్తుకొచ్చారోయ్.

**2 వ వాడు:-** (తమిళంలో) ఆమా; ఆమా; నాను పాతేన్ ఇప్పిదా వందాన్.

**3 వ వాడు:-** (ఇంగ్లీషులో) జస్టు ఐ సాయె ఫెలో రన్నింగ్ దిస్ వే

**4 వ వాడు:-** ఏరా, ఫ్యాన్సీ డ్రస్ కాంపిటీషన్ కాదుగదా కొంపదీసి?

**1 వ వాడు:-** అయితే వార్డెన్‌తో చెప్పావా?

**అతను:-** వార్డెన్ ఎక్కడ?

**1వ వాడు.-** చూడు, బ్రదర్, చూడు. ఆ మేకప్ రూంలో వుంటాడేమో పద, పద,

[ఒకటవవాడు, అతడు స్టేజీమీదకు పరుగెత్తుతారు. ఇంతలో వార్డెన్ వస్తూ]

వార్డె: ఐసే, ఏమిటీగోల ? నాటకం జరగనీకుండా. వాట్ ఈజ్ రాంగ్ విత్ యు !

అతను: హాస్టల్ స్టోర్స్‌లో దొంగ పడ్డాడండి.

వార్డె: దొంగ !

1 వ వాడు:-అవునటండి.

వార్డె:- తాళం పగంగొట్టాడా ?

అతను:- అవునండీ !

వార్డె:- మనిషిని చూసావా ?

అతను:- ఎవడో బెగ్గర్ వెధవండి. రేగ్స్ (చింకిపాతలు)లో ఉన్నాడు.

వార్డె:- వాచ్‌మన్ అంతా ఏం చేస్తున్నారోయ్ ?

1 వ వాడు:-ఇక్కడ నాటకం చూద్దాని కొచ్చేశారండి.

వార్డె:- నాన్ సెన్స్. ఆ వెధవలకూ వైజ్ఞానిక వారోత్సవాలు కావలసి వచ్చినాయ్ ? కమాన్ కమాన్. వెళ్ళి అక్కడ ఏం జరిగిందో చూద్దాం రండి. [పోతోతూ, వెనక్కు తిరిగి] మహాశయులారా ! ఈ అవాంతరము కలిగినందుకు విచారిస్తున్నాము. తొందరలో ఇంజనీరింగు కాలేజీవారి నాటకం మొదలు పెడతాం. మీరు కాస్త ప్రశాంతంగా వుండాలి. ఇప్పుడే వస్తా [అని పోతోతుండగా, ఎదురుగా పోలీస్ సబ్ ఇనస్పెక్టరూ, కానిస్టేబుల్ వస్తారు]

వార్డె:- పోలీస్ !!!

సబ్ ఇనస్పెక్టరు:-గుడ్ మార్నింగ్ సార్.

వార్డె:- గుడ్ మార్నింగ్. ఏం కావాలండీ ?

స.ఇ:- ఏం లేదండీ ? ఈ హాస్టల్ వార్డెన్ గారెవరండీ ?

వార్డె:- నేనే, ఎందుకండీ ? దొంగ దొరికాడా ?

స.ఇ:- దొంగా ?

వార్డె:- ఆఁ. దొంగండి. హాస్టల్ స్టోర్సులో తాళం పగలగొట్టి దూరాడు. మనిషి కనపడేటప్పటికల్లా పత్తా లేకుండా పోయాడు.

[ఇంతలో లోపలనుంచి ఒక కుర్రాడు పరుగెత్తుకొస్తూ]

కుర్ర:- సార్! సార్!

వార్డె:- ఏం ?

కుర్ర:- మనం నాటకానికి తెచ్చిన డ్రస్‌ల మూటంతా కనపడ్డం లేదండీ.

వార్డె:- వెదకండోయ్ ! ఎక్కడో వుంటుంది. అన్నీ ఇప్పుడే వస్తాయి. మీకు.

కుర్ర:- వెదికామండీ ! ఎక్కడా లేదు. ఇప్పుడే తెచ్చి ఆ సైడు డ్రెసింగ్ రూమ్‌లో పెట్టాం. ఒక్క మినిట్! చూస్తే లేదు.

వార్డె:- చూచారండి, ఇదీ ఆ దొంగే కొట్టేసుంటాడు. సందేహం లేదు.

స. ఇ:- దొంగ ఎలా పారిపోయాడో ఎవరన్నా చూసారా?

అతను:- కాస్త దూరంనుంచి టార్చివేసి చూచానండి, మనిషి ముఖం కనపడలే! ఒక ముష్టివాడిలా ఉంటాడు. చిరిగిన చొక్కా, చింపిరి తల అయిదడుగుల రెండంగుళాలు లేక మూడంగుళాలు ఉంటాడు.

స.ఇ:- లావుగా వుంటాడా! బక్కగా వుంటాడా?

అతను:- మీడియం (మధ్యస్థం)గా ఉంటాదండీ.

స.ఇ:- [కానిస్టేబుల్‌తో] ఏయ్! ఈ గుంపులో ఎక్కడన్నా ఉన్నాడేమో వెతుకు.

[కానిస్టేబుల్ స్టేజి దిగి ఆడియన్సులోంచి మెల్లగా జారుకుంటాడు]

స.ఇ:- వాడు వెలికి పట్టుకొస్తాడు లెండి; మీరు కాస్త దయచేసి స్టేషన్ దాకా రావాలి.

వార్డ:- దొంగ దొరకందే !

స.ఇ:- దొంగ వాడే దొరుకుతాడు లెండి.

వార్డ:- రేపు మార్నింగు రాకూడదూ? నాకో ఫంక్షనుంది.

స.ఇ:- లేదండీ! వెంటనే రావాలి.

వార్డ:- కాస్త కూచోండి, వెళ్దాం! ఇప్పుడు ఇంజినీరింగు కాలేజీవాళ్ళ నాటకం వుంది. చూచిపోదాం. లాస్టియియర్ (నిరుడు) ఫస్ట్‌ప్రయిజ్ వచ్చింది వీళ్ళకే. ఈసారి కూడా మంచి నాటకమే ఆడతారు. చూచి వెళ్దాం ఏమంటారు?

స.ఇ:- నో, ఎక్స్‌క్యూజ్‌మి; ప్లీజ్; క్షమించండి. మాకు నాటకాలు చూసే తీరిక లేదు.

వార్డ:- పోనీ రేపు మార్నింగ్ వచ్చి రిపోర్టు యివ్వకూడ దాండీ?

స.ఇ:- రిపోర్టు యిదివరకే యిచ్చేశారు. ఇక మీరు యివ్వాల్సింది సంజా యిషీనే!

వార్డ:- ఏమిటి ?

స.ఇ:- యు ఆర్ అండర్ అరెస్టు. (మిమ్మల్ని అరెస్టు చేశాం)

వార్డ:- అరెస్టు! మైసెల్ఫ్! వాట్? నన్నా, ఏమిటి!

స.ఇ:- యు ఆర్ అండర్ అరెస్టు.

వార్డ:- ఓ............

స.ఇ:- రాండి సార్, రండి !

[ఇంతలో ఒక కానిస్టేబుల్ గబగబ వస్తాడు. సబ్ ఇన్‌స్పెక్టరుకి సెల్యూట్‌కొట్టి......]

కాని:- సార్ !

స.ఇ:- ఏం రా ?

కాని:- బాపూజీ రైన్ మిల్లుదాకా వెళ్ళి రావాలి సార్!

స.ఇ:- ఎందుకూ ?

కాని:- పెద్ద గొడవ జరుగుతూందండి అక్కడ !

స.ఇ:- ఏమిటా గొడవ ? బందిపోటా ?

కాని:- కాదండి !

స.ఇ.- కమ్యూనిష్టుల కాబటేజా ?

కాని:- కాదండి !

స.ఇ:- మరి ఏమిటి నీ తలకాయ్ !

కాని:- వచ్చి చూడండి సార్ !

స.ఇ:- చెప్పవోయ్, ఏం ఫరవాలేదు.

కాని:- నేనలా మిల్లు దగ్గర నిలబడి ఉన్నాను సార్ ! లైట్లున్నట్టనిపించింది. ఏమిటిరా, అర్ధరాత్రిలో లైట్లేమిటని కాస్త చెవిపెట్టి విన్నానుసార్! ఎవరో యిద్దరు మాట్లాడుతున్నారు. ఒక అతను "మూటకు అరపడి రాళ్ళు కలిపితే మీ కెంత లాభం వస్తుందయ్యా ! నువ్వు సుమారు 60 లక్షల మూటలు సప్లయి చేస్తున్నావు. అరవై లక్షల అర్ధ రూపాయలు 30 లక్షలు వొస్తుంటే, మాకు పదివేలివ్వడానికి ఏడు స్తావు ? సరే నీ ఇష్టం" అంటున్నాడండి. ఇంకో అతను "మన సంబంధం యీ రోజుతో తీరేదాండి! యింకా వుందిగా! ప్రస్తుతం ఈ అయిదూ తీసుకొండి. మీముందున్న-ఆఫీసరుగారు కూడా ఇంతే పుచ్చుకునేవారు" అంటున్నాడండి. ఏమిటో గొడవ !

స ఇ:- ఊం. గొడవ ఏముంది ! కరప్షన్ (అవినీతి). ఈలాంటి మనుషు లుంటే, దేశంలో తిండి ఎందుకుంటుంది? తిండి లేకుండా చసారంటే ఎందుకు చావరూ? ఛీ... ఛీ... అల్‌రైట్, రాండి.

వార్డ:- జస్టు ఎ మినిట్ ప్లీజ్; మహాశయులారా ! ఈ నాటక కార్యక్రమం యధాప్రకారంగా సాగుతుంది. ఇంజనీరింగు కాలేజి వారు నాటకం ఆడతారు; సెంవు (సైడ్ కర్టన్సులోకి చూచి) కమాన్, కమాన్ ఆరం భించండి. తెరెత్తండి, తెరెత్తండి. ఇప్పటికే చాలా ఆలస్యమైంది.

[అని అందరూ వెడతారు; తెర లేస్తుంది]

[ఒక పోలీసు స్టేషన్-సబ్ ఇన్‌స్పెక్టరు వచ్చి కూర్చుంటాడు]

[ఒక వైపులో ఉన్న రిమాండు సెల్లులో ఒక రిద్దరు ఖయిదీలు ఉన్నారు -తెర లేచేటప్పటికి]

1 వ ఖైదీ:- "దొంగలెవరో దొరలు ఎవరో" తెలుసుకొనవొయ్ బ్రహ్మయా !

1 వ :- " అన్నమైతే నేమిరా సున్నమైతే నేమిరా.

2 వ :- ,, అందుచేతను పాడుపొట్టకు అన్నమే వేతాముురా!

(అని పాడుతుంటారు)

[ఇంకొకవైపు బియ్యపు బస్తాలు ఉన్నాయి-కుడివైపు నుంచి బావిలో పెద్ద బరువయిందేదో వేసినట్లు రెండు మూడుసార్లుశబ్దం, తరువాత కెవ్వుమని ఒక అరదాని కేక. ఈ పాటికి సీటులోంచి లేచిన స.ఇ. గాబరాగా పరుగెత్తుతాడు. రిమాండ్‌లో ఉన్న ఖైదీలు ద్వారం దగ్గరకువచ్చి ఆత్రంగా చూస్తుంటారు. బయట ఏదో గోల. ఇంతలో కానిస్టేబుల్ పరుగెత్తుకొచ్చాడు. టేబిలుమీద ఉన్న టార్చిలైటు, మూలనున్న చేంతాడు తీసుకొని మళ్ళీబయటకు పరుగెడ్తాడు. ఒక క్షణము నిశ్శబ్దం. స.ఇ. తొందరగా వచ్చి టేబిల్ మీదనున్న టెలిఫోన్ తీసుకుని, "హలో ! హలో ! డాక్టర్ అర్జంటు, కమాన్ ప్లీజ్" అని టెలిఫోన్ పెట్టేస్తాడు. గాబరాగా అటూ ఇటూ తిరిగి, "చూస్తూ, నిల్చుంటారేమిటిరా ఇడియట్స్, ఫస్టుఎయిడ్ ఇవ్వండిరా!" ఇంతలో ఇంకొక కానిస్టేబుల్ వస్తాడు ]

కాని:- ముగ్గురు బిడ్డలు దొరికారండి.

స.ఇ:- ఓ మైగాడ్! ముగ్గురు బిడ్డలే? అందరూ చచ్చిపోయారా?

కాని:- చచ్చి ఎప్పుడో పోయారండి.

స.ఇ:- ఛీ. ఛీ ఛీ నేను చూస్తున్నా! ఏమిటో ఈ స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ ఒకటే చావులు! ఒకటే ఆత్మహత్యలు!

కాని:- ఇంగ్లీషువారుండగా చావటానికి స్వాతంత్ర్యం లేదండి.

స.ఇ:- అయితే ఇప్పుడు స్వాతంత్ర్యం చావటానికి వచ్చిందంటావా?

కాని:- ఆ రోజుల్లో మన కాంగ్రెసు వాళ్ళు ఉపన్యాసాల్లో బానిసలుగా బ్రతకడంకన్నా, స్వతంత్రులుగా చావటమే మేలనేవారండి!

స.ఇ:- కాదురా ఈడియట్! బానిసలుగా పాయసం తాగడం కన్నా స్వతంత్రులుగా గంజి తాగటం మేలని.

1 వ ఖైదీ:- ఇప్పుడు కాయకూరలు తింటమే మేలంటున్నారండి.

[ఇంతలో డాక్టరు వచ్చారు]

స.ఇ:- హల్లో డాక్టర్!

డాక్ట:- ఏమిటండి గొడవ?

స.ఇ:- ఆ ఆడమనిషి ముగ్గురు పిల్లల్ని బావిలో పడేసి తానూ పడిపోయిందండి. ఇంకో క్షణముంటే...!

డాక్ట:- ఏ బావిలో?

స.ఇ:- మన స్టేషన్ బావిలోనండి.

డాక్ట:- తప్పు చేసింది. ఏ ఎమ్.ఎల్.ఏ. ఇంటి వెనకాల బావిలోనో పడి వుంటే, కొంత ఫలితముండేది.

స.ఇ:- ఏ ముండేది? తీసేవాళ్ళయినా లేకుండా చచ్చేది.

డాక్ట:- మరిప్పుడామెను బ్రతికించి గొప్ప ఘన కార్యము చేశామనుకుంటున్నారా?

స.ఇ:- కాదుమరి! ఒక ప్రాణాన్ని కాపాడాం.

డాక్ట:- ఎందుకూ? ఈ రామరాజ్యంలో ఇంకా పది కాలాలపాటు బ్రతకమనా? రైట్ రైట్ (వెళ్తూ బస్తాలు చూచి ఆగి, బస్తాలో బియ్యం చూస్తూ] యస్.ఐ. గారూ! ఈ కేసుకు కారణం ఏమిటో చెప్పమన్నారా?

స.ఇ:- ఆ, ఏముంటుంది? ఏవో కొంపలో వెధవగొడవలు.

డాక్ట:- [పిడికెడు బియ్యము తీసుకొచ్చి ఎస్.ఇ. చేతిలో పోసి] నా చిన్నతనంలో అందరూ అనేవాళ్ళు-అన్నంలేకుండా ఎవ్వరూ చావరు లేరా

అని. కాని ఇప్పుడు నూటికి-యాభై చావులు అన్నంలేకనే. దేశం మారిపోయింది.

[డాక్టరు వెళ్ళిపోతాడు. ఎస్. ఐ. బియ్యాన్ని ఒక చేతిలో నుంచి ఇంకొక చేతిలో పోసుకుంటూ, అలాగే చూస్తూ కుర్చీలో కూల బడ్డాడు. రిమాండ్‌లో ఉన్న ఖైదీలు...]

ఒకడు:- ఇదంతా చూస్తుంటే జెయిల్లో నుంచి విడుదల చేస్తారంటే—భయంగా ఉందిరా!

రెండ:- ఆఁ విడుదల చేసినా ఎంతసేపు. మరలా ఒక్క రోజులో తిరిగి రావచ్చు

1 వ:- ఎట్టా?

2 వ:- నీకు తెలియదేం? సుళువైన దోవ వుంది. ఎర్ర గుడ్డ పీలిక పట్టుకు బయలుదేరావంటే, కళ్ళు మూసి తెరిచే లోపల—మళ్ళీ కటకటాల వెనక ఉంటాము.

స.ఇ:- (తిరిగిచూచి) ఆ కాలం పోయింది. ఇప్పుడు తుపాకి పెట్టి కాల్చేస్తాం!

2వ - అది మరీ సుళువుకదయ్యా—ఒకేసారి చస్తాం.

స.ఇ:- చస్తాం, చస్తాం. ఏమిటీ దేశంలో అందరూ ఒకటే చస్తాం, చస్తాం అంటారు!

1 వ:- బతుకుతాం— బతుకుతాం— అనటానికి ధైర్యం లేదుగనక.

స.ఇ:- ఎందుకు లేదోయ్! అనండి, ధైర్యంగా అనండి — బ్రతుకుతా మని...

2 వ:- మీరీ వుద్యోగానికి చాలా కొత్తగా బోలయ్యా?

స.ఇ:- ఏం?

2 వ:- పాతబడ్డ పోలీసోళ్ళెవరూ, బతకమని అనరే!

[ఒక పత్రికా విలేఖరి ప్రవేశము]

ప.వి:- నమస్కారమండి...

స.ఇ.- నమస్కారం. రాండి కూచోండి. ఏమిటి విశేషాలు?

ప.వి:- ఏ మున్నయ్, మీరే చెప్పాలి. మరి మన పోలీస్‌స్టేషన్ కాడిలో—

స ఇ:- అవునవును. ఒక తల్లీ ముగ్గురు పిల్లలూ పడి చచ్చారు.

ప. వి:- చచ్చిపోయారా!

స. ఇ:- తల్లిని మాత్రం తీశాం. డాక్టరు వచ్చారు. బహుశా-బ్రతకొచ్చు.

ప. వి:- పేపరుకు న్యూస్ పంపించమంటారా?

స. ఇ:- పంపండి; ఏం? నన్నడగట మెందుకూ?

ప. వి:- అలా కాదులెండి; ఈ మధ్య ఈలాంటి వార్తలు పూర్తిగా బహిష్కరిస్తున్నారుగా.

స. ఇ:- ఎవరు?

ప. వి:- ఎవరేమిటి. ప్రభుత్వమే. ఇదిగో— చూడండి. ఈ రోజు పేపరులో ఏమంటున్నారో మన వాళ్ళు- "ఆహార పరిస్థితిని గురించి కొందరు విష ప్రచారము చేస్తున్నారు. గోరంతలు కొండంతలు చేస్తున్నారు. నిజంగా అంత తీవ్ర పరిస్థితులు లేవు. చిత్తూరు జిల్లా తదితర ప్రాంతాలలో చావులకు కారణం— అన్నంలేకకాదు, ఇతర జబ్బులే. ఆహార పరిస్థితి సంతృప్తికరంగా ఉందని గ్రామాలలో నుంచి బాధ్యతకల వ్యక్తులు మాకు స్వయముగా తెలియజేస్తున్నారు" విన్నారా?

స. ఇ:- నిజమే! నేనూ ఇన్నాళ్ళు అలాగే అనుకున్నా, కాని అదంతా అబద్ధమని ఈనాడు తెలుసుకున్నా!

ప. వి:- ఏదంతా అబద్ధమని?

స. ఇ:- అన్నము లేనందువల్ల, ఆకలి బాధకి ఆగలేక, మనుష్యులు చస్తున్నమాట యదార్థం.

ప.వి:- యస్.ఐ. గారూ!

స. ఇ:- ఎందుకలా తెల్లబోతారు?

ప. వి:- మీరు గవర్నమెంటు ఉద్యోగులు!

స. ఇ:- అయితే నిజం మాట్లాడకూడదంటారా?

ప. వి:- నిజం మాట్లాడటమే ఈ రోజుల్లో ఒక విధ్వంసక చర్యగా వుంది.

స. ఇ:- నేనిప్పుడు గవర్నమెంటును పడగొట్టాలని ప్రయత్నించడములేదు. నాకు మంత్రి పదవిమీద ఆశా, వున్నవారిమీద అసూయా—రెండూ లేవు. నేను కమ్యూనిస్టును కాను. కాని నా అభిప్రాయ మంటే మనమే మనవాళ్ళని చంపుతున్నాం, మనలోనే వున్నారు దొంగలు! మనలో ఉన్న దొంగల్ని మనం పట్టుకోగలిగితే, గవర్నమెంటు దానంతటదే బాగుపడుతుంది.

ప. వి:- అయితే మీరు ఆహార సమస్యమీద తీవ్రంగా పనిచేయదలచుకున్నారన్నమాట!

స. ఇ:- నా శక్తివంచన లేకుండా!

[డాక్టరు వస్తాడు]

స. ఇ:- డాక్టర్! ఆ పేషెంట్ ఎలా వుంది?

డాక్ట:- (తాపీగా) ఆవిడ కింక రేషన్‌కార్డు అవసరం లేదు.

స. ఇ:- వాట్?

డాక్ట:- వాట్‌లేదు, గీటూలేదు. ఆహార సమస్యలను అతి సులభంగా పరిష్కరించుకొని వెళ్ళింది.

స. ఇ:- అయితే ఆకలితోనే!—అన్నం లేనందువల్లనే చచ్చిందంటారా?

డాక్ట:- సైన్సుకు తెలిసినంతవరకూ అలాగే చెప్తుంది. పత్రికల్లో స్టేట్‌మెంట్లా? ప్లాటుఫారంమీద ఉపన్యాసాలు ఎవరినన్నా మోసం చేయవచ్చునుగాని, మెడికల్ సైన్సును మోసం చేయటానికి వీల్లేదు.

ప. వి:- డాక్టరుగారూ! మా పేపరుకు ఒక స్టేట్‌మెంటు యిస్తారా?

డాక్ట:- నేనింకా కనీసం ఒక ఎం.ఎల్.ఏ. నయినా కాందే.

ప. వి:- ఈ విషయం ప్రజలకి బాగా తెలియటం అవసరం ఏదండీ ?

డాక్ట:- చస్తున్న వాళ్ళకు చస్తున్నామని తెలియడ మేమిటి ? ప్రజలకు కాదు —తెలియాల్సింది, ప్రభుత్వానికి.

స. ఇ:- డాక్టరు గారూ ! అయితే నిజంగా చచ్చిపోయిందంటారా ?

డాక్ట:- చచ్చిపోలేదు–కానీ, ప్రాణాలు పోయినాయి. (యస్ ఐ. మీదకు ఉరికి) నువ్వింతా ఆరౌన్సులు కాదు, బస్తా బియ్యం ఇచ్చినా ఆమె బ్రతకదు.

స. ఇ:- (కుర్చీలో కూలబడ్డాడు) ఒక తల్లీ, ముగ్గురు బిడ్డలూ. అబ్బ ! ప్రాణా లంటే ఎంత చులకనై పోయింది !

డాక్ట:- (యస్. ఐ. వీపు తట్టి) నువ్వు పోలీస్ ఉద్యోగంలో ఉండతగ్గవాడివి కావు. నీకేదో కాస్త హృదయం ఉన్నట్లుంది.

స. ఇ:- (లేచి పిచ్చిగా తిరుగుతూ) ఇదేనా నాదేశం ? ఇన్ని పొలాలూ, ఇంత పంటా, ఇందరు జనముండీ, ఒక్క ఆడది అన్నం లేకుండా చచ్చిందంటే మన కెందుకు సిగ్గులేదు ? మనమెలా తలెత్తుకు తిరుగుతాం ?

డాక్ట:- కాలేజీ నాటకాల్లో ఎప్పుడన్నా వేషాలు వేశావా ?

స. ఇ:- డాక్టరు గారూ ! పరిహాసానికి ఇదా సమయము ?

డాక్ట:- పరిహాసం కాదోయ్ పిచ్చివాడా ! తొంభై మంచి గింజల్లో-ఒక్క-పుచ్చుగింజ ఎంతో, తొంభై పుచ్చుల్లో ఒక్క 'మంచు'న్నా అంతే. నువ్వొక్కడివి ఏం చేయగలవు ? లంచగొండి తనమూ, బ్లాక్ మార్కెట్ అధికారం చెలాయిస్తున్న రోజుల్లో, నీ ఆవేదనంలా నిరుపయోగం.

స. ఇ:- అయితే నేను ఈ ప్రవాహంలో కొట్టుకు పోవలసిందేనా ? ఏం చేయ లేనంటారా ?

డాక్ట:- చేయగలవు. కాని నీకు ప్రమోషన్లు రావు. నిన్ను ఏ ఎడారికో బదిలీ చేస్తారు. ఇంకా ఇలాంటి ఇబ్బందులెన్నో వస్తాయి.

స. ఇ:- ఎన్నొచ్చినాసరే, యీ నిండు ప్రాణాలు తిండిలేకుండా మాడిపోయే దౌర్భాగ్యాన్ని ఆపాలి.

డాక్ట:- సరే ! ప్రయత్నించు. విష్ యు సక్సెస్. (వెళ్ళిపోతాడు)

స. ఇ:- (కాస్సేపు ఆలోచించి కాలింగుబెల్ కొట్టాడు; కానిస్టేబుల్ వచ్చాడు) ఏయ్ ! ఆ వార్డెన్‌ని పిలుచుకురా !

[కానిస్టేబుల్ వెళ్ళాడు]

స. ఇ:- (విలేఖరితో) మీరా గదిలో ఉండండి. ఇక్కడ జరిగే ప్రతి విషయం — తు. చ. తప్పకుండా రేపు పత్రికకు పంపండి. (ప॥వి॥ వెళ్తాడు. ఇంతలో వార్డెన్ వచ్చాడు). వార్డెన్ గారూ; ఇప్పుడొక స్త్రీ—ముగ్గురు పిల్లల్ని బావిలో పడేసి, తానూ పడి చచ్చిపోయింది. కారణం ఏమిటో తెలుసా ?

వార్డె:- ఓ ! ఈజిట్ ?

స. ఇ:- అవును; ఇలా తిండి లేక పోవటానికి కారణం ఎవరో తెలుసా ?

వార్డె:- ఆదేనండి ! మీరు ఉండమంటే ఉన్నారు కారు; ఇంజినీరింగు కాలేజీ వాళ్లు ఆహార సమస్యమీద మంచి నాటకం ఆడబోతున్నారు. చూచి వుంటే తెలిసేది- తిండి లేకపోవటానికి కారణం ఎవరో !

స.ఇ:- నాన్‌సెన్స్ ! నాటకాలు ! నాటకాలు ! 'ఆహార సమస్య'ను నాటకాలటయ్యా పరిష్కారం చేసేది ! మీబోటి పెద్ద మనుషులంతా ఇలా బస్తాల బియ్యం బ్లాకు మార్కెటులో కొని దాచేస్తుంటే, తిండెలా వుంటుంది ? మనుషులెందుకు చావరు ?

వార్డె:- ఇదంతా మా స్టూడెంట్సు కోసం కొన్నానండీ ! ఇచ్చే రేషన్ చాలటం లేదు. చూడండి ! స్టూడెంట్సు ఫ్యూచర్ సిటిజన్స్ (భావి పౌరులు) వాళ్ళకు మంచి నరిష్మెంట్ ఉండాలి.

స.ఇ:- మీ సమర్థనలన్నీ తర్వాత చెప్పకుందురు కానీ, ఎక్కడ కొన్నారీ బియ్యాన్ని ?

వార్డె:- చెప్పాలంటారా?

స. ఇ:- చెప్పాలనే అడగటం!

వార్డె:- చూడండి, ఇది ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్,

స. ఇ:- ఇదేనేమో మీరిచ్చే ఎడ్యుకేషన్! అడిగిందానికి జవాబు చెప్పండి.

వార్డె:- బాపూజీ రైస్ మిల్లులో కొన్నానండి.

2వ ఖైదీ:- బాపూజీ రైస్‌మిల్లే! బాపూజీ రైస్‌మిల్లే!

స.ఇ.- బాపూజీ రైస్‌మిల్! సరే, మీరు వెళ్ళి అక్కడ కూర్చోండి.

[వార్డెన్ వెళ్ళారు]

స.ఇ.- (బెల్ కొట్టారు. కానిస్టేబుల్ వచ్చారు) సుబ్బయ్య చౌదరిని పట్టుకురా. (కానిస్టేబుల్ వెళ్ళాడు. మూలనున్న ఒక పెద్ద పట్టా తీసి బియ్యం బస్తాలు కప్పేశాడు యస్. ఐ. ఇంతలో సుబ్బయ్య చౌదరి వచ్చారు)

చౌదరి:- నమస్కారమండీ.

స.ఇ:- నమస్కారం. రాండి, రాండి!

చౌదరి:- ఏమిటో అంత తొందరగా కబురు పంపారు?

స.ఇ:- ఏంలేదు. మీ మిల్లు నుంచి ఎన్ని బస్తాలు రవాణా అవుతాయ్?

చౌదరి:- సుమారు 60 లక్షలు.

స.ఇ:- ఊఁ! ఎన్ని బస్తాలు రాళ్ళు సరఫరా చేస్తారు?

చౌదరి:- అబ్బే! రాళ్ళెక్కడివండీ?

స.ఇ:- పోనీ- మట్టి ముద్దలు?

చౌదరి:- ఏదైనా పొరపాటున ఉంటే ఒకటీ రెండూ వస్తే వస్తాయేమో గానీ-

స.ఇ:- డి. యస్. ఓ.కి ఎంత యిస్తారు?

చౌదరి:- జీతమాండి?

స.ఇ:- కాదు. అర్ధరాత్రిలో లైటు వేసుకొని బస్తాకి అరపడి రాళ్ళు కలపడానికి ఆయన అనుమతి కోసం-మీరిస్తారే సంభావన?

చౌదరి:- లంచమాండీ?

స ఇ:- ఛ;ఛ; పెద్ద వాళ్ళు తీస్తే లంచమెందుకు అవుతుందండీ?

చౌదరి:- అట్లాంటివి మేము ఇంతవరకు ఎరగమండి. రైన్‌మిల్ బాపూజీ చనిపోయిన రోజున స్థాపించామండి.

స ఇ:- బాపూజీ బ్రతికి వున్నప్పుడు స్థాపించినవే కరష్టయి పోతుంటే, చచ్చిన తరువాత స్థాపించిన దాంట్లో తప్పులేదులెండి.

చౌదరి:- మీరేదో కానివాళ్ళ మాటలు నమ్మి—

స ఇ:- (చాలా సీరియస్‌గా లేచి) చౌదరిగారూ! (పెద్దగా అరిచాడు)

చౌదరి:- (కాస్త కంగారుపడి- తెప్పరిల్లి కాస్త విసురుగా) ఏమిటండీ మీ బెదిరింపులు?

స.ఇ:- (తాపీగా) బ్లాక్ మార్కెటు చేసిన వాళ్ళను ఉరి తీస్తానని నెహ్రూ ఒకప్పుడు చెప్పాడు.

చౌదరి:- ఆ! చెప్పాడు. ఒక్కడిని ఉరి తియ్యగా ఇప్పటికి చూడలా!

స.ఇ:- అదే పొరపాటు జరిగిపోయింది. తీసి వుంటే ఈ బస్తాలు ఇక్కడికి వచ్చేవికావు (బస్తాలు తీసి చూపుతాడు) ఈ బస్తాలు ఇక్కడికి రాకుంటే, ముగ్గురు బిడ్డల తల్లి చచ్చేదికాదు. న్యాయశాస్త్రం లేదు కానీ, నువ్విప్పుడు నల్గురి ప్రాణాలను ఖూనీ చేసావు.

చౌదరి:- ఏమండి! కాస్త మర్యాదగా మాట్లాడండి.

స.ఇ:- మనుష్యుల్ని తినేవాళ్ళకు మర్యాదా, గౌరవమూ, పదవులూ ఇవ్వ బట్టి మనలోకం యిలా తయారైంది. నేను మీకలాంటి మర్యాదా యివ్వదలుచుకోలా. (రిమాండ్ సెల్లువైపు చూచి) గవర్నమెంటు తరుపున మీకిక్కడ కావలసిన మర్యాదలు జరిపిస్తా. (బెల్లు కొట్టి) వార్డెన్‌గారూ! (వార్డెను వచ్చాడు) యీయన్ని మీరెరుగుదురా?

చౌదరి:- తెలిస్తే?

స.ఇ:- ఏమీలేదు. కాస్సేపు కూర్చోండి (యస్.ఐ. బైటికి వెళ్ళాడు.)

చౌదరి:- (ఇటు అటు చూచి) చెప్పారా ఏం, కొంపతీసి?

వార్డె:- మీరూ డి.యస్ ఓ మాట్లాడుతుండగా విన్నొచ్చి కానిస్టేబుల్ చెప్పాడు.

చౌదరి:- అయితే ఈ రాయి డి యస్. ఓ. దాకా తగుల్తున్నదన్నమాట.

వార్డె:- వీడెవడో కాలాంతకుడిలా ఉన్నాడు; గట్టి పట్టు పట్టాడు.

చౌదరి:- ఏం పర్వాలేదు. డి.యస్.ఓ. గారి బావగారు ఎం.ఎల్.ఏ. క్షణంలో కేసు కొట్టించేస్తాడు.

వార్డె:- అయినా మనం చేసింది తప్పే.

చౌదరి:- తప్పేమిటండి, తప్పు! ఈకాలంలో ఎవడికివాడు నాలుగు కాసులు చేసుకోవాలి.

వార్డె:- గవర్నమెంటు ఇప్పుడు కాస్త తీవ్రంగా చర్య తీసుకుంటున్నట్టుంది.

చౌదరి:- తీవ్రమూలేదు, చర్యాలేదు. బాపనయ్య దగ్గర రెండు మూడు వందల పుట్ల ధాన్యం మూలుగుతోంది. ఆయన గడప తొక్కి, 'పడి'ధాన్యం తెచ్చే ధైర్యం ఒక్క ఆఫీసరుకూ లేదు.

1వఖై :- అవున్నా, ఆఫీసర్ల ధైర్యమంతా మన బోటాళ్ళ మీదనే!

2వఖై :- అంతేకదూ! మొనగాళ్లు! గుడిసెం మీదపడి, రోజుకు పెట్టుకున్న ధాన్యాన్ని కూడా లాక్కు పోతున్నారు.

1వ ఖై :- మా వూళ్ళో ''రిలీఫ్ అంగడంటూ'' పెట్టారు. ఊరి మునసబు కిచ్చారు; 20 బస్తాలొస్తాయి; అందులో వారానికి అదమపచ్చం 10 బస్తాలు ఆయన ఎనకేస్తాడు.

2వ ఖై :- ఎట్టా? లెక్క లేదూ?

1వ ఖై :- ఎట్టా గేంటోయ్? చుట్టు ప్రక్కలున్న గ్రామాల్లో అంతా కూలీ నాలీ చేసుకునే జనం అధికం. వాళ్ళకొక్కొక్క వారం మొత్తం రేషను కొనుక్కునేందుకు డబ్బులుండవు; అంతగా కూలినాలీ చేసి డబ్బులు తెచ్చుకుంటే-వారం అయిపోయిందంటాడు; రేషను కార్డులన్నీ ఆళ్ళ దగ్గరే వున్నాయ్. ఆళ్ళకి సమవా సందా? ఇచ్చినట్లు గిట్లు గీస్తుంటాడు. అడిగే నాయాలెవడు?

2వ ఖై :- చెక్కింగు ఆఫీసర్లుంటారు గదట్రా?

1వ ఖై:- ఆఫీసర్లంటే ఆకాశాన్నుం డూడి పడ్డారనా ? అళ్ళూ మనుషులే ; ఆశ చూపి_త్తే అందరూ లొంగుతారు.

2వ ఖై:- అయితే యిదెట్టా తెగేదంటావు ?

1వ ఖై:- మనకు తోసే దొక చే, అందరూ జైల్లోకొచ్చి కూచుంటేసరి.

2వ ఖై:- మరి బువ్వో ?

1వ ఖై:- ఆఁ, గవర్నమెంటు పెట్టటంలా ! అట్టాగే అందరికి పెడతాది. [చౌదరి, వార్డెన్ పెద్దగా నవ్వారు. ఖయిదీలు జవాబుగా వెకిలిగా నవ్వుతారు. చౌదరీ, వార్డెన్ మొఖాలు చిన్న చేసుకుంటారు...]

చౌద:- (ఉన్నట్టుండి ఏదో జ్ఞాపకమొచ్చి) ఇక్కడ ఫోనుందా ?

వార్డె:- ఎందుకూ ?

చౌద:- పనుంది.

వార్డె:- ఇక్కడెక్కడో పబ్లికు ఫోనుండాలి.

చౌద:- రైటో ! అయిపోయింది. ఒక్క క్షణంలో తేల్చేస్తా. వీడెంత ? వీడి సబ్ ఇన్‌స్పెక్టరు పనెంత ? మహా మహా వాళ్ళనే చూచాను (వెళ్తాడు). [వార్డెన్ ఏమీతోచక, అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు. ఇంతలో మొట్ట మొదట ఆడియన్సులోకి పరుగెత్తిన దొంగ గబా గబా పరుగెత్తుకుంటూ వచ్చాడు. వచ్చి అటూ ఇటూ చూచి, వార్డెన్‌తో......]

దొంగ:- అయ్యా ! అయ్యా !

వార్డె:- ఏం ?

దొం:- ఇప్పుడే ఇక్కడ ఈ బావిలో, ఓ ఆడమనిషి పడి చచ్చిపోయిందట. మీరు చూసారా బాబూ ? నిజమేనా ?

వార్డె:- అవును, చచ్చిపోయిందట ! అది చస్తే చచ్చింది, మా ప్రాణాలు తీస్తోంది అది చావటానికి కారణం మేమట ? ఎవరు దీనికి కారణం, ఎవరి కర్మ వాళ్ళదిగాని—

దొం:- ఇంతకూ చచ్చిపోయిందా బాబు

వార్డె:- చచ్చిందట !

దొం:- మీరు మనిషిని చూశారా ?

వార్డె:- లేదు.

దొం:- ఎట్టావుంది బాబూ మనిషి ?

వార్డె:- అరె ! చూడలేదంటే - ఎట్లా వుందని అడుగుతావేం ? అరమనిషి లాగే వుంటుంది.

దొం:- పిల్లలా బాబూ ? పిల్లలన్నా బ్రతికున్నారా బాబూ ? మీరు చూశారా పిల్లల్ని ?

వార్డె:- పిల్లలూ తల్లీ, అంతా క్లోస్. చెప్పకుండా పోయాయి—ప్రాణాలు.

దొం:- ఎందరు పిల్లలు బాబూ ?

వార్డె:- నిన్ను చూస్తే వదిలేటట్టు లేవే ! ఎందరు పిల్లలు ? ఎవరికి పుట్టారు ? ఇదంతా-విచారించటమా నా పని ?

దొం:- కాదు బాబు ! మా యింట్లో వాళ్ళం వారం రోజులుగా పచ్చి మంచి నీళ్ళు తాగుతున్నాం. పిల్లా జల్లా అంతా అట్లాగే బ్రతుకున్నాం .మేం సరే- ఆ పిల్లలు- ఆళ్ళేం చేశారు ? అళ్ళట్టా ఎండిపోతావుంటే చూడలేకపోయా ! చివరికి......

వార్డె:- బావిలో తోసేశావా ?

దొం:- లేదు బాబూ, ఆ పని చెయ్యలేకనే బయల్దేరా-దొంగతనానికి.

వార్డె:- దొంగతనానికి !! నువ్వు దొంగవా ? ఎక్కడికి వెళ్ళావు దొంగ తనానికి ?

దొం:- ఆడ చదువుకుంటారే - ఆ చోట్లో - ఆస్టలంట, ఆదీ—

వార్డె:- ఓ, నువ్వేనా ఆ మహానుభావుడివి ! యస్. ఐ. గారూ...ఇన్స్పెక్టరు గారూ!...... (చాలా ఆత్రంగా వెదుకుతూ పిలిచాడు; బెల్ కొట్టాడు) దొంగ......! దొంగ......!

దొం:- జైల్లో ఎయ్యటానికేనా బాబూ ? మీరెయ్యక్కర్లా ? నేనే వెళ్ళి కూసుంటా. నేనేం లచ్చలూ, వేలూ దొంగతనం చెయ్యలా! పిడికెడు కూడు బాబూ ! ఆకలితో చస్తున్న బిడ్డలకి అంత కూడు. అంతే

బాబూ ! ఎప్పుడూ దొంగతనం ఎరగను. మావోళ్ళంతా చాల గొప్పగా మర్యాదగా బ్రతికినోళ్ళు. మర్యాదా, గౌరవం, గొప్పా-అన్నీ చచ్చాయ్ ఆకలితో......దొంగిలించా......తీరా తీసుకుని యింటికి పోతే, ఇల్లు ఖాళీ. యింతలో యీ చావు కబురు విన్నాను. నా లచ్చే మోనని పరుగెత్తుకొచ్చా. చెప్పండి బాబూ, ఏదుంది ? చెప్పండి బాబూ !

వార్డె:- లోపలుందట! పోలీసు నడుగు, చూపుతాడు.

దొం:- ఆఁ! ఆఁ ! ! బాబూ! బాబూ! (పరుగెత్తి వెళ్ళాడు)

వార్డె:- ఏయ్! పోలీసు! దొంగ! దొంగ! జాగ్రత్తగా చూడు! వాడు పచ్చి దొంగ!

[ఇంతలో యస్. ఐ. వస్తాడు]

స. ఇ:- వాడు కాదు దొంగ. మీరూ, మనం, మనపైన వున్న వాళ్ళూ!

వార్డె:- నిజంగా దొంగ వచ్చాడండి !

స. ఇ:- కాని అసలు దొంగ తేలాలి!

వార్డె:- యస్. ఐ. గారూ! నన్ను కాస్త తొందరగా పంపేయండి దయ చేసి. ఇంజనీరింగు కాలేజీ వాళ్ళ నాటకం! తప్పక చూడాలి.

స. ఇ:- ఈ జీవిత నాటకం చూడండి సార్, చాలు...ఇదిగో, కొత్త పాత్రలు వస్తున్నాయి చూడండి. ఈ పాత్రలను నాటకంలోలా నేను క్రమె టిక్‌గా ప్రవేశపెట్టి పరిచయం జేయలేను. అయినా... ఈయనెవరో తెలుసునా? మన డి.యస్.ఓ. ఆయన వెనకాల వున్నవారు ఓ గ్రామ మునసబు (ఇటూ అటూ చూచి) చౌదరిగా రెక్కడ?

వార్డె:- ఫోన్ చేయాలని వెళ్ళాడండి.

స. ఇ:- ఎవరికో?

వార్డె:- ఏమోనండి !

స ఇ:- బహుశా గవర్నమెంటు హౌసెక్సై ఉంటుంది వుండనీండి. (డి. యస్ ఓ తో) రాండి సార్! రాండి, కూర్చోండి.

[ డి. యస్ ఓ. తలవంచుకొని కూర్చున్నాడు ]

స. ఇ:- (సెల్లులా వున్న ఖైదీలను చూపి) వీళ్ళెవరో తెలుసాండి?

[ డి. యస్. ఓ. మౌనం ]

స. ఇ:- వీళ్ళు దొంగలు.

వార్డె:- ఏమండీ, నాటకం ఈపాటికి సగం అయిపోయి వుంటుంది.

స. ఇ:- ఇదిగో, తొందరలో పంపివేస్తా. మిమ్మల్ని ఎక్కడికి పంపాలా అనేదే ఆలోచిస్తున్నా. ఆర్డర్ల కోసం ఎదురు చూస్తున్నా. డి. యస్. ఓ. గారూ! ఈరోజు ఒక ఆడది ముగ్గురు బిడ్డలతో సహా ఆత్మహత్య చేసుకుంది.

డి.యస్.ఓ:- అబద్ధం!

స. ఇ:- ఇదిగో- డాక్టర్ సర్టిఫికేట్!

డి యస్.ఓ:- ఇదేదో నాటకం!

స. ఇ:- హుఁ, మీకందరికీ నాటకం జబ్బు పట్టిందేం! ఇక్కడ కాదు. పచ్చయప్ప కాలేజీలో జరుగుతోంది. యిది యదార్థం. కావాలంటే శవాన్ని చూసిరండి.

డి.యస్.ఓ:- నేను చూడాల్సిన అవసరంలేదు.

స ఇ:- అవును, 5 వేలు చూచిన కళ్ళతో శవాన్నెలా చూస్తారు, పాపం!

డి యస్.ఓ:- ఓ, మీకు రుజువు?

స. ఇ:- రుజువులన్నీ ఉన్నాయి. అవి కోర్టుకో మాట్లాడాల్సిన మాటలు. కాని ఇక్కడ మిమ్మల్ని నే కోరేదొక్కటే. మీ గుండెలమీద చెయ్యి వేసుకొని చూడండి, మీరు రోజు కెందరి ప్రాణాలు తీస్తున్నారో! మీ బిడ్డల్ని ఒక్కసారి బావిలో పారేస్తే......

డి.ఎస్.ఓ:-యస్. ఐ. గారూ!

స ఇ:- మీ భార్య బావిలో పడితే...

వార్డె:- మమ్మల్ని ఏడిపించాలనా ఇదంతా?

స. ఇ:- ఏడిపించాలని కాదు, మీ కర్థం కావాలని; అంతే!

డి ఎస్ ఓ:-యస్ ఐ. గారూ! మీకు ఋజువులుంటే కోర్టులో దాఖలు చేసుకోండి, మీ చేతనైన పని చేసుకోండి; అంతేగాని ఒక గవర్నమెంటు ఆఫీసరును బాధ్యతారహితంగా...

స. ఇ:- మీరు బాధ్యత కలిగే ప్రవర్తిస్తున్నారా ?

డి ఎస్ ఓ:-మాకు తెలిసినంతవరకు మేమెరి ప్రాణాలూ తీయలేదు.

[డి.ఎస్.ఓ. పై మాటలు చెప్తూ మెల్లగా జేబులోంచి నోట్ల కట్ట తీసి వేస్టుపేపరు బుట్టలో వేయబోతుంటాడు]

స. ఇ:- స్టాప్! నోట్లకట్ట బుట్టలో పడ్డదా- తల పేల్తుంది!

[డి.యస్.ఓ. ఆగిపోయాడు]

స ఇ:- హాండ్సప్.

[డి.యస్.ఓ. చేతులెత్తాడు. ఇంతలో చౌదరి వచ్చి వెనక్కి తగ్గాడు]

స. ఇ:- రాండి! చౌదరిగారూ! (చౌదరి వెనకటడుగు వేశాడు) ఇంకొక్క అడుగు కదలకండి, ప్రమాదం (బెల్ కొట్టాడు; కానిస్టేబుల్ వచ్చాడు) చౌదరిగారి కోటు జేబులో ఒక ఉత్తరం ఉంది తియ్యరా? (కానిస్టేబుల్ చౌదరి జేబులోనుంచి ఉత్తరం తీశాడు) వార్డెన్‌గారూ! ఉత్తరం చదవండి.

వార్డె:- (ఉత్తరం తీసుకొని చదువుతాడు) "చౌదరిగారికి, రేపు ప్రొద్దున్నే 60 లక్షల బస్తాలు పంపాలన్న విషయం జ్ఞాపకము ఉందనుకుంటా. ఇంతవరకు మన విషయం సెటిల్ చేయలేదు. నాకు కాస్త పైకం జరూరుగా ఉంది. రాత్రికి కలుస్తా."

స. ఇ:- ప్రసాద్ మీరేనాండి?

డి.ఎస్.ఓ:-అవును.

స. ఇ:- ఈ ఉత్తరం మీరు వ్రాసిందే? అవునా?

(డి.ఎస్.ఓ. మౌనం)

స. ఇ:- గిద్దలూరు బాపనయ్య దగ్గర 200 పుట్ల ధాన్యం వుందని మీకు తెలీదా?

డి.యస్.ఓ :-తెలీదు

స. ఇ :- మీకు తెలిసినట్లు దాఖలా చూపుతాను.

డి.ఎస్.ఓ:-తెలిస్తే ?

స. ఇ:- మీరెందుకు 'ప్రొక్యూర్' చేయలేదు ?

డి.ఎస్.ఓ:-ఆయనివ్వలేదు.

స. ఇ:- మళ్ళా అబద్ధం!

1వ ఖై :- ఇవ్వనంటేనే ఊరుకున్నారా? మా ఇళ్ళల్లో దూరి కుండా బొచ్చా అంతా గాలించి లాక్కెళ్ళలా! అట్టా ఎందుకు చేయకూడదుట?

2వ ఖై :- ఎందుకంటే, ఆళ్ళు లావాంటాళ్ళురా?

1వ ఖై :- బాపనయ్య పెద్ద మంత్రులతో చెప్పి ఏడ ఉద్యోగం వూడబెరికిస్తాడో అని భయంరా!

స. ఇ:- (ఖైదీలతో) సూ్సా (డి.ఎస్.ఓ.తో) బాపనయ్య బ్లాక్‌మార్కెటు వ్యాపారం చేయటం మీకు తెలీదూ?

డి.ఎస్ ఓ:-తెలిస్తే ?

స ఇ:- మీరూ, బాపనయ్యా, చౌదరీ - మీరందరు ఈ వ్యాపారంలో భాగస్వాములు; మీరందరూ షరీకై ఇది సాగిస్తున్నారు.

డి.యస్ ఓ:- లేదు; లేనేలేదు—

స.ఇ:- అయ్యా, గ్రామ మునసబుగారూ!

డి.ఎస్ ఓ:- ఏమని బెదిరించారు మిమ్మల్ని?

[మునసబు చెప్పడానికి జంకుతాడు]

స.ఇ:- చెప్పు, పర్వాలేదు.

మున:- ,ఘూ-ఊళ్ళో 200 ఇళ్ళున్నాయండి. 200 ఇళ్ళలో ఏ పది ఇరవై మందికో సరిగా రెండుపూటలా భోజనం వుంటుంది. మిగతా అందరూ వారానికి మూడురోజులు తింటే అధికం. ఈ విషయం నే నెన్నో సార్లు అయ్యగారితో మనవిచేసుకున్నాను. పండినపంటలు పండినట్టు

లాక్కెళుతున్నారు. పెద్దవాళ్ళదగ్గరనుంచి గింజయినా కదల్చడం లేదు. మహ బాగా పండినా, రైతుకు మూడు నెలల బత్తెంరాదు. అది కాస్తా లాక్కెడితే వాళ్ళేంకావాలి? ఈ విషయం పైకి రాయమని ఎన్నోసార్లు చెప్పానండి.

డి.ఎస్.ఓ:- నేను రాశాను.

మున:- రాశారేమోగానీ, పత్రికల్లోమాత్రం, మా ఊళ్ళో తిండికరువేమాత్రం లేనట్టే వచ్చిందండి!

డి.ఎస్.ఓ:- పత్రికల్లో వచ్చిందానికి నేనా కారణం?

మున:- కారణం ఎవరికాక్కాలిబాబూ, ఫలితం కావాలిగానీ. ఇది ఇట్టా వుండగా మొన్న అయ్యగారు మా ఊరొచ్చి మా ఊళ్ళో ఆహార పరిస్థితి బాగుందనీ, తిండి లేకుండా మనుషులు చావటం వట్టి అబద్ధమనీ రాసివ్వమన్నారు.

స.ఇ:- నువ్వేమన్నావు?

మున:- రాసివ్వనన్నానండి.

స.ఇ:- ఎందువల్ల ?

మున:- అదొట్టి అబద్ధం బాబూ!

స.ఇ:- తరువాత?

మున:- అయ్యగారు నన్ను బెదిరించి, బలవంతాన రాయించుకుపోయారు బాబూ!

డి.ఎస్.ఓ:- అబద్ధం! పచ్చి అబద్ధం! యూ స్కౌండ్రల్!

[విసురుగా వెళ్ళి కొట్టబోయాడు]

స.ఇ:- (డి.ఎస్.ఓ. నాపి) ఆగు!

దొం:- (పిచ్చివాడిలాగా వస్తూ) అబద్ధం, నా పెళ్ళాం చచ్చింది అబద్ధమా ? నా పిల్లలను నూతిలో పడేసింద అబద్ధమా? నేను కడుపుమాడి చావలేక, తిండికోసం దొంగతనం చేయడ మబద్ధమా? మనకు సొతంత్రం వచ్చినమాట అబద్ధం. ఇది పేదోళ్ళరాజ్యంఅనటం అబద్ధం.

స.ఇ:- ఏయ్! ఎవరు నువ్వు?

వార్డె:- వీడేనండి మా హాస్టల్లోపడ్డ దొంగ !

దొం:- నువ్వు సెప్పక్కర్లా, నేనే చెప్తా; నేనే దొంగను. మీ రందరూ పెద్ద మనుషులు! మీకు డబ్బుంది, అధికారముంది; తిండివుంది; మీ దొంగ తనాలు పెద్ద తరహావి (చంకలోవున్న అన్నంమూట తీసిచూపుతూ) ఇదిగో, మీ అన్నం. దీనికోసమే నేను దొంగనయ్యాను. దీనితో నా పెళ్ళాం బిడ్డల్ని ఒక రోజు బతికిద్దామనుకున్నాను. పిచ్చివాణ్ణి, దీంతో ఒక రోజు గడిచినా మళ్ళీ పస్తులే కదా అన్న విషయం మర్చి పోయాను. నా పెళ్ళాం తెలివయింది. దానికి తెలుసు, ఈ బాధ ఎప్పటికీ తీరదని, బాగా ఆలోచించి చచ్చింది. నాకు దారి చూపింది. తీసుకోండి మీ అన్నం (విసిరికొట్టాడు వార్డెన్‌మీద. వెంటనే యస్.ఐ చేతిలోఉన్న పిస్టల్ తీసి పేల్చుకున్నాడు )

స. ఇ:- ఆఁ ఆఁ !

దొం:- (ఒరిగిపోతూ) ఇంకా నేను దొంగనేనా ? సెప్పండి. మీ అన్నం మీకిచ్చేశాను. ఇఁక నా కన్నం వద్దు... ఇంకా నేను దొంగ నేనా?... దొంగనేనా ?... దొంగ... నే... నా... (పడిపోయాడు)

స. ఇ:- (ఒక క్షణం అల్లా వుండి కన్నీళ్ళతో) నువ్వు కాదు తమ్ముడూ దొంగ... ఇదిగో వీళ్ళు... వీళ్ళందరూ దొంగలు... తోడు దొంగలు. నీ ప్రాణాలు, నీ పెళ్ళాం బిడ్డల ప్రాణాలు తీసింది వీళ్ళు. పదండి, కదలండి (విసురుగా డి.యస్.ఓ, దగ్గరకు వెళ్ళి మెడ పట్టుకుని) మిమ్మల్ని ఉరితీసే అధికారం లేదు. కానీ- మీకు తిండి లేకుండా పోవడం అంటే ఏమిటో చూపిస్తా. (సెల్లులోకి గెంటుతాడు. వార్డెన్, చౌదరీల నుద్దేశించి) ఊఁ ! కదలండీ.

[మెల్లగా వాళ్ళిద్దరూ సెల్లువైపు నడుస్తుంటారు. కానిస్టేబుల్ వచ్చాడు...]

కాని:- సార్ ! (ఒక కవరు ఇచ్చాడు. యస్. ఐ. కవరు చించి చదివి, చౌదరి వైపు- అందరివైపు చూచి)

స. ఇః- చౌదరిగారూ ! మీరే గెలిచారు. నేనే ఓడిపోయాను. అవినీతిని అరికట్టాలనేది వట్టి ఉపన్యాసాలని, ఇప్పుడు తెలుసుకున్నా. నన్ను ట్రాన్స్‌ఫర్ చేశారు. మీరు బ్రతికి పోయారు.

(చౌదరి అందరూ వికటాట్టహాసం చేశారు.)

స. ఇః- (బియ్యపు బస్తా క్రిందకు తోసి) తీసుకెళ్ళండి, తినండి, చచ్చేదాకా తినండి. దీన్ని ఎవరు కష్టించి పండిస్తున్నారో, వాళ్ళందరూ చస్తున్నారు. వాళ్ళ కిది నిరాకరించబడింది. వాళ్ళందరూ పోయిన తరువాత మీరు బ్రతికుంటారా ? బ్రతకండి.

[డి.ఎస్.ఓ, చౌదరి, వార్డెన్ వికటాట్టహాసం చేస్తూ పోతారు.)

స. ఇః- (మెల్లగా గ్రామ మునసబు దగ్గరకెళ్ళి) మునసబుగారూ ! నా చేత నైనది చేద్దామనుకున్నా. అవినీతిని అరికట్టాలనుకున్నా. కాని అంతా నా కెదురయింది. ఇక మీరు — గ్రామాలలోని ప్రజలు పరిష్కరించుకోవాలీ తిండి సమస్యను. (ఒక పిడికెడు బియ్యము తీసుకొని దొంగ శవం దగ్గర కూర్చొని) ఇదిగో తమ్ముడూ ! బ్రతికుండగా పిడికెడు బియ్యం ఇవ్వకపోయినా, ఇప్పుడైనా ఇస్తున్నా. (నోట్లో పోస్తాడు) యీ పిడికెడు బియ్యంతో — యీ దొంగల్ని — తిండి దొంగల్నీ, మమ్మల్నీ క్షమించు.

(తల పట్టుకుని విచారంగా ఉంటాడు. ఇంతలో పత్రికా విలేఖరి వచ్చి, రిపోర్టు తీసి విచారంగా చింపేస్తుంటాడు).

(తెర జాలిగా దిగుతుంది)



## పాత్రలు

విశ్వనాథం

సూర్యం

అప్పారావు

నరహరి

నౌకరు

మాణిక్యం

[పల్లెటూరిలో సాధారణ కుటుంబీకుని గృహం. పంచ గది. ఒకనాటి సాయంకాలం. గోడకు పురాతన పటాలు, క్యాలెండరు, గాంధీ ఫొటో వుంటాయి. వెనుక గోడలో మధ్య ద్వారం. గదిమధ్య మేజాబల్ల. దానిమీద అగరొత్తులు. ఒక పడక కుర్చీ, మూడు సాదా కుర్చీలు. ఒక ప్రక్క-తివాసీ మీద వీణ, హార్మోనియమ్. తెర లేవ గానే ఎవరూ వుండరు. నరహరి హడావుడిగా ప్రవేశించి, అన్నీ అమర్చారా లేదాఅని అటూయిటూ చూసి. ఏదోసవరించుతూ వుంటాడు. నరహరికి నడివయస్సుదాటింది. మనంమామూలుగా 'పెళ్లిళ్లపేరయ్య' లంటూ వుండేవారిలో ఒకడు. తనని అలా ఎవరైనా అంటే మటుకు ఒప్పుకోడు. కాలానుగుణ్యంగా ఛలోక్తులు విసిరే స్వభావం. కను బొమ్మల్లో పట్టుదల కన్పిస్తూవుంటుంది. పూర్వాచారాలు అనుసరించు తాడో లేదో గాని నమ్మకం చూపిస్తాడు. బయటవేపుకు వెళ్ళిపోబోతూ, ఇంతలో లోపలికి వచ్చేవారిని చూచి ఆహ్వానిస్తాడు. విశ్వనాథం, సూర్యం వస్తారు. వారిద్దరూ పెళ్ళిచూపులకు వచ్చిన తండ్రికుమారులు. విశ్వనాథం తహశీల్దారుచేసి రిటైరైనాడు. కోటుగుండీల బిగింపు, ఉత్తరీయం మడతలు, కట్టుమీసం, చేతికర్ర-అన్నిటిలో ధీమా కల వాడులా కనుపిస్తాడు. ఆయన కుమారుడు సూర్యం చదువు కొంటున్న యువకుడు. జీవితమొక వెన్నెలస్వప్నం అనుకుంటూ యదార్ధజీవితం అర్థంకాక, పెద్దల మాటలు కాదనలేక బాధపడే యువకుల్లో ఒకడు]

నరహరి:- రండి! రండి! విశ్వనాధంగారూ! ఇలా దయచేయండి. అబ్బాయ్! అబ్బాయ్! కుడికాలు-కుడికాలు ముందర వెయ్ నాయనా!

సూర్యం:- ఓ! ఫర్వాలేదండీ. నాకలాంటివి నమ్మకమూలేవు - పట్టింపూలేదు.

న:- అలా అనకు నాయనా! మావన్నీ, అనుభవంమీద చెప్పే మాటలు, ఆ, ఆ, ఇలా దయచేయండి, ఇలా, నిల్చున్నారే! విశ్వనాధంగారూ- అబ్బాయ్ [ఇద్దరూ కూర్చుంటారు.] వేళకందుకున్నారు. చాలా సంతోషం! రైలుకు...

విశ్వనాథం:-ఆ మరె, రైలుకు నమ్మకుంటే, ఇంతేనండి

న:- ఏం. ఇవాళ వేళ కేవచ్చింది !

వి:- వచ్చింది, మేం వచ్చింది నిన్నటిబండి. ఇవాళబండి అంతేలేదు. ఏం రైళ్ళో, ఏం ప్రయాణాలో-ఏ పనికి వేళకందుకోలేం కదా !

సూ:- అంతేమరి, మన ఆచార సాంప్రదాయాలంటే, నమ్మకంలేని యీ రోజుల్లో, తిథులు, శకునాలు పెట్టుకుంటే 'లంగరందనిబోటు ప్రయాణం'లా వుంటుంది.

న:- పోనీ, బస్సులో రాకపోయారా ? మీకు సీట్లగొడవ లేదాయె ! ఎలాగైనా రిటైర్డు తహశీల్దారు గారంటే సీట్లివ్వకేం చేస్తారు?

వి:- ఆ అవన్నీ వెనక, ఆఁదులో బస్సువాళ్ళెప్పుడూ వాళ్ల జుట్టును చేతిలో వుంచుకున్న వాడికే, వంగి వంగి సలాములు చేస్తారు.

న:- ఇంతకూ నాలుగుముళ్ళు పడేయోగంవుంటే బస్సులు, రైళ్ళు అడ్డ మొస్తాయా ? తారాబలముంటే అన్నీ ఎలాగోలా నిర్విఘ్నంగా నెర వేరవూ ! ఆ! పెళ్ళిచూపు లవగానే పెళ్ళెంతసేపూ ! [పెళ్ళికొడుకు తండ్రి ధీమాతో ఇల్లు నలువేపులా విశ్వనాథంచూస్తూ వుంటాడు] ఆ! అదుగో, ఇది పంచగది, ఆ వాకిలి దాటగానే తోట, ఆ తోటలో భవంతి, అప్పారావుగారు, అదేపిల్ల తండ్రి గ్రామపెద్దకదూ. వచ్చిన వాళ్లు కూర్చోడానికి, పంచాయతీలకు, సంప్రదింపులకూ, కాస్త మీబోటి వారొస్తే మర్యాద చెయ్యడానికి, ఇలా పంచగది వీధివరకు కట్టించాడు.

వి:- ఓవ్ బాగుంది. ఆ, చూడండి, పిల్లతండ్రి ఇంటోలేడా ?

న:- మీ కోసం స్టేషన్ కొచ్చాడే, కలుసుకోలేదూ ?

వి:- లేదే !

న:- అలాగా, మరివచ్చాడే. అయితే పిలుచుకొస్తాను, నిమిషం [కదలి నడుస్తూ] అబ్బాయ్, టయిమెంత నాయనా ?

సూ:- ఏడూ ఏభై నిముషాలు.

న:- సరె, ఫర్వాలేదు. ఇంకా పదినిముషాలు వ్యవధి వుంది. ఈ లోపుగా అన్నీ సిద్ధం చేస్తాను. పిల్లను చూసి అబ్బాయి 'సరే' అంటే ఇక పెళ్ళెంతసేపు? ముహూర్తాలు కూడా, దగ్గరలోనే, భలే భేషుగ్గా వున్నాయ్!

వి:- సరే, చూద్దాం, కానివ్వండి !

న.- ఊఁ, కానిస్తున్నా, అలాగే. (వెళ్ళబోతున్నాడు)

వి.- ఇదుగో! మేం, మళ్ళా వెంటనే వెళ్ళిపోవాలి.

న:- చిత్తం చిత్తం, అలాగే (అంటూ వెనక్కివచ్చి మళ్ళా వెళ్తూ సూర్యం వంక ఓ క్షణం ముఖంలోకి చూసి) ముఖాన బొట్టేది నాయనా ?

సూ:- (బొట్టు పెట్టుకోడం పాతకాలపు పద్ధతి అనుకునేవాడు గనుక కోపం వచ్చేసింది) నేనేం ఆడదాన్ననుకున్నారా?

న:- మొగాడివయితే మీసాలేవీ ? ఏం ఫ్యాషన్లయ్యా ? ముచ్చటగా మీసాలు కూడా లేకుండా?

వి:- మీసాలు లేవనుకోవడమెందుకు ? ఈ కాలపువాళ్ళకు మెదళ్ళే లేవు, ఏమిటో !

న:- బాగా సెలవిచ్చారు. (అంటూ విశ్వనాథం, నరహరి నవ్వుకుంటారు. నరహరి వెళ్తాడు)
(విశ్వనాథం తలవంచుకొని పత్రిక చూస్తూ వుంటాడు. సూర్యం క్రాపు, డ్రస్సు సవరించుకొంటూ ఆలోచిస్తూ, లేచి ఏదో అడగాలని విశ్వనాథం దగ్గరకెళ్ళి, తను అడగబోయేది అడిగితే ఏమను కుంటాడో అని మళ్ళా తన కుర్చీ దగ్గరకెళ్ళి, మళ్ళా తండ్రివేపుచూసి ఆయన దగ్గరికెళతాడు. ఇదంతా తల ఎత్తకుండానే విశ్వనాథం గమనిస్తాడు. కొడుకు మనస్సులోని ఆదుర్దా గ్రహించాడు)

సూ:- నాన్నా! (ఆగి) నాన్నా!

వి:- యిష్! పెళ్ళంటేసరి, నీకిన్ని అనుమానాలేమిటిరా? ఇలాంటప్పుడు, మౌనం, మనస్థిమితం చాలా అవసరం. వూరికే బుర్ర పాడు చేసుకోకు.

సూ:- మిమ్మః ను...ఒకటి అడగాలనుకొంటున్నాను.

వి:- అడగవద్దంటున్నాను.

సూ:- చూడండి!... పెళ్ళి, అసలవసరమా ?

వి:- [ఈ సన్నివేశంలో, గుండె పగిలే ప్రశ్న గనుక క్షణం నిశ్శబ్దం తర్వాత] అందరి సంగతీ ఏమో, నీకవసరం !

సూ:- అవసరమో, అనవసరమో నిర్ణయించవలసిం దెవరు ?

వి:- నేను.

సూ:- నేను కాదా ?

వి:- కాదు.

సూ:- ఎంచేత ?

వి:- నీకదనవసరం ?

సూ:- బాగా ఆలోచించారా ?

వి:- నువ్వు పుట్టినప్పట్నుండీ ఆలోచించాలేవోయ్ !
[అని తమాయించి మార్చుతాడు]

సూ:- [వాదనలో దెబ్బతిన్నాడు. ఆదుర్దా ఎక్కువయింది] ఇంకా చాలా... చాలా అడగాలనుకున్నాను. కాలేజినుండీ ఇంటికి రాగానే లాక్కొచ్చేస్తిరి, బయలుదేరితే గాని వీల్లేదంటిరి !
[ఇంతలో నరహరి, అప్పారావు ఫలహారాలు తీసుకుని ప్రవేశిస్తారు. పిల్లతండ్రి అప్పారావు పల్లెటూరి సాధారణ కుటుంబీకుడు. యాభయి సమీపిస్తున్నాయి. ఆడపిల్లల్ని కన్న అదృష్టహీనుని అవతారం కాదుగాని, మనువులు వెతకడంవల్ల కొంత బాధ అతనిలో కనుపిస్తుంది.]

న:- బయలుదేరితేగాని వీల్లేదంటాడేమిటి, అబ్బాయ్ !

వీ:- ఆ, వీడా ! వెంటనేబయలు దేరద్దా అంటున్నాడు.

అ:- నమస్కారమండి !

వి:- నమస్కారం, కూర్చోండి

అ:- ఫర్వాలేదు. ఆలస్యానికి క్షమించండి. మీరొచ్చారని తెలిసి, అవధానిగారినికూడా కేకేసుకు వద్దామని వెళ్ళాను. మాట తప్పకుండా వచ్చారు. సంతోషం!

న:- [అప్పారావుకి సూర్యాన్ని చూపుతూ] వారి అబ్బాయ్!

అ:- అలాగా!

న:- తండ్రికి తగిన కుమారుడు. యోగ్యుడు. ఛేషైనవాడు. తండ్రిమాట జవదాటడు సుమా!

అ:- మంచిది!

న:- ఇంతపిల్లవాడప్పటినుండీ నాకు తెలుసు. చూడండి, క్లాసులోకల్లా ఫస్టు. మంచి పదునైన పిల్లవాడులెండి. ... [విశ్వనాథం, సూర్యంతో] ఆ, ఆ, ముందర ఫలహారం సేవించండి! అబ్బాయ్! కానివ్, సిగ్గుపడతావే!

సూ:- నాకు వద్దండి!

అ:- మన పల్లెటూరి పాకాలు వారికి నచ్చుతాయా?

వి:- [తింటున్నవాడల్లా సడన్‌గా] అహ, అదేమిటండోయ్! అలా అంటారు, మా బాగా వుంటయ్. వెనక మేం క్యాంపులకెళితే, ఏం తినేవాళ్ళం, ఏం తినేవాళ్ళం! [అంటూ తినడం సాగిస్తాడు]

న:- అబ్బాయి, కాస్త రుచిచూడు.

వి:- పోనివ్వండి, వద్దంటున్నాడుగా.

న:- ఏం, పాకం రుచిలో పిల్ల మసూచిక మేదన్నా వుంటే మరచిపోతాడనా మీ భయం? ఆ అమ్మాయికలాంటివేమీ లేవండోయ్, రవ్వలరాణి!

వి:- ఆహహ, అదికాదు. గతికితే అతకదంటారు.

అ:- నరహరిగారు అలాంటి పొరపాటు జరుగనిస్తారా? ఈ పాకాలన్నీ ప్రక్కయింటివారిచేత చేయించాను,



న:- (సూర్యాన్ని చూసి) ఊఁ, ఊఁ, అలా తినడం ఆచారం నాయనా!

సూ:- తినడానికి కూడా అచారం-చట్టం కూడానా ?

న:- మరే, ఆచారం బాబూ తినమంటే తింటారా? రేషనింగ్ చట్టం పెట్టి మట్టిగడ్డలు తినమంటే మహాప్రసాదమని మింగరూ...ఊఁ, కానివ్వ వయ్యా. ఇంకో క్షణంలో పిల్లను చూద్దువుగాని - ఆ తర్వాత... (సూర్యం గత్యంతరంలేక తినడం ప్రారంభిస్తాడు)

అ:- ఏమండీ! అబ్బాయి చదివేది ఇంజనీరింగ్ కదూ?

వి:- ఆ, మరేనండి,

అ:- ఎన్నో సంవత్సరం ?

వి:- రెండో సంవత్సరం. ఫస్టుక్లాసులో పాసవుతున్నాడు. ఏదో ఈ కోర్సు కాగానే అమెరికా పంపించాలని వుంది. ఏదో అన్నీ సమకూడాలి కాదండీ!

అ:- అవునవును. మరి సామాన్య చదువా?

వి:- సామాన్య చదువుకి జీతాల్లేవండీ. పెద్దచదువు చదివితేగాని పెద్ద ఉద్యోగాలు రావుకదా! అదే చూస్తున్నా, మరి ఎలావుందో ఏమిటో...

న:- ఇంతకూ తారాబలముంటే !

వి:- అదుంటే, అడిగినదల్లా యిచ్చే మామగారు రాకూడదూ?

అ:- లేక కట్నం తీసుకోకుండానే పెళ్ళి కాగూడదా? చిన్న చదువుతోనే పెద్ద ఉద్యోగాలు రాకూడదా?

వి:- అవునవును చెప్పలేంలెండి, ఇంతకూ, పెద్ద చదువు చెప్పించాలని సంకల్పం...మరి ఏమవుతుందో!

సూ:- ఏ పెద్ద చదువయినా, నాకు మాత్రం ఉద్యోగం చెయ్యాలని......

వి:- (తనేదో దర్పంగా, పెద్ద ఉద్యోగం కోసం, పెద్ద చదువు చెప్పించాలంటేగాని ఎక్కువ కట్నానికి గాలం పడదని చెప్తూవుంటే, వీడేమిటి ఉద్యోగం వద్దంటూ ఏ్రబాసిముఖం వీడూనూ అనుకుంటూ) ఆ, పసివాడివి, నీకేం తెలుసురా!

న:- పసివాడంటారేమిటి, పెళ్ళికాబోతూ వుంటే!

వి:- పెళ్ళికాగానే పెద్దవాళ్ళయిపోతారా ఏమిటి, ఇంకా మనం ఉన్నాంగా!

అ:- పోనీ ఉద్యోగం చెయ్యాలని లేకపోతే, హాయిగా ప్లీడరు కోర్సో, డాక్టరు కోర్సో చదివించకపోయారా!

వి:- ఆ, అవి దేనికి? తగవులుంటేగాని ప్లీడరు సంపాదించడు. రోగులుంటేగాని డాక్టరు సంపాదించడు సంఘంమీద కుళ్ళుని ఆధారం చేసుకు బ్రతకాలి

అ:- అలాగంటే ఎలా, ఏ బ్రతుకు తెరువయినా అంతే! దేనికదే దుర్భరంగా వుంది. అయితేమట్టుకు, మీరన్నట్టుగా ఓ పక్షాన ఉద్యోగమే నయం!

వి:- మరే, ఏదో మీలాంటి మామగారాశీర్వదిస్తే మా వాడికేం కొదవలేండి. ఎంతైనా చదవచ్చు. ఎంత ఉద్యోగమైనా సంపాదించవచ్చు.

న:- [అప్పారావుతో] చూశారా ఎత్తు. మీరిచ్చే కట్నాలతో చదివిందాలని కాబోలు.

అ:- అహా, మనదాకా రావాలా! వారెక్కడ శ్రీమంతులు.

వి:- ఏం శ్రీమంతులం! ఎలాగయినా, మీ పల్లెటూరివారి భాగ్యాలు, మా బస్తీ వారి కెక్కడివిలెండి.

న - అయినా నేటి యువకులంతా ఆదర్శప్రాయులు. అభ్యుదయ శిఖరాలకు పరుగులు తీస్తున్నారు, సహశతాళ్శఖారావాన్ని వూదిపారేస్తున్నారు మరి కట్నాలను తీసుకోరనుకుంటాను. పెళ్ళిమార్కెట్లలో అమ్ముడు పోవటానికి ఎండిపోతున్న కాకరకాయ మొహాలు వేసుకుని కూర్చోరనకుంటాను [ సూర్యంతో ] ఏం నాయనా నీదేపార్టీ? కాంగ్రెసా, కమ్యూనిస్టా, సోషలిస్టా!

సూ:- (చిరనవ్వు) మరింకోపార్టీ కాగూడదా?

న:- నువు చెప్పక పోయినా, ఈరోజుల్లో ఎవడేపార్టీవాడో మూడునిమిషాల్లో చెప్పవచ్చు కాంగ్రెసయితే భూముల మంజూరు లిస్టుల్లో వుంటాడు.

కమ్యూనిస్టయితే పోలీసు లిస్టుల్లో వుంటాడు, సోషలిస్టయితే హోటల్సు లిస్టుల్లో వుంటాడు.

అ:- ఇంకోదేదన్నా పార్టీ అయితే?

న:- ఆ, యీ మూడుపార్టీలు పాడేనని గోలగా వాగుతూ వుంటాడు. (అందరూ నవ్వుతారు) అయితే విశ్వనాథంగారు, మీవాడేపార్టీయో తెలుసుకోలేక పోతున్నానండి!

వి:- మావాడా? ఏమోమరి, ఖద్దరు గుడ్డలుతప్ప వెయ్యడు. కమ్యూనిస్టు వాళ్ళ పుస్తకాలు తెగచదువుతాడు. ఇక సోషలిస్టులకు చెల్లించే చందాలు అంతుండవు.

న:- ఇకనేం, ఏమంత్రివర్గమయినా, మీవాడికి ఉద్యోగం తథ్యమన్నమాటే! భేష్; అయితే అబ్బాయ్ రాజకీయాలు, ఆదర్శాలు మాట్లాడుతారే, మీరు కట్నాలు తీసుకోరాదని అదన్నా ఆందోళన చెయ్యరాదూ?

సూ:- (వుషారుగా అందుకుని) అందుకనే...నేను...

వి:- (అడ్డంవచ్చి) ఆ. ఆ. సరేలే. అసలలాకాదండీ. కట్నాలు నిషేధించాలని ఆడపిల్లల తండ్రులే పూనుకోవాలి.

న:- ఆడపిల్లల తండ్రులంటూ, మొగపిల్లల తండ్రులంటూ రెండు తెగలా ఏమిటండీ?

అ:- అయినా, పిల్లల తండ్రులేంచేస్తారండీ, ఋణాలతో శల్యమై, సంసారం సరిదిద్దుకునేసరికి సతమతమవుతూ వుంటే? పోనీ ప్రజా ప్రభుత్వం ఇన్ని చట్టాలు పాస్ చేస్తుంది. కట్నాలు నిషేధిస్తూ ఓ చట్టం పాస్ చెయ్యగూడదూ?

వి:- చట్టాలతో నేమవుతుందండీ, మీ పిచ్చి, ప్రజలు గుర్తించాలి గాని. దీనిలోనూ బ్లాక్ మార్కెటుచేసే వారుండరూ? మొన్న శారదా ఆక్టు వస్తే, ఏరాం, ఎర్రుపాలెం పరుగెత్తలా? ఏమిటో ప్లీడర్ల పేచీలతో అంతటి చట్టమయినా ఏమీ ప్రయోజనం లేకుండా పోవడం లేదూ! పది రూపాయలిస్తే ఎంత పెద్ద నేర మయినా నేరం కాదని శాస్త్రీయంగా, చట్టబద్ధంగా, కొట్టొచ్చినట్లు వాదించడంలా?

వి:- ఇదంతా దేనికండీ, కట్నాలుంచే పెళ్ళిచేసుకోమని ఆడపిల్లలంతా సమ్మెచేస్తే సరి !

న:- (సూర్యంతో) ఇవ్వకపోతే, మీరు సమ్మె చేయరూ ?

సూ:- మా ప్రశ్నేముంది (తండ్రిని చూపిస్తూ) వారు, చదువుకి, సర్వానికి తండ్రిమీద ఆధారపడే వయస్సులో కట్నాలు వద్దనే అధికారం మాకుంటేగా, కావలసిందే అనేవారున్నప్పుడు... (నవ్వుతూ) మీ రామాట వారి నడగాలి.

న:- (నవ్వుతూ) చూశారా అప్పారావుగారూ ! మాంచి పదునైన వాదం టినే... అ. ఆ. వెళ్ళి అమ్మాయిని తీసుకరండి...

అ:- అలాగే (వెళ్తాడు)

సూ:- నిజంగాచూస్తే, మన సాంప్రదాయాలు మార్చెయ్యాలండి, ఎంత డబ్బు తగలేస్తాము అసలు తన్నుతాను పోషించుకోలేని వాడు పెళ్ళెందుకు చేసుకోవాలి చెప్పండి. ఇతర దేశాల్లో చూడండి, ముప్పది యేళ్ళకు పైబడితేగాని పెళ్ళి చేసుకోరు.

న:- ఓహో ! నీకూవుందీ యీ పాశ్చాత్య వ్యామోహం ! అసలదొక అంటువ్యాధి. అయితే నీకిక్కడ (మెదడు చూపిస్తూ) ఆపరేషన్ అవసరమన్నమాట !

సూ:- నే చెప్పేది మీరు...

వి:- (కోపం వచ్చేసి వూరుకుంది, కొడుకు మాటలకి. మాటకు అడ్డం వచ్చి) పోనీ పెళ్ళిళ్ళే మానెయ్యమన రాదురా !

సూ:- అలాకాదు. నన్ను చెప్పనివ్వండి మరి !

న:- } (మాటకు అడ్డువచ్చి) బాబూ,
వి:- } బాబూ, నీ కొడుకుల

హయాంలో నీ యిష్టంగాని, అందాకామట్టుకు మా సాంప్రదాయాలే వుండనిద్దూ.

న:- వీళ్ళహయాంచూస్తేనే వున్నాంగా, నవయువకులంతా కంచుకాగడాలతో ముందడుగు వేస్తూనే వున్నారు. లోకాలు భగ్గునమండి పోతూనే

వున్నాయి కాని, మారేదేమిటో. అన్ని మోసాలు, దురాచారాలు అన్నీ, అలాగే వున్నయి. పైగా రానురానూ పతనమై పోతున్నాం.

సూ:- (ఏదో చెప్పబోయి వ్రేలిలా చూపిస్తూ లోపలనుండి వస్తున్నవారి అలికిడివల్ల దృష్టి వారివేపు పడి, చెప్పబోయి మానేసి వూరు కుంటాడు)

(అప్పారావుతో పెళ్ళికూతురు మాణిక్యం ప్రవేశం. అప్పారావు చెయిపట్టుకుని కూర్చోపెడతాడు. మాణిక్యానికి అంతగా అందం లేకపోయినా యువకుల్ని ఆకర్షించే లక్షణాలున్నాయి. అమితమైన సిగ్గుచేత తల వంచుకుని తివాసిమీద వీణా, హార్మోనియం దగ్గరగా కూర్చుంటుంది. పిల్లను సూర్యం, విశ్వనాధం చూస్తారు. క్షణం నిశ్శబ్దం. సూర్యం, విశ్వనాధం వంక నరహరి, అప్పారావు చూస్తారు)

న:- ఆ, విశ్వనాధంగారు, అబ్బాయ్, ఆ మరి, అమ్మాయి నేమైనా నాలుగు ప్రశ్నలు...వేస్తారా ?

వి:- ఆ, అలాగే.

సూ:- అహ, అక్కర్లేదులెండి !

న:- అలా అనకు వెయ్యండి, హిందీ, ఇంగ్లీషు, తెలుగులోనైనాసరే !

వి:- (తాపీగా పిల్లనుచూసి) పేరేం పెట్టారు ?

అ:- మాణిక్యం.

వి:- (బాగుంది అన్నట్టుగా తల వూపుతూ, తలవూపడం ఆపి మాణిక్యం మీద దృష్టి నిలిపి) చూడండి, కొంచం అమ్మాయి నలిగినట్టుంది. ఎప్పుడయినా, ఏమయినా సుస్తీ చేయలేదు కదా !

అ:- ఈ మధ్యనే ఓ పక్షం మాత్రం లంకణాలు చేసింది, అంతే ! అది తప్ప...

న:- ఊ, ఊ, అడగండి, అప్పారావుగారంటే ఏమనుకున్నారో, ఏదైనా దాచకుండా చెప్పేస్తారు. చుట్టుపక్కల అరవై గ్రామాల్లోనూ సత్యం తప్పడని పేరండోయ్ మీ రా పిల్లను చేసుకోండి, చేసుకో పోనివ్వండి, నిష్కల్మషంగా, వున్నదున్నట్లు చెప్పేస్తారు

సూ:- ఏమండీ వారు హిందీ అన్నారు. తాను స్వతహాగానే నేర్చుకుందా ?

అ:- స్వతహాగా—కాదులెండి, దాని మేనత్తకొడుకు-

న:- (మాణిక్యం పేరుతో మేనత్తకొడుకు ప్రస్తావన రావడం, నిష్కారణంగా లేనిపోని అపోహలకు కారణమవుతుందనే ఆదుర్దాతో) అది, అతను-

వి:- (అప్పారావుని చూపిస్తూ, నరహరితో) వారిని చెప్పనివ్వండి.

అ:- ఆ, మేనత్త కొడుకు నేర్పాడులెండి!

వి:- (ఇక తరచి అడగాలన్న ఆదుర్దా మొదలెట్టింది) ఈ వూరిలోనే వుంటాడా ఆ అబ్బాయి ?

అ:- లేదు. చదువుకుంటున్నాడు. కాని ఎప్పుడన్నా శలవులకు వస్తూ వుంటాడు.

న:- (మళ్ళా అడ్డంవచ్చి సంభాషణ మార్చాలని ప్రయత్నం) అతనంటే, అతను, అతను-

వి:- (అప్పారావుని చూపిస్తూ, నరహరితో కొంచెం నిశితంగా) వారిని చెప్పనివ్వండి.

అ:- అలా వచ్చినప్పుడల్లా, కొంచం కొంచంగా నేర్పాడు.

వి:- [అడగటం అవసరమన్నట్లుగా] అతని వయస్సెంత ?

అ:- [అమాయకంగానే] మన అబ్బాయి వయస్సే ఉంటుంది?

వి:- [అనుమానం ఎక్కువవుతోంది] అతనికి వివాహమయిందా?

అ:- చేసుకోడట.

సూ:- మంచిపని. భలేవాడు, అయితే ఎందుకు చేసుకోడో?

వి:- ఇంకెందుకూ, అమ్మాయికి పాఠాలు చెప్పడానికే!

న:- ఆ, అతను, అతనంటే, సూర్యం! మీ గోపాలరావోయి!

సూ:- అతనంటే, వాడు నాన్నా! ఉత్తరం వ్రాయలేదూ యీ మనవు గురించి, అతను చాలా మంచివాడు నాన్నా!

వి:- (నవ్వుతో) ఓరి, అతనుటారి పాపం! మరి చెప్పేవుకా వేమయ్యా నరహరిగారూ?

న:- నన్ను చెప్పనిస్తేనా...అప్పారావుగారి లాంటి విషయం చెప్పడం చేతగాని తండ్రులుంటే, ఆడపిల్లలు పెళ్ళిళ్ళుగాక అడుక్కుతినాల్సిందే!

సూ:- అసలు మనువుల మంత్రాంగాలు నిజంగా చదరంగపు ఎత్తులేమో నని!

న:- ఆ, విశ్వనాథంగారూ, అమ్మాయినేమన్నా అడగండి?

సూ:- ఎందుకూ, అక్కర్లేదండి?

న:- ఆలా అనకయ్యా, తీరా పెండ్లయాక మాటలురాని మంగమ్మను మా మెడకు కట్టారంటే!

వి:- అహ. మంచిమాట! మీరంత మోసం చేస్తా రనుకుంటామా!

న:- అనుకోరనుకోండి!

సూ:- దేనికిలెండి!

న:- (మాణిక్యం దగ్గర కెళ్ళి) ఇదుగో అమ్మాయ్! ఒక పాట పాడమ్మా (వంగి హార్మోనియంమీద చేతులు చాచి వాయించమన్నట్లు వేళ్ళు చూపుతూ) ఓ త్యాగరాజకృతి పాడమ్మా! (మాణిక్యం వాయించడం మొదలెడుతుంది. నరహరి సూర్యంవంకచూసి) త్యాగరాజ కృతనంగానే, ముఖం ఎలా ముడుచుకున్నాడో చూడు!

సూ:- దేనికండి, యీ మ్యూజికల్ టెస్టు!

వి:- (మాణిక్యం మరొకమారు వరస వాయించేస్తుంది. పడక కుర్చీలో విశ్వనాథం వెనక్కు ఆనుకుంటాడు. ఆయన జీవితపథంలో కొన్ని మధురస్మృతులు మనసును కదిలించాయి కాబోలు, మళ్ళా ముందరికివంగి శూన్యంలోకి చూస్తూ) నాపెళ్ళి చూపులనాకు మీ అమ్మపాట జ్ఞాపకం వస్తూందిరా (అంటుంటే కంటతడి వచ్చింది కాని ఎవరూ గమనించలేదు).

సూ:- అవును. ఆనాటి సంగీతం జ్ఞాపకం రాక...ఈమధ్య పాడటం వుండేనా...పెళ్ళి సంగీతం పెళ్ళితో సరి!

న:- ఎందుకూ, వినతీరిక వుండే నవుకరీ తెచ్చుకో, పెళ్ళాం చేత అస్త మానం పాడించుకో, కాదన్నదెవరూ ఊ, పాడమ్మా, పాడనివ్వ వయ్యా, నీబోటి గాన విశారద లెవరో అని సంగీతం శ్రమపడి నేర్పించాడయ్యా !

సూ:- ఆ, దేనికండీ !

న:- అలాగనవద్దు.

సూ:- పోనివ్వండి.

న:- ఆచారాన్ని కాదనకు.

సూ:- వద్దంటూ వుండే!

న:- [వాయించడం మానివేసిన మాణిక్యం దగ్గరకెళ్ళి] ఊ, ఏదీ ! పాడమ్మా పాడు ! (నిశ్శబ్దం) సరే, నిన్ను సాగదీయడం మళ్ళా అర గంటా !

సూ:- ఎందుకండీ, అనవసర శ్రమ !

న:- ఓహోహో ! ఏం సున్నిత భావాలయ్యా ! కాబోయే పెళ్ళాం అరిగి పోతుందనా ?

వీ:- మరేం ఫర్వాలేదండీ, అప్పారావుగారూ, అమ్మాయిని లోపలకు తీసు కెళ్ళండి (మాణిక్యం యింతవరకు కదల మెదలకుండా అలాగే కూర్చుని వుంటుంది. అప్పారావు దగ్గరకెళ్ళి మళ్ళా చెయిపట్టుకుని లోపలకు తీసుకెళ్తాడు).

న:- ఏం అబ్బాయి, పిల్ల నచ్చిందా (నిశ్శబ్దం) ఏం ?

సూ:- (ఆలోచన తెగలేదు) చె...ప్పడం ఎ-లా-గా అని ?

న:- లగ్నం పెట్టెయ్యమా ?

సూ:- (అయ్యబాబో) ఆ, ఏమంటారు ?

న:- చూపులకు నచ్చిందా ?

సూ:- (ఇంకా ఆలోచన తెగలేదు కాని మొహమాట పెట్టేస్తున్నాడే నరహరి మరిఎలాగ) న... చ్చిందనే...అనుకుంటాను.

న:- ఇకనేం, మాఘమాసంలో పెళ్ళి ఖాయం ! (హడావిడిగా లోపలికి చూస్తూ) అప్పారావుగారూ ! (వెళ్తున్నాడు)

సూ:- నరహరిగారూ ! (నరహరి ఆగిపోతాడు) వచ్చే మాసంలోనే !

న:- నీవు కావాలంటే యీ క్షణం, అన్నీ !

సూ:- నరహరిగారూ !

న:- ఏం కావాలి నాయనా?

సూ:- నా పెళ్ళి కోసం, మీకింత తొందరేమిటండీ !

న:- ఇలాంటివనుు చప్పున ఫైసలవాలి, ఆలస్యం అమృతం విషం !

సూ:- అలా తొందరపడితే ఎలా ? (ఆలోచనలలో మునిగిపోయి) కాస్త వ్యాపారానికి, అణాభాగస్తుని చేర్చుకోడానికి, అరవై ఆరు నక్షత్రాలు లెక్కెడుతామే ! జీవితంలో సగభాగస్తురాలు, అర్ధాంగిని ఎన్నుకోవాలంటే ఎన్ని ఆలోచించాలి ?

న:- ఇంకా ఆలోచన దేనికయ్యా, రూపం చూచావు గదా ? కుటుంబం తెలిసినదే ! ఇక మిగతా విషయాలు మాకు వదిలేయ్ !

సూ:- (దూరాన ఏమిటో చూస్తున్నాడు) ఆ అమ్మాయి మనసెలాటిదో- - ఆశయాలేమిటో - - - అభిరుచులేమిటో - - - ఏమీ తెలియకుండా - - - ఎలా - - పెళ్ళాడటమా అని - ఏదో బాధగా వుందండీ !

న:- పెళ్ళి చేసుకోమంటే బాధంటావేమిటయ్యా, నోటకని అల్లుడల్లే ! మా అమ్మాయి యెలాంటిదో తెలుసా, చూశావుగా, మేనక పాకం; కొత్తపల్లి కొబ్బరి !

సూ:- [ఆలోచన తెమిలింది] చూడండి, నరహరిగారూ ! మీకు నామీద నమ్మకమే కదూ!

న:- అహా, నిస్సందేహంగా ! నీకంటే యోగ్యుడెవరు ?

సూ:- చూడండి - - ఆ అమ్మాయి - తో - అయిదు నిముషాలు - - -

న:- ఆ, ఏమిటేమిటీ !

సూ:- అయిదునిముషాలు అమ్మాయితో మాట్లాడుతాను.

న:- [విసుగ్గా] ఆ, ఏమిటీ !

సూ:- అమ్మాయితో ఏకాంతంగా !

న:- [కోపం వచ్చేస్తున్నది] ఆ, ఏ మన్నావ్ ?

సూ:- మాట్లాడిన తర్వాత !

న:- [కోపం ఆపుకోలేడు] చాల్లేవయ్యా, ఎవడన్నా వింటే నవ్వుతాడు.

వి:- ఒరేయి ! ఇది పిల్లతండ్రివింటే మనల్ని పొలిమేరల దాకా తరుముతాడురా !

సూ:- ఇందులో తప్పేంలేదే, మాట్లాడటం ఒక్కటేగా నే కోరింది.

న:- ఏం ఒక్కటయ్యా, ఇవి పెళ్ళి చూపులనుకున్నావా, సంత జాతరనుకున్నావా ?

వి:- మనమడిగేది సబబుగా వుండాలిరా ?

సూ:- (సమర్థించుకుంటూ లేచి) ఏం సబబండి, మంచి చెడ్డలేం పరామర్శ చేయనక్కర్లా ? ఏం లేకుండానే, ఏ చెవిటిదాన్నో మూగదాన్నో చేసుకోమంటారా ?

న:- (చిందులు తొక్కేవాడల్లా ఆగి) ఆ మాటంటేనే జాతరనేది. ఇందాక అడగమంటే అడగనంటివి, పాడమంటే పాడవద్దంటివి—

సూ:- ఇప్పుడు మాట్లాడనివ్వరని నాకేం తెలుసూ !

వి:- తెలిసేదేమిటి, లోకాచారం తెలియదూ ?

సూ:- లోకాచారం కాకపోతేనేం, మంచిదైతే చెయ్యగూడదా ?

న:- మంచేమిటయ్యా మంచి – – పరాయి పిల్లతో - ప్రయివేటుగా - పరామర్శ చెయ్యడం మంచా !

వి:- మేమంతా అలాచేశాంరా ?

సూ:- మీరు చేయకపోతేనేం, మేం చెయ్యగూడదూ ?

న:- [లేచి తెగించుకు వెళ్ళిపోతున్నాడేమో) పోనీలే బాబూ, పోనీ. ఇక ఇంతటితో కట్టిపెట్టు. పిల్ల నచ్చకపోతే పోయింది. ఆ అమ్మాయికి తగ్గ వరుడు ఆ అమ్మాయికి వస్తాడు. తారాబలం కుదిరితే సరి ! ఇది కుదరదని నాకు మొదటే తెలుసు. వద్దన్నకొద్దీ ఎడంకాలు అడుగు పెట్టావ్ - - - (కూర్చుంటూ) అయినా మాట మాట్లాడితే, నీవు అంబరవీధి కెగసిపోతుంటే, నిన్ను పట్టుకు ఎందాకా వేళ్ళాడం! (అందరూ బుర్రలు పాడుచేసుకుంటూ ఎవరి ఆలోచనల్లో వారుంటారు. వెనకాలగా మామూలుగానే వచ్చినట్లు వచ్చి జోరుగా సాగిపోతున్న సంభాషణకు అడ్డురాకుండా వెనకాలే నిలబడివింటూ వుంటాడు]

సూ:- అయితే మీరనేది, కాబోయే భార్యతో అయిదు నిముషాలు !

న:- అదుగో మళ్ళా కాబోయే భార్యంటావు, నువ్వు చేసుకుంటానను. నీ ఇష్టం వచ్చినంతసేపు.........

సూ:- అయితే మాట్లాడిన తర్వాతగా...

న:- (లేస్తూ) అందుకే......ఇది కుదిరే బేరం కాదండీ ! (విసురుగా అవతలకెళ్ళి నిలబడతాడు)

వి.- ఓరేయ్! నీ చాదస్తం పిల్లతండ్రి చూస్తే,మన ముఖాన ఉమ్మేస్తాడురా. మేం చెప్పినట్టు వినరా ! మన పరువు పోతుంది!

సూ:- పిల్లను పరామర్శ చేయకుండా పెళ్ళికొప్పుకోనండీ !

వి:- ఆ పరామర్శ అనవసరం !

సూ:- నాకు చాలా అవసరం.

వి:- (లేచి) నే చెప్తున్నాను.

సూ:- (తాపీగా) నే వింటున్నాను.

వి:- (కోపం) ముహూర్తం పెట్టేస్తాను !

సూ:- (నిర్లక్ష్యం) పెట్టేసుకోండి !

వి:- (మీదకెళ్ళి) నీవు పెళ్ళాడాలి !

సూ:- (తొణకకుండా) నే పెళ్ళాడను.
(కొడుకు మాటలలో అవిధేయత, తృణీకారంతో తండ్రికి కంగారు-కోపం, ఆవేశం కలిగాయి. వుత్తరీయం, చేతికర్రకోసం చిందులు తొక్కుతున్నాడు. వెళ్ళిపోదామనే ఇంతదాకా వెనక నిలబడిపోయిన అప్పారావు ముందర కొస్తాడు.)

అ:- (విశ్వనాధంతో) ఏమంటున్నాడండీ, అబ్బాయి ?

వి:- (బయలుదేరుతూ) ఆ ఏం లేదు. ఏంలేదు. మేం శలవు తీసుకుంటామండి, వెళ్ళగానే మీకు జాబు వ్రాస్తాం.

న:- జాబెందుకులెండి, ఎదురుగా వున్నాడుగా, చెప్పండి !

సూ:- చెప్పండి !

వి:- నా కనవసరం.

అ:- ఏమిటో చెప్పండి !

న:- ఏముందీ...ఏమీలేదు...ఏమిటంటే...

వి:- (మాట కడ్డువచ్చి) ఎందుకూ చెప్పడం ? వారికేం కోపం వస్తుందో, ఎందుకులెండి !

సూ:- ఏం లేదండీ...! మీ అమ్మాయితో నే మాట్లాడాలన్నాను. (క్షణం నిశ్శబ్దం)

అ:- (చిరునవ్వు) అంతేకదా !

న:- (షాక్‌తో) వంటరిగాటండీ !

అ:- (క్షణం ఆగి) వారంతగా అడిగితే ఎలా కాదనటం... సరే కానివ్వండి! ఇంతకీ ఏం జరుగనున్నదో అదే జరగాలి కదా... (సూర్యంతో) ఆ, చూడండీ, నేవెళ్ళి అమ్మాయిని తీసుకొస్తాను...... కాస్త సిగ్గువల్ల...

8)

సూ:- నాకూ కాస్త సిగ్గుగానే వుంటుంది లెండి. ఫర్వాలేదు లెండి. (అప్పారావు వెళతాడు)

న:- త్వరగా...ముగించునాయినా! (నరహరి, విశ్వనాధం వెళతారు)
(అందరూ నిష్క్రమించిన తర్వాత, సూర్యం అటూ ఇటూ తిరుగుతూ వుంటాడు. వంటరిగా తన యెదుట వచ్చి నిలబడే మాణిక్యంతో యెలా సంభాషణ మొదలెడదాం, ఏవిధంగా పోజు పెట్టుదాం, ఏమడుగుదాం, మనం అందంగా కనబడమా? కనబడకేమిటి, అసలు మనం యెలావున్నాం, మనం, మన క్రాపు, డ్రెస్సు యెలా వున్నాయి? ఇలా అనేకం ఊహాగానం చేస్తూ తిరుగుతూ, ఆగుతూ, ఎదురు చూస్తూ వుంటాడు. ఇలా వకమారు బయటదాకా వెళ్ళి అదో ఆలోచన చేస్తూ చేతివ్రేళ్ళ మీది అదో అంచనాలు మనస్సులో నిచ్చెనలు వేసుకుంటూ వాకిటవేపు తిరిగివుంటే, లోపల నుండి నవుకరు కప్పులు, సాసర్లు తీసుకెళ్ళడానికి వచ్చి బల్లమీద కప్పులు సాసర్లు చేతిలోకి తీసుకోవడంలో చప్పుడు చేయగానే, మాణిక్యం వచ్చిందనుకొని సూర్యం ''ఏం అమ్మాయి'' అంటూ ఇటు తిరిగి నవుకరును చూచి తెల్లబోయి చూస్తాడు. నవుకరు ఇదేమిట్రా, మనల్ని అమ్మాయి అంటాడు? అని ఏదో విత్తరచూపు సూర్యం వేపు పారేసి, తన పని చేసుకు కప్పులు, సాసర్లు లోపలికి తీసికెళ్తూవుంటే, తోచక తిరుగుతున్నట్టుగా నవుకరు వెంట లోపల వాకిలిదాకా వచ్చి, మళ్ళా బయటవాకిలిదాకా, మళ్ళా లోపలవాకిలి దాకా పచార్లుచేస్తూవుండగా మాణిక్యం ప్రవేశించి ఒక ప్రక్కగా నిల్చుని తలవంచుకుంటుంది. ఒక క్షణం నిశ్శబ్దం)

సూ:- (ఎలా నిశ్శబ్దాన్ని ఛేదించాలో, ఎలా సంబోధించాలో తెలియక అప్రయత్నంగా అనేస్తాడు) ఏం! వచ్చారా అమ్మాయ్?

మా:- (అలాగే తలవంచుకుని మాట్లాడదు)

సూ:- ఆ, మరి అలా కూర్చోండి.

మా:- (కూర్చోదు. చలవంలేదు. తలఎత్తదు)

సూ:- ఆ ఊ. ఇటు చూడండి.

మా:- (చూడదు. చలనంలేదు, తలఎత్తదు)

సూ:- (దగ్గరకెళ్ళి, ఆమెవంక చూడకుండా) కూర్చోండి!

మా:- (తలఎత్తి. అతనివంక చూడక ఎటో చూసి తలవంచుకుంటుంది)

సూ:- (అవతలకెళ్ళి వచ్చి దగ్గరకెళ్ళి తనచేయి ఆమెచూపుల్లో పడేలాగు కుర్చీ చూపిస్తూ) అలా కూర్చోండి, మరి!

మా:- (అతని చేసంజ్ఞనుబట్టి కుర్చీలో కూర్చోమంటున్నాడని గ్రహించింది గనుక కుర్చీలో కూర్చుంది. తలమాత్రం ఎత్తలేదు)

సూ:- (ఎలాగైతేనేం మాణిక్యంలో చలనం తెచ్చానుగదా అనే సంతోషం) మిమ్మలను అడిగి తెలుసుకుందామని...మీరు అపార్థం చేసుకోవద్దు ...మీరు ఎంతవరకు చదువుకున్నారు ?

మా:- (జవాబు లేదు, చలనం లేదు)

సూ:- మీరూ ఎంతవరకు చదువుకున్నారని ?

మా:- (ఇతనివంక చూడకుండా అనవసరమైన వేపు ఓ మారు చూచి మళ్ళా తలవంచుకుంటుంది)

సూ:- (చిరునవ్వు) చెప్పరేం...మీపేరు ?

మా:- (చలనం లేదు. తల ఎత్తదు)

సూ:- అరె. పేరు చెప్పడానికేం ?

మా:- (మార్పులేదు)

సూ:- మీరిలా బిగుసుకుపోతే ఎలా ? ఇంకా చాలా అడగాలి ?

మా:- (జడముందర వేసుకుని జడలో ఏదో చూసి జడమళ్ళా వెనక్కు వేసుకుంటుంది. ఎదురుగా ఎక్కడో ఏమిటో చూస్తూ కూర్చుంటుంది. అక్కడున్న సూర్యంతో గాని సూర్యం అడిగే ప్రశ్నలతో గాని, ఆమెకు సంబంధం లేదని ఆమెను చూస్తే గ్రహించవచ్చు)

సూ:- (ఇంకా ఓర్పుపోలేదు. కొంచెం రసవత్తరంగా అవస్థగా) పేరేమిటీ చెప్పండి ?... చెప్పరా ? మూగనోము పట్టారా ? (నవ్వుతూ)

మా:- (సూర్యం అందం ఎలా వుందో ఓమారు చూసి) ఏమో బాబూ ?

సూ:- మీ భర్త ఏం ఉద్యోగం చెయ్యాలని వుంది ?

మా:- అసలేదో ఒకటి చేస్తే చాలు.

సూ:- నన్ను పెళ్ళి చేసుకోవాలని మీకు వుందా ?

మా:- (ఏమిటీ గొడవ అన్నట్లు) మీరసలు పెళ్ళి చేసుకుంటారా ?

సూ:- ఎదురుప్రశ్న వేస్తావేం ? జవాబు చెప్పు ?

మా:- (స్వచ్ఛమైన కంఠంతో, ఆత్మవిశ్వాసంతో) ఏమిటండీ జవాబు చెప్పేది ? మీ ఇష్టమొచ్చినట్లడగటానికి స్త్రీలంత అమ్మడుపోని సంతసరకులనుకున్నారా ? ప్రశ్న లడగటానికేం అడుగుతారు. అడిగేవారికి చెప్పేవారు లోకువ ? మీరింత చదువూ, ఇంత విజ్ఞానంతో పట్టుమని పది రూపాయలు సంపాదించగలమని చెప్పగలరూ? ఇన్ని పుస్తకాలు చదివానన్నారే, మీరేం చదివారు ? రామాయణం ఒక్కమారైనా చదివారూ? మీ ఇంగ్లీషు చదువులు ఉద్ధరిస్తున్నాయి. ఇక మా ఇంగ్లీషు చదువులు? మీరు భుక్తి గడిచేటందుకు సంపాదిస్తే గదా అటుపైన మా క్లబ్ సభ్యత్వాలూ, గ్రంథ సమీక్షలున్నూ ! 'విశ్రాంతి సమయాల్లో, ఏం చేస్తావ్' ఇంటిచాకిరేగా ! భార్య అస్తమానం అరవచాకిరీ చేస్తూ-అత్తపోరు పడుతూవుంటే, మీ బోటి విద్యావంతులైన భర్తలంతా గుడ్లప్పగించి ఇదుగో, ఇలాగే చూస్తూ కూర్చుంటారు. 'సుఖానికందం ముఖ్యమా' అన్నారు. అందచందాలు దేనికండీ అదృష్టం లేనిదే ! సూర్యుడు సహితం గ్రహణంలో కాంతి విహీనుడవుతాడే ! మానవ జీవితం అనుక్షణం విధివశమే ! ఇక దేనికి మనం కర్తలం? దేనికీ ప్రశ్నలు ? శలవు !!! (చరచరా వెళ్ళిపోతుంది)

(సూర్యం నిర్ఘాంతపోయి మాణిక్యం వెళ్ళగానే కుర్చీలో కూలబడతాడు. సూర్యానికి తన పరాభవానికి పట్టరాని కోపం వచ్చింది. కాని ఏం చేయలేనివాడవటం వల్ల దుఃఖంలోకి దిగి హస్తాల్లో తలదాచుకొని వున్నాడు)

(విశ్వనాథం, అప్పారావు, నరహరి ప్రవేశిస్తారు)

అ:- వర్షం వచ్చేసిందేమో నరహరిగారూ !

న:- మరేం ఫర్వాలేదు. ఆ, విశ్వనాథంగారు అలా దయచెయ్యండి... మనం నాలుగూ అనుకొని... పుచ్చుకుంటే...ఏది... శలవు పుచ్చు కోడం కాదు... తాంబూలం పుచ్చుకుంటే-

వి:- అలాగే, మీకన్నీ తెలిసినవే, అన్నీ చూస్తున్నారు.

న:- ఎన్నో చూస్తున్నాను.

అ:- ఏదో మనసులు కలవాలిగాని, వేటిల్లోనూ పేచీలు రావనుకోండి. ఏదో ముగ్గురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు ఏ గొడవా లేకుండానే చేశాను.

న:- (చిరునవ్వు) వారికి మట్టుకు తెలియదూ ? ఎలాగయినా పురామరిగా నన్నా అనుకుంటే మంచిది.

సూ:- (మనసులో ఏదో బాధపడుతున్నాడు) అదికాదండీ !

న:- (చెప్పనివ్వకుండా అడ్డంవచ్చి) తొందర పడకయ్యా, ఓహోహో ! నీవిప్పుడే పెళ్ళాడాలంటే ఎలా ?

సూ:- మీరు పొరపాటు - -

న:- పొరపాటులేదు – గ్రహపాటులేదు, నువ్వలా వుండవయ్యా! అన్నీ నీ ఇష్టం ప్రకారమే చేయించేస్తున్నానా ! ఆ - - అప్పారావుగారు, కట్నం మాట అనండి !

అ:- అనేదేముందీ, మిగతా పిల్లల మాదిరే - - - మూడువేలు కట్నం ఇస్తాను - - -

సూ:- (లేచి) నేనొక్కటి చెప్తాను - -

న:- యిష్, కట్నం విషయం నీకెందుకయ్యా, అది మా విషయం. (కూర్చోపెట్టకుండానే సూర్యం కూర్చుంటాడు)

వి:- నేను చెప్పాను కాదండీ నరహరిగారు ! మాది సూర్యవంశం. చంద్రబలం తారాబలం మాకేం అడ్డురావు. నాకేం కట్నం విషయంలో పట్టింపులు లేవు. కానీ – మా వంశంలో ఇంత వరకు అయిదు వేలకట్నం, అయిదురోజుల పెళ్ళి - ఆచారం క్రమం

తప్పకుండా వస్తోంది. చూశారూ, నేను నలుగురిలో తిరగవలసిన వాడిని - - ఇక మీ ఇష్టం !

అ:- ఈ రోజుల్లో అయిదు రోజుల పెళ్ళి, అయిదువేల కట్నం !

న:- మీరాగండి, ఇదుగో విశ్వనాథంగారూ! ఇన్ని మాట లెందుకుగాని మూడువేల రెండువందలు, ముప్పయి రెండువందలు.—

వి:- ఏభయి వందలు.

న:- ముప్పయి అయిదు.

వి:- ఏభయి !

న:- ముప్పయి అయిదు !

వి:- ఏభయి !

న:- నలభయివందలు,

వి:- నలభయి రెండు.

న:- నలభయిమూడు, ఒకసారి, రెండుసార్లు.

వి:- మూడుసార్లు !

న:- రైట్, నలుభయి మూడువందలు !

వి:- ఇక ఆడబిడ్డల లాంఛనాలు అవీ !

అ:- ఇంకా లాంఛనాలు కూడానా ?

వి:- అంతవాడికి ఇదంతా ఎందుకండీ ?

న:- అన్నట్టు విశ్వనాధంగారూ, మీకు ఆడపిల్లలు లేరు కదా!

వి:- [విసురుగా] నా తమ్ముడు కూతుళ్ళు లేరూ ! లాంఛనా లివ్వకపోతే వాళ్ళసలు పెళ్ళి జరుగనిస్తారా ?

న:- సరె. ఓ నూటపదహార్లు వేసుకోండి.

వి:- అమ్మమ్మా! లాభంలేదు (లేవబోతాడు)

న:- (కూర్చోపెట్టూ) నే మాట్లాడుతాగా మీతమ్ముడు కూతుళ్ళతో! మీరలా వుండండి !

వి:- సరే మీ ఇష్టం !

సూ:- మీరందరూ ఇన్ని విషయాలు మాట్లాడుతున్నారు కదా ! ఇందాకటి నుండి చూస్తున్నాను, నా విషయం ఎవరన్నా ఆలోచించారా ?

న:- నీ విషయమా? అడుగూ? మోటార్ సైకిలేనా? అడిగేసెయ్, ఊఁ, అలాగే కొనుక్కో ! ఇంకా మనసులో వున్నదేమిటో అడిగేసెయ్.

అ:- ముహూర్తంకూడా అనుకుంటే మంచిది. మరి మాఘ మాసం బాగుంది.

వి:- వీల్లేదు. మావాడిపెళ్ళాం కనే నెలలు.

అ:- మీవాడి పెళ్ళామా ?

వి:- నరహరిగారికి చెప్పానుకూడా !

న:- ఇదేంటండోయి, నాకెప్పుడు చెప్పారూ!

వి:- నా తమ్ముడిపెళ్ళాం, కనే నెలలని చెప్పలేదూ !

అ:- ఇకనైతే చైత్రమాసం.

సూ:- వీల్లేదు. నే ఒప్పుకోను.

న:- పోనీలే, కోప్పడకు. ఆ నెలలో పరీక్షలా ? (సూర్యం చతికిల పడతాడు) అహహ ! మీవాడికి చదువంటే ఏం ప్రాణమండీ !

అ:- ఇకనైతే వైశాఖం బాగుంటుందేమో!

న:- వైశాఖానికేం దివ్యం, అమోఘం. ఎవ్వరూ ఏ ఆక్షేపణ పెట్టటానికి వీల్లేదు. ఫస్టుక్లాసు రిజర్వుడు ముహూర్తం యేర్పాటు చేస్తాను! అప్పారావుగారూ...ఊఁ ఊఁ-తాంబూలాలు...మళ్ళా వర్జ్యం వస్తుందో, వచ్చేసిందో. ఊఁ, ఊఁ (అప్పారావు వెళ్తాడు)

వి:- వచ్చేసిందా వర్జ్యం?

న:- ఎలా వస్తుందండీ, మనకు తెలియకుండా? ఇదుగో, పంచాంగం తీసుకొస్తాగా, అయినా వర్జ్యం ఏముంధండీ. వర్జ్య మేమిటి ఏదైనా మనం రమ్మంటే వస్తయి, పొమ్మంటే పోతయి! పంచాంగం తెస్తాగాని...

విశ్వనాథంగారూ! మీరు చాలా అదృష్టవంతులు. కామధేనువులాంటి కోడలు దొరికింది...ఇక అబ్బాయి సంగతి (లోపలికెళ్తూ) ఓహోహో
(నరహరి వెళ్తాడు)

(సూర్యం తలవంచుకు కూర్చునివుంటాడు, విశ్వనాథం చూసి దగ్గర కెళ్ళి క్షణం చూస్తాడు)

వి:- (బుజంతట్టి) ఏమిట్రా?

సూ:- (పంకడు. తలెత్తి శూన్యంలోకి చూస్తాడు)

వి:- ఏమిట్రా ?

సూ:- ఇప్పుడూ ?

వి:- (విసుగు) ఇప్పుడు?

సూ:- నా పెళ్ళి దేనికి ?

వి:- (కోపం) నా చావుకి !

సూ:- పెళ్లిప్పుడు చెయ్యకపోతేనేం ?

వి:- ఇక చెయ్యనే చెయ్యను !

సూ:- అయినా, అలా అనడానికి మీకధికారం వుందా?

వి:- ఛా వెధవ! వంశం పాడుచెయ్యడానికి పుట్టావ్, (గొంతు తగ్గించి) ఛండాలుడా !

సూ:- అబ్బ అలా అరుస్తారేం !

వి:- అరుస్తానా, నరుకుతానా!

సూ:- అబ్బ, అరవకండి, చెప్పనివ్వండి.

వి.- చెప్పనిస్తానా, చెప్పుచ్చుకు లెంపలు వాయిస్తానా? ఇలా అయితే ఇక చూడు నీ తిప్పలు. ఇంట్లో అడుగుపెట్టు, చవడా లెక్కతీస్తాను. ఇక నేచెప్పినట్లు నడుచుకో పోయినావా -ఇటుచూడు (చేతికర్ర చూపిస్తూ) నరహరిగారన్నట్లుగా దీనితో నీకు ఆపరేషన్ చేసి తీర్తాను !

న:- (పంచాంగంతో హడావిడిగా ప్రవేశించి, విశ్వనాథం చిందులు తొక్కడం చూసి) ఏమిటండోయి!

సూ:- (లేచి అవతలకు వెళ్తూ) అబ్బ! మీకు చెప్పలేను బాబూ !

న:- ఏమన్నాడండీ విశ్వనాథంగారూ ?

వి:- అధికారంలేదుట ! ఆడదానెదుట అణాకుపనికిరానిపక్షి, అధికారం లేదుట ! అష్టకష్టాలు పడి, పెంచి, పెద్దవాళ్ళను చేస్తే, పెళ్ళిచెయ్య డానికి అధికారంలేదూ! మదమెక్కి వళ్ళుబలిసి!

న:- ఏమిటన్నాడు ?

వి:- పెళ్ళాట్ట! వూరిమీద వూరేగుతాడు కాబోలు, షామ దేవత!

న:- నే చెప్పలేదండీ, తారాబలం లేనిదే, ఎవ్వరం ఏం చేయంలేం!

వి:- ఆదికాదండీ, వాడికేమన్నా వళ్ళుతెలిసేనా ?

న:- ఇదుగో విశ్వనాథంగారూ! (విశ్వనాథాన్ని తీసుకెళ్ళి కుర్చీలో కూర్చో పెట్టూ) మీరంత హైరాన పడతారేమిటి? కూర్చోండి, (సూర్యం దగ్గరకెళ్ళి) అబ్బాయ్, ఇలా అడుగడుగున ఇలా హంసపాదులు పెట్టకు! యేదోఒకటి తేల్చెయ్.

సూ:- నరహరిగారూ! ఇంతమంది ఇన్నిసార్లు నన్నడుగుతారు గాని, మరి ఆ అమ్మాయినడిగారా, నన్ను పెళ్ళిచేసుకుంటుందో లేదో?

న:- నువ్వడగలా?

సూ:- అదే, చెప్పలేదు.

న:- అసలు నువ్వడిగావా?

సూ:- అడిగాననే అనుకుంటాను.

న:- అనుకోటాలేమిటయ్యా! పోనీ నువ్వు చేసుకుంటానను.

సూ:- ఒక్కసారైనా ఆ అమ్మాయి మనసార 'సరే' నంటే

వి:- అన్నా, నేను చెయ్యనురా బాబూ, యీ పెళ్ళి, చెయ్యను.

న:- విశ్వనాథంగారూ, ఏదో పసివాడూ!

వి:- పసివాడంటారేమిటి, పెళ్ళి కాబోతూంటే!

న:- పెళ్ళెక్కడ కాబోతూంది? అసలవుతుందోలేదో, పోనీ ఆ అమ్మాయి చేతనే అనిపిద్దాం మీరేమి అనకండి. వర్షం వస్తోంది. అమ్మాయిని తీసుకువస్తాను.

(నరహరి లోపలికెళ్ళి మాణిక్యాన్ని వెంట తీసుకువస్తాడు. మాణిక్యం కూర్చుంటుంది.)

న:- అమ్మాయి, నీ నోటిమీదుగాట చెప్పు. నీ కిష్టమేనా ?

మా:- వారిని చెప్పమనండి?

న:- ఆ, నువ్వేటి చెప్పవయ్యా!

సూ:- చెప్పొకదండీ, ఆ అమ్మాయి ముందర చెప్తే.

న:- ఆ, సరే నువ్వనమ్మా అను.

మా:- ముందు వారినిగా అడగవలసింది?

న:- అమ్మాయికి, సిగ్గుకదటయ్యా నువ్వనవయ్యా?

సూ:- పోనీ- పెళ్ళిచేసుకుంటుంది కదా?

న:- ఏమమ్మాయి, పెళ్ళిచేసుకోవడం ఇష్టమేనా?

మా:- మా ఇష్టాయిష్టాలు దేనికిలేండి, యెవరినో ఒకరిని యెప్పుడోకప్పుడు చేసుకోవాలిగా!

సూ:- చూశారా!

న:- మధ్యవాళ్ళం మేం అడిగితే ఇలాగే ఊగులాడుతుంది పచ్చిగడ్డి ! నువ్వడగవయ్యా!

సూ:- నే అడగనండీ, నన్ను పెళ్లిచేసుకుంటావా అని నే అడగనండీ, కావాలంటే మీరడిగి మాట తీసుకోండి!

న:- నే నెలాగయ్యా?

సూ:- మీరడిగే సెయ్యండి చెప్తా!

న:- (మాణిక్యం దగ్గర కెళ్ళి) నన్ను పెళ్ళిచేసుకుంటావా అని ఆయన ప్రశ్నమ్మా! (అనేవాక్యం పూర్తికాక మునుపే మాణిక్యం జవాబు చెప్పేస్తుంది)

మా:- ఆ !

సూ:- ఎవరిని?

మా:- అడిగిన వారిని !

సూ:- చూశారా ఆ విరుపు?

వి.- విరుపేమిట్రా ? మాట్లాడకపోతే మూగంటివి. మాట్లాడితే ఇలా అంటివి. ఇప్పుడే ఇలావుంటే ఇక కాపురమేం వెలగపెట్టావురా నాయనా?

న:- ఇదుగో అమ్మాయి! మాట్లాడకుండా వుండకూడదు, మాట్లాడకూడదు, విరుపు విపరీతాలు లేకుండా, ఎవ్వరికీ కోపం రాకుండా--ఊఁ ఊఁ ఊఁ! (మాణిక్యంవెళ్లి సూర్యాన్ని చెయ్యిపట్టుకుని మధ్యకు తీసుకువస్తుంది. అప్పారావు తాంబూలంతో ప్రవేశించి ఆశ్చర్యపడతాడు)

అ:- ఏమిటిదంతా ?

సూ:- ఇదా

మా:- పెళ్ళి ?

న:- తారాబలం ?

(అందరూ నవ్వేసుకుంటారు. అప్పారావు భార్యతో కాబోలు చెప్పటానికి లోపలకి "ఏమేవ్" అంటూ వెళ్తూవుంటే నరహరి అడ్డంవెళ్ళి, ఇంకెవ్వరూ చూడకుండా, నాకిస్తానన్న పైసా ఏది అన్నట్టు చేతితో చూపిస్తూ, కళ్ళ చూపులతో అడుగుతాడు. అప్పారావు బదులు చెప్పకుండా)

అ:- వర్జ్యం, తాంబూలాలు !

న:- తారాబలం !

:- తెర :-



## పాత్రలు

సైంటిస్టు
పెట్టుబడిదారు
పిచ్చివాడు
బోయ్
శాంతి

అది ఒక సైన్సు పరిశోధకుని గది.

గదినిండా గ్లాసు ట్యూబులు, రికార్డులు, స్పిరిట్ దీపాలు, స్టౌలు తదితరాలు.

గోడలకు రకరకాల విమానాలు, బాంబులు, స్టీమర్లు, యుద్ధ నౌకలు తదితరాలు అట్ట కత్తిరింపులు, ఫోటోలు, బొమ్మలు తగిలించబడి వున్నాయి. గదంతా చిందరవందరగా వుంది.

ఎప్పుడో తెచ్చిపెట్టిన ఫలహారం, దానిప్రక్కనే భోజనం ఒక చిన్న టేబిల్ మీద ఎండిపోతూంది.

మొత్తంమీద ఆ గదిలో మనుషులైన వాళ్ళెవ్వరూ హాయిగా ఒక్క క్షణకాలం కూర్చోలేరు.

ఒక పెద్ద టేబిల్ మీద ఏదో ఎక్స్పెరిమెంటుకు సంబంధించిన పరికరాలున్నవి. గ్లాస్ ట్యూబులో ఏదో ద్రావకం పొంగుతూంది. ఆ టేబిల్ దగ్గర "సైంటిస్టు" నిలబడి వున్నాడు. అతడు ఈ లోకంలో లేడసలు. సంపూర్ణంగా తన పరిశోధనలో మునిగి వున్నాడు. చాల తీక్షణం, తీవ్రావధానంతో ఆ పరిశోధన వైపు చూస్తున్నాడు. మధ్యమధ్య తల పంకిస్తున్నాడు. ఏదో గొణుక్కుంటు న్నాడు. కొద్దిలో నిరుత్సాహం, మరుక్షణం ఆశ, ఆతరువాత జుగుప్స, ఆ వెంటనే ఏదో ఆనందం అతని ముఖంలో తెరలు తెరలుగా వచ్చిపోతున్నాయి. ఆ గది వాతావరణంనుంచి అతన్ని బయటికితీసి వేరేగాచూస్తే కేవలం అప్పుడే పిచ్చాసుపత్రినుండి బయట పడ్డ వ్యక్తి అంటారు మీరు- లోతుకళ్ళు- పొడుగాటి ముక్కు- పెద్ద నుదురు, దాని నిండా ముడుతలు-సంస్కారం ఎరగని జుట్టు- కొన్ని నెలలుగా కత్తి సంపర్కం ఎరుగని గడ్డం-మాసి నలిగి- మచ్చలుపడి చిరగటానికి సిద్ధంగావున్న పంట్లాం షర్టు. ఒక వైపు తెగి కాలినంటిపెట్టుకొనివున్న జోళ్ళు—ఇవీ అతని లక్షణాలు.

"బోయ్" వచ్చాడు.

"బోయ్" సామాన్య బంట్రోతు. కుర్రవాడు-సుమారు 19 సం॥లు ఆ ప్రాంతం వుంటుంది వయసు. సైంటిస్టుముందు వాడే కొంచెం

శుభ్రంగా వున్నట్లనిపిస్తాడు. నిక్కరు, ఆఫ్ షర్టు. తలదువ్వుకొని వున్నాడు. అప్పుడే వస్తున్న మీసాలను సన్నగా కోలగా తీర్చి వున్నాడు. వచ్చి ద్వారానికి కొంచెం దగ్గరగా నిలబడి ఒకటిరెండు నిమిషాలు ఇతనివంక చూస్తూన్నాడు. ''సైంటిస్టు'' మాత్రం వాడి వంక చూడనేలేదు. నిలబడి నిలబడి విసుగేసింది.)

బోయ్:- సార్ !

[ సైంటిస్టు బదులులేదు ]

బోయ్:- (ఇంకా కొంచెం దగ్గరగా) సార్!

[సైంటిస్టు ఇటు తిరిగాడే కాని వెంటనే అటు తిరిగేశాడు. అసలు వాణ్ణి చూసినట్టే లేదు. ఏదో శబ్దానికి సహజగుణంగా ఇంద్రియాలు పనిచేసినట్లున్నాయి.........]

బోయ్:- (తిరిగి చూచాడు కదా అని సోది మొదలెట్టాడు.) నిన్న ఉదయం కాఫీ ఫలహారం, రాత్రి భోజనం అట్టాగే వుండిపోయాయి సార్! ఇప్పుడు టీ తీసుకురమ్మంటారా? యీరోజు అక్కగారు వస్తున్నారు సార్! నిన్న ఉత్తరం వ్రాశారు. ఈ రోజు తంతికూడా ఇచ్చారు. స్టేషను కెళ్ళటానికి టైమైంది. ఆమె మీకోసం ఎదురు చూస్తుంటా రండి-వెంట ఇంకెవరూ మగతోడులేదని కూడా వ్రాశారండి. (ఇంత సొద చెప్పిన తర్వాత ''సైంటిస్టు'' తన మాటలు వినటం లేదని వాడికి తెలిసింది. విసుగుతో) టీ సార్!

సైంటి:- యు ఇడియట్! గెటౌట్. (చాలా నెమ్మదిగా అన్నాడు)

బోయ్:- సరే. సార్! (అని వెళ్ళాడు)

సైంటి:- (ఏదో జ్ఞాపకం వచ్చి) ఒరే!

బోయ్:- సార్! (తిరిగి వచ్చాడు)

[సైంటిస్టు పరిశోధన ధోరణిలో పడ్డాడు;
బోయ్ ఏమీ పలక్కుండా నిలబడ్డాడు]

సైంటి:- అయిపోయింది! ఇంకో అయిదే నిముషాలు! అయిపోతుంది!

బోయ్:- అయిదు నిమిషాల్లో ఎక్స్‌ప్రెస్ వస్తుంది సార్!

సైంటి:- అది కాస్త వచ్చేసిందంటే ఇంక అయిపోయిందన్న మాటే! విజయం దిగ్విజయం... ప్రపంచ విజయం... ఓ...

బోయ్:- విజయంగారు రావటం లేదండి...

సైంటి - విజయం తప్పక వస్తుంది.

బోయ్:- రాదండి.

సైంటి:- యు ఇడియట్ !

బోయ్:- అవునండి! ఉత్తరంలో ఆమె ఒక్కరే వస్తూన్నట్టు వ్రాశారండి, విజయంగారు రావటంలేదు.

సైంటి:- ఓ! అదా నువ్వనేది! వెధవబుర్రలురా మీవి. ఎంతసేపూ ఇల్లూ-వాకిలీ-బంధువులు——

బోయ్:- నిన్నటి భోజనం అలాగే వుండిపోయిందండి.

సైంటి:- నాన్‌సెన్స్! భోజనం భోజనం! నేనెంత పెద్దపని చేస్తున్నాను. దీనిముందు భోజనం హిమాలయం ముందు చదపుట్టలాంటిది తెలుసా? వెధవబుర్రలు! అంతాచెత్త!! సందులో? గొందులోపడి ఆలోచిస్తాయి! విశాలంగా చూడవు. (అంటూ పళ్ళెంలో వున్న చిప్స్ ఒకటి రెండు తింటూ) అయిపోయింది! ఇంకో అయిదు నిమిషాలే! అయిపోయింది!

బోయ్:- శాంతమ్మగారు వస్తున్నార్ సార్!

సైంటి:- డామిట్! శాంతీలేదు గింతీలేదు. వస్తేగిస్తే మళ్ళా యుద్ధమే వస్తుంది. యుద్ధమే రావాలి. అప్పుడు——

బోయ్:- అదికాదు సార్! మీ అక్కగారు శాంతమ్మగారు వస్తున్నారు సార్!

సైంటి:- ఓ! మరచా! అవునవును. ఈరోజేగా వస్తానని రాసింది. ఎక్స్‌ప్రెస్‌లో-పోనీలే! స్టేషన్‌దాకా వచ్చింది ఇంటికి రాకుండా పోతుందా? వస్తుందిలే! శాంతి వచ్చేలోగా నా పని పూర్తికావాలి. విజయం సాధించాలి. ఆ సంతోష వార్తతో శాంతిని ఆశ్చర్యచకితని చేయాలి. శాంతివస్తే ఇంక నా పని సాగదు వెళ్ళు—— వెళ్ళరా-నువ్వెళ్ళు (ఈ మాటలన్నీ తన పరిశోధన చూస్తూనే అంటూన్నాడు)

బోయ్:- టీ సార్ ?

సైంటి:- టీ, భోజనం, ఫలహారం అన్నీ శాంతి వచ్చిన తర్వాతనే. ఇప్పుడేమీ వద్దు, వెళ్ళు.

బోయ్:- సరే సార్! (వెళ్ళాడు)

సైంటి:- (మళ్ళా తన పరిశోధనలో పడ్డాడు) యుద్ధం రావాలి. శాంతి రావటానికి వీల్లేదు. వట్టి వెధవలు ! శాంతి, శాంతి అంటారు. (మెల్లగా గొణుగులోకి దిగి, పూర్తిగా అయిపోయింది. ఒక్క-క్షణం అలాగే నిశ్శబ్దంగా శూన్యం (చిల్లంగి) పెట్టేవానిలా చూస్తూన్నాడు, ముఖం మెల్లగా ఆనందంతో విప్పారుతుంది. ఉన్నట్లుండి ఒక అగ్ని పర్వతం బద్దలైనట్లు నవ్వటం మొదలెట్టాడు. ఆర్కిమెడుసులాగా పరుగెత్తుతాడు ఆ గదిలోంచి బయటికి. మళ్ళీ గదిలోకివచ్చి కుర్చీలో కూర్చుండి విరగబడి నవ్వుతూన్నాడు. సంతోషంలో జుట్టు, బట్ట పీక్కుంటున్నాడు. అ చినిగిన చొక్కా కాస్తా చిరిగింది)
వచ్చేసింది విజయం ! ఐ హావ్ ఫౌండౌట్ !
(ఈలాంటి మాటలేవేవో పెద్దగా అరుస్తూ వున్నాడు. ఆ నవ్వుతో మిళితమై వాకిట ఇంకెవరి నవ్వో వినిపిస్తూంది. ఈ గోలకు "బోయ్" వచ్చి కంగారుగా చూస్తాడు. సార్ సార్ అంటూ ఇతన్ని పట్టుకో బోతాడు. కాని ఇతడు వాడి బుజాలు పట్టుకొని కుదుపుతూ) ఒరే ఫూల్ ! ప్రపంచంలోకల్లా మహారాజు మనంరా ఇంక. ప్రభుత్వమే మన వాకిట కాపలా కాస్తుందిరా ! చూడు ! ఓ ! సక్సెస్. యు ఇడియట్ ! ఆ'ఁరా ? పెద్దగా అను ! నవ్వరా నవ్వు ! పూర్ బ్రెయిన్స్ మీకెలా తెలుస్తుంది ఆనందం !
(వాడు నిజంగానే కంగారుపడి వణికిపోతున్నాడు.)
(ఇంతలో బయటినుంచి పెద్దనవ్వు - నవ్వుతోపాటు పిచ్చివాడు లోపలికి వచ్చాడు. ఇప్పుడైనా మీరు తెలుసుకుంటారు - సైంటిస్టుకీ పిచ్చివాడికీ ఏమి తేడా లేదని. సైంటిస్టు, పిచ్చివాడు ఈ ఇద్దరిలో ఎవరు సైంటిస్టో తెలుసుకోవటం కష్టం. పిచ్చివాడు నవ్వుతున్నాడు; సైంటిస్టూ నవ్వుతున్నాడు. ఈ మధ్య "బోయి" కంగారుపడి దావు కేక వేసి తప్పించుకొని పారిపోతాడు.)

పిచ్చి:- ఆపు ! (ఉన్నట్లుండి సీరియస్ అయాడు.)
(సైంటిస్టు నవ్వు ఆపేసి తెల్లబోయి చూస్తున్నాడు.)

పిచ్చి:- ఏమిటి నువ్వు చేస్తున్నది ? ఎందుకు నవ్వుతున్నావు?

సైంటి:- నవ్వటంకాదు - ఆనందిస్తున్నాను.

పిచ్చి:- ఏం ఘనకార్యం చేశావని ఆనందిస్తున్నావు. ఆనందించటానికి ఈ ప్రపంచంలో ఎవడికీ హక్కు లేదు మనకు తప్ప ! తెలుసా? చెప్పు ఏం చేశావని ఈ ఆనందం?

సైంటి:- ఇప్పుదేంవుంది నా ఆనందం ! యుద్ధంరావాలి, వస్తుంది. తప్పకుండా వస్తుంది యుద్ధం. అప్పుడు చూడాలి నా ఆనందం ! ఆఁ- ఇంతకూ నువ్వెవరూ ?

పిచ్చి:- (కుర్చీలో కూర్చుని) నేనే. యుద్ధదేవతను.

సైంటి:- నాన్ సెన్స్ !

పిచ్చి:- నాన్ సెన్స్ ! నీకు నో సెన్సు, అంతే. దేవతలను చూచావా నువ్వు ఎప్పుడైనా ?

సైంటి:- మోస్టు అన్ సైంటిఫిక్ !

పిచ్చి:- పోవోయ్ ఫూల్లాయ్ ! నీ సైన్సు యింకా దేవతలను చూచేంత అభివృద్ధి కాలేదు, తెలుసా ?

సైంటి:- నువ్వు పిచ్చివాడివి !

పిచ్చి:- నువ్వు ?

సైంటి:- ఏయ్ గెటౌట్ ! నా ఆనందానికి అడ్డురాక ! నేను తృప్తిగా నవ్వుకోవాలి ! ఈ రోజు మహా పర్వదినం. ఈ రోజు నా జీవితంలో స్వర్ణదినం, ప్రపంచ జీవితంలోనే ఒక పండుగ దినం ! సైన్సు శిఖరాగ్రాన్ని చేరుకుంది. ఇంతకంటే ప్రగతి ఇక సైన్సుకు లేదు. సంతోషించవోయ్ ! నువ్వూ సంతోషించు !
(పిచ్చివాడు భోరుమని ఏడుస్తున్నాడు)

సైంటి:- ఎందు కేడుస్తున్నావు ?

పిచ్చి:- ఏడవటంలేదు, నవ్వుతున్నా.

సైంటి:- డామిట్.

పిచ్చి:- ఇంకా సైన్సుకు నవ్వేదో ఏడుపేదో తెలియలేదు. అంతా వట్టి ఫూల్స్ యీ మనుష్యులు. నవ్వాల్సిన దాని కేడుస్తారు. ఏడవాల్సిన దానికి నవ్వుతారు. బిడ్డపుడితే నవ్వుతారు, చస్తే ఏడుస్తారు. "అబ్సర్డ్".

సైంటి:- అబ్సర్డ్ ? గెటౌట్ !

పిచ్చి:- వెళ్ళను, ఇక్కడే కూచుంటా, నేనీ ప్రపంచములోకి దేవదూతనుగా వచ్చాను. యుద్ధదేవతగా వచ్చాను. యుద్ధదేవతగా పనిచేస్తున్నా. యుద్ధం ఇంకా వుంటుందంటావా, లేదా ?

సైంటి:- తప్పకుండా ఉంటుంది. ఇంకో యుద్ధం తప్పదు.

పిచ్చి:- మరి శాంతి సభలు అవీ-ఇవీ-చేస్తున్నారే ! ఏమంటావు ?

సైంటి:- అదంతా మోస్టు అన్ సైంటిఫిక్. వాళ్ళంతా శాంతిని గురించి మాట్లాడుతూ యుద్ధాన్ని గురించి ఆలోచిస్తూంటారు. అంతే !

పిచ్చి:- అయితే నాకిక్కడ పనుంది.

సైంటి:- ఇక్కడ నీ కేం పని ?

పిచ్చి:- ఉందంటే ఉంది, అంతే !

సైంటి:- ఓ మై గుడ్నెస్ ! అయితే దయచేసి గోలచేయక కూర్చో, నా పని చూచుకోనీ.

పిచ్చి:- ఆల్ రైట్ !

(ఇంతలో బయట తలుపులు తట్టిన శబ్దం)

సైంటి:- రావచ్చు.

పెట్టుబడిదారు:- (వచ్చాడు, కోటీశ్వరుడు. ప్రపంచాన్నంతా బ్లాక్ మార్కెట్లోనైనా కొనేయగల ధీమా కనుపిస్తుంది అతనిలో. వాళ్ళిద్దరి మధ్య అతను వెక్కిరింతగా వుంటాడు) హల్లో !

సైంటి:- హల్లో ! రాండి రాండి, కూర్చోండి !

(పిచ్చివాడు పిల్లిలా అణిగి కూర్చున్నాడు.)

పెట్టుబడి:- (పిచ్చివాడివైపు చూచి) ఎవరూ ?

సైంటి:- ఎవరో పిచ్చివాడు.

(పెట్టుబడిదారు నవ్వుతాడు)

(పిచ్చివాడు వెక్కిరింతగా నవ్వుతాడు.

పెట్టుబడిదారు కంగారుపడి ఆగుతాడు)

సైంటి: డామ్‌న్యూసెన్సు ! యు గెటౌట్. ఆ పిచ్చివాడితో ఏంపనిలెండి.

పెట్టుబడి: అవునవును, మీతోనేలెండి. మరి మనం మాట్లాడుకోవచ్చా ?

సైంటి: ఓ యస్. కాని తొందరగా ముగించాలి. లేకుంటే శాంతి వస్తుంది.

పెట్టుబడి: శాంతి మీ అక్కగారు కదూ !

సైంటి: అవును ఆవిడవస్తే యుద్ధాన్నిగురించి ఏమీ మాటలు సాగనీదు. యుద్ధమంటేనే వణికిపోతుం దావిడ. వట్టి సెంటిమెంటల్ ఫిమేల్. యుద్ధంలో - అంటే గడిచిన యుద్ధంలో - సత్యం చనిపోయి నప్పటి నుంచి ఆమె అలా అయిపోయింది. వట్టి గాంధీమతం.

పిచ్చి: అది ఇంకా బతికుందా ?

పెట్టుబడి: ఆఁ, బతికేవుంది. కొందరి పిచ్చిబుర్రల్లో. నీకెలా తెలుసు ఆ మతం?

పిచ్చి: ఎప్పుడో - కాదుకాదు ఈ మధ్యనే - ఎవరో ఉపన్యసిస్తుంటే విన్నా. ఉపన్యాసానికి చాలా బాగుంటుం దా గాంధీమతం, పెరుగులో ఆవ కాయ ముక్కలా.

పెట్టుబడి: అందుకే బతకదలచుకున్న వాడెవడూ దాన్ని అమలులో పెట్టడం లేదు.

సైంటి: నాయకుడు కాదలచుకున్న వాడెవడూ వదిలిపెట్టడం లేదుగా !

పెట్టుబడి: ఆఁ! అసలు విషయం దూరమైపోయింది. రాండి మనం కాస్త రహస్యంగా మాట్లాడుకోవాలి (ఇద్దరూ కొంచెం దూరంగా వెళ్ళి నిలబడతారు. పిచ్చివాడు అలాగే కూర్చొని తనలోతాను నవ్వు కొంటాడు)

పెట్టుబడి:- డబ్బు కావాలా ?

సైంటి:- అక్కర్లేదు.

పెట్టుబడి:- ఏం ?

సైంటి:- అక్కర్లేదు, అంతే !

పెట్టుబడి:- ఇంకా కాలేదూ ?

సైంటి:- ఏమిటి ?

పెట్టుబడి:- అదే !

[సైంటిస్టు పెద్దగా నవ్వాడు, పిచ్చివాడు నవ్వాడు.]

సైంటి:- డామ్ న్యూసెన్స్ (ఈ మాట అంటూండగానే బయట తలుపు తట్టిన శబ్దం) రాండి !

[బోయ్ వచ్చాడు.]

సైంటి:- ఏమిటిరా ?

బోయ్:- ఆమె వచ్చారండి.

సైంటి:- శాంతి ?

బోయ్:- అవును సార్ !

పెట్టుబడి:- శాంతి అప్పుడే వచ్చేసిందా ?

బోయ్:- అవును సార్ !

పిచ్చి:- నాన్‌సెన్స్ ! అబద్ధం, పచ్చి అబద్ధం !

బోయ్:- నిజం సార్! పచ్చినిజం సార్!

పిచ్చి:- అయితే శాంతి కేవలం ఒక మనిషి పేరు అయివుండాలి.

బోయ్:- మనిషి పేరే సార్!

పిచ్చి:- రైట్! కరెక్ట్! చూడారా! నన్నందరూ పిచ్చాడంటారు. ఎంతసరిగా వూహించానో! నాకు తెలుసు, ప్రపంచంలో ఇంత తొందరలో శాంతి రావటానికి వీల్లేదని.

బోయ్:- సత్యం చనిపోయిన రోజట సార్, ఈ దినం!

సైంటి:- అవునవును!

బోయ్:- ఆమె చాలా విచారంగా వున్నారు సార్!

పిచ్చి:- చచ్చినవాళ్ళకోసమే!

సైంటి:- అంతా సెంటిమెంటల్!

పెట్టుబడి:- ఫీమేల్సు అందరూ అంతే!

బోయ్:- ఈరోజు ఆయన దినం చేయాలని వచ్చారట సార్!

సైంటి:- ఓ మై గుడ్‌నెస్! నేను ఆనందంతో పొంగిపోతూంటే ఇదెక్కడి ఏడుపు? నేను ఈ రోజంతా తృప్తిగా ఖుషీ చేసుకోవాలి, నవ్వాలి, తాగాలి, వీలైతే డాన్స్ కెళ్ళాలి. ఆమె ఏడుస్తూ కూచోవాలి తలుపు లన్నీ మూసుకొని ముఖం ముడుచుకొని కూచోవాలి. ప్రార్థనలు చేయాలి. ఓ వాట్ ఎ హారిబుల్ థింగ్! వాట్ ఎ టెరిబిల్ కాంట్ర డిక్షన్!! వాట్ ఎ హెల్!!!

పిచ్చి:- అదే జీవితం! అదే బ్రదర్, బ్రతుకు,

సైంటి:- నాన్‌సెన్స్! వెళ్ళిచెప్పు! శాంతితో చెప్పు. ఇన్ని సంవత్సరాలుగా నేను చేస్తున్న కృషి, నిద్రాహారాలు కూడా లేకుండా చేస్తున్న పరిశోధన ఫలించిందని చెప్పు! ప్రపంచానికే ఒక మహాభాగ్యం లభించిందని చెప్పు! విజ్ఞానానికి ఒక వెలలేని మణి దొరికిందని చెప్పు! ఈ మహదానందంలో— ఈ బ్రహ్మానందంలో విచారానికి చోటులేదని చెప్పు! చెప్పు పోవోయ్!

[పెట్టుబడిదారు పెద్దగా నవ్వాడు]

సైంటి:- ఓ-మీరు ఇక్కడే వున్నారా?

పెట్టుబడి:- (సైంటిస్టు వీపుమీద తడుతూ) ఏం ఫర్వాలేదు! ఏం ఫర్వాలేదు! కంగ్రాచ్యులేషన్స్!

సైంటి:- (అదోరకంగా నవ్వి) థాంక్ యు! మీతో చెబుదామనే! కాని ఏవో మాటల్లోపడి మరచిపోయా. క్షమించండి!

పెట్టుబడి:- దానికేంలెండి. మీరు సక్సెస్‌ఫుల్ కావడమే మాకు కావలసింది. చూడాయా-సైన్స్, ఆర్ట్ ఇవన్నీ ప్రోత్సహింపబడాలి. అప్పుడే దేశం

ఎంతైనా ముందడుగు వేస్తుంది. మరి ఈనాటి ప్రపంచంలో సైన్సు కున్నంత విలువ ఇంక దేనికీలేదు భోజనం మొదలు అన్నీ సైంటి ఫిక్‌గా వాడబడుతున్నాయి. నాగరికతకు మొదటి గురుతు సైన్సు అభివృద్ధి కనుక—

[పిచ్చివాడు చేతులు తట్టాడు.]

పెట్టుబడి:- చావటాన్నీ బ్రతకటాన్నీ ఎంతో నాజూకుగా చేసింది సైన్సు. మనిషిని మనిషి చంపటం మునుపెంతో ఘోరంగా వుండేది. మునుపటి యుద్ధాలు ఈటెలతో బాణాలతో ప్రతి అంగం నరికి, నరికించుకొని ఎంతో బాధపడేవాళ్ళు. ఇప్పుడలాటి అనాగరిక యుద్ధం లేదు. విషవాయువు ప్రయోగిస్తే వున్నమనిషి వున్నట్టే హాయిగా ప్రాణాలు వదుల్తాడు. ఇంత నాజూకు చావుకు కారణం సైన్సు !

[పిచ్చివాడు చేతులు తట్టాడు]

పెట్టుబడి:- కనుక సైంటిస్టులు దేశానికి జీవగర్రలు. వాళ్ళులేని దేశం వల్లకాడు. వాళ్ళని పోషించని దేశం నాశనం. హిట్లర్ కొన్ని వేలమంది సైంటి స్టులను పోషిస్తూ వుండేవాడు. అందుకే అంత పెద్ద యుద్ధం అన్ని రోజులు చేయగలిగాడు.

పిచ్చి:- చివరికి చచ్చాడు.

సైంటి:- చావడం సహజం!

పిచ్చి:- అవును. మన నాగరికతలో బ్రతకడమే అసహజం!

పెట్టుబడి:- ఇప్పుడు అన్ని దేశాలలో పెద్దవాళ్ళ మనుకునే కొందరు యుద్ధం అనేది లేకుండా చేయాలని ఆలోచిస్తున్నారు

పిచ్చి:- కాదు కాదు. మాట్లాడుతున్నారు

పెట్టుబడి:- ఆలోచించకుండా ఎలా మాట్లాడుతారు?

పిచ్చి:- మాట్లాడేదే ఆలోచిస్తూండాలని రూలెక్కడిది?

పెట్టుబడి:- రెండూ వేరు కావటానికి వీల్లేదు. మోస్టు అన్ సైంటిఫిక్.

పిచ్చి:- రెండూ వేరు వేరు కావడమే మోస్ట్ సివిలైజ్డ్.

పెట్టుబడి:- నీవొట్టి పిచ్చాడివి నీతో నాకు మాటలేమిటి?

పిచ్చి:- నాకు మెదడుంది కాబట్టి పిచ్చివాడి నయ్యాను. నీ కదిలేదు తెలుసా?

సైంటి:- ఇస్! యు బెగ్గర్, అతనెవరో తెలుసా?

పిచ్చి:- తెలుసు. బెగ్గర్‌ను సృష్టించినవాడు.

సైంటి:- పెద్ద కోటీశ్వరుడు.

పిచ్చి:- యుద్ధకాలంలో పుట్టి పెరిగిన బిడ్డ. అంతేనా?

పెట్టుబడి:- సరే పోనీలే! అతనితో మనకేమిటి?

సైంటి:- బయటికి గెంటిస్తా.

పెట్టుబడి:- అక్కర్లా! వాడే పోతాడు. అసలు విషయం మరచాం. యుద్ధం పూర్తిగా లేకుండా పోవడానికి వీలే లేదు. యుద్ధం సృష్టితోపాటు పుట్టిన గుణం. యుద్ధం లేకుంటే విజ్ఞానం, అభివృద్ధి ఏమీలేదు.

పిచ్చి:- యుద్ధం లేకుంటే ఆకలిలేదు - చావులులేవు – వ్యభిచారంలేదు - బ్లాక్ మార్కెట్టు లేదు-కోట్లు కోట్లు కొల్లగొట్టడంలేదు - బొజ్జలు పెరగడం లేదు.

పెట్టుబడి:- నాన్‌సెన్స్! యుద్ధంలేనిదే-యుద్ధంలేందే—

[సరిగా ఈ సమయానికే శాంతి తలుపు తెరుచుకొని వచ్చింది. తెల్లటి బట్టలు, మనిషి చాలా అందగత్తె కాని, ముఖంలో విషాద రేఖలు అగుపిస్తుంటాయి. వితంతువని చూడగానే తెలుస్తుంది. నిజానికి సైంటిస్టుకన్నా పెద్దదయినా చూట్టానికి చిన్నదిగా వుంటుంది. తెల్లటి చీరమీద ఒక నల్లటి ముసుగు వేసుకుంది. కళ్ళల్లో దైన్యం, దయ, ప్రశాంతత అగుపిస్తుంటాయి.]

శాంతి:- (యుద్ధం అన్నమాట వినగానే వణకిపోతుంది; ఏ పెద్దపులినో సింహాన్నో చూచినట్టు బెదిరిపోతుంది) యుద్ధం! ఓ, యుద్ధం!

సైంటి:- పేపరు చూచావా ?

శాంతి:- యుద్ధం! తమ్ముడూ! మళ్ళీ యుద్ధమే! ఓ! (ఏడుపు పర్యంతమవుతుంది. అక్కడున్న కుర్చీలో కూలిపోతుంది)

సైంటి:- ఓ. మన అదృష్టం పండింది అక్కయ్యా! సీతమ్ముడి పేరు దశదిశలా మారు మోగుతుంది. ప్రపంచమంతా నీ తమ్ముడికి జోహారు లర్పిస్తుంది. ప్రపంచాని కింత అమూల్యమైన పరిశోధన చేసినందుకు ఆకాశాని కెత్తేస్తారు. నే ననుకుంటూనే ఉన్నాను, ఇంకో యుద్ధం తప్పదని. వచ్చింది. మనకు శుక్రదశ వచ్చిందక్కయ్యా! ... యుద్ధం ...

శాంతి:- ఆ మాట పల్కకు! నేను వణికిపోతాను. నే నూపిరి పీల్చుకోలేను. నా గుండె ఆగిపోతుంది. తమ్ముడూ! ఆ మాటే ఎత్తకు.

పెట్టుబడి:- ఇంతకూ యుద్ధం వచ్చిందని యెవరు చెప్పారు ?

శాంతి:- మీరే! మీరే అంటున్నారు, నేను వచ్చేటప్పటికి. సరిగ్గా నా కర్మకాలి అదేమాట విన్నాను.

సైంటి:- నాన్ సెన్సు, నువ్వు పేపరులో చూడలేదూ?

శాంతి:- నేనేమీ చూడలేదు.

సైంటి:- చచ్చాం. నువ్వింకా పేపరు చూచివచ్చి కేకలేస్తున్నా వనుకున్నా. డిసెప్పోయింటెడ్, హారిబుల్.

శాంతి:- ఇంతకూ అట్టాంటిదేమీ లేదుకదూ తమ్ముడూ ?

సైంటి:- లేదులే! తాపీగా కూర్చో.

శాంతి:- అమ్మయ్య!

[ బోయి టీ తెచ్చాడు ]

శాంతి:- కూర్చోండి. అందరూ కూర్చోండి. హాయిగా టీ తాగుదాం. (అతనితో) మీరిలా కూర్చోండి ఏమిట్రా తమ్ముడూ, ఈ గది! ఒక్క క్షణం కూర్చోబుద్ధివేయదు. (పెట్టుబడిదారునితో) ఈరోజు మీరు మా ఇంటికి రావడం నాకెంతో యిదిగా వుంది! ఈరోజు - సరిగా 5 సంవత్సరాలకు పూర్వం ఇదే రోజున మా సత్యం పోయాడు - సత్యాన్నెరుగరూ మీరు?

పిచ్చి:- సత్యం ముకుడు మొహం ఎరగడు అతడు!

శాంతి:- అన్నట్టు ఈయనెవర్రా మంచి స్నేహితుడే ! సైంటిస్టేనా. ?

పిచ్చి:- చస్తే యీ జన్మలో కాను.

శాంతి:- అచ్చం మా తమ్ముడిలాగే వుంటే అడిగా !

పిచ్చి:- మీ తమ్ముడే నాలా గున్నాడు. నే నతనిలా లేను.

శాంతి-: ఇంతకూ క్షమించండి, మీ రెవరో ...

సైంటి:- అక్కయ్యా ! ఆయన ...

పిచ్చి:- నేనే చెప్తా. ఒక పిచ్చాడిని-పరేనా ?

శాంతి:- (నవ్వి) టీ తీసుకోండి. ఏంరా తమ్ముడూ ! స్టేషనుకు రాకనే పోయావు. నువ్వు తప్పకుండా వస్తావనుకున్నా సుమీ ! నీకోసం ఆ మంచులో ఎంతసేపు కాచుకున్నాను ! చివరికి విసిగి టాక్సీ వేసుకొచ్చా.

సైంటి:- రావాలని ఎంతో అనుకున్నా నక్కయ్యా. కాని రాలేకపోయా, చూచావు;ఒక్కక్షణం ఈ గదిలోంచి కదలటానికి వీల్లేకపోయిందనుకో

పిచ్చి:- గదిలోమాత్రం కది లేదిస్తేగా ! ఇదిగో నిన్నటి కాఫీ, భోజనం...

సైంటి:- అవునక్కయ్యా! చూడు. చేస్తూన్నదీ- ఎంత అమూల్యమైన కృషో. నువ్వు గ్రహించి స్టేషనుకు రానందుకు ఆగ్రహించకుంటావని నా నమ్మకం. ఇంతకూ నీకు చెప్పాల్సిన దేమంటే, అక్కయ్యా విను.

శాంతి:- ఇంకొంచెం టీ పోయనా ?

సైంటి:- అక్కర్లేదులే. విను చెప్తా. నే నిన్నేళ్లుగా చేస్తున్న పరిశోధన విజయ వంతమైనది అక్కయ్యా ! బ్రహ్మాండంగా ఆనందించాల్సిన శుభదినం యిది. చూశావ్! ప్రపంచంలో యింతవరకూ ఎవరూ కనీ వినీ ఎరుగని ఒకకొత్త శక్తిని కనిపెట్టా నక్కయ్యా !

శాంతి:- అలాగా ! పోనీలే, నువ్వు రాకున్నా నేనే వచ్చేశాగా ఎలాగో ! ఈ రోజు నాకేం బాగాలేదు సుమా చాలా బరువుగా ఉంది గుండె ! ప్రతీ క్షణం కళ్ళయెదుట సత్యం ప్రత్యక్షమవుతూన్నాడు తమ్ముడూ!

పిచ్చి:- డామిట్, సత్యం! సత్యం! సత్యం కళ్ళకు కనబడటం పచ్చి అబద్ధం.

శాంతి:- సత్యం నా ఒక్కగాని ఒక్క కొడుకండి.

పిచ్చి:- ఓహో ! చచ్చిపోయాడా ?

శాంతి:- అవును. ఐదు సంవత్సరాలకు పూర్వం అన్యాయంగా...అనవసరంగా ...ఎందుకో చచ్చిపోయాడు...కాదు, చంపేశారు...సత్యం !...

పిచ్చి:- సుఖపడ్డాడు,

శాంతి:- ఏమన్నారు ?

పిచ్చి:- ఏమీలేదు. సత్యం యీ లోకంలో ఉండకుండా వెళ్ళడమే మంచిదైంది.

శాంతి:- మీదెంత కటికిగుండె అండి ?

పిచ్చి:- సత్యం కంటేనా ? సత్యందే చాల రాతిగుండె.

శాంతి:- కాదు, కానేకాదు. మా సత్యం చాల మంచివాడు. ఎంతో మెత్తటి హృదయం. అన్యాయంగా పోయాడు. వాళ్ళనాన్నను చేరుకున్నాడు. నా కెందుకిచ్చాడో ఈ తీరని ఆయుస్సు. నా తండ్రికిబదులు నన్ను తీసుకుపోరాదూ, నీకు పుణ్యముంటుంది.

పిచ్చి:- అసాధ్యం ! మోస్టు అన్ సైంటిఫిక్.

శాంతి:- మీకు తెలీదు, నా గుండె యెలా తరుక్కు పోతుందో - ఆ పాడు యుద్ధం, నాశనమైన యుద్ధం - దాని వెధవాయుస్సు కూలిపోను - ఐదు సంవత్సరాలు జరిగింది. నా సత్యంకోసమే కాచుకున్నట్టు వాణ్ణి పొట్టనబెట్టుకుంది - ఆగిపోయింది — తమ్ముడూ ! ఇన్ని కనిపెడుతున్నావు ! ఈ యుద్ధాని కేదైనా కనిపెట్టరాదూ ? నీకు పుణ్యముంటుంది.

పిచ్చి:- అదే! సరిగ్గా అదే! మీరు కోరేదే కనిపెట్టా డిప్పుడు.

శాంతి:- నిజంగా !

పెట్టుబడి:- అవును. సరిగ్గా అదే !

శాంతి:- నిజం తమ్ముడూ ?

సైంటి:- అవునక్కయ్యా !

శాంతి:- తమ్ముడూ ! (ఒక్కసారి లేచి అతన్ని కౌగలించుకొని) ప్రపంచమంతా నీకు ఋణపడుతుంది తమ్ముడూ ! నువ్వు కేవలం దేవుడివి తమ్ముడూ ! (చేతులు తడుతూ) ఒరే అబ్బాయి ! ఎంత ఆనందం ! ఇది ముందుగా చెప్పావు కావేం ? సత్యం చనిపోయాడన్న విచారం ఒక్కసారిగా పోయింది తమ్ముడూ ! కనీసం యికమీదైనా తల్లికడుపు దహించుకుపోకుండా వుంటుంది.

బోయ్:- (వచ్చాడు) పిలిచారమ్మా ?

శాంతి:- ఏదిరా హారం, సత్యానికోసం తెచ్చిన హారం? అదిలాపట్రా. వెళ్ళు - త్వరగా - పరుగెత్తుకు రావాలి.

(బోయ్ నిజంగానే పరుగెత్తాడు)

శాంతి:- తమ్ముడూ ! ఈ రోజు నా సత్యం పోయిన దుఃఖంతో కుమిలి పోవటానికని యిక్కడికి వచ్చాకాని, యింతటి సంతోష వార్త వింటాననుకోలేదు. సైన్సంటే నా కిన్నాళ్ళు ఎంతో అసహ్యం. సైన్సు లోకాన్ని నాశనం చేయటానికి ఉపయోగపడుతుందని అనుకునేదాన్ని. యీనాడు విన్నా, లోకాన్నంతా ఉద్ధరించడానికీ సైన్సు కారణమని.

పిచ్చి:- పొరపాటు ! కేవలం పొరపాటు.

బోయ్:- (పూలహారంతో వచ్చాడు) ఇదిగోనమ్మా హారం!

శాంతి:- ఆఁ తెచ్చావూ ? తీసుకోరా ! — ఇదిగో తమ్ముడూ ! ఇది నా ముద్దుల సత్యానికోసం — కేవలం సత్యానికని — ప్రత్యేకంగా ఆర్డరిచ్చి కట్టించాను. ఈ రోజు నీకు — నువ్వు లోకానికి చేస్తున్న యీ గొప్ప సహాయానికోసం - నీకు వేస్తాను. నేను సత్యాన్నెంతగా ప్రేమిస్తానో నీకు తెలుసు. ఈ హారం ఆ ప్రేమకు గుర్తు ! రా తమ్ముడూ ! వేసుకో. ప్రపంచం నీ కింతకంటె గొప్ప సత్కారం చేయబోతూంది. కాని-నీ స్వంత అక్క, ఈ తృణం అర్పిస్తూంది, స్వీకరించు.

పిచ్చి:- ఆగండి ! ఆగండి ! ఆయన కనిపెట్టిం దేదో అడిగి ముందుగా తెలుసుకోండి. మీరు పట్టి వుద్రేకం మనిషిలా అగుపిస్తున్నారు.

శాంతి:- వుద్రేకం మనిషిని కావచ్చు. కాని పిచ్చి మనిషిని కాను.

పిచ్చి:- కావచ్చు. కాని అదేదో ముందుగా తెలుసుకోందే ఆయన్ను సత్కరించటం నేను సుతరామూ అంగీకరించను.

శాంతి:- మీరే మంటారు ?

పెట్టుబడి:- నేనూ అదే మంచిమార్గ మనుకుంటా.

శాంతి:- పోనీ తమ్ముడూ, నువ్వు చెప్పు ?

సైంటి:- చెప్తా—కాస్త టీ త్రాగనీ.

శాంతి:- ఒరే ! (బోయ్ వచ్చాడు) టీ పట్రా.

సైంటి:- టీ వచ్చేలోగా మీ రందరూ ఒక్కసారిగా వూహించి చెప్పండి—నేనేం కనిపెట్టి వుంటానో ?

శాంతి:- ఏముంటుంది ? యుద్ధం చేయాలనే వెధవాలోచనే మనుషులకు రాకుండా ఒక మందు కనిపెట్టి వుంటావు, అంతేనా ?

(పిచ్చివాడు పెద్దగా నవ్వాడు)

పెట్టుబడి:- అదికాదు.

పిచ్చి:- ఆఁ, ఏదికాదు ? చీకటబజారు యింకా చీకటి అయ్యే సాధనం కనిపెట్టి వుంటాడనేనా ?

పెట్టుబడి:- అదికాదు !

పిచ్చి:- మరింకేది ? రూపాయలు పిల్లలు పెట్టే యింజక్షన్ ?

పెట్టుబడి:- అదంతా కాదు ! ఎప్పుడూ సమ్మెలు చేస్తూండే వెధవల కొక మత్తు మందు కనిపెట్టి ఉంటాడు !

(బోయ్ టీ తెచ్చాడు)

పిచ్చి:- ఒరే! అయ్యగారు యిన్ని రోజులు ఈ గదిలో కూర్చొని ఏం కనిపెట్టి వుంటార్లో నువ్వు చెప్పరా !

బోయ్:- నాకేం తెలుస్తుంది సార్ ! ఏదో అందరికీ కూడూ, గుడ్డా పెట్టే యిదానం ఏదైనా కనిపెట్టి వుంటారు.

(పిచ్చివాడు పెద్దగా నవ్వాడు. బోయ్ వెళ్ళాడు.)

సైంటిః- (టీ తాగుతూ ఇటూ అటూ పచారుచేస్తూ) మీరూ వాడూ వూహించిందంతా వట్టిది. నేను కనిపెట్టిందంత తేలికైంది కాదు. మీరు కాదు, ప్రపంచంలోని గొప్ప గొప్ప బుర్రలు కూడా వూహించుకోలేవు.

పెట్టుబడిః- నేను చెప్తా - చావులేనిమందు అమృతం.

సైంటిః- కాదు. అమృతమే కనిపెడితే ఘోరమై పోతుంది ప్రపంచం. యుద్ధాలకు యెడ తెరిపే ఉండదు.

శాంతిః- అదేదో నువ్వు చెప్పరా, తమ్ముడూ !

సైంటిః- చెప్తా వినండి.

(టీ ముగించి ఉపన్యాసం పోజులో)

పిచ్చిః- సైలెన్స్ !

సైంటిః- నాకు రహస్యాలను రహస్యాలుగా ఉంచటమే యిష్టం. చెప్పకుండా ఉండడం మేలైనమతం. అసలు యిటువంటివాటి విజయమంతా రహస్యంగా ఉంచటంలోనే ఉంది. నేనీ పరిశోధన చేస్తూ నాకు తప్ప మరెవ్వరికి తెలియరాదని చెప్పగూడదనే చెప్పలేదు. అయినా యిప్పుడు మీ రందరూ చేరడం, నా విజయాన్ని గురించి ఇంతగా ఆనందించడంవల్ల చెప్పాలనిపిస్తుంది. ఒక చిన్న ముక్కలో చెప్పాలంటే నే నీరోజు మన యుద్ధచరిత్రలో ఒక మహా విప్లవం తెచ్చాను.

శాంతిః- అంటే యుద్ధాన్ని పూర్తిగా రూపుమాపడమే గదూ, తమ్ముడూ!

పిచ్చిః- ఉండండి ! అతన్నే చెప్పనీండి.

శాంతిః- యుద్ధాన్ని రూపుమాపడ మనేది కేవలం అసంభవం.

పిచ్చిః- అసంభవం అన్నది యేమోగాని అనవసరం మాత్రం కాదు.

పెట్టుబడిః- అవసరమైతే అసంభవమవటానికి వీల్లేదు. కాని అది అసంభవం కనక అనవసరం.

సైంటిః- చాలా బాగా అన్నారు.

శాంతిః- తమ్ముడూ ! ఏమిటన్నావు ? యుద్ధాన్ని రూపుమాపడం అనవసరమా ? నాకు జీవితంలో అంతకన్నా చాలా అవసరమైంది,

ముఖ్యమైంది వేరే కనిపించటం లేదు తమ్ముడూ ! ఆయనకేం ? యుద్ధం ఆయన్నేమీ బాధించలేదు. పైగా అతనికి డబ్బును కురిపిస్తుంది. కాని నాలాంటి సామాన్య స్త్రీ ఎలా బాధపడుతుందో తెలుసా మీకు ? యుద్ధానికి పూర్వం నా యిల్లు ఎంతో ప్రేమించే భర్తతో అల్లారుముద్దుగా పెంచిన కొడుకుతో ఎంత కళ కళ లాడుతూండేదీ? యుద్ధం ముగిసేటప్పకి అవేవీ లేవు - అంతా శూన్యం. అంతా నాశనం - కొడుకు పోయాడన్న చింతతో గుండెపగిలి పోయారాయన.

సైంటీ:- అదే సెంటిమెంట్ ! అదే మోస్టు అన్ సైంటిఫిక్ ఫీలింగ్. యుద్ధం వల్ల నువ్వు కొంత నష్టపడ్డావు నువ్వే కాదు; ఎందరో నష్టపడ్డారు. ఎందుచేత ? యుద్ధం చేయటంలో - అంటే యుద్ధపరికరాల్లో మనం చాలా వెనుకబడివున్నాం. యుద్ధం ఈ నాటికన్నా ఇంకా భయంకరంగా కావాలి.

శాంతి:- ఓ, తమ్ముడూ ! ఇంకా భయంకరంగానా ?

సైంటీ:- అక్కయ్యా, సరిగ్గా విను. నా పాయింటు నువ్వు గ్రహించటం లేదు. ఎన్నో యుగయుగాలుగా బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీ లాంటివాళ్లు యుద్ధాలు మానండ్రరా అని ఎలుగెత్తి అరుస్తున్నారా. ఏం ? చెప్పు.

శాంతి:- అరుస్తున్నారు. కాని, ఏం లాభం?

సైంటీ:- కాని యెందువల్ల మానలేకుండా వున్నారు?

పెట్టుబడి:- అది మానవసహజం కనుక. భోజనం మానేమంటే ఎలా మానేస్తాం?

పిచ్చి:- ఎందుకు మానేయకూడదు ! మెదడుండి ఆలోచించటం మానేయడం లేదూ ?

సైంటీ:- అది కేవలం అసంభవం. నీతి ప్రబోధాలవల్ల యుద్ధాలు ఆగవు కనుక ఇక మిగిలిందొకటే దారి. ఏమిటది తెలుసా ? చిన్న ఉదాహరణతో చెప్తా ! చేతులు కాల్తాయని ఒకసారి అనుభవమైన తర్వాత ఎవరన్నా నిప్పుజోలి కెళ్తారూ ?

పెట్టుబడి:- చాలా గొప్ప సత్యం.

సైంటి - అలాగే యుద్ధంకూడా అతి భయంకరంగా, మళ్ళా దాని జోలికి రానట్లుగా తయారుకావాలి. అంటే యేమిటి? ఇప్పుడున్న వాటికంటే గొప్ప మారణాయుధాలు తయారుకావాలి. గడచిన యుద్ధం అయిదు సంవత్సరాలు జరిగింది. అది తలచుకుంటేనే నాకు సిగ్గేస్తుంది. మనం యింకా కొండజాతుల దశలో వున్నామన్నమాట. శాస్త్రీయ విజ్ఞానం కలిగిన ఈ యుగంలో కూడా యుద్ధం అయిదేళ్లు జరగడం హాస్యాస్పదం. ఒక్కరోజులో ముగించి వుండాలి.

పెట్టుబడి:- నాన్ సెన్స్! అప్పుడు యుద్ధంలో మజా యేముంటుంది?

పిచ్చి:- మజాలేదు. నల్లబజారులేందే మజా యేముంటుంది? జనం కొన్ని సంవత్సరాలపాటు తిండికీ, బట్టకూ కరువెత్తిపోకుంటే మజా యేముంటుంది?

సైంటి:- అలాకాదు. ఆ మజాలన్నీ లేకుండాపోవు. ఇప్పుడు 5 సంవత్సరాలలో జరిగేదంతా అప్పుడు ఒక రోజులోనే జరుగుతుంది.

శాంతి:- ఇప్పటిలాగే ఇంతజనం చచ్చిపోతారా తమ్ముడూ!

సైంటి:- నేనిప్పుడు కనిపెట్టింది ఆ ఆటంబాంబుకన్న చాల తీవ్రమైంది. దీన్ని విసిరితే రెండు ఆఫ్రికాలను, ఒక అమెరికాను నాశనం చేయవచ్చు. దీని గాలి సోకినంతదూరం, దీని శబ్దం ప్రాకినంతవరకు, మానవులు మానవులేకారు; సకల చేతనా చేతనాలు మసి అయిపోతాయి. ఆ ప్రదేశంలో ఇక ఏలాంటి సృష్టి జరగదు. మనం మన ఇష్టప్రకారం కావలసిన సృష్టి అక్కడికి దింపుకోవలసిందే. మనుష్యులు, మనుష్యులకు సంబంధించిన స్థిరచరాస్తులు, ఆలోచనలు, అభిప్రాయాలు, విజ్ఞానం అన్నీ నాశనమైపోతాయి. సైన్సు ఇంత మహత్తర ఆయుధాన్ని ప్రసాదించబోదు. మానవ విజ్ఞానానికి మకుటమణి. ప్రకృతి శాసకుడుగా మానవుడు పొందే అంతిమ విజయం ఇది.

[శాంతి వెర్రికేకవేసి కూలిపోతోంది]

సైంటి:- వట్టి ఫీమేల్సు! ఒక సెంటిమెంటల్ ఫీమేల్! నాన్ సెన్స్!

**పిచ్చి:** నువ్వు ప్రపంచాన్ని ఉద్ధరించడానికి వచ్చిన దేవతవు. సర్వ విధ్వంసనానికి కాలికి గజ్జెకట్టిన పరమశివుడవు. అవునా? ముందా మెకు పరిచర్య చేయి.

**సైంటిస్:-** (కాసిని నీళ్ళు ఆమె ముఖాన చల్లి) అక్కయ్యా! అక్కయ్యా!

**శాంతి:-** తమ్ముడూ! సత్యం నీకు జ్ఞాపకం లేదూ?

**సైంటిస్:-** జ్ఞాపకం లేకేం?

**శాంతి:-** నాకంటే నీవు ఎంతో ముద్దుగా పెంచావు.

**సైంటిస్:-** అవును.

**శాంతి:-** యుద్ధం ప్రారంభమయ్యేటప్పటికి వాడికి నూనూగు మీసాలు వస్తున్నాయి. ఆ నిమ్మపండులాంటి రంగు నిగనిగలాడుతూంటే, ఆ కోటేరులాంటి ముక్కు - కోలకళ్లు - ఇంకా నాకు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నాడు. యుద్ధానికి వెళ్ళాడు. ఎందుకు వెళ్ళాడో తనకే తెలియదు-ఎందు కీ యుద్ధమో, ఎవరెవరికో, వాళ్ళకు-తనకు ఏమి వైరమో ఏమీ తెలియదు-వెళ్ళాడు; చచ్చిపోయాడు. అందరూ ఏదో ఒకనాడు చావక తప్పదు. నాకు తెలుసు. కాని ఈ చావు అలాంటిది కాదు. కొందరు తమ బ్రతుకు తాము బ్రతికిచస్తారు. కొందరు ఇతరులకోసం, ప్రపంచంకోసం, ఏదో మహత్తర కార్యంకోసం చస్తారు. సత్యానికి అలాంటి దేదీలేదు. అనవసరంగా అసహ్యంగా అయ్యో అనేవాళ్లలేక చివరికి దహనం చేసేవాళ్ల లేక కుళ్ళి కుళ్ళి... (ఇక చెప్పలేకపోయింది.)

**పిచ్చి:-** చచ్చిపోయినందుకు సంతోషించు, చస్తే బాధలేదు నా పెద్దకొడుకు యుద్ధానికి వెళ్ళాడు. రెండు కళ్ళూ పోయినాయి. ఒక కాలు పోయింది. నా చిన్నకొడుక్కు అప్పుడే పెళ్ళిచేశాను. యుద్ధానికి వెళ్ళాడు. చాలా అందంగా ఉంటాడు. వాడికి తగ్గటే వాడి పెళ్ళాం రంభ. యుద్ధంలో వాడు చచ్చిపోయివుంటే నాకేడుపు లేదు. తిరిగి వచ్చాడు. ఇప్పుడాపసికందుల దుఃఖం చూడలేకున్నా. ముక్కు-మొహం అంతా పోయింది. రెండు చేతులూ పోయినయి. ఆ దాంపత్యం ఎంత నరకంగా వుంటుందో ఆలోచించండి. (బోరుమని ఏడుస్తున్నాడు.)

సైంటి:- నాన్ సెన్స్! మీరు చాలా సంకుచితంగా ఆలోచిస్తున్నారు. స్వార్థాన్ని ముందు పెట్టుకొని చూస్తున్నారు మీకు విశాల దృక్పథమే లేదు.

పెట్టుబడి:- అవును కేవలం బావిలో కప్పలు.

శాంతి:- నువ్వెప్పుడైనా యుద్ధాని కెళ్ళావా?

పెట్టుబడి:- లేదు.

పిచ్చి:- నీ కొడుకు వెళ్ళాడా?

పెట్టుబడి:- లేదు.

పిచ్చి:- నీ కూతురు ముండమోసిందా ?

పెట్టుబడి:- నేను వార్ కాంట్రాక్టులు తీశాను; యుద్ధానికివెళ్ళేవాళ్ళను చూచాను- నా కొడుకు డాక్టరు.

పిచ్చి:- యుద్ధంలో పనిచేశాడా ?

పెట్టుబడి:- లేదు. ఇక్కడే యుద్ధానికి వెళ్ళేవాళ్ళను పరీక్షించి పంపేవాడు. నేను వార్ హాస్పిటళ్ళకు ఆహారం సప్లయి చేశాను. గాయపడ్డ సోల్జర్ల నెందరినో చూచాను.

శాంతి.- మద్రాసులో బాంబులు పడుతూన్నప్పుడు నువ్వు అక్కడ ఉన్నావా?

పెట్టుబడి:- లేదు. మావూరు వెళ్ళాను.

శాంతి:- భయంచేతనే కదూ ?

పెట్టుబడి:- ఆఁ వూరికే రెష్టుకోసం.

పిచ్చి:- అబద్ధం.

పెట్టుబడి:- అయితే అయింది. హల్లో ప్రొఫెసర్! నేను కేవలం వ్యాపారరీత్యా వచ్చాను. యుద్ధం మంచి చెడ్డలను తర్కించటానికి కాదు. నేనేం కాలేజీ స్టూడెంటుని కాను, అటువంటి వివాదం పడటానికి. మీరు చెప్పండి. మీ పరిశోధన సర్వహక్కులు ఎంతకిస్తారు ? వెంటనే చెక్కు పంపుతా!

సైంటి:- ఛీఛా!

పెట్టుబడి:- ఏం ?

సైంటి:- నేను, ముందు మన గవర్నమెంటు నేనుకోరే పారితోషకం ఇవ్వకుంటే, వేరే ఇంకో గవర్నమెంటుకై నాసరే ఇస్తాను.

పెట్టుబడి:- ఇదుగో, నామాట వినండి. గవర్నమెంటుతో మీరు అవస్థలు పడలేరు. ఆ బాధంతా మీకక్కరలేదు. హాయిగా మీరు కోరినంత డబ్బు ఇస్తాను. ఇంకా మా సైన్సు అకాడమీ ఆధ్వర్యాన మీకు పెద్ద బిరుదులు కూడా ఇప్పిస్తాను. మీ పేరిట ఒక యుద్ధబాధిత సహాయ నిధి ఏర్పాటు చేస్తాను. అనామక శిశు రక్షణాలయంలో రోజూ మీ పేరిట పాలు పోయిస్తాను. ఇంకా...

పిచ్చి:- ఇల్లంతా ఇనప్పెట్టెగా మారుస్తాను. చలవరాయి మేడలో బంగారు పూలు పొదుగుతుంటాను. ఇంకా ఒక్క ఆడుగుమందం బొజ్జ పెంచుతాను.

శాంతి:- ఇంకా కొందరిల్లాళ్ళని వెధవలు చేస్తాను. తల్లుల కడుపుల్లో చిచ్చు పెడతాను. పసిజీవితాలను చిదిమేస్తాను. పచ్చి కసాయి వ్యాపారం చేస్తాను.

పెట్టుబడి:- నాన్‌సెన్స్! మీరు ఇస్తారా ఇవ్వరా?

శాంతి:- తమ్ముడూ! నీ పరిశోధనను అడుగంట ధ్వంసం చేస్తావా లేదా?

సైంటి:- శాంతీ !

శాంతి:- అవును! ఈ రాక్షసవిజ్ఞానం నాశనం చేయాలి !

సైంటి:- విజ్ఞానాన్ని నాశనం చేయడమే రాక్షసత్వం.

శాంతి:- తమ్ముడూ! ఇది విజ్ఞానం కాదు. మానవుని జీవితాన్ని సుఖప్రదం చేసేదే విజ్ఞానం. మానవుని ఆయుర్దాయాన్ని పెంచేదే విజ్ఞానం.

పిచ్చి:- ఆకలి, శోకం లేకుండా చేసేదే విజ్ఞానం.

సైంటి:- అదీ విజ్ఞానం కావచ్చుకాని ఇది విజ్ఞానం కాకపోదు.

పెట్టుబడి:- పోషించేవాడూ దేవుడే-నాశనం చేసేవాడూ దేవుడే!

శాంతి:- ఛీ! దేవుడ్ని కూడా ఎందుకు దోపిడీ చేయాలని చూస్తావు ?

పిచ్చి:- అసలు దేవుడు లేకుంటే వీళ్ళదోపిడి సాగనేసాగదు.

శాంతి:- తమ్ముడూ అంతా నాశనం చేసేయి. నువ్వు కనిపెట్టిందంతా మరిచిపో! నీ మేధస్సును మంచి మార్గానికి త్రిప్పు.

సైంటి:- అసంభవం! ఇన్నాళ్ళ నా కష్టాన్ని చేతులారా నాశనం చేయటం అసంభవం. సైన్సు చరిత్రలో నాకు రానున్న అగ్రస్థానాన్ని నేను వదులుకోలేను.

శాంతి:- నాశనం చేయవూ ?

సైంటి:- చేయను.

శాంతి:- చేయవూ ?

సైంటి:- నన్ను బెదిరించకు శాంతీ!

శాంతి:- ఐతే నేనే ధ్వంసం చేస్తా (అక్కడున్న రిటార్టూ, టెస్టు ట్యూబులు అన్నీ క్రిందకి తోసేసింది.)

సైంటి:- శాంతీ ! (పెద్దగా నవ్వాడు) ఎంత పిచ్చిదానివి శాంతీ ! అందులో ఏముంది? అవి నాశనంచేస్తే విజ్ఞానం నాశనమౌతుందా ? ఇదుగో - అంతా యీ మెదడులో వుంది. నువ్వింగదంతా ధ్వంసం చేసేసై. ఏం పర్వాలేదు, — రాండీ సేట్‌గారూ, రాండి, వెళ్దాం—పిచ్చి పిల్ల ! తృప్తిపడనీ, యీ గ్లాసు ముక్కలతో—— (పెద్దగా నవ్వుతూ పోతుంటారు - పిచ్చివాడు టేబిల్ మీదవున్న బాకు శాంతి చేతికిస్తాడు-ఒక్క క్షణం తటపటాయించి వెనకాలనే వెళ్ళి - సైంటిస్టుని పొడిచేస్తుంది. సైంటిస్టు కూలిపోతాడు. పెట్టుబడి దారు పారిపోతాడు. శాంతి విచారంగా 'తమ్ముడూ' అని అతని మీద వాలింది.)

[ తెర పడింది ]



# పాత్రలు

| | | | |
|---|---|---|---|
| పురుషోత్తం | గృహస్థుడు | వయస్సు | 55 |
| రాము | పురుషోత్తం కొడుకు | ,, | 16 |
| అచ్యుతం | మేనల్లుడు | ,, | 50 |
| వెంకటరమణ | బంధువు | ,, | 40 |
| శతభిషం | వంటవాడు | ,, | 30 |

[తెరవెనక పాత్రలు: అంట్లు తోమేవాడు, కాయగూరలమ్మేవాడు ]

పురుషోత్తం యిల్లు. ఎదురుగా కిటికీలోంచి దూరంగా మర్రిచెట్టు కనిపిస్తూ వుంటుంది. ఒకప్రక్కగా డెస్కు. డెస్కుపై ఏవో కాగితాలు - ఒక మామూలు కుర్చీ, రెండు యీజీచైర్లు వుంటాయి. రాముడు, కృష్ణుడు యిత్యాదుల ఫోటోలు గోడకు తగిలించి వుంటాయి. ఒక డ్రాయరు. డ్రాయరు మీద భాగవతపు బైండు వుంటుంది. పురుషోత్తం విసుగుదలగా పచార్లు చేస్తూ వుంటాడు.

పురుషోత్తం:-నీ యిష్టం వచ్చినట్లు సాగుతుందనుకున్నావ్! ఒక్క క్షణం కూడ ఇంట్లో వుండటానికి వీల్లేదు. నేను మాట అననే అనను. అన్నానా అంతే.

(రాము ప్రవేశిస్తాడు)

పురు:- ఒరే రామూ !

రాము:- (వెనక్కి తిరుగుతాడు)

పురు:- మీ అమ్మ ప్రయాణమవుతోందా ?

రాము:- తెలీదు.

పురు:- తెలుసుకోవలసిన బాధ్యత నీకుందంటావా ?

రాము:- అదీ తెలీదు.

పురు:- నీ వెక్కడికి వెళుతున్నావ్ !

రాము:- వీధిలోకి.

పురు:- ఎందుకు ?

రాము:- బండికోసం.

పురు:- (బిగ్గరగా) ఎవరు తీసుకు రమ్మన్నారు ?

రాము:- అమ్మే.

పురు:- ప్రయాణం కాలేదని చెప్పావుగా ?

రాము:- ప్రయాణం అనే ప్రయత్నం అమ్మ ఏమీ చేయడం లేదు కాబట్టి.

పురు:- మరి బండి ఎందుకు ?

రాము:- ఫలానా అందుకని అమ్మ చెప్పలేదు.

పురు:- అమ్మ చెప్పలేదు... నేను చెపుతున్నానురా... ఆమె తన పుట్టింటికి వెళ్ళడానికి. జన్మజన్మానా భర్తా బిడ్డలు వున్నారనే జ్ఞప్తి లేకుండా వుండటానికి. అర్ధంలేని స్వాతంత్ర్యాన్ని కోరే ఆడదాని దుర్గతికి ఆదర్శప్రాయంగా నిలవడానికి. చెప్పానుగా... తిరిగి వెళ్ళు... అవల వీధిలోవున్న అమ్మగారింటికి అర్ధ రూపాయి తగలేసి, ఐటా్కలు, కార్లు కట్టించిపంపే జమీందారు ఇక్కడపడి యేడ్వటం లేదని చెప్పు.

రాము:- ఆ డబ్బులు తాతగారే యిస్తారులే నాన్నా!

పురు:- అలాకూ్కడా వీల్లేదు.

రాము:- మరి ఎలా వెళుతుందండి?

పురు:- నీకు కళ్ళులేవురా? ఆమెకు కాళ్ళున్నాయి. ఆమె ఈ చావిడిలోంచి వీధిలోనికి బయలుదేరుతుందేమో. అదికూడా జరగడానికి వీల్లేదు.

రాము:- ఎలా వెళ్ళమన్నారు?

పురు:- మనిషిలా కాళ్ళతో నడచి. వెధవప్రశ్నలు నువ్వూ. దొడ్డిగుమ్మ ముందిగా, అదారిని పొమ్మను.

(రాము రెండడుగులు వేస్తాడు.)

పురు:- ఒరేయ్! వెళ్ళేటప్పుడు నాతో మాట్లాడాలని ప్రయత్నిస్తుందేమో ! ప్రయత్నం చేస్తుందంటావా?... వద్దని చెప్పు.

రాము:- సరే !

పురు:- సరే అంటే చెప్పవా? ఏమిటి? వినదేమిట్రా?

రాము:- వింటుంది. తప్పకుండా చెపుతాను.

పురు:- ఏడిశావ్‌లే! చెప్పొద్దని నే నంటానని నీ వనుకుంటున్నావా? తప్ప కుండా చెప్పు

రాము:- చెపుతాలెండి.

పురు:- ఆమె చెప్పొద్దన్నా చెప్పాలి.

రాము:- అమ్మ చెప్పొద్దనదు చెప్పిన తరువాత తప్పకుండా వింటుంది.

పుర:- తప్పకుండా వింటుంది...వినమను. జాగ్రత్తగా వినమను. అదే నాకు కావాలి. వెళ్ళు!
(రాము లోపలికి వెళతాడు పురుషోత్తం అటు, ఇటు పచార్లుచేస్తూ వుంటాడు. లోపలినుండి శతభిషం వస్తాడు.)

శత:- అమ్మగారూ!

పురు.- (వెనక్కి తిరగకుండానే) పిలుస్తోందా ? నేను రావడానికి వీల్లేదని దానితో, ఈ జిహ్వతో... ఈ జన్మలో మాట్లాడనని...

శత:- కాదండి.

పురు:- (వెనక్కి తిరిగి) ఏమిటి ?

శత:- పిల్లల్ని...

పురు:- తీసుకువెడతానంటుందా ?

శత:- అదీ కాదండి.

పురు:- ఏమిట్రా ?

శత:- మీ యిష్టమయితే...

పురు:- తీసుకువెళతానంటుంది. అంతేగా ?

శత:- (బిగ్గరగా) బాబుగారూ ! (నెమ్మదిగా) మీ యిష్టమయితే ఇక్కడ వుంటానన్నారండి.

పురు:- అదీ... అలా అంటుంది. దానికితెలీదు, వీడు మొండి ఘటమని.

శత:- (వెడుతూ తిరిగి) అవసరమయితే...

పురు:- పిలవను! పిలవను! చస్తే పిలవను !

శత:- కాఫీకాచి...

పురు:- ఇస్తుందా ? ఊహూ... తాగను, వెళ్ళు, పెందలాడే వెళ్ళిపొమ్మని చెప్పు.

శత:- బేబీ అమ్మగారిని విడిచిపెట్టలేక ఏడుస్తోందండి.

పురు:- ఏడుస్తున్నా సరే, విడిచిపెట్టి ఆగలకువెళ్ళిపొమ్మను. ఏం, వెర్రి వేషాలు వేస్తోందా? పిల్లల మిషతో తను కదలకుండా వుండాలని చూస్తోందా? అలా వీల్లేదు.

శత:- అందు క్కాదండి.

పురు:- ఎందుకురా ? కొండముచ్చిలా మొహం నువ్వూనూ ! వెళ్ళు. ఆ బేబీని ఇలా తీసుకురా ? (శతభిషం వెళుతూ వుంటాడు.)

పురు:- ఒరేయ్ ! ఇల్లారా ! (నెమ్మదిగా) బేబీ బాగా ఏడుస్తోం దేమిటి ?

శత:- అమ్మగారు కూడాను

పురు:- దానిమాట నా కనవసరం. అంతగా బేబీ ఏడుస్తుంటే కడుపారా కాసిన్ని పాలిచ్చి మరీ వెళ్ళమను.
(శతభిషం నవ్వుతూ వెళ్ళిపోతాడు. వీధిలోనుంచి మాటలు విని పిస్తాయి.)

వీధి:- అమ్మగారో !

పురు:- ఎవరు తమరు ?

వీధి:- వంకాయలండి బాబూ!

పురు:- ఎందుకూ ?

వీధి:- అమ్మకానికండి.

పురు:- వూరికే ధారవోస్తావని గాదోయ్ ! ఇప్పుడెందుకంట ?

వీధి:- కూర వండుకోడానికండి.

పురు:- ఉహు... అందుకా (కోపంగా) బుద్ధిలేదూ ! ఇక్కడ అయ్యగా రుంటే అమ్మగారే కావలసి వచ్చిందేమిటి ? నీ వంకాయ లక్కర లేదు; బెంకాయ లక్కరలేదు. అవతలకు పో !

వీధి:- లేత వంకాయలండీ !

పురు:- కబుర్లు ముదురుగా వున్నాయే ! ఒరేయ్ ! నేను మాట అననే అనను. అన్నానంటే ఇక తిరుగులేదు. వెళ్ళిపో !

వీధి:- చిత్తం. (పోవును)

పురు:- (పుస్తకం తిరగవేస్తూ) అమ్మగారట అమ్మగారు. బొమ్మగారున్నూ.

రాము:- (బిక్కముఖంతో లోపలినుండి వస్తాడు) అమ్మే...

పురు:- ఏవమ్మా? (కూర్చుంటాడు)

రాము:- మీ ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకోమంది.

పురు:- దాని ఆరోగ్యం మహా గొప్ప ఆరోగ్యం అయినట్లు, పోతూ పోతూ ఈ ఏడ్పెందుకు? వెళ్ళిపోయిందికదూ ?

రాము:- (తాళం చెవులిస్తూ) తాళం చేతులు మీ కిమ్మంది.

పురు:- దాని తాళంచేతులు నా కెందుకు ? దాని పెట్టి, బీరువా నేను ముట్టుకుంటానా ? జన్మలో ఆ పని జరగదని చెప్పు.

రాము:- అవన్నీ మీవేననీ, అమ్మకీ యింటిలో గడ్డిపరక కూడా లేదని, తనదంటూ ఏమన్నా వుంటే అవి ఏనాడో మీవిగా భావించాననీ, చెప్పమంది.

పురు:- (లేస్తాడు) అందీ ! భేషుగ్గా అంది ! అలా అంది- నాకు నచ్చింది. తానుకూడా ఒప్పుకుందిగా ! అదే కావాలి. ఏనాడైనా 'నా' అనే పరిస్థితిలో నా నట్టింట కాలు పెట్టిందంటే చూస్తాను... ఒరేయ్ ! రామూ! నువ్వు వింటున్నావ్‌గా — అది మీ అమ్మ...నేను మీ నాన్నను—కాదు...ఇక అది మీ అమ్మకాదు, అందుచేతనే వెళ్లిపోతుంది.

రాము:- మీరు వెళ్లిపొమ్మన్నారు.

పురు :- నన్నెదిరిస్తే వెళ్ళమంటానా? పీపు చిట్లగొడతానా?

రాము:- అమ్మ ఏమెదిరించింది నాన్నా ?

పురు :- ఎదిరింపులంకేం కావాలిరా? నేను మగాణ్ణి, అది ఆడది. సృష్టిలో భగవంతుడే పెట్టాడుగా ఈ విచక్షణ. కాస్త అణిగి మణిగి వుండ నక్కర్లేదూ ? ఏమిటంటే ఏమిటి? ఇదట్రా వరస? సావిత్రి, సీతా, అనసూయ ఈలాగే చేశారా కాపురాలు? యముడు సావిత్రిని 'పో! పొమ్మ'ని పొలికేకలు వేస్తే చచ్చిపోయిన భర్త శరీరాన్ని పట్టుకు విడిచిపెట్టిందా? 'నువ్వు చస్తావ్, వనవాసం చెయ్యలే'వని రాముడు 'వద్దు! మొర్రో' అంటే వినిపించుకుందట్రా సీత? ఆడవాళ్లు అంటే వాళ్లు. ఇదీవుంది. వెళ్లిపోయింది కదూ?

రాము:- వెళ్ళలేదు.

పురు :- ఇంకా వెళ్లలేదూ! తక్షణం వెళ్లిపొమ్మని చెప్పు. ఆఖరిసారి నాతో అవతలకు గెంటించుకుందామని చూస్తుందేమో! ఆ మర్యాదకాస్త జరక్కముందే కాలు కదపమను. (రాము లోనికి వెళతాడు.)

వీధి :- అమ్మగారో!

పురు :- వీడెవడు?

వీధి :- అంట్లు.

పురు :- అమ్మకానికేనా? ఏ మంట్లు? మల్లంట్లా? మామిడంట్లా?

వీధి :- అంట్లు తోముతానండి బావ్, మా ఆడదీయాల వూట్టం పడ్డాదండి.

పురు :- (కూర్చుని పుస్తకం చూస్తూ) అలాగా! తోమేవన్నీ అమ్మగారంట్లేనా. ఇక అయ్యగారివేమీ లేవన్నమాట?

వీధి :- ఓటండిబావ్! అలాదరియి తోముతా!

పురు :- అయితే అమ్మగార్నే పిలవడమెందుకు ?

వీధి :- అనవాట బావ్.

పురు :- గ్రహపాటురా? వెళ్ళు...ఇప్పుడేమీ ఖాళీలేదు. కాస్సేపుండిరా.

వీధి :- ఆ యీాది తిరిగొచ్చినానంటే, ఆకాశంమీదికి పొద్దెక్కి పోతాది బావ్.

పురు :- (కేస్తాడు) ఆకాశంమీద పొద్దెక్కకపోతే, నీ నెత్తిమీద ఎక్కుతుందా? ఒరే! అట్టే వాగక అవలికి పో.

వీధి :- ఏంటయ్యో! ఏదప్ప గిద్పు అంటున్నావ్!

పురు :- ఏమనా లేమిటి?

వీధి :- మరేదా, గిరేదా చూసుకు మాటాడాలి.

పురు :- పో!పో! అట్టే వెధవ కబుర్లు చెప్పక.

వీధి :- మాటలొగ్గేత్తున్నావ్, జాగరత.

పురు :- ఏమిట్రా! ఎర్రబడి చూస్తున్నావ్! ఏం, ఏమన్నా చేస్తావా ఏం? అయినా నీతో నాకెందుకు వెళ్లిపో, అందరికీ అమ్మగారే.

(వెంటనే శతభిషం లోపలనుంచి వస్తాడు)

పురు :- ఏరా, ఎందుకొచ్చావ్?

శత:- పిల్లలు రావటంలేదండీ!

పురు:- ఈడ్చుకుని లాక్కురా! వెధవ వేషాలు, వాళ్ళూనూ.

శత:- అమ్మగార్ని పట్టుకుని విడిచిపెట్టడం లేందే !

పురు:- ఆ పిల్లలను పట్టుకొని నువ్వు విడిచిపెట్టొద్దు.

శత:- నన్ను మీరు విడిచిపెట్టొద్దు......నాకేం తెలీదు బాబూ! నేను ఏమీ చెప్పలేను. అయ్యగారూ! అమ్మగారితో ఒక్కసారి...

పురు:- మాట్లాడమంటావా? పళ్ళు రాలగొడతాను. మొద్దులా అలా చూస్తావేరా? వెళ్ళి లాక్కురా పిల్లల్ని.

శత:- (ఏడ్పుముఖంతో) చిత్తం (వెళ్ళిపోతాడు)
(రాము లోపలినుంచి వస్తాడు)

రాము:- మీ కోపానికి అర్థముండదు. అమ్మేం తప్పు చేసింది ? ఎందుకు ఇంట్లోంచి వెళ్ళిపోమ్మనాలి ?

పురు:- ఓరి బోడివెధవా! ఏం తప్పులేకుండానే వెళ్ళిపొమ్మంటాను. వెళ్ళి పొమ్మనడానికి నాకు అధికారముందిరా! నన్నెదిరిస్తుందేం? వెళ్ళనని ఒక్కసారనమను చూద్దాం.

రాము:- అంటే ?

పురు:- అనమను చెపుతాను.

రాము:- అమ్మ అలా ఒక్కనాటికీ అనదు.

పురు:- అలా అనమని అంటే, వుండమని నే నంటానని నువ్వు అనుకుంటు న్నావ్. నేను అననే అనను.

రాము:- (ప్రక్కకు చూస్తూ దుఃఖంగా) అదిగో ! అమ్మ వెళ్ళిపోతోంది, పిల్లల్ని విడిచిపెట్టలేక వెళ్ళిపోతోంది. వెనక్కి తిరిగిచూస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూ వెళ్ళిపోతోంది...ఆగమని చెప్పేవారు లేక, ఆపు చేసేవారు లేక అనాధగా వెళ్ళిపోతోంది. (హఠాత్తుగా పురుషోత్తాన్ని

కౌగలించుకొని) నాన్నగారూ! మీరు పిలవండి వస్తుంది. అమ్మ మీమాట కెదురుచెప్పదు. రమ్మంటే వస్తుంది. పొమ్మంటే పోతుంది. అమ్మ అంత మంచి అమ్మ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. (లోపల పిల్లలు 'అమ్మా! అమ్మా!' అని ఏడుస్తుంటారు.)

పురు:- ఏడవండి. మీతోపాటు నేనుకూడా ఏడుస్తాను. కాని మాటతప్పే మనిషిని కాదు. నా జన్మలో మళ్ళీ దాన్ని పిలవను. తిరిగివస్తే (ఆశగా) వస్తుందా?...రాదు...రానివ్వను. నా గుమ్మం ఎక్క నివ్వను. జానకీ, వెళ్ళిపోతున్నావ్‌గా! వెళ్ళిపో. (వెళ్ళి యీజీ చైర్లో కూలబడతాడు.)

రాము:- (బిగ్గరగా) నాన్నా (కుర్చీ దగ్గరగా వెళతాడు)

పురు:- రామూ! పిల్లల్ని వెళ్ళిచూడు. (రాము వెళతాడు)
(అచ్యుతం వీధిలోనుంచి యీజీచైర్ ప్రక్క నిలబడి, తిన్నగా మూలకు వెళ్ళి చూచి తిరిగివచ్చి)

అచ్యు:- మామయ్యా!

పురు:- బాబూ!

అచ్యు:- ఒక ఘనమైన సత్యాన్ని ఈనాటికి సాధించావు.

పురు:- గ్రహించావు కదూ?

అచ్యు:- అహంభావమే గంభీరంగా పోజ్‌చేసే ఆడవాళ్ళ మానసిక తత్వానికి మామయ్య! నీలాంటివాడుండాలి.

పురు:- (ఆనందంగా లేస్తూ) అచ్యుతం! నా తత్వం నీకు తెలుసుగా! నాకు కోపము రానేరాదు...వచ్చిందా, అటో ఇటో తక్షణమే తేలిపోవాలి. ఏమంటావ్?

అచ్యు:- కాదంటానా? అసలు రాముడు అవతారమూర్తి కావడానికి ఆ పట్టుదలేగా కారణం.

పురు:- నిజంగానా?

అచ్యు:- అబద్ధం చెబుతానా మామయ్యా! చాకలాడు ఏదో వాగితే సీతను ఏం చేశాడు? హఠాత్తుగా అవలికి పొమ్మన్నాడు. అంతే. గప్‌చిప్‌గా

కార్యసాధన అయిపోయింది. ఉత్తర రామాయణం ఉత్తమంగా తయారయి పూరుకుంది. అసలు కోపం రానేరాదు. వచ్చిందా? అటో యిటో తేలిపోవాలనే నినాదమే ఆయన ఆశయం కూడాను. చూడు ...అసలు ఆడదనే వస్తువునే సృష్టిలో చాల తేలికైన పదార్థంతో తయారుచేసి విడిచిపెట్టారు! ఎవరు? దేముడు-ఆ దేముడే ఏమి చేశా డంటే, మొగాణ్ణిమట్టుకు నాలుగుపాళ్ళు ఎక్కువచేసి నారీద్వేషిలా తయారుచేశాడు. అసలు సృష్టిలోవుండే రహస్యాన్ని ఏ ఆడది గమ నించదో ఆ ఆడది ఆడదేకాదు.

పురు:- అచ్యుతం! నువ్వు నిజంగా బుద్ధిమంతుడివిరా! అందుకే మీ అమ్మ చచ్చిపోతూ అందిలే, మా వాడు మంచి జాతకుడవుతాడని.

అచ్యు:- (ఆనందంగా) అందీ-అందుకే మామయ్యా! నాకు తెలియకుండా వయస్సు మీరేకొద్దీ వెధవలక్షణాలు నాలో బయలుదేరుతున్నాయ్... అత్తయ్యమీద అంతకోపం దేనికి?

పురు:- అదే అడగొద్దురా అచ్యుతం!

అచ్యు:- ఓహో! అడగాలని అడగలేదు. అసలు అత్తయ్య చాలా మంచి దేగా?

పురు:- కాదంటానా? చాలా మంచిదే. ఆ మంచి తనమనే ఆధారం అయు ధంగా వున్నదని అడ్డమయిన స్వల్ప విషయాలకు స్వాభిమానమే! ...చీర తెచ్చానే అనుకో. ఖరీదు కాస్త ఎక్కువే, కట్టాలంటావా? వద్దంటావా?

అచ్యు:- చచ్చినట్లు కట్టాలి.

పురు:- అది కట్టగా ఆనందించేవాణ్ణి నేను. అందుచేత నా యిష్టప్రకారము అది నడవాలంటావా? దానిష్ట ప్రకారం నేను నడవాలంటావా?

అచ్యు:- అబ్బే, నీ యిష్టప్రకారమే నడవాలి. అసలు ఎందుకొచ్చింది తగువు?

పురు:- అదే అడగొద్దన్నాను. అసలు ఆటువంటి విషయాలు నీవు అడగ కూడదు; నేను చెప్పకూడదు.

(శతభిషం రెండు గ్లాసులతో కాఫీ తీసుకొస్తాడు.)

శత:- పంచదార అంచనా నాకు తెలియదండి, అమ్మగారే వేశేవారు.

పురు:- అదే అనొద్దు. దాని తాతలా నే వేస్తాను. పంచదార డబ్బా యిలా తీసుకురా!

(శతభిషం వెళతాడు.)

పురు:- చూశావ్ అచ్యుతమ్! ఆడదానికి ప్రతి పనిలోను ప్రాముఖ్యత యివ్వడం వల్లనే-పట్టపగ్గాలు లేకపోతున్నాయ్. వంట మనం చేసుకోలేం? కాఫీ మనం కాచుకోలేం? మా శతభిషంలాంటి వంటవాడు ఒక్కడుంటే వూరంతా వడ్డన చెయ్యొచ్చు ఒక పూటలో—

అచ్యు:- ఆడదాని అవసరం లేకుండా మగాడు బ్రతకొచ్చు. మగాడి అవసరం లేకుండా ఆడది బ్రతుక లేదు మామయ్యా!

పురు:- ఒరేయి వెధవా! పంచదార తొందరగా తీసుకురారా! అచ్యుతం, చక్కని మాటన్నావ్.

అచ్యు:- భారతదేశంలో బ్రహ్మచారు లున్నారు కాని, బ్రహ్మచారిణులు వున్నారా?

పురు:- ఏరీ...వెతికి ఒక్కదాన్ని బ్రహ్మచారిణిగా మన మతంలో చూప గలమా? అంతా మగాళ్ళే. భారతంలో భీష్ముడు, రామాయణంలో ఆంజనేయులు.

అచ్యు:- కలియుగములో వివేకానంద, సుభాస్ చంద్రబోస్.

పురు:- ఒరేయ్! కాఫీ చల్లారిపోతోందిరా!

(శతభిషం డబ్బా తీసుకువస్తాడు.)

పురు:- (డబ్బా చూడకుండా చంచాతో పంచదార అనుకొని కాఫీ పొడి కలుపుతూ) రామూ ఏమి చేస్తున్నాడు?

శత:- కాఫీ కావాలని కూర్చున్నాడండి.

పురు:- వాళ్ళకింకా యివ్వలా?

శత:- మళ్ళీ పట్టుకొస్తానండి. (లోపలికి వెళతాడు)

పురు:- అచ్యుతం! వెధవ... కుక్కలాంటివాడు తెలివిలో చిత్రగుప్తుడు గూడా సిగ్గుపడాలి పని చేశాడంటే, పటానికి ఫ్రేమ్ కట్టినట్లుంటుంది.

అచ్యు:- అసలు మీరు కాఫీలో వేసేదేమిటి?

పురు:- పంచదార! (డబ్బాకేసి చూచి) ఒరే వెధవా! పంచదారని కాఫీ పొడి డబ్బా తీసుకొస్తావట్రా? కళ్ళు మూసుకుపోయి పనిచేస్తున్నావా? ఇలారా!

(శతభిషం వస్తాడు.)

పురు:- ఇదేం డబ్బారా?

శత:- పంచదార డబ్బా కూడా అచ్చం ఇలాగే వుంటుందండి.

పురు:- రెండు డబ్బాలు జాయింటు చేస్తే నీ ముఖంలా వుంటుంది. (డబ్బా గిరవాటేసి) వెళ్ళు ... ఈ గ్లాసులుకూడా తీసుకువెళ్ళి కాఫీచేసి తీసుకురా!

(శతభిషం వెళతాడు. పురుషోత్తం నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చుంటాడు.)

పురు:- అబ్బబ్బ! యింత శుద్ధ తెలివితక్కువ వెధవతో నేను కాబట్టి వేగుతున్నా ననుకో—

అచ్యు:- అసలు అత్తయ్యే వాణ్ణి అలా తయారుచేసిందేమో!

పురు:- ఆ! బాగా చెప్పావు. అదే ఆడదానిలోవున్న కిటుకు. తన పనితనం ప్రక్క మగాడికి చెప్పేస్తే; ఇక వాళ్ళ అవసరమే వచ్చి ఏడ్వదని వెధవ అదురు. లేకపోతే కాస్తంత కాఫీలో పంచదార వెయ్యడమే చేతకాలేదంటే...

అచ్యు:- అంతా పొలిటికల్ కుట్ర

పురు:- ఏదో పొయ్యిలో కుట్ర. నా సంసారానికి చాలా ద్రోహం చేసింది అచ్యుతం!

అచ్యు:- ఇక అత్తయ్య అవసరం లేకుండా జాగ్రత్తపడ్డంలోనే నీ తెలివి తేటలున్నాయ్ మామయ్యా!

పురు:- ఒరేయ్! మీ అమ్మ నెరుగుదువుగా?...ఆవిడ స్వయం నా చెల్లెలు... మీ నాన్న ఏంచేసేవాడు? ... ఆగ్రహంవచ్చి అవలకు పొమ్మంటే; హఠాత్తుగా వచ్చి 'నేను అడదాన్ని, నాకు మీరే దైవము, నన్ను చంపినా మీ పాదాలదగ్గరే ప్రాణం విడుస్తాను' అని కాళ్ళు పట్టు కునేది. మీ నాన్న కౌగలించుకొని కన్నీళ్లు తుడిచేవాడు. అదిరా దాంపత్యం. ఆడదంటే మా చెల్లెలే ఆడది. మీ అత్తయ్యను పొమ్మ న్నానే అనుకో. ఒకసారివచ్చి, అహఁ! అది యింట్లో వుండాలని నా వుద్దేశంకాదు. కోరిందంటావా? ఈ పిల్లల గురించికాని... లేకపోతే దానవసరం నాకేమిటి?

(రాముడు వస్తాడు.)

రాము:- నా స్కూలుకు టైమయింది.

పురు:- నీ స్కూలుకేగాని టైమయింది, ఈ భూ ప్రపంచంలో దేనికి కాలేదేమిటి?

రాము:- టిఫిన్ ఏమీ చెయ్యలేదు. కాఫీ యింకా కాచలేదు.

పురు:- ఒరే శతభిషం!

రాము:- చెల్లాయి ఆకలితో ఏడుస్తోంది. బేబీ పాలకోసం బాధ పెడుతోంది.

పురు:- ఒరేయ్! వెధవ శతభిషం' (విసురుగా లోపలికి వెళతాడు)

అచ్యు:- రామూ!

రాము:- (తిరుగుతాడు)

అచ్యు:- ఏమిట్రా ఈ గొడవ?

రాము:- బావా! నేనీ యింట్లో వుండలేను.

అచ్యు:- అదేమిటి?

రాము:- వయస్సు మీరినకొద్దీ నాన్న మరీచెడ్డగా తయారవుతున్నాడు. అమ్మ ఎన్నన్నా మాట్లాడదు. ప్రతి సాధింపును ఎంతో సమానంగా భరిస్తుంది. ఆటకోతిలా చేసి అమ్మను అడిస్తున్నాడు నాన్న.

అచ్యు:- అసలు ఎందుకొచ్చిందిరా?

రాము:- మూడువందల రూపాయలుపెట్టి జరీపువ్వుల సిల్కు చీర తెచ్చాడు రాత్రి...

అచ్యు:- తీసుకొస్తే ?

రాము:- అంత ఖరీదెందుకంది అమ్మ. అంతే. రాత్రి తెల్లవార్లు సాధించాడు. ప్రొద్దున్నే సాగనంపాడు.

అచ్యు:- రోజూ యింతేనా ?

రాము:- రోజూ కేకలు వేసేవాడు. కాని వెళ్ళిపొమ్మని ఎప్పుడూ అనలేదు. ఈ రోజున అలా అన్నాడు. అమ్మ వెళ్ళిపోయింది. ప్రొద్దుటనుంచి కాఫీలేదు.

అచ్యు:- (జేబులో రూపాయితీసి) నువ్వు ఆ ప్రక్క హోటల్‌కు పోయి కాఫీ త్రాగిరా. మీ నాన్నతో నేను మాట్లాడుతాగా—
(అచ్యుతం రూపాయి యిస్తాడు. రాము అది తీసుకొని బయటకు వెళతాడు. లోపలనుంచి పురుషోత్తం వెంటనే వస్తాడు.)

పురు:- ఏమిటి చెపుతున్నాడు వాడు ?

అచ్యు:- ఏదో చెప్పాడు. ఇప్పుడు మీ కెందుకావాలి ?

పురు:- (కూర్చుంటూ) నాక్కాకపోతే, నీక్కావాలా ? అంతా విన్నానులే, నువ్వు చెప్పకపోయినా నాకు గ్రహింపే. ఈ పిల్లల్నికూడా చాడీ కోర్లుగా తయారుచేసింది.

అచ్యు:- అత్తయ్య మహాపెద్దదిగా కనిపిస్తుంది మామయ్యా !

పురు:- నెమ్మదిగా అంటావేమిటి ? వంటవాడి విషయం ఒక్కటి చాలదు ? అంటుతప్పేలాలన్నీ అలాగే వుండిపోయాయి. అచ్చికి రోగం వచ్చిందట, రోగం. వెధవజాతి.

అచ్యు:- ఆడజాతేనా ?

పురు:- నన్ను మళ్ళీ ప్రశ్నించకు.

అచ్యు:- మా అమ్మకూడా ఆడదే మామయ్యా !

పురు:- ఆడదే అయితే ?

అచ్యు:- ఇంట్లోవున్న పిల్లలుకూడా ఆడవాళ్ళే అయ్యారు.

పురు:- నా పిల్లలు ఆడవాళ్ళుకాని, మొగవాళ్ళుకాని నీకెందుకు ?

అచ్యు:- వాళ్ళు అత్తయ్యకు పుట్టినవాళ్ళేగా ?

పురు:- ఏమిట్రా ?

అచ్యు:- ఎవ్వరయినా సరే! జాతివిచక్షణ వచ్చినపుడు ఆడవాళ్ళు ఆడవాళ్ళే, మొగవాళ్ళు మగవాళ్ళే!

పురు:- నీ వుద్దేశం ?

అచ్యు:- ఆడవాళ్ళ విషయంలో మన, పర అనే భేదాలు ఆవలకు నెట్టి, జాతి దౌర్బల్యానికి, దేశహీనతకు, సంసార విచ్ఛిన్నానికి హేతు భూత మైన ఆడజాతినంతా వెలివేసి, మనం! పురుషులం! సర్వశక్తి సంప న్నులం మనమే! ఆడవాళ్ళకు ఆధారం మనమే! దేశానికి, జాతికి, కనీసం సంతానానికి కారణభూతులం మనమే అని బల్ల గుద్దుదాం. బాహ్యంగా వెళ్ళి ప్రచారం చేద్దాం.

పురు:- ఫలితం ?

అచ్యు:- తన్నులు!

పురు:- (కోపంగా) అచ్యుతం ?

అచ్యు:- మామయ్యా !

పురు:- ఎవడ్రా తన్నేది ?

అచ్యు:- ప్రజ... ఇంటిలో కాబట్టి నీ అవకతవక పనులు సరిపోతున్నయ్ వీధిలో ఆడవాళ్ళ యెదురుగా వెళ్ళి ఆ మాటలను చూద్దాం

పురు:- వాళ్ళని అనడానికి నా కేమవసరం ?

అచ్యు:- అత్తయ్య కాబట్టి లోకువా ? భారత, రామాయణ కాలాలనాటి ఆడవాళ్ళ తైపును పుత్రికలో పెట్టుకొని అవలకు తోలుతావా ? అత్తయ్య అమాయకురాలు కాబట్టి సరిపోయింది.

పురు:- లేకపోతే ఎవర్తయితే ఏం చేస్తుందోయ్ ? ఒరేయ్ అచ్యుతం! పెద్ద కబుర్లు చెపుతున్నావ్ కాని, రేప్రొద్దున ఏ ఆడదయినా నీ పెడ్డా మయితే ?

అచ్యు:- నాతో సమానాధికారమిచ్చి సగౌరవంగా చూస్తాను.

పురు:- అప్రాచ్యుడా !

అచ్యు:- ఇంతకాలం అన్యాయంగా ఆడవాళ్ళను అంధకారంలో వుంచిన దానికి ప్రతిఫలంగా వాళ్ళ పాదాలు పట్టుకొని క్షమాభిక్ష కోరుకున్నా పాప మింకా సశేషంగా మిగిలివుంటుంది మనకి.

పురు:- (బిగ్గరగా) అచ్యుతం !

అచ్యు:- ఇప్పటికైనా శాస్త్ర తమాయించి అత్తయ్యను రప్పించడం...

పురు:- మంచిది మామయ్య ! చచ్చు కబుర్లు చెప్పక గౌరవంగా బయటకు వెళ్ళు.

అచ్యు:- నీ పట్టుదల విడిచిపెట్టవన్నమాట.

పురు:- నువ్విక్కడనుంచి వెళ్ళాలి.

అచ్యు:- ఇక్కడ వుండమన్నా ఉండను. కాని...

పురు:- కానిలేదు, అర్ధణాలేదు, కాలు బైటపెట్టు.

అచ్యు- వెళ్ళకపోతే నీవు చేసేదేమిటి ?

పురు:- దౌర్జన్యం సాగిస్తావా ? సరే ! అదీ నేను చూస్తా. (నడుం కదతాడు)

అచ్యు:- ఆడవాళ్ళ మీద చేయుటలేదుగా. (నవ్వి) మామయ్య ! అత్తయ్యను బాధపెట్టడమనేది అర్థంలేని పని. ఆలోచించుకో. వస్తాను.

పురు:- (వెళ్ళే అచ్యుతాన్ని చూస్తూ) ఓరి పిరికిగా ! ఎంతటి వాడివయ్యావ్ ! ఒరే రామా! ఏమిట్రా యింతకుముందు నువ్వు అచ్యుతంగాడితో చెబుతున్నది ?

రాము:- ఏమో జ్ఞాపకములేదు. (లోపలికి వెళతాడు)

పురు:- (వెళ్ళేవాణ్ణి చూస్తూ) ఆ ! పొగరు. ఎంత నిర్లక్ష్యం (అని వెళ్ళి పోతూవుంటే, శతభిషం కాఫీ తెస్తాడు)

పురు:- ఎంత పెందలాడే చచ్చావురా ?

శత:- పచ్చి పుల్లలండి.

పురు:- బొగ్గులు పొయ్యి ఏడ్చిందిగా. దానిమీద తగలెయ్యలేక పోయావ్. (కాఫీ తీసుకుంటాడు)

శత:- కూరలేమీ లేవండి.

పురు:- శకునపక్షివిరా. అది చేయాల్సిందంతా చేసివెళ్ళింది. ఆ మంత్రాం గంలోపడి నువ్వుకూడా మాయముండా కొడుకు వవుతున్నావు. (కాఫీ రుచిచూచి) ఇది ఏ పదార్థమురా ?

శత:- నా కర్థమవటం లేదండి.

పురు:- నీకే అర్థంకావటంలేదు. బాగానే వుంది !

శత:- మీ రన్నమాట అర్థం కావటం లేదండి.

పురు:- నువ్వు ఏడుస్తూ పొయ్యిమీద పెట్టిన (గ్లాసు చూపిస్తూ) ఈ ఆకారం గల పానీయం ఏమిటూ ? అని; వాసనలేదు, రుచిచూస్తే చేదు... వేడిలేదు. తెలియకడుగుతాను, ఇది కాఫీయా ? టీయా ? కోకో ఆ ? ఓవల్‌టిన్నా ? లేక అన్నీ కలిపి చౌచౌగా తయారుచేసిన చావు ద్రావకమా ! (మళ్ళీ త్రాగి) ఛీ ! ఛీ ! దీనిలో ఏదన్నా నాలి ఏరి పొరపాటున నీ చెయ్యి పడవేయలేదుకదా ? ఆహాఁ ! అది చెప్పి వెళ్లిందేమోతే! ఒరేయ్ ఇష్టంలేకపోతే చెప్పేయ్. నా దుంపతెంచి ఇలాంటి పదార్థాలతో నా ప్రాణంమట్టుకు తీయకు.

శత:- రామ! రామ! అవేం మాటలండి?

పురు:- (గ్లాసు చూపుతూ) చూడు, నీ కళ్ళతో నీవే చూడు. యింత నల్లగా యేడ్చిందేం ?

శత:- ఇందాక మీరిచ్చిన కాఫీలో చక్కెరవేసి మళ్ళా కాచానండి.

పురు:- ఓరి శనిగా! అలా ఏడ్వవేం? (గ్లాసు డ్రాయరుమీద పెట్టి ఉసూరు మంటూ కుర్చీలో కూలబడి) తీసుకువెళ్ళురా, కాఫీ తీసుకువెళ్ళు! నీ పేరుమీద ఇవాళ వుపవాసం చేస్తాను.

శత:- మళ్ళీ కాస్తాలెండి.

పురు:- చచ్చారులెండి (లేచి) వెళ్ళేటప్పుడు మీ అమ్మగారు ఏమన్నా చెప్పి వెళ్ళిందా? అబ్బే! ఏమీలేదులే. కాస్త ఇలా ప్రతి పనీ తగలేస్తే; అచ్యుతంగాడు ఏడ్చినట్లు తిరిగివెళ్ళి ఆమె పాదాలు పట్టుకుంటానని.

శత:- అమ్మగార్ని అనుకున్నవారు పాపాన్ని మూటకట్టుకు పోతారండి.

పురు:- నేనే నన్నమాట-అంత దుర్మార్గుణ్ణి. ఒరేయ్! తెలియకడుగుతాను- అది వున్నప్పుడు ఎప్పుడైనా ఇంత అధ్వాన్నంగా తగలేశావా కాఫీ?

శత:- అమ్మగారే అన్నీ పైనుండి చూచేవారండి.

పురు:- నీవు క్రిందనుండి జీతాన్ని కాజేయటానికి ప్రవేశించావనుకుంటాను మా యింట్లో.

శత:- మీ కిష్టం లేకపోతే...

పురు:- వెళ్ళిపోతానంటావా? (ఆలోచిస్తాడు) అబ్బెబ్బె! ఏదో పొరపాటు అయిందనుకో. కాస్త జాగ్రత్తగా పనిచేసుకోవాలిగాని చికాకుపడితే ఎట్లా?

శత:- అమ్మగారు లేకపోతే ఈ యింట్లో ఒక్క క్షణంకూడా వుండలేనండి. అలాంటి అన్నపూర్ణమ్మను కాదని గెంటిస్తే కష్టాలేకాదు, అన్నం కూడా దొరక్క అవస్థపడతారండి.

పురు:- ఏమిటి? అన్నం వండదల్చుకోలేదేమిటీ రోజు?

శత:- అంట్లు అలాగే వున్నాయండి.

పురు:- ఆ అచ్చికి వంట్లో ఏదో రోగ మొచ్చిందంట. దానిమొగుడు పెద్ద మొనగాడిలా వచ్చి...

శత:- వాడుకూడా తోముతాడు కదండి.

పురు:- వళ్ళు మండుతూవుంటే వద్దు పొమ్మన్నాను.

శత:- ఇవాళ కడుపు మండేనండి మనకి.

పురు:- శతభిషం! ఆ అంట్లు...

శత:- అంట్లుతోమేపని నా ప్రాణముండగా నేను చెయ్యను.

పురు:- బంగారంలా నేనే చేస్తాను, చూద్దువుగానిగా—

(కొంతదూరం వెళ్ళేటప్పటికి వీధిలోనుంచి వెంకటరమణ వస్తాడు)

వెంక:- బాబాయ్!

పురు:- (వెనక్కి తిరిగి) వెంకటరమణా ఎంతకాలానికి చూశానురా! అలా నిలబడిపోయావే కొయ్యలా! కూర్చో... నాన్న, అమ్మ అంతా క్షేమమే కదూ!

వెంక:- అంతా క్షేమంగానే వున్నారు బాబాయ్! కాని మా ఆవిడకు కంట్లో నలుసుపడింది బాబాయ్. (కూర్చుంటాడు)

పురు:- ఎంతపని జరిగింది?

వెంక:- బ్రహ్మాండమైన పని. నలుసు పడితే అది వూరుకుందా? దాని యిష్ట మొచ్చినట్టు నలిపింది. కన్నంతా ఎర్రగా అయిపోయింది.

పురు:- తరువాత?

వెంక:- తెల్లవార్లు నిద్రలేకుండా గుడ్డతో ఆవిరిపెట్టాను. మా అమ్మ, నాన్న వచ్చి కోడలికి ఎలావుందో పలకరించాలా, బాబాయ్? నాకు బలే బాధగా తోచిందిలే బాబాయ్!

పురు:- అసలు కన్నెలాగుందిరా?

వెంక:- నా శ్రమ వూరికే పోతుందా? తెల్లవార్లు దానిగురించి నిద్రపోయానా బాబాయ్! పైన భగవంతుడు చూశాడు. తెల్లవారేటప్పటికి కన్ను మామూలుగానే అయిపోయిందిలే.

శత:- మీలాంటివారు వుండే పెళ్ళాలు సుఖపడతారు కాని...

పురు - నువ్వు నోరుమూయ్యవోయ్! (లేస్తాడు)

వెంక:- నిజం బాబాయ్! అతను చెప్పినమాటల్లో అబద్ధంలేదు. యింత ప్రాణంగా చూసుకున్నా, అది అంటుంది 'నన్ను పెళ్ళిచేసుకున్నాక అది మహా కష్టాల్లో పడిపోయిందిట, అసలు అది మంచిదేలే బాబాయ్, పైకి అలా అంటూ వుంటుంది. ఒక్కొక్కసారి పుట్టింటికి వెళ్ళిపోతా నని బలే బెదిరిస్తుందిలే!

పురు:- పొమ్మనలేక పోయావు.

వెంక:- చచ్చిపోనూ! అవి నా కంటికి కనుపించకపోతే. నువ్విలా వెళ్ళావంటే, ఇలా రైల్వు క్రింద తలకాయ పెడతానంటాను. అంతే బాబాయ్ ఖదేరావ్, ఆగిపోతుంది. (లోపలికు చూచి) ఏదీ? చిన్నమ్మ ఎక్కడా కనిపించదేం?

పురు:- వెలుపలుంది.

వెంక:- అయితే బాబాయ్ మన భోజనాలేర్పాటు?

శత:- నే నున్నానండి.

పురు:- ఇప్పుడే వస్తానుండు. (లోపలికి వెళతాడు)

వెంక:- నీ పేరేమిటోయ్?

శత:- శతభిషం.

వెంక:- (నవ్వి) శ...త...భి...షం. మంచి పేరేనోయ్ అయితే మనకు పెళ్ళయిందా?

శత:- లేదండి. దాని గురించే...

వెంక:- అరె! ఇంతమనిషి వున్నావ్...... ఆడది లేకుండా జీవిస్తున్నావా?

శత:- ఏం చెయ్యనండి?

వెంక:- గంతకుతగ్గ బొంత. ఎవ్వరన్నా! చూచుకోవాలి శతభిషం. మా వూరులో ఒక అమ్మాయి వుంది. చేసుకుంటావా? వయస్సుకు పెద్దదనుకో. పేరు అశ్విని. ఇద్దరి పేర్లు నక్షత్రాలే. కాబట్టి తారాబలం బాగుంటుందని తోస్తుంది. ఆమెకూడా వంట బాగానే చేస్తుంది. మెత్తని మనస్సు ఏం చెప్పినా కాదనదు ఆమెను పెండ్లిచేసుకుంటే ఇద్దరూ కలసి భోజనహోటలు పెట్టొచ్చు. ఏమంటావ్?

శత:- ఆమె వయస్సు ఎంత వుంటుందండి?

వెంక:- ఆఁ...ఎంతా? ఒక్కటితక్కువ యాభై. స్థిరమైన మగ దిక్కులేక మహా చికాకు పడుతోంది. చూదమంటే మాట్లాడుతాను (లోపలకు చూచి) బాబాయ్!...

శత:- వస్తారులెండి. అంట్లు తోమడానికి వెళ్ళారు.

వెంక:- ఛీ! ఛీ! బాబాయ్ అంట్లు తోముతున్నాడా?

శత:- ఆడదాన్ని కాదన్నవాళ్ళకు అదేగతి పడుతుందిలెండి!

వెంక:- ఆడదాన్ని కాదనడమేమిటి ?

శత:- మీ చిన్నమ్మగార్ని కోపమొచ్చి పుట్టింటికి పంపేశారుగా !

వెంక:- అరి బాబోయ్ ! వెఌపలఌందని చెప్పావ్. శతభిషం, అసలు ఎందుకు పంపేశాడంటావ్ ? చిన్నమ్మ చాలా మంచిదే.

శత:- ఒళ్లు బలిసి, కళ్లు మూసుకుపోయి !

వెంక:- మా యావిణ్ని నా జన్మలో అలా అంటానా ? అంటే మళ్ళీ నా కంటికి కనిపిస్తుందా ?

(రాముడు లోపలినుంచి వస్తాడు.)

వెంక:- రాముడేనా? కాస్త సాగావే ?

రాము:- ఎప్పుడొచ్చారు?

వెంక:- ఇప్పుడే ఒరే రాముడూ! మన భోజనం ఏర్పాటు ఇవాళ కాస్త కష్టంగా వుండేటట్టుందే... మా ఆవిడ నీకు తెలుసుగదూ! మన భోజనం సంగతి ఆవిడకు తెలుసు. శతభిషం ! కాస్త కడుపులో కంగారు లేచింది. ఏదో మీరంతా కాపాడాలి. ఇలాంటి ఆపద సమయంలో మా ఆవిడ వుంటేనా...

రాము:- కాపాడి, రక్షించేది!

వెంక:- నీక్కూడా తెల్సుగా రాముడూ!

రాము:- అట్టే మాట్లాడకండి.

వెంక:- మా ఆవిడ ఒక్కనాటికి కూడా అలాంటిమాట అనదు. ఇంతకూ మన భోజన ఏర్పాటు ఏమన్నా జరిగేనా?

రాము:- మా అమ్మ యింట్లో లేదు.

వెంక:- శతభిషం ఉన్నాడుగా?

రాము:- వాడి జన్మలో ఏ పనీ కాదు.

వెంక:- కార్యక్రమం ఏమిటి?

రాము:- కాఫీహోటల్లో చూచుకోవడం.

వెంక:- అంతేనా ?

రాము:- యస్.

వెంక:- ఇంగ్లీషు నేర్చుకున్నావ్. మా ఆవిడకూడా వచ్చున్లే నన్ను ఎ. యస్. యస్., యాస్ అని అప్పుడప్పుడు అవసరార్థంగా పిలుస్తూ వుంటుంది.

రాము:- ఏమండోయ్! మీ ఆవిడ్ని గురించి యాకరవు పెట్టమని ఎవ్వరూ ఏడ్వటంలేదు. కావలిస్తే కామ్‌గా కూర్చోండి, కాదంటారా వెళ్ళి పొండి.

వెంక:- మా ఆవిడ ఏ చుట్టాన్నీ ఈ విధంగా మర్యాద చేయలేదు, చేయబోదు, చేయదు.

రాము:- మీ ఆవిడ సంగతి ఎవరి క్కావాలండి?

వెంక:- నాకు, సర్వ ప్రజలకు, ప్రపంచానికి - పరమాత్మ అనే నిర్వికార నిరంజన రూపంలో మా ఆవిడ ఆత్మకూడా ఒక అంశా సంభూతమే.

రాము:- మీరు మాట్లాడక ఊరుకొంటారా, ఊరుకోరా,

వెంక:- భోజనయేర్పాట్లు చేస్తే సరి.

శత :- నేను చేస్తాలెండి.

వెంక:- అయితే కాలకృత్యాలు తీర్చుకువస్తాను. శతభిషం! పెద్ద కాల్వలో నీళ్లు పరిశుభ్రమైనవేనా? రాముడూ! మా ఆవిడుంది చూశావ్, పెద్ద కాలవంటే భలే భయంలే.

రాము:- మీరు వెళతారా ? వెళ్ళరా?

వెంక:- భోజనయేర్పాటు చేస్తానన్నారుగా. వెళ్లి తప్పకుండా మళ్ళీ వస్తాను. (వీధిలోకి వెళతాడు)

రాము:- (వెళ్ళేవాణ్ణి చూస్తూ) తిండిపోతు.

శత :- భగవంతుడిచ్చిన ఆకలి.

రాము:- నీకేమన్నా పెళ్ళాళ పెట్టాడేమిటి?

శత :- పెండ్లామంటే అందరికీ ఆశే గదండి, బాబుగారికి తప్ప.

రాము:- ఏడ్చావులే. ఆ చెల్లాయికిచ్చిన కాఫీ నువ్వు కాచిందేనా ?

శత :- బాబుగారు కాఫీ పౌడరు కలిపిచ్చారు.

రాము:- నవ్వు కాచి పిల్లలమొహాన్ని తగలేశావ్. అదేం తాగనక్కర్లేదూ? దాని బడికి వేళయింది. యేడుస్తూ కూర్చుంది. కాఫీ లేదు, గీఫీలేదు.

శత :- నన్నేం చెయ్యమంటారు ?

రాము:- నిన్ను చెయ్యమనక యెవ్వరిని చెయ్యమంటాను ! ఎందుకున్నావ్ యింట్లో? నాకు స్కూలుకు టైము కావస్తూంది. ఇంతవరకు పొయ్యిమీద పాత్రయెక్కలేదు. వెధవయిల్లు, వెధవ పనులూను.

శత:- అలా అని మీ నాన్నగారిదగ్గర అనండి.

రాము:- అంటే? పోనీ, నేనిలా అన్నానని నువ్వు చెప్పరాదూ ?

శత:- నేను చాడీకోరును కాదండోయ్ !

రాము:- యజమానురాలు ఇంట్లోంచి వెళ్ళిపోతూంటే, ఏడుస్తూ కూర్చునే వాడవు, అంతేగా ?

శత:- అగమంటే బాబుగారితో తగాదా.

రాము:- అందుకాయనకు తాళం వేశావ్. ఇద్దరూ కలిసి అమ్మను సాగ నంపారు.

శత:- రాముగారూ ! అన్యాయంగా మాట్లాడితే పడేవాణ్ణి కాదు.

రాము:- ఇంట్లో అన్యాయం జరుగుతూవుంటే చూస్తూ వూరుకునేవాడివేగా !

శత:- ఏమన్నా అనడానికి నాకేం సంబంధం ?

రాము:- ఏం సంబంధం లేకుండా యింట్లో ఎందుకున్నావ్ ? నువ్వు కాదంటే నాన్నగారు ఆ ధైర్యం చేయగలరా ? ఆ మాత్రం బుద్ధి వుండక్కర్లేదూ ?

శత:- మాటలు జాగ్రత్తగా రానివ్వండి.

రాము:- ఆ మాటన్నావంటే పళ్ళు రాలగొడతాను (మీదకు వెళ్ళబోతాడు.) (పురుషోత్తం లోపలనుంచి వస్తాడు. రాము వెళ్ళిపోతాడు.)

పురు:- ఏమిట్రా పేలుతున్నాడు వాడు?

శత:- ఏమీలేదు.

పురు:- నువ్వు దాస్తేమాత్రం దాగుతుందా? అంతా విన్నాను. అంతా ఏకమై, ఆఖరికి వంటపాత్రలు తోమించే గతికి కూడా తీసుకొచ్చారుగా. ఇక మీ యిష్టం. కానివ్వండి.

శత:- బాబుగారూ ! నేను వంట ప్రారంభించినది లగాయతు యింతవరకు చాలా ఇళ్ళు చూశాను. నాకెన్నో అనుభవాలున్నాయ్. కాని, మీవంటి అనుమానపు మనిషిని, అమ్మగారంత మంచి తల్లిని నేను ఏ కుటుంబములోను చూడలేదు.

పురు:- ఏమంటున్నావ్ ?

శత:- నిజమే చెపుతున్నానండి. వెళ్ళిపోతూ అబద్ధమాడడమెందుకు !

పురు:- వెళ్ళిపోతున్నావా ?

శత:- అవునండి. మొత్తం పదిహేను రోజుల జీతం పడెయ్యండి. ఈ ఇంట్లో వుండను.

పురు:- (కోపంగా) నేను ఒక్క కానీ యివ్వను. (కూర్చుంటాడు) ఇంటిలో ఆడది లేనిసమయంలో ఈ విధంగా దగా చేస్తావా? సరే! నీ యిష్టం, వెళ్ళిపో. ఆపుచేస్తే అడుగుదువుగాని. నేను మాట అననే అనను, అన్నానా అంతే.

శత:- జీతం యివ్వరన్నమాట ?

పురు:- చస్తే చిల్లి కానికూడా యివ్వను.

శత: అది మీకు ధర్మంగావుంటే సరే. (లోపలికి వెళతాడు)
(పురుషోత్తం లోపలకు తీవ్రంగా చూస్తూవుంటాడు. చిరాకుగా మధ్య మధ్య తిరుగుతూ వుంటాడు. తువాలు వేసుకుని చిన్న సూటుకేసుతో శతభిషం వీధివైపుకు వెళ్ళిపోతూ వుంటాడు. పురుషోత్తాం లేస్తాడు.)

పురు:- శతభిషం !

శత:- (తిరిగి చూస్తాడు.)

పురు:- వెళ్ళిపోదుగాని... ఒక్కమాట. నీ డబ్బు నాకక్కరలేదు. అది కూడా వెళ్ళిపోయింది. వెళ్ళిపొమ్మన్నానే అనుకో, తిరిగివస్తే నేను కాదంటానా ? నాకీ యింట్లో అధికారముంది, నేను వెళ్ళనంటే నేను నోరెత్తుతానా ? అది యిప్పుడూ రావాలని నేను అనడం లేదు.

శత:- అమ్మగారు తనకుతానై ఎప్పుడూ రాదు. ఇన్ని సంవత్సరాలు అమ్మ గారితో వుండి ఆవిడ గుణమేమిటో మీరు తెలుసుకోలేక పోయారు. అలాంటి ఆవిడతో కాపురం చేయించుకోవడం చేతగాని మీకు లోకంలో సుఖంగా బ్రతకడం గూడా చేతగాదన్నమాట నిజం... వెళతానండి.

పురు:- వెళతావా ? నే వెళ్ళనివ్వను.

శత:- ఒక్క నిముషంగూడా ఈ ఇంట్లో వుండను.

పురు:- ఎలా వెళతావో నేనూ చూస్తాగా ! (సూటుకేసు లాగుతాడు)

శత:- నా కిష్టంలేనప్పుడు నన్నాపు చెయ్యడానికి మీరెవరు ?

పురు:- నీ యజమానిని నేనే

శత:- పుస్తికట్టిన పెళ్ళాన్నికాదు.

పురు:- నిన్ను నమ్ముకొని దాన్నికూడా విడిచిపెట్టాను. (చెయ్యి పట్టుకొని) శతభిషం! యింతమంది పిల్లలతో నే ఒక్కడిని వేగలేను. నీక్కావాలంటే జీతమెక్కువ చేస్తాను. నీకు కష్టం కలగకుండా ప్రవర్తిస్తాను. నీ కాళ్ళుకూడా పట్టుకొని ప్రార్థిస్తున్నాను.

శత:- ఎంతమాటండి, వెళ్ళనులెండి,(తిరిగి సూటుకేసుతో లోపలికివెళతాడు)

రాము:- (వస్తూ) వెళ్ళేవాణ్ణి అంత బ్రతిమాలడ మెందుకు ?

పురు:- మీరంతా మాడిచస్తారని.

రాము:- వాడిగురించే బ్రతుకుతున్నామా ?

పురు:- వాడు లేకపోతే వంట ?

రాము:- వంటకోసం, వాడు వండిన తిండికోసం వాడి కాళ్ళు పట్టుకొని బ్రతిమాలే బదులు చావడం మంచిపని.

పురు:- రామూ !

రాము:- అవసరానికి జీతం తీసుకుంటూ కాస్త అన్నం పెట్టే నౌఖరుగురించి మీరింత బాధపడుతూ అంత నీచమైన బాధ్యత తీసుకుంటే, తన

జీవితాన్ని మన సుఖానికి తాకట్టుపెట్టి దుఃఖాన్నికూడా సంతోషంగా స్వీకరించిన అమ్మకు మనమిచ్చే ప్రతిఫలం, 'యింట్లో ఒక్కక్షణం వుండొద్దు వెళ్ళిపో' యింతేనా ?
(రాముడు తీవ్రంగా యింటిలోకి వెళతాడు. పురుషోత్తం కుర్చీలో కూలబడతాడు. ఆలోచిస్తూ వుంటాడు. వీధిలోంచి వెంకటరమణ వస్తాడు.)

వెంక:- బాబాయ్ ?

పురు.- (వెర్రిగా చూస్తూ వుంటాడు.)

వెంక:- భోజన ఏర్పాటు అయిందా ?

పురు:- ఇంకా లేదు.

వెంక:- మా ఆవిడుంది చూశావ్. వంటలో మహా చురుకైంది బాబాయ్! అయితే చిన్నమ్మ పుట్టింటికి వెళ్ళిందటగా ?

పురు:- వెళ్ళింది.

వెంక:- వెళ్ళిందా ? నువ్వు వెళ్ళగొట్టావా ?

పురు:- (కుర్చీలోంచి విసురుగా లేచి) ఏదో చేశాను. అదంతా నీ కనవసరం.

వెంక:- అందరికి అవసరమే బాబాయ్. మా యావిడుంది చూశావ్ బాబాయ్, ఎవ్వరికీ మంచిదికాదు. నాకుంది చూశావ్, అది దేవత. నా తిండి కోసం అది బాధపడి భోజన ఏర్పాటు చేస్తుంది. చెప్పడానికి వీల్లేదు. అప్పుడప్పుడు విసుగుదలతో ఏమన్నా అంటుందే అనుకో. మనం గప్‌చిప్. అంతా మళ్ళీ అరగంటలో తయారు ! బాబాయ్, ఆడవాళ్ళ గుణం కనిపెట్టి మగవాడు సంచరిస్తే మోక్షం సంసారంలోనే వుంది బాబాయ్ !

పురు:- మీ యావిణ్ణి కోపమొచ్చి యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నావే అనుకో, అప్పుడేం చేస్తుంది ?

వెంక:- ఆఁ ! అంతపనే బాబాయ్ ! అన్నాను అంటే ఈ జన్మలో దాని మొహం చూపించదు, దాని మొహం చూడకపోతే నేను బ్రతకను బాబాయ్ !

పురు:- వెళ్ళమంటే వెళ్ళనని ఎదురుతిరగడం గాని, ప్రాధేయపడ్డం గాని ఏదో జరగాలిగా ?

వెంక:- ఛీ ! ఛీ ! ఏ ఆడదీ అలా చేయదు బాబాయ్ ! ఇంతకూ చిన్నమ్మ చాలా మంచిదేగా ? ఎందుకు వెళ్ళిపొమ్మన్నావ్ బాబాయ్ !

పురు:- వెళ్ళిపొమ్మన్నామ.

వెంక:- ఛా ! చాల తప్పుచేశావ్ బాబాయ్ !

పురు:- (ఇటూ అటూ చూచి) తప్పే అంటావా ?

వెంక:- ముమ్మాటికి తప్పే బాబాయ్.

పురు:- మరి మనం చెప్పినపని కాదని ఎదిరించడం దాని తప్పు కదూ ?

వెంక:- బాబాయ్ ! నీ కిష్టంలేని పని నేను చెయ్యమంటే నువ్వు చేస్తావా ? ఆడదికూడా అంతేగా—

పురు:- ఆడది మగాడు చెప్పినట్లు వినొద్దూ ?

వెంక:- వినే సంగతి వింటారు. విననిది వినరు. ఆడవాళ్లు ఏదైనా చెబితే మనం కూడా అంతేగా బాబాయ్ ! ఆడది తక్కువనీ నీవు ఎక్కువనీ అనుకుంటున్నట్లున్నావ్. అబ్బే ! అక్కడే వస్తుంది చిక్కు బాబాయ్ ! ఎవళ్ళూ అనుకోకూడదు. ఆమాట అనుకున్నామా వచ్చిందే చిక్కు. మా యావిడకూడా యిదే జబ్బు - మగాళ్ళకంటే ఆడ వాళ్ళే గొప్పవాళ్లని. అందుకు అవసరార్థంగా అలాగేకానీ అంటాను. నేను గొప్ప, నేను గొప్ప అనుకుంటూ ఉంటే సంసారం ఎలా సాగుతుంది బాబాయ్ !

పురు:- (వుద్రేకంగా అతని చేయిపట్టుకొని) నువ్వు నాకంటే ఎంతో తెలివైనవాడవురా వెంకటరమణా !

వెంక:- అబ్బే ! మా అవిడ ఒక్కనాడుకూడా ఇలాంటి పొరపాటు మాట అనలేదు.

(రాము లోపలనుంచి కంగారుగా వస్తాడు.)

రాము:- నాన్నా ! బేబీ మంచం మీదనుంచి పడిపోయింది. బిగిసిపోయింది. మాటాడ్డం లేదు.

(అచ్యుతం కూడా వస్తాడు )

పురు:- (భయంగా) ఆ ! ఎంతపని జరిగింది రామూ ! వెళ్ళి డాక్టర్ని తీసుకురా. వెంకటరమణా ! మనస్సు యిప్పుడేం బాగుండలేదు. ఇదుగో, యీ రూపాయి తీసుకువెళ్ళి నా మర్యాద దక్కించు.

వెంక:- దీనికింత పట్టుబలవంత మెందుకు బాబాయ్. రూపాయి యిద్చావుగా, హాయిగా హోటల్‌కు వెళ్ళి భోజనం చేసి వస్తాను.

(పురుషోత్తం లోనికి వెళతాడు. వెంకటరమణ వీధిలోకి వెళతాడు)

అచ్యు:- రామూ ! డాక్టరు అక్కరలేదు (రామూ, అచ్యుతం లోనికివెళతారు)

(అచ్యుతం, పురుషోత్తం వస్తారు.)

అచ్యు:- ఆడదాని ఆధారం లేకుండా మగవాడే సంసారాన్ని చక్కబెట్టుకోవాలంటే, యింత చక్కగా వుంటుంది వ్యవహారం !

పురు:- అచ్యుతం !

అచ్యు:- ఎందుకు !

పురు:- ఇప్పుడు మనస్సేమీ బాగుండలేదు. నీవు మాట్లాడావంటే ఏమీ మాటదక్కదు.

(రాము వస్తాడు )

రాము:- మనస్సనేది మీ కుంటే !

పురు:- రామూ !

రాము:- కోపమెందుకు నాన్నా! కాస్త కళ్ళు తెరిచి చూడు చెల్లాయికి యింతవరకు కాఫీలేదు. బేబీ మాటలేక పడిపోయింది. నాకు స్కూలుకు టైం కావచ్చింది. యింతవరకు ఎవరికీ భోజనంలేదు. అమ్మకు బదులు శతభిషంగాడున్నాడు కాబట్టి మీ వుభయులు క్షేమంగా వుండండి. చెల్లాయిని తీసుకొని నేను అమ్మ దగ్గరకు వెళ్ళిపోతాను.

పురు:- వెళ్ళిపోడానికి నీ యిష్టమేడ్చిందిక్కడ.

రాము:- అమ్మను పొమ్మనడానికి మీకు అధికార ముందనుకుంటాను.

పురు:- వుంది, వుందిరా. మళ్ళీ మాట్లాడితే పళ్ళు రాలగొడతాను.
(మీదకు వెళ్ళబోతాడు. అచ్యుతం ఆపుచేస్తాడు. రాముడు లోనికి వెళతాడు)

అచ్యు:- మామయ్యా! ఏమీ తెలియలేదనుకుంటున్న రాము కూడా నీకంటె తెలివైనవాడే. అమ్మలోవుండే విలువ వాడికి బాగా తెలుసు. వాడు వెళ్ళడం గురించి నీవు ఆపుచెయ్యడం అనేది తెలివైన పనికాదు.

పురు:- నిన్ను మధ్యవర్తిగా మా యింటికి తగలడమని, వెధవ తీర్పులు తీర్చమని యిక్కడెవ్వరూ పడి ఏడ్వలేదు. అవతలకు వెళ్ళిపో!
(సూటుకేసుతో శతభిషం కోపంగా వస్తాడు.)

శత:- చేతగాని వెధవని ఈ యింట్లోకి చాకిరీకి రావడమేమిటి?

పురు:- ఎవడ్రా నిన్నన్నది?

శత:- (సూటుకేసు పడేసి, నమస్కారం పెట్టి) మీకు దణ్ణం పెడతాను. నన్నాపుచెయ్యవద్దు. చేతులో శక్తి వుండగా కుర్ర కుంకలతో కూడా మాట అనిపించుకోమని భగవంతుడు నా నొష్టనేమీ వ్రాయలేదు. డబ్బిస్తున్నారు, పని చేయించుకుంటున్నారు. మాటలంటే ఎవరు పడతారండి! (రాము వస్తాడు)

రాము:- నువ్వు అనవసరంగా వాగకు. మంచివాణ్ణి గాబట్టి మాటల్తో విడిచి పెట్టాను.

శత:- లేకపోతే?

రాము:- పళ్ళు రాలగొడతాను. (మీదకు వెళ్ళబోతాడు)

పురు:- రామూ!

శత:- చూశారా?

రాము:- బండి తీసుకురావడానికి వెళుతున్నాను.

పురు:- ఎందుకు?

రాము:- పిల్లల్ని అమ్మదగ్గరకు తీసుకువెళ్ళడానికి.

పురు- తీసుకు వెళ్ళటానికి వీల్లేదు ఇది నా యిల్లు. నా బిడ్డలపై నా కధికారముంది. నేను చెప్పినట్లు వినాలి వ్యతిరేకించారా రక్తాన్ని కళ్ళ చూస్తాను. వెళ్ళవేం లోపలికి ?

అచ్యు:- మామయ్యా !

పురు:- ఎవరు చెప్పినా నా పట్టుదలకు భిన్నంలేదు. ముందు లోపలికి వెళ్ళరా !

రాము:- వెళ్ళను. బండి తీసుకువస్తాను. (వెళుతుంటాడు)

పురు:- ఆఁ! ఆగు! (చెంపపై కొడతాడు పిల్లలు ఏడుస్తుంటారు. అచ్యుతం, శతభిషం నివ్వెరపడి చూస్తారు)
(పురుషోత్తం కొట్టిన కొంతసేపటికి తేరుకొని కళ్ళనీళ్ళతో)

పురు:- మీరెవ్వరూ ఎక్కడకు వెళ్ళొద్దు... నేనే వెళతాను. నా తప్పును ఒప్పుకుంటాను... నా జానకిని రమ్మని ప్రాధేయపడతాను. ఆడది తక్కువని అహంభావంతో చూస్తే నాలాంటి వాళ్ళకు ఇలాంటి అనుభవం కావల్సిందే ! ఆడదిలేని సంసారం నరకంతో సమానమని గుర్తించాల్సిందే—
(రాము కళ్ళనీళ్ళతో ఆనందంగా చూస్తాడు. పురుషోత్తం వీధిలోనికి వెళతాడు)

(తెర మెల్ల మెల్లగా జారుతుంది)



## పాత్రలు

1. శ్రీనివాసం
2. చైతన్యం
3. బాబు (1)
4. బాబు (2)
5. సర్వయ్య
6. ఇనస్పెక్టరు
7. పోలీసు
8. రాధ

ఒక సామాన్య గృహంలో వక సావిడి, కుడివైపు ద్వారం బయటికి దోవ. ఎడమవైపు ద్వారం లోపల గదులకి దోవ. గదివెనక గోడకి కుడివైపున వక రాధాకృష్ణుల బొమ్మ. మధ్యలో వక స్త్రీ చిత్రం. (పెద్ద enlargement). ఎడమవైపున వక రంభా రావణాసురుల బొమ్మలుంటాయి. ఈ బొమ్మకి క్రింద కాస్తకుడివైపుకి వక చిన్న టేబుల్ వుంటుంది. దానిమీద వక పాత Table cloth వుంది. టేబుల్ ప్రక్కగా ఒక చిన్న కుర్చీ వుంది. రాధాకృష్ణుల బొమ్మ క్రింద భూమిమీద వక కంచు గ్లాసు పడవేసివుంది రంగానికిముందు కుడివైపున మరో చిన్న stool వేసివుంది. దానిమీద వక తోమని కంచుగ్లాసు. దానికుడివైపున మరోగ్లాసు క్రింద పడవేసివున్నది గదినిండా పాత కాగితాలు చెల్లాచెదరుగా పడవేసివున్నై. తెర ఎత్తగానే శ్రీనివాసం వక మధ్య వయస్కుడు-దాదాపు 45 సం॥ల వాడు, రంగాన్నంతా కలియచూస్తూ ఏదో దిగులుగా తిరుగుతూ కనిపిస్తాడు. జుబ్బా, పంచ ధరించివున్నాడు. క్రింద పడవేసివున్న కాగితాలు ఏరుతూ టేబుల్ దాకా వెళ్ళాడు. ఆ Table ను పరకాయించి చూసి, విసుక్కుని "రాధా...రాధా...ఇట్లారా వక్కసారి" అంటాడు.

(రాధ వచ్చింది చేతిలో వక గడ్డ పుచ్చుకుని)

శ్రీనివాసం:- (వెనకవున్న Table cloth మొ॥ నవి చూపిస్తూ) ఇవన్నీ యింకా తియ్యలేదేం. తీసెయ్యి.

(రాధ ఆ Table cloth తీస్తుండగా)

ఆ? ఆ దీనిమీద ఆ Table cloth వెయ్యి- ఆ-చూడూ- కాఫీ filter వేశావా-లేదా? (రాధతల వూపగా నవ్వి) వేశావుగదా చూడూ- కాఫీ యిప్పుడే కలపకు. వాడు వచ్చిన తర్వాత కలపచ్చు. ఇంకా అరగంటసేపు వుందిలే అరగంట! చాలా సేపు ఉంది.

(ఏదో ఆలోచనలో మునిగి తెప్పరిల్లి)

ఆ; యీలోపున ఆ మధ్య గదీ-వెనక గది కూడా సర్దు, ఫో... ఆ... వేణ్ణీళ్ళు కాగేయా?

(రాధ 'ఆ...' అని తల వూపుతుంది)

ఆ! సరే! ఫో! ఆ Table cloth తెచ్చియిచ్చి వెళ్ళుత్వరగా.
(రాధ లోపలికి వెళ్ళింది)

(శ్రీనివాసం మధ్యకొచ్చి (గోడ దగ్గరికి) మధ్యలో పైగావున్న enlargement చూసి నిట్టూర్చుతూ నుంచున్నాడు. ఇంతలో చైతన్యం-అతని యీడువాడే బయటనుంచి వచ్చి శ్రీనివాసం వెనగ్గా నుంచుంటాడు. శ్రీనివాసం యితన్ని చూడకుండా లోపలికి వెళ్ళి పోతాడు. చైతన్యం వెనక కుర్చీలో కూర్చుంటాడు. శ్రీనివాసం వక పడకకుర్చీతో వచ్చి stage Rt. side కి సరాసరి వెళ్ళి అక్కడవేస్తాడు. పడకకుర్చీ అడ్డంగా వుండటంవల్ల చైతన్యాన్ని చూడలేదు. అక్కడనుంచి ముందుకి నడిచి ముందువున్న బల్లమీద గ్లాసు తీసి చూసి) రాధా, ఇది తోమకుండా యిక్కడే వుంచావేం?

(రాధ వస్తుంది)

ఇట్లా నల్లగా అసహ్యంగావుంటే బాగుంటుందా చెప్పూ. వాడిల్లాంటివి ఇంట్లోవుంటే అసహ్యించుకోడూ? వాడూ మనలాగానే అనుకున్నావా యేం? ఇంద. తోముకురా.

(గ్లాసు రాధకివ్వగా తీసుకు వెళ్ళిపోయింది)
(ఆ Table వెనగ్గావున్న మరో గ్లాసుచూసి)

సరే; ఇక్కడొకటివుంది. (అంటూ అది తీసుకుని లోపలికి వెళతాడు. చైతన్యం వెనక గోడదగ్గర పకవేసివున్న వక గ్లాసు తీసుకు వచ్చి ముందు Stool మీద పెట్టి వెనక్కి వెళ్లినుంచుంటాడు శ్రీనివాసం ఒక Table cloth తో వచ్చి ముందు Stool మీద గ్లాసుచూసి తెల్లబోయి, తను తెచ్చిన flower Vase Stool మీద పెట్టి ఆ గ్లాసు తీసుకుని లోపలికిపోతాడు చైతన్యం flower vase తీసి వెనక table మీద పెట్టి, తను వెనక్కి వెళ్లి వుంటాడు. మళ్ళీ శ్రీనివాసం వచ్చి ముందు Stool మీద Vase లేకపోవటం చూచి తెల్లబోయి తలగోక్కుని Table cloth తీసుకుని వెనక Table దగ్గరికెళతాడు. చైతన్యం శ్రీనివాసం వెనగ్గా తిరిగి తప్పుకుంటాడు. శ్రీనివాసం అక్కడ flower Vase వుండటంచూచి ఆశ్చర్యపోతాడు, అక్కడ Table మీద cloth వేసి, Vase

దానిమీదవుంచి అంతా బాగుందని సంతృప్తిపడుతూ తనచుట్టూ తానుతిరుగుతూ గది అంతా కలియచూస్తాడు. చైతన్యం అతని వెనకే తిరుగుతూ కనబడకుండా తప్పించుకుంటుంటాడు.]

శ్రీనివాసం:- (తిరుగుతూ) ఆ. ఆ. అంతా బాగుంది.

(అని తనలోతాను నవ్వుకుంటాడు. రాధ తిరిగివస్తుంది)

Decoction తయారయిందా? ముందే కలపకు. వాడు రాంగానే కలిపి యిస్తూగాని- ఆ. చూడూ. ఆ మధ్య గదిలో పట్టెమంచం తెచ్చివెయ్యి.

(రాధ చైతన్యంవంక సౌజ్ఞచేస్తూ మాట్లాడబోయింది' కాని... అది తననే అనుకుని...)

శ్రీనివాసం:- నువ్వు మాట్లాడకు, మంచం మధ్య గదిలోనే వెయ్యి, మరేం పర్వాలేదు. (మళ్ళీ మాట్లాడబోగా) నేనంతా ఆలోచించాగా, అక్కడే వెయ్యి. వెళ్ళు. (వెళ్ళబోగా) ఆ వేరే పెరుగు తోడు పోయించుకున్నావా! ఆ? (రాధ పోయించుకున్నానని తలవూపుతుంది) ఆహా, అయితే ఆ కాఫీ కుంపటిమీద వేరే ఆత్తెసరు వేసివుంచు. వాడు ఎప్పుడు ఫోంచేస్తాడో ఏమో- ఎందుకైనా మంచిది...... ఊ ఊ పో! త్వరగా పో! వచ్చేస్తాడు. ఇంకొక్క 20 నిమిషాల్లో వచ్చేస్తాడు- 20 నిమిషాల్లో... [రాధ వెళ్ళింది. తర్వాత తన జేబులోంచి వక మూడేళ్ళ పిల్లవాడి లాగూ చొక్కా తీసిచూసుకుంటాడు. గుండెల కద్దుకుంటాడు. అది జాగ్రత్తగా మడిచి బల్లమీద పెట్టబోతాడు- వేరేవైపు చూస్తూ పరధ్యానంగా. చైతన్యం చెయ్యిచాచి దాన్ని అందిపుచ్చుకుంటాడు. అయినా అది గమనించకుండా శ్రీనివాసం ఏదో జ్ఞాపకము వచ్చి లోపలికి పోతాడు.]

[కాసేపటికి రాధ వస్తుంది]

రాధ:- మిమ్మల్నింకా చూసినట్టులేదే!!

చై:- లేదు. ఎక్కడో మతి తాకట్టు పెట్టినట్టున్నాడు.

రాధ:- ఏమో. పొద్దుట్నించీ అల్లాగే వున్నారు. ఆ. నిన్న గూడా అల్లాగే వున్నట్లున్నారు- అహ కాదండీ మొన్న-అసలు మొదలు.

చై:- కాదులే! అటుమొన్న కూడా యిల్లాగే వున్నాడు.

రాధ:- అయితే ఏమో. పొద్దుట్నించీ యిల్లు సర్దటమే సరిపోయింది. ఈ రైలుకి ఎవరో వస్తారట. చాలా గొప్ప వారులావుంది, అందుకని యిల్లంతా శుభ్రంగా వుంచాలట.

చై:- నాకేం చెప్పలేదే! సాధారణంగా నాతో ఏదీ చెప్పకుండా వుండడు. (లోపల్నించి ''రాధా రాధా'', అని శ్రీనివాసం పిలుస్తాడు)

రాధ:- పిలుస్తున్నారు. వస్తా (వెళ్తుంది)
చైతన్యం కాసేపాగి...వకసారి లోపలికి చూస్తాడు.
పువ్వులు పట్టుకు వస్తున్న శ్రీనివాసాన్నిచూసి Vase తన నెత్తిన పెట్టుకుని మధ్యలో కూర్చుంటాడు. శ్రీనివాసం వచ్చి ఆ Vase లో పూలగుత్తులు పెట్టి పైకి చూస్తూ (గదిఅంతా) బాగానే వుంది యిప్పుడు (ముందున్న స్టూలు దగ్గర కెళ్ళి) ఇది యిక్కడెందుకూ? అక్కర్లేదు (అని తీసి వెనక్కు పెడతాడు. యీలోగా చైతన్యం లేచి Vase Table మీదపెట్టి తప్పుగుంటాడు. శ్రీనివాసం వెనక Table దగ్గరకెళ్ళి Vase చేతిలోకి తీసుకుని ''ఇది నేనిక్కడ పెట్టానా?'' అని అనుమానిస్తుండగా చైతన్యం దగ్గరకొచ్చి చెయ్యి చాపుతాడు. అతని చేతిలో పరధ్యానంగా పెట్టి) ఇది నేనిక్కడ పెట్టానా (అని గొణుగుతూ కాస్త తిరిగి, చైతన్యాన్ని చూసి) నువ్వెప్పుడు వచ్చావ్?

చై:- వచ్చిచాలా సేపయిందిలే. కాని ఏమిటిది యింత పరధ్యానంలో వూరేగుతున్నావ్.

శ్రీ:- (కాని యింకా పరధ్యానంలోనే) ఏమిటీ అంటావ్?

చై:- సరిగా నావంక చూడు. నేకనిపిస్తున్నానా?

శ్రీ:- (దిక్కులు చూస్తూ) ఊ!

చై:- (నిరాశగా) స్వారె... నామాటలన్నా వినిపిస్తున్నాయా?

శ్రీ:- ఆ!

చై:- (నిరాశగా) బాగానే వుంది,

శ్రీ:- ఆ.ఆ. (నవ్వి) బాగుందికాదూ. యీగది యిల్లా వుంటే బాగుంటుంది కదూ!

చై:- (విసుగ్గా) బాగానే వుందయ్యా, మహాశయా, కాస్త యీలోకంలోకి వచ్చి మాట్లాడు.

శ్రీ:- వస్తా వస్తా (పరధ్యానంగానే) వాడొచ్చే వేళ అయింది. ఇంకో 10 నిమిషాల్లో వాడొచ్చేస్తాడు.

చై:- ఎవరూ వచ్చేది?

శ్రీ:- మావాడు... (ధ్యానంలోకొచ్చి) అరరే! చెప్పేశానే!

చై:- సర్లే, ఏం చెప్పందే.

శ్రీ:- వాడొస్తాడని చెప్పలే?

చై:- కాని వాడెవరని?

శ్రీ:- అవును. వాడెవరో చెప్పలే. అవును, చెప్పలే. ముందు చెప్పకుండా వక్కసారి - నీకు- విస్మయం కలిగేట్టు చెయ్యాలని చెప్పలే. కాని నువ్వెప్పుడే వచ్చావేం? నిన్ను 11 గం॥ లకి రమ్మని కబురు చేశాగా.

చై:- కాని రోజూ యిప్పుడే రావటం అలవాటు కాదూ? అందుకని వేళ కాంగానే కాళ్ళు ప్రయాణం కట్టాయి. ఇంతకూ యీ హడావుడి యెందుకో చెప్పావుకాదు.

శ్రీ:- అదో పెద్ద కథలే. నీకు తెలియదు- కానీ, నాకు వకప్పుడు వక పెళ్ళాం వుండేది.

చై:- అలాగా! పెళ్ళిచేసుకున్న పెళ్ళామేనా!

శ్రీ:- ఆ. అదిగో. (మధ్య Enlargement చూపించి) ఆమెదే ఆ చిత్రం. వక కొడుకు కూడా పుట్టాడు. వాడూ...

చై:- ఆ. ఆ. పండులాగుండేవాడు కాదూ?

శ్రీ:- అవును. నీకెలా తెలుసు?

చై :- తండ్రికి తనకొడుకు పండులాగే వుంటాడెప్పుడూ.

శ్రీ:- కాని వీడు నిజంగా పండులాగే వుండేవాడు. ఆ పసిగుడ్డును చూసు కొని మురుస్తూ మూడేళ్ళు గడిపాం.

చై :- మూడేళ్ళా! అయితే ఏదోవకటి జరిగివుంటుందప్పుడు.

శ్రీ:- జరిగింది. మా మురిపెం ముక్కలయింది. ఆనందం అణగారి పోయింది. నా భార్య నన్నువీడి పోయింది.

చై :- ఆ!!

శ్రీ:- (Pause) ఆ. Hospital లో 10 రోజులు బాధపడింది. నేనా రోజున చూడటానికి వెళ్ళాను. చూశాను—కలకలలాడే మొహం కళా విహీనంగా - నులి వెచ్చని చేతులు మంచుగడ్డలాగ ...ఆమె వెళ్ళి పోయింది. నాకు నా పసివాణ్ణి..వొదలి. నేను మనసు మొరదుసుకుని బ్రతికుండాల్సి వచ్చింది. ఆ పిల్లవాడికోసం, చిగురించని ఆ మొలక కోసం...బ్రతికేవున్నాను. నాకోసం కాకపోయినా.

చై :- మరి...ఆ కుర్రవాడేడీ?

శ్రీ:- పెంచమని వక వృద్ధురాలి చేతిలోవుంచి నేనీవూరు వచ్చేను. వాళ్ళిద్దరి పోషణభారం నేనే వహించాను. ఒక యేడాది జరిగిందో లేదో-అక స్మాత్తుగా వక నెల నే పంపిన మనిఆర్డరు తిరిగివచ్చేసింది. రెక్కలు గట్టుకు ఎగిరిపోయాను ఆ వూరికి. వూరుకలియ వెతికాను. ఆ పిల్ల వాడెక్కడో తప్పిపోయాడట. ఎంత వెతికినా ప్రయోజనం లేక పోయింది.

చై - అయితే యింతకూ ......!!!

శ్రీ :- 15 ఏళ్ళయిన తర్వాత, రెండురోజులక్రిందట, మొన్న తెల్సింది. నా ఎడ్రసు ఎల్లాగో కనుక్కొని వక అనాధ శరణాలయంవాళ్ళు వ్రాశారు. మావాడక్కడున్నాడనీ. చదువుకుంటున్నాడనీ ...... యివ్వాళ యిక్కడికి వస్తున్నాడనీ - యిప్పుడే- యీ బండికే...

(జేబులోంచి చొక్కాలాగూ తీసిచూస్తూ) ఈ వయస్సులో చూశాను. తిరిగి యిప్పుడు చూస్తున్నాను. ఆనాటి పసివాడు- యీనాడు నవ యువకుడు. నా జీవితంలో విదియ చంద్రుడు. ఏమిటీ ఆలోచిస్తున్నావ్ ?

చై:- అహ, ఏంలేదు.

శ్రీ:- ఇప్పుడు నాకు నిజంగా జీవించాలనే వుంది. నాకోసంగాదు. వాడి కోసం. ఆ వేళ్ళు పాతుకోని చిన్ని మొలకకోసం.

చై:- శ్రీనివాసం!

శ్రీ:- నిరాశతో ఎప్పుడూ- ఎప్పుడు యీదేహం రాలిపోతుందా అనే ఆలోచించే వాడిని...ఇందుకేగాబోలు బ్రతికివున్నాను, ఇప్పుడు జీవించాలి జీవించి తీరాలి, నాకోసం కాకపోయినా-వాడికోసం. వాడి భవిష్యత్తు కోసం...చైతన్యం! (ఉద్రేకంతో) నేనింకొక్క పదేళ్ల జీవించగల నంటావా ?

చై:- జీవిస్తావ్. (వేళాకోళంగా) నేవద్దంటే మానావ్ గనక !

శ్రీ:- అయితే ఫర్వాలేదు 10 యేళ్ళలో ఎంతైనా చెయ్యగలను.

చై:- చెయ్యగలవ్, కాని యేం చేద్దామని ?

శ్రీ:- మా వాడికి చదువు చెప్పించి పెద్ద వుద్యోగస్తుణ్ణి చేస్తాను. వాడి కుటుంబం మూడుపువ్వులూ ఆరు కాయలుగా జీవితాన్ని గడిపేట్టుగా ఆస్తి సేకరించి సమకూర్చి పెడతాను. ఏం ? బాగుండదూ ?

చై:- బాగానే వుంటుంది. కాని...వాడి రాత బాగుంటే.

శ్రీ:- (కోపంగా) చైతన్యం......

చై:- ఏం, కోపం వచ్చిందా ! వస్తే వంటికి మంచిదేలే. నేననేదీ యేం లేదు. మీవాడు వర్ధిల్లాలనే నా కోరికానూ. కాని యీ కాలాన్ని బట్టి...కుర్రవాళ్ళు...

శ్రీ:- నా కత్రవాడు అందరిలాగా యెప్పుడూ అవడు. నా పిల్లవాడు - నా పిల్లవాడే.

చై:- ఇప్పటికి నాకర్థం అయింది.

శ్రీ:- ఏమర్థమయింది ?

చై:- నీకు మతి యింతవరకూ పోకుండా వుంటే-ఇక త్వరగా పోతుందని.

శ్రీ:- కాని నాకివ్వాళ వున్నట్టు ఎన్నడూ లేదు. ఆనందం అంటే యేమిటో అర్థమవుతోంది. ముందు చూపుతో సంతోషం, వెనక చూపుతో విచారం, రెండూ కలిసి నా హృదయం బరువెక్కిపోతూంది. నిజమే. సంతోషంలో మతి పోవచ్చు. నువ్వు దగ్గరుండి పోకుండా చూడు. (రాధ వస్తుంది)

రాధ:- Decoction తయారయింది. మీకు కాఫీ కలిపి పట్టుకు రమ్మంటారా ?

శ్రీ:- వాడింకా రాందే!

చై:- పోనీ - నేను వచ్చాగా! (నవ్వుతారు)

శ్రీ:- (నవ్వి) పట్టుకురా పోనీ. (రాధ వెళ్ళబోగా) అంతా కలిపేశేవ్ సుమా! మా యిద్దరికే కలుపు. అ, ఆ, నువ్వుకూడా తాగు. (వెళ్ళబోగా) ఆ, రాధా, నిన్న కొన్న కొత్తబట్టలు కట్టుకోలేదేం ? (రాధ తలవంచుకు వెళ్ళిపోతుంది.)
కట్టుకో-కట్టుకో...(రాధ వంకే చూస్తూ) పాపం, నన్నింతవరకూ తల్లి పిల్లని సాకినట్లు సాకింది. దాసీపిల్లయినా నా కూతురిలాగ ప్రవర్తించింది. ఎవర్నో వకర్ని చూపిస్తాడా భగవంతుడు.

చై:- మరే. అల్లాగేగా-నువ్వీ వూరు రాంగానే నన్ను చూపించాడా భగవంతుడు-రోడ్డుమీద-

శ్రీ:- దీనికి మంచివాణ్ణి చూసి పెళ్ళి చెయ్యాలి. కాస్త డబ్బు ఖర్చయినా సరే.

(''అయ్యా'' అంటూ బయటనుంచి సర్వయ్య వస్తాడు)

శ్రీ:- ఎవరది ? (చూసి) సర్వయ్యా ? వచ్చావ్. రా. నీకోసం కబురు చెయ్యాలనుకుంటున్నా.

స:- అహ్హహ్హ (నవ్వి) మా పిల్లదీ...వచ్చిందాండి ?

శ్రీ:- అదేనా !

స:- అదే కదండీ...ఏరే ఎవరున్నారు ?

శ్రీ:- ఇప్పుడేం! ప్రొద్దున్నే వచ్చింది.

సర్వ:- వచ్చిందాండీ—మరి ఏవన్నా చెప్పిందాండీ—

శ్రీ:- ఏం చెప్పలేదే.

సర్వ:- మర్చిపోయింది కావాల. పిచ్చిమాలోకం. అయ్యగోర్నడిగి రెండు రూపాయిలు ఎత్తుకరాయే అని నోరు కాయగాచేట్టు చెప్పా.

శ్రీ:- ఆహా, చెప్పలేదే.

చై:- చెప్పవద్దనుకుందేమొ.

శ్రీ:- ఏం అలా అన్నావ్.

చై:- అలా ఎందుకన్నా నంటావా—సర్వయ్యా, ఎందుకా 2 రూ॥లు?

స:- అదేటండీ! డబ్బెందుకని అడుగుతారూ?

చై:- డబ్బు అవసరం చాలా వాటికుంటుంది, కాని యీ రెండు రూ.లూ ఎందుకని? తాగటాన్కా?

సర్వ:- రామ రామ!! అది నేనేప్పుడూ ఎరగనండీ.

చై:- మరి ఎందుకూ! వెచ్చానికా, గుడ్డలకా, ముందలకా?

స:- ఏదో నాశిరకపోళ్ళం బాబూ, మీరు నిలవేసి అడిగితే ఎట్లా సావటం!

శ్రీ:- సర్లే. సర్వయ్యా, సాయంకాలంచూద్దాంగానీ, నువ్వీపూటల్లా ఇక్కడే వుండు. మా అబ్బాయి వస్తున్నాడు.

సర్వ:- అబ్బాయిగోరండీ! ఎప్పుడు పుట్టారండీ?

శ్రీ:- అదో పెద్ద గాథ. నువ్వెరగవ్లే. ఇప్పుడే ఈ బండికే వస్తాడు. నువ్వు వుండు.

స:- చిత్తం బాబయ్యో, మీ పాదాలకాడ— ఈ గుమ్మందగ్గరే కూకుంటా. కేకెయ్యండి-లగెత్తుకువత్తా.
(సర్వయ్య వెళ్ళంగానే రాధ వస్తుంది)

రాధ:- ఆ వెళ్ళేది మా నాన్నకదండీ?

శ్రీ:- ఆ.

రాధ:- రెండు రూపాయలు అడిగేడా?

శ్రీ:- అడిగాడు.

రాధ:- ఇవ్వకండి.

శ్రీ:- ఏం?

రాధ:- ఏం లేదు.

శ్రీ:- సరేలే గానీ నువ్వింకా ఇలాగే వున్నావేం- ఆ కొత్త బట్టలు కట్టుకోకుండా.

రాధ:- అవ్వి...లేవు.

శ్రీ:- ఏం లేవూ?...నిన్ననే కొన్నవి...లేవూ.

రాధ:- అవ్వే...లేవు.

శ్రీ:- ఏం? ఎందుకు లేవూ?

రాధ:- మా నాన్న ఉంచుకున్నదాని కూతురికి వెళ్ళాయి.

శ్రీ:- (తెల్లబోయి) ఆ!

రాధ:- నిన్నరాత్రి నన్నేడిపించి, అవ్వి లాక్కుని, దాని కిచ్చాడు?

చై:- ఓరి, వెధవ!!!

రాధ:- ఆ రెండు రూ॥లు అడిగితే ఇవ్వకండి. దాంతో వాళ్ళు ముగ్గురూ సినిమాకి వెళతారు- రేప్రొద్దున్న తిండికి లేకపోయినా—

శ్రీ:- సర్లే.

(రాధ వెళ్ళిపోతుంది)

శ్రీ:- హైము అయినట్టుందే.

చై :- అయింది ఇంకో 5 ని॥లు ఓపికపట్టు.

శ్రీ:- స్టేషన్‌నుంచి యిక్కడికి రావటానికి 5 ని.లు కావాలా ?

చై :- విమానంమీద వస్తే అక్కర్లేదుకాని బండిమీదయితే కావాలి.

శ్రీ:- అవేవోరకం విమానాలు మన దేశంలోకూడా వస్తే బాగుండును.

చై :- వచ్చేవే, మీ అబ్బాయి ఇవ్వాళ వస్తాడని తెలిస్తే!

శ్రీ:- తెలుసుకో అక్కర్లే—(నవ్వి) ఈలోగా నువ్విక్కడ వుండి ఏం చేస్తావ్! రాధకి వక చీర కొనుక్కువస్తావా-పోనీ.

చై :- తెస్తాన; ఏం చేస్తానూ యిక్కడ. వచ్చేది మీ అబ్బాయిగాని- మా అమ్మాయి కాదుగా.

శ్రీ:- ఆ...పట్రా (డబ్బు తీసియిచ్చి) కాస్త మంచిదే పట్రా, కట్టుకుంటుంది-ఇంతలో ఏం పోయింది.

(చైతన్యం డబ్బు తీసుకుపోతాడు)

(శ్రీనివాసం ఏదో ఆలోచిస్తూ కాసేపాగి—)

శ్రీ:- రాధా! (రాధ వస్తుంది)

రాధ:- ఎందుకండి?

శ్రీ:- 18 యేళ్ళ కుర్రవాడూ...ఎంత యెత్తు వుంటాడంటావ్?

రాధ - (చేతితో తన యెత్తు చూపిస్తూ) ఇంత వుంటాడు.

శ్రీ:- అంతేనా?

రాధ:- (చెయ్యి బాగా పైకి యెత్తి) ఇంత వుండవచ్చు.

శ్రీ:- అంత!! ఉంటాడంటావా?

రాధ:- ఏమో!

శ్రీ:- ఉన్నా వుండవచ్చులే. వాళ్ళమ్మ బాగా పొడుగే. నా మీద ఓ గుప్పెడు వుండేదేమో. వీడూ బాగానే ఎదిగి వుంటాడు-ఈ చొక్కా చాలకుండా (అని తన దగ్గరున్న చొక్కాలాగు తీసి చూస్తుంటాడు.)

ఇంతవరకూ నా జన్మ వృధాయేననుకునేవాణ్ణి, రాధా; కాని అనుకోకుండా అదృష్టం కలిసివచ్చింది. అంధకారంలో ఆశాకిరణం కనిపించింది. ఇకచూడు. Bank లో 5 వేలున్నాయి. వాడి చదువుకి అదిచాలు. పోతే 5, 6 యేళ్ళలో 20, 30, వేలు సంపాదించలేనూ? కిష్టయ్య యేడాదిలో లక్ష సంపాదించాడు. లక్షా !! Black market లో. నేను 4–5 యేళ్ళలో సంపాదించ లేనూ? చూడూ? 4-5 యేళ్ల వరకూ Black market వుండదూ? ఉంటుందా వుండదా? మాట్లాడవేం?

రాధ:- నాకేం తెలుసునండీ?

శ్రీ:- ఆ... ఈమాత్రం తెలియదూ?

రాధ:- తెలియదు—కానీ—Black market చెయ్యటం తప్పుగాదండీ ?

శ్రీ:- కాదు. ఎవరన్నారు తప్పని ?

రాధ:- మీరే అన్నారొకసారి.

శ్రీ:- అది వేరు. సొంతానికి చేస్తేతప్పు. కాని నేను నాకోసం చేశానా-వాడి కోసంగాని. నేబాగా సంపాదించక పోతే వాడు కష్టపడిపోడూ-తల్లీ తండ్రీలేని బికారి లాగ వాడు అవస్థ పడుతుంటే - నేనుండీ-చూస్తూ వూరుకోనా? నీకు తెలియదు రాధా; వాడు దరిద్రం అనుభవించలేదు.

రాధ:- మీకెల్లా తెలుసునండీ ?

శ్రీ:- ఎల్లాతెలుసు!! మావాడు - మాఅబ్బాయి సంగతి నాకు తెలియదూ ?

రాధ:- అహ! మీరు ఎప్పుడూ చూడలేదు గదండీ ?

శ్రీ:— చూడలేదు; చూడలేదు, నిజమే కాని యీ 15 యేళ్లబట్టీ యేరోజు వాడు జ్ఞాపకం రాకుండావున్నాడు, ఏరోజు కలలోరాకుండా వున్నాడు, ఏరోజు కళ్లలో ఆడకుండా వున్నాడు. నా కళ్ల యెదట పెరగలేదు గాని- నా కళ్ళల్లోనే పెరిగాడుగా-ఆ...ఇంతవుంటాడు సరిగ్గా వాళ్ళమ్మ కళ్ళే. నవ్వితేసరిగ్గా వాళ్లమ్మే. కాస్త గడ్డంలో తేడా·

పిచ్చివెధవ. తల్లీ తండ్రీ తెలియకుండా ఎల్లా గడిపాడో- 15 యేళ్లు. (కళ్ల నీళ్లు పెట్టుకుంటాడు)

రాధ:- (ఖంగారుపడుతూ) ఇదేమిటండీ?

శ్రీ:- ఈ భాష నీకర్థం అవుటంలే. అర్థం కాదులే, నీకూ, కడుపుపండి వక కుఱ్ఱవాడు పుడితే—వాడూ ఇలాగే...(ఆవేశంతో) అహహా! వద్దు, వద్దు ఈ కడుపు కోత పగవాడికైనా వద్దు, వద్దు-రాధా-వద్దు,

రాధ:- (ఆదుర్దాగా) ఏమిటండీ-ఏమిటండీ యిదీ ?

శ్రీ:- (తెప్పరిల్లి) ఏంలేదు. ఏంలేదులే,

రాధ:- ఏమిటండీ, ఇవ్వాళంతా మీరదోమాదిరిగా వున్నారు?

శ్రీ:- ఏంలేదు. (తెప్పరిల్లి) ఆ — చూడు. ఆ గదిలో ప్రక్కవేశావా ?

రాధ:- లే- నేనామంచం ఎత్తలేను.

శ్రీ:- అహ! అయితే నేనేవేస్తాలే-ఆ గదిలోగాని గాలి బాగా రాదు. (శ్రీనివాసం వెళ్తాడు, వెనకనే రాధ వెళ్ళబోతుంటే సర్వయ్య బయటనుంచి వచ్చి)

స:- రాధా,

రాధ:- (ఆగి) ఏం?

స:- నే రెండు రూపాయలడిగానని అయ్యగారితో చెప్ప లేదంటగా !

రా:- అవును, అవి నేకష్టపడి సంపాదించుకున్నడబ్బు,నీకూ, నీ తిరుగుళ్ళకి ఎందుకివ్వాలి?

స:- ఆయితే...తల్లీ తండ్రీ అక్కర్లే?

రాధ:- 'తల్లీ తండ్రీ' నా గుడ్డలు తీసుకెళ్ళి దాని కట్టబెట్టడం, నా తండ్రి చెయ్యాల్సిన పనేనా?

స:- పిట్ట కూతట్టిందే, ఇట్టా వాగటం మొదలెట్టావంటే కాళ్ళూ చేతులూ కట్టేసి ఇంటో పడేస్తాను.

రాధ:- (ఆక్షేపణగా) అ-పారేస్తావ్ - నేనింటికి వస్తేగా?

స:- రాకేంచేస్తావ్? ఇక్కడ యిల్లరికముంటావా ?

రాధ:- వుంటే వుంటాను, నా పొట్ట వెళ్ళిపోదనే బెంగలేదు.

స:- ఎందుకుంటుందీ "అయ్యగోరికి ఓ అబ్బాయి గోరొస్తున్నారు. కన్నేసి కరగిస్తే కావల్సిందుండదు" అనేగా నీ దీమా!

రా:- ఛీ! మాట్లాడకు.

స:- ఏమిటే కూశావ్!

(అని కోపంగా చెయ్యెత్తి కొట్టబోయాడు. కాని వెనక చైతన్యం రావటంచూసి ధోరణిమార్చి)

మా అమ్మగా, తల్లివిగా. పనిఅవంగానే-యింటికిరా.

చై:- (వచ్చి) ఏమిటి సర్వయ్య-అది?

స:- ఏం లేదండీ, పిల్లది...నామీద అలిగిందీ...బ్రతిమాలుతున్నా

చై:- (చీరపాకెట్ యిస్తూ) రాధా! ఈ చీర తీసుకెళ్ళి కట్టుకో. (రాధ తెల్లబోయి-తీసుకు వెళ్తుంది)

స:- అహ్హహ! ఇంకేం !

చై:- ఆ?...ఏమిటి ?

స:- ఏం లేదు బాబూ, అమ్మాయి చీరచూసి— ఆ చీర కడితే బలేసోగ్గా కనిపిస్తుందిగదా- అరొచ్చేటప్పటికి అనుకున్నా.

చై:- ఏడిశావ్‌లే. బైటకూర్చో. చెప్పకుండా వెళ్ళిపోక.

స:- అయ్యో బాబూ, చెప్పకుండా వెళ్తానాండీ? ఆ రెండూ చేతిలో పడ్డే గాని వెళ్ళనుగా.

(అని వెళ్ళి... గబ గబా తిరిగివచ్చి)

ఏదో బండి వొచ్చిందండీ — అబ్బాయిగారు కాబోలు దిగారు.

చై:- ఆ, ఆ. (అని ఖంగారు పడుతూ వుండగానే బాబూరావు వస్తాడు. వచ్చీ వస్తూనే హుషారుగా)

బాబూ:- Hallo Daddy, బలే సంతోషం. చాలా సంతోషంగా వుంది, మిమ్మల్ని కన్పకోవటం.

చై :- నేనూ—

బాబూ:- మీరు సంతోషిస్తారు. నాకూ తెల్సు. నాకామాత్రం తెలియదా?

చై :- కాని—

బాబూ:- కానీ ఎందుకండీ యింకా. మీరు నా తండ్రి. మీ కొడుకును నేనూ. 15 ఏళ్ళయితే మాత్రం అపేక్షలు తగ్గుతాయా ?

చై :- కాని అసలు సంగతి వినవేం ?

బాబూ:- ఇక అన్ని సంగతులూ మర్చిపోండి. పాత సంగతులు విస్మరించి కొత్తవాటికి మార్గం తీద్దాం.

చై :- కానీ- నా మాట వినుమరి.

బాబూ:- హృదయాలు సంతోషంతో నిండివుండగా యింకా మాటలెందు కండీ మాటలు.

చై :- కానీ... నా హృదయం అంత సంతోషంతో లేదు.

బాబూ:- ఇది నేను అసలు నమ్మను. వినను. ఎట్లా వుంటుంది సంతోషం లేకుండా.

చై :- నాకూ సంతోషం అసలు లేకపోలేదు.

బాబూ:- ఆ, అల్లా చెప్పండి.

చై :- కాని నేను నీ తండ్రిని కాను.

బాబూ:- కారూ? (తెల్లబోయి) Damit, చెప్పరేం యిందాకట్టించి.

చై :- మీ నాయన లోపలేదో చేస్తున్నాడు.
(లోపలికి చూస్తూ) శ్రీనివాసం. శ్రీనివాసం.

బాబూ:- అయితే మీరు శ్రీనివాసం కాదన్నమాట.

చై :- అబ్బే, నేనెట్లా అవుతానూ నేనతని స్నేహితుణ్ణి (శ్రీనివాసం యేదో గుడ్డ చేతిలో పుచ్చుకువస్తాడు. రాంగానే) మీ నాయన్న

శ్రీ:- (చేతిలోవున్న గుడ్డ క్రిందపడేసి సంతోషంతో) మావాడా (Pause) (వెళ్ళి కౌగలించుకుంటాడు), నువ్వేనా ~~నువ్వేనా~~ (మళ్ళీ)



కౌగలించుకుంటాడు) ఏదీ? సరిగ్గాచూడనీ, 15 యేళ్ళుగా కనిపించని వాడిని కళ్ళారా చూడనీ.

చై :- కాఫీ పెట్టించినట్లున్నావ్. మర్చిపోయావా శ్రీనివాసం?

శ్రీ:- ఆ. మరే. కాఫీ... రాధా... కాఫీ (లోపలికి తనే వెళ్తాడు.)

చై :- ఇట్లా కూర్చో అబ్బాయ్. నిన్నేమని పిలుస్తారూ?

బా :- బాబూరావ్.

చై :- ఆం. ఏం చదువుతున్నావ్?

బా:- Inter.

చై :- బాగుంది. మీ నాన్న కలలు కంటున్నాడు నీకోసం.

(శ్రీనివాసం కాఫీ తెచ్చియివ్వగా)

బాబు:- ( తాగుతూ ) అబ్బ, రాత్రంతా నిద్రలేదండీ. కళ్ళు తూలి పోతున్నై.

శ్రీ:- పడుకుంటావా? రాధా! ఆ మంచం యిట్లా పట్రా.

చై :- ఆ గదిలోనే వేస్తే బాగుంటుందేమొ.

శ్రీ:- నీకు తెలియదు రాధా! (తప్పు దిద్దుకుంటూ) ఆ. రాధా అంటూ – చైతన్యం అక్కడుంటే సరిగ్గా కనిపించదు. (వెళ్ళి మంచం తెస్తూంటగా బయటనుంచి సర్వయ్య )

శ్రీ.- ఇదిగో సర్వయ్యా అబ్బాయి అబ్బాయిని చూశావా ఇదిగో, వీడే.

స.- చిత్తం బాబయ్యా; చూశానండీ. అబ్బాయిగోరు వచ్చారు గనక నాకు సెలవిప్పిత్తారేమోననీ...

శ్రీ:- వెళ్తావా, పనుందా? పనుంటే పోయి సాయంకాలం రా.

స.- అట్టాగే వత్తానండి కాని ఆ రెండు రూ॥ ఈ పూటే కావాలండి.

శ్రీ:- అదా? అది రాధ యివ్వద్దన్నది. నేనివ్వను.

స:- అదట్లాగే అంటది లెండి- పిచ్చిది. అయ్యిత్తేగాని యియ్యాళ పొయ్యిలో పిల్లి లెగదండి.

శ్రీ:- కాదు. ఇవ్వను. నువ్వు దాన్ని సరిగా చూడటంలేదు. పో! పో! (బాబుతో వేశిన మంచంమీద పక్కవేశి సర్దుతూ.) రా... బాబు. ఇల్లా పడుకో.

స:- కోపం చెయ్యకండి బాబూ. మీకు కోపంవత్తే నెల్లా బతకటం?

శ్రీ:- అందుకని ఏమంటావ్?

స:- వేరేమంటానండీ— ఆ రెండూ యివ్వమంటాను.

శ్రీ:- ఏడిసినట్టుంది. యివ్వను (బాబుతో) పడుకో. బాబూ (సర్వయ్యతో) ఇక పో సర్వయ్యా పో. నే కుట్టించినబట్టలు యెవరికో ఇచ్చావటగా. దాన్ని కొట్టావటగా. ఫో, నీకు చస్తే యివ్వను. పొమ్మని నీక్కాదూ చెప్పటం?
(బాబు వచ్చి పడుకోగా) దిండు యివ్వనా?

బాబు:- వద్దులెండి.

స:- ఇవ్వన్నీ మీకు అదే చెప్పిందాండి?

శ్రీ:- ఆ. అదే చెప్పింది. చెప్పదూమరి.

స:- కోపంతో రెండు వేసినమాట నిజమే కానండీ- అంత మాత్రానికి మీతో చెప్పాలా! ఇంటికి రానియ్యండి. దాని పని పడతా.

శ్రీ:- అది యింటికేరాదూ. నువ్వెళ్ళు.

స:- ఇంటికేరాక యిక్కడే వుంటుందేమండి?

శ్రీ:- వుంటే వుంటుంది.

స:- అయ్యగోరోవ్. దణ్ణం పెడతా! దాన్ని వుంచేసుకుని నన్నూ, నా పిల్లనీ వేరు చెయ్యకండి.

చై:- ఏడిశావ్‌లే అట్టేవాక్క ...వెళ్ళు.

స:- దాన్ని వదిలి నేనెక్కడికెళతాలెండి...వస్తా.

(వెళతాడు.)

శ్రీ:- ఫో ఫో!

శ్రీ:- బాబూ...బాబు నిద్రపోతున్నాడు.

(కాళ్ళగట్టున యెదురుగా నిలబడి) నిద్రపోతున్నాడు. ఆనాడు వుయ్యాలల్లోనూ, తల్లి పొత్తిలిలోనూ ఆదమరచి నిద్రపోయినట్టే-యీనాడునూ. నాటికీ నేటికీ నా కంటికి తేడా కనిపించటంలేదు. ఒక్కసారి కావలించుకోవాలనుంది...కాని మెలకువ వస్తుందేమొ. వద్దులే... ... ఈడుకు తగ్గట్టుగా పెరిగాడు

మొహంలో యవ్వనం తొణుకుతోంది. పెదవులమీద నవ్వు నాట్యం చేస్తోంది. చెక్కిళ్ళు మెరుగు టద్దాలలాగ మెరిసిపోతున్నై. చైతన్యం! నువ్వున్నావని వూరుకున్నాగాని, లేకపోతే వక్కసారి ముద్దాడాలని వుంది. (మధ్యకు నడిచి, తలయెత్తి. enlargement చూసి) నిర్భాగ్యురాలా! నామాత్రం నోచుకోలేదు- నువ్వు.

చై:- ఇన్నాళ్ళూ పండిన వేదాంతిలాగా కనిపించేవాడివి. యిల్లా మమకారంలో పడిపోతున్నావేం శ్రీనివాసం?

శ్రీ:- నువ్వెరగవులే నా మనసు. నాలాగ నీకూ వక కొడుకుంటే.

చై - కొడుకు లేదు. కూతురుండిగా.

శ్రీ:- (యేదో తట్టినట్లు) చైతన్యం!

చై:- ఏం? అల్లా అరిచావ్!

శ్రీ:- ఏంలేదు. నాకో కొడుకు; నీకో కూతురూ వున్నారు. వీళ్ళిద్దరికీ పెళ్ళి చేసి దానిమీదట మన భవిష్యత్తు నిర్మించుకుంటే యెట్లా వుంటుంది?

చై - బాగానే వుంటుంది కాని నీ భావాలిట్లా పరుగెత్తుతున్నాయేం?

శ్రీ:- పరుగెత్తుతున్నాయి. 15 యేళ్ళుగా అణిగిపోయి, వదిలి, వాడి, యెండిపోయిన ఆలోచన లన్నిటికీ ప్రాణం వచ్చి, రెక్కలు విచ్చి, విచ్చలవిడిగా ఎగిరి పోతున్నై. ఈ వేగంతో రాగలిగితే సాగిరా. లేకుంటే ఆగిపో.

కాని మీ అమ్మాయిని యివ్వనంటే సాగదు. ఆ ఆ. వాడు నిద్ర పోతున్నాడు. భోజనం వేళకి తిరిగి వద్దాం. లే-పద. (చైతన్యం ఏదో మాట్లాడబోగా) ఎక్కడికని అడగకు, పద పోదాం.

(ఇద్దరూ బయలుదేరి వెళ్తారు)

[సర్వయ్య లోపలికి వస్తాడు]

స:- రాదా- రాదా! (రాధ వస్తుంది)

స:- అయ్యగోరితో అన్నీ చెప్పేసి నట్టుండావే.

రా:- చెప్పా. ఏం చెపితే?

స:- చెప్తావ్ చెప్తావ్- దవడ యీపళాన బద్దలు కొడితే యెవరే నీకర్థం వచ్చేది? ఊరుకుంటుండానని ఊగిపోతున్నావే. పనీవద్దు పాటావద్దు రేప్పొద్దుట్నించీ యింటికాడే పడివుండు.

రా:- ఏ యిల్లు? నీ యింటికి నేరాను.

స:- ఊఁ?

రా:- నీ యిల్లూవద్దు, నీ పోషణావద్దూ, నారెక్కల్లో శక్తుండగా నా పొట్ట నే పోషించుకోగలనులే.

స:- ఆ? చాలా నేర్చావే?

రా:- నేరిస్తే నేర్చాలే. నేర్చకపోతే నీకుమల్లే నీచంగా తయారయేదాన్నే.

స.- ఏమిటే కూస్తావ్? (అని చెయ్యెత్తి కోపంగా మీద కెళతాడు) (బాబు లేచి అడ్డుపడి)

బా:- ఏయ్! ఏయ్! ఆగవయ్యా ఆగు. ఈడొచ్చిన ఆడపిల్లని అమాంతం కొట్టబోతున్నావే... అందులో యిలాంటి పిల్లను.
(రాధవంక చూస్తాడు)

స:- ఆ? (ఏమిటీ?? అని ఆశ్చర్యంగా అన్నట్టు)

బాబు:- పాపం, ఆ కళ్ళుచూడూ...కవిని కాదు కాని యేదో వర్ణించే వాణ్ణే యీపాటికి.

స:- ఆ. (స్వరం తగ్గిస్తాడు అలాగా అన్నట్టు.)

బా:- ఆ చూడు. కళ్ళు భయంతో వణుకుతున్నాయి. పెదవులు అదురుతున్నాయి. ఎరుపెక్కాయి చెక్కిళ్లు.
(తడుముకుంటూ) ఇంకా ...ఇంకా
(రాధ కోపంగా లోపలికి వెళ్ళిపోతుంది)

బా:- ఎవరా అమ్మాయి? అంతగా కోప్పడి కొట్టబోతున్నావ్?

స:- అమ్మాయా, మన అమ్మాయేలెండి. మనింట్లోనే పని చేస్తోంది. అయితే మనం ఏవూరినుంచి వచ్చాం బాబూ, కొత్తపురంనుంచి కాదుగదా ?

బాబు:- అంతా ''రాయల్ వ్యవహారంగా'' వుందే! అయితే మనం ఎవరేం ?

సర్వ:- అట్టా ఎరగనట్టు అంటారేం బాబూ, (నవ్వుతూ) మనం మనం వక టేగా.

బాబు:- ఆ ఆ వక టేగా! అమ్మాయి మన అమ్మాయే.

సర్వ:- బాబుగారు కాస్త రసికత్వం తెల్సినవారే.

బాబు:- తెలియక పోవటమేం. కాస్తోకూస్తో నీటోటివాళ్ళ సావాసం వుంటే.

సర్వ:- అయితే నేనెందుకు బాబు, వెళ్ళిరానా?

బాబు:- ఓ శీఘ్రంగా.

సర్వ:- సరి...(సందేహిస్తూ) బాబూ!

బాబు:- ఏం ?

సర్వ:- మరేంలేదు బాబు! నే వెళ్ళొస్తాగాని, యిబ్బందిలో చస్తుండాం. వక నాలుగు రూపాయలు యిప్పించండి.

బాబు:- (జేబులు తడుముకొని) ఊఁ ... చిల్లర లేదే.

సర్వ:- పోనీ, అయిదూ పారెయ్యండి, రేపటికి కూడా వస్తుంది.

బాబు:- ఆహా! బాగా చెప్పావ్-ఊఁ, నీ పేరేమన్నావ్?

సర్వ:- సర్వయ్యంటారండి.

బాబు:- ఆ. సర్వయ్యా, చూడూ! మనకివున్న సర్వస్వం యీ కోటు (కోటు పుచ్చుకు చూపిస్తూ) ఈ కోటులో 5 జేబులున్నాయి. ఐదు జేబుల్లో నాలుగు జేబులు ఖాళీ. 5 వ దాంట్లోవున్న సర్వస్వం యీ రెండు రూపాయలు. ఇది మన Balance, ఇక నీ కెంత కావాలో అడుగు.

స:- ఇక ఏమడుగను. ఆ రెండే యిప్పించండి.

బాబు:- అహ! అయితే కళ్ళు మూసుకో. (సర్వయ్య మూసుకోగా) వెనక్కి తిరుగు. (తిరగ్గా మెడమీద చెయ్యేసి గెంటుతూ) Get out rascal.

స:- (క్రిందపడి లేచి, కోపంగా) మీకేకాదండోయ్ నాకూ ఇంగ్లీషొచ్చు. నేనూ దొరలదగ్గర రెండేళ్ళు వంటచేశా. మనవంక కాస్త కనిపెట్టి చూడండి.
(బయటికి కోపంగా వెళ్తాడు)
(లోపల్నించి రాధ వస్తుంది)

రా:- మిమ్మల్ని డబ్బడిగినట్టున్నాడు ?

బాబు:- అడిగాడు.

రా:- అడుగుతాడు, ఇవ్వకండి.

బాబు:- ఏం?

రా:- వాడుత్త పొగరుపోతు, రౌడీ, ముండల ముఠాకోరు.

బాబు:- అంతేకదా!

రాధ:- మీబోటి వాళ్ళని యిల్లా అడిగి-తీసుకుని తగలేస్తాడు.

బాబు:- Very Good.

రాధ:- అది చెప్పటానికే వచ్చాను. వస్తా (వెళ్ళబోతుంది)

బాబు:- కాని వెళ్ళకు... (రాధ వెళ్ళిపోయింది) అమ్మా... తారాజువ్వ... ఇదిగో అమ్మాయి. నీ పేరేమిటి? పలకవేం—తారేనా? తారా—
(తనూ లోపలికి వెళతాడు)

[కాసేపటికి రాధ గబగబా బయటికి వస్తుంది. వెనకనే బాబు వస్తాడు.]

బాబు:- అంత రుసరుసలుగావుండే మొహం.

రా:- ఏం, ఎల్లావుంటే మీకేం ?

బాబు:- ఒక అపురూపపు అపరంజి బొమ్మ అగ్నిహోత్రం లాగ మండి పోతుంటే, ఏ సౌందర్య పిపాసి, చూసి, సహించగలడు ?

రా:- ఆగండి. (కోపంగా చూస్తుంది అతనివంక.)

బాబు:- ఆ. అట్లా అట్లాగేవుండు (కళ్ళల్లోకి చూస్తూ) తెల్లని కళ్ళల్లో నల్లని పాపలు — అదో అందం, ఎర్రని కళ్ళల్లో కోపంతో కదిలే కనుపాపలు—ఇదో అందం.

రా:- ఛీ (వెళ్లిపోతుంది, విసుగ్గా)

బాబు:- ఛీ-ఇదివరకే సరసం నేనెరగనే, అల్లా పరుగెత్తుతావేం [వెంట పోబోతాడు]

[వెళ్ళబోయిన రాధ ఎదురు తిరిగివచ్చి-]

రా:- (కోపంగా) నా వెనకనే వస్తారెందుకు?

బా:- పేరన్నా చెప్పకుండా అల్లా పరుగెత్తుతావేం?

రా:- పేరుకోసమా, మీరు రావటం?

బా:- మరి యింకెందుకనుకున్నావ్?

రా:- (కోపంగానే) అయితే పేరు రాధ.

బా:- రాధ! రాధ! హృదయ వేధ, (రాధాకృష్ణుల పటంవంక చూస్తాడు)

రా:- ఏమిటి మీరనేది?—

బా:- అహ-అదేం పటం. దాన్లో వక రాధాకృష్ణుల జంట. దాని ముందో రాధా రమణుల జంట.

రా:- వళ్లు మంట.

బా:- ఏమంటావ్ ?

రా:- వచ్చి వక గంట కాలేదు. మీ ధోరణి యేమీ బాగా లేదంటాను. మీ నాన్నగార్తో చెప్తానంటాను.

బా:- ఏమిటి, నామీద నెపం వేస్తున్నట్టున్నావ్ ?

రా:- నేను నెపం వేస్తున్నానా ?

బాబు:- మరి నాన్నగారితో చెప్తానంటున్నావ్ ?

రా:- మరి చెప్పనూ, ఇట్లా...ఇట్లా (ఎట్లాగో చెప్పటానిక్కి సిగ్గుపడి ఆగి పోతుంది)

బాబు.- ఇట్లా-ఆ-ఇట్లా...నేనేం చేశానిప్పుడు?

రా:- (కోపంగా, విసుగ్గా) ఏం చేశానుట? ఏం చేశాను.

బా:- (రాగయుక్తంగా)
పూలమేల్ముసుగునే తొలగించి తొంగిచూసేవూ॥
మనసిచ్చి మాటాడ మనసు లేదే నీకు చిలకా॥
(రాధ కోపంగా అతనివంక చూడగా, బాబు తల వేరేవైపుకి నెమ్మదిగా తిప్పి "చిలకా" అంటూ ఆలాపిస్తాడు.)

రా:- (కోపంగా) అది ఏమిటండీ?

బాబు:- (తడుముకొంటూ) పాట-నాటకం...నాటకం పాట.

రా:- బాగుంది నాటకం.

బాబు:- బాగుందా...నిజంగానేనా? (దగ్గరికెళతాడు.)

రాధ:- (దగ్గరకు రాంగానే కాళ్ళమీద వాలి) మీకు దణ్ణం పెడతాను. నా జోలికి రాకండి. మీరెక్కడ; నేనెక్కడ? మీకూ నాకూ సాపత్య మెక్కడ? పచ్చని కొమ్మ-మచ్చ మాపకండి. గొంతు నులిమి గోతిలో పారేసినా యిష్టమే. గుణాన్ని చంపి గోతిలో తొయ్యకండి. మీ తండ్రిగారు నన్ను కూతురిలాగ పెంచారు. తోడబుట్టినదానిలాగ నావంక చూడండి. మీరు చదువుకొన్నవారు. చదువులేని దాన్ని నేను. మీ కడుపున పుడతాను. చదువులేనిదాన్ని "నీతి లేనిదాన్ని" చేసి నన్ను నిందలపాలు చేయకండి. (తలయెత్తి) నేనిప్పటికే

రెక్కలువిరిచి కట్టిన పిట్టలాగ కొట్టుకుంటున్నాను. రెక్కలు కత్తిరించి నా జీవితాన్ని పాప కూపంలో పడవెయ్యకండి. మీ పాదాలంటి ప్రార్థిస్తాను. (మళ్ళీ పాదాలంటి లేస్తుంది) నా బ్రతుకు నన్ను బ్రతకనివ్వండి. నన్ను బాధపెట్టకండి (దుఃఖిస్తూ వెళ్ళిపోతుంది.)

బాబు:- రాధా రాధా! (అంటూ వెనకనే వెళ్ళి ఆగాడు...వెళ్ళాడు. బయట నుంచి ఈల వేసుకుంటూ సర్వయ్య వస్తాడు. అంతా కలియచూసి ద్వారందాకా వెళ్ళి విన్నట్టు అభినయించి వెనక్కి వచ్చేస్తాడు. కాసేపటికి రాధ వెనకనే బాబు వస్తారు. వీళ్ళని చూసి సర్వయ్య బయటికి తప్పుకుంటాడు.)

రాధ:- ఎంత చెప్పినా వినరే. మీ నాన్నగారొచ్చే వేళయింది, వారు చూస్తే ఏమంటారు ?

బాబు:- ఏమంటారూ?

రాధ:- చూసి వూరుకుంటారా ?

బాబు:- ఊరుకోక యేం చేస్తారు?

రాధ:- ఏమైనా చేస్తారు. వారు మీ నాన్నగారు.

బాబు:- కాదు.

రా:- ఏమంటారూ!

బాబు:- ఆయన తండ్రీకాదు; నేను కొడుకునూ కాదు.

రా:- అనేమాట అర్థం చేసుకునే అంటున్నారా !

బా:- అర్థంచేసుకోలేని అంధకారంలో లేను.

రా:- అంధకారంలోపడే అంధులైపోయారు. లేకపోతే యేమిటిది?

బా:- నువ్వేమనుకున్నా సరే.

రా:- కాని-మీ మూర్ఖం వదలరు.

బా:- ఆహ !

రా:- కాని యీ కంఠంలో ప్రాణం వుండగా మీ కోరిక తీరదు. (వెళ్తుంది.) (బాబు అటే చూస్తూ నుంచుండగా సర్వయ్య బయటనుంచి వస్తాడు)

స:- అయ్యగారు మాచెడ్డ ఆలోచనలో వుండారే.

బా:- ఆ !

స:- ఏదో పెద్ద పని మీదుండారు.

బా:- ఎందుకొచ్చావు మళ్ళీ ?

స:- ఏం లేదు బాబయ్యా; ఆ రెండూ యిస్తారేమోనని.

బా:- ఊ ?

స:- ఇందాక అడిగుండా సూడండి.

బా:- ఇవ్వను, పో.

స:- (నవ్వి) కొత్త బిగువంతే లెండి. కొంత బండి సాగితే మీరే నన్ను కనిపెట్టి సూత్తారు. నావోటోళ్ళని మీరు కనిపెట్టి చూడకపోతే మరెవరు చూస్తారు, బాబూ ? నేను రాధ తండ్రిని.

బా:- అయితే ?

స:- కష్ట సమయంలో నన్ను కనిపెట్టుంటే- కోరినవన్నీ తెచ్చి కాళ్ళ మీద పడేస్తా.

బా:- ఏ మక్కర్లే; పో అవతలకి.

స:- పోదల్చుకుంటే మిమ్మల్ని తీసుకే ఎళ్లాలెండి.

బా:- ఏమిటి నువ్వనేది?

స:- ఆ రెండూ పారెయ్యండి.

బా:- బెదిరించి మాట్లాడుతున్నావే!

స:- బెదిరింపుదాకా ఎందుకులెండి. నా గుట్టు మీ కెరుక లేదుగాని, మీ లోగుట్టు నాకెరికే.

బా:- ఏమిట్రా నువ్వు వాగేదీ?

స:- ఆ. అయ్యగార్కి కోపంలో తల పనిచెయ్యదులాగుందే ?

బా:- పళ్ళూడతాయ్- పేలావంటే.

స:- ఆ బెదిరింపులేం లాభంలేదు లెగండి.

బా:- (కోపంగా) లాభంలేదూ (చెంపకాయ కొడ్తాడు.)

స:- సరేలెండి; ఈడి సంగతి తర్వాత తెలుస్తుంది.

(వెళ్తాడు.)

బా:- [లోపలవైపుకి నడిచివెళ్లతూ రంభా రావణాసురుల బొమ్మమీద చెయ్యివేశి నుంచుని లోపలికి చూస్తాడు. కాసేపు ఆలోచించి లోపలికి వెళ్తాడు. కొంత తడవయిన తర్వాత శ్రీనివాసం, చైతన్యం బయట నుంచివస్తారు.]

శ్రీ:- (ప్రక్కమీద బాబు లేకపోవటం చూసి) ఏడీ వీడు?

చై:- లోపలికెళ్ళాడేమొ

శ్రీ:- అప్పుడే లేచాడే నిద్ర!

చై:- మరయితే టీపార్టీకి ఎవర్ని పిలవాలో... అది చెప్పు.

శ్రీ:- టీపార్టీకేగా; మనవాళ్లందర్నీ పిలు. ఫర్వాలేదు. రేపు సాయంకాలంగా- Time వుందిలే. ఇదిగో, ఈ డబ్బు నీదగ్గరుంచు. Hotel లో ఎడ్వాన్సు యివ్వటానికీ- దానికీ-వుంటుంది. వీడు రాలేదేం యింకా?

చై:- వస్తాడే...అదిగో- ఏదో మాట్లాడుతున్నాడు రాధతో.

శ్రీ:- (తనూవిని) ఆ. మాట్లాడుతున్నాడు రాధతో— రాధ ఆ చీర కట్టుకుందో-లేదో చూసి వస్తానాగు.

చై:- కాసేపట్లో యింత యిదవుతావేం శ్రీనివాసం! ఎంత కొడుకైతే మాత్రం.

శ్రీ:- ఆ?

చై:- ఎంత కొడుకైనా- అంత మమకారం పనికిరాదయ్యా.

శ్రీ:- ఉహ్హూహు (నవ్వేశి) ఏదో 15 యేళ్ల తర్వాత చూడటం చూడు (ధోరణి మార్చి) ఆ మరి నువ్వెళ్ళిరావూ...?

చై:- ఎక్కడికి?

శ్రీ:- అప్పా; మనవాళ్లందర్నీ పిలవద్దూ టీ పార్టీకి? - తర్వాత Time వుండదు.

చై:- మరేంభయంలేదు. అదంతా నా కొదిలెయ్యి. ఇంతకూ అసలు సంగతి మాట్లాడవేం?

శ్రీ:- (లోపలికి చూస్తూ) ఏదీ ?

చై:- మా అమ్మాయిని మీ అబ్బాయికివ్వటం.

శ్రీ:- అదా! దానికేం తొందరలే

చై:- మరి పార్టీకేనా తొందర?

శ్రీ:- చూద్దాంలే. మావాడికి మీ అమ్మాయిని చూపించి- చూసిన తర్వాత- అన్నీ ఆలోచించి, యేర్పాటుచేద్దాం

చై:- (నిరాశతో) సరేలే! ఆలోచనలో పెట్టావ్ !

శ్రీ:- అట్లా అంటావేం ? నాకిష్టమయితే సరా ? వాళ్ళిద్దరూ వప్పుకోవాలా వద్దా? తీరా మీ అమ్మాయే వద్దనవచ్చు. ఆలోచించుకో.

చై:- అయితే ఒక పనిచేద్దాం. మా యింటికి రాత్రి భోజనానికి రావాలి- మీరిద్దరూ. దాంతో చాలాభాగం తేలిపోతుంది.

శ్రీ:- అవా! అల్లాగేకానీ. నిన్ను కాదనగలనా... ఇంకా రాడేం వీడు? (పోబోతాడు.)

చై:- కొడుకును చూసుకుంటేగాని కాలాగేటట్టులేదు. వెళ్ళిచూసిరా. ఆదుర్దా తగ్గుతుంది.

శ్రీ:- (నవ్వి) వస్తా. వెళ్ళివస్తా. ఉంటావుగా (వెళ్తాడు.)

[ కాసేపటికి ఖిన్నుడై వచ్చి వెనక Table మీద కూలబడి పోతాడు.]

చై:- (ఖంగారుగా) శ్రీనివాసం, శ్రీనివాసం, ఏమిటిది?

శ్రీ:- (కోలుకొని) ఏం లేదు.

చై:- ఏం జరిగింది?

శ్రీ:- ఏం జరగలేదు.

చై :- అబ్బాయి యేడీ? ఎక్కడ? (లోపలికి పోబోగా)

శ్రీ:- (బిగ్గరగా) వెళ్లకు లోపలికి.

చై :- (ఆగి) ఏం?

శ్రీ:- ఏంలేదు వెళ్లకు; వెళ్తేమన స్నేహంమీద వట్టు.

చై :- నాకేం అర్థమవటం లేదు.

శ్రీ:- అర్థం కాకపోవటమే మంచిది. అర్థం కాకపోవటమే మంచిది. ఈ భగవంతు డెందుకివ్వాలి నాకీ కష్టం?

చై :- ఏం జరిగిందయ్యా; అసలు సంగతి చెప్పవేం?

శ్రీ:- చెప్తానయ్యా చెప్తా ... ఎట్లా చెప్పాలా అనే...
[సర్వయ్య, పోలీసు ఇన్‌స్పెక్టరు, ఒక పోలీసు వస్తారు.]

శ్రీ:- (సర్వయ్యనుచూసి ఆశ్చర్యపోయి) సర్వయ్యా !!! ఎందుకొచ్చావ్?

స:- రెండు రూపాయలకోసం కాదు లెగండి. అవతారం యెత్తిన అబ్బాయి గారికోసం వచ్చా.

చై :- ఎందుకూ ?

స:- ఎందుకో తెలుస్తుంది లెగండి; మీ అబ్బాయినీ మా అమ్మాయినీ బయటికి రమ్మనండి.

శ్రీ:- ఆ !

స:- ఆ, అందుకే యీరినీ తెచ్చుకున్నా, ముందు వాళ్ళిద్దర్నీ రమ్మనండి.

శ్రీ:- (దిగాలుగా) సర్వయ్యా!

స:- (కర్కశంగా) సర్వయ్య!

శ్రీ:- సర్వయ్యా - మాట. నీకాక్కావల్సింది డబ్బేగా?

స:- కాదు; అమ్మాయి.

శ్రీ:- మీ అమ్మాయి సంగతి నేచూస్తా. నన్ను గోల చెయ్యకు. డబ్బుకావాలంటే తీసుకో. ఎంత కావాలి ? వంద కావాలా ? వెయ్యికావాలా ? చెప్పు ఇప్పుడే యిస్తా.

స:- (మెత్తబడి) యిప్పుడే యిస్తారా !

ఇన:- ఆ, ఆ, యిప్పుడే యిస్తారు. లేకపోతే ఎట్లా, కాని కంప్లైంటు దాఖలయింది, ఇప్పుడు చర్య మాది.

శ్రీ:- (ప్రార్థేయపూర్వకంగా) ఇనస్పెక్టరుగారూ !

ఇన:- ముందు మీ అబ్బాయిని పిలవండి. లేదా మేమే పిలుస్తాం.

శ్రీ:- (నిస్సహాయతతో) చైతన్యం !

ఇన:- పదండి తర్వగా.

శ్రీ:- నా మాట వినండి. మీ మేలు మర్చిపోం.

ఇన:- మర్చిపోరు. మర్చిపోరు. అది నాకు తెల్సు, కాని case book చేసుకున్నాం. ముందు మీ అబ్బాయిని వప్పగిస్తే తర్వాత మీతో తీరుబడిగా మాట్లాడతాను.

చై:- ఏమిటండీ ఇదంతా; అసలు సంగతి ఎవ్వరూ చెప్పరేం ?

ఇన:- ఎవ్వరూ చెప్పలేదూ ! అప్పుడే వూరంతా గోలయిపోతే, రోడ్డుమీద ఎవరి నడిగినా తెలిసేదే ! ! కేసు లెండి. Rape కేసు; వీరి అబ్బాయి మీద (సర్వయ్యతో) పదవయ్యా లోపలికి.

శ్రీ:- ఆగండి.

ఇన:- ఏం ?

శ్రీ:- మా అబ్బాయే గా మీక్కావల్సింది ? నేనే వప్పగిస్తా తీసుకువెళ్లుదురు గాని- ఆగండి. చైతన్యం, ఇందాక నీకిచ్చింది యిట్లా యియ్యి.

చై:- ఏది ?

శ్రీ:- అదయ్యా- (డబ్బుని సౌఙ్ఞగా చేసి) ఆ (అతను జేబులోంచి డబ్బు తీసి యివ్వగా దాన్ని తన జేబులో పెట్టుకుంటూ లోపలకి వెళతాడు.)

ఇన:- (సర్వయ్యతో) ఏమోయ్ మాదగ్గరకొచ్చి "పిల్ల అన్యాయమైపోయిం" దని బయటదేరేదాకా అంత గోలపెట్టావ్ - ఆయన డబ్బిస్తానే సరికి - కరిగిపోయావేం?

స:- ఏదో బీదోళ్ళం బాబూ?

చై:- సర్వేయ్యా, అసలు జరగటం నిజమేనా?

స:- నిజమే బాబూ! అడ్డంపోతే నా గూబ పగలగొట్టాడు.

చై:- ఎవరూ!

స:- ఆడే. అబ్బాయినంటూ దిగాడు.

ఇన:- (లోపలికి చూస్తూ) ఇంకా రాడేం యీయన.

చై:- వస్తాడు...ఏమిటో గోల, కాస్త బయటకిపోయి, Bank లో డబ్బు Draw చేసుకు వచ్చేసరికి - ఇట్లా జరిగింది.

స:- జరిగింది బాబూ - జరిగింది-నేకిక్కడ వుండగానేగా. రెండు రూపా యం కోసం నేనిక్కడ కూకుంటే-
ఆ రెండూ లేకుండా- యీ వందా లేకుండా జరిగింది.

ఇన:- ఏడీ యీయన ? ఇంకా తిరిగి రాలేదు ?

చై:- వస్తాడు.

ఇన:- పిల్చుకు రావటాన్కి యింతసేపెందుకు ?

చై:- కాస్త ఓపిక పట్టండి. 15 యేళ్ళయిన తర్వాత కొడుకు తిరిగి వచ్చాడు. చూసి పూర్తిగా సంతృప్తి పడనేలేదు. ఇంతలో జైలుకి పంపాల్సి వచ్చింది.

ఇన:- ఏదైతేనేమండి. అంతగా అయితే Bail అప్లికేషన్ పెట్టి తంటాలు పడాలిగాని- మమ్మల్నిల్లా నిలబెడితే ఎట్లా?

స:- నిలబడకండి బాబూ, కూకోండి. (కుర్చీ ముందుకు లాగి వేస్తాడు)

ఇన:- ఏడిచినట్టుంది. (పోలీసుతో) లోపలికెళ్ళి పిల్వవోయ్ !

చై:- (లోపలికి చూసి) అదిగో వస్తున్నాడు.
(శ్రీనివాసం విచారంగా, నిశ్చలంగా వస్తాడు.)

ఇన:- ఏడండీ మీ అబ్బాయి ?

శ్రీ:- లేడు.

చై:- (తెల్లబోయి) ఏమయ్యాడు ?

శ్రీ:- పరారీ అయ్యాడు.

ఇన:- పరారా ! ఎట్లా పరారీ అయ్యాడు ?

శ్రీ:- ఏమొ.

ఇన:- ఏమోనా ! మా కన్ను కప్పుదామనే... ఆ. మీరు లోపలికి తీసుకెళ్ళిన డబ్బేదీ? (వెతకబోగా)

శ్రీ:- లేదు

ఇన:- ఏమయిందేం ?

శ్రీ:- ఏమో !

చై:- శ్రీనివాసం !!!

ఇన:- ఏమోనా. తెలుస్తుందాగండి, ఆ డబ్బూ వస్తుంది, మీ కుర్రవాడూ వస్తాడు- వెతుక్కుంటూ! ఏయ్, వీరికి బేడీలు వెయ్యవోయ్. (పోలీసు బేడీలు వేస్తాడు)

చై:- ఎందుకూ?

ఇన:- ఎందుకా? నేరస్థుణ్ణి నెమ్మదిగా దాటేయించినందుకు, డబ్బుకూడా యిచ్చి, దొడ్డిదోవని ఆయన్ని సాగనంపినందుకు. ముందీయన్ని కుక్కితే- ఆయన తేల్తాడు. ఎక్కడికి పోతాడు- చుట్టూరా సముద్రం వుంటే. ఏయ్ సర్వయ్యా- మీ అమ్మాయినిగూడా ఠాణాలో హాజరు పెట్టు

సర్వ:- చిత్తం. నే పిలిస్తే అది రానంటుందండి.

ఇన:- రానంటే జుట్టట్టుకు లాక్కురా. లేకపోతే నువ్వూ వెళతావు-లాకప్ లోకి. పదండి.

(అప్పటికి బేడీలు వెయ్యటం అయిపోయింది.)

శ్రీ:- పదండి.

చై:- శ్రీనివాసం! (అడ్డంపోయి దిగాలుగా.)

శ్రీ:- చైతన్యం! (నవ్వి) నే బ్రతికివుండటంలో అర్థంవుంది చూశావా ఏ జన్మకైనా వక ప్రయోజనం వుంటుంది. ఇట్లా అయినందుకు విచార మల్లా (లోపల్నించి రాధవచ్చి కనిపిస్తుంది. దానివంక చూసి) దాని బ్రతుకిల్లా బ్రద్దలైందిగదా అని. (నిట్టూర్పు)పదండి. (ఇన॥ పోలీ॥ శ్రీని॥ వెళ్ళారు.)

చై:- (ఆవేశం అపుకుంటూ) సర్వయ్యా!

స:- (విచారంతో) అయ్యా.

చై:- నీకు డబ్బు కావాలిగాదూ?

స:- అక్కర్లేదుబాబూ అక్కరలే; బుద్ధి గడ్డితిన్నది. ఉక్రోషంలో గుడ్డా ణ్ణయిపోయా గోవువంటి మారాజుని కటకటాలపాలు చేశా. తొందర బడ్డా, (బాగా దుఃఖంతో అంటాడు.)

చై:- నీకూ హృదయముందా, సర్వయ్యా! చట్టాల కట్టుదిట్టాలకు లేని హృదయం నీకుందా... 11 గం. ల బండీ వచ్చినట్టుంది. పద; శ్రీని వాసం సంగతేమిటో, ప్లీడర్లనీ, వాళ్ళనీ, విచారిద్దాం. (రాధ కూల బడింది)

[ఇద్దరూ లేచి వెళ్ళబోతుండగా తెర వెయ్యదలిస్తే వేసుకోవచ్చు.]

## 2 వ రంగం

[ఆదేగది, మరొక రెండు గంటల తర్వాత రాధ వంటరిగా కూర్చొని వుండగా...కొంతసేపటికి వక 18 ఏళ్ళ కుర్రవా డొస్తాడు.]

కుర్ర:- శ్రీనివాసంగారిల్లు ఇదేనాండి?

రాధ:- ఇదే.

కుర్ర:- వారున్నారా?

రాధ:- లేరు.

కుర్ర:- ఎక్కడి కెళ్ళారండి ?

రాధ:- ఏమో. (వెళ్ళబోతుంది)

కుర్ర:- వారెక్కడికెళ్ళారో చెపితే వెళ్లి కల్సుకుంటాను. కాస్త చెపుతారా?

రాధ:- తెలియదు (వెళ్ళబోతుంది)

కుర్ర:- క్షమించాలి నేను వారి అబ్బాయిని వారిని కల్సుకోవాలి...

రాధ:- ఆఁ!!!

కుర్ర:- చిన్నప్పట్నుంచి వారిని చూడనేలేదు. వారెక్కడ కనిపిస్తారో చెప్పండి.

రాధ:- (దిగ్భ్రమతో అటూ ఇటూ చూశి లోపలికి పరుగెత్తుతుంది.)

కుర్ర:- అదేమిటి-కాస్త ఆగండి. (కాని రాధ వెళ్లిపోయింది. చేసేదిలేక కుర్రవాడు దిక్కులు చూస్తాడు.)
(బయటనుంచి సర్వయ్య వస్తాడు)

కుర్ర:- (సర్వయ్యతో) ఇది శ్రీనివాసంగారి ఇల్లేనా?

స:- ఆ. యేం?

కుర్ర:- వారెక్కడికెళ్ళారో మీకు తెల్సా?

స:- ఆ.

కుర్ర:- నేను వారబ్బాయిని—కాస్త...

స:- (తెల్లబోయి) ఆ!!!

కుర్ర:- ఆ వార్ని వెంటనే కల్సుకోవాలి. యెక్కడున్నా రాయన?

స:- (పరకాయించి చూసి బయటికి గబగబా పరుగెత్తాడు)
(కాసేపటికి బయటనుంచి చైతన్యం వస్తాడు )

కుర్ర:– మీరేనా శ్రీనివాసంగారంటే ?

చై:- కాదు.

కుర్ర:- అయితే వారెక్కడుంటారు ?

చై:- వారూ...

కుర్ర:- నాకోసం కనిపెట్టుకుంటానని వ్రాశారు. ఇక్కడలేరు. ఎక్కడుంటారో చెప్పండి

చై:- మీరెవరూ?

కుర్ర:- వారి అబ్బాయిని.

చై:- ఆ!! అబ్బాయా!!!

కుర్ర:- ఇదిగో ఆయన వ్రాశి పంపిన వుత్తరాలు.

చై:- (తెల్లబోయి మంచంమీద కూల బడతాడు.)

కుర్ర:- ఏమిటండీ యిది, ఇల్లా కూలబడి పోయారేం? అంవరూ యిల్లా తెల్లబోతారేం? మాట్లాడరేమండి? ఏమండీ, మిమ్మల్నే : (మనిషిని కుదిలిస్తాడు. చైతన్యం కదలడు. కుర్రవాడు నాడి చూస్తాడు. చైతన్యం తెప్పరిల్లి.)

చై:- రాధా, రాధా! కాసిన్ని మంచినీళ్ళుపట్రా అమ్మా! నువ్వా, శ్రీనివాసం కొడుకువి?

కు:- అవునండి. నేనే, చూడండి-నాన్నగారు నాకు పంపిన టెలిగ్రాము.

చై:- ఆగు చూస్తా మంచినీళ్ళు తాగనీ (రాధ మంచినీళ్ళు తేగా, త్రాగి) ఆ; ఏవీ? (అని వుత్తరాలు తీసుకుచూసి) అయితే, నువ్వన్నమాట, శ్రీనివాసం కొడుకువి!! ఏబండికివచ్చావ్?

కు:- 11 గంటలబండికి వచ్చాను.

చై:- అహ్హా! శ్రీనివాసం 9గం॥ లకే వస్తావనుకున్నట్టున్నాడు.

కు:- అసలు బయలుదేరటం ఆ బండికే బయలుదేరాను. కాని నా పెట్టె, Bed ఎవరోకాజేశారు, అవ్వి వెతుక్కోవడంలో ఆబండి దాటింది! అవి దొరకనూలేదు. చేసేదిలేక, తర్వాత బండికి బయలుదేరాను.

చై:- ఓహో! (వెనక పెట్టివున్న పెట్టే, Bed చూపించి) ఆ పెట్టే-Bed నీవేనా?

కు:- ఇవ్వే! ఇక్కడికెల్లా వచ్చాయి? (ఆశ్చర్యంతో వాటిదగ్గరకుపోయి చూసుకుంటాడు)

చై:- గాభరాపడకు. అంతాతెలుస్తుంది. మీనాన్నను నేవెళ్ళి తీసుకువస్తా నండు.ఆ రాధా, యితనికి కాఫీ కావాలేమొ-యియ్యి [వెళ్ళిపోతాడు]

కుర్ర:- ఆగమ్మాయి...... యేమిటిదంతా? నన్నుచూశి గాభరా పడ్డారేం, అందరూ?

రాధ:- ఏంలేదు

కుర్ర:- (ఇక బాబు no (2) ఏంలేదూ? నాకేం అర్థంకావటం లేదు. నువ్వు. నాకేమవుతావు?

రా:- ఏమవను.

బాబు(2):- ఏమవవ్? ఏమవకుండా యిక్కడెందుకుంటున్నావ్?

రా:- నేనీయింట్లో పనిచేసే మనిషిని.

బాబు(2):- ఆహా మా నాన్నగారేరీ.

రా:- 9 గంటలబండికి మీ బదులు వేరే ఎవరో వక రౌడీ "తన కొడుకు నంటూ"దిగాడు. అందరూ వాడే కొడుకని నమ్మారు. వాడు వక అపచారంచేస్తే- పట్టుకోటానిక్కి పోలీసులు వచ్చారు. మీ నాన్నగారు వాణ్ణి తప్పించి, తప్పించిన నేరానికి తనే జైలుకి వెళ్ళారు.

బాబు(2):- ఆ!

రా:- కొడుకు మీద ప్రేమతో – కొడుకుకోసం కన్నతండ్రి త్యాగం చేశారు.

బాబు(2):- అరరే, నాసామాను తాజేసిన వెధవే అయి వుంటాడు వీడు మా నాన్న! అబ్బ... ఆయన్ని చూడాలి త్వరగా. ఎక్కడా ఆయన Photo అన్నాలేదూ? (చుట్టూరా చూస్తాడు)

రా:- ఇక్కడలేదు. లోపల వక చిన్న Photo వుండాలి. తేనా వెతికి-?

బాబు(2):- ఉందా! తీసుకురా—తొందరగా, (రాధ వెళ్ళింది)

[బాబు తల్లి Photo దగ్గరకెళ్ళి తేరిపార చూస్తాడు. "మరణం 1988" అని చదువుతాడు. తలవంచుకుంటాడు. బయట నుంచి ఇనస్పెక్టర్ వస్తాడు]

ఇన:- ఈ యింట్లో వక అమ్మాయివుంది. 'రాధ' అని, పిలవండి.

బాబు2:- వస్తుందాగండి.

ఇన:- త్వరగా పిలవండి. వక Statement తీసుకోవాలి.

బాబు2:- ఏ Statemenet?

ఇన:- ఏదోవకటి. పిలవండి. ఇక్కడ వక Rape కేసు జరిగింది. ఆమె దగ్గర Statement తీసుకోవాలి.

బాబు 2:- ఎక్కడా?

ఇన:- ఎక్కడా !! ఇక్కడే; యీ యింట్లో-ఏదో అడివిలోంచి సరాసరి యీ యింట్లోకి దిగినట్టు మాట్లాడతారేం?

బాబు 2:- అడివిలోంచే వచ్చాను. ఏమీ తెలియని మాటా నిజమే. నేను శ్రీనివా సంగారబ్బాయిని. యిప్పుడే వచ్చాను.

ఇన:- What !!!

బాబు 2:- What యేమిటి, What?

ఇన:- శ్రీనివాసంగారబ్బాయి! ఏయ్ 304,-304.
(పోలీసు రాగా) Arrest-Arrest him first.

బాబు 2:- ఆ—అదీ బాగానేవుంది. రండి, నా అభ్యంతరం ఏంలేదు. (Police బేడీలు వేస్తుండగా రాధ లోపల్నించి వస్తుంది.)

రా:- (తెల్లబోయి) ఇదేమిటి!

బాబు 2:- ఏం లేదు. నువ్వూరుకో. మా నాన్నగార్ని త్వరగా చూడటానికి వెళ్తున్నాను. పదండి.

ఇన:- (రాధతో) ఇతన్ని Lock up లో పెట్టివచ్చి నీదగ్గర Statement తీసుకుంటాను; నువ్విక్కడే వుండమ్మా! ఈ మధ్య పొగరు బోతు లెక్కువయ్యారు. నాలుగు కేసుల్లో పడితేగాని బుద్ధిరాదు.

(బాబును తీసుకు ఇనస్పెక్టరు, పోలీసు, వెళ్తారు)

రాధ:- [దిగాలుగాపడి అటేకాసేపుచూసి, తలవంచుకు లోపలకు వెళ్ళబోయి-తలెత్తిచూసి; తెల్లబోయి వెనక్కి వెనక్కిపోతూ]- ఆ!... నువ్వా?!...
ఎందుకొచ్చావ్, మళ్ళీ? (లోపల్నుంచి బాబు (1) వస్తాడు)

బాబు(1):- వచ్చాను. ఎందుకొచ్చానంటావా? వక పనిమీద వచ్చాను. వెళ్ళటానికి రైలులేక వచ్చాను.

రాధ:- ఫో! పో. శనిపీనుగులాగ దాపురించావ్.

బాబు(1):- పోవటానికే వచ్చాన్లే-ఊ-మానాన్నగారేరీ?

రాధ:- జైలుకి పోయారు. ఫో- అక్కడికే నువ్వుగూడా.

బాబు(1):- జైలుకా!— ఎందుకు?

రాధ:- ఆ; నిన్ను విడిపించిన పుణ్యానికి.

బాబు(1):- అరరే.

రాధ:- నీకు విచారం గూడానా?

బాబు(1):- ఆయన కొడుకును. నాకు విచారంగాక మరెవరికి ?

రాధ:- నువ్వా కొడుకువి! నీ దొంగతనం మాకింకా తెలియదనే!

బాబు:- ఆ?

రాధ:- అసలు కొడుకు వచ్చాడు. నీ సంగతి బట్టబయలయింది.

బాబు(1):- ఆ!

రాధ:- కాసేపాగు, నీ పాపం పండి బ్రద్దలవుతుంది.

బాబు(1):- అయితే, నేను త్వరగా పని ముగించాలి. ఊ... శ్రీనివాసంగారు డబ్బెక్కడ దాస్తారో చెప్పు.

రాధ:- ఆ...?

బాబు(1):- ఎక్కడ దాస్తారో చెప్పు ముందు.

రాధ:- నే చెప్పను.

బాబు(1):- చెప్పనంటే కుదరదు.

రాధ:- నిలువునా కొఱత వేసినా, చెప్పను.

బాబు(1):- పెంకెతనం చాలించు. నువ్వు అంతా అర్థంచేసుకోలేదు. బాగా ఆలోచించుకో. నీకిష్టం వున్నా - లేకపోయినా నాతో రావటమే నీకు మంచిది. ఒప్పుకోకపోతే ఎంతైనా బాధపడ్తావ్ - వస్తే సుఖపడతావ్. ఈ యింటిని దోచుకుపోయి మనం ఆనందిద్దాం. ఆలోచించు

రా:- ఆలోచిస్తున్నాను- నీ తల పగలలేదేమా అని.

బాబు(1):- ఆ తలంగలదానివైతే అలాగనవ్.

రా:- (లోపలికి చూచి) ఆగు, మా నాన్న వస్తున్నాడు. తల యిప్పుడే పగులుతుంది.

బాబు(1):- ఆ! (అని ఖంగారుపడి పారిపోతాడు; లోపలికి) (బయటనుంచి సర్వయ్య వస్తాడు.)

స:- (ఎవరో పారిపోయినట్టు చూశి, అనుమానించి, ఆగి) ఎవరది ? ఎవరే ఆ పారిపోయిన యెదవగాడిద ?

రా:- వాడే, యిందాక వచ్చినవాడు.

స:- ఇందాక వచ్చినోడా! వాడింకా ఎక్కడున్నాడు ?

రా:- వాడే నాన్నా!

స:- చీ; నోరుముయ్యి; మాట్టాడతావేం- దాచేవోళ్ళని దాచేసి.

రా:- (బిగ్గరగా) నాన్నా...

స:- ఛీ, మాట్లాడకు, కన్నవాడిని నన్నూ, నిన్ను నమ్మిన ఆ మారాజు కళ్ళల్లో గూడా కారం గొట్టి - దరిద్రపు మొహం. ఫో. పోక పొయ్యావ్ ఆడితోబాటు ? మా ఛిద్రం వదిలేది.

(బాబు (1) వస్తూ)

బాబు(1):- అదే నేనూ అన్నా - సర్వయ్యా! కాని రానంటోంది.

స:- అహ్హా, తమరేనా స్వాములు. దొరగారిక్కడే వున్నారే ?

బాబు(1):- ఆ వున్నా. దీనికోసమే వున్నా.

స:- చిత్తం, ఇక వేషంతీసి మాట్లాడవచ్చు. ఇంకెందుకూ సంగతి తేలి పోయాక.

బాబు(1):- ఏం వేషం ?

స:- చాల్లే, నాదగ్గర యీ పప్పులుడకవ్; నీకెన్నో నేర్పాను గాని యీ వేషాలు వెయ్యటం నేర్పలేదే. ఇవి ఎక్కడ నేర్చావ్ నాయనా?

బాబు(1):- ఏమిటి వాగుతున్నావ్ ?

స:- వాగుడేలేగాని, మొహంమీద మచ్చవుండాలి, ఎట్లా మాయంచేశా ?- ఏంరంగుపూశా ?

(దగ్గరికి పోబోతాడు చేత్తో మొహంమీద రంగు తుడవబోయినట్టుగా.)

బాబు(1):- ఆగు.

స:- దబాయింపులు దాచిపెట్టవోయ్, గురువుకే పంగనామాలా ! మనకి చుట్టలూ అగ్గిపుల్లలూ అందిచ్చిన రోజులు మర్చిపోయా ?

బాబు(1):- ఇస్తే యిచ్చాను. ఆ రోజులు మారాయి. రోజుల్తోబాటు ఆ మనుష్యులూ మారారు. ఆ దొరయింట్లో నీ చేతి క్రింద పనిచేస్తూ వెంటతిరుగుతూ వంటచేసే కుర్రవాణ్ణి కాదు, నేనింక...

స:- కాక కొమ్ములు మొలిచాయా ?

బాబు(1):- మొలిచాయి. దగ్గరకొస్తే కనిపిస్తాయి.

స:- ఏవీ ? చూపించు నాయనా! (ముందుకు పోతాడు)

బాబు(1):- ఇదిగో (వక బాకు పైకిలాగి) దూరంగా వుండు.

(రాధ కెవ్వున కేక వేస్తుంది. సర్వయ్య వెనక్కి తగ్గాడు)

బాబు:- జాగ్రత్త ! కొరివితో తల గోక్కోకండి. వెంటపడ్డావా జాగ్రత్త! (లోపలవైపుకి వెళ్ళిపోతాడు)

స:- ఎధవ; పెద్ద మొగోడయ్యాడు-పదేళ్ళక్రింద నాచేతికింద తిరిగినోడు.

రాధ:- పో, వెంటబడి పట్టుకోరాదూ?

స:- ఎక్కడికి పోతాడు రాత్రి ఏడు గంటలదాకా పారిపోవటానికి రైలు బండి లేదు. వూళ్ళో అన్ని వేపులా మన పచ్చంవోళ్ళని పారా పెట్టా (బయట వైపుకి చూసి) అయ్యగారొస్తున్నారే. బేలు (Bail) ఇచ్చారు గామోలు.

రాధ:- ఆ. వస్తున్నారు.

(చైతన్యం, శ్రీనివాసం వస్తారు)

శ్రీ:- నాకోసం చాలా శ్రమపడ్తున్నావ్ చైతన్యం, చాలా శ్రమపడ్తున్నావ్. ఇదిగో తండ్రీకూతుళ్ళు యిక్కడే వున్నారే, ఏడీ, మావాడు ?

స:- మర్చిపోయా, ఏరే ఆరు?

రా:- తీసుగెళ్ళారుగా, వాళ్ళొచ్చి.

స:- ఎవరొచ్చి ?

రా:- పోలీసులు.

చై:- }<br>శ్రీ:- } పోలీసులా !!!

రా:- ఆ, మీరెళ్ళిన తర్వాత పోలీసులొచ్చారు. వాళ్ళతో నేనే శ్రీనివాసం గారబ్బాయినని చెప్పారీయన, "నేరం చేసిందియనే" అని తీసు కెళ్ళారు.

చై:- ఇతను నా తప్పేంలేదని చెప్పలే?

రా:- చెప్పలే. నేచెప్పపోతే నన్నూ చెప్పనియ్యలే. మా నాన్నను తర్వగా చూడాలీ— అజైల్లోకే నేనూ పోతా నన్నారు.

శ్రీ:- నన్ను చూట్టానికి-తను నేరం నెత్తినవేసుకు జైలుకి వెళ్ళాడా?

రా:- ఆ. మిమ్మల్ని చూట్టానికి తొందరపడ్డారు. ఆఖరికి Photo అన్నా చూపించమన్నారు. లోపలికి వెళ్ళి Photo తెచ్చేప్పటికి యిల్లా జరిగింది.

చై:- హు! కొడుకు చెడ్డవాడయితే తండ్రిని జైలుకి పంపైనా తను తప్పు కుంటాడు. మంచివాడైతే తండ్రికోసం తనే జైలుకి వెళతాడు.

శ్రీ - అయ్యో ఖర్మమా ! చెయ్యి పెదవికందిచ్చే లోపల చెప్పలేని అవాంతరాలు. వాడు కనిపిస్తాడని కొండంత ఆశతో యింటికొచ్చాను. క్రూరఖర్మం యిలా వేధిస్తోంది. ఇప్పుడేమిటి చెయ్యటం ?

చై :- ఆగు! నేవెళ్లి విడిపించుకు వస్తాను.

శ్రీ:- ఆ, నేనూ వస్తా.

చై :- మళ్ళీ నువ్వెందుకూ ? నేవెళ్ళొస్తాగా, వుండు, (వెళతాడు)
[లోపల కేకలు "తన్నండి దున్నపోతును", "తొయ్యండి లోపలికి," "20 ఏళ్ళున్నయో లేదో వళ్ళు పొగరెక్కింది."]

స:- ఏంటందది? (సర్వయ్య బయటికి వెళతాడు)
[బాబు(1) ని సర్వయ్య పట్టుకుని లోపలికి లాక్కొస్తాడు]

స - ఆయ్యగారోయ్ అబ్బాయిగారు దయచేశారు. బోజనాన్కి లెగండి. మీరు పొండ్రా. వీకిసంగతి నేపడ్తాను. (శ్రీనివాసం బాబు (1) దగ్గరకుపోయి.)

శ్రీ:- ఎవరు నువ్వు ?

స:- యీడా అండి. హైదరాబాదులో దొరింటో నేను వంట చేశేప్పుడు నాచేతికాడ కుర్రోడండీ. యియ్యాళ యీడూ దొరయ్యాడు. తస్సగొయ్యా ! పారిపోదామనే- వూరినిండా మన మణుసులు తిరగతావుంటే ఏడకి పారిపోదామనో.

శ్రీ:- ఎందుకు చేశావబ్బాయ్- యీ పాడు పని ?

స:- ఎందుకనా ! కొడుగ్గా చలామణీ అయిపోదామని.

శ్రీ:- ఏం ? అంతేనా ?

బా(1):- ఆ.

స:- (ఎక్కిరిస్తూ) 'ఆ' ఆట. మరి అసలారొస్తే ఏ మేశుద్దామనుకున్నా ?

శ్రీ:- అది అంత తేలిక పనే అనుకున్నావా ?

బా(1):- తేలిక కేముంది? ఈ గోలవల్లగాని లేకపోతే ఆయనే నకిలీ - నేనే అసలూ అంటే నమ్మనిదెవరు? నే నసలు ఆయన్ని లేకుండా చేద్దామనే అనుకున్నా.

స:-
శ్రీ:- } ఆ

బాబు(1):- అంతా నా తొందరవల్లే పాడయింది.

స:- పాడయిందేం, పొడిచేవాడు లేక. అరేయ్. నేను నీ గురువుని. నే చెయ్యని పాడుపనిలేదు. ఏం చేసినా, ఏం కూసినా నమ్మినవాడి నోట్లో మన్ను పొయ్య లేదురా.

శ్రీ:- అసలు మావాడి సంగతి ఎలా తెల్సు ?

బాబు(1):- నాకంతా తెల్సు. నేను అనాధాశ్రమంలో పని చేసేవాణ్ణి. మీ అబ్బాయి పూర్వోత్తరం తెల్సుగోవాలని ఆశ్రమం అధికార్ల ఆత్రం; మీ కుత్తరం రాయటం అంతా తెల్సు.

స:- కాబట్టి శానా రోజుల్నించే స్నానేడిశావన్నమాట. పద పదండీ అప్ప గిద్దాం పోలీసుల్కి (లాగబోతాడు)

శ్రీ:- ఆగు సర్వయ్యా !

స:- ఆ; చెప్పండి, పోలీసులికి అప్పజెపుదామా? మనమే కర్రుకాల్చి వాతలేసి వూరిమీద వదుల్దామా ?

శ్రీ:- వద్దు. వప్పచెప్పొ వద్దు. వాతలూ వద్దు. వదిలేద్దాం.

స:- వదిలేద్దాం !! ఎందుకూ. మరో పేరుతో మరో యింట్లో జొర బట్టానికా !

శ్రీ:- ఇంకా బుద్ధి రాలేదంటావా?

స:- మీరూరుకోండి బాబుగారూ ! వీడిసంగతి మాకొదలండి. నేనూ మనోళ్ళూకల్సి యీడి మక్కలిరక్కొడతాం.

శ్రీ:- (కోపంగా గట్టిగా) సర్వయ్యా!

స:- అయితే వీడి పాడుపన్లకి వదిలెయ్యడమే !

శ్రీ:- పోనీ, వాడి పాపాన వాడే పోతాడు.

స:- అదే అలుసు. అబ్బాయిగోర్ని చంపాలని చూశాడే— యీడు! యీణ్ణి వదలటం!

శ్రీ - వెళ్ళబ్బాయి. వెళ్లు; ఇట్లాంటి పనులిక చెయ్యకు.

స:- పోనీ- ఆ డబ్బన్నా తీసుకోండి.

శ్రీ:- పోనీ అదీ తీసుకుపోనీ. మనకు కనపడకుండా పోతే అదేచాలు.

(బాబు వెళ్తాడు.)

(రాధ మంచినీళ్ళతో ప్రవేశించి)

రాధ:- వదిలేశారు... దయతలచి... మంచివారు కాబట్టి. మంచిగా వుండటం నాకూ యిష్టమే కాని అల్లరిపాలైన అమాయకురాల్ని — నేను, నేను క్షమించలేదు.

శ్రీ:- నేనూ వాణ్ణి క్షమించలేను. నిన్ను చూస్తూ అసలు క్షమించలేను. కాని నేనింకా మా అబ్బాయి ఎల్లాగుంటాడో చూడనేలేదు. నా కొడుకనే దృష్టితో వాణ్ణే మొదట చూశాను. ఇప్పుడెంతకాదనుకున్నా ఇంకా వాడు ''మావాడే'' అనిపిస్తుంది-యీ మనసులో. నువ్వు నన్ను తిట్టుకుంటావేమో. కాని ఏం చెయ్యను? హృదయంలో ప్రేమ తడి ఆరలేదు. రాధా! (దగ్గరకెళ్ళి) బాధపడకు

(చైతన్యం వస్తాడు.)

చై:- వెధవ పోలీసులు! అనవసరమైన వాళ్ళని పట్టుకు వదలరు! అసలు వాళ్ళు రోడ్డుమీద అట్లా తిరుగుతుంటే వూరుకుంటారు

శ్రీ:- మావాడేడీ ?

చై:- ఆ వేషపు వెధవ రోడ్డుమీన విచ్చలవిడిగా తిరుగుతున్నాడు.

స:- వాణ్ణికక్కడికి మనోళ్లు పట్టుకొచ్చారు బాబూ, అయ్యగారే... వది లేశారు

చై:- అదేమిటి శ్రీనివాసం ?

శ్రీ - ఆడిసన్లే, మావాడి సంగతేమయింది?

చై:- వదలరట!!

శ్రీ:- వదలరూ!... ఏం?

చై:- వాళ్ళకి నమ్మకం చాలదట.

శ్రీ:- అయ్యో రామా! అదేమిటి ?

చై:- ఏమి టేమిటి! నేరస్థుణ్ణి మనమే వదిలేసి- వాళ్ళచేతిలో వున్నవాణ్ణి నేరస్థుడు కాదంటే ఎవరు నమ్ముతారు? నిన్నొదలటమే ఆ ఇన్ స్పెక్టర్ కి యిష్టంలేదు.

శ్రీ:- ఇప్పుడేంచేద్దాం? ఎట్లామరి?

చై:- ఏదోచూద్దాం కానీ...

శ్రీ:- ఏం కానీ? ఒంటిగంటయింది. అన్నంవేళ దాటింది. ఆ జైల్లో తిండీ తిప్పలూ సరిగ్గావుంటాయా ఏమన్నానా, ఎట్లా...

చై:- 15 ఏళ్ళనుంచి "ఆ తిండీ తిప్పలూ" సంగతి ఆలోచించా యీవక్కపూటలో యిదవుతావ్ ? నేనవన్నీ ఏర్పాటు చేసేవచ్చాన్లే. బెంగ పడకు. నువ్వు తిండి తిన్నావా?

శ్రీ:- నాతిండికేం తొందరలే...యింతకూ...

చై:- (నవ్వుతూ) సరే, నాసంగతి నీకసలే పట్టదు.

శ్రీ:- ఆ మర్చిపోయా! మీరందరూ భోంచెయ్యండి.

[ఇన్ స్పెక్టర్ వస్తాడు]

చై:- ఏమండీ, యిట్లా వచ్చారు?

ఇన:- రావద్దుటండీ! యీ గల్లంతంతా మాకు పనితక్కువయిందనేగా. ఇట్లారా అమ్మాయి- Statement యివ్వాలి.

చై:- ఇస్తుంది కానీ, మాకికేసు వదిలేద్దామనే వుంది. ఏం సర్వయ్యా?

స:- వదిలేద్దామండి. వదిలేద్దాం.

ఇన:- వదిలేసుకోండి-కోర్టులో నాపనికి అడ్డురాకండి, కేసు పెట్టటమే మీయిష్టం తీసెయ్యటం మీయిష్టంగాదు, మాపని మాది. తర్వాత కోర్టు యిష్టం ఆ ఇట్లారా అమ్మా! ఏం జరిగిందో, చెప్పు.

రా:- ఏం జరగలేదు.

ఇన:- నీ మీదకు ఎవరో వచ్చారే, అతనెవరు?

రా:- తెలియదు.

ఇన.- తెలియదూ? వీరబ్బాయేగా? వీరబ్బాయి తెలియదూ?

రా:- వీరి అబ్బాయి కాదు.

ఇన:- అదీ నిజమేటలే. ఏదో గొడవ విన్నాను. పోస్లే ఎవరో వకరు.
ఇక్కడి కెందుకు వచ్చాడు?

రా:- నే పిలిస్తే వచ్చాడు.
(తెల్లబోయి మాట రాక ఆగి తెప్పరిల్లి)

ఇన:- ఆ!!! ఊఁ, ఎక్కడుండే పిలిచావ్?

రా:- రోడ్డున పోతుండే.

ఇన:- రోడ్డున పోతుండే పిలిచావా?

రా:- అవును.

ఇన:- అబ్బే! అలా చెప్పగూడదు. కేసు బలం పోతుంది.

రా:- కాని...వున్న సంగతది.

ఇన:- అయితే, అతను రావటం నీకిష్టమేనా?

రా:- ఆ.

ఇన:- ఊఁ...వచ్చిన తర్వాత ఏమయిందో చెప్పు.

రా:- ఏమీ కాలేదు.

ఇన:- ఏదీ ?

రా:- నా కయిష్టమయిందేదీ కాలేదు.

ఇన:- అయితే కేసేదీ?

చై:- ఏదీ ?

ఇన:- మరి యీ సర్వయ్య యింత గోల చేశాడు

రా:- నాకిష్టమేనని తెలియక చేశాడు

ఇన:- మరి కోర్టులో అడిగినా యిల్లాగే చెప్తావా ?

రా:- ఆ.

ఇన:- అయితే లాభమేమిటి?

చై:- లాభంలేదు.

ఇన:- ఇంకెందుకూ యీ కేసు...?

చై:- అబ్బే ! ఎందుకూ?

ఇన:- (విసుక్కుంటూ గట్టిగా) ఆగండి మీరు.

చై:- అల్లాగే,

ఇన:- ఊఁ! బాగానే వుంది. అమ్మాయిని బాగా తయారు చేశారే! సరేలెండి, నేనూ కేసు వదులుకుంటాను, ముద్దాయిని వదిలేస్తాం.

చై:- అంతా మీ యిష్టం.

ఇన:- వస్తాను...రా, సర్వయ్యా నీ సంగతి ఆలోచిద్దాం.

స:- నా సంగతేంటండోయ్ ?

ఇన:- ఆ, రా. తప్పుడు కేసు పెట్టినందుకు వూరికే పోతుందనుకున్నావా?

స:- ఇదేంటండోయ్. ఉరుము వురిమి నక్కమీద పడ్డట్టు, (ఒక పోలీసు వస్తాడు. తొందర తొందరగా రావటం వల్ల మాట తడబడుతూ మాట్లాడతాడు)

పో.- మిమ్మల్ని రమ్మంటున్నారండి.

ఇన:- ఎవరూ?

పో:- స-స-స. సర్కిల్‌గారు, మిమ్మల్నీ, వీరినీ, వీరినీ (శ్రీనివాసం చైతన్యంని చూపిస్తూ) అర్జంటుగా ర-ర- రమ్మన్నారు.

ఇన:- ఎందుకూ?

పో:- ఏమోనండి, ''వీ-వీరి అబ్బాయిని నేనూ, జైల్లో పెట్టి నాయన కాదూ'' అంటూ ఎవరో వచ్చాడు ఈ తికమక తెలియక ''అందర్నీ కేకేసుకురావోయ్'' అన్నారు.

ఇః- మళ్ళీ యిదేమిటి?

ప్రో:- ఏమోనండి.

ఇః- ఏమోనంటావేం? నువ్వు వినలే?

ప్రో:- వి. వి. విన్నాగానీ అర్థం కాలేదండి!

ఇన:- ఏమిటో గోల- పదండి సార్.

స:- (చేతులు నలుపుకుంటూ) నేనక్కర్లేదుగదండీ!

ఇన:- నువ్వా? వద్దులే...వీరందరూ చాలరూ, పదండి సార్ (అందరూ వెళ్తారు)

స:- రాధా!

రా:- (పలకదు.)

స:- రాధా!

రా:- ఎందుకూ?

స:- నువ్వు పుణ్యంచేసుకు పుట్టావే.

రా:- ఆ, కనిస్తూనేవుంది.

స:- సరేగాని, నీకు కొత్త చీరకట్టబెట్టామగా. ఆ పాతయ్యి మీ చెల్లెలికివ్వు.

రా:- పాతయి చెల్లిల్కి యివ్వాలా. చెల్లెలు. మాలావు చెల్లెలు.

స:- అట్లా అంటావేంటే. అది నీ చెల్లెలు గాదూ?

రా:- అది నా చెల్లెలుగాదూ, నేనప్పనీ కాను.

స:- అదేంటే? నా కడుపున పుట్టింది నీకు చెల్లెలు గాదూ

రా:- ఆ చెల్లెలే. వుంమకున్న ప్రతిదానికీ పుట్టినదల్లా నాకు చెల్లెలవు తుందేం!

స:- చెల్లెలవదూ! ఏమొ, నాకు మతిమరపు జాస్తే గాని మీ అమ్మని మాత్రం నేను పెళ్ళెప్పుడు చేసుకున్నానూ?

రా:- అయితే, మా అమ్మ కూడా వక లేచివచ్చిన మనిషా !!

స:- అఁ, నాకోటి ఎదవతో వచ్చిందిగనక అది వక లేచి వచ్చిన మనిషి! అదే కాస్త గొప్పోడితో లేచొస్తే 'ప్రేమ' అనేవోళ్ళు - పాటలు రాసేవోళ్ళు, ఆ పాటలు యీ నాటికి నువ్వు పాడేదానివి

రా:- చాలు, వూరుకో. మా అమ్మని కూడా పాడుచేశి...

స.- ఏమో ఎవరు ఎవర్ని పాడుచేశామో- అది బ్రతికుండగా ఎవ్వరం ఆలోచించుకోలే అది చచ్చిపోయిన తర్వాత నన్నే అది ఊబిలో దింపిపోయిందని బాధ పడ్డా. కాదూమరి, సచ్చి అది సుకపడిందం టావా? బ్రతికి నే సుకపడ్డానంటావా? నేనేం చేసినా నీ బాగుకోసమే!

రాధ:- ఏమిటీ వాగుడు? చాల్లే! నాబాగుకోరే నువ్వుచేశేవింతా. నాకేదన్నా ఆశవుంటే అది నిరాశ చేశావ్. నాతల్లి వక లేచి వచ్చిన మనిషి! నా తండ్రి వక తిరుగుబోతు! నాబ్రతు కివ్వాళ యిల్లా అల్లరయింది. ఇంకా యీజన్మకి సుఖం, అవకాశం వస్తుందట ఛీ! ఛీ!

స:- బ్రతకటం బాధే- సేతకానోళ్ళకి. కాని బ్రతకటం నేర్చుకోవాలి రాధా, నేర్చుకోవాలి.

(బాబు (2) వస్తాడు )

(సరాసరి లోపలి కెళతాడు )

[బాబు (2) తిరిగొచ్చి]

బాబు(2):- ఏరీ? మానాన్నగారు యింట్లోలేరే యింట్లోవున్నారా?

స:- టేషన్ కే వచ్చారుగా

బాబు(2):- Station కా? ఎందుకు?

స:- ఇనస్పెక్టర్‌గారు పిలిపించారు మీకు కనిపించలే

బాబు(2):- లే ఒక పోలీసువచ్చి "తంపుతీసి" వదిలేశారన్నాడు. నే పరు గెత్తుకువచ్చి జట్కా ఎక్కా. అదే. జట్కావాడికి డబ్బులివ్వనేలేదు. ఇచ్చొస్తానాగు.

(బయటికి వెళ్తాడు )

స:- ఎంత తొందరో!

రాధ:- అంత ఆలస్యం. (బాబు (2) తిరిగొస్తాడు )

బాబు(2):- ఇది విన్నారా ? నాపేరు పెట్టుకు వచ్చినవాడు ఎవరో కాదు. మా Hostel లో వాడే. వెధవ, ఎంతో నమ్మకస్తుడిలాగ కనిపించేవాడు. వాడొచ్చి తనంతట తనే పట్టుబడ్డాట్ట!!

స:- వెధవ.

రాధ:- సాఫీగా నడిచేదాన్ని సకల తిప్పలూ పెట్టాడు.

బాబు2:- వాడిప్పటికీ తనే అసలు కొడుకునని వాదిస్తున్నాట్ట. ఆ Police అన్నాడు.

స:- మీరు భోంచేశారా?

బాబు2:- అహ, వాళ్ళేవో తెచ్చి యిచ్చారుగాని- తినలే.

స:- అయితే భోంచెయ్యండి మీరు.

బాబు2:- భోజనానికేం తొందరలే వాళ్ళని కూడా రానీ.

స:- లెగండిబాబూ! వాళ్ళందరూ వచ్చేలోగా చాలా పొద్దుపోతుంది. లెగండి. ఈలోగా స్నానమన్నా చేద్దురుగాని. రాధా-అయ్యగారికి నీళ్ల తోడు

బాబు2:- ఊ! సరే-కానీ (ఇద్దరూ లోపలికి వెళతారు.) (సర్వయ్య నవ్వుతూ అటే చూస్తుండగా బయటినుంచి చైతన్యం వస్తాడు.)

స:- అయ్యగారేరండి?

చై:- వస్తున్నారు. అబ్బాయి ఏడీ?

స:- స్నానాని కెళ్ళారు.

చై:- సర్వయ్యా, అబ్బాయి ఎట్లాంటివాడు?

స:- అబ్బాయికేమండి!

చై:- బుద్ధిమంతుడేనా?

స:- అనుమానం ఎందుకండీ!

చై:- ఊఁ, మరేంలేదు. మన అమ్మాయిని అబ్బాయిని యిద్దామని - అనుకున్నాంలే

స:- ఎట్టా?

చై:- సంబంధం బాగుంటుందంటావా?

స:- బాగోకేమండి. చిలకా గోరింకల్లా గుంటారు.

చై:- ఆ! అయితే మా అమ్మాయి 'చిలక'లా గుంటుందంటావా?

స:- ఆహ. చిలకలా యెల్లా వుంటుందండీ? నలుపు కాదూ? గోరెంకలా గుంటుంది. (నవ్వుతారు)

బాబు2:- (వచ్చి) మా నాన్న ఏరండీ?

స:- మీరు స్నానానికి వెళ్ళలే?

బాబు2:- లే. వీరి మాటలు విని వచ్చేశా. మీరు Station లోనే వున్నారటగా.

చై:- ఆ. వున్నాం. నువ్వింటికెళ్ళావని చెప్పారు. మేమూ బయలుదేరి వస్తున్నాం. త్రోవలో రోడ్డు మీద వక కారు స్పీడుగా ఎదురువచ్చింది కాస్త యిటు తప్పుకున్నాం. ఇంతలో వెనకనుంచి మరోకారు... ...వచ్చి...

బాబు:- ఆ కారు...వచ్చి...

చై.- మా వెరగ్గా వచ్చేసి...ఆగింది.

బాబు:- అయితే...

చై:- కారు మమ్మల్ని చూసే ఆగిందిలే దాంట్లోంచి మీ నాన్న స్నేహితు డొకడు దిగి, అర్జంటుగా మాట్లాడాలని బలవంతంగా లాక్కెళ్ళాడు- మీ నాన్నని కాసేపటికి వస్తాడు నువ్వెళ్ళి స్నానం చెయ్యి...పో..

బాబు - సరే. (2) (లోపలికి వెళతాడు)

చై:- సర్వయ్యా! మాట; శ్రీనివాసం ఇప్పుడే వస్తున్నాడు నా వెనకే వచ్చాడులే కాస్త నాటకం ఆడదాం. మాట. (చెవులో ఏదో చెప్తాడు.)

స:- అబ్బే, ఎందుకండీ?

చై:- నువ్వూరుకో. నే చెప్తాగా.

(శ్రీనివాసం వస్తాడు.)

శ్రీ:- ఆ Shop దగ్గర నన్నుండమని నువ్వొచ్చేశావేం?

చై:- (నవ్వి) నువ్వు వుంటావనుకోలే.

శ్రీ:- మరి మావాడేడీ?

చై:- మీవాడా,...రాలే.

స:- అహ; వచ్చినట్టుండారండీ.

చై:- ఏహ! రాందే. రాలే.

శ్రీ:- స్టేషన్నుంచి బయలుదేరినవాడు యింటికి రాక ఏమయ్యాడంటావ్?

చై:- త్రోవలో వుండివుంటాడు. మరీ...మీ వాడికి మా పిల్ల నచ్చుతుందా, కాస్త నలుపుగా?

శ్రీ:- స్టేషన్నుండి ఇంటికి రావటాన్కి ఇంత సేపెందుకు?

చై:- కుర్రవాడుగాదూ! త్రోవలో ఎక్కడన్నా సిగరెట్ కాల్చుకోడాన్కి ఆగాడేమోలే.

శ్రీ:- మా వాడు సిగరెట్లు కాలుస్తాడంటావా!

చై:- ఏమొ. కుర్రతనం. ఇంతకూ పెళ్ళిసంగతి ఏమంటావ్?

శ్రీ:- ఏదీ వాణ్ణి రానీ...త్రోవ తప్పాడేమొ - అందాకా వెళ్ళి చూసిరానా- ఏమిటి?

చై:- ఆగవయ్యా; నా మాట...కాస్త విను.

శ్రీ:- మీ అమ్మాయి పెళ్ళిసంగతి తర్వాత చూద్దాంలే ఆగు.

(బయటికి వెళతాడు.)

స:- ఎందుకండీ అనవసరంగా ఆయన్ని ఆడిస్తారు?

చై:- ఉత్త తొందర మనిషి.

(రాధ వస్తుంది.)

రా:- ఏరివారు?

స:- ఎవరు ?

రా:- బాబుగారే

చై:- బయటికి వెళ్ళారు. అబ్బాయి ఏడీ ?

రా:- బాబుగారొచ్చినట్టున్నారని నేననేసరికి గబగబావస్తున్నారు (పైజామా షర్టు బనీను వేసుకొని బాబు 2 వస్తాడు)

బాబు 2:- ఏరండీ ?

చై:- మీనాన్నేనా ? నీకో పెళ్ళిసంబంధం కుదుర్చుకు రావటానిక్కెళ్ళారు.

బాబు 2:- ఏమంటారూ ?

చై:- ఏమంటారేమిటయ్యో ! ఎగిరి గంతెయ్యక - పెళ్ళి !-పెళ్ళి అంటే ఎరగవ్ ?

బాబు 2:- వేళాకోళం ఎందుకండి. ఆయనింకా రాలే ?

చై:- వస్తాడు. తొందరగానే వస్తాడు. నువ్వెళ్ళి కాస్త తల దువ్వుకురా వెళ్లు, యింతలో ఆయనా వస్తాడు.
(నిరాశగా కుర్రవాడెళ్ళాడు-లోపలికి)

స:- పాపం !
(శ్రీనివాసం బయటనుంచి వచ్చి )

శ్రీ:- లేదటయ్యో, అబ్బాయి యింటి కిందాకే వచ్చాట్ట – ఆ కొట్టువాడంటున్నాడు.

చై:- అయితే యింట్లోనే వున్నాడన్నమాట !

శ్రీ:- ఆ యింట్లోనే వుండి వుండాలి.

చై:- అయితే ఏ పెట్టెలోనన్నా దాక్కున్నాడేమొ చూడూ!

శ్రీ:- ఏమొ; కుర్రవెధవ...చూసి వస్తానాగు.
(లోపలికి పోబోగా ఎదురు కుర్రవాడొస్తాడు. ఇద్దరూ ఆయనేనా అని ప్రశ్నార్థకంగా కళ్ళతో చైతన్యాన్ని అడుగుతారు. సంతోషం ఎక్కువవుతుంది - యిద్దరిలో. చైతన్యం తల వూపుతాడు ఇద్దరూ

సంతోషంతో కౌగలించుకుంటారు. సంతోషంలో కళ్ళనీళ్ళు తిరిగాయి శ్రీనివాసానికి)

శ్రీ:- క్షమించు బాబూ! నీ నాయన యింతవరకూ బ్రతికివుండీ చచ్చిన వారితో సమానమయ్యాడు.

బాబు 2:- నాన్నా !

శ్రీ:- బాబూ !

బాబు 2:- నాన్నా !

శ్రీ:- నాన్న, నాన్న. ఈమామూలుమాటలో యింత తియ్యదనం ఎక్కణ్ణించి వచ్చింది బాబూ !

బాబు 2:- నాన్నా !

శ్రీ:- చాలు చాలు బాబూ! చాలు ఇగిరిపోయిన కన్నీళ్లు ఉబికివచ్చి ఎండి పోయిన హృదయం నిండిపోయింది, ఇకచాలు. ఈ సంతోషం— ఈ సంతోషం కలకాలం నిలిచివుంటే అదే చాలు. నాతోనువ్వుంటే అంతే చాలు.

చై:- ఇక తండ్రీకొడుకులు మమ్మల్ని బొత్తిగా మర్చిపోయారు.

శ్రీ:- ఆ... మర్చిపోయా. నీ భోజనం సంగతేగా! రాధా, అందరికీ వడ్డించు. సర్వయ్యా, నువ్వుకూడా...

స:- వద్దులెండి. నేపోతా. ఇంటికాడ ఆళ్లు తిన్నారో-పడుకున్నారో.

శ్రీ:- వాళ్ళ సంగతి నాదగ్గరెత్తకు.

స:- వాళ్ళసంగతి మీ దగ్గరెత్తక ఎట్టా బాబూ ? మీ పిల్లాడు మీ కెట్టాగో నా పిల్లలు నా కట్టాగేగా !

శ్రీ:- (ఆలోచించి) అవును. అంతేగా. ఇంద- యీ రెండూ తీసుకో... (పర్సు చూసి) అరే, చిల్లరలేదే.

స:- పోనీ, నోటే యిప్పించండి.

శ్రీ:- ఊఁ, తీసుకో, కాని భోజనం చేసి మరీ వెళ్లు.

చై:- ఇకయితే నాసంగతేంచేశావ్ ?

శ్రీ:- ఏది?

చై:- మా అమ్మాయిని చేసుకోవటం

శ్రీ:- అదా, భోజనం చేసి మాట్లాడదాంలే.

చై:- ఎంతసేపు మాట్లాడాలీ...

శ్రీ:- చైతన్యం, స్నేహితుణ్ణి బాధించటం తెలికా ? క్షమించటం తెలికా ?

చై:- రెండూ తెలికే- తల్చుకుంటే.

శ్రీ:- అయితే ఇందులో నీ కేది యిష్టం ?

చై:- క్షమించటమే.

శ్రీ:- అయితే నన్ను క్షమించు.

చై:- అంటే ? నాకర్థమయ్యేటట్టు చెప్పు.

శ్రీ:- మీ అమ్మాయిని మావాడికి చేసుకోం.

చై:- ఏం ?

స:- గోరెంకలాగుంటుందని.

శ్రీ:- కాదు. రాధని వాడికిచ్చి చెయ్యాలి.

స — రాధనా !
చై — రాధనా !!
రా — నన్నా !!!

శ్రీ:- ఆ. రాధను. 8 ఏళ్ళనుంచీ నాకు అదే కొడుకూ, అదే కూతురూ. యీ యింట్లో దీపం పెట్టి యీ జీవితాన్ని సాకిన రాధను నా కోడలుగా చేసుకోవడం బాగుండదూ? ఏం చైతన్యం? లేకపోతే దాని జీవితం గోతిలో దిగమారిపోదూ ?

చై:- శ్రీనివాసం! నీ సంకల్పాని కర్థంరాను. ఇదినేనే నీకు చెప్పి, నీ చేత చేయించాల్సింది. అది నాకెందుకు తట్టలేదా అని విచారిస్తున్నాను.

రాధ:- వద్దు, వద్దు. విచారించకండి. మీ అమ్మాయినే యిచ్చి చేయండి.

చై:- ఏం ?

రాధ:- ఏమని అడుగుతున్నారా ? అంతా తెల్సినవారేగా మీరు.

శ్రీ:- నేనంతా ఆలోచించా, రాధా! ఆలోచించి చేసిన పనే యిది.

రా:- కాదు. మీకు తెలియదు. మీకు తెల్సినవికాక తెలియనివి చాలా వున్నై.

బాబు2:- తెలియనివి తెలియకుండానే వుండనియ్యి. తెల్సినవాటిని తెల్సుకుని, నేను నిర్ణయాన్కి వచ్చాను. రాధా! నిన్ను పెళ్ళి చేసుకుంటాను. నీమీద వున్న "వాదు" మాపెయ్యటాన్కి కాదు. నీ అందం చందం చూశి కాదు. కాని అంతకంటె ఎక్కువే ఆలోచించి, నిన్నే పెళ్ళి చేసుకుంటాను.

రా:- వద్దు. మీరెంతో మంచివారు. మంచితనం చూపించుకోటాన్కి మీరెంతైనా త్యాగం చేస్తారు. కాని క్షమించండి. యీ ప్రయత్నం ఆపండి.

బాబు2:- ఎందుకు ?
చై:- ఎందుకు రాధా ?
శ్రీ:- ఎందుకు రాధా ?

రా:- నేను మీకు తగను. మీ అబ్బాయికిగాని, మీ కుటుంబాన్కి గాని, మీ అంతస్థుకిగాని నేను తగను. మీకు తెలియదు-నా తల్లి వక లేచి వచ్చిన మనిషి.

చై:- ఏమిటీ !

రా:- కలుషితమైంది నాతల్లి, నా వంశం. మీ వంశాన్ని కలుషితం చెయ్యటం నా చేతగానిపని. నేనిక్కడ వక దాసిని, దాసిగానే నన్ను బ్రతక నివ్వండి.

చై:- నిజమేనా సర్వయ్యా ?

స:- నిజమేనండీ— నా సుఖం, నా సంతానానికి సంతాపమౌతుందని నేనెప్పుడూ అనుకోలేదండీ!

శ్రీ:- అనుకోవద్దు. మనకు కావల్సింది "మనసు మంచితనం". "వంశం వంకరలు" మనసును మలినం చెయ్యలేవు. మనకు కావల్సింది గుణంగాని, కులంగాదు రాధా; నువ్వు వప్పుకోవాలి.

బాబు2:- రాధా, ఇదిగో నా చెయ్యి. నీ చేతికోసం కాచుకునుంది. కాచుకునే వుంటుంది కలకాలం.

రాధ:- ఏమంటారూ!

బాబు2:- పెళ్ళిచేసుకుంటే నిన్నే చేసుకుంటా! అంతే నేననేది.

రాధ:- కాని నేను మీ చేతికి సరికాను. నా స్థానం అదికాదు. నా స్థానం యిది-మీ పాదాలు.

(కాళ్ళమీద వాల్తుంది)

శ్రీ:- నా హృదయపూర్వకంగా కోరతాను, ప్రార్థిస్తాను, యీ చిరంజీవుల సౌశీల్యం శాశ్వతం కావాలని. చైతన్యం! మీ అమ్మాయి రాధకు కల్యాణపు కుంకుమ దిద్దాలి. పిలుచుకురా మీ వాళ్ళని...పిలుచుకురా సర్వయ్యా; మీ వాళ్ళందర్నీ పిల్చుకురా. అందరికీ యిక్కడే భోజనాలు. (అందరూ అన్నివైపులకీ వెళ్ళబోగా.) చైతన్యం! నా జన్మకి ఫలితం దక్కింది వాళ్ళిద్దరూ కాపురం చేస్తుంటే, కళ్ళారా చూస్తూ, నేనూ (గోడమీద Enlargement చూపిస్తాడు) వక బొమ్మలాగ కాలం గడుపుతాను. ప్రాణంవున్న ప్రతిమలాగ చూశి సంతోషిస్తాను తండ్రిగా నా జీవితం తరించిందని తలుస్తాను. (నెమ్మదిగా మధ్య Enlargement దగ్గరకొచ్చి చూస్తూ)

శ్రీ:- నిర్భాగ్యురాలా!!
(కంటినీటి బొట్టు క్రింద రాల్తుంది)

-:తెర:-



## పాత్రలు

1. రంగనాథం
2. రామం
3. బాబాయి
4. కుర్రవాడు

(రామం యింటిలో మధ్య సావడి. ఒక ప్రక్కగా రెండు కుర్చీ లుంటాయి. రెండు ప్రక్కలా రెండు ద్వారా లుంటాయి.

ఒక వైపునుంచి - రంగనాథం ప్రవేశించి, రెండవ వైపు ద్వారం దాకా వెళ్ళి, ''రామం'' ''రామం'' అని పిలుస్తాడు.)

(లోపల్నించి ఏవో మాటలు వినబడతాయి.)

లోపల్నించి రామం కంఠస్వరం:- అందుకని - ఆ మాటంటావా ? నేను మొగుడ్నీ, నువ్వు పెళ్ళానివా? నువ్వు మొగుడూ, నేను పెళ్ళాన్నీనా!

స్త్రీ కంఠస్వరం:- మీరే మొగుడైతే మాత్రం, మీరు ఏం చేసినా వూరుకోవాలా ?

రామం:- కంఠస్వరం:- ఊరుకోవద్దూ ? వూరుకోకపోతే వూరి వాళ్ళంతా ఏమంటారు ?

స్త్రీ కంఠస్వరం:- ఏమంటారూ ? 'వట్టి దద్దమ్మ' అంటారు ?

రామం:- అంటే అనిపించుకుని వూరుకోనా - నిజంగా నేను దద్దమ్మనయినట్టు?

స్త్రీ కంఠస్వరం:- నిజంగా దద్దమ్మ కానట్టు !

రామం:- నేను దద్దమ్మనా ? మళ్ళీ అను ఆ మాట. ఇంతదవకు వూరుకున్నా యిక్కడ ఎవరూ లేరుగనుక. ఇక వూరుకునేది లేదు, జాగ్రత్త!

స్త్రీ కంఠస్వరం:- జాగ్రత్తగా లేకపోతే ఏంజేస్తారేం?

రామం:- (లోపల్నించి) ఏంజేస్తానా? ఏమైనా చెయ్యగలను. తర్వాత మీరంతా కల్సి-ఏడ్చినా సరే ఏమైనా చేసేస్తాను. ఆ ! జాగ్రత్త ! ఏమను కున్నారో! నే తల్చుకుంటె ఏమైనా చెయ్యగలను. (అంటూనే మధ్య సావడిలోకి వస్తాడు, రంగనాధం అదిరిపోతూ వెనక్కి వెనక్కి పోతాడు.) తల్చుకున్నా ఏం చెయ్యలేని దద్దమ్మ ననుకున్నావా ? ఇక అనుకోకు. చేతిలో కర్రవుంటే పీపు పగులగొట్టేస్తాను - వీం లేకపోతే చేత్తో దవడ పేలగొట్టేస్తాను.

రంగ:- (నిమ్మదిగా దగ్గరకెళ్ళి) ఏమిట్రా యిది ?

రామం:- (వినిపించుకోకుండా) అదీకాకపోతే యింట్లోంచి గెంటెయ్యగలను లేకపోతే నేనే వెళ్ళిపోగలను,

రంగ:- ఏమిట్రా యిది?...

రామం:- ఇది కోపంలే; ఆగు కాస్త. బలే కోపంగా వుంది ?

రంగ:- కోపం కనిపిస్తూనే వుంది. కాని ఎవరిమీదేం ?

రామం:- ఎవరిమీదేమిటి- దానిమీదే... లోపలుంది. (ఆయాసపడ్తూ) మా ఆవిడమీద.

రంగ:- మీ ఆవిడమీదా? (ఆశ్చర్యపోయి) నీకు కోపం వచ్చిందా !

రామం:- ఆ! ఆ! వచ్చింది.

రంగ:- ఎప్పుడూ !

రామం:- ఇప్పుడే, 2 నిమిషాలయింది.

రంగ:- ఎందుకు వచ్చిందేం ?

రామం:- ఎందుకేమిటి? వెధవ ప్రశ్నలూ, నువ్వూను. పెళ్ళాం మీద కోపం రాదూ మొగుడికి!

రంగ:- వస్తుంది-వస్తుంది- కాని నీ కెందుకు వచ్చిందని ?

రామం:- ఏం? నాకు రాకూడదా? నేను మొగుణ్ని కాదా ?

రంగ:- నువ్వు మొగుడివేరా. నీకూ కోపం రావచ్చు. కాని ఎందు కొచ్చిందని ?

రామం:- అదే వచ్చింది- మీ బ్రహ్మచారిగాళ్ళతో; కోపం వచ్చినప్పుడల్లా ఎందుకొచ్చిందని ఆలోచిస్తూ కూర్చుంటామా ?

రంగ:- అప్పే? ఆలోచిస్తే కోపం ఎందుకొస్తుందీ ?

రామం:- మరెందుకొచ్చిందని అడుగుతావేం?

రంగ:- నీ బుర్రలో కాస్త ఆలోచన వున్న వాడివిగదా అని.

రామం:- ఊఁ ?

రంగ:- బుర్రలో ఆలోచనవుంటే కోపం రాదుగా!

రామం:- నా బుర్రలో ఆలోచన లేదంటావా? కోపం లేదంటావా?

రంగ:- ఏదో వకటి లేదంటాను.

రామం:- కాదు; రెండూ వున్నాయి. బుర్రకిమించిన ఆలోచనా వుంది, బుర్ర పగిలిపోయేటంత కోపం వుంది.

రంగ:- ఏమిటీ వుందీ?

రామం:- అది నీ కర్థం కాదులే.

రంగ:- ఏం ?

రామం:- నీ బుర్రలో రెండూ లేవు గనుక.

రంగ:- లేవుగాని, నువ్వు చెపితే- గ్రహించగలన్నా!

రామం:- అయితే చెపుతా విను. నీ బుర్రలో ఏ మాత్రం ఆలోచనవున్నా బోలెడు కోపం వస్తుంది.

రంగ:- కానీ చెప్పు చూస్తా.

రామం:- విను. నువ్వు కాస్త శ్రద్ధగా వింటేగాని అర్థం కాదు. ఆ, అటు మొన్న...రాత్రీ...ఏమిటమ్మా అదీ... (ఆలోచనలో పడ్డాడు.)

రంగ:- నీకు కోపం వచ్చింది యివ్వాళగాదుగా ?

రామం:- ఆగు నువ్వు. అసలేం జరిగిందో, జ్ఞాపకం చేసుకుంటుంటే అడ్డొస్తా వేం?......అటు మొన్న రాత్రి...

రంగ;- అటు మొన్న రాత్రి, మనం గుంటూరు వెళ్ళాంగాదురా ?

రామం:- ఊహూ; అయితే మొన్న రాత్రి కాబోలు. ఇంటికి రాంగానే, చొక్కా మాపుకున్నానని సాధింపు మొదలెట్టింది.

రంగ:- మీ ఆవిడ?

రామం:- ఆ, మా ఆవిడ. మా పే...ద్ద ఆవిడ-నామీద తను మేనేజర్ అయి నట్టు-అక్కడికి ప్రపంచంలో ఎవ్వరూ చొక్కాలు మాపుకోనట్టు-

రంగ:- అవున్నా; నువ్వు చొక్కాలు మరీ మాపేస్తావ్!

రామం:- (కోపంగా) నా చొక్కాలు, నే మాపుకుంటే తనకేం?

రంగ:- అబ్బే, తనకేం?

రామం:- నీకేం?

రంగ:- అవును నాకేం?

రామం:- నీపాటి బుద్ధి లేదేం దానికి! చొక్కాలు తెగమాపితే ఎక్కువసార్లు వుతుకులుకి వెళ్తాయటా - వెళ్తే చిరుగుతాయట-తను నాకేమన్నా చొక్కాలు కుట్టిస్తోందా? నా చొక్కాలమీద పెద్ద లెక్చరు మొదలెట్టింది-దాంతో కోపం వచ్చింది...

రంగ:- అది మొన్నరాత్రి...ఆ?

రామం:- ఆ, మొన్నరాత్రి...నిన్న రాత్రీ...

రంగ:- నిన్న రాత్రి గూడా కోపం వచ్చిందా?

రామం:- నిన్న రాత్రి, పొద్దుపోయి యింటికి వచ్చాను. ఆకలితో కడుపు కాలిపోతూంది. ప్రాణానికి శోష వచ్చేసింది. రాంగానే కుర్చీలో కూలబడి కాసిన్ని మంచి నీళ్ళడిగాను. వెంటనే యివ్వాలా, అక్కర్లేదా?

రంగ:- ఇవ్వాలి, యివ్వాలి.

రామం:- ఇవ్వాలా? యివ్వలేదు. ఇవ్వనుగాక యివ్వనంది. మంచినీళ్ళు ఒక గుక్కెడు కూడా యివ్వనంది.

రంగ:- పోనీ, నువ్వే వెళ్ళి తాగెయ్యక పోయావు? Self help మంచిదన్నారు.

రామం:- ఆ, నేనేవెళ్ళి తాగబోతే-చేతిలో గ్లాసు లాగేసుకుంది.

రంగ:- ఛా-ఛా.

రామం:- అన్నానికిముందు మంచినీళ్ళు తాగితే ఆకలి చస్తుందట- "అన్నం తినండి. మంచినీళ్లు తాగద్ద"ని ఆరోగ్యశాస్త్రం ఉపదేశించింది.

రంగ:- (ఆశ్చర్యంగా) ఆ!

రామం:- ఇవ్వాళ ప్రొద్దున్న మట్టుకు ప్రొద్దున్న - కాఫీలో తను First decoction శల్లుపుకుతాగేసి-Next decoction బాబాయికి, Last decoction ను నాకూ యిచ్చింది.

రంగ:- ఆ, (ముక్కుమీద వేలేసుకొని అంటాడు)

రామం:- అలా అన్నానని మధ్యాహ్నం మరీ చేదు కాఫీ యిచ్చింది.

రంగ:- ఆహా!

రామం:- ఇవన్నీ వింటుంటే కోపం రావటం లేదురా నీకు?

రంగ:- ఆహా! ఇంకారాలే.

రామం:- ఎందుకొస్తుందీ? నీకూ నీ యింట్లోవున్న సర్వాధికారాలూ పరహస్త గత మయిపోతే వస్తుంది. నువ్వేమన్నా అను అబ్బాయ్, ఇది కాప రానికి వచ్చిందీ- నేనీ యింట్లో వక నౌకర్ని అయిపోయాను. మాట మాట్లాడితే రూల్సు ఇంట్లో సిగరెట్లు కాల్చగూడదు. తనకి వాసన గిట్టదట. రెండో ఆట సినిమాకి వెళ్ళగూడదు. తను వంటరిగా ఉండ లేదట. ఇంట్లోవున్నా రాత్రి 10 గంటలదాకా తనతో మాట్లాడ గూడదు-తను నవలలు వ్రాసుకోవాలట. పోనీ, ఏం తోచక రేడియో పెట్టుకుందామంటే అదీ వీల్లేదు; తనకి-Disturbance అట. చచ్చి పోతున్నాననుకో యీ రూల్సుతో.

రంగ:- ఆహా!

రామం:- ఎల్లాగరా! ఇంత చెప్పినా నీకు కోపం రాకపోతే!

రంగ:- అదే చూస్తున్నా. నాకు రానికోపం "నీకెట్లా వచ్చిందా" అని.

రామం:- ఈ సంగతి చెప్తా విను. ఇవ్వాళ 2 Sets Tennis ఆడి ఆరున్న రకి యింటికివచ్చా. అలుపు తీర్చుకోటానికి సరాసరివెళ్ళి, ప్రక్క మీద పడుకున్నా. ఇంతలో వచ్చింది- ఎక్కణ్ణించి వచ్చిందో- "Get Down from the bed" అంది. చూశావా? bed మీద పడుకోటానికి కూడా వీల్లేదన్న మాట!

రంగ:- ఏమిటీ?

రామం:- నేనూ ఏమిటీ అన్నా "I say, get down from the bed" అంది. నేనేమనను?

రంగ:- ఇహ ఏముంది అంటానికి?

రామం:- మరి కోపం రావాలా వద్దా?

రంగ:- రావచ్చు.

రామం:- ఇంట్లో సర్వెంట్‌కన్నా కనాకష్టమా? ఈ మాదిరి Insult చేస్తుంటే కోపం రావాలా, వద్దా? "No. I dont" అన్నా, "I say you must" అంది. నేను "No No No." అన్నాకోపంగా.

రంగ:- అది ఇంగ్లీషులో అన్నావా, తెలుగులో అన్నావా?

రామం:- తెలుగులో కోపం ఎట్లా వస్తుందోయ్? ఇంగ్లీషులోనే అన్నా.

రంగ:- అయితే, నీకు నిజంగానే కోపం వచ్చినట్టుంది.

రామం:- కాస్తా కూస్తాగా వచ్చిందా? మా ఆవిడ ఆడదయి పోయిందిగాని-మగాడయితే ప్రాణాలు తోడేద్దును. వళ్ళు మండిపోయింది. కోపం నిండిపోయింది; ఇష్టం వచ్చినట్లు కోప్పడి- నోటికి వచ్చినట్లు తిట్టి, ఇంకా కోపం తీరక...కోపం తీరకా...

రంగ:- కోపం తీరక- ఏంచేశావు?

రామం:- కోపం తీరక యిట్లా బయటికి వచ్చేశాను. ఇక్కడ నువ్వున్నావు.

[బాబాయి కోపంగా ప్రవేశం]

బాబా:- ఉన్నావూ- ఇక్కడ. ఇల్లారా; రా దగ్గరికి, ఈ యిల్లు ఎవరిది?

రంగ:- (భయంగా) మీది

బాబా:- నాదా? నాదికాదు. అమరశ్రీది. తెలిసిందా? ఈ యింటిమీద పెత్తనం ఆమెదే- తెలిసిందా?

రంగ:- తెలిసింది.

రామం:- పెత్తనం తనదని నోటికొచ్చినట్లల్లా అంటే- పడి పూరుకోవాలా?

బాబా:- నోటికొచ్చినట్లల్లా ఏమంది?

రామం:- ఏమనాలి ? 10 నిమిషాలక్రింద నన్ను దద్దమ్మంది.

బాబా:- అవును, నిజమేగా. "నవ్వు దద్దమ్మ 'వని నేనెన్నిసార్లనలేదు. అదీ-అదే-అన్నది.

రామం:- అందే అన్నది. కాని కాసిన్ని మంచినీళ్ళడిగితే యివ్వని పెళ్ళాం-ఎందుకొచ్చిన పెళ్ళాం అంట ?

రంగ:- పైగా చొక్కాలు మాపాతని సాధింపు

రామం:- సినిమాకి వెళ్ళగూడదు-రేడియో పెట్టగూడదు.

రంగ:- సిగరెట్లు కాల్చగూడదు. (రామం నోరు నొక్కుకుంటాడు.)

బాబా:- ఆ-నువ్వు సిగరెట్లు కాలుస్తా ?

రంగ:- అప్పు దప్పుడూ-ఎప్పుడన్నాలెండి.

రామం:- మొగుడూ పెళ్ళాం అన్నాక- మాటా, మంచీ అంటూ వుంటుంది పది గంటలదాకా నవలలు రాస్తుంది, అందుకని మాట్లాడటానికి వీలులేదు.

రంగ:- పది గంటల తిర్వాత నిద్రవస్తూంది.

రామం:- ఇవ్వాళమట్టుకు యివ్వాళ "Get out of the bed" అంది. ఆస్తి అంతా తనదే అయితే- bed కూడా తనదేనా?

బాబా:- నిన్ను Get out అందేం ?

రామం:- ఒక్క Get out ఏమిటి ? సర్వెంట్ కంటె హీనమయిపోతే! మంచి కాఫీకూడా గతిలేదు. తనకి fist filter కాఫీ-నీకు "next", నాకు last యిస్తుందీ ?

బాబా:- నాకూ first filter కాఫీ యివ్వదూ?

రామం:- నీకు first లేదూ, నాకు second లేదు. ఛీ, ఛీ, వళ్ళు మండి పోతుంటే-

బాబా:- మండదూ? ఆగు. కనుక్కువస్తా. (లోపలికి వెళతాడు.)

రంగ:- మీ బాబాయికి కోపం వచ్చినట్లుందిరోయ్ ?

రామం:- వచ్చినట్టేవుంది.

రంగ:- లోపలికి వెళ్ళి మీ ఆవిడమీద కేకలేస్తాడు.

రామ :- వేస్తాడు. ఆగు, కుర్రాణ్ణి పిలిచి, వినిరమ్మందాం. అరే! ఇట్లా రారా (కుర్రవాడు రాగా) బాబాయి ఏమని కేకలేస్తున్నాడో-వినిరా...పో

కుర్ర:- అల్లాగేనండి? (వెళతాడు.)

రంగ:- బాగా కేకలేస్తుండాలి యీపాటికి.

రామం:- బాబాయికి కోపం వస్తే కేకలు బాగా వేస్తాడు. ఈ దెబ్బతో అణిగి పడివుంటుందిలే! ఇక ఎదురు చెప్పిందంటే ''బాబాయితో చెప్తా" అని బెదిరించవచ్చు. ఇక చూడు. చేతికో ఆయుధం దొరికింది. ఇక ఎట్లా ఆడిస్తానో, చూడు.

రంగ:- (తలుపు దగ్గరకెళ్ళి వింటాడు రామం దగ్గరకెల్తాడు. లోపల్నుంచి బాబాయి కేకలు వినిపిస్తాయి)

బాబా:- (లోపల్నించి) కాస్త మగవాళ్ళమని భయభక్తు లక్కర్లే? ఇంత చదువుకున్నందుకు ఇదా లాభం? వాడంటే భయం లేకపోతే మానె? నేనన్నా భయం అక్కర్లే?

రంగ:- బాగా కోప్పడుతున్నాడ్రా!

రామం:- అవును.

రంగ:- బాబాయికి కోపంవస్తే వళ్లు తెలియదసలు.

రామం:- నిజం.

రంగ:- తన్నిగూడా Insult చేసిందని మహాకోపం వచ్చింది.

రామం:- మరే.

రంగ:- ఈ కోపంలో వళ్లు మర్చిపోయి...

రామం:- మర్చిపోయి?...

రంగ:- వళ్లు మర్చిపోయి చెయ్యిచేసుకోడుగదా ?

రామం:- ఊ! కొడతాడంటావా?

రంగ:- ఆ కోపంలో...ఏమొ ?

రామం:- అదెప్పుడూ ఎవరిచేతిలోనూ దెబ్బలు తినలేదురా!

రంగ:- ఇల్లాగా?

రామం:- బాబాయికి కోపం వస్తే వళ్లు తెలియదు.

రంగ:- మరే.

రామం:- ఆ కోపంలో బావకొడితే?

రంగ:- కొట్టినా కొట్టవచ్చు.

రామం:- ఎల్లారా? ఎరక్కపోయి కోప్పడ్డాను.

రంగ:- అది మంచికే వచ్చిందిలే? ఇకనుంచీ "బాబాయితో చెప్తా" అని బెదిరించవచ్చు.

[కుర్రవాడొస్తాడు]

రామం:- ఏమంటున్నాడ్రా బాబాయి?

కుర్ర:- బాబాయిగారిది - పై డాబుసరి అనుకున్నాగాని ఇంత కోప్పడతారని నేననుకోలేదండీ!

రామం:- బాగా కోప్పడుతున్నాడా?

కుర్ర:- అమ్మగారిమాట వినిపించుకోకుండా కోప్పడుతున్నారు.

రామం:- రంగనాథం! నువ్వు వెళ్లి సర్దన్నా చెప్పిరారా?

రంగ:- సర్దిచెప్పటానికేంగాని-ధైర్యం చాలటం లేదురా.
(కుర్రాడితో) ఆ! ఇంకేమంటున్నాడు?

కుర్ర:- ఇకనుంచి తనకే First decoction యివ్వాలట?

రామం:- ఆ!

కుర్ర:- మీరు చొక్కాలు మాపుకున్నా - ఆలస్యంగా యింటికి వచ్చినా-సిగరెట్లు కాల్చినా-తనతో చెప్పాలిటగాని ఆమెగారే కోప్పడగూడదట.

రామం:- తనతో చెప్పాలా?

కుర్ర:- First decoction తనకే ఇవ్వటానికి వప్పుకున్నారు గాని రిపోర్టుచేసి వూరుకోటానికి అమ్మగారేమాత్రం వప్పుకోటంలే!

రామం:- ఏం ?

కుర్ర:- తను చదువుకున్న భార్యగాబట్టి తన భర్తప్రవర్తన నడవడిక తనే సరిదిద్దుకోవటానికి తనకి సంపూర్ణ అధికారం వుందట, కనక బాబాయి అడిగినా-ఆ భగవంతుడే అడిగినా-ఆ అధికారం తను వదులుకోనని అమ్మగారు ఖచ్చితంగా చెప్పారు.

రామం:- అనేసిందీ అంతమాట!

కుర్ర:- దాంతో బాబాయిగారు కోపం పట్టలేకపోయారు. మొహం కందగడ్డలాగయింది. కళ్ళెర్ర బడ్డాయి. మీసాలు నిక్కబొడిచాయి.

రంగ:- బాబోయ్!

కుర్ర:- ఇక కోపం పట్టలేక, గదిలో, ధనా ధనా-అటూ-ఇటూ-తిరుగుతూ మూలనున్న దుడ్డుకర్ర తీసుకొనీ-

రామం:- తీసుకున్నాడూ - కొట్టేడా - దెబ్బ తగిలిందా?

రంగ:- కొట్టే వుంటాడు యీ పాటికి?

రామం:- కొట్టాటరా-కొట్టేశాడా?

కుర్ర:- ఈ పాటికి కొట్టే వుంటారండి. ఆయన కర్ర ఎత్తేటప్పటికీ— మీకు చెప్పేద్దామనీ-నే వచ్చేశాను.

రామం:- ఏడిసినట్టుంది. పో! చూసిరా.

కుర్ర:- ఈ పాటికి అంతా అయిపోయే వుంటుందండి. ఇంకా ఏముంటుంది చూడటాన్కి-?

రామం:- ఏడిశావ్! పో బాబాయి ఏమంటున్నాడో-అమ్మగారు ఏడుస్తోందో-ఏమన్నా కట్టూగిట్టూ కట్టుకుందో! అంతా చూసిరా!

(కుర్రవాడు వెళ్తాడు)

రామం:- రంగనాధం!

రంగ:- రామం...?

రామం:- ఇప్పుడు నేనేం చెయ్యాలి?

రంగ:- ఏం చేస్తానంటావ్?

రామం:- ఏదోవకటి చెయ్యాలి.

రంగ:- పోనీ చెయ్యి.

రామం:- సరాసరి వెళ్ళి బాబాయిని కోప్పడితే!

రంగ:- బాబాయినే!

రామం:- ఆ, బాబాయినే! ఏం, కోప్పడలేనూ?

రంగ:- కోప్పట్టానికేం? కోప్పడగలవ్, కాని ఆ కర్రతోనే నిన్నూ వకటి వేస్తే?

రామం:- (తగ్గి) ఒకటీ!-ఒకటివేసివదిత్తే బాగానే వుంటుంది.

(కుర్రవాడు గాభరాగా వచ్చి)

కుర్ర:- బాబుగారూ! బాబుగారూ!

రామం:- ఏంరా? ఏం?

కుర్ర:- ఇల్లా అవుతుందని నేనెప్పుడూ అనుకోలేదండి!

రంగ:- ఏమయిందేం?

కుర్ర:- బాబాయిగారు కర్ర ఎత్తేరా—ఎత్తేటప్పటికి-

రంగ:-
రామం:- | ఆ.

కుర్ర:- అమ్మగారు కన్నీళ్ళు కడవలుగా కార్చేశారు. ''నే నెంత చేసినా మీరూ మీరూ వకటే-చివరికి ఆయన మాటలే నమ్ముతారు - Coffee Stronggా తాగితే మీ ఆరోగ్యం చెడుతుందని మీ కాఫీలో పాలెక్కువ వేశి యిస్తుంటే యీమాట అన్నారూ'' అన్నారు. దాంతో బాబాయి గారు ''అల్లాగా, అయితే సరే...నాకు కాఫీ ఎప్పుడూ అల్లాగే యిస్తూండు'' అన్నారు. పైగా-మీ మాట, యిక చస్తే నమ్మనని ప్రతిజ్ఞ చేశారు.

రంగ:- ఊహూ!!!

కుర్ర:- ''లేనిపోనివన్నీ నాతో చెప్తాడా? ఆగు వీడి సంగతి చెప్తా'' అని కర్రతీసుకు బయలుదేరారు.

రంగ:- ఆ, ఆ, వస్తున్నారా ఏం?

కుర్ర:- అప్పుడమ్మగారు అడ్డుపడి ''ఎంత చెడ్డా, నా భర్త నా కళ్ళఎదట ఆయన్ని కొట్టద్దూ'' అనీ-కర్ర లాగేసుకున్నారు.

రంగ:- అయితే ఫర్వాలేదు. కర్ర తేవటంలేదుగా.

కుర్ర:- ''కొట్టద్దూ, బాగా కోప్పరమనీ'' మరి-మరీ చెప్తున్నారు. (బాబాయి రాగా కుర్రవాడు నిమ్మదిగా వెళ్ళిపోతాడు)

బాబా:- ఇల్లారా! రా. దగ్గరకి. ఏమిటి చెప్పావిందాక?

రామం:- ఏం చెప్పాను-పెద్ద, ఏం చెప్పందే?

బాబా:- ఏడిశావు వూరుకో, ఏం చెప్పలేదంటావేం? లేనిపోనివన్నీ కల్పించి పెద్ద లిస్టుగా-రిపోర్టులు ఏకరువు పెట్టి-ఏం చెప్పలేదంటావేం?

రామం:- అవును. అవన్నీ నిజమేగా!

బాబా:- నిజం? ఏం నిజంరా? అసలు సంగతి దాచిపెట్టి, అన్నీ అతుకులు పెట్టి, పితూరీలు చెప్తావు-పైగా అన్నీ నిజమంటావు!

రంగ:- ఏం అతుకులు పెట్టావురా రామం?

బాబా:- మన విషయం, మన ఆరోగ్యం విషయం, అది అంతగా ఆలోచించి-జాగ్రత్తగా చూసుకొస్తూంటే, దాని మీద పితూరీలు చెప్తావు-పితూరీలు.

రామం:- నా ఆరోగ్యం సంగతా అది చూసింది? అన్నీ అలావుంచి "Get out, get down" అనటం గూడా నా ఆరోగ్యం సంగతేనా?

రంగ :- అవునండి. రెండు Sets Tennis ఆడి, ఓడివచ్చి, వాడు కాస్త నడుం వాలిస్తే-"Get out of the bed" అని అంటే - వాడిలాటి మగవాడి కెలావుంటుంది! చెప్పండి ?

బాబా:- ఊ ?

రంగ:- అహహ. మీరు కోప్పడితే, నే చెప్పలేను గాని ...

బాబా:- కానీ ? కాని ఏమిటోయ్ గాని ? వూరంతా తిరిగి వచ్చి, మట్టి కాళ్ళతో-మంచమెక్కి- కూర్చుంటే, దిగి వెళ్ళి కాళ్ళు కడుక్కోమంటం తప్పా ?

రామం:- ఊ. అట్లా అందేమిటి ?

బాబా:- మరి ఎట్లా అందేం ? ఒరేయ్ ! ఇవన్నీ ఎందుకు ? నే చెప్తున్నా విను. అది నీకంటె తెలివయిందని వప్పుకుంటావా-వప్పుకోవా ?

రంగ-: వప్పుకోరా రామం-ఆ మాట నిజమే గాదురా ?

బాబా:- అది తెలివైందిగనక-దానిమాట నువ్వు విని తీరాలి, అవునా కాదా?

రంగ:- అవున్లెండి.

బాబా:- కాబట్టి యిక నీ విషయం నాతో ఏమైనా చెప్పేంబా, జాగ్రత్త!

రామం:- అయితే అది చెప్పిందల్లా నిజం, నే చెప్పిందల్లా అబద్ధం అన్న మాటా ?

బాబా:- అన్నమాటేమిటి! అంతే. అనుమానం లేదు. అందువల్ల నోరు మూసుకు పడివుండి అది చెప్పినట్టల్లా విను.

రామం:- ఊహూ! నేను వినను.

బాబా:- ఏడిశావు. నోరుముయ్యి. వెధవవేషాలు నాదగ్గర కాదు. ''పెళ్ళాం చెప్పిన మాట వినరా'' అంటే వినలేని దేవయ్యవేంరా నువ్వు? నాకే పెళ్ళాంవుంటే, మాట వినకుండా వుండేవాడినా ? అది మంచిది గనక నీ ఆటలు సాగుతున్నై, అది మహా యిల్లాలు గనుక నీకిన్ని మంచినీళ్ళు పుడుతున్నాయి, అది మహామంచిది గనక నీతో కాపురం చేస్తున్నది.

రంగ:- రామం!

బాబా:- (విసుగ్గా) రామం, రామంట. ఒరే, రంగనాథం! విను. విని నువ్వు నీ స్నేహితులందర్కీ చెప్పు. వీడి పేరు యిక రామంగాదు.

రంగ:- కాదూ ?

బాబా:- కాదు. రామంగాదు. వీడిపేరు ఇకనుంచీ అమరశ్రీ మొగుడు, ఇహ నుంచీ అట్లా పిలవాలి-మీ స్నేహితులందరూ. (లోనికి వెళ్తాడు.)

రామం:- (చాలాసేపు ఆలోచించి) రంగనాథం !

రంగ:- ఆ, ఏంరా ?

రామం:- మా అమ్మా నాన్నా నాకు రామం అని పేరు పెట్టారు.

రంగ:- మీ అమ్మా-నాన్నా పెట్టింది ?

రామం:- ఆ పేరుకూడా యివ్వాళ పోయింది.

రంగ:- ఏం శాశ్వతం లేద్దూ ? వాళ్ళిచ్చిన ఆస్తులే ఆగలేదు- పేర్లా ఆగేవి ?

రామం:- ఉన్న పేరుకూడా పోయింతర్వాత ఏం లాభంరా బతికి?

రంగ:- అబ్బాయ్! మనం ప్రతిదానికీ లాభనష్టాలు లెక్కపెడ్తూ కూర్చో గూడదు.

రామం:- అందుకే ఏ లెక్కా లేకుండా యివ్వాళ మనకి - వున్నదీ లేనిదీ- అంతా త్యాగం చేస్తున్నాను

రంగ:- పోనీ—చేసెయ్యి.

రామం:- ఈ కష్టం, సుఖం, కలిమీ లేమీ, ఆస్తీ పాస్తీ, అంతా చేసుకున్న భార్యతో సహా-వదిలేస్తున్నాను.

రంగ:- ఆలాగే.

రామం:- ఐహికమైన యీ తుచ్ఛ జీవితాన్ని వదిలి జీవితాన్ని భగవదార్పణం చేసి, ఆధ్యాత్మికంగా జీవితం వెళ్ళబుచ్చుతాను.
(వెళ్ళి ఒకమూల సన్యాసి పోజు పెట్టి కూర్చుంటాడు)

రంగ:- ఏమిట్రా యిది?

రామం-: సన్యాసంరా-సన్యాసం. వైరాగ్యం-దివ్యనేత్రం వికసించింది, ఆత్మ జ్ఞానం కలిగింది. ముక్తి మార్గానికి "గేటు" తెరుచుకుంది.

రంగ:- ఏమిట్రా యిది...రామం?

రామం:- ఇకనుంచీ మన పేరు రామంగాడు.

రంగ:- అవును ఆ పేరు బాబాయి పెట్టాడుగా!

రామం:- ఇకనుంచీ మన పేరు "రామేశ్వర యతీంద్రులు"

రంగ:- "యతీంద్రులా" అంటే—?

రామం:- ఆ. సర్వసంగ పరిత్యాగం చేసి - మోక్షమార్గాన్ని అన్వేషిస్తూ— శ్రీశ్రీశ్రీ రామేశ్వర యతీంద్రులు-ఈ యింటినీ, ఈ ఆస్తినీ, ఈ సర్వ సుఖాల్నీ, ఆ బాబాయినీ (కళ్ళ నీళ్ళు తుడుచుకొని) ఆ యిల్లాలినీ-ఇక- యిల్లా-విడిచేసి......

రంగ:- విడిచెయ్యటమే!

రామం:- నిద్రాహారాలు వర్జించి-ఎండనక, వాననక, కేవల పరమేశ్వరోపాస నాసక్తుడై; యిల్లా ... యిల్లా ...... వెళ్ళిపోతున్నాడు. (వెళ్ళిపో బోతాడు)

రంగ:- నిజంగానే, నిజంగానే. (అడ్డంపోతూ) ఒరే! రామ! కాస్త ఆలోచించరా?

రామం:- ఇక ఏ ఆలోచనల్లేవు.

రంగ:- తర్వాత విచారిస్తావ్!

రామం:- ఏ విచారం లేకుండా వుండటానికే, ఈ పని చేస్తున్నాను. చూశావా! నాలో ఎంత మార్పు వచ్చిందో?

రంగ:- ఆ.

రామం:- సన్యాసం తీసుకునేసరికి-ఉన్న విచారాన్నీ పోయాయి. మనసు తేలిగ్గా వుంది. ఒళ్ళు బరువు తగ్గింది. కళ్ళు చల్లబడ్డాయి ఒరేయ్, నే వెళ్తున్నా- నాతోబాటు నువ్వూ రా.

రంగ:- నేనూ రానా?

రామం:- ఆ సన్యాసంలోవున్న సుఖం- సంసారంతో లేదు. అనుభవం మీద చెప్తున్నా-అన్నీ విడిచిరా. సుఖపడ్తావు.

రంగ:- ఎల్లా రానూ? పెళ్ళి అవందే ఎవర్నీ విడిచిపెట్టి రాను?

రామం:- సరే, నీ ఇష్టం-ఎంతో అనుభవిస్తేగాని నా అంతవాడివి కావులే. నే వెళ్తున్నాను. (వెళతాడు)

రంగ:- ఆ. ఆ. వెళ్ళటమే. ఒరే. కుఱ్ఱాడా!

[కుఱ్ఱవాడు రాగా]

కొంప మునిగిందిరా. బాబాయిని పిలవరా. రామం సన్యాసం పుచ్చుకుంటున్నాడ్రా. పో-పిలూ-అమ్మగార్నికూడా పిల్చుకురా. ఆమెను చూశన్నా-ఏమన్నా, తిరుగుతాడేమో.

(కుఱ్ఱవాడు లోపలికివెళ్ళి బాబాయితో సహా వస్తాడు.)

బాబా:- ఏడీవాడు?

రంగ:- వెళ్ళాడు.

బాబా:- ఎక్కడికి?

రంగ:- సన్యాసం పుచ్చుకోడానికి-

బాబా:- సన్యాసం పుచ్చుకోడానికా?

రంగ:- ఆ, అందుకే. కొప్పడి మీరిటు వెళ్ళారూ- వాడు అటు వెళ్ళాడు.

బాబా:- వెళ్తుంటే, చూస్తూ వూరుకున్నావు?

రంగ:- ఏం చెయ్యను? మీరన్న మాటకి "ఛ! ఎందుకీ జీవితం" అనుకున్నాడు. ఇంతలో-ఎక్కణ్ణించి వచ్చిందో- వైరాగ్యం వచ్చేసింది. వెళ్ళిపోయాడు. పైగా నన్నూ రమ్మని బలవంతం చేశాడు.

బాబా:- వెళ్ళకపోయావు తోడు?

రంగ.- వెళతా. మీతో చెపుదామని ఆగా. (తనూ వెళ్ళబోతాడు.)

బాబా:- ఆగు (అని కోపంగా కేకవేసి) ఇద్దరూ తోడుదొంగలు పోగయ్యారు. చెప్పు-ఈ నాటకమంతా ఏమిటి?

రంగ:- నాటకం!

బాబా:- ఆ. నాటకం! ఇలా బెదిరించి, నన్ను లొంగదీసుకోవాలని గాదూ? చెప్పు-ఇది యిద్దరూ కలిసి వేసిన ప్లానా, కాదా?

రంగ;- (మాట్లాడడు)

బాబా:- చెప్పవేం? చెప్తావా లేదా? ఏమిటీ ఆలోచన?

రంగ:- (వణికిపోతూ) సన్యాసం తీసుకుని వాడితో వెళితే బాగుండేది కదా అని ఆలోచిస్తున్నా.

బాబా:- నోరుముయ్యి (మహాకోపంగా) దొరికారు ఒకళ్ళ కొకళ్ళు ఏడీవాడు? రానీ. సన్యాసం గిన్యాసం వదలగొడతా.

రంగ:- (కళ్ళ-నీళ్ళతో) వాడికరాడు.

బాబా:- పోనీ, ఎన్నాళ్ళని-ఎక్కడికి పోతాడో?

రంగ:- పోతాడు. పోయి సన్యాసుల్లో కలుస్తాడు.

బాబా:- కానీ, కలిస్తే కలుస్తాడు.

[కాషాయ వస్త్రాలు ధరించి రామం ప్రవేశిస్తాడు.]

రంగ:- వచ్చావుట్రా రామం? ఇంకా వెళ్ళలేదూ?

రామం:- పొశ్: ''స్వామీ రామేశ్వర యతీంద్రులవారిని'' 'రామం' అన కూడదు.

బాబా:- ఆహా, మహబాగా కుదిరించే వేషం- (దగ్గరికి వెళ్ళి కోపంగా) వేషం ఊడగొట్టేవాడు లేక, వేషం విప్పుతావా దవడ పేలగొట్టమంటావా?

రామం:- హుష్. ఆగ్రహం పనికిరాదు. దురాగ్రహం అసలు పనికిరాదు. సామాన్య ప్రజలకు కామ క్రోధ మద మాత్సర్యాలలో, కామంతప్ప తక్కినవన్నీ వర్జనీయాలు.

బాబా:- ఏమిటీ ఎంగిలి కూతలు?

రామం:- అంతా సొంతం. రామేశ్వర యతీంద్రుల ఉవాచ-అంటే అన్నారన్న మాట-ఏమన్నారంటే......

బాబా:- వళ్లు పొగరెక్కితే ఏమన్నా అంటారు.

రామం:- పొగరు. అది మనం వర్జించేశాం. ఈ ఐహికమంతా వదిలేసి, ముక్తి మార్గా న్నన్వేషిస్తూ దేశదేశాలూ...

బాబా:- తిరుగుతావేం? తిరగటానికి జోలె అక్కర్లేదూ- జోలె? ఇదిగో–నే దానంచేస్తా తీసుకో.

రామం:- జోలె అక్కరలేదు. గీలె అక్కరలేదు. కావల్సిందల్లా ఒక్క శిష్య వర్గం. శిష్యులుగా చేరేవారెవరో రండి. నే వెళుతున్నా, జై సీతారాం (వెనక్కి తిరగ్గా)

బాబా:- ఆగు.

రామం:- ఆగను.

బాబా:- ఆగకపోతే అధోగతి పాలవుతావు.

రామం:- అదంతా కేవలం ఐహికం.

బాబా:- మళ్ళీవస్తే తిండిగూడా పెట్టను.

రామం:- నిరాహార దీక్ష యివాళే ప్రారంభం.

బాబా:- అమరశ్రీతో మాట్లాడనివ్వను.

రామం: సన్యాసికి సంసారబంధాలు పనికిరావు.

బాబా:- అయితే కానీ, అమరశ్రీకి మళ్ళీ పెళ్లి చేస్తాను.

రంగ:- రామం! ఇదన్నా ఆలోచించరా.

రామం:- భౌతిక విషయాలు ఆత్మని కలుషితం చెయ్యలేవు.

బాబా:- అయితే పో, ఇక్కణ్ణుంచి తొందరగా.

రామం:- పోతున్నాను. జై సీతారాం పోయేముందు పెద్దలయినందున, మీకు నమస్కారం చేసి పోతాను. (అని దగ్గరకు వెళ్ళి పాదాభి వందనం చేస్తాడు)

బాబా:- నిజంగా వెళ్తున్నావట్రా!

రామం:- ఆఁ.

బాబా:- మమ్మల్నిద్దర్నీ యిల్లా వదిలి వెళ్తావుట్రా, పెద్దవాణ్ణి నా సంగతి ఆలోచించవు సరే. చిన్నది-దాని సంగతి ఆలోచించరా!

రామం:- పెద్దాలేదు. చిన్నాలేదు. అంతా విధి విలాసం.

[కుర్రవాడొస్తాడు]

కుర్ర:- మీరు వెళ్ళేముందు ఒకసారి మాట్లాడి వెళ్ళమన్నారండి.

రామం:- ఎవరా అన్నది?

కుర్ర:- అమ్మగారండి.

బాబా:- పాపం!

రంగ:- అవున్రా. ఆఖరిసారి - ఒక్కసారి - ఒక్కమాట మాట్లాడిపోరా.

రామం:- వద్దు మనకి ఆఖరిసారీ, మొదటిసారీ లాంటివిలేవు

బాబా:- ఇంత కఠోర్కటకుడివేంరా! కోరి చేసుకున్నందుకు యీ కోరిక చెల్లించరా?

రామం:- అరరే. ఆత్మజ్ఞానంలో పరిపక్వమై భగవదైక్యం కావటానికి ఎన్ని అడ్డంకుల్రా ప్రపంచంలో...సరే కానీ, వెళ్ళి వస్తాను. (లోపలి కెళ్తాడు)

బాబా:- వేళాకోళం అనుకున్నాను. ఎంత అఘాయిత్యం తలపెట్టావురా!

రంగ:- వేళాకోళం అనుకోవట మేమిటండీ, నేనింతగా మొత్తుకుంటుంటే-

బాబా:- ఆఁ ?

రంగ:- వాడు సన్యసిస్తున్నాడండీ అని నేను నెత్తీనోరూ కొట్టుకుంటుంటే వినకుండా, మీరూరికే ఒళ్ళు తెలియకుండా కోప్పడటమేనయ్యే.

బాబా:- ఊం.

రంగ:- సన్యాసించాడంటే సన్యసించడూ - మీరిద్దరూ కల్సి వాణ్ణి ఇలా అడకత్తెరలో నొక్కుతుంటే!

బాబా:- ఎవరిద్దరూ ?

రంగ:- ఇంకా ఎవరిద్దరూ ఏమిటి? మీరే. మీ మామాకోడళ్ళు; పొద్దస్తమానం వాడి ఎముకలు కొరుక్కుతిని వెన్నవంటి వాడి మనసు విరిచేశారు.

బాబా:- మేం విరిచామా ?

రంగ:- కాదూ మరి ? వాడు బయటికి సినిమాకి వెడితే తప్పు, ఇంట్లో రేడియో పెడితే తప్పు. మంచినీళ్ళు తాగటానికి వీల్లేదు. మనిషితో మాట్లాడటానికీ వీల్లేదు. మంచంమీద కూర్చోటానికి వీల్లేదు. చస్తాడేం, సన్యాసం పుచ్చుకోక?

బాబా:- ఏడిశావ్, ఆగు. చూడగా చూడగా నువ్వే యిదంతా రేపెట్టి నట్టున్నావు-

రంగ:- నేను రేపెట్టేదేమిటి? వాడి అవస్థచూసి నేనూ పెళ్ళి చేసుకోకుండా వెళ్ళి వాడి శిష్యుడుగా చేరదామని చూస్తుంటే!

బాబా:- ఇంకేం? నీవల్లే వాడి కీబుద్ధి పుట్టింది.

రంగ:- నావల్ల ఎందుకు ? వాడికే పుట్టింది. యింట్లో Servant కన్న హీనంగా చూస్తుంటే పుట్టదూ! ఎన్నిసార్లు fail అయినా మాత్రం, వాడూ B. A. దాకా చదివాడు.

బాబా:- చదివినందుకు యిదా ? సన్యాసుల్లో కలవడమా !

రంగ:- అది నయంకాదూ, మీ యిద్దరిమధ్యా నలిగేవానికంటే; మీకు మీదే. ఆమెకి ఆమేనాయె.

బాబా:- అబ్బాయ్, నన్నంటే అన్నావు, దాన్ని అనకు... అహహ... దాన్నంటే అన్నావు-నన్ననకు

రంగ:- ఇద్దర్నీ అంటాను. ఎందుకు అనను ? అలాంటి స్నేహితుణ్ణి యిలా కాషాయగుడ్డల్తో చూస్తుంటే కడుపు మండిపోతుంటే!

బాబా:- ఇదిగో! నన్ను రేక్కొట్టావంటే వాడితోపాటు నీకూ సన్యాసం యిచ్చి యింట్లోంచి గెంటిస్తా.

రంగ:- నాకు చిరాకొచ్చిందంటే వాడితో పాటు నేనూ సన్యాసం పుచ్చుకు వెళ్ళిపోతా, జాగ్రత్త-ఆఁ-

బాబా:- పొండి, పోతే యిద్దరూ కల్సి.

రంగ:- పోతాం మహారాజుల్లాగా, పిలవండి వాణ్ణిగూడా.

బాబా:- పిలుస్తా, పొండి ముందు.

రంగ:- పిలవండి ముందు వాణ్ణి.

బాబా:- ఓరేయ్ రామం !

రంగ:- రారా రామం !

బాబా:- ఈనాటికి నువ్వూ ధైర్యవంతుడ వయ్యావే !

రంగ:- మీరవలా, నాటకంలో Villain లాగా.

బాబా:- నన్ను Villain అంటావుట్రా ?

రంగ:- ఏం, అంటే అంటా...ఆఁ.

బాబా:- పో ముందు, నా యింట్లోంచి.

రంగ:- పోతా వాడూ వస్తే

బాబా:- ఒరే రామం, బయటికి రా.

రంగ:- ఒరే రామం, పోదాం పద.

బాబా:- పోతాడు. అడుక్కు తింటానికి.

రంగ:- అక్కర్లే, నాతో వుంటాడు.

బాబా:- పెద్ద దొరికావు. వాడికి ఆసరా.

రంగ:- లేకపోతే లెక్కేమిటి, పెద్ద.

బాబా:- అయితే తీసుకుపో, వాణ్ణి.

రంగ:- పోతా రమ్మనండి, వాణ్ణి.

బాబా:- రావేరా రామం, పిలుస్తుంటే.

రంగ:- రావేరా రామం, పోదామంటే.

బాబా:- రామం, నిన్నే పిలిచేది.

రంగ:- రామం. నిన్నే రమ్మనేది.

[కుర్రవాడొస్తాడు]

బాబా:- ఏం చేస్తున్నార్రా వాడక్కడ?

రంగ:- ఎందుకున్నార్రా వాడింకా అక్కడ?

బాబా:- రాదేంరా, అక్కణ్ణుంచి కదలి!

రంగ:- రాదేరా, యిల్లిక వదలి !

కుర్ర:- రామంగారే నాండి?

రంగ:-<br>బాబా:- | ఆఁ, వాడే.

కుర్ర:- అమ్మగారితో మాట్లాడుతున్నారండి.

బాబా:- రమ్మను - గెంటేస్తా - యింట్లోంచి.

రంగ:- రమ్మను. పోతాం-గెంటకముందే.

(కుర్రవాడు వెళతాడు)

బాబా:- చూసుకో బాబాయి అంటే ఏమిటో.

రంగ:- కామకోండి రంగనాధం అంటే ఏమిటో.

బాబా:- ఆఁ.

రంగ:- ఆఁ.

[కాషాయ గుడ్డలు చేతో పుచ్చుకొని కుర్రాడొస్తాడు.]

బాబా:- ఏడిరా వాడు?

రంగ:- (కాషాయగుడ్డలు చూసి) ఏమిట్రా యిది ?

బాబా:- వాడింకా రాడేం ?

రంగ:- వాణ్ణింకా పిలవలేదేం?

కుర్ర.- పిలిచానండి. పిలిస్తే, నవ్వేసి తలుపేసేస్తూ, యీ గుడ్డలు నా మొహాన పారేసి, ఇవి, మీ మొహాన పారేసి నన్ను యింటికి పొమ్మన్నారండి. (అని రంగనాథం మొహాన పారేసి బయటికి వెళతాడు.)

బాబా:- వాళ్ళిద్దరూ కలిసిపోయారేం!

రంగ:- ఆ-కలిశారు, మనిద్దర్నీ విడదీసి. హరి రామం! మళ్ళీ సంకెళ్ళు వేయించుకున్నావు! (కుర్చీలో కూలబడతాడు.)

( తెర )



## పాత్రలు

న్యాయపతి
డాక్టర్ ఆరోగ్యం
M. L. A. ప్రజాపతి
నాగేశం
కోటి రూపాలు

(హిందూ దేశంలో తయారయిన గడియారం సాయంకాలం ౫ గంటలు వినిపించింది. జీవిత నాటకంలో మానవునికి కొంత వ్యవధి దొరికిందా సమయంలో. వివిధసమస్యలు, ఆందోళనల మధ్య నలిగి, నాశనమవుతున్న మానవుల (ప్రేక్షకుల) తో నిండిపోయిందా నాటకశాల. దొరికిన దొక గంట అవకాశాన్ని ఆనందంగా అమాయకంగా గడిపి వెళ్లాలనుకొని వారంతా నాటకానికి వొచ్చారు. ధర్మాత్ములు, దరిద్రులు, స్వార్థపరులు, స్వార్థత్యాగులు, రాజకీయ దురంధరులు అందరితోను ఆ నాటకశాల కిటకిటలాడి పోతూందంటే అతిశయోక్తి వుండబోదు. నాటకం యెప్పుడు ప్రారంభమవుతుందా, యెవరు బాగా నటిస్తారా, కథ, మాటలు యెవరు వ్రాశారు. సినిమా తారలెవరైనా నటిస్తున్నారా లేదా అనే అతురతను ప్రకటిస్తున్నారు పెద్దమనుష్యులు నాగరికత తెలిసిన వారు యేవో ముఖ్య విషయాలు (తమ స్వంత వ్యవహారాలు) తమలో తామే ఆలోచించుకుంటూ పదే పదే గడియారం వంక చూచుకుంటూన్నారు. అంతవరకు రంగాన్ని కప్పివేసి, ప్రేక్షకులకు విసుగునుకలిగించి, వివేకాన్ని కోల్పోయేలా చేసిన ఆ తెర (ఉక్కు తెరకాదు) తొలగిపోయింది.

ప్రేక్షకులు కన్నార్పకుండా కుతూహలంతో ఆ దృశ్యం చూస్తున్నారు. జీవిత నాటకంలో మానవుని మధ్య తిరుగాడే వివిధ మనస్తత్వాలు, వాతావరణంలాగే అదికూడా 'జూపిటర్స్ క్లబ్' హాలు. విలువైన కుర్చీలు, పొడుగాటి టేబిలు, ద్వారాలకు విలువైన సిల్కు కర్టన్లు, గోడలకు రాజకీయ నాయకుల బొమ్మలు, అన్నీ వున్నాయ్. ప్రపంచాన్ని తెలుసుకోవటానికి అవకాశం కలిగించే వొక గ్లోబ్ టేబిల్ మీద వుంది. ఆకాశంలోని తారా మండలాలు, చంద్ర మండలం, వాటి దూరాలను తెలుపు వొక పెద్ద మ్యాప్ (గీచినది) తగిలించబడి వుంది. రంగస్థలం నిశ్శబ్దంగా ప్రశాంతంగా వుంది. జీవితంలో గడిచిపోయిన సాయంత్రం ౫ గంటలను-తిరిగి సృష్టిస్తూ నాటకం లోని వాతావరణం ౫ గంటలు వినిపించింది. యెవరో వొక పెద్ద మనిషి 4౫ సం॥ వయసు వుంటుంది. సన్నని చెదరిన జుత్తు, చొక్కా ప్యాంటు, మెడకు టై కట్టుకొని టేబిలు మీదకు వాలి, దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తున్నాడా లేక దీర్ఘంగా నిద్రి

స్తున్నాడా అనే సందేహం కూడా కలక్కపోదు ఆ వాలకం చూసే ప్రేక్షకులకు. క్షణం గడచిన తర్వాత మరో పెద్ద మనిషి ఆ క్లబ్ లోకి ప్రవేశించాడు. వయసు 60 సం॥ మీరిన సోమరిలాగున్నాడు. కాని జీవితంలో బా.గా బ్రతికినవాడే. కంటికి అద్దాలు, కాలికి చిరిగిన పాత చెప్పులు, చేతిలో వొక పాత గొడుగు, ధోవతి చొక్కాపైన కట్టి ఆ చొక్కాకు వొక టై బిగించాడు. వెంట్రుకలు బాగా నెరిసి తెల్లబడి పాపం ఆ పెద్దమనిషి వయస్సును బయటపెట్టేస్తున్నాయ్. అతన్ని చూడగానే 60 సంవత్సరముల బాలుడని బాగా తెలుసుకో వచ్చును. ముఖంపైన మూడు నామాలున్నాయ్ దైవభక్తుడేమోననే సందేహం కూడా కలుగుతుంది ప్రేక్షకులకు రాగానే చేతిలోని కోటును గొడుగును వో స్టాండుకు తగిలించి, మెడను నులుముతున్న టైని కొంచెం వొదులు చేసి, అద్దాలు తీసి, చేతిరుమాలుతో ముఖం తుడుచుకొని, దగ్గరలోనేవున్న కూజాలోని నీళ్లను వో గ్లాసులోనికి పోసుకొని రెండు గ్లాసుల నీరుత్రాగి అలసట తీరినట్టుగా వో నిట్టూర్పు విడిచి కుర్చీపై కూర్చున్నాడు. టేబిలుమీదనున్న తెలుగు మాసపత్రిక "భారతి"ని చేతితో అందుకొనబోయి అద్దాలు కంటికి తగిలించి దగ్గరకు పొయ్యాడు. వెంటనే కుర్చీలో దీర్ఘాలోచనలో నిమగ్నుడై వున్న పెద్ద మనిషిని చూచాడు. కాస్త తటాపటాయించి తన చేతి గడియారం వంక చూచుకొని మెల్లగా ఆలోచిస్తున్న వాని దగ్గరకొచ్చి సంభాషణ ప్రారంభించాడు. ఇంతకూ యీ ముసలి పెద్దమనిషిపేరు న్యాయపతి. అప్పుడప్పుడూ వీరికి మాటలు యెక్కువ దొర్లుతూ వుంటాయి )

న్యాయపతి:- హల్లో డాక్టర్ ! నేను మిమ్మల్ని చూడనేలేక పొయ్యాను. ముందు మీరు నన్ను క్షమించాలి. మిమ్మల్ని గుర్తు పట్టలేక పోవడానికి యింకో కారణం కూడా వుంది. అద్దాలు కంటికి తగిలించిన తర్వాత గాని మీరు నాకు కనిపించలేదు. క్షమించాలి. ఇంటికెళ్ళి కాఫీ త్రాగితే ఆలశ్యమవుతుందని సరాసరి యిక్కడికే వచ్చి రెండు గ్లాసుల మంచి నీళ్ళు త్రాగి తృప్తిపడ్డాను. (పిసినిగొట్టు భావాన్ని చూపిస్తూ) అయ్యో ! యింటి వద్ద నాకొరకై వుంచిన కాఫీ వృధా అయిపోతా

యేమో ! ఆ పిల్లముండలు వాటిని బురదగుంటలో పారబోస్తారేమో? అనవసరంగా అణాపాలు నష్టమైపోతాయి గదా ! (డాక్టరు విన్నాడేమోనని భయపడి) క్షమించాలి. యిది నా స్వంత విషయం. మరి, మన కార్యక్రమం ప్రారంభిద్దామా ! (డాక్టరు పలకడు, కదలడు, కన్నెత్తయినా చూడలేదు. వొకటే ఆలోచనలో వుండి పోయ్యాడు ) (కాస్త దగ్గరగా సమీపించి) మీరు నిద్రపోతున్నారా, ఆలోచిస్తున్నారా ? (డాక్టరు దగ్గరనుంచి జవాబు లేదు)

నా ఆలశ్యం మీ కోపానికి కారణం కాలేదుగదా ? నాకు తెలియదు మీరు చాలా శాంతమూర్తులు. యేదో గొప్పవిషయం ఆలోచిస్తున్నారు మీ ఆలోచన యేమిటో నేను గూడా తెలుసుకోవచ్చునా ?
(డాక్టర్‌లో చలనం లేదు)

(కాస్త పొడుంపీల్చి రెండు తుమ్ములు తుమ్మి) డాక్టర్ ! డాక్టర్ ! అరే! ఆత్మహత్య కాదుగదా? లేక ఆలోచిస్తూనే ప్రాణం పోయిందా? రామరామ- యీ సమయంలో నేనెందుకు వచ్చానిక్కడికి ? ఆ ! ఇంతకూ చచ్చినట్టేనా ? (మరీ దగ్గరకు ప్రవేశించి) లేక నేనేమైనా పొరపాటున......డాక్టర్! యేమండీ ఆరోగ్యంగారు! (వీపుమీద తట్టాడు. వెంటనే డాక్టర్ శవంలాగా ముందుకు టేబిలు మీద పడిపోయాడు. న్యాయాధిపతికి చెమటలు పోసినయ్.) తప్పకుండా ఎవరో హత్య చేసారు. ఇది కోటిరూపాలుగాడి పనే. ఇంక నన్ను మాత్రం బ్రతకనిస్తాడా......నన్నూ చంపేస్తాడు. (బయటనుంచి పోలీసు విజిల్ వినిపిస్తుంది. న్యాయపతిలో దడ ప్రారంభమయింది) అదిగో పోలీసులు! యేడుకొండలవాడా, వెంకటరమణా రక్షించు! నాకేమీ తెలియదు (బయటకు వెళ్ళిపోవడానికి గొడుగు కోటు తీసుకుంటాడు. మరలా పోలీస్ విజిల్ వినిపిస్తుంది. గాబరాతో నేలకూలిపోతాడు. లేవను శక్తిరాదు. మెల్లగా కుర్చీని పట్టుకొని లేస్తాడు. కోటును వేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. చేతులు వణకడంమూలాన అది సాధ్యం కాదు. గొంతులో తడిలేదు ఒకసారి డాక్టర్‌ను చూశాడు. కూజాను పైకితీసి గ్లాసులో నీళ్ళు పోస్తుండగా కూజా జారిపోయి మరలా

పట్టుకుంటాడు. మరలా పోలీస్ విజిల్ వినిపిస్తుంది. (ఈసారి అలాగే కుర్చీలో కూలబడి పోయ్యాడు) రామ! రామ! రామ! రామ! ఏడు కొండలవాడా! ఆపద మొక్కులవాడా! రక్షించు! రక్షించు! (మనిషి బాగా వణికిపోతున్నాడు. ఆలోచిస్తున్న డాక్టరు వొక్కసారిగా)

డాక్టరు:- I have found out the way!

న్యా:- అయ్యో! వచ్చేశారు పోలీసులు! వెంకటరమణా! రక్షించు. (కళ్ళు రెండు గట్టిగా మూసుకొన్నాడు.)

డా:- Now I can catch the moon. I can go upto the destiny of moon. (పైకి లేచాడు. కుర్చీలో భయంతో ప్రాణం విడుస్తున్న న్యాయపతిని జూచి) Oh! you are here? (దగ్గరకొచ్చాడు) Mr. న్యాయపతి! (భుజం తట్టాడు)

న్యా:- (పిచ్చిగా అరచి) నాకేం తెలియదు సార్! యీ హత్య నేను చేయ లేదు. నేను వచ్చేలోపలే యీన చచ్చిపడి ఉన్నారు. అంతేసార్! నాకేమీ తెలియదు.

డా:- ఇక్కడెవర్ని హత్య చేసారు? మీ రెందుకు యిలా భయపడు తున్నారు? యిలా చూడండి.

న్యా:- (చూడకుండానే) నా కేమీ తెలియదు సార్! ఆయన కాయనే ఆత్మ హత్య చేసుకున్నాడు సార్!

డా:- మీరు వొక్కసారి యిలా చూడండి.

న్యా:- ఊహు! నేను చూడను సార్!

డా:- ఇక్కడ యెవ్వరూ లేరు. యిలా చూడండి.

న్యా:- ఎవ్వరూ లేకపోబట్టే యీ నేరం నామీద పడింది. (కళ్లు మూసు కునే) మీకు నమస్కారం చేస్తాను సార్! నా కేమీ తెలీదు. అయినా నేను ప్లీడర్ని. 20 సం॥ సర్వీసు. నేనెందుకు చేస్తాను సార్ హత్య!

డా:- ఇప్పుడు హత్య ఎవరు చేశారు?

న్యా:- కోటిరూపాలుగాడు.

డా:- వాడెవడు?

న్యా:- గజదొంగ.

డా:- వాడు హత్య ఎందుకు చేస్తాడు?

న్యా:- హత్యలు చెయ్యటమే వాడి పని. మొన్ననే జైల్లో నుంచి పారిపోయాడు. నన్ను చంపుతానని...సార్ పబ్లిక్‌గా- ఆఁ! పబ్లిక్‌గా చంపుతానని వొక ఆకాశరామన్న ఉత్తరం రాశాడు సార్. యిదిగో కోటు జేబులో వుంది తీసుకొని చూడండి సార్. (అని గొడుగు అందిస్తాడు.)

డా:- మీరు కళ్లు తెరచి మాట్లాడండి!

న్యా:- నాకు కళ్ళులేవు సార్. ఫ్యాషన్‌కోసం అద్దాలు వేసుకున్నాను. అంతే.

డా:- మీరు నాటక మాడుతున్నారా?

న్యా:- ఎప్పుడో చిన్నతనంలో నాటకాలు వేశాను. అంతే.

డా:- ఏదీ! మీ చెయ్యి యిలా యివ్వండి.

న్యా:- ఎందుకూ సంకెళ్ళు వేస్తారా? అమ్మో; నేనివ్వను.

డా:- మీ రెవరితో మాట్లాడుతున్నారు?

న్యా:- పోలీసు యిన్స్‌పెక్టర్‌తో.

డా:- (పెద్దగా నవ్వేశాడు) (నాగేశం న్యాయపతి రికార్డు తీసుకొచ్చాడు.)

నాగే:- రికార్డు తీసుకొచ్చాను సార్.

న్యా:- ఎందుకూ? నా దగ్గర స్టేటుమెంటు తీసుకుంటారా? నేను చంపలేదన్నానుగా.

డా:- మీరు మతితప్పి మాట్లాడుతున్నారు-అవునా?

న్యా:- అంతే. అంతే. మతిపూర్తిగా పోయింది. నేను రేపు కోర్టులో గూడా యిదే చెబుతాను మా అబ్బాయిని, అమ్మాయిని పిలిపించండి.

వారితో కొన్ని ముఖ్య విషయాలు చెప్పాలి. ఆఖరిసారిగా వారిని చూచి మరీ వస్తాను.

నా:- రికార్డు తెద్దాను సార్.

న్యా:- నా దగ్గరికేనా ?

నాగే:- అవును.

న్యా:- అయ్యో వెంకటేశా! మీరు నన్ను తప్పకుండా అరెస్టు చేస్తారా ?

డా:- ఎందుకండి?

న్యా:- ఆయన్ను యెవరో హత్య చేసినందుకు.

డా:- ఎవర్ని ?

న్యా:- డాక్టర్ ఆరోగ్యం గార్ని

డా:- (విస్తుపోయి) What! డాక్టర్ ఆరోగ్యాన్నా?

న్యా:- అదిగో చూచారా, మీరప్పుడే నన్ను అనుమానిస్తున్నారు. నేనందుకే మా పిల్లల్ని పిలిపించమని చెప్పాను. జైలు కెళ్ళేలోగా వారిని ఒక్కసారి చూడాలని వుంది... వెంకటరమణా, రక్షించు తండ్రి !

నాగే:- మీరేంమాట్లాడుతున్నారు సార్?

డా:- Mr. న్యాయపతి ! మీరు చాలా పిచ్చిదశలో వున్నారు. డాక్టర్ ఆరోగ్యం బ్రతికేవున్నాడు. యిలా చూడండి.

న్యా:- (ఆశ్చర్యంగా) ఆ! బ్రతికున్నాడా! అబద్ధం. యింత క్రితం చచ్చి పడున్నవాడు యిప్పుడే యేలా బ్రతికాడు, నన్ను పరీక్షిస్తున్నారా సార్?

డా:- ఏమండి, మీరు యీ లోకంలోనే వున్నారా?

న్యా:- యిప్పటివరకు వున్నానుసార్! యింకోక్షణం దాటితే జైలు ప్రపంచంలో వుంటానని నాకు తెలుసు. యెందుకు సార్, నన్ను యేడిపిస్తారు? మా పిల్లల్ని పిలిపించండి చూచిపోతాను.
(మూర్ఛపడినట్లు పడిపోతాడు.)

డా:- (నాగేశంతో) Water తీసుకో!

నా:- (తెచ్చాడు)

డా:- (న్యాయపతి ముఖాన నీళ్ళుజల్లి) యిప్పుడెలాగుందో చెప్పండి.

న్యా:- (కళ్ళుమూసుకునే) ఎలాగుంటుంది? నేను ఖైదీలాగే వున్నాను. యిదంతా ఆ కోటిరూపాలుగాడు చేసిన పని.

డా:- న్యాయపతిగారు, వొక్కసారి కళ్ళు తెరవండి నేనే! Dr. Arogyam Speaking.

న్యా:- (తాపీగా) ఏమిటి! నిజంగానా? పోలీసు గాదూ?

డా:- No. No. చూడండి!

న్యా:- (మెల్లగా కళ్ళు తెరిచాడు. నాగేశాన్ని డాక్టరును చూచాడు) నిజంగా మీరు డాక్టర్ ఆరోగ్యమేనా?

డా: ఊఁ!

నాగే:- అవునండి. నేను నాగేశాన్ని.

న్యా:- (చూచాడు. మరలా డాక్టర్‌ని చూచాడు. తిన్నగా లేచాడు. డాక్టర్‌ను పరిశీలనగా జూచి దగ్గరకు వొచ్చి......అమాంతం కౌగిలించుకున్నాడు.) శ్రీ వెంకటరమణా! ఎంత పని జరిగిందయ్యా!

డా:- అసలు జరిగిన విషయమేమిటి?

న్యా:- ఆఁ! ఏదోలేండి. చెప్పుకుంటే సిగ్గుచేటు. ఆ! మీరు యెంత పిలిచినా పలుకలేదు.

డా:- నేనా! నన్ను మీరు పిలిచారా?

న్యా:- వొక్కసారి కాదు. అరడజన్ సార్లు. మీరు పలుకలేదు. నాకు పిచ్చి పట్టింది వొరే నాగేశం, యింటికెళ్ళి అబ్బాయినోసారి పిల్చిరా! (నాగేశం వెళ్ళిపోయాడు) డాక్టర్! మీరు యేమైనా ఆలోచిస్తూ అలా గుండిపోయారా?

డా:- అవును. చంద్రమండలం సరిహద్దుల్లోకి సరాసరి వెళ్ళిపొయ్యాను.

న్యా:- చంద్రమండలం కళ్ళారా చూచారా?

డా:- లేదు. తీరా వెళ్ళేసరికి యింజన్ చెడిపోయింది. తిరిగి భూమి మీద పడ్డాం. యీసారి మరో ప్రయత్నం చేస్తున్నాను. తప్పక చంద్ర మండలం చేరుకుంటాను. ప్రపంచంలో అన్ని దేశాలకన్నా మొట్ట మొదటిసారిగా భారత పతాక ప్రతిష్ఠాపన చంద్రమండలంపై జరిగి తీరుతుంది. ఇది తిరుగులేని నా దృఢ విశ్వాసం. అయితే యిది నా వొక్కడితో అయ్యే పనికాదు. మీ అందరి సహాయం కావాలి. మొత్తం భారతీయులందరూ యీ ప్రయత్నంలో నాకు చేయూత నివ్వాలి.

న్యా:- మీరు మాట్లాడుతున్నది చంద్రమండలం గురించి కదూ? మరి సూర్యమండలం మాటేమిటి?

డా:- ఒకటి తర్వాత మరొకటి. ఆఁ! Mr. న్యాయపతి, మీరు గూడా నాతో రావాలి.

న్యా:- తప్పకుండా వస్తాను...ఆఁ! ఎక్కడికి ?

డా:- చంద్రమండలంలోని అపూర్వ శృంగార దృశ్యాలు మీకంటితో మీరే చూచి తన్మయత్వం చెంది మత్తుగా ఆనందించటానికి. అచ్చటి ప్రకృతి మీకు చాలా వుత్సాహాన్ని కలిగిస్తుంది. ఆ లోకపు వింత నాగరికత మిమ్మల్ని దిగ్భ్రాంతులుగా చేసి పారేస్తుంది. ఆ నైసర్గిక స్వరూపం మిమ్మల్ని అనేక ఆలోచనలలో ముంచేస్తుంది. మీరు తప్పక నాతో రావాలి.

న్యా:- రావటానికి నా అభ్యంతరం అంతగా లేదనుకోండి. అయినా నేను వయసు చచ్చి, ఆరోగ్యం చెడి, నడుంవంచి నడుస్తున్నాను. ఇంకొక కారణమేమిటంటే...

డా:- కారణాలు ఎన్ని అడ్డం వచ్చినా కాదనటానికి వీలులేదు. మీరు రాజకీయాలు మాట్లాడుతావు గదా— మన దేశానికి కలుగబోతున్న వొక అఖండ విజయానికి మీరు గూడా కర్తలుగా నిలబడాలి. విప్లవాత్మకమైన యీ విజయం ద్వారా భారతజాతి ప్రపంచంయొక్క ఆశీర్వాదాలు పొందుతుంది. అప్పుడు ప్రపంచంలో మన స్థాయి

పెరుగుతుంది. మన పేర్లు చిరస్థాయిగా ప్రజా హృదయాల్లో మెరస్తూ, మేల్కొల్పుతూ వుంటాయి. దీనిమూలంగా మన దేశానికి ఎంతకీర్తి రానున్నదో ఊహించండి మీరు తప్పక నాతో చంద్ర మండలం రావాలి.

న్యా:- నే నెందుకండి, మన M.L.A. ప్రజాపతిగారిని వెంట తీసుకు పోండి. వారు నాకన్నా చిన్నవారు. రాజకీయాలన్నా, రాజ్యాలు చూడాలన్నా వారికి నిండా ఆసక్తి, శ్రద్ధ. పైగా చంద్రమండలం చూడాలని నాతో వోమారు చెప్పివున్నారు. కాబట్టి మీతో తప్పకుండా వొస్తారు. చూడండి... మీరు నన్ను క్షమించే వుంటారని భావిస్తు న్నాను. యింకొక కారణం యేమిటంటే... (కాస్త పొడుంపీల్చి) నాకు పిల్లా, జెల్లా పెద్ద సంసారం. పిల్లాడు మొన్ననే M. A. ప్యాసయి వుద్యోగంలేక తిరుగుతున్నాడు. వాడిని అలాగే విడిచిపెడితే యీ రాజకీయాల్లోపడి మనమాట వినకుండానే పోతాడు. యింకొక కారణమేమిటంటే అమ్మాయి... నా కూతురండీ......శారద.... B.A. చదివి, భర్తకోసం అంటే తనకు తగుమైన వాడుగా వో అందంలోగాని, చదువులోగాని వుండాలని కోరిక. కట్నం ఎక్కువ అడుగకూడదు. యింకొక కారణం యేమిటంటే-

డా:- అబ్బ! మీకు లక్ష కారణాలుంటాయ్

న్యా:- వున్నాయని చెప్పండి.

డా:- మనిషన్న తర్వాత కారణాల కేం తక్కువ? కోటి రూపాలు గాడు దొంగతనం చేస్తాడు. ఎందుకు చేశావని జడ్జిగా రడిగితే కోటికారణాలు చెప్తుతాడు. అవన్నీ మన మంగీకరిస్తామా ?

న్యా.- (కోటి రూపాలుగాడు పేరెత్తగానే న్యాయపతిలో భయంకనిపించింది కాస్త గొంతు సవరించుకొని) చూడండి, వాడి పేరు మాత్రం ఎత్తకండి.

డా:- వాడంటే మీ కెందుకంత భయం ?

న్యా:- వాడు గజదొంగ, ఖూనీకోరు, దగాకోరు, దుష్టుడు, దుర్మార్గుడు. అబ్బ, కాసిన్ని మంచి నీళ్ళివ్వండి (డాక్టరు యిచ్చాడు) (తాగి)

వాడు... నా కొంపతీయటానికే పూనుకున్నాడు. నేను ప్లీడర్ని, అంత సులభంగా విడిచిపెడతానా ? Twenty years of experience! ముప్పై కోర్టులూ తిప్పి, మూడు చెరువుల నీళ్ళు త్రాగించి, మూడు సంవత్సరాలు కఠిన శిక్ష వేయించాను. (కాస్త దిగులుతో) కాని, వాడు నెల శిక్ష కూడా పూర్తికాకుండానే జైల్లో నుంచి తప్పించుకొని పారిపోయాడు.. నన్ను పబ్లిక్‌గా చంపుతానని ఉత్తరం వ్రాశాడు. (డాక్టర్ చేతులు పట్టుకుని) డాక్టర్! నా కన్న చిన్నవాడివైనా నీ చేతులు పట్టుకుని ప్రార్థేయపడుతున్నాను. నన్ను ఎలాగైనా ఆ రాక్షసుడి గండంనుంచి తప్పించు. నా సంసారం నిలుపు. నా తర్వాత నా పిల్లలకు దిక్కులేదు. ఆస్తినంతా పాడు చేసేస్తారు.

డా:- యింతకూ కోటిరూపాలుగాడు మీకేం అపకారం చేశాడు?

న్యా:- అయ్యో, అదంతా పెద్దగొడవ. యిప్పుడెందుకులే. వాడు పరమ దుర్మార్గుడని చెప్పానుగా. అంతే, మనస్సులో పెట్టుకో. వాడు యీ గోడలచాటున పొంచయినా మనమాటలు వింటూంటాడు.

డా:- వింటే విననీండి!

న్యా:- నీకు తెలియదు నాయనా! తర్వాత నా కొంప మీద నిప్పులుపోస్తాడు. వాడి విషయమే మనకొద్దు. ఆ! యేదీ ఆ చంద్రమండలం యింకా యెలాగుంటుంది? ఆఁ-నన్ను గూడ రమ్మన్నారు గదూ! ఓ తప్పకుండా వస్తాన. ప్రజాపతిగారినీ కూడ తీసుకెళ్దాం! మనతో వొస్తాడు. ఇంతకూ మనం చంద్రమండలానికి నడిచి వెళ్ళాలా లేక విమానం మీదనా ? ప్రపంచాన్ని దాటిపోవాలి గదూ? అబ్బ! చాలా దూరమే! ఆఁ! దయచేసి అలా బయట చూసిరండి, ఆ కోటి రూపాలు గాడొస్తున్నాడేమో? యీలోగ నేనోగ్లాసు మంచినీళ్ళు త్రాగుతాను. కాస్త దడ తగ్గుతుంది.

డా:- (న్యాయపతి కనబరుస్తున్న వికారాలకు కాస్త చీకాకు కనబరుస్తూ తాపీగా బయట గుమ్మం వరకు వెళ్ళి గిర్రున న్యాయపతి వంక తిరిగి) మీరు పవిత్రమైన భారత దేశంలోని ఆవేశ పూరితమైన

ఆంధ్రప్రదేశ్‌లో వున్నతమైన బ్రాహ్మణ కులంలో జన్మించారు. బాగా చదువుకున్నారు. పుష్టిగా డబ్బు సంపాదించారు. జాతీయ అభివృద్ధి కార్యక్రమాలకు మీ సంపాదనలో రాగిదమ్మిడీ కూడా వుపయోగపడక పోగా, యింకా యెక్కువ సంపాదించి యింట్లో పోగుచెయ్యాలని మీకు ఆరాటం.

న్యా:- ఇదిగో డాక్టరుగారు ! ఆ విషయాలు మా సంసారానికి సంబంధించినవి. వాటిని బయటపెట్టి నన్ను రచ్చ కీడ్చడం మీకు న్యాయం కాదు.

డా:- Mr. న్యాయపతి ! నేను డాక్టరును, లెబరేటరీ చీఫ్‌ను, సైకాలజిష్టును-అవునంటారా ?

న్యా:- కాదని యెలా అనగలను ?

డా:- అనలేరు కాబట్టి వింటూ వుండమని నేనంటున్నాను. మానసికంగా శారీరకంగా మీరు పొందే కష్టాలు, సుఖాలు, లాభాలు, నష్టాలు, మీ మొఖం చూస్తే చెప్పి వేయగలను. చెప్పమంటారా ?

న్యా:- చెప్పినందువలన మీకేమైనా లాభమా ?

డా:- మీరు న్యాయవృత్తిలో సత్యాలు అసత్యాలుగా, దొంగను దొరగా, దొరను దొంగగా తారుమారుచేసి కేసులు గెలుస్తారే, దాని వల్ల మీకేమైనా లాభమా ?

న్యా:- అది వృత్తికి సంబంధించిన విషయం. పైగా అలా చేయడం ప్రతి ప్లీడరు బాధ్యత. ఇందులో నా వొక్కడి లాభంతో పనేముంది?

డా:- ఆలాగే నేను సైకాలజిష్టును. ప్రతిమనిషి యొక్క మానసిక తత్వాలు పరీక్షించి ప్రపంచానికి తెలపడం నా బాధ్యత. యిందులో నా తప్పేముంది ?

న్యా:- ఏమీ వుండదు...ఆ...యేదీ, ఆ చంద్రమండలం విషయం మరిచి పోయాం. కాస్త విపులంగా చెబుదురూ ! ఆకాశంలో ప్రయాణము చేయడానికి పరికరాలన్నీ సిద్ధంగా వున్నాయా ?

(డాక్టరు అతని అనకాశనాద ధోరణికి నవ్వుకుంటూ వుంటాడు)

(నాగేశం తొందరగా కొంపమునిగిన వాడిలా వొక్క పరుగులో న్యాయపతి ముందు వాలి వొగురిస్తూ)

నాగే:- మీ కోసం యెవరో వచ్చారండి. నిండా అవుసరమైన పని వుందని చెప్పారు. యెలాగైనా మిమ్మల్ని పిలుచుకొని రమ్మన్నారు.

న్యా:- యీ సమయంలో నా కోసమెవరొస్తారు? కోర్టు పనిగా వచ్చారా?

నా:- ఏ విషయమైనా మీతోనే నేరులో మాట్లాడాలట. అమ్మాయిగారు తొందరగా పిలుచుకుని రమ్మన్నారు.

న్యా:- మనిషి యెలా వుంటాడు ?

నా:- పొడుగ్గా, లావుగా, వొంపుగా, బాగానే వున్నాడు.

న్యా:- అతని పేరు కనుక్కున్నావా ?

నా:- పేరు చెప్పనన్నాడు సార్. మీతోనే చెపుతాడట. పైగా గుర్తులు చెబితే మీరే తెలుసుకుంటారని కూడా చెప్పాడుసార్.

న్యా:- (కోటి రూపాలు గాడేనని గుండె జారిపోయింది. విస్తుపోయిన వాడిలా) ఆఁ ! చెప్పొద్దూ, కొంపతీసి కోటి రూపాలుగాడు కాదు గదా !

నా:- ఏమోసార్, యింట్లో పెద్ద గొడవగా వుంది. అమ్మాయి గారు చాలా కోపంగా వున్నారు. పెద్దగా... వెక్కి ... వెక్కి యేడ్చేస్తున్నారు.

న్యా:- ఆఁ ! యేడుస్తున్నారా ? ఎందుకురా ?

నా:- ఆమె చీరలు, నగలూ, పెట్టె, పక్క, అన్ని మూటగట్టి...

న్యా:- మూట-గట్టి.........

నా:- ఎక్కడికో పోతానంటున్నారు... !

న్యా:- వెళ్ళిపోతానంటు దీ ! ఆ కోటి రూపాలుగాడు దానికేదో మచ్చు మందు చల్లాడు. బి ఎ. వరకు చదివిన పిల్ల తన్ను గురించి నేనెంత కష్టపడుతున్నదీ తెలుసుకోకుండా ఆ వెధవ దొంగతో వెళ్ళిపోతానంటుంది ఆరవై సంవత్సరాలు నిండి రామా కృష్ణా అనుకునే ఈ వయస్సులో యికా వృత్తిని విడిచిపెట్టకుండా డబ్బు సంపాదించి

కూడపెటుతున్నది వీళ్ళ కోసమేగా ! వీళ్ళు బాగుపడతారనేగా ! డాక్టర్ ! (డాక్టర్ దగ్గరకొచ్చి) డాక్టర్ ! మీరీ విషయంలో నాకు గొప్ప సహాయం చేసిపెట్టాలి... యింకో కారణమేమిటంటే... దీని వల్ల మా సంసారమంతా...

డా:- (నాగేశంతో) ఆ వచ్చిన మనిషి కోటి రూపాలని నీకు బాగా తెలుసా ?

న్యా:- తెలిసేదేమిటండి వాడి పిండం ... నేను చెపుతున్నానుగా! వాడు యిమ్మాటికీ వాడే...నన్ను చంపి మా అమ్మాయిని యెగరేసుకు పోదామనే వచ్చాడు. ప్లీడర్ని, 20 సంవత్సరాల Experience ఆ మాత్రం తెలీదా సార్ నాకు...మీరు నాకు సహాయం చేసిపెట్టండి. వెంకటరమణా !

డా:- మీరు అనవసరంగా కంగారు పడకండి ! (నాగేశంతో) ప్లీడరు గారమ్మాయితో వొచ్చిన వ్యక్తియేమైనా ముఖాముఖి మాట్లాడినాడా?

నా:- మూతులు మూతులు కలిసి పోయేటంత దగ్గరలో చేరి ... తర్వాత చెవులో యేదో...గుసగుసలు.

న్యా:- ఆఁ ! గుసగుసలా ? మా అమ్మాయితోనే...!

డా:- పూర్తిగా వినకుండానే మీ కెందుకీ ఆవేదనా ?

న్యా:- ఆవేదన యేమిటండి ఆరాటము పుట్టుకొస్తుంటేను... ! (కుర్చీలో చేరగిలడి నెత్తిన చేతులుపెట్టి యింకేమీ చేసేది లేదన్నట్లుగా ఆకాశంవైపు చూస్తున్నాడు)

డా:- ఆఁ ! గుసగుసలాడుతున్నారా ?

నా:- అవునండి.

డా:- తర్వాత !

నా:- కొంతసేపయిన తర్వాత...నన్ను జూచి అమ్మాయిగారు బయటకు వెళ్ళిపొమ్మన్నారు.

డా:- వెంటనే వెళ్ళిపోయావా ? (న్యాయపతి ఆతురతగా నాగేశంవంక చూస్తున్నాడు)

నా:- నేను వెళ్లానా ? గోడ చాటు నుంచి వాళ్ళ మాటలన్నీ వింటూనే వున్నాను

డా:- ఏం మాట్లాడుకున్నారో త్వరగా చెప్పు !

నా:- రెండు నిమిషాల వరకు వొట్టి నవ్వు మాత్రం వినిపించింది.

డా:- తర్వాత?

న్యా:- ఆ! తర్వాత యేముంటుంది? ఆ దొంగముండాకొడుకు మచ్చు చల్లి మా అమ్మాయికి మంత్రం వేసుంటాడు.

నా:- అదికాదండి!

న్యా:- ఇంకేమిటిరా ?

నా:- తర్వాత యేదో రూపాయలు లెక్కబెడుతున్నట్టు వినిపించింది సార్ ! చిల్లరంతా క్రిందబోసి యెంచుతున్నారు.

న్యా:- (పూర్తిగా దిగజారి పోయ్యాడు.) అయిందీ! నా యిల్లంతా గుల్లయి పోయిందీ. వెంకటరమణా, యికనేమి చేతునయ్యా! కన్నబిడ్డకన్నా మిన్నగా నా డబ్బును సాకేనే! అందరినోట మాటలనిపించుకొని, వ్యసనాలకోర్చి ఆస్తినంతా ప్రోగుచేసేనే! డాక్టర్! డబ్బువిలువను మా పిల్లలు తెలుసుకోవాలని, పొయ్యిలో కట్టెలు కొనాలంటే పావలా ఖర్చని చెట్టుమీద కాకిగూడు పడగొట్టి వంటచేయమని...పనిమనిషితో చెప్పాను. దాని కిష్టం లేక ఆ పని చేయనంటే నౌకరీ వూడగొట్టి నేనే మడిగట్టుకొని వంటచేసిపెట్టాను యిరవై పైసలు పెరుగుకొంటే డబ్బుదండుగని అణా మజ్జిగలో నౌటాకునీళ్ళుకలిపి రెండు పూటలు సుష్టుగా భోంచేసేవాణ్ణి యింత కష్టపడి కూడబెట్టిన డబ్బు...ఆ గజ దొంగ లాక్కొనిపోతుంటే చూస్తూ వూరుకోమంటారా...డాక్టర్! (డాక్టర్ చేతులు గట్టిగా పట్టుకొని) ఇవి చేతులుగాదు... మీరు తప్పక మాయింటివరకు వెళ్ళిరండి...డాక్టర్! (యేడుస్తాడు)

డా.- మీరు చాలా వింత మనుషులండి! మీ వయస్సు మీ ప్రాణానికెంత ప్రమాదమో—మీ మాటలు గూడా వినేవారికి అంత ప్రమాదం కలిగిస్తున్నాయ్. పాపం! మిమ్మల్ని చూస్తే నాకెందుకో చాలా జాలిగా వుంది!

న్యా:- జాలిగా వుందికదూ! వుంటుంది. వుంటుంది. మీరు సర్వవిధ సంపూర్ణ పండితోత్తములు కాబట్టి నామీద జాలిచూపుతున్నారు. ఆ గజదొంగపు నామీదెందుకు జాలివుంటుంది. నా డబ్బు కొల్లగొట్టు కొని పోతున్నాడు. పట్టపగలే నా యింట్లో దోపిడీకి సిద్ధమయి నాడు. డాక్టర్! మీరు వెంటనే మాయింటికెళ్ళాలి.

డా:- వెంటనే పోలీస్ స్టేషన్‌కు తెలియజేస్తే మంచిదికదూ?

న్యా:- అమ్మయ్యో! వద్దు. మరీ కోతిపుండు బ్రహ్మాండమైపోతుంది. అందర్నీ కోర్టుకు తాగుతారు... లేనిపోని గొడవ బయల్దేరుతుంది.

డా:- సరే అయితే, నేను వెళ్ళేముందు యింకా కొన్ని విషయాలు తెలుసు కోవాలి. (నాగేశంతో) అమ్మాయి గారు యెక్కడికి పోతున్నారో నీకు తెలుసా?

నా:- తెలీదు సార్! డబ్బులన్నీ బాగాలెక్క పెట్టి మూటగట్టారు. తర్వాత గాజుల శబ్దం వినిపించింది. దాన్నిబట్టి చేతిగాజులు, మెడలోవున్న నగలుకూడ మూటగట్టినట్లు అనుమానం వేసింది సార్! తర్వాత అమ్మాయిగారి యేడుపు వినిపించింది...

న్యా:- నగలుకూడా దోచుకున్నాడూ! వాడి పీడి పాపాలు పండిపోను. శ్రీ వెంకటరమణా! నన్ను యింకా ఎందుకు బ్రతికించినావయ్యా? డాక్టర్! నీకింకా అర్థం కాలేదా? మా అమ్మాయి ఆ నగలు యివ్వనని వుంటుంది... వాడు కత్తిచూపించి అన్నీ విప్పి మూటగట్టేసుంటాడు. అమాయకురాలు యేడుస్తూంది. గోలచేస్తే నలుగురూ వింటారని ఆ పిల్లను గొంతు పిసికేస్తాడేమో! డాక్టర్, మీకు నమస్కారం చేస్తాను...వెళ్ళండి. యీ సమాచారం పోలీసుకు మాత్రం పట్టించ కండి, అంతా తారుమారైపోతుంది.

నా - అబ్బాయిగారుకూడా యింట్లోనే వున్నారండీ!

న్యా - ఏమిటీ! మా అబ్బాయి గోవిందుగూడా యింట్లోనే వున్నాడా?

నా.- తర్వాత వొచ్చారండీ!

డా.- ఆ... వచ్చి... ఏం చేశాడు?

న్యా:- ఆ గజదొంగను నాలుగు తన్నారా లేదా ? వెధవకు బుద్ధివొచ్చేట్టు చెయ్యాలి!

డా:- ఇంతకూ గోవింద్ మీ కుమారుడేకదూ?

న్యా:- అవును. M.A. ఫస్టుక్లాసులో ప్యాసయినాడు, చాలా చురుకైనవాడు, నేనంటే యెంత ప్రాణం-యెంత మర్యాద, యెంత భక్తి డాక్టర్! మీరు నమ్ముతారో లేదోగాని నాకీమధ్య మా బంధువుల దగ్గరనుంచి వో పెండ్లి సంబంధ మొచ్చింది నా వంటరితనాన్ని చూచి సహించలేక మా అబ్బాయి గూడా నన్ను పెండ్లిచేసుకోమని ప్రాధేయపడ్డాడు. నేను అంగీకరించలేదు. వొద్దన్నాను. మావాడు అన్నం మానేశాడు. వెంటనే 80 వేల రూపాయలు కట్నమిస్తామని, పెండ్లికంగీకరించమని టెలిగ్రాం వచ్చింది. నేనందు కంగీకరించాను.

డా:- (ఆశ్చర్యంతో) What! మీకు మళ్ళీ పెళ్ళా?

న్యా:- నా కోసమా? నా యింటి గౌరవం కోసంగాని! (నాగేశంతో) యింతకూ ఆ దొంగను బయటకు గెంటి డబ్బులు- నగలు లాక్కున్నారా లేదా?

నా:- లేదండీ! అబ్బాయిగారు యింట్లోకి పోగానే-హల్లో, హల్లో అని వొకటే పకపకలు...యికయికలు... కాపీ కాయమని అమ్మాయిగారితో చెప్పారు. ముగ్గురూ హాయిగా త్రాగేసి కులాసాగా కాలం గడిపారు. (డాక్టరుకు యీ వింతపోకడ యేమి అర్థంగాక గుట్టుగా కుర్చీలో కూలబడ్డాడు.)

న్యా:- ఓరి దౌర్భాగ్యుడా! ఆ దొంగ రాస్కేల్‌ను గొంతు నులిమి బయటకు నెట్టక కులాసాలు మాట్లాడాడాడు- కులాసాలు! యేడవలేక పొయ్యాడు చచ్చుపీనుగ!

(ప్రజాపతి దర్జాగా ప్రవేశించాడు. సిల్కు లాల్చీ, సిల్కు కండువా, సిల్కు ధోవతీ! ఠీవిగా నడుస్తాడు. ఠీవిగా మాట్లాడుతాడు. తను మాట్లాడే ప్రతి మాటలోను హోదా కనుపరుస్తూ వుంటాడు. చేతిలో వో పేపరు.)

ప్ర:- అంతా క్షేమమేనా న్యాయపతిగారూ!

న్యా:- అదిగో దొంగ—పట్టుకో! పట్టుకో!!

ప్ర:- ఎవరండీ దొంగ!

డా:- హల్లో! Mr. ప్రజాపతి, యిప్పుడేనా రావటం?

ప్ర:- హల్లో! Dr. ఆరోగ్యంగారా? మీరూ యిక్కడే వున్నారన్నమాట!

న్యా:- (ఓన్నబుచ్చుకొని) క్షమించాలి. వేరే ధోరణిలోపడి మిమ్మల్ని అన కూడని మాటన్నాను. యింకో కారణమేమిటంటే......

ప్ర:- ఏమైనా కానివ్వండి, అనడంమాత్రం సుద్ద పొరబాటే, నేను MLA ని.

న్యా:- కాదని యెవరనగలరు?

ప్ర:- అంటేమాత్రం నేనొప్పుకుంటానా?

న్యా:- (నాగేశంతో) నేను, ప్రజాపతిగారు, ఆరోగ్యంగారు, ముగ్గురం కలసి వొస్తున్నాం. యీలోగా నువ్వు వాడిని బయటకు పోనివ్వకుండా జాగ్రత్తగా చూడు.

(నాగేశం వెళ్ళిపొయ్యాడు. న్యాయపతి ప్రజాపతిని సమీపించి)

న్యా:- మీరు అత్యవసరంగా నాకొక సహాయం చేసిపెట్టాలి. నా సంసారాన్ని నిలబెట్టాలి. నా గౌరవాన్ని కాపాడాలి

ప్ర:- ఏమిటండీ, అప్పుడే నివేదికలు సమర్పించుకుంటున్నారు. యేమిటి అంత కొంపమీదకొచ్చిపడింది ?

న్యా:- కొంపమీద పడటమేమిటి, నా కొంపే కూలిపోయింది. నా ఆస్తి నాశనమైపోయింది. అంతా ఆ దొంగముండాకొడుకు చేతిలో చిక్కిపోయింది. Mr. ఆరోగ్యం! మీరైనా వీరికి అర్థమయ్యేటట్లు చెప్పండి. యీలోగా రెండు గుటకలు మంచి నీళ్లు త్రాగుతాను, గొంతుపిడచగట్టుకొని పోయింది. (కూజా దగ్గరకు పోతాడు.)

ప్ర:- ఈపాటి విషయం నాకు తెలియకపోవటమేమిటి? నేను ప్రజాపతిని ! అందులో M.L.A. ని. ఆఁ! ఇంతకూ విషయమేమిటండీ డాక్టర్?

డా:- న్యాయపతిగారింట్లో దొంగలు పడ్డారు. పాపం, వాళ్ళ అమ్మాయిని బలవంతాన చంపటానికి ప్రయత్నిస్తున్నారు...

ప్ర:- న్యాయపతిగారమ్మాయి శారదనే? ఘోరం! ప్రపంచంలోని మన భారతసూత్రాలకే విరుద్ధం. యిలాంటి ఖూనీకోరులందరికీ, కఠిన శిక్షలు మాన్పించి, వురికంబాలు తప్పించి, ఊరిబయటకు పంపాలని వొక చట్టాన్ని అసెంబ్లీలో ప్రవేశపెడతాను నేను ప్రజాపతిని. అందులో M.L.A. ని ఆ(? తర్వాత చెప్పండి? (న్యాయపతి గుండెను సవరించుకుంటూ మెల్లమెల్లగా గ్లాసులోని నీరు త్రాగుతున్నాడు.)

డా:- న్యాయపతిగారు తన విలువైన రక్తపు బొట్టుకన్నా మిన్నగా కాపాడి పోగుచేసి, రాసిపోసిన డబ్బును కొల్లగొట్టి మూటగట్టి...

ప్ర:- ఏమిటీ-ఏమిటీ! కొల్లగొట్టడమే! యిలాంటి దొంగలను వొళ్ళువంచి కాళ్ళుగట్టి ఖజానాలో పారెయ్యాల్సిందిగా ప్రభుత్వానికి సలహా పంపిస్తాను. అందులో M L A. మాట పాటించకుండా వుంటారా ? త్వరగా తర్వాత యేం జరిగిందో చెప్పండి?

న్యా:- (మెల్లగా సమీపించి) ఏమి చెప్పమంటారు! నన్ను హత్యచేస్తానని... పట్టిగ్గా...

ప్ర:- పట్టిగ్గానా?

న్యా:- అవునండీ, పట్టిగ్గా హత్యచేస్తానని ఆకాశరామన్న వుత్తరాలు వ్రాశాడు. (జేబులోని వుత్తరం తీసి యివ్వబోతాడు )

ప్ర:- వుంచండి వుంచండి. హత్యచేస్తానని ఆకాశరామన్న ఉత్తరాలా! ఈ ఆకాశరామన్న ఏ మండలానికి చెందినవాడో వెతికి గాలించి వివరాలు తెలిపిన భారతీయునికి M.L.A. ప్రజాపతి బంగారు పతకం బహూకరిస్తాడని పత్రికల్లో ప్రకటించి పారేస్తాం. ఆ(! తర్వాత జరిగే ప్రమాదాన్ని చల్లగా సెలవీండి!

డా:- ప్రమాదమంతా మన ముగ్గురం వారి ఇంటికెళ్ళి ఆ దొంగను పట్టుకొని వారి ఆస్తిని కాపాడి, వారి అమ్మాయి ప్రాణం రక్షించి, వారి స్నేహాన్ని చంద్రమండలం వరకూ తీసుకొని పోవటమే.

న్యా:- ఆరోగ్యంగారు సత్యం సెలవిచ్చారు స్వార్థ త్యాగులై ప్రజా క్షేమాన్ని సర్వదా వాంఛించే ప్రజాపాలకులైన ప్రజాపతిగారనూ...

ప్ర:- మీరు నన్ను చిన్నబుచ్చుతున్నారు.

న్యా:- నేనా?

ప్ర:- అవును! ప్రజాపతికి తర్వాత M. L. A. కలిపి పూర్తి పేరుతో పిలవండి.

న్యా:- క్షమించాలి. ప్రజాపాలకులైన ప్రజాపతి M. L. A. గారునూ...

ప్ర:- చూడండి, ప్రజాస్వామ్యం అనిపించుకునే యీ దశలో ప్రజాపాలకులకు విలువ తక్కువ కాబట్టి అవగింజంత హోదా పెరగాలన్నా ప్రజాసేవకులైన ప్రజాపతి M.L.A. గారు అని మీరు నన్ను పిలవాలి. తర్వాత విషయాలు నేను చూచుకుంటాను.

న్యా:- అలాగే పిలుస్తాను. ప్రజాసేవకులైన ప్రజాపతి M.L.A. గారు... ప్రజారోగ్యాన్ని సర్వదా కాంక్షించే ప్రాణదాతలైన ఆరోగ్యంగారు. . ఈ క్షణమే జాగుచేయక మా ఇంటి కరుదెంచి, మా డబ్బు రక్షించి, ఆ గజదొంగను శిక్షించి, మా వందనాలను స్వీకరిస్తారని బహుళ విధముల ప్రార్థిస్తూ అర్థిస్తున్నాను.

ప్ర:- భేష్! వచనాన్ని కవిత్వసరళితో మూడు ముక్కల్లో ముంచి తేల్చారు. బహిరంగ సభల్లో గూడా మా కిలాంటి బిరుదులు రావటం చాలా అరుదు. అసలు రావనే చెప్పాలి. ప్రజలు అమాయకులు. ఆవేశంతో వివేకం కోల్పోయి ప్రజాపతి M. L. A. మీదనే ప్రశ్నలవర్షం కురిపిస్తారు. కాని, మీరు మమ్మల్ని పూర్తిగా అర్థం చేసుకున్నారు. డాక్టర్! వెంటనే అస్మదీయ నేస్తంగారి యిల్లు పరీక్షించి, దొంగను దూషించి వారి ఆస్తిని పోషించాల్సిన బాధ్యత మనది. బయల్దేరండి.

డా:- మీరు నన్ను క్షమించాలి!

ప్ర:- క్షమించేశాం! ఏమిటి! ప్రజాపతి M.L.A. ని మీరు క్షమాపణ కోరుతున్నారా? కారణం తెలుసుకోవచ్చునా?

డా:- తెలుసుకోకూడదు.

న్యా:- అనగా?

డా:- మీరు దయచేసి నన్ను విడిచిపెడితే చాలు

ప్ర:- మీరు మనస్నేహాన్ని అర్థం చేసుకోలేక పోతున్నారు. ముఖ్యంగా ప్రజాపతి M.L A. గారిని...

డా:- అర్థం చేసుకుంటూ వున్నాను

న్యా:- డాక్టర్! యీపాటికి ఆ గజదొంగ ఇనప్పెట్టంతా ఖాళీ చేసుంటాడు.

డా:- ఇల్లుదాటి పదిమైళ్ళు ప్రయాణం గూడా చేసుంటాడు

న్యా:- అయ్యో! వెంకటరమణా, నన్ను యిలా యెందుకు పరీక్షిస్తున్నావయ్యా!

ప్ర:- డాక్టర్! మీలో కలిగిన ఈ వింతమార్పుకు కారణం ?

డా:- మీ మనస్తత్వం!

ప్ర:- మీరు అర్థం చేసుకున్నారా?

డా:- నేను కేవలం డాక్టరునే కాదు; సైంటిష్టుని, సైకాలజిష్టుని! ఇప్పుడు మీరు అర్థంచేసుకున్నారా?

న్యా:- డాక్టర్! మా అమ్మాయి శారద ఆ గజదొంగ కబంధహస్తాల్లో యమచెర పడుతూవుంటుంది. మీరు వెంటనే కరుణించి బయల్దేరండి, పుణ్యముంటుంది.

డా:- మోక్షమంటేనే మమకారం చూపని మానవుడు-పుణ్యాన్ని లంచంగా పుచ్చుకుంటాడా? మరేం పర్వాలేదు. మీ కుమారుడు గోవింద్ వున్నాడుగా! వ్యవహారం అదుపులోకి తెచ్చేవుంటాడు.

ప్ర:- డాక్టర్, మీది రాతిగుండె!

డా:- అవును, వొక్క రోగి విషయంలో మాత్రం!

న్యా:- కాదు, ప్రజలంటే మీకు విశ్వాసం లేదు.

డా:- ప్రజలకు ప్రాణదాతలని పేరే చెప్పారుగా? అంతకుమించి నేనేమీ చెప్పదలుచుకోలేదు.

ప్ర:- మీకు స్నేహితులన్నా గౌరవం లేదా?

డా:- గౌరవమా?

ప్ర:- అవును!

డా:- ఆ మాటను ముందుగా మీరు అర్థం చేసుకోవాలి. స్నేహితులంటె నా హృదయాన్ని కోసి వారి అవసరం తీర్చగల శక్తి నాకుంది. కాని మీకు లేదని నాకు తెలుసు.

ప్ర:- మీకెలా తెలుసు?

డా:- చెప్పానుగా! నేను సైకాలిజిస్టునని. మీరు చేసే స్నేహిత మంతా మీ స్వార్థాలను పోషించి మీ సుఖాలను కూడగట్టుకోడానికే చేస్తున్నారు.

ప్ర:- మామీద మీకు కలిగిన యీ దురభిప్రాయానికి ప్రజాపతి M.L.A. చాలా చింతిస్తున్నాడు. పైగా అభిప్రాయం మార్చుకుంటె మనమధ్య స్నేహం పెరిగి చంద్రమండలం తాకుతుందని గూడా సలహా యిస్తున్నాడు.

డా:- సంతోషం!

న్యా:- డాక్టర్! యీపాటికి ఆ దొంగ మా యింటికి నిప్పు గూడా పెట్టేసుంటాడు.

డా:- నేను మీకు సహాయం చేయలేనని చెప్పటానికి చింతిస్తున్నాను.

ప్ర:- యేడ్చేస్తే మరీ సరదాగా వుంటుంది.

డా:- ఆ అవసరం మీరే కలుగజేసుకుంటే మరీ బాగుంటుంది

ప్ర:- ఓ రాజకీయ నాయకుడితో మాట్లాడుతున్నామనే మర్యాద గూడా మర్చిపోయారు!

డా:- మీరు M. L. A. అని బాగా తెలుసు.

ప్ర:- మీకేమిటి? ప్రపంచమంతా తెలుసు.

డా:- పొరపాటు ఆంధ్రప్రదేశ్ వరకు.

ప్ర:- ఆ మాటకొస్తే ఆరు వందల మైళ్ళవరకు—అంతకు మించయినాసరే మీ ఉద్యోగాన్ని బదిలీ చేయించగలను. ఆ మాత్రం పలుకుబడి ప్రజాపతి M.L.A.కి లేదనుకోకండి!

డా:- సరిహద్దుల వరకూ సంతోషిస్తాను. కానీ మీరు వొక్కటి మాత్రం గుర్తుంచుకోండి. మీదంతా సీజనల్ పలుకుబడి. అయిదు సంవత్సరాలే మీ పలుకుబడికి జీవితం. తర్వాత చచ్చిన శవాన్ని చూచి జాలిగా కన్నీరైనా కారుస్తారు గానీ, మీరంటే...

ప్ర:- మేమంటె? యేంజేస్తారేం.!

డా:- కొంతకాలమైన తర్వాత మీరే అనుభవం మీద తెల్సుకోవాలి.

ప్ర:- (మీసంమీద చేయివేసి మీసం త్రిప్పుతూ) ఇంతవరకు M.L.A. ప్రజాపతి అపజయమంటె యేమిటో అనుభవించి యెఱుగడు.

డా:- తారుమారు చేయటం ప్రజాపతిగారికి పరిపాటయితే విజయాలు పొందటం కూడా......

ప్ర:- యేమిటయ్యా మేము తారుమారు చేసింది?

డా:- ప్రజాస్వామ్యాన్ని! ప్రజల హక్కుల్ని! రాజకీయ యంత్రాంగాన్ని! యింకా విపులంగా చెప్పమన్నారా?

న్యా:- మీరేమీ చెప్పనక్కర్లేదు యీపాటికి వాడు కొంపను సదరంగా పూర్చేసే వుంటాడు...మీ వాదోపవాదాలు నా కొంపకు చేటేగాని మేలులేదు. డాక్టరు గారు...యింతకాలంనుండి మనమెంతో క్లోజ్‌గా వున్నామే! యెన్నో విషయాలు మాట్లాడుకున్నామే, మీతో చంద్రమండలంవరకూ వస్తానన్నానుగదా. నామీదెందుకండీ మీకింత కోపం? మా అమ్మాయి గతేమయిందో యేమో...! అయ్యో, వెంకటరమణా, యీ వృద్ధాప్యంలో యెందుకయ్యా నన్నిలా పరీక్షిస్తావ్! నేనేం పాపం చేశాను!

డా:- క్షమించండి. పవిత్రమైన నా కాలాన్ని ప్రయోజనంలేని మీ చర్చతో వృధాపుచ్చాను. నా పరిశోధనను గురించి చాలా ఆలోచించాలి,

ఒస్తాను (వెళ్ళబోతూ కాస్త ఆగి) అరగంట వరకు మీరు నన్ను పిలవడానికి అవకాశంలేదు—అసలు పిలచినా కూడ నేను పలకను—తర్వాత మీ కార్యక్రమంలో పాల్గొంటాను (గ్లోబ్ తీసుకొని వెళ్ళి పోతాడు)

న్యా:- (ఏమి చెయ్యాలో తోచక దిగులుతో ప్రజాపతి వంక చూస్తాడు) అనుకున్నంత పనీ చేశాడు ... యిప్పుడేం చెయ్యాలి...మనమిద్దరం ఆ దొంగను పట్టగలమా!

ప్ర:- ప్రజాపతి మీ వెంట వస్తున్నాడంటే పది పదుం నూరు మంది పోలీసులు మీకు అండగా, మీ గండానికి కాపలా కాస్తున్నట్లే ననుకోండి.

న్యా:- ఆ మాట మీరు చెప్పాలా...నాకు మాత్రం తెలీదూ? త్వరగా వెళ్ళి పట్టుకుందాం రండి.

ప్ర: M. L. A. ప్రజాపతంటే దిష్టి బొమ్మనుకున్నాడు డాక్టరు) చూపిస్తాను. ప్రజా నాయకులుగా ప్రజలచే యెన్నుకొనబడిన M.L.A. లను మర్యాదగా చూడని వారిని, వినయంగా మాట్లాడని వారిని, చాటుగా దూషించిన వారిని ప్రభుత్వం వారు విధిగా శిక్షించి, పదహారణాలు జరిమాన వసూలుజేసి అందులో యెనిమిదణాలు క్షయ రోగనివారణకు చందా కట్టాలని వొక చట్టం ప్యాన్ చేయిస్తాను, త్వరగారండి దొంగను పట్టుకుందాం ! (అడుగు ముందువేసి. ఇంతకూ దొంగ పేరు ?

న్యా: వాడేనండి, మనకు ఆజన్మ శత్రువు.

ప్ర: న్యాయపతిగారు, మీరు పొరపాటుపడ్డారు.రాజకీయాల్లో జన్మ ప్రధానం గాని, ''ఆ'' పనికిరాదు. తండ్రికి కుమారుడు శత్రువై పోతాడు, భర్తకు భార్య శత్రురాలవుతుంది. మొత్తంమీద మిత్రులకన్నా శత్రువులే మనకెదురౌతారు. అంతమాత్రునికి గుండె జారి, బండబారి మనంవ్యవహరించకూడదు. ఆc! ఇంతకూ మనజన్మకు శత్రువెవరు?

న్యా: ఆ కుక్కమూతి నక్కతోలుగాడు.

ప్ర: మీరు జంతువు పేరు చెబుతున్నారా ?

న్యా: మనిషేనండి ! ఆ గజదొంగ పేరే !

ప్ర: ఓ! భారతదేశంలో దొంగలకు కరువులేదు. యీ దొంగలనంతా సంఘం తయారుజేస్తున్నదనే విమర్శలకు కొదువలేదు. యింతకూ పేరు చెప్పను మరిచారేం ?

న్యా: పేరు చెప్పను నాకు ధైర్యంలేదు —చెప్పిన తర్వాత మీకు బలమూ వుండదు, శుంభశైలిలో చెప్పాలంటె సెక్షన్ 457 & 369 I P C క్రింద మూడు సంవత్సరాలు కఠిన శిక్ష వేయించామే, ఆ ఘనుడే

ప్ర: అంటే మీకు కోపం వొస్తుందేమోగాని ... అనాలని నాకు కోరిగ్గా వుంది. చూడండి. అనేక సెక్షన్ల క్రింద అనేక మంది ప్రతిరోజు జైలుకెళ్లుతున్నారు. అందులో దోషులున్నారు. నిర్దోషులున్నారు. అంతా మీ చలవేనని అందరూ అంటారు కొందరు తిట్టిపోస్తారు మరికొందరు పొగిడి పారేస్తారు...

న్యా: దానికి మనమేం చేస్తాం. అది మా వృత్తిధర్మం!

ప్ర: సరేసరే! యింతకూ పేరు చెప్పండి! దొంగలుపడ్డ ఆరు మాసాలకు కుక్కలరిచాయని...తీరా దొంగపొయ్యాక మనం వెళ్ళి మాత్రం చేసేదేముంది?

న్యా: వాడు నిండు దరిద్రుడండి. యిప్పుడర్థమయిందా?

ప్ర: ఎలా అవుతుంది? దరిద్రంవల్లనే దొంగతనాలు జరుగుతున్నాయని ప్రభుత్వాన్ని తెలివిలేకుండా తిట్టిపోస్తున్నాయ్ రాజకీయ పార్టీలు. M. L. A గా వుండి యీపాటి తెలివి నాకున్నా-ప్లీడరుగావుండి ముసలితనంలో మీకువున్న మతి మందమెక్కి పోతూవుంది. ఇంతకూ దొంగపేరు చెబుతారా చెప్పరా?

న్యా: (కళ్ళు రెండూ గట్టిగ్గమూసుకొని) ప్రజాపతిగారు యెవరైనా వొస్తున్నారేమో అలా చూడండి.

ప్ర: ఎందుకు?

న్యా: మీకు పేరు చెబుతాను.

ప్ర: (గుమ్మం వరకూ వెళ్ళి) ఫోర్డుకంపెనీ మోటార్‌కార్లు యిండియాలో తయారైన సైకిల్ రిక్షాలు తప్ప బయట యెవరూ లేరు—యెవరూ రావటం లేదు. పోవటం లేదు

న్యా: (కళ్ళుమూసుకుని) అయితే చెప్పేస్తున్నాను. వెంకటరమణా కాపాడు తండ్రి! ఆ గజదొంగ పేరు ... వాడేనండి, మా యింట్లో దొంగ పేరు ... కో...టి...రూ...పా...లు ... (ప్రజాపతికి గుండె గతుక్కుమంది.)

ప్ర: న్యాయపతిగారూ!

న్యా: ఏమండీ ప్రజాపతిగారూ! క్షమించండి M. L. A. ప్రజాపతి గారూ?

ప్ర:- ఇప్పుడు యెలా పిలిచినా వొక్కటే లెండి! ఇంతకూ నేను మీ యింటికి రావాలంటారా ?

న్యా:- రావాలనే కదా యింతసేపూ బ్రతిమాలటం ? రండీ !

ప్ర:- ముందు కాసిని మంచినీళ్ళందుకోండి. గుండెలో యెందుకనో పోటుగా వుంది. (న్యాయపతి కూజాలో నీళ్ళు పోసుకుని తెచ్చి యిచ్చాడు. ప్రజాపతి త్రాగి గుండెను సర్దుకుంటూ) నాకు యీ మధ్య ఆరోగ్యం కొంచెం చెడింది. Blood Pressure వుందని డాక్టర్ ఆరోగ్యంగారే చెప్పారు. ఎక్కువ దూరం నడవకూడదని కచ్చితమైన సలహా యిచ్చి తుదా తప్పక పాటించమన్నారు...మరి ...మీ యింటివరకు యెలారాగలనో... చెప్పండి.

న్యా:- కారులో వెళదాం రండి !

ప్ర:- ప్రజాసేవకుడైన ప్రజాపతి కాలినడకతో ప్రయాణం చేస్తాడు గాని..

న్యా:- టాక్సీకి నే నిచ్చుకుంటానండి డబ్బులు !

ప్ర:- అంత అపువరం మీకు కలుగజేస్తానా !

న్యా:- పోనీ జట్కాలో వస్తారా ?

ప్ర:- అది మన ఠాహతుకే కళంకం!

న్యా:- పోనీ నడిచి వెళ్దాం రండి ! యిప్పటికే యిల్లు గుల్లయి పోయి వుంటుంది.

ప్ర:- చెప్పానుగా, నాకు Blood Pressure వుందని. నడిస్తే గుండె బాధ యెక్కువై పోదూ?

న్యా:- పోనీ, నా వీపుమీదెక్కండి, మోసుకొని పోతాను.

ప్ర:- నరవాహనం నాగరిక లక్షణం కాదు.

న్యా:- ప్రాణంతో చెలగాటలాడటం రాజకీయ లక్షణమా ?

ప్ర.- (వినిపించుకోనట్లే) ఏమన్నారు ?

న్యా:- నా నెత్తిన నిప్పులు పోయమంటున్నాను. (కొంచెం కోపం తెచ్చుకొని) అసలు మీరు మొన్న మద్రాసులో కారెందుకు కొన్నారు ?

ప్ర:- మావాడు విశ్వం కోసం ! వాడి సరదా తీర్చటానికి...మా అర్ధాంగి కోరిక నెరవేర్చటానికి !

న్యా:- విశ్వం కోసం కొన్నారా లేక విలాసం కోసం కొన్నారా ? ప్రజాపతిగారూ, మీకు చేసిన మేలు మరచిపోకండి.

ప్ర:- నేను చేసిన మేలు మీరు మర్చిపోతారా ?

న్యా:- మరిచిపోలేదుగాబట్టే మిత్రులని యింతదూరం బ్రతిమాలాను. నా సహాయం మీరు మరిచిపోయారుగాబట్టె నిరాకరిస్తున్నారు. యింత అహంకారం యెవ్వరికి పనికిరాదు.

ప్ర:- మేము చూపిస్తున్న అహంకారం యేమిటండీ ?

న్యా:- ఇంకా యేం చూపించాలి, నాకష్టార్జితమంతా దోపిడై పోతూ వుంటే మీరు దర్జాగా చూస్తూ నిలబడుతున్నారు.

ప్ర:- మీతోపాటు నోరు కొట్టుకోమన్నారా ?

న్యా:- అంతేనండి, యిప్పుడు మీరు ఆ మాటననక మరేమంటారు ? మీ పాలేరు పాపయ్య ప్రాణాలు నిలువునా తీసి, యీ కేసు నేలాగైనా తప్పించి పేరు ప్రతిష్ఠ కాపాడమని కాళ్ళు పట్టుకొని నా గేదుప

లేడ్చిననాడు ‘యీ న్యాయపతి అడ్డుపడి మీ పరువును కాపాడాడు.
ఆ విశ్వాసమైనా లేదు మీకు !

ప్ర:- అందుకోసం మీకు మా కృతజ్ఞతలు తెల్పుకుంటూ ఆరు వేల రూపా
యలు పారితోషికం చదివించాం.

న్యా:- వెధవ పారితోషికం! పరువుపోయ్యాక యెంత చేస్తే యేముంది? కళ్ళు
నెత్తినపెట్టుకొని, వొళ్లు బలిసి మీ కుమారుడు నిండు చూలాలు
మీద కారు పోనిచ్చాడు, ఆమెను చంపాడు.

ప్ర:- ఆ కేసు గెలిచినందుకు వెయ్యి రూపాయలు మీకు ఫీజు చెల్లించాను

న్యా:- గ్రామాల్లో కక్షలు పెంచి, మత్తెక్కిన మీ వర్గం పేదల పాకలకు
నిప్పంటించి, ఆడంగులను అవమానపరచి...గ్రామాన్నంతా భీభత్సం
చేసి విడిచిపెట్టారు. వారి ఆస్తులంతా అగ్నిపాలుచేశారు. మొర్రో
అంటూ వాళ్లు కోర్టు వారికి ఫిర్యాదు చేస్తే మీది అక్రమమని తెలిసి
గూడా మీ కేసు గెలిపించాను... మీ అన్యాయాన్నే బలపర్చాను.

ప్ర:- ఆ సంతోషంలో నా చేతిడబ్బు అయిదు వేలిచ్చాను— పార్టీ దగ్గర
పది వేలు వసూలు చేసి మీకు సమర్పించాను. మీ భార్య తద్దినానికి
మూడు వీశలు వంకాయలు పంపాను... రెండు బండ్ల కట్టెలు
తోలించాను. మీ అమ్మాయికి రెండు సవర్ల నెక్లెసు చేయించి
యిచ్చాను. మీరు నాకుచేసిన మేలుకు, నాకు తోచిన వుపకారమే
చేశాను కాని అపకారం చేయలేదు. ప్రజాపతి M. L. A. అంటే
రాతి గుండె గల కసాయికాదు. యింతటితో మీ వుద్రేకం తగ్గిస్తే
బాగుంటుందేమో !

న్యా:- మీరు నాకు వుపకారం చేశారా ! యీ కోటి రూపాలుగాడిని నా
కొంపమీదకు తెచ్చిందెవరు ?

ప్ర:- మీరే తెచ్చుకున్నారు !

న్యా:- నేనా ? B. A. చదివిన కోటయ్యను కోటిరూపాలుగా పేరు
సృష్టించి... మీ డబ్బుబలంతో సాక్షుల అండ సంపాదించి, కోట
య్యను ఖూనీకోరుగా కోర్టుముందు హాజరు పెట్టిందెవరు ?

ప్ర:- ఆ ఖూనీకోరు కోటయ్యకు కఠిన శిక్ష విధించాలని కోర్టు వారికి సలహా యిచ్చిందెవరు ?

న్యా:- చక్కెర ఫ్యాక్టరీ దివాలా తీసిందని లాభాలు మూట గట్టి, దొంగ లెక్కలతో నష్టమొచ్చిందని నాటకమాడి, ఫ్యాక్టరీని మూసేసారు. యీ దొంగలెక్కలు ప్రభుత్వానికి చేరవేస్తాడని కోటయ్యమీద కత్తి గట్టి కోటిరూపాలుగా పేరుమార్చి, నిలువెత్తు ధనం యిస్తానని ఆశ జూపి, కోటయ్యపై కేసుపెట్టి ఖైదుకు పంపమని కళ్ళనీళ్ళతో కాళ్ళమీదపడి ప్రాధేయపడిందెవరు ?

ప్ర:- న్యాయపతిగారు, అంతటితో ఆగండి. మీ అమ్మాయి శారదా దేవి B A. గారికి Mr. కోటిరూపాలు, I mean కోటయ్యకు యెన్ని సంవత్సరాలుగా ప్రేమ సంబంధాలున్నవో మీకు తెలుసునా?

న్యా:- ప్రేమలేదు, సంబంధంలేదు. అంతా వొట్టి అబద్ధాలు, అభాండాలు.

ప్ర:- (విషపునవ్వు నవ్వి వోరకంటితో న్యాయపతినిచూస్తూ) అబద్ధాలని మీరు బుకాయిస్తారు. గట్టిగా మాట్లాడితే నాకు తెలియదంటారు. అంతేనా? కాని ప్రజాపతి M L.A. గారికి వారిరువురి అన్యోన్య ప్రేమను గురించి బాగా తెలుసు.

న్యా:- ఇదిగూడా పచ్చి అబద్ధమే !

ప్ర:- అబద్ధమని యిప్పుడంటే యేం లాభం ? నాతో యీ విషయం చెప్పక ముందే మీరు జాగ్రత్తపడుంటె యింత రచ్చకెక్కె వారు గాదు. ప్లీడరుగారు ! అమ్మపుట్టిల్లు మేనమామకు తెలీదా ? అబద్ధమని బుకాయిస్తారా ?

న్యా:- మళ్ళీ చెబుతున్నాను. అంతా అబద్ధం. నీవు దొంగవు, మోసగాడివి, ఖూనీకోరువు రాక్షసుడివి, మైరావణుడివి...... (గుండెపట్టుకొని బాధపడుతున్నాడు. ముఖమంతా చెమటలు కమ్మి నెరసిన గడ్డం పైకి జారుతున్నాయ్)

ప్ర:- (న్యాయపతి ఆవేశంచూచి బాగా కడుపుబ్బ నవ్వేశాడు.) అనండి యింకా అనండి శపించండి. కాని, నిజాన్ని మాత్రం దాయ

కండి. మీ అమ్మాయిని ప్రేమించి, మీ వంశం పేరు నాశనం చేస్తున్నాడని కోటయ్య మీద విషం గ్రక్కుతూ వొచ్చారు మీరు. శారదకు పెండ్లి చేయాలని యెంతో ప్రయత్నించారు. అందుగ్గాను వెయ్యి రూపాయలు ఖర్చయిందని చాలా బాధ పడ్డారు మీరు. కాని వివాహం కుదరలేదు. శారద కోటయ్యనితప్ప మరెవ్వరిని పెండ్లాడనంది యెంత చెప్పినా వినిపించుకోలేదు. వొకనాడు రాత్రి శారదను మీరు తన్నబొయ్యారు. కాళ్ళుగట్టి మెళ్ళో పుస్తె వేయిస్తానని శపథం తీశారు. ఆ రాత్రే శారద నూతిలోపడబోయింది. అదిచూచి మీరు గొల్లుమన్నారు. ఆనాటి నుంచి శారదతో పెండ్లి విషయం మాట్లాడటం మానుకున్నారు. కాని పగపట్టిన త్రాచులాగా కోటయ్య మీద ప్రతీకారం తీర్చుకోవాలని శుభ ఘడియ కోసం యెదురు చూశారు. మనమిద్దరం కలిశాం. యేవిధంగానైనా శారద నుంచి కోటయ్యను వేరు చేయ్యాలనుకున్నారు. అందుకు నా ఫిర్యాదును జోడించారు. కోటయ్యకు కఠినశిక్ష వేయించారు. వాళ్ళ సంసారాన్ని చిందర వందర చేసారు. ఆ దిగుల్తో వాళ్ళమ్మ మంచ మెక్కింది. చిన్నతమ్ముడు బడి మానేశాడు. ముసలి తండ్రి పస్తులతో చస్తున్నాడు. కాని కోటయ్య జైల్లోనుంచి తప్పించుకున్నాడు. మీ మీద కక్ష సాధిస్తాడు. మీ డబ్బు కొల్లగొట్టాడు, మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు.

న్యా:- ఇది యెన్నటికి జరుగదు!

ప్ర:- ఈపాటికి జరిగిపొయ్యేవుంటుంది!

న్యా:- ఇదంతా మీవల్లనే జరిగింది! మీ స్నేహం చెయ్యడం మూలాన జరిగింది!

ప్ర:- కాదు, మీ వల్లనే జరిగింది!

(దిగ్గరగా అరుచుకుంటారు ఆవేశంగా. వీరి కొట్లాటను చూచి డాక్టర్ ఆరోగ్యం పరిగెత్తుకుంటూ వొచ్చాడు)

(డాక్టరు వొచ్చిన విషయం గూడా గమనించకుండా వారి వాదోపవాదాలు తీవ్రరూపం దాల్చాయి.)

న్యా:- మీ వల్లనే పచ్చని మా సంసారం పదిమందికి లోకువైపోయింది!

ప్ర:- మీ చలవవల్లనే M. L. A. ప్రజాపతంటే—ప్రజలదృష్టిలో పనికి రాకుండా పొయ్యాడు.

న్యా:- నా మాటను మీరు వొప్పుకుంటారా?

ప్ర:- మరి నా మాట సంగతి?

డా:- (వారి మధ్యచేరి వారిస్తూ) Peace! Peace! ఆంధ్రుల మధ్య ఐకమత్యం కుదరాలి. మీరు వెంటనే రాజీ కుదుర్చుకోవాలి.

ప్ర:- కుదరాల్సిందే మరోజన్మకు! యిలాంటి చచ్చు ప్లీడర్లు, పిసినిగొట్టు పీనుగలు చస్తేనేగాని ముందుతరం ఆంధ్రుల్లో ఐకమత్యం కుదరదు!

న్యా:- ప్రజాపతులమంటూ, M.L.A.ల మంటూ ప్రజల నెత్తిన చేతులు బెట్టి పరిపాలన సాగించాలనే దుర్మార్గులు, దౌర్భాగ్యులు మట్టి పాలయ్యేవరకు ముందువారికి ముక్తి రాదు.

ప్ర:- ఎవరయ్యా దుర్మార్గులు?

న్యా:- ఎవరయ్యా పిసినిగొట్టు, చచ్చుప్లీడర్లు?

ప్ర:- దుర్మార్గులు మేమంటారా?

న్యా:- పిసినిగొట్టు మేమంటారా?

ప్ర:- అవును నువ్వే!

న్యా:- అవును నువ్వే!

డా:- (వారు అరుస్తున్న అరుపులకన్నా బిగ్గరగా అరుస్తూ) ఇద్దరూ ఇద్దరే, దిష్టిబొమ్మలు. అనవసరంగా మీ కుళ్లునంతా బజారు కెక్కించి అల్లరి పాలుకాకండి. వినేవారు, చూచేవారు ముఖాన వుమ్మేసిపోతారు.

ప్ర:- మరి అతని మాటలు మీరు విన్నారుగా?

డా:- బాగా విన్నాను!

న్యా:- మరి అతని దౌర్జన్యం మీరు చూచారుగా?

డా:- సమస్తం నా రెండు కళ్ళతోనే చూధాను!

ప్ర:- మీరే చెప్పండి యెవరు చచ్చుప్లీడర్లో !

డా:- ఆంధ్రుల మేలుకోరి మీరు యింతటితో యీ రగడ మానేస్తే చాలా సంతోషిస్తాను.

ప్ర:- ప్రజాపతి MLA దుర్మార్గుడంటే యేలాగండి వూర్కోటం ?

న్యా:- మరి న్యాయపతిని చచ్చు ప్లీడరంటె వింటూ కళ్లు మూసుకో మంటారా ?

డా:- చెప్పానుగా, యిద్దరూ దిష్టి బొమ్మలేనని. వాగుడు కట్టిపెట్టి పెద్ద మనుషుల్లా బ్రతకడానికి ప్రయత్నించండి !

ప్ర:- ఏమిటండి మీరనేది ? అప్పటికి మేము పెద్దమనుషులంకాదనా మీ అభిప్రాయం !

న్యా:- అరవై సంవత్సరాలు నిండినా వొకపన్నయినా రాలి నేలమీద పడ లేదు. వొక్కరిదగ్గర వొక్కమాటగూడా అనిపించుకోలేదు. నేను పెద్దమనిషిని కాదంటారా ?

డా:- గౌరవనీయులైన M L A గారికి, ప్లీడరు గారైన న్యాయపతిగారికి, డాక్టర్ ఆరోగ్యం యిస్తున్న సున్నితమైన సలహా యేమిటంటే... వొకటి — కుళ్ళుకంపు కొట్టే మీ కాకిగోలను కట్టిపెట్టి పెద్ద మనుషుల్లా, నీతిగల తెలుగు వీరుల్లా బ్రతకమని. రెండు – ఇది ప్రజాయుగం. ప్రజాపాలన జరుగుతున్నదని పాప పుణ్యాలు పనికి రావని ప్రజాపతి M L A గారికి బాగా తెలుసు అలాగే ధర్మ చక్రం వెలుగునీడలో ధర్మప్రభుత్వం న్యాయాన్ని కలుగ జేస్తున్న దని ప్లీడరు న్యాయపతి గారికి తెలుసు. కానీ, మరిగిపోయిన పాత స్వాములాచారాలనే మీరనుసరిస్తూ, ప్రజలను, ప్రభుత్వాన్ని, న్యాయాన్ని ధిక్కరించాలని మీరు కుట్రపన్నారు. నాటకమాడారు.

ప్ర:- కుట్రా ?

న్యా:- నాటకమా ?

డా:- అవును. గౌరవనీయులైన వొక తెలుగు బిడ్డను, అందులో బి ఏ వరకు చదివిన విద్యావంతుడ్ని, దరిద్రుడని, గజ దొంగని, ఖూనీ

కోరని, కోటిరూపాలని పేర్లు సృష్టించి మీ డబ్బుబలంతో. వృత్తి బలంతో, అన్యాయంగా ఖైదుపాలు చేశారు. మూడు — ఆధునిక ప్రపంచంలో ప్రేమకు అగ్రస్థానముందని మీకు తెలిసికూడా, కులము మతము, సాంప్రదాయమనే పిచ్చికలలు కని, అమాయికురాలైన శారదను, అమాయకుడైన కోటయ్యను వేరుచేసి వారి అనురాగ హృదయాలను భగ్నం చేశారు. కోటయ్య సంసారాన్ని కూల్చేశారు. వాళ్ళనాన్నను పస్తుల్తో చంపుతున్నారు. ఒక ప్రళయ భయంకర మైన ప్రజాద్రోహానికి, బీభత్సానికి కారకులైనారు.

ప్ర:- మీరు చెప్పినదంతా సత్యమని అభిప్రాయపడుతున్నారా ?

న్యా:- ఇదంతా మీకెలా తెలిసింది ?

డా:- దొంగతనం, రంకుతనం దాగదని మీకు తెలిసిందేగా ? పతనమైన మీ పరువు ప్రతిష్టల్ని తిరిగి ప్రజలముందు నిలుపుకోవాలంటె వొక్కటే మార్గముంది !

ప్ర:- అడుగదల్చుకుంటె మీరు చెప్పడానికి నిరాకరించరు గదా ?

న్యా:- మనిషికి మార్గం చూపడం మహాత్ముల లక్షణం ! సెలవిస్తే తప్పక స్వీకరిస్తాం !

డా:- (చరచరా టేబిల్ దగ్గరకెళ్ళి రెండు తెల్లకాయితాలు తెచ్చి) మీరు ఖైలుపాలు కాకుండా మర్యాదస్తులుగా, మంచిగా బ్రతకాలనుంటే, కోటయ్య... కాదు... మీరు పెట్టిన పేరు ప్రకారం, కోర్టు వారికి తెలిసిన పేరు ప్రకారం కోటిరూపాలు నిర్దోషని, మేమే అతనికి అన్యాయం చేశామని యీ కాగితంలో వ్రాసియివ్వండి.

ప్ర:- మీరు చెప్పేది నాకేమీ అర్థం కావటంలేదు. మేమెందుకు రాసివ్వాలి?

న్యా:- ఆయన మూలంగానే కోటిరూపాలు ఖైదు పాలయ్యాడు...... యిందులో నేను చేసిందేముంది?

ప్ర:- నావల్ల యేమీ తప్పులేదు. తప్పంతా మీదే. మీరే వ్రాసివ్వండి.

న్యా:- నేనెందుకు వ్రాస్తాను? ఆ తప్పులో మీకూ భాగముంది. మీరే వ్రాసివ్వండి.

ప్ర:- మీరే వ్రాసివ్వండి.

న్యా:- మీరే వ్రాసివ్వండి? (వీరి వాదం మరలా తీవ్రమైంది)

డా:- (గట్టిగా) మీరు వ్రాసిస్తారా లేక నన్నే పోలీసులకు రిపోర్టు యివ్వమన్నారా? (ఫోను దగ్గరకు పోపోడు

న్యా:- చూడండి ఆరోగ్యంగారు! మా యింటివరకు వెళ్ళి పరిస్థితు లెలాగున్నాయో వొక్కసారి చూసి చిటికలో తిరి గొస్తాను

డా:- ఆ విషయంలో మీ కెలాంటి భయమక్కరలేదు!

న్యా:- బోలెడా స్తి వుందండీ! రొఖ్ఖం యాభై వేలు, బంగారు ముప్పై వేలు, యిల్లు యిరవై వేలు, కుల్లు లక్ష... ఇంత ఆస్తి...

డా:- దమ్మిడీతో సహా మీకు అప్పగించేట్టు నేను చేస్తాను. నమ్మకం లేదా? లేకుంటే నా ఆస్తినంతా మీ పేర వ్రాచ్చేస్తాను. నా మాట నమ్మండి. ముందు స్టేట్‌మెంటు వ్రాయండి. కోటిరూపాలు యెక్కుతున్నా పట్టి, బంధించి, ప్రాణంతో యిక్కడకు లాక్కురమ్మని యిప్పుడే ఫోను చేస్తాను ఊ! వ్రాయండి! (ఫోను దగ్గరకు వెళ్ళి ఫోను చేత్తో తీసుకుని) Heleow! Yes: Dr. Arogyam Speaking! Yes! Jupiter r Club! ఆఁ! చూడండి! కోటిరూపాలనే గజదొంగ; మన ప్లీడరు న్యాయపతిగారింట్లో ఆ! ఆ! న్యాయపతిగారింట్లోనండి!

న్యా:- No. 25, National Road.

డా:- ఆఁ! No. 25, National Road; అవునండి! పట్టపగలు జొరబడి...ఆస్తినంతా-ఆఁ! వారు సంపాదించిన డబ్బునంతా దొంగిలించుకొనిపోతున్నాడు...మీరు వెంటనే అతన్ని అరెస్టు చేసి...

న్యా:- చూడండి...మా అమ్మాయి శారదను గూడా చంపబోతున్నాడని చెప్పండి.

డా:- ఆ మాటెందుకు చెప్పటం?

న్యా:- నిజం చెప్పకుంటె యెలాగ?



డా:- ప్రేమించినవాడు...ప్రేయసిని చంపుకుంటాడా? మీదంతా పిచ్చి.

న్యా:- ఏం ప్రేమో, వల్లకాటిప్రేమ, నా కొంప ముంచింది.

డా:- ఆఁ! ఆ! వెంటనే అరెస్టు చేసి యిక్కడకు తీసికొస్తే యింకా కొన్ని విషరాలు మీకు తెలుస్తాయి! ఇప్పుడే వెళ్తున్నారా? ఆ! Jupiter's Club! Thank You (ఫోను క్రింద పెట్టేశాడు).

న్యా:- ఆ దగుల్బాజీగాడు యిక్కడికెందుకండి!

డా:- వొచ్చినా మీకేమి భయంలేదు!

న్యా:- అవునులెండి మీరుండగా నాకెందుకు భయం!

డా:- ఇంకా మీరు నిల్చుకొని వున్నారేం, యిలా కుర్చీలో కూర్చొని అనుకున్న మూడక్షరాలు విపులంగా వ్రాసివ్వండి. (ప్రజాపతి, న్యాయపతి తప్పదన్నట్లు వొకరినొకరు చూచుకొని గ్రుడ్లురున మొఖాలు చాటుగా త్రిప్పుకున్నారు.) కానివ్వండి! పోలీస్ వొచ్చేలోగా మీవ్రాత పూర్తి కావాలి. (ఇరువురూ కుర్చీల్లో కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తూ మధ్య మధ్యలో వొకరి నొకరు చూచుకుంటూ వొకరిపై మరొకరు అక్కసు వెళ్ళబుచ్చుకుంటున్నారు. డాక్టరు చంద్రమండలం, తారా మండలం గీచియున్న బొమ్మ (MAP) దగ్గరకుపోయి యేదో లెక్కలు కూడుకుంటూ వొక కాగితంమీద వ్రాసుకుంటున్నాడు. అప్పుడప్పుడూ గ్లోబు దగ్గరకొచ్చి త్రిప్పి ఏదో వ్రాసుకొని MAP దగ్గరకెళ్ళి పరిశీలనగా చూస్తున్నాడు. నాగేశం తొందరగా వొచ్చి న్యాయపతితో)

నాగే:- సార్! సార్! (న్యాయపతి దీర్ఘాలోచనలో వుండడంమూలంగా పలుకలేదు. డాక్టరు అతనిని పిలువవద్దని సైగచేసి నాగేశం చెవిలో యేదో చెప్పి పంపుతాడు. యీలోగా న్యాయపతి, ప్రజాపతి వ్రాత పూర్తి చేసి డాక్టరువంక చూస్తారు )

డా:- పూర్తి చేశారా? Very Good! మీరు చాలా వుత్తములు. యేదీ యిలాగివ్వండి! (యిద్దరి దగ్గరనుంచి కాగితాలు తీసుకొని బాగా చదివి) యెలాగైతేనేం, యెవరిపల్లనైతేనేం కోటిరూపాలు నిర్దోషయ్యాడు.

న్యా:- ఇంతకూ ఆయన గారు యేసువి వ్రాశారో వినిపించితే బాగుంటుంది.

ప్ర:- నాదెందుకు. ప్లీడరు యేమి వ్రాశారో చదవండి.

న్యా:- మీదే ముందు చదవాలి, మీరేయిందులో మొదటి ముద్దాయిలు.

ప్ర:- కాదు, మీరే యిందులో మొదటివారు. మీదే చదవాలి.

న్యా:- వీల్లేదు మీదేచదవాలి

ప్ర:- వీల్లేదు మీదేచదవాలి.
(కుర్చీల్లోనుంచి అరుచుకుంటూ పైకి లేచారు)

డా:- మళ్ళీ మీలో ఐకమత్యం చెడిపోతూవుంది. వుద్రేకాలతో యిప్పుడు మనకు నిమిత్తంలేదు. మనకు కావల్సినదంతా వ్యవహారం పరిష్కారం కావటమే. యీ ఘట్టం పూర్తయ్యేలోగానే మీకొక సలహా నివ్వ దల్చుకున్నాను. చూడండి మీరు మీ స్వార్థం కోసం, చేసిన పాపాల మూలంగా భయంతో, ఆందోళనతో ఈ జీవితంలోని ప్రతిక్షణం చావుబ్రతుకులమధ్య రోజులు నెట్టుకుంటూ వొచ్చారు. ప్రతి మాన వుడూ తన జీవితంలో మీలాగే చేయరాని పొరపాట్లు చేస్తూ పరిహా రంగా నాశనాన్ని కోరి తెచ్చుకుంటూ వుంటాడు. ఇలాంటి మానసిక దౌర్బల్యాలకు అతీతుడు కాగలవాడే మహాత్ముడు, మార్గదర్శకుడు అనిపించుకుంటాడు. కాబట్టి నా ఆంధ్ర సోదరులకంతా నేను చెప్ప దల్చింది వొక్కటే ప్రజాపతి,న్యాయపతిగార్లలాగా సాంఘిక దురా చారాలకు తావివ్వక, పలుకుబడి నుపయోగించి పాప కృత్యాలు చేయక; న్యాయాన్ని తల్లక్రిందులు చేసి నాగరికతకే కళంకం తెచ్చి పెట్టక, అఖండ భారత దేశానికి తెలుగుజాతి వెలుగును చూపించా లని కోరుతున్నాను! నా సలహా మీకు నచ్చిందికదూ?

ప్ర:- (తలూపాడు.)

డా:- (న్యాయపతితో) మీకు కూడా నచ్చిందా?
(నాగేశం తొందరగా వొచ్చి)

నాగే:- సార్! సార్! కొంప మునిగిపోయింది సార్!

న్యా:- ఏం జరిగిందిరా?

నాగే:- అమ్మాయిగారి మెడలో...

న్యా:- అమ్మాయిగారి మెడలో...ఉరి తగిలించాడా...డాక్టర్ గారూ...! వెంకటరమణా!

నా:- అదికాదు సార్! (ఒగురుస్తున్నాడు.)

డా:- త్వరగా చెప్పవోయ్!

నా:- చెబుతాను సార్, చాలా ఆయాసంగా వుంది.

న్యా:- కాఫీక బేడిస్తాను, త్వరగా చెప్పరా!

నా:- అమ్మాయిగారి మెడలో...దేవుని పటానికెదురుగానిలబడి-

న్యా:- (ఇంకా ఆతురతతో) నిలబడి! ఏం చేశాడు ?

నా:- తాళిబొట్టు కట్టేశాడు సార్ !

న్యా:- (అలాగే కుర్చీలో కూలబడుతూ) అరి వీడిచావు చదరంగాను! వెంకటరమణా, ఎంతపని చేశావయ్యా ! ఆసి పాపిష్టిదానా ! నిప్పుతో నాలుక కాల్చుకున్నా ఉగగని పాపం చేశావు కదా ; వంశం పేరు పాడుచేశావుకదే !

నా: అమ్మాయిగారిని యింట్లో పెట్టి కోటిరూపాలు సరాసరి మీ దగ్గరకే వొస్తున్నాడు.

న్యా:- (కోపంతో) వొస్తున్నాడు ; రానీ ; యీ దెబ్బతో ఆజన్మాంతం జైల్లో కుళ్ళి చచ్చేటట్లు చేస్తాను.

(S. I. ప్రవేశం. రాగానే అందరినీ వొక్కసారి చూచాడు. హాలంతా టాపీగా కలయజూచాడు.

S. I:- మీలో Dr. ఆరోగ్యం యెవరు ?

డా:- నేనేనండి ; వీరిపేరు న్యాయపతి. పేరుపొందిన పెద్ద ప్లీడరు.

S. I-: Oh ! అలాగా ; నేను యీరోజే మీవూరు బదిలీ అయ్యాను. రాగానే మీదే మొదటి పరిచయం. (న్యాయపతి S. I. కరస్పర్శ చేసుకుంటారు.)

డా:- వీరు ప్రజాపతి M. L. A. గారు ; రాజకీయాల్లో రాటు తేరిన గొప్ప ఘనులు.

S. I:- చాలా మంచిది ఈ రోజు చాలా శుభదినం. గొప్పవారితోనే పరిచయం కలిగింది. (నమస్కరించుకుంటారు).

డా:- (S. I.కి కుర్చీ చూపిస్తూ) Take your seat Sir!

S. I:- Thank you Doctor !

డా:- మీరు సరాసరి నేరుగా యిక్కడికే వొచ్చారా ?

S. I:- లేదు. న్యాయపతిగారింటి కెళ్ళి మీరు చెప్పిన Information ను గురించిన దర్యాప్తుచేసి వొస్తున్నాను.

న్యా:- దొంగను పట్టుకున్నారా ?

S. I:- ఆ యింట్లో దొంగలెవరూ లేరు. అసలు దొంగ యిక్కడికి పారిపోయి వచ్చారని అక్కడివారు చెప్పారు !

న్యా:- ఆ! దొంగ పారిపోయి వొచ్చాడా ! అయ్యో, వాడి నెందుకు విడిచి పెట్టారు సార్? (గడియారంచూచి) సరిగ్గా ఆరుగంటలు. S.I. గారూ! ఈరోజు ఆరు గంటలకు నన్ను పబ్లిగ్గా హత్య చేస్తానని వొక ఆకాశ రామన్న వుత్తరం గూడా వ్రాశాడండి. యిదిగో (చూపిస్తాడు. S I. చదువుకొని జేబులో పెట్టుకుంటాడు).

S. I:- ఇందులో పూర్తి పేరు లేదే !

న్యా:- వాడిపేరు కోటయ్య సార్ ! (తప్పు చెప్పేశామని నాలుక కొరుక్కొని) కాదు సార్ ; వాడి పేరు కోటి రూపాలు ! (ఈ సారి ప్రజాపతిలో కొంత కంగారు కనిపించింది)

S. I:- మీరు కోటయ్యఅని మొదట్లో చెప్పారు... మరి...

న్యా:- పొరబాటు సార్ ! అది... అది... ప్రజాపతిగారబ్బాయి పేరు !

S. I:- ప్రజాపతిగారికి కోటయ్య అనే కుమారుడున్నాడా ?

ప్ర:- అబ్బే లేదండి. వాడెవడో దొంగ !

S. I:- దొంగని మీకు తెలుసా ?

ప్ర:- దొంగేమోనని నా ఐడియా సార్ !

S. I:- యిప్పుడు మాకు కావల్సింది, నిఖరమైన మీ వాఙ్మూలం. ఇంతకూ యీ కోటయ్య, కోటిరూపాలు యెవరు ? వారికి మీకు యేమిటి సంబంధం ?

ప్ర:- సంబంధం యేమీ లేదు సార్ !

S. I:- డాక్టరుగారూ! మీరు చెప్పిన కోటిరూపాలనే వ్యక్తి న్యాయపతి గారింట్లో యెవరూ లేరు. కాని వారు చెప్పిన దొంగపేరు, మీరు చెప్పే దొంగ పేరు బట్టి చూస్తే మీరు కొంచం Strong గా వివరాలు చెప్పాలి. మీరు న్యాయపతిగారింట్లో దొంగలు పడ్డారని ఎందుకు ఫోన్ చేశారు?

న్యా - పడ్డమాటా నిజమే. యాభై వేల రూపాయల రొక్కం, ముప్పై వేల రూపాయల బంగారు దొంగిలించిన మాటా నిజమే సార్!

S. I:- మీ కెలా తెలుసు ?

న్యా:- మా ప్యూను నాగేశాన్నడగండి. చెప్పరా చెప్పు ! నువ్వు చూచిందంతా చెప్పు.

నా:- (వినయంగా S. I. దగ్గర చేతులుకట్టుకొని) నేనేమీ చూడలేదు సార్! అంతా విన్నాను! నేను వారికి చెప్పిందంతా నా ఐడియా సార్!

S. I:- ఏమిటోయ్, వేళాకోళమాడుతున్నావా ?

నా:- లేదుసార్, సత్యం చెబుతున్నాను !

S. I:- సరే, అలా వెళ్ళి నిలుచుకో ! (నాగేశం వెళ్ళి నిల్చుకున్నాడు) డాక్టర్‌గారూ! న్యాయపతి గారింటివద్ద మాకు దొరికిన ఆధారాలను బట్టి దొంగలెవరో యిప్పుడే తేల్చేస్తాను. మీరు నాతో సహకరించాలి.

డా:- తప్పకుండా సహకరిస్తాను. కానివ్వండి.
(ప్రజాపతి, న్యాయపతి దొంగలు తామే కాబోలుననే భయంతో బొమ్మల్లాగా చలనం లేకుండా నిలబడిపోయ్యారు).

S. I:- న్యాయపతి గారూ ! (న్యాయపతి పలకడు), ప్రజాపతి గారూ ! (పలకడు). మిమ్మల్నే పిలవటం ! అలా దిష్టిబొమ్మల్లా నిల్చొనున్నారేం ?

న్యా:- (తత్తరపడి) నన్ను పిలుస్తున్నారా ? యెందుకు సార్ ?

S. I:- మీ అమ్మాయి పేరు శారద గదూ !

న్యా:- అవును.

S. I:- మీరు దొంగని చెప్పిన కోటి రూపాయలకు మీ అమ్మాయి శారదకు యేమైనా సంబంధముందా ?

న్యా:- అబ్బె, యేమీ లేదు సార్ !

S I:- పోనీ కోటయ్యతో యేమైనా సంబంధముందా ?

న్యా:- ఏమీలేదు ?

S. I:- డాక్టర్, యీ విషయంలో మీ కెంతవరకు తెలుసు ?

డా:- వాళ్ళిద్దరూ ప్రేమించి పెళ్లిచేసుకున్నారని యిప్పుడే తెలిసింది.

S. I:- You are correct. (ప్రజాపతిని సమీపించి) ప్రజాపతిగారూ ?

ప్ర:- (బెదిరిపడి) ఆఁ ! నేను M. L. A. నండి !

S. I:- Oh ! I See M. L A. ప్రజాపతిగారూ ! మీకూ న్యాయపతి గారికి యెంతకాలం నుంచి పరిచయముంది ?

ప్ర:- పరిచయమేమీ లేదుసార్ ! ఆయన ప్లీడరు, నేను M L A ని.

డా:- ఇది మాత్రం చాలా అబద్ధం సార్ ! (ప్రజాపతి డాక్టర్‌ను చూస్తాడు. డాక్టరు వారు వ్రాసియిచ్చిన కాగితాలను చూపుతాడు. అది చూచి M. L. A. గారికి గాబరాపుట్టి)

ప్ర:- అంతా వో మూడు సంవత్సరాల నుంచి !

న్యా:- అబద్ధం సార్, పరిచయమే లేదు ! (డాక్టరు మరలా న్యాయపతికి కాగితం చూపుతాడు, న్యాయపతి కొంచెం సర్దుకొని) అంతే సార్ ! అంతే ! మూడు సంవత్సరాలే !

S. I:- ప్లీడరుగా మీరు న్యాయవృత్తి చేస్తున్నారు, M. L. A. గా మీరు ప్రజాసేవ చేస్తున్నారు, యెందుకండీ అలా అబద్ధాలనే జపిస్తూ వుంటారు ?

డా:- అది వారికలవాటే లెండి !

S. I:- You are correct ! న్యాయపతిగారూ, మీ మీద, ప్రజాపతి M. L. A. గారి మీద మాకు C I.D. రిపోర్టులు బోలెడొచ్చాయి.

ప్ర, న్యా:- (యిద్దరూ వొక్కసారిగా) మా మీదనా ?

S. I:- అవును మీ మీదనే ! కోటిరూపాలు నిర్దోషి ! మీరు కాదంటారా ?

న్యా:- తప్పకుండా అంటాం. వాడు గజదొంగ?

ప్ర:- వాడు ఖూనీకోరని కోర్టువారే వొప్పుకున్నారు!

న్యా:- నేనేనండి ఆ కేసును Take up చేసింది. మూడు సంవత్సరాలు కఠినశిక్ష వేశారు. కోర్టు వారిచ్చిన తీర్పునుగూడా మీరు కాదంటున్నారా సార్ ?

S. I. కోర్టువారు CID రిపోర్టు బాగా చదివారు, నిజం తెలుసుకున్నారు. అసలు దొంగలెవరో తేలిపొయ్యారు. వెంటనే కోటయ్యను విడుదల చేశారు. మీ యిద్దర్ని ఆరెస్టు చేయమని వారంట్లు జారీ చేశారు. ముందు మీరు కదలండి!

న్యా:- అలా వీల్లేదు. అలా చేయటానికి "లా'' వొప్పుకోదు. ముద్దాయికి శిక్షపడితే గడువు ముగిసేవరకూ వాడు శిక్ష అనుభవించాల్సిందే!

ప్ర:- అందులో బోలెడు సాక్ష్యం యిప్పించి, వాడు గజ దొంగని గట్టిగా నిరూపించి, ఆ దొంగను జైలుకు పంపించాం.

S. I. దొంగలను అమాయకులుగా, అమాయకులను దొంగలుగా మీ యిష్ట ప్రకారం చేయటానికి యిదేం గుడ్డికాలం కాదు. అసలు దొంగలెవరో గాలించి పట్టుకోవటమే ప్రజాప్రభుత్వ లక్ష్యం. యింతకూ కోటి రూపాలు నిర్దోషని మీరు వొప్పుకుంటారా లేదా?

యిద్దరూ:- మేము వొప్పుకోమండి! (డాక్టరు వారు వ్రాసిచ్చిన కాగితాలను S.I. చేతికిస్తాడు).

S. I. (బాగా చదువుకొని) యీ స్టేటుమెంటు మీరు వ్రాసిందేనా? (అది చూచి యిద్దరూ విస్తుపోతారు) చెప్పండి! మాట్లాడరేం? యీ కాగితం మీది అవునా కాదా?

న్యా:- అవును.

S. I. ప్రజాపతిగారూ, మీరేమంటారు?

ప్ర:- నాదేనండి. నేనే వ్రాసిచ్చాను.

S. I. సరే నడవండి స్టేషనుకు.

న్యా:- ఎందుకు సార్?

S. I. జైల్లో కోటయ్యకు బదులు మీరు నిద్రపోవటానికి!

ప్ర:- జైల్లోనా?

S. I. ఏం! అవమానంగా వుందా?

న్యా:- S. I. గారు, నేను చేసిన పాపాలకు నాలుక కోసుకోమన్నా కోసుకుంటాను. ఇంకెప్పటికి యిలాంటి నేరాలు చెయ్యను. నన్ను క్షమించండి. డాక్టరుగారూ, మీరన్నా కొంచెం రెకమెండ్ చెయ్యండి. కావాలంటే ప్రజాపతిగారొస్తారు మీవెంట.

ప్ర:- ఏమిటి నేనా! S. I. గారూ, నాదేమీ లేదండీ. నేనీ మధ్యననే M. L. A. అయ్యాను కాస్త నా గౌరవమాలోచించండి. కావాలంటే వారే వస్తారు మీవెంట.

న్యా:- నేనెందుకు పోవాలి? మీరేగా యింతాచేసింది. మీరే పొండి!

ప్ర:- మీరు చేసిన పాపాలు నా నెత్తికి రుద్దుతున్నారా? మీరేగా కోర్టులో యింత నోటితో వాదించింది? మీరే పొండి.

న్యా:- నేను పోను, మీరేపోండి!

ప్ర:- మీరేపోండి, నేనెందుకు?

న్యా:- మీరేపోండి.

ప్ర:- మీరేపోండి. (మరలా వ్యవహారం ముదురుతుంది. S I. బిగ్గరగా వారిగోల అణిగేటట్టు)

S. I. Shame! Shame! సిగ్గుచేటు; నోరుమూసుకోండి మీరు వెంటనే కదుల్తారా లేదా?

న్యా:- (తాపీగా) ఎక్కడికి సార్?

S. I. జైలుకి?

న్యా:- యేమిటిసార్! మేమేదో నాటకమాడుతుంటే మధ్యలో మీరొచ్చి పెద్ద గొడవ చేస్తున్నారు?

S. I. ఏమిటి? నాటకమా?

ప్ర:- అవునండి... నేను అసలు M. L. A. ని కాదు నాటకంలో M. L. A. ని.

న్యా:- నాలాంటి ప్లీడర్లు చాలామంది దేశంలో చెలామణి అవుతూ, న్యాయాన్ని యెలా తారుమారుచేస్తుంటారో ప్రజలు తెలుసుకోవాలని, ఆ వేషం వేశాను. అంతే. నేను న్యాయపతిని గాదు, ప్లీడర్ని కాదు, వొక నటుణ్ణి.

ప్ర:- అంతేసార్! M.L A. ల మని చెప్పుకుంటూ ప్రజాసేవను మరచి, రాజకీయ నాయకులమని తిరిగేవారిని గురించి వొక్క కంట కని పెడ్తూ వుండాల్సిందని ప్రజలను హెచ్చరిస్తూ నేను M. L. A. వేషంకట్టాను. అంతే, నిజానికి నేనూ వొక నటుణ్ణే.

డా:- చూడండి సార్! మా సంఘం వాళ్ళు వొక నాటకం వేయాలను కున్నారు! ప్రజలకు నీతి, నాగరికతా, విజ్ఞానము కలిగించే వొక అభ్యుదయ కళను ప్రదర్శించాలని యీ "దిష్టిబొమ్మలు" అనే నాటికను వేశాం. అందులో నేను డాక్టర్‌ను, అంటే సైంటిస్టును, సైకాలజిస్టును. అంతే, యిందులో నేనూ వొక నటుణ్ణే.

న్యా:- నేనుగూడా వొక నటుణ్ణే సార్!

S. I. అయితే నేనేనా అంత ఫూల్ని? న్యాయపతిగా రమ్మాయిని వివాహ మాడి, మిమ్మల్ని భయసందేహాల మధ్య వుయ్యాల లూపిన ఘనుణ్ణి, కోటిరూపాయిగాడ్ని, మిమ్మల్ని భయపెట్టడానికి S. I. వేషంలో వచ్చిన ఘనుణ్ణి!

అందరూ:- నువ్వేనా కోటిరూపాలు ?

S. I. అవును.

డా:- (ప్రేక్షకుల నుద్దేశించి) సోదర సోదరీమణులారా! ఇంతసేపూ సహనంతో కూచొని మా నాటకాన్ని చూచినందుకు మా సంఘం తరపున ధన్యవాదాలు. మీ అందరి సహకారముంటే ఇటువంటి కళనే ప్రదర్శిస్తూ మీ అభిమానాన్ని పొందగలం నాటకం పూర్తి యింది. శలవు. జై హింద్

[ తెర ]



## పాత్రలు

1. మొదటి సైనికుడు
2. రెండవ సైనికుడు
3. ముసలివాడు
4. ముదుసలి
5. వ్యక్తి

[ద్వితీయ ప్రపంచ సంగ్రామపు అంతిమ దినాలు. సంగ్రామం జరుగుతున్నది. యుద్ధం జరుగుతూవున్న ఒక దేశపు ఒక కుగ్రామం పొలిమేరలో. చీకటిరోజుల్లో ఒక రాత్రివేళ, ఇద్దరు సైనికులు దోవ వెతుక్కుంటూ ప్రవేశిస్తారు. ఆ చీకట్లో ముందు ఏముందో, వెనక ఏముందో తెలియటం లేదు. కాసేపటికి-]

మొదటి సైనికుడు :- (పెద్దగా నవ్వుతూ) హై హూ ? Soldier చూశావా ? కన బడేదే మన వూరు. యుద్ధ మేఘాలు ప్రపంచాన్నంతా కమ్మేసి నటే, Black out మన వూరిని కమ్మేసింది. కమ్మివేసిన గాఢాంధకారాన్ని చీల్చుకొని బయటపడి కనిపిస్తోంది దూరాన-వీధి దీపాల కాంతి... అమ్మయ్య... ఎడతెగకుండా నడిచి, ఎల్లాగయితే ఏం మన వూరు చేరుకున్నాం.

రెండవ సైనికుడు :- చేరుకున్నాం ఎట్లాగయితేం, ఓ! తిరిగి మనవూరు చూస్తుంటే నా హృదయం పొంగిపోతోంది—ఏవో పూర్వ స్మృతులన్నీ జ్ఞాపకంవచ్చి. పరిచితమైన స్పర్శవల్ల కాలోలు, పాదాలు వుబ్బి తబ్బిబ్బులవుతున్నాయి చిన్ననాడు మనం ఆడుకున్నదే కాలోలు యీ నేల !

మొదటి:- ఆ. ఈ నేలా ? ఆ కొండ, ప్రతి అంగుళం, మనం తొక్కి గంతు లేసిందే.

రెండవ:- విసురుగా ఆ కొండవాలులో పరుగెత్తటం, ఆనాటి ఒక ప్రజ్ఞావిశేషం జ్ఞాపకముందా ?... ఒకనాడు నేను పడ్డాను పరుగెత్తుతూ. నువ్వు నవ్వేవు

మొదటి:- ఆవేళ నిన్ను చూసి నేను నవ్వేను. ఇవాళ మనల్ని చూసి అలాగే నవ్వుతారు అందరూ.

రెండవ:- ఎవరు ?

మొదటి:- మనవూరు వాళ్ళంతా, మనిద్దర్నీ చూసి

రెండవ:- మనిద్దర్నీ చూసి నవ్వుతారు. అవును.

మొదటి:- అర్థమయిందా ! ఎందుకు నవ్వుతారో ?

రెండవ:- అర్థమయింది. ఆఁ, సిగ్గువేస్తోంది కూడా.

మొదటి:- సిగ్గువేసి లాభం ఏమిటి? పద పోదాం. (ముందుకుపోయి, రెండో సైనికుడు కదలక పోవడం చూసి) ఏం ? ఆగావ్ ?

రెండవ:- అడుగు ముందుకువెయ్యి బుద్ధిపుట్టడం లేదు.

మొదటి:- అందుకని ఇక్కడే ఉండిపోదామా ?

రెండవ:- ఆఁ, ఇక్కడే ఆగిపోతే మంచిదిలావుంది.

మొదటి:- ఇక్కడా ! మనం వున్నది ఎక్కడో గుర్తుపట్టావా ?

రెండవ:- ఎక్కడ ?

మొదటి:- ఊరివెలుపల, కొండపక్క, ఏముందో గుర్తు లేదా ?

రెండవ:- ఉంది, శ్మశానం.

మొదటి:- అక్కడే మనం వున్నది.

రెండవ:- శ్మశానంలో మనం వున్నాం. ఇక్కడే వుండిపోదాం.

మొదటి:- ఇక్కడా ?

రెండవ:- అవును ఇక్కడే ! సైనికుడు యుద్ధంలో చచ్చినా శ్మశానం దావేగా! బ్రతికి శ్మశానంలోనే వుందాం

మొదటి:- యుద్ధంలో చచ్చి శ్మశానంలోవుంటే బాగుంటుంది. కాని యుద్ధం లోంచి పారిపోయొచ్చి, శ్మశానంలో వుంటే ఏం బాగుంటుంది ?

రెండవ:- బ్రతికి, ఊళ్ళో తలెత్తుకు తిరగలేనప్పుడు, శ్మశానంలోనే నశించి పోవటం బాగుండదూ ?

మొదటి:- బాగుంటుందేమో ! కాని నశించడం నాచేత కాదు. నేను ఇవాళ ఓడి పారిపోయి వచ్చాను. కాని కంఠంలో ఊపిరుండగా శత్రువుకు తలవంచను, నా రెక్కల్లో జవసత్వాలు చలనంతో వున్నంత వరకు వీరవిహారం చేస్తాను. ఆఖరి క్షణంవరకూ దెబ్బలాడతాను.

రెండవ:- (మాట్లాడడు)

మొదటి:- చూడు చూడు-ఇవిగో గోరీలు-గోరీలు- క్రిందటి యుద్ధంలో మన కోసం నీకోసం నాకోసం చచ్చిన మన తాతలు, ముత్తాతలు, తండ్రులు, దేశంకోసం ప్రాణాలొదలిన ధన్యులు. మన ఊరివారందరూ చిర కాలం స్మరించుకునే ధన్యజీవులు. ఈ గోరీ ఎవరిదో జ్ఞాపకం వుందా? వళ్ళు తూట్లు పడినా చేతిలో తుపాకీ వదలని మన పొడుగు తాతయ్యది. (మరో ప్రక్క చూపిస్తూ, పరుగెత్తి) ఈ గోరీఎరగవ్? ఈ ముసలాడి సాహస కృత్యాలు వింటుంటే మన హృదయాల్లో గర్వం పొంగి పొరలేది. వీళ్ళిద్దరూ మన ఊరికేకాదు, మన దేశానికే గౌరవం సంపాదించి పెట్టారు అనే వాళ్ళంతా. *

రెండవ:- మన తాతలూ. తండ్రులు, దేశానికంత గౌరవం సంపాదించిపెడితే మనం సిగ్గు, అవమానం, అపకీర్తి ఇంటికి మోసుకువచ్చాం. చూడు ఆ వీధి దీపాలు మన్ని చూసి దుఃఖిస్తూ తలలు వంచుకున్నాయి.

[దూరాన్నుంచి విమానాలు దగ్గరకు వస్తున్నట్లు శబ్దం వినిపిస్తుంది]

మొదటి:- ఏమిటిది ?

రెండవ:- విమానాలు !

మొదటి:- మనవెనకే వెతుక్కుంటూ వచ్చాయి !

రెండవ:- పారిపోయి వచ్చిన మనమీద కసితీర్చుకోవటానికి వచ్చాయి. (విమానాలు రెండో పక్కకి వెళ్ళిపోయాయి. సైనికులిద్దరూ వాటి వంకే చూస్తూ తలలు రెండో పక్కకి తిప్పుతారు.)

రెండవ.- ఊరి మీదకు వెళుతున్నాయి.

---

* ఈ గుర్తువున్నచోట నాటికా నిర్వాహకులకు Foot notes లో కొన్ని Directions యివ్వబడతాయి. ఇక్కడ Aeroplane Sound రాబోతోంది కనుక ప్రామ్టర్ జాగ్రత్త పడాలి. గుర్తు చూడగానే Technical assistants కు Warning యివ్వాలి. ఇక్కడ విమానాల రికార్డుకు వార్నింగ్ యివ్వాలి.

మొదటి:- ఇద్దరు పిరికి వాళ్ళకోసం ఊరినంతటినీ Bomb చేస్తారు.

రెండవ:- తరిమి పట్టుకోవటం చేతకాక తేలికపద్ధతికి తయారయ్యారు.

మొదటి:- మనవూరికి మనం చేసిన ఉపకారం ఇదే. మన్ని చూసి, మన్నే Bomb చేసి, తిరిగిపోతే ఎంత బాగుండును.

(దూరాన Bomb లు వేసిన శబ్దం *)

రెండవ:- ఊరిమీద బాంబులు వేస్తున్నారు.

మొదటి:- (కాసేపాగి) తిరిగి వస్తున్నాయ్ ! ఇంకా బాంబులు వేస్తున్నారు. పో దాక్కో (రెండోవాణ్ణి ఒకప్రక్కకు త్రోసి తాను రెండవప్రక్కకు పోతాడు)

(బాంబు ప్రేలుడు దగ్గరగా ఇంకా దగ్గరగా మరీ దగ్గరగా వినిపిస్తుంది. విమానాల రొద మరీ ఎక్కువ అవుతుంది. ఒక పెద్ద మెరుపు ప్రేలినమోత. అంతా చీకటైపోయింది. అంతా పొగ. మొదటి విమానాల రొద క్రమేపి తగ్గిపోయింది సైనికుడు నెమ్మదిగా లేచి కనిపిస్తాడు )

మొదటి:- (ఒళ్ళు దులుపుకుంటూ లేచి) ఎక్కడున్నావోయ్ నేస్తం, బయటికిరా. విమానాలు వెళ్ళిపోయాయిలే ఇక బయటికి రావచ్చు. రా. రావేం ! ఎక్కడున్నావ్ ? (వెనక నున్న గోరీలవెనక వెతికి తెల్లబోయి నుంచుంటాడు) ఆ ! దెబ్బతగిలిందా ?

(గోరీం వెనుక నుంచి స్నేహితుణ్ణి ముందుకు లాగుతాడు.) గూడు నలిగి పోయింది రక్తం బాగా కారుతోందే !! (కంగారుపడుతూ) తొందరగా వూళ్ళోకి తీసికెళతా పట్టు.

రెండవ:- ఎందుకు ? (హీనస్వరంతో బాధతో మాట్లాడతాడు )

మొదటి:- Hospital ల్లో చేరుస్తా

---

* Lights off. విమానాల మ్రోత, బాంబుల శబ్దం, మెరుపుపొగ, 2 వ సైనికుని భుజం నెత్తురుతో తడవటం, సమాధులు విరగటం, విమానాల రొద ఆగటం. On lights.

రెండవ:- ఇంకా నేను బ్రతుకుతాననే ఆశ వుందా ?

మొదటి:- ప్రయత్నిద్దాం.

రెండవ:- ప్రయత్నాలేం లాభం లేదు. విరిగిన ఎముకలు గుచ్చుకుని బాధ పెడుతున్నాయ్. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయ్.

మొదటి:- ఉండు. నేను మోసుకుపోతా. రా

రెండవ:- ఒద్దు. నీచెయ్యి తగిల్తేనే బాధ ఎక్కువవుతోంది. వద్దు, నువ్వెళ్ళిపో. నన్నొదిలేసి వెళ్ళిపో. (కాసేపాగి) ఎందుకు అనుమానిస్తావ్ ?

మొదటి:- ఉహూ. వెళ్ళను. ఎట్లా వెళ్ళమంటావ్ ?

రెండవ:- జీవన్మరణాల సంధిలో వున్న నన్ను వదిలేసి వెళ్ళక మరేం చెయ్యగలవ్ ?

మొదటి:- చేసేదేంలేకపోయినా, స్నేహధర్మం నన్నిక్కడ కట్టి పడేస్తోంది.

రెండవ:- ఏదైనా నువ్వు నాతో రాలేవుగా ! అబ్బా, బాధ

మొదటి:- అధైర్యపడకు. ఊళ్ళోకి తీసుకెళతా. రా.

రెండవ:- లాభంలేదు. దోవలోనే ప్రాణం పోతుంది... ఆ ... నువ్వు నాకు ఆప్తమిత్రుడివి కదూ !

మొదటి:- ఏం ! ఏం ?

రెండవ:- ఒక్క సహాయం కావాలి, చెయ్యగలవ్ ?

మొదటి:- తప్పకుండా చేస్తాను.

రెండవ.- నీ తుపాకిలో ఒక తూటా మిగిలింది కాదూ?

మొదటి:- మిగిలింది.

రెండవ:- దానితో నన్ను పేల్చేసి నీ దోవన నువ్వుపో.

మొదటి:- ఇదా సహాయం ! ! !

రెండవ:- అదే! అంతకంటే వేరేంకావాలి ? సుఖమరణం మంచిది కదూ-యీ బలవన్మరణం కంటే ?

మొదటి:- అహాఁ ! వల్లకాదు.

రెండవ:- అబ్బా ! ఈ బాధపడలేను.

మొదటి:- నా చేతుల్తో చెయ్యలేని పని.

రెండవ:- నన్ను త్వరగా వద్దెక్కించు.

మొదటి:- కానీ నా స్నేహితుణ్ణి నిన్నే, అహహ:-

రెండవ:- నీ శత్రువుని సహించంపి వదిలేశావా ఎప్పుడైనా ?

మొదటి:- కాని నువ్వు ?

రెండవ:- ఒక్క గుండుతో చచ్చేవాడి మీద పదిగుళ్ళు పేలుస్తావెందుకు ?

మొదటి:- (మాట్లాడడు)

రెండవ:- అనుమానరహితంగా చావటానికి కాదూ ?

మొదటి:- అయితే ?

రెండవ:- వాడికంత ఉపకారం చేసి— ఆదే ఉపకారం నాకు చెయ్యడానికి సందేహిస్తావేం ?

మొదటి:- నువ్వు నా స్నేహితుడివి.

రెండవ:- స్నేహితుణ్ణవటమేగా, నేను చేసుకున్న పాపం—నీకు దణ్ణం పెడతాను. ఈ బాధ భరించలేక అడుగుతున్నాను. ఈ ఉపకారం చెయ్యి.

మొదటి:- కాని—

రెండవ:- నీ స్నేహితుడిలా బాధపడటం నీ కిష్టమా—నే బ్రతుకుతాననే ఆశ నీకేమైనా వుందా ?

మొదటి:- లేనిమాట నిజమే.

రెండవ:- అయితే ఎందుకీ అనుమానం? స్నేహితుడు శత్రువుపాటివాడు కాడా? నీ శత్రువునైతే బాగుండేది కాదూ నేను. *

మొదటి:- ఓ! (దుఃఖంతో వివశుడౌతాడు)

రెండవ:- పేల్చెయ్ నన్ను! చెయ్యెత్తి దణ్ణంపెడతాను. ఈ బాధనుండి తప్పించు.

* తుపాకీ శబ్దం రాబోతున్నది.

మొదటి:- ఆఁ ఆఁ, నీ స్నేహితుణ్ణి. స్నేహితుణ్ణిచంపే స్నేహితుణ్ణి. ఈ చేతు ల్తోనే ఆ పని ముగిస్తాను. ప్రపంచం ఆ తర్వాత నన్ను నిందించనీ, ఏమైనాగానీ.

రెండవ:- ఆ. ఆ. త్వరగా కానియ్యి ప్రతిక్షణం ఒక యుగంగా వుంది. పేల్చేయ్. నీ ఆఖరి తూటాను సార్థకం చెయ్యి ఇంకా ఆలస్యం చేస్తావేం? కానీ.

మొదటి:- నేను సిద్ధమే!

రెండవ:- ఐతేకానియ్యి! త్వరత్వరగా! కానియ్యి. (మొ.సై.తుపాకీ పేల్చాడు) అహహ ! బాగుంది, బాలా బాగుంది. నీఉపకారం నేమరచిపోలేను. ప్రాణంవదుల్తూ చాలా సంతోషించానని మా వాళ్ళందరితోనూ మా నాన్నతోనూ చెప్పు. నిజమైన స్నేహితుడంటే నువ్వే. వెళ్ళు. పో నాన్నతో చెప్పు. నా దోవ నాది. నీ దోవ నీది. పో (మరణించాడు) [మొదటి సైనికుడికి కళ్ళ నీళ్ళు తిరిగినై. కాసేపాగి కళేబరాన్ని గోరీలవెనక్కి కనబడకుండా లాగి, తన తుపాకే అవతలపారేసి, రెండోవైపుకు బయలుదేరాడు. కాని అప్పటికే ఒక ముసలివాడు లాంతరుతోవచ్చి రెండవవైపున వున్న ఒక గోరీదగ్గర ఆగి వున్నాడు. మొదటి సైనికుడు అతన్ని చూసి వెనక్కి వెళ్ళి అతని వంకే చూస్తున్నాడు. ముసలివాడు ఆ గోరీని పరీక్షగా కొంతసేపు చూచి]

ముసలివాడు:- అంతా బాగానే వుంది. ఏమీ పగిలిపోలేదు. అంతా సరిగానే వుంది. ఓ భగవంతుడా! భూమిమీద బ్రతికినన్నాళ్ళూ, ప్రతి జీవినీ బాధపెడ్తూన్న ఈ భౌతిక శక్తుల్ని, ఈ గోరిమీదకూడా తరమకు. ఇవే నా ప్రణామాలు. (ముందుకు వస్తాడు. మొదటి సైనికుణ్ణి చూసి ఆగి) ఎవరునువ్వు ?

మొదటి:- నువ్వెవరు ?

ముసలి:- నేనా! కనబడటంలా? ఒక ముసలివాణ్ణి-నువ్వూ?

మొదటి:- నేను ఒక పడుచువాణ్ణి-నాదీ యీ వూరే!

ముసలి:- అబద్ధం !

మొదటి:- ఆహఁ. నిజమే!

ముసలి:- అబద్ధం, పచ్చి అబద్ధం. నువ్వీవూరివాడివికావు.

మొదటి:- ఏం అలా అన్నావ్?

ముసలి:- ఈ వూళ్ళో పడుచువాళ్ళెవరూ లేరు. 16 ఏళ్ల దాటిన వాళ్ళంతా యుద్ధానికి వెళ్ళారు.

మొదటి:- నేను యుద్ధంనుంచే తిరిగి వస్తున్నా.

ముసలి.- పారిపోయి వస్తున్నావా?

మొదటి:- యుద్ధఖైదీల శిబిరాలలోనుంచి తప్పించుకొని.

ముసలి:- ఎలా తప్పించుకొన్నావ్?

మొదటి:- చీకట్లో పహరావాళ్ళమీద పడి చంపేశాం. వాళ్ళ తుపాకులే తీసుకు బయలుదేరాం. కొంతదూరం వాళ్ళు మమ్మల్ని తరుముకువచ్చారు. మేం దొరకలేదు.

ముసలి:- ఆగు. నీమొహం సరిగా చూడనీ కంఠం. విన్నదిలాగేవుంది. (ముసలి వాడు లాంతరు మొహంమీదకు యెత్తుతాడు.) ఏమిటి నువ్వా?

మొదటి:- ఆ! నేనే తాతా!

ముసలి:- చాలా మారిపోయావ్. చిక్కిపోయావ్-అవును, ఆగటం ఎందుకులే.

మొదటి:- నువ్వూ బాగా మారిపోయావ్.

ముసలి:- అవును; మారేను. అందరూ మారుతారు- కాలం గడచినకొద్దీ.

మొదటి:- అయిదేళ్ళయింది నిన్ను చూశి.

ముసలి:- అయిదా? అయిదేనా? (లెక్కపెట్టుకుని) అవును అయిదే, నేనింక యెక్కువనుకొంటున్నా! ఐదేగాని, చాలా నిమ్మదిగా గడిచాయి కదూ, యీ ఏళ్ళు? పదపోదాం రా-ఊళ్ళోకి. (తను వెళ్ళబోతాడు)

మొదటి:- ఊళ్ళోకి రావటానికి మనసొప్పకే ఇక్కడ ఆగాను.

ముసలి:- ఏం ?

మొదటి - ఏం చెప్పను? యుద్ధానికి వెళ్ళి వెనక్కి వచ్చానని నలుగురూ నన్ను చూసి నవ్వుతారు. చూడు, ఆ వీధి దీపాలు నన్నుచూసి మొహం మాడ్చుకొంటున్నై. ఇదే గెల్చివస్తే? ఎన్ని దీపావళులు మిరుమిట్లు గొల్పుతూ స్వాగతం యిచ్చేవి!

ముసలి:- పారిపోయి వచ్చినందుకు సిగ్గుపడుతున్నావా?

మొదటి:- ఆ. (తలవంచుకుంటాడు)

ముసలి - మరే! గెల్చివస్తే- మన ఊరికీ- మన మనసుకీ బాగానే వుంటుంది. కాని, గెల్పు నీ చేతిలోవుందా?

మొదటి - లేదనుకో. కాని-

ముసలి:- గెల్చినా అది నీఒక్కడి గెల్పా?

మొదటి.- అందరి సైనికుల్దీ!

ముసలి:- అయితే, ఈ అవమానమూ అందరి సైనికుల్దీనూ,

మొదటి:- కాని, అందరూ ఇంకా పోరాడుతున్నారు.

ముసలి:- ఆ. ఆ. పోరాడుతూనే వుంటారు. తరతరాలుగా పోరాడుతూనే వున్నారు. దశాబ్దాలు శతాబ్దాలుగా పోరాడుతూనే వుంటారు. పోరాటంలో గెలుపా, ఓటమా అనే-ఆలోచనా లేకుండా పోరాడుతూనే వుంటారు. సైనికుడిపంతు పోరాడటం మాత్రమే. గెలుపూ ఓటమి ఒక్కడివే. అవి యుద్ధం ప్రారంభించిన వాడెవడో-వాడివి.

మొదటి:- ఆదేమిటి? గెలుపూ, ఓటమీ-నావీ-దేశానివీను.

ముసలి:- నా దేశం ఏమిటి, నీ దేశం ఏమిటి? ఆ దేశపు ఒక సైనికుడితో ఈ దేశపు ఒక సైనికుడు యుద్ధంలో తలపడ్డాడు. ఇద్దరూ తుపాకులు పేల్చుకున్నారు. విధివశాన ఒకడికి గుండుతగిలి చచ్చాడు. రెండోవాడు గెల్చాడు. వాళ్ళవాళ్ళెవరో ఒక వందమంది మిగిల్తే వాళ్ళదేశం గెల్చింది. అంతేగా?—కాని, గెల్చినవాడేం బావుకున్నాడు? వాడు గెల్చినా, వాడిపక్షం ఎక్కువ చస్తే, వాడి గెలుపుకేం విలువ?

గెలుపూ ఓటములు సైనికుడివి కావు—మీ సైనికులందరూ 'పావులు' 'గుర్రాలు' 'ఏనుగులూ'. మీ అందరి వెనుక ఎత్తులు వేసే అజ్ఞాత హస్తం వుంది. గెల్పు ఓటములు, ఆ అజ్ఞాత హస్తానివి.

మొదటి:- ఆ అజ్ఞాతహస్తం నా నాయకుడు. నా దేశానికి నాయకుడు. నేనూ, నా నాయకుడూ, నా దేశంకోసం పోరాడుతున్నాం.

ముసలి:- అందరూ తమ దేశంకోసమే పోరాడుతున్నా మంటారు. అందరూ దేశభక్తితోనే యుద్ధాలు చేస్తారు.

మొదటి:- అదేమిటి, అట్లాగంటావ్?

ముసలి :- నేను నా జన్మలో రెండు ప్రపంచ సంగ్రామాలు చూశాను. మొదటి సంగ్రామంలో నా పెద్దకొడుకును బలిపెట్టి ఇక్కడ గోరీ కట్టాను. (తను మొదట వచ్చి పరీక్ష చేసిన గోరీని చూపిస్తాడు) రెండో కొడుకును ఈ యుద్ధానికి పంపాను. పెద్దవాడు నాకూ నా దేశానికి వొరగ బెట్టిందేం లేదు. ఇక ఈ చిన్నవాడేం ఒరగ బెడ తాడో యింకా తెలీదు. చూద్దాం కానీ, యింటికి పోదాం పద (వెనక్కు తిరిగి నడుస్తాడు రెండోవైపుకి)

మొదటి:- నేను రాలేను.

ముసలి.- రాక ఇక్కడేం చేస్తావ్? ఈ గోరీల్లో అసంతృప్తితో చచ్చి అణగి పడియున్న పిశాచాల్తో పోట్లాడతావా? మరణానంతరం అవేం కాస్త సుఖజీవనం చేస్తున్నై. వాటిని లేవగొట్టకు.

మొదటి:- నాకేదో భయంగా వుంది. ఆందోళనగా వుంది.

ముసలి:- ఉంటుంది- మొదట్లో- కాని, ఇంటికిపోయి భార్యనీ పిల్లల్నీ చూస్తే సర్దుకుంటుంది. ఆఁ- నీ భార్య (ఏదో అనబోయి - ఆగి) ఇంటికి పోతున్నాంగా. రా. పిల్లలు కులాసాయే. బాగా అల్లరి చేస్తున్నారు. మీవాడు నన్ను తాతా తాతా అంటూ వదలిపెట్టడు. నా నెత్తి నెక్కి కూర్చుంటాడు.

మొదటి:- మా వాడా?

ముసలి:- ఆఁ. మహాకబుర్లు చెబుతాడు.

మొదటి:- కబుర్లా!

ముసలి:- ఒక్క కబురులేమిటి, ఆటలూ, పాటలూ! మొన్న, అయిదో ఏడు రాగానే బళ్ళో వేశాం.

మొదటి:- (ఆశ్చర్యంతో) అయిదేళ్ళే !!

ముసలి:- ఆఁ!

మొదటి:- (గుర్తుకు తెచ్చుకుని) అవును. 5½ ఏళ్లు. అవును. కాని నా మనస్సులో యింకా 6 నెలల పిల్లాడుగా మెదులుతున్నాడు - ఇప్పుడు పెరిగి వుంటాడు.

ముసలి.- బాగా పెరిగాడు. మరి పది-పదకొండేళ్లు పెళితే వాడూ యుద్ధానికి బయలుదేర్తాడు.

మొదటి:- తర్వాత ఇక్కడో, ఇలాంటి మరో శ్మశానంలోనో వుంటాడు.

ముసలి:- ఛ ఛ యువకుడివి, సైనికుడివి-అలా ఎందుకనుకోవాలి?

మొదటి:- (విచారంగా) కాని—నాకదే కనిపిస్తోంది.

ముసలి:- అలా ఆయిపోయావేం? నాకు తెల్సు, నాకు తెలుసు. కొడుకు గోరీలో ఉండటమంటే నాకు తెలుసు. 20 ఏళ్ళ క్రిందట నా పెద్దకొడుకును ఈ గోరీలో పెట్టాను. భూమాత ఎప్పుడో వాణ్ణి జీర్ణం చేసేసుకుంది. కానీ నాకు వాడింకా యీ గోరీలో వున్నాడనే అనిపిస్తుంది.

మొదటి:- తాతా! నీకొకటి చెప్పాలి. కానీ-

ముసలి:- కానీ గీనీ ఎందుకు. తర్వాత చెబుదువుగాని. ఇంటికి పోదాంరా. ఐదేళ్ళక్రితం చూశావ్! పెరిగిన పసికందును కళ్ళారా చూసుకుందువుగాని రా.

మొదటి:- రాను. రాలేను. ఇక్కణ్ణుంచి కదిలిరాలేను.

ముసలి:- ఇంకా తలను వంచిన అవమానభారం తగ్గలేదా?

మొదటి:- కాదు.

ముసలి:- మరి ?

మొదటి:- నే నేదో ఇక్కడ పోగొట్టుకున్నాను.

ముసలి:- రేపు వచ్చి వెతుక్కోవచ్చుగా. రా.

మొదటి:- కానీ నాకది దొరకదింక. ఎంత వెతికనా దొరకదు.

ముసలి:- ఏదైనా-నీ కన్నకొడుకును ఇన్నేళ్ళ తర్వాత చూడడానికంటే అమూల్యమైందా? ఏ, నీ కన్నకొడుకను కళ్ళారా చూచుకుందువు గాని - నా ఒక్క కొడుకును గురించి చెవులారా చెబుదువుగాని-

మొదటి:- నో (వివశుడై) ఎల్లా చెప్పగలను?

ముసలి:- ఏడుస్తున్నావా! అంత ముఖ్యమైందా ఆ వస్తువు? ఏమిటది? ఎలా వుంటుంది? దీపం వుందిగా-వెతుకుదాం రా!

మొదటి:- ఒద్దు. వెతకవద్దు.

ముసలి:- ఏం?

మొదటి:- వెతికితే దొరికేది కాదు.

ముసలి:- మరేమిటి!

మొదటి:- అది - నా స్నేహితుడి ప్రాణం.

ముసలి:- ఆఁ!

మొదటి:- నేనూ, నా స్నేహితుడూ శత్రువుల నుండి తప్పించుకొని ఇక్కడి దాకా వచ్చాం. మమ్మల్ని వెంబడించి పట్టుకోలేక, వెనకనే విమా నాల్ని పంపారు.

ముసలి:- ఆఁ ఆఁ. ఆ విమానాలు బాంబులు వేసుకుంటూ యిటునుంచే వచ్చాయి. (పెద్దవాడి గోరీచూపించి) ఈ గోరీమీద కూడా బాంబులు పడ్డాయేమోనని చూసుకోవటానిక్కే నేను వచ్చేశాను.

మొదటి:- బారా!

ముసలి:- కానీ, గోరీ ఏం దెబ్బతినలేదు.

మొదటి:- నాతో వచ్చిన-ఈ చిన్నవాడికి దెబ్బతగిలింది.

ముసలి:- పాపం చిన్నవాడేనా! ఎన్నేళ్ళుంటాయ్?

మొదటి:- 28 ఏళ్ళు.

ముసలి:- అంతేనా! పాపం, బాగా గాయాలు తగిలాయా?

మొదటి:- ఈపక్క భుజం, పక్క ఎముకలు, వెణ్ణు అన్నీ విరిగి పోయాయి.

ముసలి:- ఆఁ!!

మొదటి:- రక్తం వరద.

ముసలి:- పాపం.

మొదటి:- బాధ, భరించలేని బాధ.

ముసలి:- అంత దెబ్బ తగిలితే ఎంత సేపుకావాలి ప్రాణం పోవటానికి.

మొదటి:- ఉహుఁ-ప్రాణందానంతటది పోలేదు.

ముసలి:- మరి?

మొదటి:- చాలాసేపు బాధపడ్డాడు; బాధభరించలేక చివరికి.

ముసలి:- ఆఁ చివరికి?

మొదటి:- నన్నే ఈ తుపాకీతో పేల్చమన్నాడు. కాని.

ముసలి:- ఆఁ ఆ.

మొదటి:- కాని పేల్చలేకపోయాను. పేల్చనన్నాను.

ముసలి:- ఎందుకన్నావ్? వెంటనే పేల్చి సహం పోయిన ప్రాణాన్ని పూర్తి చెయ్యలేకపోయావా?

మొదటి:- చేశాను లాల, చేశాను. అంతపనీ చేశాను, చివరికి.

ముసలి:- చేశావా? అన్నుదిన్యు చెయ్యెత్తి దణ్ణంపెట్టి వుంటాడతను.

మొదటి.- పెట్టాడు, దణ్ణం పెట్టాడు.

ముసలి:- జన్మ జన్మాలకీ నీ పేరు తల్చుకుంటాడు. స్నేహితుడికి ఏ మానవ మాత్రుడూ చెయ్యలేని ఉపకారం చేశావ్.

మొదటి:- అనే అతనూ అన్నాడు.

ముసలి:- పాపం ఏడీ? (వెతుకబోతూ) ఎక్కడ? అతనేడీ? మనం త్వరగా అతన్ని సమాధి చేద్దాం. మా పెద్దవాణ్ణి సమాధిలో పెట్టిన ఈ చేతుల్తోనే ఇతన్నీ పెడతాను. ఇతనూ మరో చిన్న కొడుకనుకుంటాను.

మొదటి:- అవును తాతా! ఇతను చిన్నకొడుకే!

ముసలి:- అవునవును. యుద్ధంలో పోయిన వాళ్ళంతా నా బిడ్డల్లాంటి వాళ్ళేగా అవును

మొదటి:- కాదు తాతా!

ముసలి:- ఇంతకూ నాకు చూపించవేం అతన్ని? ఎక్కడున్నాడు?

మొదటి:- అక్కడ.

ముసలి:- (వెళ్ళి సమాధుల వెనుక చూస్తాడు)

మొదటి:- (కళ్ళు మూసుకుని వెనక్కు తిరిగిపోతాడు)

ముసలి:- (తిరిగి వస్తూ) పాపం, అదేపోడుగు, అదేమాదిరి, సరిగ్గా మా చిన్నవాడిలాగే వున్నాడు కదూ! అదే వయస్సుకూడా! అయిపోయింది. ముందు ఇతన్ని సమాధి చేద్దాం. నేను వెళ్ళి పనిముట్లూ అవీ పట్టుకువస్తా. నువ్వు యిక్కడే ఇతన్ని చూస్తూవుండు. ఏం? వస్తా. (వెళతాడు) *

మొదటి:- (అటే చూస్తూ నిలబడి వున్నాడు వెనక్కి తిరిగి నడిచాడు మళ్ళీ. 'తాత' వెళ్ళిన వైపుకు చూస్తున్నాడు. కాసేపట్లాచూసి పెద్దగా) ఓ హ్, నేనెందుకు బ్రతికి వున్నాను? ఎందుకు బ్రతికున్నాను? ఎందుకు బాంబు తగిలి చావలేదు? [లోపల్నుంచి ప్రతిధ్వని మూడు సార్లు వినిపిస్తుంది. ఒకసారికంటె మరోసారి దూరాన్నుంచివస్తున్నట్లు శబ్దం తగ్గుతూ:-]
"ఎందుకు బాంబుతగిలి చావలేదు"
"ఎందుకు బాంబుతగిలి చావలేదు"
"ఎందుకు బాంబుతగిలి చావలేదు"

మొదటి:- ఈ తాత పుత్రశోకం చూడటానికేగా?

ప్రతిధ్వని:- ఈ తాత పుత్రశోకం చూడటానికేగా
ఈ తాత పుత్రశోకం చూడటానికేగా
ఈ తాత పుత్రశోకం చూడటానికేగా

---

* ప్రతిధ్వనులు. 2వ సైనికునిలోపల నుంచి మాటలు.

మొదటి:- అహఁహఁ నేనీమాట చెప్పలేను. చెప్పలేను. యీ మాట నా నోటితో తాతతో! వెళ్ళిపోతాను. పారిపోతాను. ఏదూరతీరానికో పారిపోతాను. ఇక ఈ వూరు తిరిగి రాకుండా ఎక్కడికో అక్కడికి పారిపోతాను. ఇక ఎప్పటికీ.

[లోపల్నుంచి రెండవ సైనికుడి కంఠస్వరం వినిపిస్తోంది]

కంఠస్వరం:- ఇక ఎప్పటికీ తిరిగిరాకుండా పారిపోతావా?

మొదటి:- ఆ! (ఆశ్చర్యంగా) ఎవరా మాట్లాడేది?

కంఠస్వరం:- అప్పుడే మర్చిపోయావా?—నీస్నేహితుణ్ణి.

మొదటి:- నువ్వా? చచ్చిపోయినా?

కంఠస్వరం:- ఆఁ చచ్చిపోయినా మాట్లాడగలనులే. పారిపోతానంటున్నావ్. ఎక్కడికి పారిపోతావ్. పారిపోయి సత్యాన్ని కప్పిపుచ్చగలవా?

మొదటి:- మరి యీ వార్త తాతతో ఎలా చెప్పగలను? అతన్ని చూస్తేనే-నా గుండె...

కంఠస్వరం:-నిజమే. కాని చెప్పెయ్యి. అంతేకాదు. మరణించిన తర్వాత 'తాత' 'తండ్రి' అనే విభేదాలు లేవని కూడా చెప్పు. నువ్వు చూడజాలని ఒక వింత లోకాన్ని నేనిప్పుడు చూడగల్గుతున్నాను. ఇక్కడ చాలా ఛాయాదేహాలు కనిపిస్తున్నాయి. బహుశా దీన్నే పిశాచలోకం అంటారు [illegible]లు. ఏదైనా తల్లీ, తండ్రి చుట్టరికాలు ఇక్కడలేవు. ముక్కు పొడుగూ, పొట్టి భేదాలు లేవు. చర్మం నలుపూ, తెలుపూ భేదాలు లేవు. అంతా ఒకటే జాతి, ఒకటే లోకంగా కనిపిస్తోంది. దీన్నంతా చూస్తుంటే నాకాశ్చర్యంగా వుంది. 'ఈఆత్మలే గల మానవ శరీరాల్లో ఈ భేదాలెందుకున్నాయా?'అని. "ఈ భేదాలతో ఈర్ష్యలు పెంచుకుని, ఒకళ్ళనొకళ్ళు చంపుకుని, మానవుడెందుకీ పిశాచ లోకాన్ని సృష్టిస్తున్నాడా!" అని-

మొదటి:- ఆ లోకాన్ని మానవుడే సృష్టించాడా?

కంఠస్వరం:-ఆఁ, మానవుడే. ఈ అసంతృప్తిరూపలోకాన్ని సృష్టిస్తున్నాడు. ఇక నే వెళ్తున్నాను. నా ప్రశ్నకు జవాబు మీ లోకాన్నడిగి తెలుసుకో.

మొదటి:- ఆగు. ఆగు. వెళ్ళావా [కాసేపు ఆలోచిస్తూ నుంచున్నాడు-వెనక్కి తిరిగి నడిచాడు. తలెత్తి చూసేసరికి ఏదో కనిపించింది] ఎవరది? ఎవరావచ్చేది? (వెనక్కి నడుస్తూ) ఎవరు? నువ్వేనా నా నేస్తానివి? ఆగు. అక్కడే ఆగు. రాక [వెనక్కి వెనక్కి పోతాడు. ఖంగారుగా. నల్లని దుస్తుల్లో ఒక వ్యక్తి ప్రవేశిస్తుంది. చేతుల్లో ఏదో వున్నది]

మొదటి:- ఎవరునువ్వు?

వ్యక్తి:- ఒక దౌర్భాగ్యురాల్ని. నువ్వూ? నువ్వెవరివి?

మొదటి:- సైనికుణ్ణి.

వ్యక్తి:- సైనికుడా!!

మొదటి:- పారిపోయి ఇంటికివస్తున్న సైనికుణ్ణి.

వ్యక్తి:- ఈ దేశం వాడివేనా?

మొదటి:- ఆ, ఈ వూరివాణ్ణే.

వ్యక్తి:- అయితేసరే. నాకు కాస్త సాయం చేస్తావా?

మొదటి:- ఏమిటి?

వ్యక్తి:- ఈ పసివాణ్ణి కాస్త సమాధి చెయ్యాలి

మొదటి:- సమాధా? ఎవరిది?

వ్యక్తి:- నా కొడుకు.

మొదటి:- చచ్చిపోయాడా?

వ్యక్తి:- చచ్చిపోయాడు. ఇప్పుడొచ్చిన విమానాలు వేసిన బాంబుల్కి. కాస్త సహాయం చెయ్యి. నే త్వరగా వెళ్ళాలి.

మొదటి:- ఏం?

వ్యక్తి:- ఇంకోపిల్లవాడున్నాడు. నిద్రపుచ్చివచ్చాను, నిద్ర లేచేలోపల ఈ పని పూర్తి చేసుకుపోవాలి.

మొదటి:- సరే కాసియ్యి. (పిల్లవాణ్ణి తీసుకోబోయి; ముట్టుకుని-ఆగి)! వళ్ళింకా వేడిగానే వుంది.

వ్యక్తి:- మొహం నవ్వుతూనే వుంది. ప్రాణాలొక్కటే లేవు. చిటికెలో విమానా లెత్తుకుపోయాయి నిమిషంలో చిన్నాయన వేరై పోయాడు.

మొదటి:- విచారించకమ్మా! నీబోటి వీరమాతలే-

వ్యక్తి:- వీరమాత! వీరమాత!- వర్ణనలకేం, మనసొచ్చినట్లు వర్ణించవచ్చు కాని, ఆ వీరమాత హృదయం తెల్సుకోటం చాలా కష్టం.

మొదటి:- మనబోటి వాళ్ళు త్యాగం చేస్తేనే ముందు వాళ్ళకి-

వ్యక్తి:- త్యాగం! త్యాగం! మేం చేసిన త్యాగం నీకే- తెల్సు? తెలిస్తే నువ్విలా అనవ్!

మొదటి:- తెలియకేం - అంతా తెలుసు.

వ్యక్తి:- తెలియదు; ఏమీ తెలియదు. యుద్ధపరికరాల్లో ఒక పరికరానివి నువ్వు. బాంబు విసిరిన తర్వాత ఏమైందో, ఎంతమంది అమాయకుల్ని బలి తీసుకుందో నీకు తెలియదు.

మొదటి:- నాకూ—

వ్యక్తి:- నాకిప్పుడు 25 ఏళ్ళు. 18వ యేటనే ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. రెండేళ్ళు ఎంతో అనురాగంతో కాపురం చేశాను. ఒక మగపిల్లవాడు కలిగాడు. ఆర్నెల్లైందో లేదో యుద్ధంవచ్చి మా వార్ని పిలుచుకు పోయింది. ఆయన తుపాకి భుజాన వేసుకొని వీధిలో March చేసుకుంటూ పోతుంటే నేనూ ఒక 'వీర పత్ని'నని గర్వించాను.

మొదటి:- ఆఁ!

వ్యక్తి:- మరో ఏడాదికి ఈ వూరు శత్రువశమైంది. శత్రుసైన్యాల చేతుల్లో పడి మా సర్వస్వాన్నీ గోల్పోయాం, ఒక్క మా ప్రాణాలూ-పిల్లల ప్రాణాలూ తప్ప.

మొదటి:- ఆహాఁ!

వ్యక్తి:- మీకు తెలిసిందల్లా యుద్ధం చెయ్యటం-కాని, ఆయన తిరిగివస్తే ఈ మొహం ఎల్లా చూపించాలో నాకు తెలియదు.

మొదటి:- కాని ఒకమాట—

వ్యక్తి:- ఇంకా మాట ఏమిటి? నీకూ ఒక సోదరివుంటే, నీకూ ఒక భార్యవుంటే, వాళ్ళూ ఇలాగే యుద్ధంలో పరాభవించబడితే, తెలిసేది నా క్షోభ. ఈ పరాభవం ఒకరోజూ, రెండురోజులూ కాదు- నెలలు, ఒకటే వ్యథగా, ఒకటే కసాయికోతగా! చిట్టచివరికి ఎలాగో మనవాళ్ళు ఈ ఊరిని వశపరచుకున్నారు. కాని అప్పటికే నేనొక గర్భిణిని.

మొదటి:- ఏమిటి?

వ్యక్తి:- 9 నెలలు గడచి పిల్లవాణ్ణి కన్నాన. పిల్లవాడు! నేనెంతో అస హ్యించుకొనే పిల్లవాడు. కాని నా పిల్లవాడు ప్రపంచంలో ఏ తల్లీ అసహ్యించు కోనంతగా అసహ్యించుకొంటూ, ద్వేషించనంతగా ద్వేషిస్తూ, ఈ చేతుల్తోనే ఈ దేహంతోనే ఆ పాప స్వరూపాన్ని పోషించి పెంచాల్సివచ్చింది. పెంచుతున్నాను- మెడపిసికి చంప లేని బలహీనతవల్ల.

మొదటి:- అర్థమయింది.

వ్యక్తి:- ఓ! నేను చావలేను, పిల్లల కోసం బ్రతకాలి. ఈ జీవితంమీద అసహ్యం పుట్టినా, యీ దేహం మీద రోత పుట్టినా, బ్రతకవలసిందే. బ్రతికి ఏదో ఒకనాడు ఆయన్ని చూడక తప్పదు యుద్ధం ముగియగానే ఆయన వస్తారు, వస్తే ఆయన కాపిల్లాణ్ణి చూపించక తప్పదు చేతిలో ఆ పిల్లాడితో ఎదురువెళ్ళి స్వాగతం ఇవ్వాలి ఏమి స్వాగతం ? ఏముఖంతో స్వాగతం ? ఏ అనురాగంతో ఎదురు వెళ్ళను ?

మొదటి:- ఆ పిల్లవాణ్ణి చంపేస్తే ?

వ్యక్తి:- నీకు చంపటంతప్ప వేరేంచేతకాదు. 9 నెలలు మోసి కని, పెంచిన పసిగుడ్డును యీ చేతుల్తో చంపడం నా చేతకాలే ఆయనవస్తే జరిగేసంగతి అనూహ్యం. ఆయన రాకుండావుంటే- అవును. అప్ప ట్నుంచి ఆయన రాకుండా వుండాలనే కోరుతున్నా. భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నా, యుద్ధంనుంచి ఆయన తిరిగి రాకుండా యుద్ధంలోనే ఆయన అంతరించిపోవాలని. ఇవాళ విమానాలొచ్చాయి. నిరాశతో ఎండి పోయిన నా హృదయంలో వింత ఆశల్ని రేకెత్తించాయ్. ఆ పాపిష్ఠి

సంతానాన్ని చేతిలో వుంచుకొని, ఆకాశంలోనే ఆశలు పెట్టుకుని, ఆరుబయట విమానాలవెంట బాంబులు పడేవైపుకు పరుగెత్తుకు పోయాను. కాని అవేవీ యీ మలిన దేహాన్ని ముట్టుకోలేదు ఇంటికి తిరిగివచ్చాను. మా ఇంటిమీద బాంబులు పడ్డాయి. మా అనురాగాల ప్రోగు, ఈ పెద్దపిల్లవాడు చచ్చిపడి వున్నాడు.

మొదటి:- ఆపవమ్మా !

వ్యక్తి:- ఎందుకాపాలి? నువ్వూ నీలాంటి వాళ్ళతో కలిసి, నీలాంటి శత్రువులతో యుద్ధంచేసి మాకు తెచ్చిపెట్టేది యిదేగా నికివ కొత్తా! నీచేతుల్తో ఎంతమందిని చంపావో, ఎంతమందిని చెరిచావో నీకు తెలియదా?

మొదటి:- తెలుసు.

వ్యక్తి:- తెలుసు, ఈ పనులు అంతా తెలిసేచేస్తుంటారు. అయితే ఈ కళేబరాన్ని ఏంచెయ్యాలో నీకు తెలిసేవుంటుంది. వీడూ నీలాంటివాడి కొడుకే. ఇంద తీసుకో, నీ యుద్ధఫలితాన్ని.
(కళేబరాన్ని అతని చేతుల్లో పడవేసి వెళ్ళిపోయింది)

మొదటి:- నేనేం చేసుకోను!

వ్యక్తి:- ఏం చేసుకున్నా సరే. *

మొదటి:- ఉద్రేకపడకమ్మా, నీకొడుకును సమాధిచేద్దాం.

వ్యక్తి:- నేచెయ్యలేనా పని. మాతృహృదయానికి పోషించడం చేతనవునుగాని, పూడ్చిపెట్టడం చేతకాదు. అది చేతనయింది నీకు. (వెళ్ళిపోయింది.)

మొదటి:- ఏమిటిది! సైనికుడంటే ఇదా! ఇదా, నా పని? వట్టి కాటికాపరా? కసాయివాడా సైనికుడంటే? కాదు, నే కసాయివాణ్ణి కాదు.
(లోపల్నుంచి కంఠస్వరం వినిపిస్తుంది)

కంఠస్వరం:- కాక మరెవరివి?

మొదటి:- ఏమిటి?

[ఒక ముసలి గోరీలమాటునుంచి బయటికి వస్తాడు]

---

* ముసలి ప్రవేశం—Dim light focus on ముసలి.

మొదటి:- (తెల్లబోయి, ఆశ్చర్యంతో) ఏమిటది ఎవరు నువ్వు?

ముదుసలి:- ప్రపంచం అంతా విస్మరించిన ఒక ముసలివాణ్ణి.

మొదటి:- ఆ! అంటే నా కర్థంకాలేదు. ఎవరివి నవ్వు? ఇప్పుడు యీ గోరీల మధ్య ఎందుకున్నావ్?

ముదుసలి:- ఉన్నాను. ఇదే నా నివాసంగనక. దానిదేముందిలే, ప్రతివాడూ ఎక్కడో అక్కడ వుండాలి నేనీ గోరీల మాటున ఉన్నా, ఈ గోరీలమాటున ఏముందో నాకు బాగాతెల్సు, నీకు తెలుసా అదేమిటో?

మొదటి:- ఏముంది?

ముదుసలి:- దుఃఖం, అశాంతి, మనోక్షోభ

మొదటి:- ఇదెవరికి తెలియదు

ముదుసలి:- చాలామందికి తెలియదు. తెలిస్తే యిన్ని యుద్ధాలెందుకు చేస్తారు? ఇన్ని మారణ యంత్రాలెందుకు కనిపెట్టుతారు? నీ చేత, ఇన్ని యుద్ధాలెందుకు చేయిస్తారు?

మొదటి:- ఎవరెందుకు చేస్తున్నారో, నేను మాత్రం నా దేశంకోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్నాను.

ముదుసలి:- అబద్ధం, ఆత్మవంచన.

మొదటి:- ఆ- మరి నే పోరాడుతున్న దెందుకు ?

ముదుసలి:- దేశం పేరిట, ప్రజాసేవ పేరిట - నీ స్వజనులకోసం - నీ స్వార్థం కోసమే పోరాడుతున్నావ్.

మొదటి:- కాదు, దీంట్లో స్వార్థంలేదు, నా ప్రజలకోసం, ప్రజా స్వాతంత్ర్యం కోసం, ప్రజాభివృద్ధికోసమే పోరాడుతున్నాను.

ముదుసలి:- నీ విరోధికూడ అతని ప్రజలకోసం, స్వతంత్రం కోసం, అభివృద్ధి కోసం పోరాడుతున్నా నంటున్నాడు.

మొదటి:- అబద్ధం, అదంతా అబద్ధం.

ముదుసలి:- నీది అబద్ధమని అతనంటాడు.

మొదటి:- ఆ శత్రువే నామీద దండెత్తాడు మొదట.

ముదుసలి:- ముందు నువ్వు చేసిన అన్యాయమే యుద్ధంలోకి దింపిందంటాడు అతను.

మొదటి:- అయితే ఇది తేలేదెట్లా?

ముదుసలి:- ఎందుకు తేలదు? ముందు మీ హృదయాల్లో ద్వేషం బయలుదేరింది. ఆ ద్వేషం పరస్పర అనుమానాలకు దారితీసింది. ఈ అనుమానం మీ యిరుపక్షాలకీ భేదం కలిగించింది. ఆ భేదం మీ యిద్దర్నీ వేరు పరచి, జాతి మత విభేదాలకి దారితీసింది. ఇవన్నీ యుద్ధాలకు దోవ తీసినై.

మొదటి:- కావచ్చు. కానీ ఈ అసూయతో నేను యుద్ధం చెయ్యటంలేదే! ఈర్ష్య లతో యుద్ధం చెయ్యటంలేదే! దేశమాత ఆర్తనాదం విని, మాతృ మూర్తి ఋణం తీర్చుకోటాన్కి ఈ యుద్ధంలో కురికాను.

ముదుసలి:- దేశభక్తి-స్వార్థానికి మరో పేరు. ఈ అనంతభూతలం ఏ ఒక్కడి దేశం కాదు - అందరిదీను. ఈ కనపడే ఎల్లలూ హద్దులూ మనం కల్పించుకున్నవే. వాటిని మనం మార్చుకోగలం "విశ్వవసుంధరంతా ఒకటే దేశం. విశ్వ మానవులంతా ఒకటే జాతి" అని అందరూ ఒప్పుకుంటున్నారు. మానవులంతా ఒకటే అయితే, జాతివైషమ్యా లెందుకు? జాత్యహంకారా లెందుకు? జాతియుద్ధా లెందుకు?

మొదటి:- ఎందుకు? ఎందుకు?

*

ముదుసలి:- ఎందుకా? మీ నాయకుల నాయకత్వంకోసం, దేశభక్తి పేరిట జాత్య హంకారాన్ని రెచ్చగొట్టి మమ్మలందర్ని యుద్ధంలోనే నినుగ్నుల్ని చేసి

---

* Lights off. అలెగ్జాండర్, అశోకుడు, ఒక మహమ్మదీయ చక్రవర్తి నెపోలియన్, Lloyd George, Hitler వరసగా వెనక తెరమీద Magic lantern తో focus చేయబడతారు. వారి వారి భాషల్లో వారు మాట్లాడతారు. ఈ 6 కంఠస్వరాలవారూ తయారవాలి.

తమ నాయకత్వాన్ని నిలుపుకోవటానికి, మీ నాయకులు పన్నిన పన్నాగం యిది.

మొదటి:- కాదు—మా నాయకుడు- "శాశ్వతమైన శాంతి కోసం, యుద్ధరాక్షసి హతమారిపోవటంకోసం" అంటున్నాడు. యుద్ధాన్ని అణగకొట్టటానికి యుద్ధమే సులభమార్గం.

కంఠస్వరం:-'యుద్ధాన్ని అణగ కొట్టటానికి యుద్ధమే సులభమార్గం' అని మీ నాయకుడన్నాడు. ఈ మాటలే అనేక శతాబ్దాలనుంచి అనేక మంది మహానాయకులూ అంటున్నారు. అనేక శతాబ్దాలకు పూర్వం, అలెగ్జాండర్ (అలెగ్జాండర్ అనగానే రంగమంతా చీకటౌతుంది. ఆకాశంలో అలెగ్జాండర్ కనిపిస్తాడు.)

ALEXANDER — దిగంచలాంతరకూ గల వివిధ దేశాలనూ జయించి ప్రపంచానికే చక్రవర్తి నౌతాను.

కంఠస్వరం — అశోకుడు (అనగానే అలెగ్జాండర్ అంతర్ధానమై అశోకుడు కనిపిస్తాడు).

అశోకుడు — "అఖిల భారతాన్ని ఏకచ్ఛత్రంచేసి సుస్థిర శాంతి రాజ్యమును స్థాపిస్తాను."

కంఠస్వరం — ఇంకా Alfred the great మొదలుగాగల అనేకమంది మహావీరులూ, మధ్యకాలంలో అనేక మహమ్మదీయ చక్రవర్తులూ.
[ఒక మహమ్మదీయ చక్రవర్తి ఆకాశంలో కనిపిస్తాడు.]

మహమ్మదీయ చక్రవర్తి-మైఫూకి దునియాకొ ఫతేహ్ కర్కే జిస్మే కామిల్ అజాది ఒస్కూన్‌కి హుకుమత్ కాయంకర్కే, ఏఖీ కౌమ్, ఏఖీ మజహబ్ ఏఖీ ఝండా లహరావుంగా. (ఉరుదు)

కంఠస్వరం:- ఈమధ్యనే Napolean- (నెపోలియన్ కనిపిస్తాడు)

నెపోలియన్:- ఝువెన్‌క్రై - లెఫోమాన్‌త్ ఎత్ఎతాబ్లెరె నాత్రెరొయోమ్ సో ఉనెజనేర్. (ఫ్రెంచి)

కంఠస్వరం:- Lloyd George [లాయడ్ జార్జి కనిపిస్తాడు]
Lloyd george:- Our war is to end all wars.

కంఠస్వరం:- హిట్లర్ [హిట్లర్ కనిపిస్తాడు]

**హిట్లర్:-** ఇఖ్ జెసీగెన్ ది గాంజ్ వెల్టు ఉంట్ బ్రింగెన్ ఆలె లాండన్ ఉంటర్ ఐన్ రైష్. ఐన్ లాండ్, ఐన్ కొనిగ్, ఐన్ రైష్ ఐన్ ఫోల్క్. (జర్మన్)

[తిరిగి లైట్లు వెలుగుతాయి]

కంఠస్వరం:- అందరూ ఇదేమాట అన్నారు. అందరూ కుమిలిపోతున్న భూమాత కాలగర్భంలో అంతర్లీనమైపోయారు. గతించిన చరిత్ర నుంచి గుణపాఠం నేర్చుకోకపోతే మానవుడి ప్రత్యేకత ఏముంది? ... యుద్ధం ఆపివేయడానికి యుద్ధం మానివేయ్యటమే మందు. కాని యుద్ధం చేయటం కాదు.

యుద్ధానికి కారణం స్వార్థం, ఈర్ష్య, దురాశ 'యుద్ధం' తనతోపాటు ఆకలి, దంద్రం, కరువు, దుఃఖం తెస్తుంది. ఈ నిరాశలో మానవుడు మళ్ళీ యుద్ధానికే దారితీస్తాడు. కాబట్టి యుద్ధానికి జవాబు యుద్ధం కాదు శాంతస్థాపన. దేశాభివృద్ధికోరే ఏ నాయకుడూ యుద్ధాన్ని కోరడు. శాంతినే వాంఛిస్తాడు. శాంతికిముందే అభివృద్ధి, ఆనందం వస్తాయి. శాంతి శోభ అభివృద్ధి. యుద్ధపుసీడ సర్వనాశనం శాంతిచిహ్నం ఐక్యత. యుద్ధచిహ్నం విభిన్నత. శాంతి ఫలితం సంతృప్తి!! యుద్ధ ఫలితం యుద్ధం!!

**మొదటి:-** అవును కాని, యీ యుద్ధం కావాలని నేనెప్పుడూ కోరలేదే!

**ముదుసలి** -కోరలేదు నీలాటి సామాన్యుడెప్పుడూ కోరలేదు. కోరింది కొద్ది మంది స్వార్థపరులు మాత్రమే! వాళ్ళేనాయకత్వం వహించి ప్రపంచాన్ని సంగ్రామాల్లో దింపుతున్నారు. నీలాటి సామాన్యుల్ని బలి పెడుతున్నారు.

మొదటి:- నా దేశ స్వాతంత్ర్యం మీదకు దాడి చేస్తే నేను యుద్ధం చెయ్యకపోతే ఎలా ?

**ముదుసలి:-**దాడి వచ్చేవరకూ ఎందుకూరుకున్నావ్? దాడి రాకముందే 'శాంతి ప్రాముఖ్యం' ప్రజలందరికీ నచ్చజెప్పి, ప్రపంచం అంతా ఒకే జాతి అని బోధించు. అన్ని దేశాలలోనూ ఐక్యత సాధించు.

మొదటి:- దీనికి అన్ని దేశాల ప్రజలూ పూనుకోవాలి, అది సాధ్యమా?

ముదుసలి:- ఎందుకు సాధ్యంకాదు? ఇన్ని దేశాలు కూడగట్టుకుని ఇంత పెట్టున యుద్ధ సన్నాహాలు చేస్తున్నాగే. ఇంత ప్రయత్నమూ చేస్తే శాంతి సుస్థిరం కాకపోయిందా! నీ నాయకులు లిని చెయ్యక, సామ్రాజ్య కాంక్షలతో నీ దేశానికి స్వలాభం చూపించి యుద్ధాల్లోకి దింపుతున్నారు. నీ నాయకులు విస్మరించిన పని నీమీద పడింది. నువ్వే నాయకత్వం వహించి శాంతి ప్రచారం చెయ్యి, ఇది నీ విధి. నీతోటి వాళ్ళందరి విధి

(ముదుసలి అదృశ్యమై పోతాడు)

*

మొదటి.- నా విధి. నా తోటివాళ్ళందరి విధి ఈ సందేశాన్నే అనేక మంది మహాత్ములు అనేకసార్లు అందించారు, యీ మానవ లోకానికి. కాని, ఎందువల్ల ఈ ప్రపంచం యీ అమూల్య సందేశాన్ని ప్రతితడవా విస్మరిస్తోంది? ఎందుకని ఈ అమర సందేశం ప్రతిసారీ పరాభవింప బడుతోంది? ఎందుకని? ? ఎందుకని ? ? ?

(రెండు కొమ్మలమధ్య ఒక పావురం కనబడుతుంది, వెనక స్వచ్ఛమైన కాంతివలయంతో.)

పావురం.- ఎందుకనా ? ప్రతిమనిషిలోనూ కాస్తన్నా స్వార్థం ఎప్పుడూ వుండడం వల్ల! అధికారంలో వున్న ఈ దురాశాపరులు యీ స్వార్థానికే ప్రోత్సాహం యివ్వటంవల్ల. మనిషిలో మిశ్రమంగా వున్న మంచి చెడ్డల్లో చెడ్డతనానికే ప్రోత్సాహం ఎక్కువగా వుండటంవల్ల! ప్రక్కవాడి ప్రాణం నువ్వు తీసినన్నాళ్ళు ప్రపంచంలో శాంతి వుండదు. ఒకడి సౌభాగ్యానికి నువ్వడ్డు వెళ్ళకుండావుంటే, నీ సౌభాగ్యానికెవరూ అడ్డురారు. ప్రక్కవాడి కష్టాల్లో నువ్వు సహాయపడితే, నీకు వాడూ సహాయపడతాడు. ప్రపంచంలో ఈ సౌహార్ద్రత త్యాగశీలత ఎక్కువైతే అదే ప్రపంచ సౌఖ్యానికి దారితీస్తుంది. మానవాభ్యుద

---

* పెట్టెతో చేసిన పావురంగాని, నిజమైన పావురంగాని కనిపిస్తుంది. బొమ్మ పావురమైతే Lights off on పావురం.

యానికి ఆశాకిరణం అదొక్కటే ఒక్కటి! (పావురం అదృశ్య మౌతుంది)

మొదటి:- మానవాభ్యుదయానికి ఆశాకిరణం అదొక్కటే ఒక్కటి. ఎప్పుడీ ఒక్కకిరణం సర్వప్రపంచానికి వెలుగునిచ్చి అంధకారాన్ని పటాపంచలు చేస్తుంది!

(వేరే కంఠస్వరం వినిపిస్తుంది)

కంఠస్వరం.-సదా యుద్ధాన్ని వరించే స్వార్థపరుల్లారా! సదా కంఠాల్ని కత్తిరించే కసాయి సైనికుల్లారా! నన్ను చూసైనా మీ ప్రయత్నం ఆపండి నన్ను చూసైనా మీ యుద్ధప్రయత్నం ఆపండి. నన్ను చూసైనా మీ యుద్ధప్రయత్నం ఆపండి.

మొదటి:- ఏమిటి విచిత్రం! ఎవరీ మాట్లాడేది?

(వ్యక్తి తెల్లని దుస్తుల్లో ప్రవేశించి, సైనికుడివంక చూడకుండానే తనలో తాను మాట్లాడుకుంటూ ఒక ప్రక్కనుంచి మరోప్రక్కకు నడిచిపోతుంది)

మొదటి:- ఏమిటది? ఎవరునువ్వు?

వ్యక్తి:- యుద్ధరాక్షసి భీకర దంష్ట్రికల్లోపడి-కాలి కుమిలిపోయిన సామాన్యస్త్రీని

మొదటి:- ఇందాక వచ్చింది నువ్వేనా? నువ్వేనా? నిన్ను చూస్తే నాకు నా...

వ్యక్తి:- తోటి మానవుడే ధన ప్రాణ మానాల్ని దోచుకోగా, నీచపు బ్రతుకులో నిరుత్సాహపడి, నిండు ప్రాణాల్ని విడిచిన నిర్భాగ్యురాల్ని.

మొదటి.- అయితే నువ్వు?

వ్యక్తి:- ప్రపంచంలో తలయెత్తుకు తిరగగల ప్రాప్తం సంపూర్తిగా తుడుచుకుపోగా తెగించి భవబంధాల్ని తెంపి వేసుకున్న తెగువరిని.

మొదటి:- అయితే నువ్వు మనిషివి...

వ్యక్తి:- అసంతృప్తితో జీవించి అసంతృప్తిగా మరణించి అసంతృప్తితో యీ అనంత భూతలంచుట్టూ తిరుగుతున్న అమానుష అశాంతి రూపాన్ని!

మొదటి.- ఓ మనిషివికావూ ?

వ్యక్తి:- మనిషిని కాకపోయినా మాతృమూర్తినే దిక్కుమాలిన యీపిల్లల్ని విడచి ఏ లోకానికి పోను ? ప్రాణాల్ని తీసుకోగలిగాను గాని కడుపు తీపినెలా కోసుకోను

మొదటి,- నీ పిల్లల్ని నే చూస్తాను.

వ్యక్తి:- నీవోట్లు వెయ్యిమందైనా ఒక తల్లితో సమానం కాలేరు. నా పిల్లలు నా చేతులతో పెరిగితేనే నాకు తృప్తి.

మొదటి.- అయితే నన్నేం చెయ్యమంటావ్ ? ఏం కావాలంటావ్ ? అసలెందుకు వచ్చావ్ ?

వ్యక్తి:- ఏదీచెయ్యమనటం లేదు నీకు ఏమయినా చేతనయితే నాలాటివాళ్ళకు తయారు చెయ్యకు !

మొదటి:- అంటే నాకు అర్థంకావటం లేదు.

వ్యక్తి:- ఏ నిండు ప్రాణాల్నీ నిలువునా తియ్యకు. ఏ తల్లి గర్భానా చిచ్చు పెట్టకు (వెళ్ళిపోబోగా)

మొదటి:- ఆగు ఎవరు నువ్వు ? ఆ ఒక్కమాట చెప్పు.

వ్యక్తి:- ఒక సామాన్యురాల్ని.

మొదటి:- కాదు-నిన్ను చూస్తుంటే నాకు...

వ్యక్తి:- అంతే అంతకంటే నేనెవర్నీ కాను (వెళ్ళిపోయింది)

మొదటి:- (అటే చూస్తాడు కాసేపు తర్వాత క్రిందనున్న పిల్లవాడి కళేబరం వంక చూసి) ఇక్కడ ఒక పసివాడు, అక్కడ ఒక సైనికుడు. ప్రపంచం అంటే అర్థం కాని ఒక లేతమొగ్గ. ప్రపంచాన్ని చూసి వికసించి ఫలించబోయే ఒక లేత పిందె-ఇద్దరూ నిస్తబ్ధులైపోయారు. [కాసేపాగి పిల్లవాణ్ణి చేతుల్లో తీసుకుని ఆలోచిస్తూ వుండగా ముసలి వాడు వస్తాడు]

ముసలి:- ఏం ప్రపంచం, ఏం జీవితం. అబ్బ !

మొదటి:- (దగ్గరకెళ్ళుతూ) తాతా !

ముసలి - తాత. తాతనై వుండి కూడా ఎందుకు బ్రతికివున్నానా అని.

మొదటి.- ఏమయింది తాతా ?

ముసలి:- నీకు తెలుసుగా! నాకున్న ఇద్దరు కొడుకుల్లో పెద్దవాడు పోయాడు.

మొదటి.- ఆఁ!

ముసలి:- పెద్దవాడు పోయిన తర్వాత యీ చిన్నవాడి మీద నాకెంతో మమకారం పెరిగింది. పెద్దతనంలో పుట్టాడు కదూ ;

మొదటి:- అవును.

ముసలి.- వీణ్ణి చూసుకుని దుఃఖం దిగమింగుకునే వాణ్ణి.

మొదటి:- అయితే!

ముసలి.- ఈ కష్టసుఖాల్లో పండిపోయిన నాకు ప్రాణం విలువ బాగా తెలుసు.

మొదటి:- అంతేగామరి.

ముసలి:- ఎక్కడయినా ప్రాణం పోయిందనగానే నా మనస్సెంతో బాధపడుతుంది.

మొదటి.- నిజమే గాని మనం ఏం చెయ్యగలం ?

ముసలి·- మన చేతిలో ఏవో వుండదనితాము. కాని ఆ మాటలో మాత్రం ఏం ఉపశాంతి వుంది చెప్పూ యీ హృదయానికి?

మొదటి.- ఆఁ అదీ నిజమే.

ముసలి:- నేనిక్కడికి రాకముందు Air Raid వచ్చింది. చూశావ్!

మొదటి:- ఆఁ, అవును.

ముసలి:- ఆ Raid లో బాంబులు.

మొదటి:- అవును బాంబులు పడ్డాయి.

ముసలి.- అవీ-మా యింటికీ మీ యింటికీ మధ్యపడ్డాయి.

మొదటి.- (నిర్ఘాంతపోయి) ఆ!

ముసలి:- మా ఇంట్లో సహం కూలిపోయింది. మీ యిల్లూ సహం కూలి పోయింది.

మొదటి:- ఎవరికేం దెబ్బలు తగలలేదు కదా !

ముసలి.- బాంబు పడటానికి ముందే నేనిక్కడికి వచ్చాను కదూ ? దెబ్బలు తగలటానికి మా యింట్లో ఎవరూ లేకపోయారు.

మొదటి:- మా యింట్లో?

ముసలి:- మీ యింట్లో మీ కుర్రాడికి,

మొదటి:- దెబ్బతగిలిందా ?

ముసలి:- ఆఁ దెబ్బతగిలి పోయాడుట.

మొదటి:- తాతా !

ముసలి:- ఏడ్చి ఏం ప్రయోజనం నాయనా- సత్యాన్ని యివాళ కాకపోతే రేపైనా తెలుసుకోవాలి. అక్కడంతా గలభాగా వుంది. నీ భార్య కనుపించలేదు. నేవెళ్ళేటప్పటికి రెండో పిల్లాడు ఉయ్యాల్లో వంటరిగా ఉన్నాడు.

మొదటి:- రెండో పిల్లాడా !

ముసలి.- ఈ గలభాలో నీ భార్య ఏమయిందో తెలియదు.

మొదటి:- నా భార్యా !

ముసలి:- మీ పెద్ద పిల్లాడి శరీరమేమయిందో?

మొదటి.- ఏమవలేదు తాతా ! ఇదిగో (పిల్లాడి శరీరం చూపిస్తాడు)

ముసలి:- ఇదా ? ఇక్కడి కెలావచ్చింది !

మొదటి:- నా భార్య తెచ్చియిస్తే వచ్చింది.

ముసలి:- తెచ్చియిచ్చిందా ?

మొదటి:- ఆ, నేనే భర్తనని తెలియక నా చేతికే యిచ్చింది

ముసలి:- ఇక్కడికి వచ్చిందా ?

మొదటి - వచ్చింది. నే లేనప్పుడు తనకు జరిగిన అన్యాయమంతా చెప్పింది. రెండో కొడుకు సంగతి చెప్పింది. ఈ పిల్లవాణ్ణి పాతిపెట్టుకోమని వెళ్ళి-

(దుఃఖావేశంతో మాట్లాడలేక పోతాడు)

ముసలి:- వెళ్ళి వెళ్ళుతూ దోవలో ఆత్మహత్య చేసుకుంది. నేను తిరిగి వస్తూంటే దోవలో ఆ శవం కనిపించింది.

మొదటి:- నాకా ఆత్మ కనుపించింది.

ముసలి:- భగవాన్! (నిట్టూరుస్తాడు).

మొదటి:- భగవంతుడేంచేశాడు తాతా? సుఖపడమని యీ ప్రపంచంలో పుట్టించాడు. చేతకాక మనమే జీవితాన్ని దుఃఖభాజనం చేసుకుంటున్నాం.

ముసలి:- అంతే, అంతే! కానియ్యి యీ కళేబరాన్ని, ఆ ఏడీ నీ స్నేహితుడు?

మొదటి:- ఇదుగో ఇక్కడ సరిగా చూడలేదుగా యిందాక. ఇప్పుడు చూడు.

ముసలి:- చూడకేం? చూశాగా.

మొదటి:- చూశావా? గుర్తుపట్టలేదుకదూ?

ముసలి:- ఊహూఁ, ఎవరేమిటి? (వెళ్ళి చూస్తాడు)

మొదటి:- చూశావా సరిగ్గా. నీ కొడుకు,

ముసలి:- (పెద్దగా వెర్రిగా నవ్వి) కొడుకు మా చిన్నవాడు. పెద్దవాణ్ణి వెతుక్కుంటూ చిన్నవాడూ వెళ్ళాడు.

మొదటి:- తాతా!

ముసలి:- వెళ్ళాడు. ఇక ఎప్పటికీ తిరిగిరాకుండా-పెళ్ళాం పిల్లల్ని బాధ పెట్టక్కర్లేకుండా-

మొదటి:- తాతా! ఏమిటిది?

ముసలి:- పోతే, ఒక్క ముసలితండ్రిని దుఃఖపెట్టాడు. అంతేగా! అదేం మించిపోయిన పనికాదుగా (నవ్వుతాడు)

మొదటి:- (దగ్గరకెళ్ళి) ఆగు తాతా!

ముసలి:- నేనేం దుఃఖిస్తాననుకున్నావా? పట్టు. యిద్దర్నీ సమాధి చేద్దాం. ఇంతకంటె ఘోరమైన పనులే చేశాను యీ చేతుల్తో. ఎంత గుండె

పగిలే ఘోరకృత్యాలు చెయ్యటానికైనా మొదటసారే కాస్త భయ పడతాం. తరవాత అవి చాలా సుంభకార్యాలు. చాలా తేలిక పనులు రా దుఃఖించకు, రా (వెళ్ళిపోతాడు) *

మొదటి.- ఆగు తాతా! పిల్లిద్దరూ యుద్ధపిశాచానికి బలియైన అమాయకులు.

ముసలి:- తంత్రికడుపులో చిచ్చుపెట్టి కళ్ళుమూసిన కఠిన హృదయులు

మొదటి:- పిల్లిద్దర్నీ ప్రాముఖ్యంగా ఈ మధ్యన సమాధి చేద్దాం యిక్కడి- ఇంతవరకూ ఏ సమాధి లేనిచోట.

(ప్రతిధ్వని మూడుసార్లు వినిపిస్తుంది)
("ఇంతవరకూ సమాధిలేని చోటా?
ఇంతవరకూ సమాధిలేని చోటా?
ఇంతవరకూ సమాధిలేని చోటా?"

మొదటి:- అవును కాదా?

ప్రతిధ్వని:- కాదు...కాదు...కాదు...

మొదటి:- ఇక్కడిదివరకే సమాధి వుందా?

ప్రతిధ్వని:- ఇక్కడిదివరకే చాలా సమాధులున్నై!
ఇక్కడిదివరకే చాలా సమాధులున్నై!!
ఇక్కడిదివరకే చాలా సమాధులున్నయ్!!!

ముసలి:- అవును. భూమాత కడుపు పగిలి ఏడ్చేవరకూ అనేక మంది, అనేక చోట్ల సమాధి చేయబడ్డారు. ఆ సంగతి మనం విస్మరించాం. ఎంత మంది మనలాంటివారి మనోక్షోభను మాహూళ గర్భస్థం చేసుకుందో యీ శతాబ్దాల కాలపరిమితిలో!

మొదటి:- (నెమ్మదిగా ప్రారంభిస్తాడు) అయితేకానీ, ఇది మొదటిది కాకపోతే ఆఖరిది కానియ్యి. ఇక్కడే కాదు. ఎక్కడా ఏ ఒక్కడూ ఏ యుద్ధానికీ ప్రాణం అర్పించవలసిన అవసరం లేనంతవరకూ యుద్ధ పిశాచాన్ని శాశ్వతంగా మాస్థాపితం చేసేంతవరకూ, నేను నిద్రపోను. నిద్రపోతుంటేనే యుద్ధరాక్షసి రాజ్యమేలగల్గుతోంది.

* ప్రతిధ్వనులు. Lights dim. get ready for sunrise.

నిద్రపోతుంటేనే తరతరాలుగా మానవుణ్ణి తన బానిసగా చేసుకొంటోంది స్వార్థాన్ని రేకెత్తించి మానవుణ్ణే మానవునిమీదికి పురికొల్పి మానవుడి చేతనే కూట హత్యలు చేయిస్తూ మానవాభ్యుదయానికే అభ్యంతరం కలిగిస్తోంది. ప్రపంచానికిది బోధించి, ప్రపంచంలో యుద్ధం తల ఎత్తకముందే ప్రచారం చేసి, అంతా యుద్ధంమాట మరచిపోయేవరకూ, ప్రపంచం నలుమూలలా నిత్య శాంతిశోభలు పచ్చతోరణాలతో ప్రభవిల్లేవరకూ, స్వచ్ఛంద సేవా వాంఛ, స్వార్థరహిత జీవితప్రవృత్తి ప్రతివాని మనసులో పాదుకునే వరకూ, సర్వమానవ సమానత్వమే బంగా, అహింసే ఆయుధంగా, అభ్యుదయమే ఆశయంగా వర్ధిల్లేవరకూ యీ శాంతి సందేశం ప్రతి దేశంలో, ప్రతి గ్రామంలో, ప్రతి హృదయంలో మారుమ్రోగేవరకూ, ఈ 'శాంతి' చక్కనితల్లి వెచ్చని సందిట్లో మైమరచి మానవుడు నిద్రించగలిగేవరకూ నేను నిద్రపోను. వెళుతున్నాను తాతా! ఈ జరిగిపోయిన వృత్తాంతాన్ని నువ్వే సమాధి చేసుకో. (వెళ్లాడు)

ముసలి:- వెళ్ళు. నాయనా, వెళ్ళు, ప్రపంచంలో కరడుగట్టిన కఠిన హృదయాలు చాలా వున్నై. నీ దీనాలాపంలో కఠినత్వాన్ని కరిగించివెయ్యి. ప్రపంచం నలుమూలలా నీ కంఠధ్వని ప్రతిధ్వనించేటట్లు ప్రచారం చెయ్యి. నీ జీవిత లక్ష్యమే ప్రతి మనిషి పరమలక్ష్యంగా పరిణమించే వరకూ తిరిగిరాక. ఓ నిర్వికల్ప నిర్వికారమూర్తీ! అనేకమంది మహాత్ముల అమర సందేశం అరణ్యరోదన మయిపోయిందింత వరకూ. ఈ సారయినా యీ సామాన్యుని కోరిక సఫలం చెయ్యి. ఇదే నా "ప్రార్థన"—
(ప్రత్యవటం ప్రారంభించగానే)

(తెర.)



## పాత్రలు

వెంకన్న పంతులు :

రిటైర్డ్ హెడ్ గుమాస్తా

వెంకట్రావ్ :

పెద్దకుమారుడు

ప్రకాశం :

చిన్న కుమారుడు

శేషమ్మ ·

వెంకన్న పంతులు భార్య

(రంగంమీదికి రాదు)

శేషాచలంచెట్టి

వ్యాపారస్తుడు; కాంగ్రెసు వాది

వెంకటేశ్వర్లు :

ప్లీడరు గుమాస్తా

వెంకన్న పంతులింట్లో మధ్యసావిడి. గోడకు పాత గడియారం, దాని ప్రక్కగా ఒక పెద్ద ఫోటో వుంటుంది. క్రింద డ్రాయరు. దానిపైన చిందరవందరగా కొన్ని పుస్తకాలు, మందుసీసా, ఔన్సు గ్లాసు వుంటాయి. డ్రాయరుకు ఎడమభాగంలో రెండు పెట్టెలుంటాయి. వాటి దగ్గరగా కోటు స్టాండు, దానిపైన కొన్ని పాత చొక్కాలూ వుంటాయి ఆ స్టాండు ప్రక్కన నీళ్ళబిందె, చెంబూ వుంటాయి.

డ్రాయరుకు కుడివైపున నులకమంచం నిలబెట్టి వుంటుంది. కుడి వైపునున్న గదిలో శేషమ్మ రోగంతో పడుకొనివుంది.

[గడియారం ఆరుగంటలు కొడుతుంది. ఆరేసిన గుడ్డలన్నీ పోగేసుకుని ఎడమ వేపునుంచి వెంకన్న వస్తాడు. ఆ గుడ్డలన్నిటినీ మధ్యగా పడేసి, వాటిలోని చీరెకు కుచ్చెళ్ళు పెడుతూ]

వెంకన్న:- ఇంటిపేరు కస్తూరివారు, ఇంట్లో గబ్బిలాల కంపని వూరికే వచ్చిందా సామెత? నా లాంటి అభాజనుడుండబట్టే వచ్చింది. ఎంత బ్రతికితే యేం లాభం? కొమ్ములు తిరిగిన జడ్జీలు, మునసఫ్‌లు, హెడ్‌గుమాస్తా వెంకన్న పంతులంటే యెంత ఆదరించేవారు? ఎంత గౌరవించేవారు? (చీరె చేతిలోనుంచి జారిపోతుంది) ఈ చీర కేమొచ్చిందోగాని, చేతిలో నిలవనంటుందే! దీని తస్సాగొయ్యా! నేనంటే దీనికికూడా చులకనే! అయినా, దీని తప్పేముందిలే! ఆ వాసన అటువంటిది. (భార్యను చూస్తాడు)

శేషమ్మ:- .........

వెంకన్న:- ఔనులేవె! నా మాటలన్నీ నీకు బాధగానే వుంటాయ్. నావన్నీ అఘాయిత్యం మాటలు, నీవన్నీ ముద్దులు మూటలుగట్టే మాటలు. మంచంలో పడుకొని యేమైనా అంటావ్! రానియ్యి చెబుతా!

శేషమ్మ:- .........

వెంకన్న:- ఎవరా? మన డాక్టరే.

శేషమ్మ:- .........

వెంకన్న:- (వెటకారంగా) "చెప్పండి" అని పెద్దరాగం తీశావే! చెప్పడనికదూ నీ వుద్దేశం? "ఓ డాక్టరుగారూ! ఒకరి రక్తాన్ని తీసి మరొకరి

కెక్కించినట్టు, మా ఆవిడగారి జబ్బును తీసి, నా వంట్లోకి యెక్కించండి'' అని అడుగుతాను. ఇక మంచాన పరుపూ, దిండూ పక్కేసుకుని హాయిగా పడుకుంటా?

[గడియారం చూచి]

ఈ రోజు కూడా డాక్టర్ రాదల్లేవుంది. ఎట్లా వస్తాడు! ఆయన తప్పేముంది? పోనీ, పొద్దునగాచిన కషాయమైనా తాగు. (ఔన్సు గ్లాసులో పోస్తూ) ఉన్నంతవరకు గొంతులో పొయ్యాలిగా?

[తెస్తూ ఆగిపోతాడు]

శేషమ్మ:- .........

వెంకన్న:- కారణం? ఎందుకు తాగవ్?

శేషమ్మ:- .........

వెంకన్న:- చస్తా చస్తానంటూ ఎవరిని బెదిరిస్తావ్? ఈ కషాయం...

శేషమ్మ:- .........

వెంకన్న:- అదిగో మళ్ళీ ఆ మాటేనా? గుండె అసలే బలహీనంగా వుందాయె. కనీసం కషాయమైనా...

శేషమ్మ:- .........

వెంకన్న:- సరే కానియ్యి! (మందును బల్లమీద పెట్టి, గుడ్డలను మడత పెడుతూ) సత్యాగ్రహం ఆరంభించావన్నమాట! ఇలాంటి వెర్రి మొర్రి సత్యాగ్రహాలకు అదిరిపోయి, తుర్రుమని తోక పీకటానికి నేనేం అల్లాటప్పాగాడ్ని కాదు. చస్తానంటూ బెదిరిస్తున్నావ్‌గా? సరే కానియ్యి. ఉండుండు. కొడుకులిద్దర్నీ కొంపచేరనియ్యి. కూతురెట్లాగు రాదులే. వాళ్ళు దాన్ని పంపేది? నీకు జబ్బుగా వుంది, పిల్లనొకసారి పంపితే చూసి వస్తుందని నాలుగు ఉత్తరాలు రాశాను. ఒక్కదానికి కూడా సమాధానం లేదు. ఈ దౌర్భాగ్యపు సంబంధం తెచ్చి మా దుంప తెంచావ్!

శేషమ్మ:- .........

వెంకన్న:- ఛీ ఛీ ! నోటికి హద్దుపద్దు వుండాలి నేనా దాని గొంతు కోసింది? ఛీ ఛీ ! (గడ్డలన్నిటిని డ్రాయరువేపుకు విసరివేస్తాడు) సిగ్గులేకుండా మాట్లాడితె సరేనా? ఈ సంబంధం కుదిర్చిందెవరు? నువ్వేకాదు? నీ పింతల్లి కొడుకు మురిసిపోయినావ్‌గాని, కట్నంలో ఒక కానీ వదిలాడు? అమ్మపుట్టిల్లు మేనమామ దగ్గిరని, మీ వాళ్ళబతుకు నా దగ్గరా చెప్పడం? మీ వాళ్ళంతా...

[శేషాచలంచెట్టి వస్తాడు]

దగుల్బాజీలు, వుండాకోరులు, పొగరుబోతులు...

చెట్టి - అయ్యోరామ! ఈ దండకం ఎక్కడిదండి పంతులుగారూ?

వెంకన్న:- (సర్దుకొని) రా! చెట్టి. రా కూర్చో. ఎంతసేపైంది వచ్చి?

చెట్టి.- మీరు కలవిస్తుండారే "వుండాకోరులు, పొగరుబోతులు" అప్పుడొచ్చా

శేషమ్మ:- .........

చెట్టి:- (శేషమ్మతో) ఆఁ! నేనేనండి, శేషాచలంచెట్టిని. మీ వంట్లో యెట్లా వుంది శేషమ్మగారూ?

శేషమ్మ:- .........

చెట్టి.- అయ్యో! అట్టానా, (వెంకన్నతో) సూదిమందిప్పించండి పంతులుగారు? అమ్మగార్కి నయమౌతుంది. (నాలుగు మూలలూ చూసి) అబ్బాయిగార్లు కనిపించరేం?

వెంకన్న:- ఇంటర్వ్యూకు రమ్మని వుత్తరమొస్తే హైదరాబాద్ వెళ్లారు పొట్టతిప్పలకు పాటుపడాలిగా?

చెట్టి - మీకేమండి? రత్నాల్లాంటి కొడుకులున్నారు. ఒకరు యం.ఏ; మరొకరు బి ఏ. రేపటినుంచి లక్ష్మి మీ యింట్లో పీటేసుకు కూర్చుంటుంది. నాలుగు చేతులా సంపాదనే

వెంకన్న:- ఆ దేవుడి దయవల్ల ఆ రోజే వస్తే, మా బరువు తగ్గుతుంది. మీ బాకీ కూడా తీరుతుంది.

చెట్టి:- బాకీని మీ అంతట మీరే చెల్లేస్తున్నారుగాని, నేను నోరుతెరచి అడిగానా యెన్నడైనా? ఈ రోజు ఒకటైనా యిస్తారేమో, దాన్ని ఆ ఇన్‌కంటాక్సు వాళ్ళ మొహానపారేద్దామని వచ్చాను.

వెంకన్న:- ఇంకెంతుంది మీ బాకీ?

చెట్టి:- (జేబులోనున్న ప్రోనోటు తీసిచూసి) పెద్దబ్బాయి.గారి చదువుబాపతేగా తీమరిచ్చింది, అమ్మాయిగారి కళ్యాణం బాపతుపైకం అట్టాగేవుంది.

శేషమ్మ:- .........

చెట్టి:- (శేషమ్మతో) పిల్లబాంఛ? ఏం చెప్పను శేషమ్మగారూ! మా యింటిది ఒకటే యేడుపు ఊరుకోదే యేడిస్తేమాత్రం పిల్లలు పుడతారా అని నే నెంత జెప్పినా వినదు పంతులుగారూ! ఆంజనేయుడి గుడి చుట్టూ అయిదురోజుల నుంచి ప్రదక్షిణాలు చేస్తున్నది. ఆ స్వామి అనుగ్రహించి ఓ పిల్లో పిచో పుడితే, వారి పేరు పెడతామని ముడుపు కూడా కట్టాం

వెంకన్న:- మంచిపని చేశారు నీ దైవభక్తి నీ మంచితనం, నీ త్యాగం ఊరికే పోతాయా? అంతా ఆ దేవుడిదయ.

శేషమ్మ:- .........

వెంకన్న:- అబ్బా! నీ కెందుకే యీ గొడవ? కళ్ళుమూసుకుని పడుకోరాదూ?

చెట్టి.- ఎందుకండీ అట్టా కసురుతారు? (శేషమ్మతో) మీరు చెప్పినట్టే 40 రోజులు చేస్తుందిలెండి స్వామి ప్రదక్షిణాలు. మీరు చాలా నీరసంగా వుండారు, పడుకోండి అమ్మగారు!

వెంకన్న:- నా మాట విని, స్వామిని నమ్మండి. మీకు సంతానం తప్పక కలుగుతుంది. మరి, వెళ్ళిరా! నా కింటిలో తొందరపనుంది.

(వెళతాడు)

చెట్టి.- (వెళ్ళేవాడల్లా ఆగి) పంతులుగారూ!

వెంకన్న:- (లోపలినుంచే) ఎందుకు?

చెట్టి:- నేనిందాక మనవి చేసుకున్నదే. ఈ రోజు ఎట్టా గడుస్తుందా అని. (వెంకట్రావ్ సూట్‌కేసుతో వచ్చి, కోట్‌స్టాండ్ దగ్గరికెళ్ళి కోటును విప్పుతూ వుంటాడు.)

వెంకన్న - (వచ్చి చూస్తూవుంటాడు)

చెట్టి.- (వెంకన్నతో) మీ పెద్దబ్బాయిగారి మొహం...

వెంకట్రావ్.- వాడినట్టుందా? మీకు వెంటనే తెలుస్తుంది. చెట్టిగారా మరే వన్నానా? బ్లాకును వైటుగా, వైటును బ్లాగ్గా మార్చే వాళ్ళకు ఇదొక లెక్కా?

చెట్టి.- ఎంతలావు మాటన్నారు వెంకట్రావ్‌గారూ!

వెంకన్న - ఏమిట్రా నీ మాటలు, చిన్నాపెద్దా లేకుండా? వెళ్ళి కాళ్ళ కడుక్కో. నీతో పనుంది.

[వెంకట్రావ్ చెంబుతో నీళ్ల ముంచుకుని ఎడమవైపుకు వెళ్ళాడు.]

చెట్టి - అదికాదు పంతులుగారూ! నే నేమన్నానో మీరే విన్నారుగా! చెప్పండి న్యాయం. చెయ్యి చెయ్యి చేరిస్తే చప్పుడేనా? ఇక నా పెద్దమనిషి తనమేముంటుంది.? పిదపకాలమై పోయిందండి- ప్రతి ఒక్కరికి తామసమే! సహనం, శాంతం సన్నగిల్లిపోయింది. మరో నాలుగు కాలాలపాటు ఆ మహాత్ముడు, మన భారతజాతి పిత, శ్రీ మోహనదాస్ కరంచంద్ గాంధిచెట్టిగారుంటే ఎంత బాగుండేది? ఈ వుడుకు రక్తాలన్నిటినీ...

వెంకట్రావ్:- (టవల్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చి) డిటెన్యూలని పేరు తగిలించి జైల్లో నెడతారు అంతేగా? ఈ రోజులు మీవే లెండి. ఊరికే ధరించారా టోపీ, ఆ ఖద్దరు?

చెట్టి.- కథ చాలా దూరకొచ్చిందే! వెళ్ళినచోట కమ్యూనిస్టుల్తో పొత్తు కలిసింది గాబోలు! నిప్పులవర్షం కురిపిస్తున్నారు.

వెంకట్రావ్ - ఇంకేం? మీరు లాఠీలు బయటికి దీయించండి.

చెట్టి - ఆఁ! ఆఁ!

వెంకన్న:- చాలుచాల్లే ప్రయోజకత్వాలు! చదవేస్తే ఉన్న మతికూడ పోయిందట!

చెట్టి:- అయ్యో! నే నేమన్నానండి? అయినా మీరుమీరు ఒకటే మధ్య నాకెందుకులెండి. నా మాటేదో చెబితే నా దారిన నేను పోతాను.

వెంకన్న:- ఇది సమయం కాదుగాని, మళ్ళీరా మాట్లాడదాం.

చెట్టి:- అట్లాగేలెండి పంతులుగారూ (నమస్కరిస్తూ) వస్తా! (వెళ్లతూ, వెంకట్రావుతో) శలవిప్పించండి పెద్దబ్బాయిగారూ!

వెంకట్రావు:- ఓ యస్! ఇచ్చాం. ఇక దయచెయ్యి!

(చెట్టి నిట్టూర్చి వెళ్తాడు)

వెంకట్రావు:- (వెళ్లతూ) అమ్మా!

వెంకన్న:- ఇలారారా! నీతో మాట్లాడాలి.

వెంకట్రావు:- (సందేహిస్తాడు)

వెంకన్న:- నిన్నే పిలిచేది? వినబడటంలా?

వెంకట్రావు:- అమ్మను చూచివస్తాను

వెంకన్న:- నిద్రపోతూంది. లేపకు.

వెంకట్రావు:- (నడ్డినచేతులు పెట్టుకుని ఆలోచిస్తాడు.)

వెంకన్న:- రమ్మంటే అట్టా నడ్డిన చేతులు పెట్టుకు చూస్తావు ఏమిట్రా! నీ ఉద్దేశం?

వెంకట్రావు:- (వస్తూ) ఉద్దేశ్యాలకేం? సాగాలిగాని లక్షున్నాయ్.

వెంకన్న:- ఆ లక్షలో ఒకటి చెబుదూ. కొడుకు ప్రయోజకత్వం వినైనా సంతోషిస్తాను.

వెంకట్రావు:- (చెప్పబోయి ఆగుతాడు)

వెంకన్న:- ఏం? ఆగుతావేం? అనదల్చుకుందేదో బయటకే అను. ఇంకా సందేహమెందుకు ?

వెంకట్రావు.- (మాట్లాడడు.)

వెంకన్న:- బుద్ధిలేకపోతేసరి? ఆ పెద్దమనిషిని పట్టుకుని అట్టా పేల్తావుట్రా? ఆమాత్రం మర్యాద తెలియక్కర్లా?

వెంకట్రావు:- మనగొడవ అతనికెందుకు తనపని చూచుకోకుండా?

వెంకన్న:- ఓహూ! అతనంటే అంత తెలిగ్గావుందేం నీకు? అతనే ఆ అప్పివ్వక పోతే నువ్వు చెల్లెలి పెళ్ళి చేసేవాడివె! పెద్దకబుర్లు చెబుతావు పైగా! నీలాంటివాళ్ళని నేనేంతమందిని చూశానో నా సర్వీసులో?

వెంకట్రావు:- క్షమించండి. నేనే మన్నేదు. అనవసరంగా మీరే......

వెంకన్న:- అంటున్నానా? కడుపు నిండిందిగాని కట్టిపెట్టవోయ్ ఆ వాగుడు. హుఁ!

వెంకట్రావు:- (వెళ్తూంటాడు).

వెంకన్న:- వెళతావేమిరా?

వెంకట్రావు:- పిలిచిన పని అయిపోయిందిగా!

వెంకన్న:- నువ్వు వెళ్ళినపని ఏమైంది?

వెంకట్రావు:- ఉద్యోగం ఇస్తామన్నారు.

వెంకన్న:- ఎప్పుడు?

వెంకట్రావు:- 3rd Five year plan లో.

వెంకన్న:- ఇంకానయం షైజన్మలో ఇస్తామన్లా. అందాకా యేపూళ్ళేలదలచుకున్నావు?

వెంకట్రావు:- ఏలటానికేం, మారాజులాగా యేలవచ్చు. కాని వున్న చిక్కల్లా ఒక్కటే.

వెంకన్న:- ఏంటది?

వెంకట్రావు:- ఖజాన ఖంధ్యం వేలాడుతుంది.

వెంకన్న:- హైదరాబాదు వెళ్ళి ఇదా నువ్వు నేర్చుకొచ్చింది? ఎంత చదివితేనేం? ఎన్ని డిగ్రీలుంటేనేం? ప్రపంచంలో బ్రతికే సూత్రం నేర్చుకోవాలి. రికమెండేషన్ లేంది యీ రోజుల్లో వుద్యోగమిస్తారా? ఏ మంత్రిగారి కడుపో కాళ్ళో పట్టుకొని పని పూర్తిచేసుకోవాలనన్న జ్ఞానముండొద్దూ? ఆ మాత్రం బుర్రవుంటేగా దొరగారికి? నాదగ్గర మాట్లాడమంటే ముందు వెనుక తడుముకోనక్కరలా! ఎందుకురా

నీ చదువంతా? ఈ అప్పుల వాళ్ళకు నేనెట్లా సమాధానం చెప్పాలి? రామచంద్రా! ఎన్ని కష్టాలు పెడుతున్నావు తండ్రీ! నేను పదుగురిలో తలెత్తుకుని తిరగాలని నీ కుందిరా? ఇంతకంటె ఆ అప్పులవాళ్లు, నువ్వూ కలసి నా గొంతు నులిమి చంపగూడదూ, పీడ విరగడై పోతుంది?

వెంకట్రావు:- నాన్నా!

వెంకన్న:- నా...న్న! ఈ నాన్నకు టావు రాకుండా వుంది. దానికూ్కడా అసహ్యమే నేనంటే!

శేషమ్మ:- ......

వెంకట్రావు:- అవునమ్మా! నే నే (తండ్రితో) అమ్మ పిలుస్తూంది. (వెళ్ళబోతాడు)

వెంకన్న:- (చెయ్యిపట్టుకుని ఆపి, ముందుకు తీసుకొచ్చి, రహస్యంగా,) గంపెడంత ఆశతో యెదురుచూస్తున్నది మీ అమ్మ. మీరేవో పెద్దపెద్ద ఉద్యోగాలుజేసి, మన ఋణాలు, వణాలు తీరుస్తారని ఆ పిచ్చిదాని నమ్మకం. అసలే జబ్బుగా వుందా? దానికితోడు నీకు ఉద్యోగం దొరకలేదంటే, దానిగుండె ఆగిపోవచ్చు. ఒకవేళ మీ అమ్మ అడిగితే, ఆఫీసర్ వుద్యోగమొచ్చిందని చెప్పు తడుముకోకుండా.

వెంకట్రావు:- అబద్ధాలా? చేసిన పాపం చాలునాన్నా క్షమించండి.

వెంకన్న:- ఈ కాస్తలో కొంప మునగదులే!

వెంకట్రావు.- మునిగినాసరే! ఈ పాడుపని నేచు చెయ్యను.

వెంకన్న:- పాడుపనా? పోసీ! నువ్వు వెళ్ళినచోటల్లా నీకుద్యోగం దొరకని మాట అబద్ధమా? ఎందుకూ పనికిరాని నీ చదువు, నా కష్టార్జితమంతా హరించినమాట అబద్ధమా? మనం ఋణాల పాలైనమాట అబద్ధమా? ఇన్ని అబద్ధాలుండగా యీ ఒక్క అబద్ధంతో భూమి బద్దలు కాదులే!

శేషమ్మ:- ............

వెంకన్న:- (విసుగ్గా) అబ్బబ్బ! వస్తాడులే! ఎందుకు గొంతు చించుకుంటావ్? నన్ను మాట్లాడనీ!

వెంకట్రావు:- ఎంత మాట్లాడినా యిదేగా ? వస్తున్నానమ్మా ! (లోపలికి వెళతాడు.)

వెంకన్న:- (విసుగ్గా) ఛీ ఛీ వెధవజన్మ ! ఈ పొడుబతుకు బతకటం కంటె కళ్లు రెండూ మూసుకొని రైలుకింద పడితే నయం

వెంకటేశ్వర్లు:- (మధ్యలోవచ్చి, నవ్వుతూ) అది అంత తేరగా వుందనుకున్నావా వెంకన్నా ? ప్లాటుఫారం మీద పోటీలు పడుతున్నారు, ఆ చావు కోసం. ఎవరో తెలుసా ? పరీక్షల్లో తప్పి యింటిముఖం చూడలేక ప్రాణాల్ని తృణప్రాయంగా త్యాగం జేసే వీరపుత్రులు. నువ్వాపని చేయలేవుగాని నా మాట విని, వూరుకో !

వెంకన్న:- అప్పన్లే వెంకటేశ్వర్లూ ! నీ భయం నీది. నేను కాస్తాగుటుక్కుమంటే నీ బాకీ ఏమౌతుందో ననుకుంటున్నావు. సహజమేలే !

వెంకటేశ్వర్లు:- బలేవాడివే ! నా చెవులు కుట్టింది కూడా కంసాలే. పిచ్చివాడా ! భయం నాకెందుకయ్యా ? వుంటే బాకీలు ఎగేసే వాళ్ళకుండాలి గాని.

వెంకన్న:- నన్నెంత నీచంగా భావిస్తున్నావ్ వెంకటేశ్వర్లు? నీ బాకీని ఎగవేస్తానని అనుకుంటున్నావు ? నేనిప్పుడు లాంగుబాటులోవున్నాను కదాయని నీ చిత్తం వచ్చినట్టు మాట్లాడటం ధర్మం కాదు. ఆత్మాభిమానం నాకింకా వుంది. నువ్వనుకున్నంత పతనానికి నే నింకా దిగిపోలేదు. నాలుగు నెలలు ఓపికపట్టు, అణాపైసలతో అవతల పారేస్తాను.

వెంకటేశ్వర్లు:- పారేస్తావుగా ? దర్జా అంతా వెలగబోశావే ? ఇప్పుడు పారేయ రాదు అంత మగతనముంటె? ఇల్లాంటి వాయిదా లెన్నైనాయ్ ? బతకని బిడ్డ బారెడని మాటలు మాత్రం కోటలు దాటుతున్నాయ్ ! (ప్రకాశం హోల్డాల్‌తో వచ్చి అతని వెనగ్గా నిలబడతాడు) (బారలు జాపుతూ) మింగటానికి మెతుకు లేదుగాని మీసాలకు సంపెంగ నూనెట !

ప్రకాశం:- ఉందా సంపెంగనూనె (భుజంతట్టి అడుగుతాడు.)

వెంకటేశ్వర్లు:- (మాట్లాడడు)

ప్రకాశం:- నోరు పెగల్దేం యిప్పుడు ? (వెళ్ళి హోల్డాల్‌ను పెట్టెమీద పెట్టి) నోటికివచ్చినట్టు పేల్తున్నావు. యిది నీ బాబుగాడి యిల్లా ?

వెంకటేశ్వర్లు:- ఎవరి బాబుగాడిల్లో రేపు దావా పడినప్పుడు తెలుస్తుంది.

ప్రకాశం:- (మీదికొస్తూ) ఏమిటి తెలిసేది నీ మొహం ?

వెంకన్న:- ఆగు ! ఇదో గొప్పనుకుంటున్నావా ? పో అవతలికి. ఇంటి కొచ్చిన వాళ్ళను గౌరవించాలని తెలీదూ ?

ప్రకాశం:- వీడ్నా ? వీడ్ని ఎలా గౌరవించాలో నాకే తెలుసు. (వెంకటేశ్వర్లుతో) మా నాన్నంటె నీకింత అలుసుగా వుందేం ? Take care !

వెంకటేశ్వర్లు:- ఇదిగోనండోయ్ వెంకన్నపంతులుగారూ ! ఇక క్షణం ఆగను. తేల్చి చెప్పండి తండ్రి కొడుకులు ?

వెంకన్న:- చెప్పానుగా నాలుగు నెలలాగమని.

వెంకటేశ్వర్లు:- వీల్లేదు వడ్డీతోసహా కట్టాలిప్పుడే !

ప్రకాశం:- నోర్ముయ్ !

వెంకన్న:- నువ్వు నోరుముయ్యరా ప్రకాశం ! మధ్య నీ కెందుకురా ? పోవేం అవతలకి ?

ప్రకాశం:- నువ్వుండు నాన్నా ! ఆ అదిరిపాటేదో అంతుతేలుస్తాను.

వెంకటేశ్వర్లు:- ఏడిశావు ! అంత మగతనముంటె కక్కరా నా పైకం? కక్కు? సొరకాయలు కాదు వూరికే కోసిపారెయ్యటానికి ? ఒకటా రెండా ? వెయ్యి రూపాయలు మీ మొహాన పోశాను. అయ్యా, బాబూ అంటూ నా కాళ్ళావేళ్ళాపడితే యిచ్చానురా అంత డబ్బు ? ఆ డబ్బే నే నివ్వకపోతే అబ్బాయిగారికి రోగం బాగా కుదిరేది. బి. ఏ. కాదు, నుయ్యే గతయ్యేది.

ప్రకాశం:- (మీదికివస్తూ) రాస్కెల్ ఏం కూశావు ? పళ్లు రాల గొడతాను.

వెంకన్న:- (అడ్డుపడుతూ) ప్రకాశం ! నీకు పిచ్చెక్కిందా ఏమిరా ? చెప్పేది నీకుకాదూ ? నువ్వు మనిషివా పశువ్వా ?

ప్రకాశం:- వదులు నాన్నా, ఆ పశువు నాలుక పీకి పారేస్తాను.

వెంకటేశ్వర్లు:- (పంచ పైకి కడ్తూ) రారా కుంక ! ఒక్క దెబ్బతో నెత్తురు కక్కి చస్తావ్. వదలవోయ్ వాణ్ణి. వదులూ ?

ప్రకాశం:- బ్లడీ రాస్కెల్ ! అబ్బా ! నువ్వు వొదులు నాన్నా ! ఏం కూశావు ?

వెంకటేశ్వర్లు:- రారా ముండ ! రా గుద్దుకు చంపుతా ! రా .

[ఇద్దరినీ ఆగమంటాడు వెంకన్న. కొడుకుని అదమాయిస్తాడు. వెంకటేశ్వర్లును బ్రతిమాల్తాడు. కాని, యిద్దరూ వినరు. మాటలు పెరుగుతాయ్. చేతులు కలుస్తాయ్. చొక్కాలు చిరుగుతాయ్. వెంకన్న అడ్డుపడ్తాడు. కొన్ని దెబ్బలు వెంకన్నకు తగుల్తాయ్. ఆఖరున వెంకటేశ్వర్లు కొట్టిన దెబ్బతో వెంకన్న కూలబడతాడు. ప్రకాశం మితిలేని ఆవేశంతో వెంకటేశ్వర్లు మీదకు దూకబో తుండగా-వెంకట్రావ్ లోపల్నుంచి ఆదుర్దాగా వస్తాడు.]

వెంకట్రావు:- నాన్నా ! నాన్నా ! (దుఃఖం పొంగుతూ వుంటుంది.)

[అందరూ వెంకట్రావును చూస్తారు.]

వెంకట్రావు:- అమ్మ పలకటంలేదు. స్మారకం తప్పుతోంది. త్వరగా రండి. (వెళతాడు.)

[ప్రకాశం, వెంకన్న ఆదుర్దాగా లోపలికి వెళ్తారు.]

వెంకటేశ్వర్లు - పాపం పూరకేపోతుందేం ? దేవుడు లేడూ ? మంచీ మర్యాదా లేకుండా యింటికొచ్చిన పెద్దమనిషి మీద కలబడతాడూ? చేతిలో పైసా లేకపోయినా పొగరుకేం తక్కువలేదు. ఇవ్వలేకపోతె చచ్చినట్టు పడుండాలి. తండ్రి కొడుకులు వచ్చి నా కాళ్ళమీద పడరాదూ-ప్రోనోటు నిక్కడే ముక్కలు జేసి పోతాను.

వెంకన్న:- (విచారంగా రెండు చేతుల్తో దండంపెడ్తూ వచ్చి) వెంకటేశ్వర్లూ !

ప్రకాశం:- (వచ్చి) నే వెళ్ళి డాక్టర్‌ను పిల్చుకొస్తాను

వెంకన్న:- మన యింటికి యిక డాక్టర్ రాడు.

ప్రకాశం:- ఏం ? వైద్యం చెయ్యటం మానుకున్నాడా ?

వెంకన్న:- ఆయన వైద్యం చేస్తూనే వున్నాడు. కాని ఏమీ చెయ్యలేని వాళ్ళం మనమే.

ప్రకాశం:- నా కేం understand కావటంలేదు. మన మేం చెయ్యాలంటారు?

వెంకటే:- నా బాకీ తీర్చాలంటారు. ఇప్పుడైనా అండర్‌స్టాండు ?

ప్రకాశం:- (పళ్ళుకొరుతూ తీవ్రంగా చూస్తాడు.)

వెంకన్న:- (బుజం తడుతూ) ఎందుకు నాయనా ఆ చేతగాని ఆవేశం ? కాలానికి తలవొగ్గటం నేర్చుకో. అదే మన పాలిట బ్రహ్మాస్త్రం. ఇతని వెయ్యి రూపాలకే ఇంత కంగారుపడితే ఎట్టా ? మనం శేషాచలం చెట్టికి మూడువేలివ్వాలి.

వెంకటే:- అమ్మబాబాయ్! కొంప ముంచావన్నమాట ఐ. పి. పెడతావాయేం వెంకన్నా ?

ప్రకాశం:- (దగ్గిరకెళ్ళి) చిత్తం ! తమ కంత కోరిగ్గావుంటే తప్పుతుందా ? ప్లీడర్ గుమాస్తావి వ్రాయి పిటీషన్ ఐ.పి. పెడితే నీ కొచ్చేది వెంట్రుకలే; పిచ్చి పిచ్చి మాటలు మాని మర్యాదగా వుండు. (తండ్రితో) చెప్పు నాన్నా! డాక్టరెందుకు రాడు ?

వెంకన్న:- రోగం వూరికే వచ్చిందని డాక్టరెట్టా వస్తాడు ? మన చేతిలో పైసా లేదు అతనికూడా అర్థమయింది. మన యింటికి రాడు.

ప్రకాశం:- (కోపంగా) రాడేం ? ఎట్టా రాడో నేనూ చూస్తాను ఫీజ్ యివ్వాలంటే తరువాత యిస్తాం. అమ్మకు ప్రాణం పోతుంటే చూస్తూ వూరుకుంటాడా ? పోనీ, మరొక డాక్టరును తెస్తాను

వెంకన్న:- ఏం లాభంలేదు. ఆయన చీటీ యివ్వందే యే డాక్టరూ రాడు.

ప్రకాశం:- కనీస మా చీటీనైనా ఇవ్వమని అడుగుతాను.

వెంకన్న:- మనం ఆయనకు ఫీజంతా యివ్వందే ఆ చీటీ యివ్వడు.

ప్రకాశం:- ఇక్కడ ప్రాణంపోతుంటే వీళ్ళు చూస్తూ ఊరుకుంటారా? వీళ్ళకు డబ్బేనా ప్రధానం? ఇందుకేనా వీళ్ళు మెడిసిన్ చదివింది? ఇందుకేనా మెడికల్ సీట్లకోసం వీధు ఆరాటపడుతోంది? ఆ చదువంతా

మానవసేవకాన్ట్ దూ? డబ్బేనా వారి ఆదర్శం? ఇంతకంటె హంతకు లెవరు? రోగాలతో వ్యాపారం చేస్తూ, మేడలు కట్టించి రూపాయల మీద శయనించే ఈ డాక్టర్లను శిక్షించరేం? ప్రభుత్వం శాసనాలు చెయ్యదేం? ఔను, ఎందుకు చేయాలి? బీదవాళ్లెందుకు బ్రతకాలి? ఇది ప్రజారాజ్యం! ఇది రామరాజ్యం!
తోటిమానవుల దురవస్థలను గుర్తించని యీ డాక్టర్లకు హృదయం లేదు; అభిమానం లేదు; మానవత్వం లేదు

వెంకటే:- తెలుసుకో ఇప్పటికైనా! నేను కాదు నోరుమూసుకొని పడుండటానికి-వాళ్ళు డాక్టర్లు ఇంగ్లీషు డాక్టర్లు. ఇంగ్లాండ్ రిటర్న్డు—

ప్రకాశం:- Shutup !

(శేషాచలం చెట్టి వస్తాడు)

(ప్రకాశం లోనికి వెళతాడు. వెంకన్న కూడా అతణ్ణి అనుసరిస్తాడు)

వెంకటే:- (చెట్టితో) వాడు తిట్టింది, ఎవరినను కున్నావు?

చెట్టి:- ఎవడో గజపాయిని! అయినా మన కెందుకు?

వెంకటే:- అవునులే! మన కెందుకు? శేషాచలం!

చెట్టి:- అయ్యా!

వెంకటే:- నిన్ను చూస్తే, నాకు చాలా యిదిగా వుంటదయ్యా?

చెట్టి:- ఇదంటె?

వెంకటే:- అదే!

చెట్టి:- అదంటె?

వెంకటే:- చాలా జాలిగా వుంది. పాపం!

చెట్టి:- ఏం?

వెంకటే:- ఏమని చెప్పను?

చెట్టి:- ఏం చెప్పకు. ఊరుకో!

వెంకటే:- నీకుపయోగించే మాటైనా చెప్పొద్దా?

చెట్టి:- చెప్పు.

వెంకటే:- ఇంటాక వద్దన్నావ్! ఇప్పు డెందుకు చెప్పాలి?

చెట్టి:- నీ ప్లీడరు గుమాస్తా బుద్ధి చూపిచ్చావయ్యా. చెప్పనన్నావ్. చెప్ప కన్నా-చెబుతానన్నావ్. చెప్పన్నా! చెప్పనూలేవు, మాననూలేవు. భలే బాపనయ్యవు! ఎట్టాగయ్యా నీతో?

వెంకటే:- ఈ వెంకన్నపంతులు దివాలా పిటీషన్ పెట్టి బాకీ లన్నింటికి సున్నా చూడతాడట-నీ బాకీ రామార్పణమే.

చెట్టి:- ఈ డాబులన్నీ నా దగ్గరనా? ఆ యెదవ పని ఆయ నెన్నడూ చెయ్యడు. ఇదిగో! మనలోమాట: నువ్వేమన్నా పెట్టమన్నావా?

వెంకటే:- ఛా ఛా! నే నెందుకు చెబుతాను?

చెట్టి:- అయినా నీ బాకీపోతే నాదీ పోతుంది.

వెంకటే:- నా దెంతలే! వెయ్యేగా!

చెట్టి:- నీది పోతేమాత్ర మేమితే! కష్టపడి సంపాదిస్తేగా? పార్టీల నోట్లో దుమ్ముకొట్టినబాపతు. పోయినా ఏం ఫర్వాలేదు. మళ్ళి ఇట్టే సంపా స్తావు.

వెంకటే:- నువ్వో? కొరియా యుద్ధం పేరుతో రేట్లు పెంచి ప్రజలను మోసం చెయ్యలా? మీదంతా పాపపుసొమ్ము.

చెట్టి:- నిన్ను కదిలిస్తే అంతా కంపేనయ్యా! నీకు పుణ్యముంటుంది కాని యిక్కడేం పితలాటకం పెట్టకు. నా బాకీ సంగతి మేము చూసు కుంటాం.

వెంకటే:- నేను వద్దంటేగా? చూసుకోండి ఇప్పటిదాకా నా వంతు యిప్పటి నుంచి నీ వంతు. ఏమిటో చూస్తాట్ట!

(వెంకన్న వస్తాడు)

అడుగో వచ్చాడు-చూడు—ఏం చూస్తావో? (వెంకన్నతో) చూపించ వయ్యా చెట్టి? బాగా చూపించు!

వెంకన్న:- (ముందుకు వచ్చి గంభీరంగా) విరిగిన నడుంమీద రాయి వేస్తు న్నావ్ వెంకటేశ్వర్లు! నన్ను అపహాస్యం చేయటం నీకు ఆనంద మైతే, నేను చెప్పవలసిం దేంలేదు. కాని మన చిరకాల స్నేహం భగ్నమౌతున్నందుకు విచారిస్తున్నాను. గడచిన రోజులైనా జ్ఞాపకం తెచ్చుకో! పదేళ్ళనాడు నువ్వూ నీ కుటుంబం వస్తున్న రోజు లున్నాయ్ నా కొచ్చిన జీతమంతా నీ కెన్నిసారులిచ్చానో, దాని ఫలితంగా మా కుటుంబమంతా మీ పస్తుల్లో ఏ విధంగా పాలు పంచు కున్నామో నువ్వు మరచిపోవటం నా దురదృష్టం. ఈ రోజున నీ దృష్టిలో నేను ఒక దోమ కంటె హీనంగా కనబడుతున్నాను. క్యాలండర్‌లోని తేదీల్లాగా మనుష్యుల విలువలు యిట్లా మారిపోతా యని యీనాడే తెలుసుకున్నాను.

క్షమించు! ఏ వేవో అన్నాను. నీకు కావలసిందల్లా డబ్బు! ఇస్తు న్నాను తీసుకోండి పిత్రార్జితమైన యీ ఒక్క యింటిని వదల్లేక యిన్నాళ్ళు బాధపడుతున్నాం. ఈ బాధను తీర్చి పుణ్యం కట్టుకుంటే, యే చెట్టు నీడనో తలదాచుకుంటాం.

శేషా:- బాధపడకండి పంతులుగారూ! ఊరుకోండి. మేంకూడా మనుష్యు లమె! వెంకటేశ్వర్లు! ఏమిటయ్యా నీ మాటలు? దేవుడెక్కడో లేడు. మన నీడలోనే వున్నాడు. మంచి అంటూ లేదటయ్యా నీకు? మం చోళ్ళ మనసు నొచ్చుకుంటుంటె, ఆ వుసురు వూరికేపోదు. పాతాళా నికి పడిపోకు! జాగర్త.

వెంకటే:- అవునయ్యా? నా కళ్ళముందు పుట్టాడు ఆ గుంట వెధవ! నా మీద కలబడటం న్యాయమేమో చెప్పమను. అది నాకు అవమానంకాదేం?

వెంకన్న:- కాదు. ఆ అవమానం నాది. (వచ్చి, రెండుచేతులు బట్టుకొని) నువ్వు నన్ను కొట్టావని నా కెంతమాత్రం బాధలేదు. కాని నేను బ్రతికుండ గానే యీ యింట్లో నీ మనసుకు బాధకలిగిందే అని దుఃఖిస్తున్నాను. మా అందరిని క్షమించు.

(బయటనుంచి 'పోస్ట్' అను లేక వినబడుతుంది. ప్రకాశం వెళ్ళి జాబును తెస్తాడు.)

ప్రకా:- (వెటకారంగా) అల్లుడుగారి యేడుపే యిది నాట్ పేడ్ వుత్తరం!

శేషా:- బలే అల్లుడే!

ప్రకా:- (కవరుచించి, వుత్తరం తీసి, చదువుతాడు) '...మామగారికి నమస్కారములు. మీరు వ్రాసిన వుత్తరమందింది. ఇర్థకంవల్ల సమాధానం వ్రాయట మాలశ్యమైంది. అత్తగారికి జబ్బుగా వుందని, అమ్మాయిని చూడాలని కలవరిస్తుందని, వెంటనే మా యిద్దరిని Next train లో బయలుదేరి రమ్మని వ్రాశారు. కాని రైలు చార్జీలు అయినా పంపాలన్న విషయం మీ కెందుకు తోచలేదో తెలియటం లేదు. పెళ్ళిలో యిస్తామన్న మోటార్ సైకిల్ విషయంకూడా మీ జాబులో లేదు. అనవసరంగా కంగారు పడుతుందని మీ వుత్తరాన్ని మీ అమ్మాయికి చూపలేదు. దాని మనసు బాధపడటం నేను చూడలేను కదా!

మరొక్క విషయం. నా మాట విని అత్తగారిని మద్రాసుకు వెంటనే తీసుకువెళ్ళి మందిప్పించండి. మోటార్ సైకిల్స్ అమ్మే షాపు, మౌంటురోడ్డులో స్పెన్సర్ కంపెనీకి దగ్గరగా వుంది. మీకు తీరిక లేకపోతే మీ పెద్దబ్బాయి వెంకట్రావును పంపండి. మీ ప్రకాశాన్ని మాత్రం వద్దు. వాడికి విషయం చెప్పకండి వాడొట్టి రౌడీ...'

(తండ్రితో) కొను మోటార్ సైకిల్? చెయ్యి మనియార్డరు? వ్రాయండి మరో ప్రోనోటు? డబ్బిచ్చే వాళ్ళక్కడే వున్నారుగా? వాళ్ళకు వడ్డీ వస్తుంది. మనకు డబ్బొస్తుంది అమ్మకు మందు అక్కర లేదు. మా అమ్మ పోయినా ఫర్వాలేదు. మీ అల్లుడుగారికి మాత్రం ఆగ్రహం రాకుండా చూచుకోండి. నేను రౌడీని, మీరు పెద్ద మనుష్యులు!

శేషా:- ఎంత లావు అల్లుడైనా అంత అదిరిపాటా? అడిగిన కట్నం పెళ్ళిలో ఇవ్వటం, పుచ్చుకోటం అయిపాయె. మళ్ళి ఇదేం బుద్ధయ్యా?

వెంక టే:- అల్లుడంటె మరేమనుకున్నావు? ఒకమారు కట్నమంటూ యిచ్చి దారి చూపించారు. ఇంకెందు కూరుకుంటాడు? పండగొస్తే కట్నం! పురుడు వస్తే కట్నం! రమ్మంటె కట్నం! పొమ్మంటె కట్నం!

ఎండొస్తే కట్నం! వానొస్తే కట్నం! అడగటం రివాజే, యివ్వటం విధాయకమే! ఇది బావి, అది చేద!

ప్రకాశం:- ఈ చేదకు తాడు తెగింది. నువ్వొచ్చి ముడెయ్యి.

(లోపల వెంకట్రావ్ "అమ్మా! అమ్మా!" అంటూ ఏడుస్తాడు. Back-ground music ఆరంభమౌతుంది. చెట్టి, వెంక టేశ్వర్లూ లోనికి వెళ్ళి ఓదారుస్తారు మాటలతో.)

(వెంకన్న నిశ్చేష్టుడై చూసి, రెండడుగులు వేసి, పోలేక ఏడుస్తాడు.)

చెట్టి:- (లోపలనుంచి కన్నీళ్ళు తుడుచుకుంటూ వచ్చి, వెంకన్నను చూస్తూ) మహాతల్లి! ఈ లోకంనుంచే వెళ్ళిపోయింది.

(వెంకన్న ఆవురుమంటాడు)

ఊరుకోండి పంతులుగారూ! మీరే దిగులుపడితే ఎట్టా? వెళ్ళి అబ్బాయిలకు ధైర్యం చెప్పండి. ఆ తల్లి కేంతక్కువ? పసుపు కుంకుమతో వెళ్ళిపోయింది. మహా పుణ్యాత్మురాలు!

వెంకటే:- (వచ్చి) సందేహమేమిటి? తన పొట్టెంత మాడ్చుకుందో, ఒళ్ళెంత విరుచుకుందో పక్కింటివాళ్ళకైనా తెలిసేదికాదు. ఎటువంటి మనసు ఆ యిల్లాలిది! మా యింట్లో పట్టెడన్నం కూడా లేనిరోజుల్లో, మా పిల్లల్ని తీసుకువెళ్ళి అన్నం వండిపెట్టి, మిగిలిందేమైనావుంటే తన పిల్లలిద్దరికి తరువాత పెట్టేది. ఆమె సాక్షాత్తు అన్నపూర్ణ తల్లే! (అంటూ చేతులెత్తి దండం పెడతాడు)

(వెంకన్న కన్నీరు తుడుచుకుంటూ వుంటాడు)

ప్రకాశం:- (కన్నీరు ముంచెత్తిన ముఖంతో వచ్చి, తండ్రిని తీవ్రంగా చూసి) నువ్వుకూడా యేడుస్తున్నావె! అదంతా నిజమైన దుఃఖమేనా? అది నీ హృదయంనుంచే వస్తున్నదా? మా అమ్మను చంపిందెవరు? ఆఖరు చూపైనా నోచుకోని మా చెల్లెలి గొంతును కోసిందెవరు? ఇప్పుడు నీకు తృప్తి అయిందా? నీ హృదయం శాంతించిందా?

(వెంకన్న తలవంచుకొని వెళ్తుండగా, ప్రకాశం వెళ్ళి అడ్డంగా నుంచొని రెండు చేతులు చాపి)

చెప్పాలి సమాధానం? నువ్వు చేసింది ఒక గుమాస్తా ఉద్యోగం. నువ్వు చదివిందల్లా మెట్రిక్కు. మేం మాత్రం గ్రాడ్యుయేట్సు మవ్వాలి, మేం గెజిటెడ్ ఆఫీసర్లం కావాలి. నీ పేరు, నీ ఖ్యాతి పెరగాలి. ఇదికదూ నీ ఆశయం? నీ కొడుకులిద్దరూ ఆఫీసర్లని నలుగురికి చెప్పటం కదూ నీ సంతృప్తి?

(వెంకట్రావ్ వస్తాడు)

చీట్లపేకతో మేడను కట్టావు! అది చిన్నగాలికే చితికిపోయింది. మనకంటె కూలివాడెంతో నయం. ఉన్నదాంతో తృప్తిపడటం వాళ్ళకు తెలుసు. శక్తికి మించిన ఆశలు పెట్టుకోవటం వాళ్ళకు చేతకాదు. అది మన కుటుంబాలకు బాగా తెలుసు, లేంది వున్నట్టు నటించటం మన జన్మహక్కు. ఇంట్లో చినిగిన గుడ్డలు, బైట జరీపంచెలు మధ్యతరగతి కుటుంబాలు నాశనమవుతున్నాయంటె దానికి కారకులెవరు? బాధ్యులెవరు? ఇదేనా మీ ముందు తరాలవారికి నేర్పాల్సిన మహా విద్య?

ఇప్పుడేచ్చి యేం లాభం? ఎందుకూ పనికిరాని మా చదువుల కోసం అప్పుజేసి మన కాపరాన్ని వీధి కెక్కించావ్! అంతేగాని, మనందరికోసం నానా బాధలు పడిన మా అమ్మ, కదల్లేక మంచాన పడితే మందిప్పించి బ్రతికించుకోవాలని, అది మీ విధి యని తెలుసు కోలేదు. ఆ ఉద్దేశమే మీ హృదయంలో లేదు. మీ దసలు మానవ హృదయం కాదు. కటిక పాషాణం!

(వెంకట్రావ్ ప్రకాశాన్ని రెండు చెంపలు బాగా వాయిస్తాడు.)

వెంకట్రా:- నోటికొచ్చినట్టు మాట్టాడుతావుట్రా? ఆయనెవరని! నాన్నను పట్టుకొని అంతమాటంటావా? నాన్న అంత తేరగా ఉన్నాడను కున్నావేం? నువ్వు పెరిగిందెక్కడ? నాన్న బుజాలమీద కాదు? నువ్వింతవాడివి అయింది నాన్న చేతులమీదకాదు? నువ్వడిగిందల్లా తెచ్చియిచ్చిందెవడ్రా? నాన్న కాదూ? మనిద్దరి చదువులతో కదూ నాన్న చితికిపోయింది? నడవలేని స్థితిలో, ఆఫీసుకు కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి, ఆ రిక్షా డబ్బులు నాలుగు అణాలు నాన్న మిగిల్చిందెవరి

కోసంరా? పిల్లలపైన ఆయనకా మమతే లేకపోతే మనగతేమయ్యేది? ఈడొచ్చినవాడి కామాత్రం జ్ఞానముండాలి. విశ్వాసం లేనివాడు బ్రతికినా ఒకటే, చచ్చినా ఒకటే ఈ మాట బాగా జ్ఞాపకముంచుకో!

మన కాపరం ఒక బండిలాంటిది. ఆ బండికి నువ్వూ నేనూ రెండు చక్రాలం. ఆ బండిని ఇన్నేళ్ళూ లాగిన ముసలెద్దులు అమ్మ, నాన్న! ఆ బండి బరువుకు నడుం విరిగి అమ్మ చనిపోయింది. నాన్నను కూడా చంపాలనుకుంటున్నావ్!

ఆ కాస్త ప్రాణం వదుల్తూ అమ్మేం చెప్పిందో నీకేం తెలుసు? నా కన్నీరు తుడుస్తూ "ఎందుకు నాయనా యేడుపు? నాకేం తక్కువ? మీ చేతుల్లో చల్లగా దాటిపోతాను, కాని నాకు ఒక్కటే దిగులు. అది మీ నాన్న! ఆయన దేవుడులాంటివాడు. మీకు అప్పగించిపోతున్నా. జాగ్రత్తగా కాపాడుకోండి......

ప్రకాశం:- (దుఃఖాన్ని ఆపుకోలేక, వెళ్ళి తండ్రి కాళ్ళపైన పడుతూ) నాన్నా! నాన్నా! నన్ను క్షమించు నాన్నా!

(వెంకన్న, ప్రకాశాన్ని లేవదీసి, తన హృదయానికి హత్తుకుంటాడు. వెంకట్రావు వెళ్ళి తండ్రిని కౌగలించుకుంటాడు.)

(చెట్టి, వెంకటేశ్వర్లు, తమ ప్రోనోట్లను చించివేసి వెళ్తూవుండగా.)

వెంకన్న:- (వాళ్ళకడ్డంగా వెళ్ళి) ఆగండి! నన్నొక బిచ్చగాడినిగాచేసి వెళ్తున్నారా? ఇది మీకు న్యాయంకాదు. మీ ఋణాన్ని తప్పకతీరుస్తాను. ఈ యింటిని మీ బాకీలకు తీసుకోండి. అంతేగాని, నన్ను బిచ్చగాడిని మాత్రం చెయ్యకండి.

శేషా:- అట్టా అనుకోకండి బాబూ! మా మనస్పూర్తిగా వదలిపెట్టాం.

(చెట్టి, వెంకటేశ్వర్లు వెళ్తారు)

వెంకన్న:- నేనొక బిచ్చగాడినా? అవును. నేను బిచ్చగాడినే. నా తండ్రొక బిచ్చగాడు. మా వంశమంతా బిచ్చగాళ్ళే!

(ప్రోనోటు ముక్కలను తీసికొని)

వెంకన్న:- (వెఱ్ఱివాడిలాగా) స్టాంపు బిళ్లలు నవ్వుతున్నాయ్! ఈ చినిగిన కాగితం ముక్కలు నన్ను వెక్కిరిస్తున్నాయ్!

(వెఱ్ఱిగా నవ్వుతాడు-ఆ నవ్వు క్రమేణా ఆగిపోతుంది. నోరు వంకరపోతుంది. చెయ్యి పడిపోతూ వుంటుంది. మనిషి తూలిపోతూ వుంటాడు)

వెంకట్రా:- (పట్టుకుని) కొంప మునిగిందిరా ప్రకాశం! నాన్నకు పక్షవాతం వచ్చింది.

ప్రకాశం:- (వచ్చి తండ్రిని పట్టుకొని) నాన్నా! నాన్నా!

వెంకట్రా:- పద! నాన్నను హాస్పిటల్‌కు తీసుకువెళదాం! పద.

(లోనికి వెళ్లి లాంతరు తెస్తాడు - ప్రకాశం వెంకన్నను భుజాని కెత్తుకుంటాడు-ముందు లాంతరుతో వెంకట్రావు, వెనుక తండ్రిని మోసుకుంటూ ప్రకాశం బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్లారు) గడియారం అరగంట కొడుతుంది. బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ ఆగిపోతుంది.

(తెర పడుతుంది)



## పాత్రలు

రమణయ్య
రామం
సుందరం
రంగయ్య
హనుమంతరావు
విశాలాక్షి
కమల

[తెర తప్పుకోగానే ఒక ఇంట్లో హాలు కనిపిస్తుంది. హాలుకి వెనక మధ్యగా ఇంట్లోకి ఒక ద్వారం, హాలుకి కుడి ఎదర ఇంట్లోకి మరోద్వారం, హాలుకి ఎడమ ఎదర వీధులోకి ఒక ద్వారం ఉంటాయి. హాల్లో మధ్యగా Teapoyతో సహా సోఫాసెట్టు. కుడిమధ్యలో గోడకి దగ్గరగా cloth stand, దానిమీద ముఖ్యంగా రెండు, మూడు కోట్లు ఇంకా కొన్ని సాధారణమైన బట్టలూ ఉంటాయి. ఎడమ మధ్యలో గోడకి దగ్గరగా ఒక బల్ల. దానిమీద రేడియో, రేడియోమీద టైమ్‌పీస్ ఉండాలి. సమయం సరిగా సాయంత్రం అయిదు గంటల వుతుంది. మధ్యసోఫాలో రమణయ్య తాపీగా కూచుని, పెద్దసైజు సంస్కృత రామాయణం చేత్తో పుచ్చుకుని చదువుతూ, లీనమై, ఆనందిస్తూంటాడు].

రమ:- అహం శూర్పణఖానామ రాక్షసీ కామరూపిణీ। భగినీ రాక్షసేంద్రస్య రావణస్య మహాత్మనః ...ఓహోహో!...

[కుడి ఎదరలోంచి విశాలాక్షి వస్తుంది]

విశా:- ఏమండీ !-

రమ:- అహం శూర్పణఖా నామరాక్షసీ...

విశా:- బాగానే ఉంది మీవరస ! అయిదయింది, తెలుసా ?

రమ:- అబ్బా ! అయిదయిందీ ?

విశా:- (ఈసడింపుగా) అబ్బే ! మూడే అయింది.

రమ:- ఇంతేనా ! (మళ్ళీ చదువుకుంటూ) ఖరేణ సహితా...

విశా:- చాల్చాలు !- లేవండి ! (పుస్తకం లాక్కుంటూ) ఈ రామాయణం పుచ్చుగుని కూచుంటే మీకు మనుషులు కనపడరు.

రమ:- మనుషుల్లో ఏముందే అమానుషత్వంతప్ప !- రామాయణంలో ఉంది మోక్షానికి హైరోడ్డు.

విశా:- అల్లానేగాని, మీరు ముందు త్వరగా తెమలండి.

రమ:- ఎందుకూ ?

విశా.- సినిమాకి వెళ్ళద్దుటండీ ?

రమ:- ఎందుకూ ?

విశా:- అయ్యో, మీ 'ఎందుకు' బంగారంగానూ ! ఈవాళ మన కోడలు పుట్టింరోజూ కదుటండీ ? అందరం కలిసి సాయంత్రం సినీమా కెడదామనుకున్నాంగా ?

రమ - అనుకున్నామా '-

విశా:- సరిపోయింది. చదవేస్తే ఉన్న మతీ పోయిందట !

రమ:- చెప్పే చదువులు అల్లానే ఉన్నాయిలే ! అన్నట్టు - సుందరం కాలేజీ నుంచి వచ్చాడా ?

విశా:- వాడూ, రాముం కూడా వచ్చేవేళయింది. మీరు తెమల్దమే తేలటం లేదు !

రమ:- (లేస్తూ) ఓమూల్నించి లేస్తూందేనే చదువుతా వెందుకే ? ఆడవాళ్ళ నోటికీ గోదావరి వరదకీ అడ్డూ ఒడ్డూ లేదనుకుంటాను. హు !...
[ఎడమ ఎదర ద్వారంలోంచి రంగయ్య వస్తాడు. చేతిలో సంచీ ఒకటి ఉంటుంది ]

విశా:- ఏం, రంగయ్యా ! తెచ్చావా మిఠాయి ఉండలు ?

రంగ:- తెచ్చానండి

విశా:- వీళ కెన్ని తూగాయి ?

రంగ:- పదహారండి!-కాదండి, పదిహేనండి!

విశా:- ఇంతే!-తక్కెడకింద చింతపండూ అదీ అంటించాడేమో చూశావా?

రంగ:- (నమ్మనట్టు) మిఠాయిఉండలో చింతపండు ఎందుకు వేస్తాడండీ?

విశా:- తెలివి తెల్లారినట్టేఉంది!—

రమ:- పోన్లే! జీడిపప్పు బాగా వేశాడా?

విశా - (విసుగ్గా) ఆ, ఆస్తి వేశాడుగాని. ముందు మీరు నడవండి! (కుడి ఎదరకుతిరిగి) కమలా!-కమలా !- ('వస్తున్నా!' అని సమాధానం వస్తుంది) రంగయ్య వచ్చాడు, చూడు!

[రమణయ్య, విశాలాక్షి మధ్యగదిలోకి వెళతారు. కుడి ఎదర ద్వారంలోంచి కమల వస్తుంది. రంగయ్య బుర్రగోక్కొని ఆలోచిస్తుంటాడు.]

కమ.- తీసుగొచ్చావా, రంగయ్యా!

రంగ - చిత్తం ! - కానండి, అమ్మగారూ! అందులో ఓ ముక్క చిదిపి రుచిచూడండి!

కమ.- ఎందుకూ?

రంగ:- చూడండి, చెబుతాను!

కమ:- ఏం?-విశేషం ఏమన్నా ఉందేమిటి? (పొట్లంపైన చింపి, ముక్క చిదిపి, తింటుంది.) బాగానేవుంది!

రంగ:- మరి, చింతపండు ఉందాండి, అందులో?

కమ:- మిఠాయిఉండలో చింతపండు ఏమిటోయి, మతిపోయిందేమిటి?

రంగ:- లేదండి. నేనూ అల్లానే అడిగితే నాకు మతిలేదన్నా రండి!

కమ:- (నవ్వి) ఎవరూ?

రంగ.- (నవ్వుతూ) పెద్దమ్మగారండి!

కమ:- (నవ్వుఆపేసి) సరేలే!- నువ్వు ముందు సుబ్బారావు దగ్గరికెళ్ళి ఫొటోలు అయ్యాయేమో తీసుకురా!

రంగ:- సుబ్బారావాండి?

కమ:- ఫొటోగ్రాఫరోయి!-మొన్న మనందరికీ గ్రూపు ఫొటో తియ్యలేదూ?

రంగ:- అందులో నన్ను ముందు కూచో పెట్టాడూ?

కమ:- అతనే!

రంగ.- ఆ!-ఆ పక్కమేడలోకి కొత్తగా వచ్చాడూ?

కమ:- అతనేనోయి!

రంగ:- అష్టనండి, తెస్తాను.

కమ:- త్వరగా, రా!-సినిమాకెళ్ళాలి.

రంగ:- చిత్తం!-చిటికెలో వచ్చేస్తానండి.

[రంగయ్య ఎడమ ఎదరలోంచి వీధులోకి వెళతాడు. కమల పొట్లంసంచీ పుచ్చుగొని ఉత్సాహంగా మధ్యగదివైపు వెడుతూంటే, ఎడమ ఎదరలోంచి పుస్తకాలు పుచ్చుగుని సుందరంవస్తాడు. వస్తూనే రేడియోబల్లమీద పుస్తకాలు పడేస్తాడు.]

సుంద:- ఏం వదినా! ముస్తాబయిందా? (బాగాపీల్చి) ఊ! ఆ పొట్లం ఏమిటి?

కమ:- పొట్లానికేంగాని, టిక్కట్లు దొరికాయా?

సుంద:- టిక్కట్లకేంగాని, పొట్లం ఏమిటో చెబుదూ!

కమ:- టిక్కట్లు తెస్తేనే పొట్లంలో వాటా!- తెచ్చావా?

సుంద:- ఏమనుకున్నావు. మరి! పొద్దున్న ఎడ్వాన్సు బుకింగు దగ్గరికి, నే వెళ్ళేటప్పటికి అక్కడ జనమే లేదు!

కమ:- ఎంచేత ?

సుంద:- బుకింగే లేదు

కమ:- అదేమిటీ?

సుంద:- టిక్కట్లయిపోయాయి.

కమ:- మరెల్లా?— నువ్వెన్నీ ఇల్లానే చేస్తావు?

సుంద:- కోప్పడకు మరీ!— నేను ఆమటుగా మేనేజరు దగ్గరకెళ్ళి, ఏమయ్యా! తొమ్మిది గంటలనుంచి, పదకొండు గంటలదాకా ఎడ్వాన్సు బుకింగు ఉంటుందని బోర్డు కట్టారు పది గంటలకే మూసెయ్యడానికి మీ కేమధికారం ఉంది? మా అన్నయ్య N.G.O మా వదిన G. O. ఏమనుకుంటున్నారోగాని, అని దులిపేశాను-

కమ:- ఈ కబుర్లకేంలే!- అసలు సంగతి చెప్పు!- టిక్కట్లు తెచ్చావా, లేదా ?

సుంద - అదే చెబుతున్నా. వినుమరీ!- అని దులిపేశాప్పటికి వాడు రాలిపోయాడు. (కమల కోపంగా వెళ్ళిపోబోతుంది) వదినా, వదినా!- అంత కోపం ఎందుకు వదినా!- ఇవుగో టిక్కట్లు!

కమ:- నాకెందుకూ? నీదగ్గిరే ఉంచు.

సుంద:- సరే! మరి పొట్లంలో వాటా ఏదీ?

కమ:- తెస్తానుగాని, నువ్వు త్వరగా తయారవు. టైమవుతోంది.

సుంద:- ఓ, రెండు నిమిషాల్లో రెడీ!- అన్నట్టు, వదినా! ఆఫీసునుంచి అన్నయ్య వచ్చాడా? (అంటూ టిక్కట్లు రేడియో బల్లమీదున్న పుస్తకాల్లో పెడతాడు.)

కమ:- ఇంకా రాలేదు.

సుంద:- నీకేమన్నా ప్రెజంటు కొంటానికి బజారుకెళ్ళేడేమో?

కమ:- ఆ, ప్రెజంట్లు కూడాను! వీధులో కెడితే అసలు ఇంట్లోవాళ్ళు జ్ఞాపకం వుంటారా, మీకూ?

సుంద:- ఇంట్లోవాళ్ళని జ్ఞాపకం ఉంచుకుని వీధులో కెడితే ఆ వుద్యోగంకాస్తా పీకేసి ఇంటికి పంపించేస్తారు, తెలుసా?

కమ:- తెలుసు, తెలుసు! నువ్వు మాత్రం త్వరగా తెములు,

[కమల, కమల వెనక్కాల చిరునవ్వుతో సుందరం మధ్య గదిలోకి వెడతారు. మరుక్షణంలోనే సుందరం తువ్వాలు భుజంమీద వేసుగుని వచ్చి ఉత్సాహంగా కుడిఎదరలోకి వెడతాడు. వెంటనే ఎడమ ఎదరలోంచి రామం వస్తాడు. చేతులో చిన్న పేకెట్ ఉంటుంది. కమలని పిలవబోయి ఆగి, ఆలోచించి ఉత్సాహంగా తలపంకించి, కోటుజేబులో ఆ పేకెట్ దాచుకొని, కోటుతీసి స్టాండుకి తగిలిస్తాడు.]

రామం:- కమలా! కమలా!

కమ:- (మధ్యగదిలోంచి వచ్చి) ఎంతసేపయింది, మీరు వచ్చి?

రామం:- ఈ అప్సరస ఎవరు? ఇది ఏలోకం?

కమ:- (చిరాగ్గా) ఉత్తభూలోకం. ఇంటి అద్దె 40 రూపాయలు!-ఇంత ఆలస్యం చేశారేం?

రామం:- (నిట్టూరుస్తూ కూమని) ప్రేమలో ఉన్న సౌరభ్యం కొంచెమైనా తెలియదే, ఈ ఆడవాళ్ళకి!- ఈవాళ నీ పుట్టింరోజుగదా అని-

కమ:- (ఉత్సాహంతో) అని!-

రామం:- చచ్చిచెడితిరిగి——

కమ:- (ఇంకా ఉత్సాహంగా) తిరిగి!-

రామం:- తిరిగి చక్కావచ్చాను.

కమ:- (విసుగ్గా) అబ్బ, వెటుదురూ!-ఏంకొనుక్కొచ్చారు?

రామం:- ఎల్లాచెప్పనూ? మూడ్ అంతా చెడగొటేశావు

కమ.- (చిరికోపంతో) పోన్లే దాచుగోండి! కోటేదీ? (స్టాండు కేసి తిరిగి, గ్రహించినట్లు నవ్వుకుని) సరే!-త్వరగా తయారవండి, సినీమా కెళ్ళాలి.

రామం - (బూట్లువిప్పుకుంటూ) సుందరం టికెట్లు తెచ్చాడా? (కమల మెల్లగా కోటుస్టాండు దగ్గరకువెళ్ళి కోటు వెతకబోతుంది. రామం చూస్తాడు) ఏయి, కమలా!-నా కోటుదగ్గరకి వెళ్ళకు!

కమ - (దొరికిపోయినట్టు నవ్వుతూ) మగవాళ్ళకి అన్నీ అనుమానాలే!-అయినా మీ కోటుతో నాకేంపని? (కిందనున్న Sandals తెస్తూ) మీ చెప్పులు తీసుగు వస్తున్నాను.

రామం:- నీ ఎత్తులు నాకు తెలుసులే! (అని లేచి Sandals తొడుక్కుంటూ) రంగయ్యేడీ?

కమ:- వీధులో కెళ్ళాడు. ఇప్పుడే వస్తాడు. (అంటూ బూట్లు స్టాండుదగ్గర పెట్టి) మీరు నడవండి!

రామం:- అబ్బే, ladies first అన్నారు! ముందర నువ్వు నడు!

[కమల రామం చిరునవ్వులతో మధ్యగదిలోకి వెడతారు. కుడి ఎడరలోంచి శ్రీరంగయ్య మెల్లిగా వచ్చి, ఇటూ అటూ చూసి, ఉత్సాహంతో తన బనియను జేబులోంచి ఓ ఫోటోతీసి, చూసుగుని, బరువుగా నిట్టూరుస్తాడు]

రంగ:- ఫోటోచూడగానే చెక్కేయ్యాలనిపించింది. ఈ పిల్ల ఎవరోగాని, ఇంటికొచ్చేలోపల మూడులారీలకింద పడేవాణ్ణి!- ఏమి అందం!- ఏమి అందం!- ఆ చూపు చూడు. తస్సాదియ్యా!- ఫోటోగ్రాఫర్నైనా అయ్యానుకాదు, ఖర్మ!

(అని ఫొటో చూస్తూ మెచ్చుగుంటూ ఉత్సాహంగా తిరుగుతుంటాడు. ఎడమ ఎదరలోంచి "రంగయ్యా! రంగయ్యా!" అని విశాలాక్షి కేక దగ్గరగా వినిపిస్తుంది. ఎడమ ఎదర ఉన్న రంగయ్య, ఆ కేక విని, హడిలిపోయి, ఫొటో కేసి భయంగా చూసి, ఫొటో పట్టిగెళ్ళి, రేడియో బల్లమీద సుందరం పెట్టిన పుస్తకాల్లో దాచేస్తాడు)

విశా:- (ఎడమ ఎదరలోంచివచ్చి) ఏం, రంగయ్యా?—

రంగ:- ఏమండీ?—

విశా: (కోపంగా) ఎక్కడికి కెళ్ళావు?

రంగ:- (కంగారుగా, వెంటనే) ఎక్కడికి కెళ్ళానూ?

విశా:- నేను నిన్నడిగితే, నువ్వు నన్నడుగుతావేమిటి?

రంగ:- అదేనండి?- ఫొటోలు తెమ్మంటే ఫొటోగ్రాఫరు దగ్గిర కెళ్ళానండి.

విశా:- తెచ్చావా?

రంగ:- లేదండి. కాని రేపు తప్పకుండా ఇస్తానన్నాడండి!

విశా:- ఆ, నువ్వెడితే అసలు ఏ పనీ అవదు. అదిసరేగాని, ఎన్నిసార్లు చెప్పాలి నీకు? నీళ్ళగదిలో నీళ్ళు పెట్టవేం?

రంగ:- (పుస్తకాలకేసి బాధగాచూస్తూ) ఎందుకండీ?

విశా:- ఎందుకేమిటోయి?- మతిగాని పోతోందేమిటి, నీకు!

రంగ:- (నీరసంగా నవ్వి) అబ్బే, లేదండి!

విశా:- చాలు, చాలు!- ముందు నీళ్ళు పెట్టు!- అవతల అయ్యగారు నుంచున్నారు.

రంగ:- చిత్తమండి!

విశా:- చిత్తమని అక్కడే తచ్చాడతావేమిటి?- వెళ్ళుముందు! (ఇక లాభంలేదనుకుని, రంగయ్య బాధగా, కుడి ఎదరలోకి వెడతాడు. మధ్యగదిలోంచి కమల ఉత్సాహంగా వచ్చి, కోటుస్టాండుకేసి వెళ్ళబోయి, విశాలాక్షినిచూసి, ఆగిపోతుంది.)
ఏమే కమలా!- మీ ఆయన వచ్చాడా?

కమ:- ఆ, వచ్చారు!

విశా:- (కమలని, పరీక్షగా చూసి) అదేమిటే కమలా! నెక్లెసు పెట్టుగోలేదేం?

కమ:- (కొద్దిగానవ్వి) ఏంలేదండి!- సినిమా కెడుతున్నాం గదా, అని!-

విశా:- సినిమాకెళితే మాత్రం? చేయించుగున్ననగలు పెట్టుగోడానికి కాక పోతే, పెట్టిలోపెట్టి పూజించుకోడానికిటే? లోపలికి, నడు!-

కమ:- (అదుర్దాగా, నవ్వి) ఎందుకూ?- నేను పెట్టుగుంటాను లెండి!-

విశా:- ఈ కబుర్లు నాకు తెలుసులే! నగలెట్టుకుంటే నామోషీ అన్నట్లు ఇదవుతారేమిటే, మరీనూ!- అదేమీ కుదరదు ముందు నాతోరా?

(విశాలాక్షిమాటకి ఎదురుచెప్పలేక, కమల, విశాలాక్షి వెనుకాలే మధ్యగదిలోకి వెడుతుంది. కుడి ఎదరలోంచి సుందరం తువ్వాల్తో మొహం అద్దుకుంటూ మధ్యగదిలోకి వెళ్ళబోయి, పక్కకితిరిగి, రేడియోబల్లమీద ఉన్న తన పుస్తకాలు తీసుగుంటూ, టిక్కట్లకోసం పేటీతెరవగానే ఫొటో కనిపిస్తుంది. ఆ ఫొటోకేసి ఆశ్చర్యంగా చూసి పుస్తకాలు అక్కడే ఉంచేసి, ముందుకివచ్చి, ఫొటో పరీక్షగా చూసి, ఉత్సాహంగా ఈలేసి కుడి మధ్యకు నడుస్తూ.)

సుంద:- అరే! - ఎవరీభామ? - ఎప్పుడూ చూళ్ళేదే! - నా పుస్తకంలోకి ఎల్లా వచ్చింది, చెప్మా!-చంద్రుణ్ణి వెక్కిరించే ఆ అందం!-హృదయాలు హరించే ఆ వాలుచూపులు!-స్వర్గం మరిపించే ఆ చిరునవ్వు!-ఎవరు, భామా, నువ్వు? ఎడ్రసైనా లేదే!-

[అంటూ ఇటూ అటూ తిరగేస్తూంటే మధ్యగదిలోంచి 'ఇప్పుడే వస్తాను' అన్న కమల మాటలు చాలా దగ్గరగా వినిపిస్తాయి సుందరం ఆగి, ఫోటోకేసి చూసి భయపడి, 'బాబో, వదిన!' అని కంగారుగా చూసి, తనకి పక్కగా స్టాండుమీదున్న కోటుజేబులో ఆ ఫోటో పడేస్తాడు. కమల ఉత్సాహంగా వచ్చి, సుందరాన్ని చూసి, విసుగ్గా నిట్టూరుస్తుంది]

కమల:- నువ్వున్నావా, ఇక్కడ!-మీ అమ్మగారు పిలుస్తున్నారు.

సుంద:- ఆ, ఆవిడకేం పన్లేదు!-(అని కుర్చీలో కూచుంటాడు)

కమ:- అదికాదు, అర్జెంటుగా రమ్మంటున్నారు.

సుంద:- (విసుగ్గా) ఎందుకూ?

కమ:- ఏమో, నాకేం తెలుసూ?

సుంద:- సరే, వస్తున్నానని చెప్పు!

కమ:- (చిరికోపంతో) మళ్ళీ చెప్పడానికి ఒకళ్ళా? లేచి త్వరగా వెళ్ళు!

సుంద:- (విసుగ్గా లేచి) ఆవిడ చాదస్తం నీకు తెలుసుగదా, వదినా!- నీక్కూడా ఇంత కంగారయితే ఎల్లా?

కమ:- (Nervous గా నవ్వి) నాకేం కంగారూ? - బాగానే ఉంది!-(దబాయింపుగా) అయినా పిలుస్తూంటే ఓసారి వెళ్ళకూడదూ?- నువ్విక్కడ వెలగబెట్టే రాచకార్యం ఏమిటి?

సుంద:- (Nervous గా నవ్వి) ఏముంది?-ఏంలేదు!-వెడుతున్నా!-

[సుందరం బాధగా, భయంగా, కోటు కేసి చూసి, తప్పదుగనుక మధ్యగదిలోకి వెడతాడు. కమల ఉత్సాహంతో నవ్వుకుంటూ గబగబా కోటు దగ్గరికి వెడుతుంది. జేబులో చెయ్యి పెట్టగానే ఫోటో తగులుతుంది. ఏమిటో అనుకుని ఇవతలికి తీసి చూసి, తెల్లబోతుంది. 'ఆ!-' అంటూ నిశ్చేష్టురాలై పోతుంది. కళ్ళమ్మట నీళ్ళు కారతాయి. మధ్యగదిలోంచి ''కమలా!-కమలా!-'' అన్న రామం కేక వినిపిస్తుంది. కమల కంగారుగా ఫోటో మళ్ళీ ఆ కోటు జేబులోనే పడేసి, బాధగా సోఫా దగ్గరికి వచ్చేసి, కళ్ళు తుడుచుకుని ఏడుపు ఆపుకుందుకు ప్రయత్నిస్తుందిగాని ఏడుపు ఆగదు]

రామం:- (మధ్యగదిలోంచి వచ్చి) ఇక్కడున్నావా కమలా?- ఊఁ! మొత్తానికి గడుసుదానివే!- బహుమతీ చూశావా? (చిరునవ్వుతో) అయినా ఆడవాళ్ళకి తొందరెక్కువ!

కమల:- (రోషంగా, ముందుకు నడుస్తూ, ఏడుస్తూ) ఆ! మగవాళ్ళకి హృదయాలెక్కువ!

రామం:- (స్టాండుమీదున్న కోటుతెచ్చి, పేకెట్ తీస్తూ) అదేమిటి? నచ్చలేదా?

కమల:- (వెనక్కి తిరక్కుండానే) మీరూ ఇల్లాంటివారనుకోలేదు.

రామం:- ఇదీ నచ్చకపోతే ఇంకెల్లా?-చూడు, ఎంత బాగుందో! పు ద్రాస్తోంది!

కమ:- (తీవ్రంగా) చాలు, మాట్లాడకండి!

రామం:- (తెల్లబోయి) అదేమిటి, కమలా ?

కమ:- (విసురుగా వెనక్కి తిరిగి) ఏమీ ఎరగనట్లు మాట్లాడతారేం ?

రామం:- (విసుగ్గా) ఏమిటి నువ్వనేది ?

కమ:- (ఏడుస్తూ) మీరే నా దైవం, నా సర్వస్వం అనుకున్నాను. ఈ జీవితానికి ఇహంపరం అన్నీ మీరే అని నమ్ముకున్నాను-(ఆవేశంతో) అందుకు నాకు ముట్టచెప్పవలసిన ప్రతిఫలం ఇదేనా ?

రామం:- అల్లా మాట్లాడతావేమిటి కమలా ? ఇప్పుడు నేను చేసిన లోటేమిటి?

కమ:- (నమ్మలేనట్టు చూస్తూ) ఎంత నిబ్బరంగా అడుగుతున్నారు !- ఎంత మోసం నేర్చుకున్నారు !

రామం:- నీ మాటలు నాకేమీ అర్థమవటం లేదు కమలా ?- నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా ?- నీ మాటలు నన్నెంత గాయపరుస్తాయో ఆలోచించావా ? గుండెలు పగలకొట్టడం సులభం కాని, అతగడం కష్టం కమలా !

కమ:- (మొండిగా) ఆ కష్టం పగలకొట్టేవాళ్ళకి ఏం తెలుస్తుంది ?

రామం:- (కోపంగా) చాలు, కమలా!-

కమ:- (భయపడి రామం దగ్గరగావచ్చి, కంగారుగా చూస్తూ, దణ్ణంపెట్టి ఏడుస్తూ) మీకు దణ్ణం పెడతాను-మెల్లిగా మాట్లాడండి, ఎవళ్ళేనా వింటారు.

రామం:- (కోపంగానే) వింటే తప్పేముంది ?- (ఎవళ్ళేనా వస్తున్నారేమోనని కంగారుగా ఇటూ అటూ చూసి, ఏడుస్తూ మధ్యగదిలోకి వెళ్ళిపోతుంది) నీ మస్తత్వం ఎంత సంకుచితమో తెలుస్తుంది. తెచ్చిన బహుమతికన్నా ఇచ్చిన హృదయాన్ని చూసి పుచ్చుగోడం సంస్కారం!- సరదాలకేనా సరిహద్దులుండాలి. (తిరిగివచ్చిసోఫాలో కూచుంటూ) ఎంత పని చేశావు, కమలా!-ఆభరణాలమీద అపేక్ష ఆడవాళ్ళని, రాళ్ళల్లా మారుస్తుంది గావును! (బాధపడుతూ) ఛీ!-

(అని విసురుగా లేచి కోటు తొడుక్కుంటాడు. వాచీ, పేకెట్‌లో పెట్టి జేబులో పడేస్తూ, చేతికి తగిలిన ఫొటో ఇవతలకి తీసిచూసి ఆశ్చర్యపడతాడు) ఎవరీ అమ్మాయి?-ఎప్పుడూ చూసిన జ్ఞాపకమేనా లేదే!- నా జేబులోకి ఎల్లా వచ్చింది చెప్మా ? కమల చూస్తే ఎంత గొడవ!...

[మధ్యగదిలోంచి విశాలాక్షి విసురుగా, "రామం!-రామం!-" అని పిలుస్తూ వస్తూవుంటుంది. రామం విని, కంగారుపడి, భయంగా 'అమ్మ!' అని ఫోటో కేసి అదుర్దాగా చూసి, కోటుజేబులో దాచుగో బోయి, భయపడి, ఎదురుగుండా ఉన్న రామాయణంలో దాచేసి, బెదురుగా కూచుంటాడు ]

విశా:- (వచ్చి, కొంచెం కోపంగా) ఏరా, రామం!- ఏమిటిది!

రామం:- ఏదమ్మా!

విశా:- పుట్టింరోజునాడు దాన్ని అల్లా ఏడిపిస్తావెందుకురా?

రామం - నేను ఏడిపించానూ?

విశా:- లేకపోతే అదెందుకు ఏడుస్తోంది?

రామం:- ఏమో, వెళ్ళి దాన్నే అడుగు!

విశా:- చదువుకున్నవాడివి, నీకూ అంత మూర్ఖత్వమైతే ఎల్లా నాయనా ?

రామం:- లేకపోతే ఏమిటమ్మా ఇది? తను పుట్టినరోజుగదా అని ముచ్చటపడి నేను ప్రెజంటు తెస్తే, ఇదేనా వరస ?

విశా:- ఏం, నచ్చలేదందా ?

రామం:- ఇంకా అనాలేమిటి?

విశా:- పోనీ, నచ్చిందే తీసుగొస్తానని లేకపోయావు?

రామం:- నేను అనలేదు !

విశా:- ప్రతివిషయానికీ పంతాలకి పోతే సంసారాలు ఎల్లా నడుస్తాయిరా?- ఎవరో ఒకరు తగ్గడం నేర్చుకోవాలి. వెళ్లు!-దానికి ఏమిష్టమో కనుక్కో!- అదే తెస్తానను!- ఇంటికోడలు పుట్టినరోజునాడు, కంట తడి పెట్టడం మనకే శ్రేయస్సు కాదు!

రామం:- అయితే ఇంకదాని పంతానికి అర్థంలేకపోయినా సరే అంటావు !

విశా:- (విసుగ్గా) అర్థంలేని పంతం గురించి, నీకుమాత్రం పంతం ఎందుకురా?- ఎవరైనా వింటే నవ్వుతారు కూడాను. జరిగింది చాలుగాని, వెళ్ళి దానికి నచ్చజెప్పి తీసుకరా!- వెళ్ళు-

[రామం ఇంక ఎదురు చెప్పలేక కదలబోయే సమయానికి విశాలాక్షి రామాయణం తియ్యబోతుంది ]

రామం:- (కంగారుగా) అమ్మా!-

విశా:- (రామాయణం బల్లమీద ఉంచేసి) ఏరా?-

రామం:- ఏం లేదు!-

విశా:- ఏం లేదంటూ అక్కడే నిలబడతావేరా?- వెళ్ళు లోపలికి?

రామం:- సరేనమ్మా!

[ఇంక ఏం చెయ్యడానికి తోచక, నిట్టూర్చి రామం మధ్యగది లోకి వెడతాడు.]

విశా:- ఆ తండ్రికి కొడుకు కదూ వీడూ !- దురుసుతనం బిరుసుమాటలూనూ!- ఏం సంసారాలో ఏమిటోగాని విసుగేసుకొస్తోంది! (ఇంతలో మధ్యగదిలోంచి సుందరం గబగబా కోటుస్టాండు దాకా వచ్చి, తల్లిని చూసి, తెల్లబోయి, పెద్దపనున్నట్టు కుడిఎదరకి బయల్దేరతాడు) ఏంరా, సుందరం?

సుంద:- (ఆగి) ఏం, అమ్మా!-

విశా:- ఇంకా అల్లానే తిరుగుతున్నావేరా?

సుంద:- ఇంకెంతసేపమ్మా, రెండు నిమిషాలు! మొహం కడుక్కుని వచ్చేస్తాను.

విశా:- ఇప్పుడేకదురా కడుక్కుని వచ్చావ్?

సుంద:- (తలగోక్కుంటూ వెఱ్ఱిగా నవ్వి) ఆదే!- ఇప్పుడే తలకి ఆయిలు రాసుగున్నాను. చేతులకి జిడ్డయింది. మొహం కడుక్కుని వచ్చేస్తాను!

విశా:- చేతులకి జిడ్డయితే మొహం కడుక్కుంటావ్?

సుం.ద:- అదేంమ్మా!- మొహానికి జిడ్డయింది; చేతులు కడుక్కుని వచ్చేస్తాను! (అని హడావుడిగా కుడి ఎదరలోకి వెళ్ళిపోతాడు.)

విశా.- సినీమా హడావుడిలో వీడికి మతిగూడా పోతున్నట్టుంది! (అని ఎదురుగా ఉన్న రామాయణం తీస్తుంది. పేజీలు తిరగేస్తుంటే ఫొటో కనిపిస్తుంది. విశాలాక్షి తెల్లబోయి ఫొటో తీసి, పరీక్షగాచూసి మరీ తెల్లబోయి) ఆ!- ఇది ఎవత్తీ?- ఎంత దారుణం! ఎంత దారుణం! వయస్సు ముదిరినా బుద్ధి మారినట్టులేదు ఈ ముసలాయనకి!...సిగ్గు లేకుండా ఎల్లా నవ్వుతోందో, ఈ పీనుగు! దీన్ని రామాయణంలో దాచుకుని, పైకి చదువుతున్నట్టు నటించి, చూసుగుని తెగమురిసిపోతున్నట్టున్నారు!- వహవ్వా!- ఎంత అప్రతిష్ట!- అందుకనేగావును, పుస్తకం వదిలి పెట్టడం కూడా మానేశారు!- రానీ చెప్తాను! (అని కోపంతో తలపంకిస్తూ, ఫొటో రామాయణంలోనే ఉంచేసి, పుస్తకం Teapoy మీద పడేస్తుంది. రంగయ్య కుడి ఎదరలోంచి వచ్చి, బాధగా విశాలాక్షిని చూసి రేడియోబల్లపైపు ఏమీ ఎరగనట్టు నడుస్తూంటాడు. విశాలాక్షి రంగయ్యని చూస్తుంది)... రంగయ్యా!

రంగ.- (గతుక్కుమని ఆగి) ఏమండి, అమ్మగారూ !-

విశా:- (కోపంగా) మీ అయ్యగారు నీళ్ళోసుగోడం అయిందా ?

రంగ:- ఏ- ఏ అయ్యగారండీ ?

విశా:- (విసుగ్గా) పెద్దయ్యగారోయి !-

రంగ.- అయిందండి!- తల దువ్వుకుంటున్నారు !

విశా:- (కోపంగా లేస్తూ) అవును మరి. షోకు చాలద్దూ ?-

[అంటూ విసుగా మధ్యగదిలోకి చక్కాపోతుంది. రంగయ్య హాయిగా నిట్టూర్చి, గబగబా రేడియో దగ్గరకెళ్ళి, బల్లమీద ఉన్న పుస్తకాలు ఒక్కొక్కటే తీసి, పుస్తకంపళంగా దులిపేస్తూ, తల పట్టుకుంటూ, మూలుగుతూంటాడు. కుడిఎదరలోంచి ఎవరో వస్తున్న అలికిడి కనిపెట్టి, హడలిపోయి కుర్చీదగ్గర పనిలేనట్టు చతికిల పడతాడు.]

సుంద - (కుడి ఎవరలోంచివచ్చి, రంగయ్యని చూసి, విసుగ్గా తలకొట్టుగుని) ఏం రంగయ్యా !- అక్కడ కూచున్నావ్ ?

రంగ:- ఏం లేదండి, ఐద్ధకంగా ఉందనీ-

సుంద:- ఏం ఒంట్లో బాగుండలేదా ?

రంగ:- ఆ, బాగానే ఉందండి!

సుంద:- మరి? - తీరిక ఎక్కువయిందేమిటి? - నిన్ను పెద్దయ్యగారు పిటు స్తున్నారు. లోపలికెళ్ళు!

రంగ:- ఇప్పుడక్కడున్నంచేకదండీ, వస్తున్నానూ? -

సుంద:- ఏమో! ఇప్పుడు మళ్ళీపిల్చారు. త్వరగావెళ్ళు!

రంగ:- చిత్రం!

[రంగయ్య బాధగా మధ్యగదిలోకివదతాడు వెంటనే సుందరం ఉత్సాహంగా చిటికె వేసి, కోటుస్టేండు దగ్గరకి పరుగెత్తుకెళ్ళి, కోటు కోసం తెగ వెతుకుతూంటాడు. ఆకోటు కనపడదు. ''కర్మ! కోటేమయిందీ!''అని గొణుక్కొని మతోయినట్టు స్టేండు వెనకవైపువెళ్ళి వెతిగేస్తూంటాడు. రంగయ్య మధ్యగదిలోంచి జాగ్రత్తగావచ్చి, ఇటూ అటూ చూసి, హాల్లో ఎవరూ లేకపోవుకుని ఉత్సాహంతో చిటికేసి రేడియోబల్లదగ్గిరికి పరుగెత్తుకెళ్లి పుస్తకాలు పిచ్చెక్కినట్టు తిరగేస్తూ ''కర్మ! ఐదేమయిందీ?'' అని గొణుక్కుంటాడు ఒకళ్ళనొకళ్ళు చూసుగోరు. ఇద్దరూ ఈ హడావుడిలో ఉండగా మధ్యగదిలోంచి రమణయ్య ''చాల్లెద్దూ, చెప్పొచ్చావ్!'' అని కేకలేసుకుంటూ చకాచకా వస్తాడు. రంగయ్య హడిలిపోయి పక్కని నక్కి, రమణయ్యరాగానే, మధ్యగదిలోకి చక్కాపోతాడు సుందరం హాలుమధ్యగా నిలబడిపోతాడు.]

రమ:- (విసుగ్గా) అందుకనే అంటారు. అనుమానం ముందూ. తరువాత ఆడదీ పుట్టిందని! ప్రతీదానికీ అంతులేే? - ప్రతీదానికీ ఆరాలే? - తలకాయి దువ్వుకుంటే తప్పొచ్చింది, ఈవిడగారికి!-(సుందరంతో) తలమీద జుట్టున్నాక దువ్వుకోకపోతే ఎల్లాగరా?

సుంద.- దుష్కోద్దని ఎవరన్నారు నాన్నా?

రమ:- ఇంకెవరూ? - మీఅమ్మ !- మీ అమ్మ !- నేను జుట్టుపోలిగాడిలా లేనని, మీ అమ్మ బాధ !

సుంద.- (కొద్దిగా నవ్వి) అదేమిటి, నాన్నా!-

రమ.- నీకేం తెలుసురా, నీ మొహం ? ఆడదానితో కాపరం చెయ్యడం బదులు అడివిలో కూచోడం నయం. చేసుకున్నవాళ్ళ బాధలు చూస్తూన్నావుగా ? నువ్వయినా సుఖపడుదువుగాని. ఒరేయి- నువ్వు పెళ్ళి మానేసెయ్యి !

సుంద.- (గతుక్కుమని) అదేమిటి, నాన్నా ?

రమ:- అల్లా చూస్తావేమిట్రా ? నేను చెబుతున్నానుగా, మానెయ్యి !

సుంద.- (అదోలానవ్వి) ఇప్పుడే వస్తాను, నాన్నా ! (అని కంగారుగా మధ్య గదిలోకి చక్కాపోతాడు.)

రమ:- (రోషంతో చూస్తూ సోఫాకేసివస్తూ) హుంష్ ! ఏం గొడవవొచ్చి పడిపోయిందీ ? స్త్రీ జీతం భ్రాంత హృదయం ఉన్మార్గపరివర్తినమ్, అన్నాడు దశరధుడు. ఎంత బాధపడి అన్నాడో ఇప్పుడు నాకు తెలుస్తోంది. రాముడికి పట్టాభిషేకం చెయ్యవద్దని ఆవిడ కూచుంది. ఆడవాళ్ళంతా ఇంతే ! (సోఫాలో కూమని, సిట్టూర్చి, రామాయణం తీసి, పేజీలు తిరగవేస్తూంటారు. కనిపించిన ఆ ఫొటో ఇవతలికితీసి) ఇదేమిటి?- (పరీక్షగాచూసి, ఉత్సాహంగా) ఎవరీ అమ్మాయి?... (మెచ్చుగుంటూ) ఆ!- కళ్లు అందంగా ఉన్నాయి'- మొహం ఎంత గుండ్రంగా ఉ దీ!- కన్నతండ్రి ఎంత అదృష్టవంతుడోగదా! మా మామగారూ కన్నాడు, ఏం లాభం?- ప్చ్!- అన్నట్టు, ఇది నా రామాయణంలోకి ఎల్లావచ్చింది చెప్మా!- మా ఆవిడచూస్తే ఇంకే మన్నా ఉందా?- లంకాదహనం అయిపోదూ? (అని ఫోటో వేరేతీసి రామాయణం Teapoy మీద ఉంచేస్తాడు. మధ్య గదిలోంచి, రంగయ్య ఒక ట్రే తీసుగుని వస్తాడు. రమణయ్య, రంగయ్యని చూసి ఫోటో దాచుకుంటాడు. ట్రేలో ఒక మిరాయి ఉండ వున్న

ప్లేటూ, మంచినీళ్ళున్న గ్లాసూ వుంటాయి రంగయ్య పుస్తకాలున్న చోటుకీ, రమణయ్యకీ, మధ్యగా వచ్చి నిలబడతాడు)... ఏమిటది, రంగయ్యా!

రంగ:- మిఠాయి వుందండి!-

రమ:- ఆడిసరే, ఎవరు తెమ్మన్నారు?

రంగ:- పెద్దమ్మగారు మీకు ఇచ్చిరమ్మన్నారండి!-

రమ:- (ట్రేలో ప్లేటు తీసుకుంటూ) ఊహూ!- ఆవిడగారు ఏం చేస్తోంది?

రంగ:- ఏం లేదండి!-

(రంగయ్య, తలమాత్రం వెనక్కి తిప్పి, రేడియో బల్లమీదున్న పుస్తకాలకేసి బాధగా చూస్తూ, ట్రే పట్టుగుని అక్కడే నిలబడి వుంటాడు మిఠాయి తింటూ, రమణయ్య మధ్య మధ్య ఆ ఫోటోకేసి ఉత్సాహంగా చూస్తూంటే, మధ్యగదిలోంచి విశాలాక్షి 'రంగయ్యా!' అని కేకవేస్తుంది రంగయ్య వినిపించుగోడు. రమణయ్య మాత్రం విని, ఫోటోకేసి భయంగా చూసి, వెనక్కి బెదురుగా చూసి, 'రంగయ్యా!' అని విశాలాక్షి మరోసారి కేక వెయ్యగానే, రమణయ్య ఆ ఫోటోని రంగయ్య చిన్నబనియనుకి ఎదర ఉన్న చిన్న జేబులో వదిలేస్తాడు. పుస్తకాలకేసి అస్తమానూ మతోయినట్టు చూస్తున్న రంగయ్య ఈ సంగతి గమనించడు.)

రమ:- (గట్టిగా) ఒరేయ్!-

రంగ:- (హడిలిపోయి) బాబయ్యా!- (ట్రేలో ఉన్నగ్లాసు దడదడలాడుతుంది.)

రమ:- ఆదేం రోగంరా, నీకూ?

రంగ:- ఏం లేదండి!

రమ:- అల్లాచూస్తావేం? (మంచినీళ్ళు తాగుతాడు)

రంగ:- ఊరికినే వండి!- అమ్మగారు, పిలుస్తూంటే!

రమ:- ఊ!- (గ్లాసు మళ్ళీ ట్రేలో పెట్టి) రంగయ్యా! నీ పెళ్ళాం తలకాయ దువ్వుకోద్దంటే మానేస్తావుట్రా?

రంగ:- అదెందుకంటుందండి?-

రమ - అందనుకోరా, ఏంజేస్తావ్ ?

రంగ.- పోనీ మానేస్తానండి!

రమ.- మానేస్తావ్?- ఓరి వాజమ్మా!- నీలాంటివాళ్ళనిబట్టే వాళ్ళల్లా నెత్తికెక్కుతున్నారు!- ఫో, లోపలికి!- (రంగయ్య తెల్లబోయి. మధ్య గదిలోకి నడ్చుకుపోతాడు. రమణయ్య రామాయణం తీసి ఇంకా ఏమైనా ఫోటోలు ఉన్నాయేమో అన్నట్లు, పేజీలు తిరగ వేస్తూం టాడు. ఇంతలో మధ్యగదిలోంచి విశాలాక్షి వస్తుంది)

విశా.- (వెటకారంగా) మీరు కూడ న్నారూ?- రామాయణం చదువుతున్నారా!

రమ:- ఆ!- చదువుతున్నాను. ఏం?

విశా.- చదవండి, చదవండి!- ఇంక పనేముంది, మీకూ?

రమ.- నాకేముంది?- రిటైరయిపోయాను. ఇంకేబాధ్యతాలేదు. నా ఇష్టం వచ్చినట్టుంటాను.

విశా:- అయితే ఇంక మాలెక్కేం లేదన్నమాట, మీకు?

రమ:- ఏమీలేదు' పైగా ఈ కోలాహలంలో కాస్త మనశ్శాంతి కలిగించేది ఇదొక్కటే నాకు, దీన్ని మాత్రం వదల్ను.

విశా:- (రోషంతో) వదల్రూ'

రమ:- (మొండిగా) వదల్ను!- ఏంజేస్తావ్?

విశా:- అయ్యో, అయ్యో!- అంతబరితెగించిపోయారూ? ఇంక దాంతో ఎప్పుడో లేచిపోతారేమో కూడాను!

రమ:- ఆ! ఏ అడవుల్లోకో లేచిపోతాను. అక్కడేనా హాయిగా ఉండొచ్చు. (మధ్యగదిలోంచి అనుమానంగా చూస్తూ రామం వస్తాడు)

రామం:- ఏమిటి, నాన్నా?-

విశా.- ఏముంది?- దాన్నుచ్చుగుని ఏ అడవుల్లోకో లేచి పోతార్ట!- రిక్షా పిలిపించు!

రామ:- అదేమిటమ్మా, మరీనూ!

విశా:- లేకపోతే అంతవయసొచ్చినమనిషి, ఆ పన్లేమిటి? ఆ మాట్లేమిటి?

రామం: ఏమయిందిప్పుడూ?

రమ:- ఏమీలేదురా అబ్బాయి!- నేచెప్తావిను!- దానితల ముగ్గుబుట్టలా నెరిసిపోయిందనీ, నా తల నల్లగా ఉండి పోయిందనీ, పైగా అది నేను నున్నగా దువ్వుకుంటున్నానని, దాని ఏడుపు!

విశా:- చాల్లెద్దురూ!- మాట మార్చి చెప్పడం మనకి మొదణ్ణుంచీ తెలిసిందేగా?

రమ:- అవును!- మనసుమాడ్చి కూచోపెట్టడం మనకి మామూలేగా?

రామం:- (రామాయణం జాగ్రత్తగా తీస్తూ) అది సరేగాని, అమ్మా!

విశా:- (కోపంగా) ఒరేయి, రామం! నువ్వుముందు ఆ రామాయణం కిందెట్టు!

రామం:- (తెల్లబోయి, పెడుతూ) ఏం?

విశా:- అపవిత్రగ్రంధంరా, అదీ!-

రమ:- ఇదిగో!- దాన్నే మన్నా అంటే నేనూరుకోను. తెలిసిందా?

[ మధ్యగదిలోంచి రంగయ్య వస్తాడు ]

విశా:- అంతవరకూ వచ్చిందీ?-

రంగ:- అమ్మగారూ! సినిమాకి టైమవుతోంది.

విశా:- (విసురుగా) రామాయణంలో పిడకల వేటలాగ నువ్వేమిటోయి! నోరుమూసుకో!

రమ:- వాడిమీద విరుచుకుపడతావెందుకూ?- సినిమాకంటూ బయల్దేరదీసిన దానివి నువ్వేగా?- నడుమరి!

విశా:- (మూతివిరిచి) ఆ!- (రామంతో) అబ్బాయి, కమలింకా రాదేరా?

రామం:- పిలు, రంగయ్యా!- (రంగయ్య పుస్తకాలకేసే చూస్తూ, బాధగా మధ్యగదిలోకి పోతాడు.)
నాకు అంత చెప్పినదానివి, నువ్వే ఇంత కోపం తెచ్చుకుంటే ఎల్లా చెప్పమ్మా!

విశా - మరీ ఇంత అసందర్భం మనిషయితే ఏం చెయ్యమంటావురా?- పోనీ ఊరుకుందాం అంటే ఊరుకోనిస్తేనా?

రమ.- అదీ సంగతి!- నేను జుట్టు, పీచుమిఠాయిలా ఉంచుకుంటే ఈవిడ ఇంచక్కా ఊరుకుంటుంది!

విశా:- చాల్లెద్దురూ!- మీకు ఎవరూ చెప్పలేరుగాని కాస్సేపు ఊరుకోండి!- (రామంతో) ఏరా, కమలకి నచ్చచెప్పావా?

రమ:- నచ్చచెప్పడం ఏమిట్రా?

రామం.- ఆ, తెచ్చిన వాచీ నచ్చలేదట! కోపగించి కూచుంది.

రమ:- ఆడివాళ్ళంతా అంతేరా! కోపగించడం వాళ్ళ జన్మ హక్కు!

విశా:- ఆ, మీరు మరీచెబుతారు! పుట్టినరోజు నాడైనా దానిష్టం కనుక్కోక పోతే ఎల్లా?

రమ:- ఆల్లానే, ఆల్లానే!- దీనికున్నంతకోపం ఈ తాలూకాలో ఎవరికీ ఉండదు. ఆ కోపానికి అర్థం అసలే ఉండదు. ఓసారి, దీని పుట్టిన రోజుకి పోనీ తింటుంది గదా అని, పావలా పకోడీలు పట్టుగొస్తే, నాలుగు మైళ్లు గిరవాటెట్టింది.

విశా:- చేసిన ప్రయోజకత్వానికి చెప్పుకోడంకూడా ఎందుకూ?- పుచ్చు గుందిరా, వాచీ!

రామం:- పుచ్చుగోక ఏంజేస్తుంది? లేకపోతే వీధులో గిరవాటెడతానన్నాను.

రమ:- అదీసంగతి!- అసలు నేనుకూడా పకోడీలు తెస్తూనే వీధులో గిరవా టెట్టపలసింది. చచ్చినట్టు తెచ్చుకు తిన్న!

విశా:- అబ్బబ్బా, దిక్కుమాలిన పకోడీలు!- ఊరుకుందురూ!

[మధ్యగదిలోంచి మూడు కాఫీ కప్పులతో బ్రేపుచ్చుగుని సుందరం, వెనకాల కమలా వస్తారు. కమలచేతికి వాచీ ఉంటుంది.]

ఇంకా కాఫీలు కలుపుతూ కూచున్నారా?

సుంద:- ఇంకెంత సేపమ్మా?- కాఫీలు తాగడమే ఆలస్యం!

(కమల అందరికీ కాఫీలు అందిస్తూంటే, సుందరం, రామం తొడుక్కున్న కోటు గుర్తుపట్టి, ఆదుర్దాగా స్టాండు కేసితిరిగి నెర్వస్‌గా నవ్వుతూ) అదేమిట్రా అన్నయ్యా!- ఇంట్లో కోటేసుకుని, కూచున్నా వేమిటి?- అబ్బ, ఉక్కబొయ్యటంలే?- ఏం, నాన్నా?-

రమ:- మరే! ఇప్పుడు కోటేశావేమిట్రా, తెలుగు సినిమాలో హీరోలాగ!- తీసెయ్!

(రామం, చిరునవ్వుతో లేచి, చేతిలో కప్పు Tea Poy మీద ఉంచి వెళ్ళి కోటు తీసేసి వస్తాడు. ఇంతలో రమణయ్య కాఫీరుచి చూసి )

ఎవర్రా కాఫీలు కలిపింది ?

కమ:- సుందరం కలిపాడు.

సుంద:- అవున్నాన్నా!- నేనే కలిపాను. (ఉత్సాహంగా) ఎల్లా ఉందీ ?

రమ:- ఇల్లానే ఉంది! ఇందులో పంచదార ఏదిరా?

సుంద:- తక్కువయిందా ?

రమ:- తక్కువేమిట్రా? అసలు లేదు!

విశా:- (రుచిచూసి) అబ్బ, ఇదేం కాఫీరా?- ఇంత పంచదార వేశావేమిటి?

సుంద.- (అనుమానంగా) ఎక్కువయిందా?

విశా:- ఎక్కువేమిట్రా, పానకంలా ఉంటేనూ!

రామం - (ఈ గొడవంతా చూసి, అనుమానంగా కప్పు తీసుకుని రుచిచూసి) రామ, రామ!-

సుంద.- నీ కాఫీకి ఏ మొచ్చిందిరా?

రామం:- ఏం, రావడమేమిట్రా?- ఇందులో ఉప్పేశావేమిటి?

సుంద:- ఆ!- ఉప్పేలావచ్చింది, చెప్మా!-

రామం:- బాబూ!- నువ్విక వంటింటిజోలికి మాత్రం వెళ్ళకు!- నీ అతిథ్యం పుచ్చుగుంటే మనుషులు బతగరు!

కమ:- (రమణయ్యతో) నేను తెస్తానుండండీ!- (మధ్యగదిలోకి వెడుతుంది)

సుంద:- అల్లా అంటావేమిట్రా?- కంగారులో ఏదో కొంచెం పొరపాటయింది.

విశా:- పొరపాటేమిటీ, అసలు ఇందాకట్నుంచి, వీడికి మతిలేదు.

సుంద:- (తెల్లబోయి) నీకెల్లా తెలుసూ?

విశా:- తెలియడానికి కొత్తేముంది? సినిమాకి ప్రోగ్రాం పెట్టినప్పుడల్లా నువ్వింతేగా?

సుంద:- (నీరసంగా నవ్వి) అదా?- మరే, మరే!- (అని అక్కడ కప్పులన్నీ హడావుడిగా ట్రేలో పెట్టుకుని మధ్యగదిలోకి చక్కాపోతాడు).

రమ:- అక్కడికి మహా తనకి లేనట్టు ఆ పిచ్చి! బాలరాజు సినిమాకి 32 సార్లు వెళ్ళింది, ఈవిడగారు.

విశా:- చాల్లెద్దురూ, అబద్ధాలు!

[రంగయ్య ట్రేతో మూడు కాఫీలు తీసుకుని మధ్యగదిలోంచి వస్తాడు. వెనకాలే కమల వస్తుంది. కాఫీలు రంగయ్య అందిస్తాడు]

రామం:- నాకక్కర్లేదోయి! నోరు చెడిపోయింది. (కమల, రామంకేసి ఉడుకు మోత్తనంగా చూస్తుంది)

విశా:- పోనీ, నువ్వు తీసుగోవే కమలా!

కమ:- అక్కర్లేదు తాగాను!

[మధ్యగదిలోంచి సుందరం వచ్చి స్టాండుదగ్గర నిలబడతాడు.]

రమ:- ఒరేయి, సుందరం! ఆ కాఫీ తాగిచూడరా? ఫష్టుగా ఉంది.

సుంద:- తాగానులెండి! (కాఫీ కప్పులు ట్రేమీద అంతా పెట్టేస్తారు. రేడియో బల్లదగ్గిర దిక్కులు చూస్తున్న రంగయ్యతో) ఏయి, రంగయ్యా!- అల్లా దిక్కులు చూస్తావేమిటోయి?- ఆ కప్పులు తీసెయి!

రంగ:- (కంగారుగా వస్తూ) చిత్తం!

రమ:- ఈ రంగయ్య వాలకం ఇందాకట్నుంచీ చూస్తున్నాను. కడుపులో పామున్నట్టు తిరుగుతున్నాడు. ఏదో ఉంది గ్రంథం!- ఏరా, అబ్బీ!-

రంగ:- (హడలిపోయి) ఏం-ఏం లేదండి! (తను పట్టుకున్న ట్రేలో కప్పులు దడదడలాడతాయి)

రామం:- అదేమిటోయి, అల్లా వణుకుతావ్? ఆ కప్పులు కింద పారేస్తావు కూడాను!- లోపలపెట్టు!

రమ - ఏం కమలా!- ఈవాళ సినీమా ప్రోగ్రాం లేదేమిటి?

కమ:- ఎందుకులేదూ?- సుందరం టిక్కట్లు కూడా తెచ్చాడు.

రమ:- అయితే నడవండి మరి!-

రామం:- (రామాయణం కేసి చూస్తూ) తలనెప్పిగా వుంది నేను రాను!- మీ రెళ్ళండి!

సుంద - (కోటు కేసి, కంగారుగా చూసి) అబ్బే, నేను మానేద్దామనుకుంటు న్నాను. ఒళ్ళు నెప్పులుగా వుంది! మీరందరూ తప్పకుండా వెళ్ళండి. మంచి సినీమా!

రంగ:- (పుస్తకాలకేసి బాధగా చూసి) ఎందుకండబ్బాయి గారూ!- మీరంతా వెళ్ళండి, నేనుంటాగా?

విశా:- అసలు ఇప్పుడు ఎవళ్ళేనా మాత్రం మానెయ్యడం ఎందుకూ?

రామం:- అవును, మానెయ్యడం ఎందుకూ?- నాకేదో తలనెప్పిగా వుందనీ!-

సుంద:- అదేమిటన్నయ్యా!—

కమ:- పోనీ, సుందరం?- బలవంత పెట్టకు!— (రోషంతో) వారికి వేరే పనుందేమో!

(రంగయ్య బాధగా చూసి మధ్యగదిలోకి వెళ్ళిపోతాడు)

రామం:- పన్లేంలేవు! రోజులు బాగా లేనప్పుడు తాళం వేసి అంతా వెళ్ళడ మెందుకని ఆలోచిస్తున్నాను! (కమల విసురుగా కుడి ఎదరలోకి వెడుతుంది )

రమ:- పోనీ, నేనుంటాను- మీరంతా వెళ్ళండి!

విశా:- ఏం? మీకుందేమిటి వేరేపని!

రమ.- నాకేం పనుంది?- ఇదుచ్చుగుని కూచుంటాను.

విశా - అదే!- నాకు తెలుసు!- ఇదుగో, మిమ్మల్ని ఒక్కర్ని ఇంటో అట్టే పెట్టి మేం వెళ్ళేది లేదు!- ఏమయినా సరే!- వెడితే అంతా వెళ్ళాలి!- లేకపోతే అంతా ఉండాలి.

రమ:- అంతేలే!- అందులో నువ్వు వొదుల్తావా, నన్ను?

విశా:- ఈ కంఠంలో ప్రాణం ఉండగా వొదల్ను!-

రమ:- (కోటుస్టాండు దగ్గిర తచ్చాడుతున్న సుందరంతో) వినరా, సుందరం!- అందుకనే నువ్వుకూడా పెళ్ళి చేసుగునీ పాడవకురా, అంటున్నాను!- ఇప్పుడేనా- తెలిసిందా?

సుంద:- అదేమిటి నాన్నా!-మధ్య నన్ను పెళ్ళి మానెయ్యమంటా వేమిటి?

రమ:- నీ సుఖం కోరేవాణ్ణి గనుక, కష్టనష్టాలు భరించినవాణ్ణి గనక, చెబుతున్నాను. పెళ్ళంటే ఏమిటో అని మురిసిపోతున్నట్టున్నావు. రేప్పొద్దున్న నీ పెళ్ళాం వచ్చి, ఆ క్రాపింగు బాగుండలేదూ, చలిమిడల్లా చేయించుగోండి, లేకపోతే గోదావర్లో దిగుతానంటుంది- ఏం జేస్తావు?

సుంద:- (తెల్లబోయి) అల్లా ఎందుకంటుంది నాన్నా?-

రమ:- అంటుందిరా, అంటుంది. ఇన్నేళ్ళు కాపరం చేశాక నన్నంటంలేదురా, ఈవిడ? నువ్వో లెక్కా, నీ పెళ్ళానికి?

విశా:- చాల్లెద్దురూ, వితండవాదన!- వాడికేం? నిక్షేపం లాంటి పిల్లని చేసుగుంటాడు. లక్షణంగా కాపరం చేస్తాడు. వాడు నా పోలిక!

రమ:- ఇదోటా!-ఇల్లా మొదలెట్టకు, వాడికి పెళ్ళిసంబంధాలు కూడా రావు!

[ఎడమ ఎదలోంచి "రామారావుగారూ!- రామారావుగారూ!" అని పిలుపు.]

రామ:- ఒరేయి, సుందరం!-ఎవరో పిలుస్తున్నారు చూడు! (సుందరం ఎడమ ఎదరకేసి వెడుతూంటే మళ్ళీ పిలుపు వినిపిస్తుంది) హనుమంతరావు గారయివుంటారు.

రమ:- హనుమంతరావుగారు, ఎవర్రా?

రామం:- మా ఆఫీసులోనే పని చేస్తున్నారు, నాన్నా!- ఈ వూరు కొత్తగా వచ్చారు. మనం సినీమాకెడుతున్నామంటే తనూ వస్తానన్నాడు పరిచయం చెయ్యచ్చుగదా అని ఇంటికి రమ్మన్నాను.

విశా:- మరి ఇందాక సినీమాకి రానంటావేం?

రామం:- వస్తానగాని, నువ్వు లోపలికెళ్ళి, కమలని ఇంక బయల్దేరమను!
(విశాలాక్షి కుడి ఎదరలోకి వెడుతుంది.)

రమ:- (జేబులు తడుముకుని లేచి) ఇప్పుడే వస్తాన్నా? (అని మధ్యగదిలోకి వెళతాడు.)

[రామం బరువుగా నిట్టూర్చి, సంతోషంతో రామాయణం తెరవబోయేసరికి ''అన్నయ్యా!-'' అని ఎడమ ఎదరలోంచి సుందరం కేక వినిపిస్తుంది. రామం, రామాయణం మూసేస్తాడు.]

సుంద:- (వచ్చి) హనుమంతరావుగారట్రా, వచ్చారు!

రామం:- అల్లానా, లోపలికి తీసుకురా!

సుంద:- సరే!- (అని మళ్ళీ ఎడమ ఎదరలోకి వెడతాడు మధ్య గదిలోంచి రంగయ్య వస్తాడు)

రామం:- (విసుగ్గా) రంగయ్యా!- నా స్నేహితు డొకాయన వచ్చారు. కాఫీ పట్రా ?- త్వరగా!

రంగ:- (విసుగ్గా) చిత్తం!- (మధ్యగదిలోకి వెడతాడు.)

రామం:- (సోఫాలోకి మారి రామాయణం గబగబా తిరగేస్తూ) ఈ దిక్కుమాలిన ఫోటో ఏమయిందిచెప్మా!... (ఎడమ ఎదరలోంచి సుందరం హనుమంతరావు గారూ వస్తారు. రామాయణం, రామం చేతులోనే ఉండిపోతుంది) రండి. హనుమంతరావుగారూ! కూచోండి

హను:- మళ్ళీ కూచోడం ఎందుకూ? సినీమాకి టైమవుతోంది. రండి పోదాం!

రామం:- ఫరవాలేదు. కూచోండి! మావాడు టిక్కట్లు తెచ్చేలాడులెండి

హను:- ఇంకనే!- (కూచుని) ఏమిటి మీరు చదువుతున్నారు ?

రామం:- అబ్బే, ఏంలేదు !- ఊరికే చూస్తున్నా !

హను:- (ఆత్రుతగా) ఏమిటది ?

రామం:- (నెర్వస్‌గా) రామాయణం !- నాన్నగారిది !

హను:- ఇంకనే !- ఇల్లా ఇవ్వండి ?- ఏదీ ! (అని మొండిగా అడిగిపుచ్చుకుని, కుర్చీలో జేర్లబడి పేజీలు తిరగేస్తూ, ఆగి, కళ్ళెగరేసి) ఓహోహో ! చెప్పారు కారేం ?

రామం:- (హడలిపోయి, చూడ్డానికి లేచి) ఏమిటీ ?

హను:- మీకు సంస్కృతం కూడా వచ్చన్నమాట !

రామం:- అదా ?-హూ!-అట్టేరాదు ! (రంగయ్య కాఫీతెస్తాడు) ఆ!- వారికియ్యి. ఆ పుస్తకం ఇల్లా ఇవ్వండి !

హను:- వొద్దండి ! ఇప్పుడే కాఫీ తీసుగుని వస్తున్నాను ?

రామం:- కాఫీకేమిటండీ ?- పుచ్చుగోండి ! - అది ఇల్లాఇవ్వండి ! (అని రామాయణం పుచ్చుగుని హాయిగా సిట్టూర్చి, సుందరంవైపు చూస్తాడు. ఈలోగా సుందరం కోటుస్టాండు దగ్గరజేరి, రామంకోటు, జాగ్రత్తగా తొడిగేసుగుంటాడు) ఆ, సుందరం !- అదేమిట్రా, నా కోటు తొడుకున్నావ్ ?

సుంద:- సీదా అన్నయ్యా ?- (అప్పుడే తెలుసుకున్నట్లు నవ్వి) నా కోటను కున్నాను, నేనూ !

రామం:- చాల్చాలు ! అది అక్కడపెట్టి అమ్మనీ వాళ్ళనీ రమ్మను.

సుంద:- ఆ ! (అంటూ సుందరం. కావాలనే కోటుతోటే కుడిఎదరలోకి చక్కాపోతాడు. మధ్యగదిలోంచి రమణయ్య వస్తూంటే, రామం బాధగా, రామాయణం Teapoy మీద ఉంచేస్తాడు.)

రామం:- (వచ్చి) ఏరా, వీళ్ళింకా రాలేదేం ?

రమ:- వస్తున్నారు నాన్నా !- హనుమంతరావుగారని చెప్పానే, వీరేనాన్నా! మా నాన్నగారు, రమణయ్యగారు !

రమ.- (హనుమంతరావు చేసిన నమస్కారం అందుకుంటూ) నేను తహసిల్దారు చేసి రిటైరు అయ్యాను !

హను:- (చిరునవ్వుతో) అల్లానాండి !

రమ:- కూచోండి !—ఆ కాఫీ పూర్తిగా తీసేసుగోండి ! (అని సోఫాలో కూచుంటాడు.)

[హనుమంతరావు కాఫీ తాగేస్తాడు కుడిఎదరలోంచి విశాలాక్షి, కమల వస్తారు. కోటు చేత్తోపట్టుగుని విచారంగా, మతోయినట్లు చూస్తూ, వెనకాలే సుందరం వస్తాడు. రాగానే కోటు స్టాండుకి తగిలించేస్తాడు.]

రామం:- (తల్లితో) వీరు నా మిత్రులు, హనుమంతరావు గారు!- (హనుమంతరావుతో) మా అమ్మగారు !- నా భార్య !- అతను నా తమ్ముడు, సుందరం. బి. ఎ. చదువుతున్నాడు. (నమస్కారాలు అవుతాయి)

హను:- (సుందరంతో) మీకూ సంస్కృతం వచ్చా ?

సుంద:- రాదండీ !

రమ:- మా ఇంట్లో నాకు తప్ప సంస్కృతం ఇంకెవ్వరికీ రాదండీ ! ఎంత పట్టుదల ఉండాలండీ దానికి ?

హను:- ఆ ! రామారావు గారికి వచ్చును కదండీ ?

రమ:- ఆ, వాడిమొహం ! వాడికేంవచ్చు ?—వాడికి తెలుగే తిన్నగా రాదు !

హను:- (నవ్వేసి) మా భలేవారే, మీరూ !

రమ:- అన్నట్లు మీకు పెళ్ళయిందా ?

హను:- ఈ మధ్యనే అయిందండి !

రమ:- (జాలిగా) అయిపోయిందీ ?

హను:- ఏం అలా అంటున్నారూ ? (సిగరెట్టు పెట్టె తీస్తాడు)

రామం:- (కంగారుగా నవ్వి) ఆ, ఏంలేదు !-వెడదామా, మరి!- నువ్వు కూడా రావోయి, రంగయ్యా !

రంగ:- (బాధగా) చిత్తం !- (సుందరంతో) అబ్బాయిగారూ ! పుస్తకాలు లోపల మీ బల్లమీద పెట్టెయ్యనాండి ?

సుంద:- (విసుగ్గా) అక్కర్లేదు, అల్లాఉంచు.

[హనుమంతరావు సిగరెట్ నోట్లో పెట్టుగుని, జేబులు తడుము కుంటూంటాడు]

రామం:- ఏం కావాలి, హనుమంతరావు గారూ ?

హను:- అగ్గిపెట్టి మర్చిపోయినట్టున్నాను !

రామం:- అగ్గిపెట్టా ? ఆ, రంగయ్యా ! నీదగ్గిర ఉంటుందిగా ? అయ్యగారికి ఓ మాటియ్యి !

[రంగయ్య, హనుమంతరావుకి ఎదురుగావచ్చి, చిరునవ్వుతో జేబులో చెయ్యెట్టి అగ్గిపెట్టి తీస్తాడు. అగ్గిపెట్టెతో, ఫోటో కూడా వస్తుంది. అగ్గిపెట్టి నేలమీదికి వదిలేసి, ఫోటోకేసి తెల్లబోయిచూస్తూ నిలబడి పోతాడు. తరవాత సుందరం కేసి వెర్రిగా చూస్తాడు. సుందరం కంగారుగా రామాన్ని చూస్తాడు. రామం హడలిపోయి రమణయ్య కేసి తిరుగుతాడు రమణయ్య ఏమీ ఎరగనట్లు పైకి చూస్తూ కూచుంటాడు. వెనకనుంచి విశాలాక్షి, కమల ఆ ఫోటోకేసి మాంచి కోపంతో చూస్తూంటారు.]

హను:- అల్లా అయిపోయా రేమిటి? అంతాను!- ఏమిటోయి, అది? (అని రంగయ్య చేతిలో ఫోటోతీసుగునిచూసి తెల్లబోయి, కోపంతో బిగుసుకుపోయి, భీకరంగా రంగయ్యనిచూసి, రంగయ్య బనియను బిగించి పట్టుగుని) నా భార్య ఫోటా నీ దగ్గరికి ఎల్లా వచ్చిందిరా? ఎల్లా వచ్చింది, నా భార్య ఫొటో !- చెప్పు ! !

[రంగయ్య పిచ్చాడిలా చూస్తూ, నోరు తేలేసి, బిగుసుకుపోయి ఉన్న పళంగా వెనక్కి-పడిపోతాడు. రామం, సుందరం పట్టుగుని ఆపుతారు]

సుంద:- రంగయ్యా !-

హను :- (కోపంగా) సీతా!- ఎంత ద్రోహం చేశావ్ నాకు!- వుండండి, ఇప్పుడే వస్తాను ! (అంటూ విసురుగా ఎడమ ఎదరలోకి పోతాడు)

రామం :- హనుమంతరావుగారూ?-

సుంద :- వదినా!- కొంచెం నీళ్ళుతే ! (కమల మధ్య గదిలోకి వెడుతుంది.)

రమ :- ఆ సోఫాలో కూర్చోపెట్రా ! (రామం, సుందరం, రంగయ్యని సోఫాలో జేరస్తారు కమల నీళ్ళు తెస్తుంది రామం రంగయ్య మొహంమీద నీళ్ళు చిలుకుతాడు. రంగయ్య కదులుతాడు) ఊ ! రంగయ్యా !- ఆ నీళ్ళు తాగు !-

రంగ :- (గ్లాసుడు నీళ్ళు గడగడా తాగేసి) హమ్మయ్య !

విశా :- (కోపంగా, గ్రహించినట్లు తల ఊపుతూ) అయితే, ఈ ఫోటో, ఆయన పెళ్ళాందా ?- హవ్వ !- ఏం పన్లండివీ ? (కమల రామం కేసి చురచురా చూస్తుంది)

రమ :- అనవసరంగా గొడవ పెట్టకు !- ఊరుకో, కాస్సేపు !- రంగయ్యా !- ఇప్పుడెల్లా వుంది ?-

రంగ :- (బెదురుతూ) బాగానే వుందండి. (అని లేవబోతాడు)

రామం :- లేవకు, ఫర్వాలేదు కాస్సేపు కూచో !- అసలు ఆ ఫోటో నీ కెక్కడిది ?-

రంగ :- (బిక్క మొహంతో) అదాండి ?- బుద్ధి గడ్డితిని తెచ్చానండి -

రామం :- ఎక్కణ్ణుంచి తెచ్చావు ?-

రంగ :- మరండీ !- ఇందాకా మన గ్రూపు ఫోటో కోసం ఫొటోగ్రాఫరు దగ్గిర కెళ్ళానండి. అతను లోపల ఉన్నాడు. బల్ల మీద ఆ ఫోటో వుంటే తీసి చూస్తున్నాను. ఇంతలో ఆయన వచ్చేశాడు. ఆయన చూస్తే మర్యాదగా వుండదని జేబులో పెట్టేశాను.

రామం .- హారి ?- తరవాత ఏం చేశావు ?-

రంగ :- తరవాత ఇక్కడికి వచ్చాక, ఫోటో బావుందని తీసి చూస్తుంటే, గబుక్కుని ఎవరో వచ్చారండి. కంగారులో సుందరంగారి పుస్తకంలో పెట్టేశానండి !-

సుంద :- నా పుస్తకంలో దాచింది నువ్వా, రంగయ్యా !- చంపేశావు కదురా !-

రామం :- మరి, నా కోటు జేబులోకి ఎల్లా వచ్చింది ?-

సుంద .- (నెర్వస్‌గా నవ్వి) అదా? నా పుస్తకంలోకి ఎల్లా వచ్చిందా అని, చూస్తూంటే ఎవరో వచ్చారన్నయ్యా!- కంగారులో నీ కోటుజేబులో పెట్టాను!-

కమ ,- అయితే వారి కోటుజేబులో ఫోటో నువ్వు పెట్టావా సుందరం ?-

రామం :- చూశావేమిటి?- అదా నీ కోపం !- నగల కోసం అనుకున్నాను, నేనూ '- ఓ చిన్న ప్రపంచ యుద్ధం లేవదీశావు కదురా !-

రమ .- మరి నా రామాయణంలోకి ఎల్లా వచ్చిందు?-

రామం .- (నెర్వస్‌గా నవ్వి) అదా ?- నా కోటు జేబులోకి ఎల్లా వచ్చిందా అని, చూస్తూంటే ఎవరో వచ్చారు నాన్నా !- కంగారులో నీ రామాయణంలో పెట్టాను !

విశా .- అయితే, వారి రామాయణంలో ఫోటో, నువ్వు పెట్టావా, రామం?

రమ :- చూశావేమిటి?- ఇదో పెద్ద C I. D ఇనస్పెక్టర్ మన కొంపలో! అందుకనా నా మీద అల్లా విరుచుకు పడ్డావు?- నీ పేరు 'విశాలాక్షి' అని మీ నాన్న ఊరికే పెట్టలేదు

రంగ :- మరి, మళ్ళీ నా జేబులోకి ఎల్లా వచ్చిందండి ?-

రమ :- అదా ?-నా రామాయణంలోకి ఎల్లా వచ్చిందా అని చూస్తూంటే ఈవిడగారి గొంతుక వినపడింది, రక్షణ ఎందుకేనా మంచిదని ని జేబులో పడేశాను

విశా :- మా గొప్ప పనిచేశారు. అసలు మగవాళ్ళంతా ఇంతే !-

రంగ :- పిల్లిని చంక నెట్టుకున్నట్టు, జేబులో పెట్టుకుని, పుస్తకాల్లో కనపడదేమా అని చస్తున్నాను, నేనూ !- ఎల్లా కనిపిస్తుందీ ?

విశా :- జరిగిన భాగోతం చాలుగాని, ఇల్లాంటి అప్రతిష్ట పనులు ఎప్పుడూ చెయ్యకు '-

రంగ :- (లేచి) చిత్తం !- ఇన్నాళ్ళకి సరిపోయే బుద్ధొచ్చింది, కదండి ?

రమ :- ఈ భాగోతం అప్పుడే ఎక్కడయిందీ?— అవతల అక్కడేం కొంపలు అంటుకుంటున్నాయో !-

రామం :- ఎక్కడ నాన్నా !-

రమ :- ఎక్కడేమిట్రా, మీహనుమంతరావింట్లో?-

**విశా :-** మరేనండోయ్!– పిచ్చాళ్ళా పరిగెత్తాడు, ఏంజేస్తాడో ఏమిటో!-
ముందు వాళ్ళింటికెడదాం నడవండి!-

రామం .- **అవును**, రండి !– వెడదాం !-

కమ :- రంగయ్యా!- త్వరగా రిక్షాలు కేకేయి !-

రమ :- అందుకనే గాంధీగారు మూడుకోతుల కథ అన్నిసార్లు చెప్పేవారు, తొందరపడి, ఏదీ చూడకు, ఏదీ వినకు, ఏదీ చెప్పకు అని !— నడవండి !-

(అందరూ తొందరగా ఎడమ ఎదరలోకి వెడతారు)

(తెర)



## పాత్రలు

జగన్నాథం
శాంతమ్మ
సుందరం
రంగయ్య
జ్ఞానశ్రీ
విక్రమరావు
డాక్టరు

(తెర తప్పుకోగానే ధనవంతుడైన గృహస్థు ఇంట్లో, తమ కుటుంబం కలుసుగునే ఉమ్మడిహాలు కనిపిస్తుంది. హాలుమధ్యగా సోఫా సెట్టు దగ్గరలో టేబుల్ ఫాను, R. M. వద్ద ఒక ఫోను ఉంటాయి R.F.లో ఒకటి, L. F. లో ఒకటి, M. B. లో ఒకటి మొత్తం మూడు మార్గాలు హాల్లోంచి రాకపోకల కుంటాయి. L.B. ప్రాంతాల్లో ఒక చిన్న డ్రాయరు, దానిమీద రేడియో, ఆపైన అల్లారం గడియారం ఉంటాయి. గడియారంలో టైము 4-45 గం॥లు అవు తుంది. L. F. లోంచి ముందు జగన్నాథం, వెనకాల ప్లీడరు గౌనూ, కాగితాలకట్టా పుచ్చుకుని రంగయ్యా వస్తారు. కాగితాల కట్ట రేడియోబల్లమీద పెడతాడు.)

జగ:- (సోఫాముందుకి నడుస్తూ, కాలర్ బేండ్సూ, కోటూ తీసేస్తూ) రంగయ్యా!- అబ్బాయి వచ్చాడా?

రంగ:- ఇంకా నేదండి

జగ:- ఉ!- (తనలోలాగ, తలపంకిస్తూ) వస్తాడొస్తాడు! (అని కోటు, కాలర్ బేండ్సు రంగయ్య కిచ్చేసి) ఆ కాగితాలు తీసుగెళ్ళి ఆఫీసులో బల్లమీద పడేయి! (అని సోఫాలో కూచుని, టీపాయిమీద ఉన్న పేపరు తీస్తాడు.)

రంగ:- (వినయంగా, చిరునవ్వుతో) అయ్యగారు!-

జగ:- ఏమిట్రా?

రంగ:- (జగన్నాథం తలకేసి చూపిస్తూ) తలపాగా అండి!

జగ:- ఆ !ఒహో. ఇదా!- దీసుగెళ్ళు! (ఇచ్చేసి) అన్నట్లు, ఒరేయి!- కారు, షెడ్డులో పడేసి డ్రైవరు చక్కా పోతాడేమో!- పనుంది, ఉండ మన్నానని చెప్పు. ఆ?

రంగ:- సిత్తం! తమకోసం ఎంకయ్యగారొచ్చి ఆఫీసులో కూకున్నారండి.

జగ:- వెంకయ్యాలేదు, దొంకయ్యాలేదు!- నాకు బోల్డు పనుంది. రేపు పొద్దున్న రమ్మను!-

రంగ:- సిత్తం! ఖాళీ సేసిన సుక్కయ్యే నేదండి?- ఆడి బాబండి, ఈ ఎంకయ్యే!

జగ:- (తగ్గి) అల్లాగా!- అయితే, ఒరేయి!- (మంచిగా, మెల్లగా) గుమాస్తా గారు ఇంటి కెళ్ళిపోయారూ, ప్లీడరుగారికి పాపం ఒంట్లో బాగా లేదూ, ఊ!- పొద్దున్నే దయచెయ్యమన్నారూ, అని జాగ్రత్తగా చెప్పి పంపించెయ్యి

రంగ:- సిత్తం! (లాయరు గౌను, కోటూ, కాలర్ బేండ్సూ, తలపాగా పుచ్చుకుని M. B. లోకి వెడతాడు.)

(R. F. లోంచి శాంతమ్మ యాదాలాభంగా వస్తుంది)

శాంత.- (జగన్నాథాన్ని చూసి) వచ్చారా? (అని వెంటనే R. F.కేసి తిరుగుతుంది. రంగయ్య. M B. లోంచి వచ్చి రేడియోబల్లకేసి వస్తూంటాడు.)

జగ:- (చిరుకోపంతో, శాంతని ఉద్దేశించి) ఆగు అక్కడ? (ఇద్దరూ ఆగిపోతారు. రంగయ్యతో) నువ్వుకాదు నవ్వుపోరా!- (రంగయ్య కాగితాలు తీసుకుని L F లోకి వెడతాడు.)

శాంత:- ఎందుకూ?

జగ - ఎందు కేమిటి?- అల్లా తొంగిచూసి చక్కాపోతున్నా వెక్కడికి?

శాంత:- బాగానే ఉంది వరస!- (వెనక్కి తిరుగుతూ) కాఫీ తెస్తానుండండి?

జగ:- (లేస్తూ)- కాఫీ వద్దు, కషాయం వద్దు నువ్వు ముందిల్లారా!- రా!- అల్లాకూచో!

శాంత:- (విడ్డూరంగా) ఇదేం మనిషమ్మా ఎక్కడోనూ!- (కూచుని, మొగుడు కోపం చూసి) అల్లా ఉన్నారే?- కేసేమన్నా పోయిందేమిటి?

జగ:- నీ మొహం!- కేసుగాదు కీర్తిప్రతిష్ఠలు గంగపాలయ్యాయి

శాంత:- అయ్యో, అదేమిటి?

జగ.- అదా? చేసుగున్న ఖర్మ!- ఇరవై ఏళ్ళ క్రితం చెప్పాను, కొడుకుట్టాడు, కొడుకుట్టాడని మరీ సంబరపడకే, ముందుంది ముసళ్ళపండగ అని.

శాంత:- మన సుందరమా?- ఏంచేశాడు?

జగ-: ఏంజేస్తాడు?- నా వంశమర్యాదలేదూ, అదట్టిగెళ్ళి మరలో పోయించి పిండాడిస్తున్నాడు!

శాంత:- ఖర్మ!- (భయంగా) ఏమిటో తిన్నగా చెప్పండి!

జగ:- అసలు దీనికంతకీ కారకురాలవు నువ్వు. నీ ఆసరా చూసుగునేగా వాడింత అఘాయిత్వం చేశాడు!

శాంత:- (ఖంగారుగా) అఘాయిత్య మేంచేశాదండి !- ఉన్!- నాకు దడొస్తోంది!

జగ:- వస్తోంది?- ఇంకేముందీ- కేషు డిస్ మిస్!

శాంత:- (రోషంతో) అంతేగాని, సంగతేమిటో చెప్పరు!-

జగ.- అయితే విను!- నీ కొడుకు పీకలోతు ప్రేమ వ్యవహారంలో దిగాడు.

శాంత:- ఏమిటి?- (ఆశ్చర్యంగా) నిజమే?-

జగ:- (కోపంగా నవ్వుతూ) అబ్బే, శుద్ధ అబద్ధం!- (జేబులోంచి తీసి) చదువుకో ఈ ఉత్తరం!

శాంత:- (చదువుతూ) ఏమిటిదంతా?- (తెల్లబోయి) ఈ కమలెవరండీ?

జగ:- రావణాసురుడు కూతురు! ఎవరైతే ఏం! ప్రస్తుతం మనవాడికి నెత్తిమీది దేవత, ఆ దేవత అందం చూసి వీడు జడుసుగున్నాట్ట! జడుసుగుని వెనక్కాలే పడ్డాట్ట! పడి ఘాటపు కొట్టినట్టు ప్రేమించేట్ట. ప్రేమించి, తన గుండెకాయ పట్టిగెళ్ళి ఆ అమ్మాయి పాదాలముందు పడేసి, తెలగపిండి తిన్నట్టు తినెయ్య మన్నాట్ట- ఆ అమ్మాయి తినేసిందిట! అదే ఇందులో కవి హృదయం !

శాంత:- ఏదో కుర్రతనం అయి ఉంటుంది.

జగ:- ఆ! నువ్విల్లా వెనకేసుగొస్తుంటేనే వాడంత ముందుకి దూకాడు. చివరికి పెళ్ళి చేసుగుంటానని కూడా ప్రమాణం చేశాట్ట!

శాంత:- ప్రమాణం కూడానా? (నోరునొక్కుకుని) అవ్వ! ఎంతపనిచేశాడు? ఇప్పుడెల్లా? పోనీ, ఆ అమ్మాయి స్థితిగతు లేమిటో, వంశమేమిటో-

జగ:- ఏమీ అక్కర్లేదు! ఆ పెళ్ళికి నేను ఎంతమాత్రం అంగీకరించ దలుచుగోలేదు! నువ్వూ వాడూ కలిసి ఏమనుకున్నా వూహాలు పన్ను తారేమో, అసలా సంబంధం గురించి ఈ ఇంట్లో ఇక ప్రస్తావించ డానికి వీల్లేదు. తెలిసిందా!

శాంత:- మీ మాట నేనెప్పుడేనా కాదన్నానా? కాని సుందరం సంగతి మీకూ తెలుసుగా! వాడు ససేమిరా అంటే?—

జగ:- నేను ససేమిరా అంటాను. అబ్బాయి అర్ధాంతరంగా వ్యవహరించి వంశమర్యాద మంటగలుపుతూంటే చూస్తూ ఊరుకోడానికి నేనేమీ చేతకాని వాణ్ణి కాదు ఈ ఇంట్లో నేనున్నంతకాలం నా మాట జరిగి తీరాలి. నేను సుందరానికి అన్నివిధాలా యోగ్యమైన మరో సంబంధం నిశ్చయం చేసుగొచ్చాను.

శాంత:- మరో సంబంధమా! మీకూ ఇంత పట్టుదలయితే ఎల్లాగండీ? వాడు వెళ్ళి పిల్లని చూసుగోవద్దూ!

జగ:- ఇంకా చూద్దం ఏమిటే! తాంబూలాలుచ్చుగుందుకు పెళ్ళివారిని ఇప్పుడే అయిదుగంటలకి రమ్మన్నాను. అంతా స్థిరపడిపోయింది.

శాంత:- వాడేమన్నా గొడవ పెడతాడేమో?

జగ:- ఇంట్లోంచి బయటికి నడవమంటాను.

శాంత:- (ఏడుపు ఆపుగుంటూ) అనేంమట్లండీ? నిక్షేపంలాంటి సంసారంలో ఎన్ని గొడవలొచ్చాయి? మీ పట్టుదలకి రెట్టింపు పట్టుదల వాడిదగ్గ రుంది. పైగా దురుసు మనిషి కూడాను.

జగ:- అయితే?

శాంత:- కాస్త ఆలోచించండి! తప్పులు క్షమించి ఆదుకోవలసిన కన్నతండ్రే విసిరికొడితే, విసుగెత్తి వాడే అఘాయిత్యమేనా చేస్తే జన్మంతా మధ్య నేను అలో లక్షణా అని ఏడవాలి! (అని ఏడుస్తుంది)

జగ:- ఏడిసినట్టే వుంది! వాడూ, వాడి తరపున వకాల్తానామా పుచ్చుగుని నువ్వూ ఇల్లా తయారవుతారని నాకు ముందే తెలుసు. ఇంక ఆ కుశాయి కట్టెయి! మనవాడు ప్రేమించిన కమల సంబంధమే స్థిరపరచు గొచ్చాను!

శాంత:- (ఆనందంతో, కళ్లు తుడుచుకుంటూ) నిజమే! మీరెంత మంచివారండీ! (జగన్నాథం నవ్వుతాడు.)

జగ:- అవునులే! మనకి జరిగిన లాభంబట్టిగా అవతలవాడి మంచి కొలవడం!

శాంత:- మీతో ఎవరూ మాట్లాడలేరు గాని, ఆ కమల ఎవరండీ ?

జగ:- సర్కిలు ఇనస్పెక్టరు విక్రమరావుగారు లేరూ ?

శాంత:- మొన్న ధైర్యంగా మంటల్లో దూకాడన్నారూ !

జగ:- ఊ! ఆయనే! ఆయనకి ఈ కమల ఒకత్తె కూతురు. అమ్మాయి బాగుంది. B.A చదువుతోంది. ఆస్తి ఫరవాలేదు. పైగా అబ్బాయి ఎన్నుకున్నాడు. అంచేత విక్రమరావుగారిని తాంబూలాలు పుచ్చుగుందుకు ఈ సాయంత్రమే ఆయిదుగంటలకి వచ్చెయ్యి మన్నాను. (ఉత్సాహంతో) అయిదవుతోంది !

శాంత:- ఊ! (ఆలోచించి, నిరుత్సాహంగా) చివరకి మీరన్నీ ఇల్లాగే చేస్తారు.

జగ:- ఏం ?

శాంత:- నాకొక్కగా నొక్క కొడుకుగదా, వాడి పెళ్ళి విషయంలో నా ప్రమేయం ఏమీ లేకుండా చేస్తారా ? నేవెళ్ళి పిల్లని చూసుగోడం, నాకు నచ్చడం, కట్నాలూ కానుకలూ మాట్లాడుకోడం ఏమీ అక్కర్లేదనుకున్నారా ? కొడుకు గారు రహస్యంగా ప్రేమించారు, తగుదునమ్మా అంటూ తండ్రిగా రెళ్ళి ఖాయపరుచు గొచ్చారు. పైగా ఇందాకట్నుంచీ నన్నాడిపోసుగున్నా రెందుకూ మధ్య ?

జగ:- ఇంతా విని మళ్ళీ నువ్వు సణుగుడు మొదలెట్టావేమిటి? కట్నాలూ కానుకలూ అన్నీ లాభసాటిగానే స్థిరపరుచుగొచ్చాను. ఇక అమ్మాయి ఉంటుందీ ! బంగారపు బొమ్మ ! ఎఱ్ఱగా, సన్నంగా, నాజూగా, రెండుజడ లేసుగుని—

శాంత:- (అడ్డొచ్చి, చిరాగ్గా చూస్తూ) రెండు జళ్ళేసు గుంటుందా ? అయితే మనకొద్దు.

జగ:- అదేమిటీ ?

శాంత:- రెండు జళ్ళేసుగునే అమ్మాయంటే నా కసలు ఒళ్ళుమంట. సుబ్బ రంగా పనీ పాటా నేర్చిన పిల్లయి ఉండాలిగాని, రెండు జడలూ, పదహారు జడలూ వేసుగుని సింగుసింగూ మంటూ తిరుగుతూ కూచుంటే ఇంక మనకేం చేస్తుందండీ ?

జగ:- బాగుంది! నీకు అభ్యంతరమల్లా రెండు జడలేగా?- పెళ్ళవగానే సిగ చుట్టించెయ్యి !

శాంత:- అసలీసుందరం వ్యవహారం నాకేం నచ్చలేదండి రాసింది చెబుతాను. మొహం వాయకొడతాన.

జగ:- ఏమో !- మీసాలొచ్చిన కొడుకుల్ని మిత్రుల్లా చూసుగోవడం తల్లిదండ్రులికి మంచిది.

శాంత:- ఏమీ ఫరవాలేదు. అసలు నేను కళ్ళెర్ర చేశానంటే వాడు గజగజా వణికిపోతాడు.

జగ:- ఏమీ లాభంలేదు. ఆ అమ్మాయి కళ్ళు సన్నచేసిందంటే వాడు గబ గబా బిలిసి లేచి చక్కాపోతాడు.

శాంత :- నావగ్గిర చెబుతారు ఎన్నికబుర్లేనానూ!-! ఇల్లా నీ ఇష్ట మొచ్చినట్టు ప్రేమించడమేనా ? మంచీచెడ్డా చూసుగోక్కర్లేదా ? పెద్దవాళ్ళని అడగక్కర్లేదా ? అని వాణ్ణి గట్టిగా నాలుగుమాటలు అడగలేరూ ! ఇంక వాడికి భయమూ, భక్తి ఎక్కణ్ణించి వస్తాయి? - ఏదో సంబంధం మంచిదయిందిగనక సరిపోయింది.

జగ :- ఎందుకడగనూ?-అడుగుదామనే నీదగ్గిర రిహార్సలు వేశాను !— నువ్వు మళ్ళీ మధ్యలో అడ్డంపడి ఆగమన్నావంటే జాగ్రత్త ! - అన్నట్టు మరోటి ! - నేను ఈ సంబంధమే స్థిరపరుచు కొచ్చినట్టు పెళ్ళివారొచ్చేలోపల అబ్బాయి కెంతమాత్రం తెలియకూడదు. తెలి సిందా ?- రంగయ్యా !-రంగయ్యా !

రంగ :- (L.F. లోంచి వచ్చి) ఏం బాబయ్యా ?

జగ :- లోపలికెళ్ళి మంగమ్మగార్నడిగి వేడి వేడి కాఫీపట్రా !

రంగ:- సిత్తం !

శాంత:- రంగయ్యా!- అబ్బాయికి పెళ్ళివా రొస్తున్నారు.

రంగ:- ఏటీ? సుందరంగారికే?- ఏవూరండి?

శాంత:- (ఉత్సాహంతో) ఈవూరే!- సర్కిలుగా రమ్మాయి !- B.A. పిల్ల!

రంగ:- (ఆనందంతో) ఏటి?- సెప్పారుగారేం?

జగ:- (విసుగ్గా) చెప్పి గంటయింది!- వెళ్ళి కాఫీ తీసుగురా! (రంగయ్య R. F. లోకి వెడతాడు. జగన్నాధం శాంతకేసి కోపంగా చూస్తాడు)

శాంత:- ఏం? అల్లా చూస్తారేం?

జగ:- నోట్లో నువ్వుగింజనానదు!- ఇప్పుడేనా సంబంధం విషయం రహస్యంగా ఉంచవే అని చెప్పాను?

శాంత:- మరిబాగుంది. వీడికి చెబుతే ఏమండీ?

జగ:- వీడెళ్ళి వాడురాగానే చెప్పేయ్యడుటండీ!- అప్పుడు నేనేమని కేక లేస్తానూ?

శాంత:- మరిచిపోయానండీ!- (రంగయ్య కాఫీ తెస్తాడు)

జగ:- రంగయ్యా! ఈ పెళ్ళి సంబంధం మాట మన సుందరానికేమీ తెలియకూడదు.

రంగ:- అదేటి బాబయ్యా!-పెళ్ళి కాయమయిందన్నారుగదా?

జగ:- అయిందనుకో!-

రంగ:- అయితే ఇంకేటండీ!- అబ్బాయిగారి కోసం గుమ్మంలో కాత్తాను. ఆరు రాగానే ఒక్క గుక్కలో సెప్పేత్తాను. నవ్వుతున్న ఆ బాబుని ఎత్తుగు తీసుగొత్తాను ఇంట్లోకి!

జగ:- (నవ్వుతూ) బావుంది!- (కోపంగా చూసి) వీడు- బజారెళ్ళి ఏమన్నా తేవాలిచే?

శాంత:- (ముఖావంగా) అన్నీ పొద్దున్నే తెచ్చాడు.

జగ:- (కోపంగా నవ్వుతూ) ఉహూ!- ఒరేయి. నువ్వు తక్షణం బజారు కెళ్ళి గమేక్సీను పట్రా. రూపాయి ఇదిగో!- (అని, తీసి ఇస్తాడు)

రంగ:- (పుచ్చుగుంటూ) ఏటందదీ ?

జగ:- పురుగుల విషంరా!-బొద్దింకలూ, నల్లులూ, అవీ చావడానికి.

రంగ:- ఓహో-అదాండి-గెమాస్కిమ!

శాంత:- (అయిష్టంగా చూస్తూ) ఇప్పుడెందుకండదీ?

జగ:- ఎందుకేమిటి? - అక్కడ ఆఫీసులో బీరువాల్నిండా పురుగులు జేరి పుస్తకాలన్నీ తగలేస్తున్నాయి. ఎప్పటికప్పుడే చెబుదామని మర్చిపోతున్నాను. వెళ్ళి తీసుకురా!

రంగ:- సిత్తం! (అని L.F. కేసి తిరుగుతాడు)

జగ.- ఇల్లాదొడ్డిదారమ్మట వెళ్ళు!-ప్రతీదానికి హాల్లోంచి తయారవక్కర్లేదు!

రంగ.- సిత్తం!-(అని R.F. లోకి పోతాడు)

శాంత:- (వెనకాలే వెడుతూ) త్వరగా రా!-పెళ్ళివారొస్తున్నారు!

జగ:- (జేబులోంచి ఉత్తరం తీసి చదువుతూ, శాంత వెనకాలే నడుస్తూ, హేళనకింద అభినయిస్తూ) ఒకర్నొకరు బాగా అర్థం చేసుకున్నాం. మనసారా ప్రేమించుగున్నాం?

శాంత:- (గుబుక్కుని ఆగి) చాల్లెద్దురూ! - మీకూ్కుడా మతిపోతోందేమిటి? ఎవరేనా వింటే నవ్వేతారనేనా లేదు మనిషికి. ఇన్నేళ్ళొచ్చి పైగా ఇప్పుడు ప్రేమట! (అని సిగ్గుపడుతూ, చిరునవ్వుతో కోప్పడుతుంది)

జగ:- (విసుగ్గా) నీ మొహంలా ఉంది!-నేను చదువుతున్నది ఈ ఉత్తరం!-

శాంత:- (నిరాశగా) అంతేనా?-

జగ:- (L.F. లో ఏదో విన్నట్టు నటించి) అదుగో, సైకిలు చప్పుడయింది! సుందరం వచ్చాడు. నువ్వక్కడ కూచో!- నేనిక్కడ కూచుంటాను. వాడు వచ్చేటప్పటికి మనం కోపంతో మటమట లాడిపోతోండాలి, తెలిసిందా? - దాంతో వాడు పిల్లి అయిపోయి 'అదేమిటమ్మా!-' అంటూ ముందు నీకేసి తిరుగుతాడు, ఆమటుగా నేను అడ్డమెళ్ళి 'ఏడిశావు నోర్మూయ్!-' అని అందుకుంటాను,

శాంత:- (భయంగా జూస్తూ) మరీ గట్టిగా కేకలెట్టకండేం? వాడసలే దురుసు మనిషి!-

జగ:- అల్లానేలే!-వస్తున్నాడు!-

(జగన్నాథం, శాంత కంగారుగా కూచుని L F. చేసి కోపంగా చూస్తూంటారు. సుందరం వచ్చి, వీళ్ళనసలు గమనించకుండా ఉత్సాహంగా కూనిరాగం తీసుకుంటూ M.B లోకి చక్కాపోతాడు. జగన్నాథం తెల్లబోతాడు, శాంత నవ్వాపుకుంటుంది. అది జూచి జగన్నాథం కోపంతో హుంకరిస్తూ లేచి)

జగ:- సుందరం! సుందరం!

సుంద:- (M B. లోంచి వచ్చి, యదాలాభంగా) ఏం, నాన్నా!-

జగ:- (ఎగాదిగా చూసి) నువ్వు అవకాశ మిస్తే రెండు మాటలు మాట్లాద తాను !

సుంద:- ఆదేమిటి నాన్నా, అల్లా అంటున్నారు!

జగ:- మా ఇద్దరి అవసరమూ నీకు ఇంక పూర్తిగా అనవసరమని తేల్చేశావు, గనక!-

సుంద:- (తెల్లబోతూ) నేనా ?

జగ:- ఆ!- అక్షరాలా నువ్వే! - తల్లిదండ్రులికి కొడుకుమీద ఎంత మమకారం ఉంటుందో, ఎన్ని ఆశలుంటాయో, తండ్రి అయ్యేదాక ఏ కొడుక్కీ తెలిసిరాదు. కాని చదువూ సంస్కారమూ కలవాడివి కదా, కొంతేనా ఊహించుగో లేవూ? ఊహించుకున్నా కనీసం మా ఇష్టా యిష్టాలు గుర్తించవలసిన గౌరవానికి కూడా మేం తగమను కున్నావా? ఏమిటసలు నీ ఉద్దేశం ?

సుంద:- (ఏమీ అర్థంకాక, తల్లివైపు తిరిగి) ఏమిటమ్మా ఇది?

శాంత:- అది కాదురామరీ!- (అని ప్రారంభించి జగన్నాథం కోపంచూసి ఆగిపోతుంది)

జగ:- నేను నిన్నడిగాను. నిజంచెప్పగలిగిన ధైర్యంఉంటే నాకు చెప్పు!

సుంద:- మీరడిగే దేమిటో నాకు అర్థం అవటంలేదు. అయినా మీకిష్టం లేందీ, కష్టం కలిగించేదీ, ఏ పనీ ఎప్పుడూ నేను చెయ్యలేదు?

జగ:- (యీసడింపుగా) ఒక్క ముక్కలో కొట్టేశాడు!

సుంద:- పోనీ, మీరు చెప్పండి నాన్నా! నేనేం తప్పుచేశాను?

జగ:- అయితే నే నడిగిన వాటికి డొంకతిరుగుళ్ళు, తిరక్కుండా, అబద్ధ మాడకుండా నిజం చెబుతావూ?

సుంద:- చెబుతాను.

జగ:- మన వంశానికి ఏమన్నా గౌరవప్రతిష్ఠలున్నాయా?

సుంద:- ఉన్నాయి.

జగ:- ఆ గౌరవ ప్రతిష్ఠలు నిలబెట్టవలసిన సమిష్టి బాధ్యత మనందరిమీదా ఉందా ?

సుంద:- ఉంది !

జగ:- అందులో నేనెక్కువ బాధ్యత వహించానంటావా, లేదంటావా?

సుంద:- లేదనేటంత నీచుణ్ణికాదు నాన్నా, నేను!

జగ:- పరవాలేదులే!- ఏ విషయంలోనేనా బాధ్యత ఎక్కువ వహించిన వాళ్ళకి హక్కులుగూడా ఎక్కువ ఉండడం న్యాయమేనా?

సుంద:- న్యాయ మేమిటి నాన్నా, ఉండి తీరాలి.

జగ:- అల్లాం టప్పుడు, ఈ వంశ విస్తరణ విషయంలో స్వతంత్రంగా, నిరంకుశంగా వ్యవహరించడానికి నీకు ఒక్కడికీ పూర్తి హక్కు ఉందా ?

సుంద - లేదు!

జగ:- లేదని తెలిసికూడా ఆ హక్కు నువ్వెందుకు పుచ్చుగున్నావు? మమ్మల్ని విస్మరించి, స్వతంత్రించి పెళ్ళి చేసుగుంటానని ప్రమాణం ఎందుకు చేశావు?

సుంద:- పెళ్ళా?- ప్రమాణమా? (తెల్లబోతాడు)

జగ:- అవునురా!- కమలకి!-

సుంద:- (హడలిపోయి) కమలా?

శాంత:- మరేరా! సర్కిలుగా రమ్మాయి!

సుంద:- (నమ్మలేనట్టు చూస్తూ) మీకెల్లా తెలుసూ?

జగ:- (శాంతతో) నవ్వు నోర్మూయి! (సుందరంతో) ఎవర్రా ఈ కమల?

సుంద:- కమల నాన్నా! (తబ్బిబ్బయిపోయి) అదే! విక్రమ రావుగారి అమ్మాయి.

జగ:- నువ్వు ప్రేమించావా?

సుంద:- (ఆశగా చూస్తూ) మరే నాన్నా!

జగ:- (గంభీరంగా) ఎందుకు ప్రేమించావు?

సుంద:- (తెల్లబోయి) ఎందుకా?

జగ:- (దగ్గరగా వస్తూ) ఏం? అల్లా తెల్లబోతావేం? ప్రేమించి పెళ్ళి చేసుగోకుండా బతగలేనని ఎల్లా నిర్ణయించుగున్నావు? నిర్ణయించుగుని పెళ్ళి చేసుగుంటానని ఏ ధీమాతో స్వతంత్రించి ప్రమాణం చేశావు? అసలు మేం ఇద్దరం బతిగున్న సంగతి మరిచిపోయావా? అనవసరం అని తేల్చుగున్నావా? ఏం మాట్టాడవేం? (అంటూ ఆ ధూకుడులోనే మధ్యనున్న శాంతతో)- your honour! ఒహో నువ్వా? మళ్ళీ ఎందుకు లేచావు? మాట్లాడొద్దని చెప్పలే?-

శాంత:- (ఉక్రోషంతో) మీరన్ని ప్రశ్నలూ ఒక్కసాగే అడిగేస్తూంటే వాడు సమాధానం ఎల్లా చెబుతాడు?

జగ:- అదా నీ రూలింగు? ఏమీ కష్టంలేదు. వీటన్నిటికీ ఒకటే సమాధానం. వెట్టి మొహం వెయ్యడం. నువ్వుకూడా వేసుగుని అల్లాకూచో!

సుంద:- క్షమించండి, నాన్నా! ఏరోజు కారోజే మీతో చెబుదా మనుకుంటున్నాను గాని అవకాశం చిక్కటంలేదు.

జగ:- ఈ శషబిషలేం నాదగ్గర పనికిరావు. నువ్వు హద్దు మీరి వ్యవహరించావా లేదా?

సుంద:- మీరు కూడా పూర్తిగా అంగీకరిస్తారని ఆశించాను.

జగ:- (బింకంగా) నువ్వు హద్దుమీరి వ్యవహరించావా లేదా?

సుంద:- ఇది నా జీవిత సమస్య నాన్నా!-

జగ:- (నిశ్చలంగా, మొండిగా) నువ్వు హద్దుమీరి వ్యవహరించావా లేదా?

సుంద:- వ్యవహరించాను.

జగ:- అందుకనే చెబుతున్నాను. నేనీ పెళ్ళికి అంగీకరించను.

సుంద:- నాన్నా!- మరోసారి ఆలోచించండి. నేనూ, కమలా మనసారా ప్రేమించుగున్నాం, పెళ్ళి చేసుగుంటానని ప్రమాణం కూడా చేశాను.

జగ:- నీకేం భయంలేదు. ఏ వస్తువు మీదేనా హక్కు ఇచ్చేవాడికే లేకపోతే పుచ్చుగునేవాడికి ఎక్కణ్నుంచి వస్తుంది? Sale of goods Act. కర్తకే హక్కు లేని ప్రమాణం భూమ్మీద ఏ కోర్టులోనూ చెల్లదు.

సుంద:- నా మాట వినండి, నాన్నా!

జగ:- పాయింటు లేకుండా వాదించకు, సుందరం! ఇంక ఆ గొడవ ఒదిలెయి. నేను మరో సంబంధం నిశ్చయం చేసుగొచ్చాను

సుంద:- (దెబ్బ తిన్నట్లు చూస్తూ) నాన్నా! మరో సంబంధమా?

జగ:- అవును!- సంబంధం అన్ని విధాలా యోగ్యమైంది. ఆస్తిపాస్తులుండి, చదువూ సంస్కారమూ కలిగి, అంద చందాలతో నిండిన పిల్ల. తాంబూలాలు పుచ్చుగుందుకు పెళ్ళివారిని ఇప్పుడే అయిదు గంటలకి రమ్మన్నాను.

సుంద.- వీల్లేదు, నాన్నా!- నా కమలకి నేను ద్రోహం చెయ్యలేను- ఈ పెళ్ళి చేసుకోడానికి నే నెంత మాత్రం అంగీకరించను.

జగ:- అయితే, నీ కమలకోసం కన్న తల్లిదండ్రులకి కూడా ద్రోహం చెయ్యటానికి సిద్ధపడతావన్నమాట!

సుంద:- అంతమాట అనకండి. నాన్నా! మీరిద్దరూ నాకు దైవసమానులు. కమల నా ప్రాణం!- ఏమిటమ్మా ఇదంతా?-

శాంత - (తోసుగొస్తున్న బాధ ఆపుకోలేక) బాధపడకు సుందరం! (భర్తతో ప్రార్థిస్తున్నట్టు) ఏమండీ!

జగ:- నువ్వేం మాట్లాడానికి వీల్లేదు!

శాంత:- (ఏడుస్తూ) నేనింక ఊరుకోలేను!

జగ.- అయితే వెంటనే లోపలికెళ్ళు! వెళ్ళు! - (శాంత భర్తవైపు రోషంతో చూచి R F. లోకి వెళ్ళిపోతుంది) ఆలోచించుకో సుందరం!- అవతల పెద్దమనిషికి మాటిచ్చాను. నా గౌరవమర్యాదలనీ, నీ ప్రేమ వ్యవహారాలనీ తూచుగు చూసుగో! - తేల్చుగు చెప్పు!

సుంద:- పోనీ, ఈ సంబంధం విషయం నాతో ముందుగా చెప్పకపోయారా ?

జగ - నువ్వేమన్నా ముందుగా నాతో చెప్పావు, కనకనా? ఏదో కాలేజీకి వెళుతున్నావు, బుద్ధిగా చదువుకుంటున్నా వనుకున్నాను గాని, మధ్యలో మిఠాయి దుకాణం పెట్టావని నాకేం తెలుసు? జరిగిందేదో జరిగి పోయింది. అదంతా మర్చిపో! ఇహనో ఉప్పుడో పెళ్ళివారొచ్చే సమయంకూడా సమీపించింది. నా గౌరవం నిలబెట్టదల్చుగున్నావో, గోరీ కట్టెయ్య దల్చుగున్నావో నిర్ణయించుగో! నా నిర్ణయం మాత్రం మారదు లోపల పనుంది, అయిదు నిమిషాల్లో వస్తాను. (అని విసురుగా R.F. లోకి వెడతాడు).

[సుందరం ఖిన్నుడై R.F. లోకి చూస్తూ ఉండిపోయి నిట్టూర్చి ఆవేశంతో L F. వరకూ నడిచి ఆగిపోయి ఆలోచించి వెనక్కి తిరిగి సోఫావైపు వస్తూ, "చివరికి ఎల్లా అయింది నా బ్రతుకు !" అనుకుని కోటు తీసేసి విరక్తితో సోఫాలో గిరవాటేసి, సోఫాలో కూలబడి బరువుగా, భారంగా చేతుల్లో మొహం దాచుగుని మధన పడతాడు]

రంగ:- (చేత్తో పొట్లం పుచ్చుగుని L F. లోంచి వస్తూ, ఉత్సాహంగా) వచ్చారా, బాబయ్యా!

సుంద:- ఏమిటిది, రంగయ్యా!

రంగ:- ఇషమండి!

సుంద:- (ఆశ్చర్యంగా) ఆ !-విషమా?

రంగ:- (విసుగ్గా) ఆ- అయ్యగారికి పని నేకపోతేసరి!- శుభమా అంటూ పురుగుల విషం తెమ్మన్నారు. (అంటూ ఆ పొట్లం రేడియో బల్ల మీద ఉంచేసి, నవ్వుతూ, ఆనందంతో) అది సరేగాని, తమరింకా ఇల్లా కూకున్నారేం ?

సుంద:- (విచారంగా, నవ్వి) ఏం చెయ్యమంటావు ?

రంగ:- ఇదేటండీ-తాంబూలా లుచ్చుగుందుకు పెళ్ళివారొత్తూంటే పెళ్ళికొడుకు గారు ఎల్లా ఉండాలి!- చాకల్లా సోకు సేసుగుని వాల్ రైట్ నెంబరు వన్ లా ఉండాలి !- రండి!

సుంద:- (బాధగా) నేనంటే నీకూ ఇంత వేళాకోళంగా ఉందా రంగయ్యా!

రంగ:- అబ్బా, ఈ సిగ్గు, సిటపటలూ, సదువుకున్నాళ్ళకి సామాన్యమే !- కానండి అబ్బాయిగారు ! ఇంక మీ సైకిలికి దీపం నేకపోయినా ఇబ్బంది నేదు.

సుంద:- (గట్టిగా) రంగయ్యా !

రంగ:- (హడలిపోయి) ఏటండీ!—

సుంద:- (కోపంగా లేచి) వాగుడు కట్టిపెట్టి నోరు మూసుగుని లోపలికెళ్లు!- [రంగయ్య తెల్లబోయి చూసి ఏమీ అర్థమవక R.F. లోకి పోతాడు. సుందరం విసుగెత్తి పోయినట్లు చూసి M.B. వైపు విసురుగా తిరిగి, రేడియో బల్లమీదున్న విషం పొట్లం దగ్గర ఆగిపోతాడు. బల్లని సమీపించి, ఆ పొట్లం తీసి, తీక్షణంగా చూస్తూ ఆలోచిస్తాడు, నిట్టూర్చి. తల పంకించి పొట్లం రేడియో బల్లమీద ఉంచేస్తాడు. రంగయ్య, సాసర్లతో నాలుగు కాఫీ కప్పులు, నిండుగా ఉన్న కాఫీ పాట్ ఒక ట్రేలో ఉంచి పట్టుగొస్తాడు.]

సుంద:- ఇదంతా ఎవరికి, రంగయ్యా ?

రంగ:- (ముభావంగా) పెళ్ళోరికండి!

సుంద :- నాన్నగారేం చేస్తున్నారు?

రంగ :- మేడమీద కెళ్ళారండి !

సుంద :- అమ్మగారూ?

రంగ :- ఆరూ కండి ! అదేటో గాని అమ్మగారొక్కరూ కదుత్రై అయ్యగారు కస్సుమంటున్నారండి !

సుంద .- (రోషంతో) ఊహూ ! తమరి మాట నెగ్గించుగు తీర్తారన్న మాట ! సరే ! ఒరేయి నువ్వు వీధులో కూచుని ఎవరేనా వస్తూంటే చెప్పు !

రంగ .— అమ్మగారు పిలుత్తారండి !

సుంద :- (కోపంతో) జన్మ అంతా వాళ్ళకే చెయ్యాలా !— ఈ ఒక్కసారి నా మాట విను. ఇంకెప్పుడూ ఏమీ అడగను !

రంగ :- మాటంటేనే అంత కోపం ఎందుకండి ? ఎడుతున్నానుగా ? (L.F. లోకి వెళతాడు)

[సుందరం గబగబా రేడియో బల్ల దగ్గిరికి వెళ్ళి ఆ పొట్లం తీసుగుని వచ్చి, నెర్వస్‌గా విప్పి, రెండు మూడు చెమిచాలు ఓ కప్పులో వేస్తాకు మళ్ళీ మరో రెండు చెమిచాలు వేస్తాడు. పొట్లం మళ్ళీ యధాప్రకారం కట్టేసి, రేడియోబల్ల మీద పెట్టేసి వచ్చి నిశ్చయించుగున్నట్టు చూస్తూ, ఆ కప్పు సాసరుతో సహా తీసి చేత్తో పట్టుగుని మళ్ళీ ఆలోచన తెగనట్టు రేడియో బల్లకేసి నడుస్తాడు. రంగయ్య L. F. లోంచి తొందరగా వస్తాడు సుందరం కప్పు సాసరు హడావుడిగా రేడియో మీద ఉంచేసి రంగయ్యకి అది కనపడకుండా నుంచుంటాడు.)

సుంద :- (నెర్వస్‌గా నవ్వుతూ) ఏం రంగయ్యా ?

రంగ .- అర్జంటుగా మాట్లాడాల్టండి. తమ కోసం ఎవరో అమ్మాయిగా రొచ్చారు.

సుంద :- (విసుగ్గా) ఎవరా అమ్మాయి?

రంగ :- ఎవరో కమలమ్మగార్టండి !

సుంద :- (ఉత్సాహంతో) కమలా !- (అని రంగయ్యని పక్కకి నెట్టి L. F. లోకి తొందరగా వెడతాడు)

(R. F. లోంచి జగన్నాథం, శాంత వస్తారు]

జగ :- అబ్బాయి ఏడిరా?

రంగ :- ఎవరో అమ్మాయి గారొ_త్తె ఇప్పుడే ఈధులో కెల్లా రండి.

జగ :- అమ్మాయా ?

రంగ :- మరేనండి. కమలమ్మగారంట !

శాంత :- ఏమిటీ !- కోడలుపిల్లే?- చూశారా. మామగారి కంటె నాలుగాకులు ఎక్కువే చదివింది కోడలు ?

రంగ :- ఏటీ?- ఈ అమ్మాయిగారే పెళ్ళికూతురు ?

జగ :- (విసుగ్గా) ఆ !- సమయానికొచ్చి స్వారస్యం కాస్తా చెడగొట్టింది. ఒరేయి!- నోరు తెలేసుగుని అల్లా నుంచోక పోతే ఆ ట్రే అక్కణ్ణించి తీసెయ్య కూడదూ ? నలుగురూ వచ్చినప్పుడు అడ్డంగా పెట్టద్దని చెప్పలే?-

[L. F. లోంచి 'జగన్నాధంగారూ! జగన్నాధంగారూ!' అని కేకలు వినిపిస్తాయి]

అదుగో పెళ్ళివారొచ్చినట్టున్నారు. సమయానికి హాల్లో ఒక్కడూ ఉండడు. వెళ్ళి లోపలికి తీసుగురా రంగయ్యా !

శాంత :- ఒరేయి, నువ్వాపని, చూడు ! మీరెళ్ళి తీసుగురండి !

జగ:- (చరచర చూస్తూ) పెళ్ళికొడుకు తల్లికదూ ! ఇహ మొదలు!- (తొందరగా L.F.లోకి వెడతాడు)

శాంత:- (రంగయ్య ట్రే రేడియో బల్లమీద పెట్టాక) ఆ పొట్లమేమిటి, రంగయ్యా?

రంగ:- ఇదాండి! పురుగుల ఇషమండి!

శాంత:- ఖర్మ ! మతిలేకపోతేసరి! – అవి పట్టిగెళ్ళి వారి ఆఫీసు గదిలో పారెయి-ఏ గుమాస్తావో తింటాడు, తీరిపోతుంది!-

[రంగయ్య పొట్లం తీసుకొని M B.లో వెడతాడు, శాంత చీర వగైరా ఉత్సాహంతో సర్దుకుంటుంది. L. F. లోంచి జగన్నాధం, సర్కిలు ఇన్‌స్పెక్టరు విక్రమరావు, వేదాంతి జ్ఞానశ్రీ ప్రవేశిస్తారు.]

జగ:- (వారికి కుర్చీలు చూపిస్తూ) దయచేయండి!-ఏమేవ్! మన వియ్యంకులు విక్రమరావుగారు! (విక్రమరావు నమస్కరిస్తాడు)

శాంత:- అల్లానా?—నమస్కారమండి.

జగ:- (జ్ఞానశ్రీ వైపు చూపిస్తూ) వీరు?-

విక్ర:- మా మామగారు!-జ్ఞానశ్రీగారు!

జగ:- (ఆశ్చర్యంగా) ఏమిటీ?-సాక్షాత్తూ ఆ జ్ఞానశ్రీగారే! దయచేయండి!- ఇన్నాళ్ళూ తమ అమూల్య వేదాంత రచనలు పారాయణ చేసుకోవడమేగాని, తమర్ని దర్శనం చేసుకునే అదృష్టం కలుగలేదు. ఈవేళ తమ రాకతో మా ఇల్లు నిజంగా పావనమయింది. (జగన్నాధం, శాంత నమస్కరిస్తారు.)

జ్ఞాన: చాలాకృతజ్ఞుణ్ణి! (నమస్కరిస్తాడు. అంతా కూచుంటారు.)

జగ: ఎంతమాట! (శాంతతో) వారెవరో తెలుసా! మన దేశానికి విజ్ఞాన దీపం అని ప్రఖ్యాతి చెందినవారు. వేదాంత పరిజ్ఞానంతో అద్వితీయులనిపించుగున్నవారు.

శాంత : అల్లానా?- మన సుందరం నిజంగా అదృష్టవంతుడండీ!

జగ. ఇంకా సందేహమా?- అన్నట్లు భగవద్గీతావ్యాఖ్యానం తరువాత మళ్ళీ తమ రేమైనా రాశారా?

జ్ఞాన: రచనకూడా ఒకవ్యసనమే! అలవాటుపడ్డ చేతికి, చెయ్యాడుతున్నంతసేపూ ఆటవిడుపు ఉండదు. అంతా భగవత్సంకల్పం. ఈమధ్యనే ఉపనిషత్సారమనే రచన పూర్తి చేశాను అచ్చు అవుతోంది.

జగ: ఉపనిషత్సారమే! చాలా బాగుంది.

శాంత: రంగయ్యా!- కాఫీలు తీసుగురా!

జ్ఞాన: ఈమధ్య జరిగిన ఘోర అగ్ని ప్రమాదంలో మా అల్లుడు చూపెట్టిన ధైర్యసాహసాలకి నేను కేవలం ముగ్ధుణ్ణయి, పండితుణ్ణి మాత్రమే గనక, ఈ గ్రంథాన్ని అతనికి అంకితం ఇవ్వదలిచాను.

జగ: తప్పకుండా ఇవ్వవలసిందే.

విక్ర: ఆ! మంటల్లో దూకడంకూడా ఓ ఘనకార్యమే?- ఇల్లాంటివి మా ఉద్యోగంలో నిత్యకృత్యాలు.

శాంత:- (ఆశ్చర్యంతో) ఏమిటి?– నిత్యకృత్యాలా?

విక్ర:- అక్కగారు ఈమాత్రానికే ఆశ్చర్యపడుతున్నారు. నేను మిలటరీలో పనిచేసిన రెండేళ్ళలోనూ ప్రతీరోజూ రెండు చెవుల్లోంచి తుపాకీ గుళ్ళు ఊరికే దూసుకుపోయేవి. కత్తులు తెగగీసుకుపోయేవి.

శాంత:- అబ్బ!- ఇంక చెప్పకండి నాకు భయమేస్తుంది!

(అంతా నవ్వుతారు)

జగ:- ఒరేయి, రంగయ్యా!

రంగ:- (M.B. లోంచి) బాబయ్యా!

జగ:- ఏం జేస్తున్నావురా?- కాఫీలు ఇయ్యి.

రంగ:- సిత్తం!

జగ:- (ఉత్సాహంతో) ఊ! - బావగారు తాంబూలాలకి ఆయుధాలుచ్చుకుని బయల్దేరారేమిటి?

విక్ర:- ఇదా?- (నవ్వి) బజారులో పని చూసుగుని మామగారు స్టేషను కొచ్చారు. ఇద్దరం ఇంటికెళ్ళి సక్రమంగా వద్దాం అనుకుంటుంటే ఇంతలో ఏక్సిడెంటని ఫోను వచ్చింది. దాంతో ఆలస్యమయిపోయింది. అంచేత ఇల్లానే చక్కావచ్చాం.

జగ:- ఏక్సిడెంటే?- ఏమిటది? (రంగయ్య పాట్‌లో కాఫీ ట్రేలో ఉన్న మూడు కప్పుల్లోనూ పోస్తుంటాడు)

విక్ర:- ఆ!- ఎవడో కుర్రాడిమించి లారీ వెళ్ళిపోయిందట.

జగ:- రామ, రామ! -

శాంత:- పోనీ, ఆ కుర్రాడు బతికాడాండీ పాపం?

జగ:- ఇంకా బతగడ మేమిటే? - మీద నుంచి వెళ్ళింది. చంటి పిల్లాడి సైకిలనుకుంటున్నావేమిటి? - దారుణమైన లారీ!

శాంత:- చావులు ఎంత విచిత్రంగా ఉన్నాయి, ఈ రోజుల్లో!

[నాలుగో కప్పుకోసం తటపటాయించి, రంగయ్య రేడియో మీదున్న కప్పు సాసరు ట్రేలో పెడుతూంటాడు]

జగ.- (విసుగ్గా) ఏరా ? -

రంగ:- ఇదుగోనండి! - (అని కంగారుగా ఆ కప్పులోగూడా కాఫీ పోస్తాడు చెమచాలతో సుబ్బరంగా కలుపుతాడు)

విక్ర:- అసలు విచిత్రమేమిటంటే, ఆ కుర్రాడు బతిగాడు.
శాంత:- (ఆశ్చర్యంతో) ఏమిటీ? -
జగ:- What ? -
విక్ర:- పైగా లారీలో ఉన్న డ్రైవరు గుండె ఆగి చచ్చిపోయాడు.
శాంత:- అయ్యో ! -
జగ:- చాలా విచిత్రంగా ఉందే? లారీకింద పడ్డవాడు బతిగి, నిక్షేపంలా లారీలో కూచున్నవాడు పోవటమేమిటి?
[రంగయ్య ట్రే తీసుగు వచ్చి నిలబడతాడు]
జ్ఞాన:- చూపు పడాలేగాని మృత్యువుకి చోటుతో పనేముందండి? - "జనన మరణములు జనులకు నిక్కము అడివిలో నున్న, ఆలయంబున నున్న!-"
జగ:- ఏం చక్కగా శలవిచ్చారు!- ఎవరికి ఎప్పుడు ఋణం తీరిపోతుందో ఎవరు చెప్పగలరు ? - కాఫీ ఇవ్వరా ! (కాఫీలు అంతా అందు కుంటారు)
జ్ఞాన:- బాధపడపలిసింది దాన్ని గురించికాదు. ఈ ఋణం ఎంత పెంద్రాకే తీరిపోతుందా అని. పాప పంకిలం కదండీ, ఈ ప్రపంచకం? విముక్తుడైనవాడే ధన్యుడు. "సంసృజ్యతే న ఉత్క్రామన్ మ్రియ మాణః పాప్మనో విజహాతి" అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. (అని కొంచెం తాగుతాడు)
శాంత:- (కొంచెం చప్పరించి) అల్లానాండి? - అయితే ఈ మనుష్యులకి మృత్యువంటే ఇంకా భయం దేనికండి!
జ్ఞాన:- (కొంచెం చప్పరించి) అజ్ఞానమండీ, అజ్ఞానం! - మృత్యువుచేసే పనేమిటి, చెప్పండి? దేహాన్నుంచి, ఆత్మను వేరు చేస్తుంది. ఇహానికీ మనకీ అనుబంధాన్ని అంతరింప జేస్తుంది. బ్రహ్మరుద్రులైనా దాని దారికి అడ్డురాలేరు. అయినాసరే ఈ దేహాన్ని నమ్ముకుని ఇహాన్ని అనుకుని మనకి మనమే పొదిగి పెంచుగున్న ఈ ఐహిక బంధాలు మనలో శాశ్వతత్వాన్ని ప్రేరేపిస్తాయి కాని అశాశ్వతమయి తీరు తుందని అనుభవం మనకి సిద్ధాంతీకరిస్తుంది అప్పుడే మనస్సు మధనపడుతుంది. బంధాలను తెంచుగోలేక, మృత్యువుని ఎదుర్కో-

లేక చివరకి భయానికి బానిసయిపోతుంది. కాని, అనుభవాన్ని ఆధారంగా చేసుగుని, విద్యని పనిముట్టుగా ఉపయోగించుకొని అర్థం లేని ఈ ఐహిక బంధాలను మనకి మనమే త్రెంచివేసుగున్ననాడు మనకీ మృత్యువంటే, భయంకాదు ఖాతరే ఉండదు! - (చప్పరించి మొహం చిట్లించి) కొంచెం పంచదార వెయ్యి, నాయనా!

జగ:- (రంగయ్య ట్రేలో పంచదార కప్పు చెమిచా జ్ఞానశ్రీకి అందించాక తనూ మొహం చిట్లించి) ఇల్లా ఉందేమిట్రా! ఏ పనీ తిన్నగా చెయ్యవు! (అని విసుక్కుంటూ తనుకూడా పంచదార కలుపు గుంటాడు.)

విక్ర:- మృత్యువు గురించి మేమంత ఆలోచించ లేదుగాని మనకి స్వతహాగా మృత్యువంటే తెగనిర్లక్ష్యం! ఎంచేతంటే, మృత్యువుకీ మాకూ ప్రతీ రోజూ ముఖాముఖి ఓ చిన్న మీటింగవుతూనే ఉంటుంది. అంతేకాదు. చివరికి ఈ మృత్యువుకి కూడా మేమంటే భయమేటి చెప్మాఅని విసుగేసుకొస్తోంది! (అని కాఫీ చప్పరిస్తాడు.)

జ్ఞాన:- (కాఫీ మళ్ళీ పీల్చి) యోధులకి ఆ ధిక్కారం ఉగ్గుపాలతో వస్తుంది!

జగ:- (హుందాగా, తలపంకించి; చిరునవ్వుతో) అదేం చిత్రమోగాని నాకూ మృత్యువంటే మహా నిర్లక్ష్యం సుమాండి! నిండైన జీవితాన్ని అనుభవించేశాను. గృహస్థాశ్రమ ధర్మాలను అనుసరించి ఆచరించవల సిందంతా చేశాను. ఫలితం గురించి అసలు నేనెప్పుడూ ఆలోచించను.

జ్ఞాన:- చాలాబాగుంది. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన ?

జగ:- చిత్తం! ఇంక నాకు కావలిసిందేముంది, చెప్పండి? "నీ ఇష్టం వచ్చి నప్పుడురా!" అని మృత్యువుకి కాలదోషం లేని నోటీసు ఒకటిచ్చేసి కూచున్నాను.

శాంత:- ఆమాటకొస్తే ఐహిక బంధాలూ, ప్రాపంచిక చింతలూ మగవాళ్ళ కింటే ఆడవాళ్ళకే చాలా తక్కువ!

జగ:- ఆమాటమాత్రం ఉంది చూశారూ, అది ఒప్పుగోడానికి ఎంత మాత్రమూ వీల్లేదు! ఒకసారి ఈ మనిషే వజ్రాలవడ్డాణం కావాలని మూడు రోజులు ఉపోషాలుచేసి మరీ సాధించింది!

కాంత:- (చిరుకోపంతో) చాల్లెద్దురూ! జీవితానికల్లా నే నడిగింది అదొక్కటేగా? పైగా ఇల్లా మొదలెడితేనే పెట్టుకోడానికి కూడా విసుగేసుగొచ్చి పెట్టిలోనే పడేశాను. అయినా. అవేమన్నా ఆకలితీరస్తాయా, కన్ను మూశాక కూడా వస్తాయా ? ఏమిటో! అసలిప్పుడు అబ్బాయికి అన్ని విధాలా తగిన సంబంధం వచ్చిందా, ఇంక నాకే భ్రాంతిలేదు! ముత్తైదువుగా మాత్రం ఈ తనువు చాలిస్తే చాలని ముక్కోటి దేవతలకీ మొక్కుతున్నాను. అంతే !

[కాఫీ తాగడానికి బాగుండలేదన్నట్లు మొహం పెట్టి రంగయ్యకేసి కోపంగా చూచి కాఫీ కప్పు టీ పాయిమీద పెట్టేస్తుంది.]

జ్ఞాన:- అంతేనండి! జీవిత పరమార్థం తెలుసుగున్నాక ''దేహమే నాటి కాణాచి దానిమీద తీపి కొరగాదు'' అనిపించి తీరుతుంది. శుద్ధ పామరత్వంగాని మనమెంత. మన తనువెంతండీ! ఇది ఉత్త నీటి బుడగ కదండీ? తేల్లాం, పేల్లాం! అంతే!- ''కలుములు నిత్యంబుకావు, మెరపు మెరయురీతి. మేఘంబుట్ల, బుద్బుదంబుల భంగి పోవును చెదరి!''

జగ:- ఆహా! జ్ఞానశ్రీగారూ! మీరు మా ఇంట్లో ఉండి పోకూడదూ?

జ్ఞాన:- ఎందుకూ ?

రంగ:- తమరి పురాణం అత్తమానం ఇనచ్చుగందా అని!- (అంతా నవ్వు తారు)

జగ:- పురాణమేమిట్రా, నీ మొహం!- ఈ కప్పులు తీసెయ్!

రంగ:- సిత్తం ? (జ్ఞానశ్రీతో) నాకేటి తెల్దని అయ్యగారి అభిప్రాయం. మాటంకి అర్థాలు పూర్తిగా తెలవకపోయినా మొత్తమ్మీద సంగతేటో నాగేత్తానండి!

జగ.- (హేళనగా) ఆ, ఆ!- అల్లాగ లాగే ఒకసారి నా ప్రాణం మీదకి తెచ్చాడు.

రంగ:- (కప్పులుతీస్తూ) ఉండండయ్యగారూ !- (జ్ఞానశ్రీతో) నానో సిన్న సంగతి సెప్పనాండీ !

జ్ఞాన:- అవశ్యం చెప్పు. ఏమిటది ?

రంగ:- వేదాంతంకన్నా, ధైర్యంకన్నా, తెలివితేటలుకన్నా సివరకి భక్తికన్నా. దరిద్రం గొప్పదండి!

జ్ఞాన:- చాలా కచ్చితంగా చెబుతున్నావే?

రంగ:- సిత్తం! ఎంత వేదాంతం తెలిసినా, ఎంత ధైర్యం ఉన్నా, ఎన్ని తెలివితేటలున్నా, ఎంతభక్తి ఉన్నా బతుకుమీద ఆశమాత్రం పూర్తిగా పోదండి. కాని దరిద్రం మాత్రం దండిగాఉంటే, బాబయ్యా! మడిసికి బతుకుమీద ఆశ సత్తెప్రమానికంగా ఎంటనే పోద్ది!

[ఒక్క క్షణం ఒకరికేసి ఒకరు చూసుగుంటారు]

జగ:- అరి వీడి శిఖాతరగా!- వీడు చెప్పిందాంట్లో కొంత పాయింటు ఉందండోయి!

జ్ఞాన:- లేదండి, జగన్నాథంగారూ?- నానాబాధలు పడుతూ విముక్తి కోరే వాడికీ, సకలసుఖాలూ అనుభవిస్తూ విముక్తి అర్థించేవాడికీ తేడా లేదూ?- అంతేకాదు, దారిద్ర్యం, బాధా జలాక్షరాలు. వేదాంతం, విజ్ఞానం శిలాక్షరాలు!

జగ:- అదీ పాయింటేనండోయి!-

[L F. లోంచి సుందరం ఉత్సాహంగా వస్తాడు.]

శాంత:- అడుగో, సుందరం వచ్చాడు!

జ్ఞాన:- ఇతనే నేమిటీ, మన కమలనాధుడు!

జగ:- (ఉత్సాహంగా) ఒరేయి సుందరం!- వారెవరో తెలుసా? జ్ఞానశ్రీ గారు!- మీ మామగారికి మావగారు!

సుంద:- (ఉత్సాహంగా) సుప్రీం కోర్టన్నమాట!- నమస్కారమండి!

జగ:- సంతోషించాం గాని, ఇంత ఆలస్యం చేశావేం?

సుంద:- ఆ!- ఎవరో స్నేహితు డొస్తేనూ!-

జగ:- నాకు తెలుసురా ఎవరొచ్చారోనూ!-

సుంద:- అదీ తెలిసిందీ?- కాని, నాన్నా!- మీరెంత నాటకం ఆడారు!

జగ:- ఏమనుకున్నావు మరి? నీ గూడు పురాణీలు నా దగ్గిర పని కొస్తాయిరా?

సుంద:- అమ్మకూడా అల్లాగే నిలబడేప్పటికి నిజం అనుకుని నేను చాలా బాధపడిపోయాను,

శాంత:- (బాధగా) చూశావా - (సుందరంతో) ఏం చెయ్యనురా? మన లెక్కే మన్నా ఉంటేగా? ఆయనకి ఎంత తోస్తే అంతే!

జ్ఞాన:- ఏమన్నా స్వవిషయమా?

జగ:- అదేంకాదు. మంచితమాషా జరిగింది, జాగ్రత్తగా వినండి! - (ఉత్సాహంతో) ఊ!- బాధపడి చివరికి ఏమాలోచించావురా?

సుంద:- ఆలోచనేముంది నాన్నా!-సర్వనాశనం అయిపోయాననుకున్నాను చివరికి నామీద నాకే అసహ్యమేసి - (అని రేడియో బల్లవైపుచూసి కప్పు, సాసరూ కనపడకపోగా నోరు తెరుచుగుని నిలబడిపోతాడు.)

జగ:- ఊ! - అసహ్యమేసి? ఏంజేశావు? (అని ఉత్సాహంగా చూస్తాడు)

సుంద:- (బిగుసుగుపోయి) రంగయ్యా! - బల్లమీద కప్పు సాసరూ ఏమయాయి?

జగ:- అబ్బో. మాట మార్చకుండా చెప్పవోయి! - నే చెప్పలా? - వీడేదో దూడేసి ఉంటాడు.

సుంద (కంగారుగా, భయంగా) మీరుండండి, నాన్నా! - రంగయ్యా! - అక్కడ కప్పేంచేశావు!

రంగ:- (కంగారుగా) అక్కడిదేనాండి?

సుంద:- ఆదేరా! - ఏంజేశావు?

రంగ:- కాఫీపోసి ఆ రెవరికో ఇచ్చానండి!

సుంద:- (హడలిపోయి) ఏమిటి! అదే!! - (నోరుమూసుగుని గుడ్లు పేల్తున్నట్లు చూస్తాడు)

జగ:- రంగయ్యా! - వాడికో కప్పు కాఫీ ఇయ్య?

శాంత.- ఏమిట్రా సుందరం, ఆ అల్లరి?

సుంద:- అల్లరి కాదమ్మా! - (చెప్పబోయి సంజ్ఞాు మొదలెట్టి మానేసి) ఎంత దారుణం జరిగిపోయింది? - ఇప్పుడెల్లా?

జగ:- (అనుమానంగా) దారుణ మేమిట్రా!

విక్ర:- (లేచి) ఆ, ఏంలేదు! - మీరుండండి! - అసలువిషయమేమిటో చెప్ప కుండా అంత కంగారు పడతావేమిటి, సుందరం! - ఏమిటి సంగతి? (మాట రాక సుందరం భయపడుతూ వెఱ్ఱిగా అందరికేసి చూస్తూ నిలబడిపోయాడు )

జ్ఞాన:- కుఱ్ఱతనం కదూ? - కంగారు సామాన్యమే మరీ!-ఏమిటి, నాయనా, సంగతి?

శాంత:- (బాధగా) సంగతేమిటో చెప్పకుండా ప్రాణం తీసేస్తారు! - ఈ వంశంలో ఉన్నదే, ఇది! ఉస్! - నాకు దడస్తోంది!

సుంద:- (మతోయినట్లు చూస్తూ) వస్తోందీ!—

జగ:- (కాస్త కోపంతో లేచి) ఏడిశావుగాని, ఏమిటి సంగతి?

సుంద:- (గుటకేసి, తమాయించుగుని) ఇందాకా నామీద నాకే అసహ్యమేసి, విషంతాగి చచ్చిపోదామనీ!

జగ:- (ఆశ్చర్యంగా) ఆ!—

శాంత:- అయ్యో, విషమే! - ఎందుకు తాగావురా, నాయనా?

జ్ఞాన:- ఈమధ్య విషాలేం పనిచెయ్యటం లేదు! - మీరు అనవసరంగా కంగారు పడకండి!

సుంద:- (విసుగ్గా) అబ్బ అసలు నేను తాగందే! - కప్పులో విషం బాగా వేసుగున్నాను. అందులో కాఫీ పోద్దాం అనుకుంటూండే కమల వచ్చింది.

విక్ర:- (అనుమానంగా) ఊం, వస్తే?-

సుంద:- హడావుడిలో ఈ కప్పు రేకి మోమీద ఉంచేసి వెళ్ళిపోయాను!

జ్ఞాన:- (అనుమానంగా) ఊఁ వెడితే?-

సుంద:- (రంగయ్య కేసి చూపెట్టి) ఈ చవట ఆ కప్పులో కూడా కాఫీపోసి మీలో ఎవరికో ఇచ్చేసినట్టున్నాడు!-

విక్ర:- (హడలిపోయి) ఇప్పుడు మేం తాగిన కాఫీలో విషముందా?

సుంద:- అంతలోనూ కాదండి? ఒక్క కప్పులోనే ఉంది! అది మీలో ఎవరు తాగారు? (మిగతా అందరూ నోళ్ళు తేలేసి, బిగుసుగుపోయి కుర్చీల్లో చతికిలపడిపోతారు.) ఆ, ఆ! కంగారుపడకండి! ఆ కప్పులూ ట్రే అన్నీ యిల్లా పట్రా?

జగ:- ఎంతపని చేశావురా, అప్రాచ్యుడ! - (ప్రయత్నం మీద గుటక వేసి) అసలు నీకు విషం ఎక్కడిదిరా?

సుంద:- పురుగుల విషం! - ఇందాకా రంగయ్య తెచ్చాడు!

శాంత:- అదే! - నేను అప్పుడే మొత్తుగున్నాను. ఈ దిక్కుమాలిన విషం ఇప్పుడెందుకండీ అని! - వింటేనా? ప్లానుప్లానంటూ ప్రాణంమీదికి తెచ్చారు!

జగ:- (విసుగ్గా) అర్థం పర్థంలేకుండా ఏమిటా వాగుడు? - కాస్సేపు ఊరుకో!

సుంద:- రంగయ్యా! ఇల్లా తీసుగురా! - (అని చూసి) ఈ కప్పులో అడుగుని తెల్లగావుంది. ఇదే విషంకప్పు! (అంతా ఆ కప్పుకేసి భయంగా చూస్తారు) ఎవరికిచ్చావురా, ఈ కప్పు? (రంగయ్య ఏడుపు మొహంతో చూస్తాడు)

జగ:- నీ మొహం ఈడ్చ! - మాట్లాడరా?

రంగ:- (శ్మశాన మొహంతో) గుర్తు నేదండి!

జ్ఞాన:- (బాధగా, కోపంతో) అంత కళ్ళుమూసుగుని ఎల్లా ఇచ్చావు? - ప్రాణమా, మరోటా? అసలు నేను రాను మొర్రో అంటూంటే బలవంతాన్ని ఇతనే లాక్కొచ్చాడు! ఇప్పుడు నా గతేమిటి?

విక్ర:- అనవసరంగా అంత కంగారు పడతారెందుకూ? ఆ విషం కాఫీ మీరే తాగారని ఎక్కడుంది?-ఏమో, ఎవరి ప్రాణంపోతుందో!-(భయంకరంగా చూస్తూ) ఏయి, రంగయ్యా! - ఎవరికిచ్చావు ఆ కాఫీ! (రంగయ్య హడలిపోయి ట్రేతోసహా ఒణికిపోతాడు).

శాంత:- కప్పులు కూడా బద్దలుకొట్టేస్తావేమిట్రా! ముందవి కిందెట్టు! (టీపాయిమీద పెడతాడు.)

విక్ర:- (బ్రతిమాలుతున్నట్టు) ఇదిగో! - ఆ విషం కప్పు నాకివ్వలేదు కదూ? చెప్పు రంగయ్యా! నువ్వు చాలా మంచివాడవు! - నాకివ్వలేదు కదూ ?

జ్ఞాన:- నీకివ్వలేదు. నాయనా! - కేవలం నాకు కేటాయించబడ్డ యములాడు వాడు! - (బాధగా కళ్ళుతూ) నాకే ఇచ్చాడు! - నా ప్రాణం పోతోంది! - మందేదేనా చూడండి, బాబూ, నా ప్రాణం!

శాంత:- ఇల్లా మీనమేషాలు లెక్కెడుతూ కూచుంటే నా ప్రాణం కాస్తా పోతుంది తీరిపోతుంది! - డాక్టర్నెవర్నైనా పిలవండీ ?

జగ:- ఉండవే! - నాకేమిటో ఒళ్ళు తిరుగుతున్నట్టుంది! - నాయనా, సుందరం! - నా ప్రాణం!

సుంద:- కంగారుపడకండి నాన్నా! డాక్టర్ని పిలుస్తాను! - పురుగుల విషానికి ప్రాణం అంత తొందరగా పోదు.

జ్ఞాన:- ఏమయితేం, పోడం రూఢేగా ? ముందు డాక్టర్ని పిలవ్వయ్యా!

సుంద:- (కంగారుగా ఫోనుదగ్గరకెళ్ళి, ఫోనుతీస్తాడు!) హలో! 290 ఇవ్వండి! రంగయ్యా! - డ్రైవరు ఉన్నాడేమో చూడు! (రంగయ్య వెళతాడు. మళ్ళీ ఫోనులో) హలో! - డాక్టరుగారున్నారాండి! ఒహో మీరేనా ? డాక్టరుగారూ! - నేనూ! - నేను లాయరు జగన్నాథంగారబ్బాయిని. మా యింట్లో దారుణమైన ప్రమాదం జరిగిందండి! - అర్జంటుగా రావాలి! ఏమిటి? - దోసెలు తింటున్నారా? - ఇక్కడ ప్రాణాలు పోతున్నాయండీ! - ఎవరికో ఇంకా తెలీదు! - ప్రస్తుతం అంతా ప్రమాదంగానే ఉన్నారు! - పొరపాటుని పురుగుల విషం కలిపిన కాఫీ ఎవరో తాగేశారు! - మీరు త్వరగా రావాలి! - కారు పంపించ మంటారా? - మీ కారులోనే వస్తారా? - సరే, త్వరగా రండి! - (అని ఫోను పెట్టేసి శ్రమ పడిపోయినట్టు నిట్టూరుస్తాడు)

జ్ఞాన:- దోసెలేమిటోయి? (అని ఆశగా చూస్తాడు)

జగ:- ఆ, ఖర్మ!-ఆ డాక్టరుకి దోసెలంటే తెగఇష్టం. దోసెలు వేసిన్నాడు కేసుల తేసి చూడడు!

జ్ఞాన:- అయితే ఇప్పుడు నా మాటేమిటి?

జగ:- వాడు నాతో చదువుకున్నాడు లెండి! - ఇక్కడికంటే అన్నీ వదిలేసి వస్తాడు.

జ్ఞాన:- ఏమో! - నాదసలే ముసలి ప్రాణం! - దాన్ని మొహమాట పెట్టి గెంటుకొస్తున్నాను. ఇదిగో, నేనో పాతిగ దోసెలు ఇమ్పుగుంటాను వెంటనే రమ్మని మళ్ళీ ఫోను చెయ్యి నాయనా?

సుంద:- అక్కర్లేదండి. బయల్దేరారు!
(విక్రమరావు ఇటూ అటూ చూసి, ఉన్నట్టుండి, జేబురుమాలు అడ్డం పెట్టుకుని ఒళ్ళంతా కుదుపుగుంటూ ఏడుస్తాడు)

సుంద:- అదేమిటండి, మామగారూ! - మీరు కూడా అధైర్యంపడితే ఎల్లా?

విక్ర:- (అతిబలవంతాన్ని ఏడుపు ఆపుగుంటూ) నా ప్రాణం పోతోంది!

సుంద:- అదేమిటండీ! డాక్టరుగారు వచ్చేస్తున్నారుగా?

విక్ర:- ఏం డాక్టరో ఏమిటో! - నా ప్రాణం పోతుంది! - నేను బావడానికి వీల్లేదు! (Hysterical గా) నేను బతగాలి!

కాంత:- ఎంత ఖర్మ కాలిపోయిందిరా, నాయనా! - కావలసిన పెళ్ళి కాదంటే మాత్రం ఇంత అఘాయిత్యంగా! - విషం తాగెయ్యడానికి సిద్ధ పడతార్రా ఎక్కడేనా? - మీ నాన్నగారికి నేను మేనమామ కూతు రైనా ఈ సంబంధం మా నాన్నకి ఏమీ ఇష్టం ఉండేది కాదు. చివరికి వీరే మొండికెత్తి వచ్చి, మా నాన్నని ఒతిమాలినా, 'చీ అవ తలికి పో' మన్నాడు. అయితే మాత్రం, ఆయనేమన్నా ఇల్లా తొందర పడ్డారా?

జగ:- ఏడిశావులే!- ఎందుకల్లా అబద్ధమాడుకుంటావు? 'చీ అవతలకి పొమ్మన లేదు, మీ నాన్న!- మళ్ళీ రమ్మన్నాడు

కాంత:- (రోషంతో) ఛస్తూంటే కూడా అబద్ధమాడతానాండీ? మెత్తగా ఉన్న వాళ్ళని చూస్తే మొత్తబుద్ధిట! ఒక్క పుణ్యక్షేత్రమేనా చూపెట్టారూ? నా బతుకంతా వంటింట్లోనే తెల్లారి పోయింది! - అసలు నా నాలిక పెనేసుగుపోతుంది! — ఆ డాక్టరింకా రాలేదేరా, నాయనా?

సుంద:- వస్తున్నారమ్మా! - రంగయ్యా!

రంగ:- (L. F. లోంచి వచ్చి) డ్రైవరున్నాడండి!

సుంద:- అక్కర్లేదు గాని నువ్వు గేటుదగ్గర నుంచుని డాక్టరుగారు రాగానే లోపలికి తీసుకురా!

రంగ:- సిత్తం!- (తొందరగా L. F. లోకి వెడతాడు)

జగ:- (ఉన్నట్టుండీ, వెఱ్ఱిచూపుచూస్తూ) ఇదేమిటి? - ఆ! - నాయనా. సుందరం! - నీ వేళ్ళు చూపెట్టు!

సుంద:- వేళ్ళా?-

జగ:- (Desperate గా) అవునురా! (సుందరం హడలిపోయి అయిదు వేళ్ళూ చూపిస్తాడు జగన్నాథం కళ్ళు పెద్దవి చేసుకొని చూసి) అవి మూడేనా?

సుంద:- (భయంగా) కాదు నాన్నా! - అయిదు!

జగ:- అయిదా! అయిపోయింది! - సుందరం! - చూపు దిగజారి పోతోం దిరా! బతికే మార్గం చూడరా!

సుంద:- కంగారు పడకండి. నాన్నా!

విక్ర:- విషం కాఫీ నాకిచ్చి ఆయన కంగారు పడతాడెందుకూ? కుర్చీలోంచి లేవగానే త్రినాట్ టూ తుమ్మాడు.
వీడి తుమ్ము తగలెయ్య! ఊపిరి తిన్నగా అందటంలేదు! సుంధరం! ఊపిరి! - నా ప్రాణం ! !

జ్ఞాన:- చాల్లెద్దూ, ఎవరేనా వింటే నవ్విపోతారు!-తుంటిమీద కొడితే పళ్ళు రాలాయన్నట్టు, విషంకాఫీ నే తాగితే నువ్వెగ బీలుస్తావేమిటీ? కర్మం కాలిపోయి వచ్చా నిక్కడికి - అమ్మబాబో!-నా ప్రాణం-పోతోంది! పోతోంది!-(అంటూ ఉన్నట్టుండి కళ్ళు మూసేస్తాడు )

రంగ:- (L. F. లోంచి డాక్టరు సంచీ పుచ్చుగుని తొందరగా వచ్చి) డాక్టరుగా రొస్తున్నారండి!

[జ్ఞానశ్రీ తప్ప మిగతావాళ్ళంతా ఆనందంతో లేచి నుంచుంటారు. డాక్టరు L F.లోంచి తొందరగా వస్తాడు. వచ్చి వీరందర్నీ రోగుల్ని చూచినట్టు కళ్ళు సన్నంచేసి, డాక్టరు ఠీవితో పరికిస్తాడు.]

డాక్ట:- అప్పుడే ఇనస్పెక్టరుగారు రావడందాకా జరిగిందీ ! - ఏమిట్రా జగన్నాథం సంగతి?

జగ:- ఇంకా ఏం జరగలేదురా! ఇనస్పెక్టరుగారు తాంబూలాలకి వచ్చారు- ఇప్పుడేం చెప్పలేను. ప్రాణం పోతోందిరా! త్వరగా మందెయ్యి!

డాక్ట:- ఏదీ, అల్లాకూచో! (అని చెయ్యి పట్టుగోబోతాడు)

విక్ర:- (అడ్డమొచ్చి) డాక్టర్!-ఆయన అనవసరంగా ఖంగారుపడుతున్నారు. అసలు విషం కాఫీ నాకిచ్చారు. ప్రాణం పోతూంట నాకు! - ముందు నాకు మందెయ్యండి!

శాంత:- డాక్టరుగారూ!-అసలు ప్రాణం పోతూంట నాకు! - ఇంక నిమిషాల మీదున్నాను! వెంటనే మందెయ్యకపోతే లాభంలేదు !

డాక్ట:- (కొంచెం విసుగ్గా చూసి) ప్రాణంమాట దేముడెరుగ్గాని ముందు మీ కందరికీ మతులుపోయినట్టున్నాయేమిటీ ? ఒక్కసారి కూచోండి, చెబుతాను!-కూచోండి! (అంతా కూచుంటారు) సుందరం!-వీళ్ళంతా విషం తాగారేమిటోయి?

సుంద:- లేదండి! విషం వీళ్ళలో ఎవరో ఒక్కరే తాగారు.

డాక్ట:- మరి అంతా కళ్ళు తేలేస్తున్నారేమిటి?-హూ! అసలు ఏమిటా విషం?

సుంద:- పురుగుల విషమండి!-

జగ:- గెమేక్సీను!

డాక్ట:- గెమేక్సీనుకే ఇంత కంగరు చేస్తున్నార్రా?-ఏమాత్రం వెళ్ళిందేమిటి?

సుంద:- నాలుగు చెమిచాలండి !

జగ:- ప్రాణం పోతూంటే ఈ ప్రశ్నలన్నీ ఏమిట్రా?

డాక్ట:- ఏడిసినట్టే ఉంది! నాలుగు చెమిచాల గెమేక్సీనుకి ఎలకపిల్ల కూడా చావదు. ఏరా, జగన్నాథం! ఏనుగంత ఉన్నావు, నువ్వూ అంత కంగారుపడతావేమిట్రా?

విక్ర:- అయితే ప్రాణం పోదంటారా?

డాక్ట:- ఛ! ఎక్కడికీ పోదు!-

రంగ:- పోయినట్టే ఉందండి!

డాక్ట:- ఏమిటీ?-

రంగ:- (జ్ఞానశ్రీని చూపెట్టి) ప్రాణం!

డాక్ట:- అరే!-ఈయన్నిందాకణ్ణుంచీ చూడలేదే?

విక్ర - (కంగారుగా) ముసలి ప్రాణం! పోయిందేమో కూడాను! చూడండి చూడండి డాక్టరుగారూ! ఆయన మా మామగారు! (డాక్టరు నాడి చూస్తాడు.)

డాక్ట:- మీరేం కంగారుపడకండి! ఆయన పేరేమిటి?

విక్ర:- జ్ఞానశ్రీగారు!

డాక్ట:- జ్ఞానశ్రీగారూ! ఏమండోయి!

జ్ఞాన:- (అల్లాఉండే) నేను పోయి అరగంటయిందండి!

డాక్ట:- (నమ్మలేనట్టు చూసి) What! (నాడి బాగా పరీక్షించి) ఇదేమిటయ్యా! నాడి గోడగడియారంలా కొట్టుగుంటూంటే ప్రాణంపోయిందంటావేమిటి?

జ్ఞాన.- ఏమిటి? నా ప్రాణంపోలే! (నమ్మనట్టు చూసుగుంటూ) నేను ఇంకా బతికేఉన్నానా? అయితే నా ప్రాణం, పోతూ పోతూవుంది గావును! మందెయ్యరూ! బాబూ! నా ప్రాణం! మీ కాళ్ళట్టుగుంటాను.

డాక్ట:- మీరు మరీ దారుణం మనిషిలా ఉన్నారేమిటి?—తాతగారూ! జీవితయాత్ర చాలావఱకు సాగించేశారు కదా. మీకూ ఇంత తాపత్రయమయితే ఎల్లా చెప్పండి! - ఆ! (అని తేలికగా నవ్వి) ఎందుకేనా మంచిది, మీరంతా తలోమాత్రా మింగండి! (అని Bag లోంచి తీసి ఇస్తాడు)

జ్ఞాన:- (చివరికి పుచ్చుగుంటూ) ఎందుకేనా మంచిది, నాలుగివ్వండి! అనుమాన రహితం అయిపోతుంది.

డాక్ట.- అల్లామింగుతే మెదడు మసీదయిపోతుంది! ఒకటి చాల్లెండి!

శాంత - డాక్టరుగారూ!-మాత్ర ఇచ్చారుగాని, మరోమాటు పరీక్షిస్తే మంచి దేమో!

డాక్ట.- ఏమి అక్కర్లేదమ్మా, అల్లా కూచోండి! మీ ప్రాణానికేం భయంలేదు. కాస్తదానికి ఎంత గొడవ చేశారు? ఇల్లాంటప్పుడే కంగారుపడకుండా నిలబడాలి! పోనీ, శాంతమ్మగారు ఏదో భయపడ్డారంటే అర్థముంది!

విక్ర:- చాల్లెద్దురూ, డాక్టరుగారూ! మీరు మరీ చెబుతారు. కలిసింది గెమేక్సీనా మరోటా?

డాక్ట:- గెమేక్సీను కనకనే అసలు ఫరవా లేదంటున్నాను. నాకు పదేళ్ళున్నప్పుడు పొట్లం కనిపిస్తే పంచదార అనుకుని అరవీశడు గమేక్సీను ఊదేశాను!

జగ:- ఏం మనిషివిరా! రుచేనా తెలియలేదురా?

డాక్ట:- సరే, మనకి రుచి తెలిశాటప్పటికి అరవీశ దయిపోయింది.

జ్ఞాన:- అబ్బా! - అరవీశడే! - అయితే అప్పుడు తమరు పోలే? (అంతా నవ్వుతారు)

డాక్ట:- తాతగారికి మాత్ర పట్టిచ్చినట్టుంది!-

[ఫోను చప్పుడవుతుంది. సుందరం ఫోనుతీస్తాడు. డాక్టరు లేచి సిగరెట్ వెలిగించుకుంటాడు.]

జగ:- కూచోరా! - రంగయ్యా! - డాక్టరుగారికి కాఫీ తే!-

డాక్ట:- కాఫీయా?- ఇంక మీ ఇంట్లో తాగను!

శాంత·- (లేచి) నేను చేసి తీసుగొస్తానుండండి! (R. F. లోకి వెడుతుంది).

సుంద:- (ఫోనులో) హలో! - ఎవరు? - ఎవరు కావాలండి? డాక్టరుగారా? - ఉన్నారు!

డాక్ట:- ఎవరోయి!-

సుంద.- అ, మీ కంపౌండరండి! - (ఫోనులో) అరే, ఆ కంగారేమిటండి, మెల్లిగా చెప్పండి! - ఏమిటీ! మా రంగయ్య తెచ్చింది గెమేక్సీను

కాదూ ? మైదాపిండా? - హారి! - మీకెల్లా తెలుసూ? - కొట్టువాడు చెప్పాడా? సరే!-పంపిస్తున్నాను! (అని ఫోను పెట్టేస్తాడు)

జగ:- ఇంతాచేసి మైదాపిండా?

జ్ఞాన:- నేను అప్పుడే అనుకున్నానుస్మీ! - ఆ రుచి పురుగుల విషం రుచిలా ఎంతమాత్రం లేదు!

విక్ర:- మరే! సరిగ్గా మైదాపిండిలా ఉంది!

డాక్ట:- ఇది మా కింపౌండరుకి ఎల్లా తెలిసింది?

సుంద:- (తేలిగ్గా) ఆ! - మీకు మాకూ కొట్టుదగ్గిర పొట్లాలు తారుమారయ్యాయిట, మే మడిగిన గెమేక్సీను మీ ఖంట్రోతు పట్టుకుపోయాడు, మీరడిగిన మైదాపిండి మా రంగయ్య పట్టుకొచ్చాట్ట!

రంగ:- కంగారులోను పొరపాటయిపో ఉంటదండి!

జ్ఞాన:- పోన్లె రక్షించినవాడు రంగయ్య!

డాక్ట:- (బిగుసుకుపోయి) ఆగండి! - మైదాపిండి మీకొస్తే గెమేక్సీను మాకొచ్చిందా? అయితే నే ఇందాకా మైదా పిండనుకొని! - (అని ఆగిపోయి భయంగా) దోసెలు! - దోసెలు! - ! (శాంత కాఫీ తెస్తుంది)

జగ:- దోసెలేమిట్రా? - ఈ కాఫీ తాగు?

డాక్ట:- వొద్దు! ఇందాకా నేతిన్న దోసెల్లో గెమేక్సీనుంది! - చాలా తిన్నాను! గుండె పట్టడుతోంది! - ఒరేయి' - ప్రాణం! - నా ప్రాణం ! !

విక్ర:- (గబుక్కుని లేచి) డాక్టరుగారూ!- కంగారు పడకండి !

సుంద:- ఓహో, ఇప్పుడందుకనా మీ కంపౌండరల్లా గోలెడుతూ ఫోను చేశాడు?

డాక్ట:- అందుకనే ఫోను చేశాడు! - నేను తిని చాలా సేపయింది. ఒరేయి, జగన్నాథం! కాళ్ళూ చేతులూ పట్టు తప్పిపోతున్నాయి!

శాంత:- మీరూ అల్లా కంగారు పడతారేమిటి, డాక్టరుగారూ!

జ్ఞాన:- అబ్బే అల్లా కంగారు పడితే ఎల్లాగండీ? - అసలు దీనికి ప్రమాద మేమీ లేదన్నారుగా?

డాక్ట:- (విసుగ్గా) లేకపోవడ మేమిటండీ? - నిక్షేపంలా ఉంది!

జ్ఞాన: ఉంటే మాత్రం? సమదుఃఖ సుఖంధీరం సోఽమృతత్వాయ కల్పతే! నిదానించాలి నిలబడాలి! - మీ దగ్గిర మాత్రలున్నాయిగా! సీసా చూపెట్టండి. గుప్పెడు తీసుకొచ్చి నోట్లో పడేస్తాను.

డాక్ట:- ఊరుకోవయ్యా. గొడవ! - ఆ మాత్రలేం లాభం లేదు! - నాకు తెలుసుగా? - ఒరేయి జగన్నాథం! - వెంటనే నన్ను గవర్నమెంటు ఆసుపత్రికి చేరెయ్యాలి! - ఆలస్యం చేస్తే మాట దక్కదు! - (అని జేబు రుమాలుతో కళ్ళు తుడుచుకొని బాధపడతాడు.)

విక్ర:- చాలు, చాలు! - ఊరుకోండి, డాక్టరుగారూ! - మతి లేకపోతే సరి ! ఈ మాత్రం దానికి కళ్ళమ్మట నీళ్ళెట్టుగుంటారా?

సుంద.- ఏం భయంలేదు. డాక్టరుగారూ! - నేను కారులో మిమ్మల్ని వెంటనే తీసుగెడతాను. రండి! - రంగయ్యా! - డాక్టరుగార్ని పట్టుగో !

డాక్ట:- (లేచి, రంగయ్యని అనుకుని) సుందరం! నువ్వు త్వరగా డ్రైవ్ చెయ్యాలి సుమా! నా ప్రాణం! జగన్నాథం! (అని మాటరాక ఏడుస్తాడు.)

జగ:- ఏమిట్రా ఇది? - నీకేం భయంలేదు! మళ్ళీ అరగంటలో నిక్షేపంలా తిరిగొస్తావు! వెళ్ళిరా! సుందరం, త్వరగా తీసుగెళ్ళు!

జ్ఞాన:- మనం ఎంత చెబితే ఏమండీ? - అసలు మనిషికి మనోనిగ్రహం ఉండాలి! అదీ ముఖ్యం!- ''మానసంబున మానవు డెందాక వర్తించు నెవిమిషంతలు నందాక నతను కర్మాను బంధంబులం బొరలు!''

విక్ర:- మనోనిగ్రహం దాకా ఎందుకండీ? - అసలు గుండె నిబ్బరం ఉంటే చాలు !

జగ:- నన్నడుగుతే ఏమీ అక్కర్లేదు ఒక్క విషయం తెలుసుగుంటే చాలు!- ఈ మానవ జీవితాలు కేవలం బుద్బుదాలు!

శాంత:- ఏదో సామెత చెప్పినట్టుంది. ఇంతకీ అసలు విషయం తాంబూలాలు!

(అంతా నవ్వుతారు)

(తెర)



## పాత్రలు

డాక్టరు
రజని
సిస్టర్ (నర్సు)
పేషెంటు (స్త్రీ) 1
పేషెంటు - 2

[ఆరోజు హాస్పిటల్ వార్డు మూడు పక్కలున్నాయి. హాస్పిటల్ వార్డులో ఉండాల్సిన వస్తువు లుంటాయి. గోడగడియారం కూడా వుంది. మూడుపక్కలలో ముగ్గురు పడుకున్నారు. ఒక పక్క దగ్గర కుర్చీవేసుకొని ఒకావిడ కూర్చునివుంది. ఆమెను చూడగానే తెలుస్తుంది డాక్టరని. ఆ దగ్గరే నర్సు నిలబడి వుంది. డాక్టరు అ ప్రక్క మీద మనిషిని పరీక్ష చేస్తూంది. నర్సు కాస్త ఇటటూ తిరుగుతూ పనులు చేస్తూండవచ్చు.]

డాక్టరు:- హారిబిల్ కేసులు. మన ప్రాణాలు తీయటానికొస్తూంటాయి ఇవన్నీ. వైద్యమే చేస్తామా. వాళ్ళప్రాణానికి కోర్టులకే తిరుగుతుంటామా ? న్యూసెన్స్ !

[లేచింది. నర్సు బేసిన్, టవల్-తెచ్చింది. డాక్టరు చేతులు కడుక్కుంటూంది. ఇంతలో బయటినుంచి ఒకావిడ గబగబ వచ్చింది. చాలా నాజూకుగా ఉంది మనిషి. బుజానికొక సంచీ తగిలించి వుంది. ఎండలోనుంచి రావడంవల్లనేమో కూలింగ్ గ్లాస్ వేసివుంది; లోపలికొచ్చి తీసేసింది. కత్తిరింపు జుట్టు, ఎత్తుమడల జోళ్ళు. చీరెకట్టు చాలా సెక్సీగా ఉంది. చేతికి గడియారం, లిప్‌స్టిక్, ముఖాన ఏదో బొట్టులాంటిది ఉంది; మనిషి సన్నగా పొడుగ్గా ఉంది. మంచిరంగు]

రజని:- హల్లో డాక్టర్ !

డాక్ట:- హల్లో, రజనీ !

రజని:- ఏమిటి? ఎలాఉంది పేషెంటు ?

డాక్ట:- ఎలాగుంది ! మా పేషెన్స్‌ను చంపుతూంది.

రజని:- ఏమిటో దాకినపోయే జిడ్డనం నెత్తిన తగులుతుంది దీనివల్ల నా వర్క్ ఎంత సఫర్ అవుతూందో తెలుసా? అంతా అయోమయంగా ఉంది ఓమైగాడ్(కూర్చుంది)వచ్చేనెల ఆలిండియా అల్ట్రా మాడెర్న్ లేడీస్ కాన్ఫరెన్సు ఉంది దానికి ఏర్పాట్లన్నీ చేయాలి. ఎల్లుండి విమానంపై ఢిల్లీకి పోవాలి. రేపు మీ వర్కింగ్ కమిటీ మీటింగు ... దీనిలో రాయలసీమ కరువునిధి వసూలొకటి ... ఇవన్నీ ఇలా వుండే ..., ఈ న్యూసెన్సు ఒకటి నాకు. (ఈమె ఇలా పొట్లాడు

తుండగానే డాక్టర్ బయటికెళ్ళింది. ఈ విషయం తెలియక ఈమె మాట్లాడుతూనే ఉంది. తిరిగిచూచి డాక్టరు లేదని తెలుసుకొని, ఒకరకంగా బుజాలెగరేసి ఇటు చూసింది. నర్సు కనిపించింది.) సిస్టర్ !

సిస్టర్:- హల్లో ! (దగ్గరకొచ్చింది)

రజని:- (ప్రక్కవైపు చూపించి) ఇంకా స్మృతి రాలేదు కదూ !

సిస్టర్:- లేదండి.

రజని:- పిల్లాడిని పోస్టుమార్టం చేశారా ?

సిస్టర్:- చేశారండి.

రజని:- ఏం తేలింది ?

సిస్టర్:- గొంతు నులిమి చంపేసిందండి.

రజని:- విషం పెట్టలేదా ?

సిస్టర్:- లేదు (వెళ్ళబోతుంది)

రజని:- సిస్టర్...ఒకమాట !

సిస్టర్:- ఏమిటి !

రజని:- ఈ కేసులో మన నెత్తిమీదకేం రాదుకదా ?

సిస్టర్:- మీకేముందమ్మా ! మీ కాంపౌండులో జరిగింది, అంతగా ...

రజని:- కాంపౌండులో కాదు. కాంపౌండు గోడచాటున కూర్చుని, పిల్లాడి గొంతు నులిమేసింది.

సిస్టర్:- చూచీ చూడనట్టు మీ దారికేపోయివుంటే పోయేది.

రజని:- నిజమే. కాని, పిల్లాడిని కాంపౌండులోపల పారేసింది. అదీ వచ్చిన అవస్థ...

సిస్టర్:- అయినా ఏం ఫర్వాలేదులెండి ఈలాంటివెన్నో జరుగుతుంటాయి. కాకుంటే కాస్త బ్రెయిన్ వేస్టు. అంతే !

రజని:- అదే వచ్చినచిక్కు. ఈ దిక్కుమాలిన వాళ్లెవరో, బతకలేక ఆత్మహత్యలకు పూనుకోవటం, మన బ్రెయిన్ పాడుచేయటం ఏంటి ? ఛీ ఛీ

[డాక్టర్ వచ్చింది]

డాక్ట:- రజనీ !

రజని:- వాట్ డాక్టర్ !

డాక్ట.- మహిళాసభ పక్కన డిస్పెన్సరీగాని, హాస్పిటల్ గాని ఉందా?

రజని:- లేదు డాక్టర్ !

డాక్ట.- ఎవరన్నా డాక్టరున్నారా ?

రజని:- లేదు ! ఏం ?

డాక్ట:- ఏమిటో న్యూసెన్సు. ఈవిడ ఏదో విషం మందు తాగింది !

రజని:- మందా ?

డాక్ట:- అవును. అదేమిటో ఇంకా తేల్లేదు. కాని అలాంటిది సామాన్యంగా దొరికేది కాదు.

రజని:- అరె ! మైగాడ్ !

డాక్ట:- చాలా బజార్ రకంగా ఉంది చూస్తే ఈ మనిషి

రజని:- వేశ్యా ?

డాక్ట:- కావచ్చు

రజని:- అలాగైతే ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం ఏముంది ?

డాక్ట:- బతకలేక చావడం. అంతే

రజని.- మీతో, తన జీవితచరిత్ర ఏమన్నా చెప్పిందా ?

డాక్ట:-. ఆఁ – వీళ్ళకో జీవితం! దానికో చరిత్ర కూడానా ? చెత్తరకం... వీళ్ళు సంఘానికి చీడపురుగులు. దేశానికి తీరని మచ్చలు.

రజని.- మా మహిళా సంఘం ఈసారి వర్కింగు కమిటీ మీటింగులో ఈలాంటి వారి విషయం చాలా సీరియస్‌గా చర్చించబోతోంది. స్త్రీకి ఆర్థిక భద్రత లేనంతవరకు ఈ అగచాట్లు తప్పవు

డాక్ట:- రజనీ! ఇలా చూడు, ఈ రాజకీయ నినాదాలన్నీ మానేసి కాస్త ప్రాక్టికల్‌గా ఆలోచించడం నేర్చుకో. వెరీ సారీ, మహిళాసంఘం

ప్రెసిడెంట్ వయ్యావనే కానీ ఇంకా నువ్వు పసిపిల్లలా మాట్లాడు తున్నావు. నువ్వు అందరిలాగే పొలిటికల్ స్లోగన్స్ స్టంట్స్ కొడితే ఎలా ?

రజిని:- లేదు డాక్టర్! అది నా నమ్మకం. నేనే...

డాక్ట:- షటప్ మైచైల్డ్! ఈనాటి కుర్ర కారంతా వట్టి మాటల పోగులై పోతున్నారు; దేంట్లోనూ లోతుగా పోనంటారు. అంతా పైపై దేవు లాడుతా నంటారు. అదే నాకు మంట.

రజిని:- మరి మీరేమంటారు డాక్టర్?

డాక్ట:- మీరెన్ని ఆర్థిక భద్రతలు, రూల్సు, విడాకులు-తమలపాకులు ఎన్ని చేసినా నైతిక పతనం అనేది ఎప్పటికీ ఏదో ఒకరకంగా ఎక్కడో ఒకచోట ఉంటుంది. ఉండి తీరుతుంది. తెలిసిందా? ఈ మనిషి ఇలా కావడానికి కారణం ఎవరంటావు? 'సంఘం' అని సులభంగా గట్టిగా చెప్పేస్తావు కదూ? నాకు తెలుసు. సంఘం అంటే ఎవరు? నువ్వూ, నేను, ఆ నర్సు, అందరూ కదూ! - ఏం?

రజిని:- అవును.

డాక్ట:- దెన్... ఇప్పుడాలోచించు. ఈ అమ్మాయి యిలా కావడానికి కారణం నువ్వు అని అంటే ఒప్పుకుంటావా? చెప్పు.

రజిని:- నో!

డాక్ట:- నే నంటావా ?

రజిని:- నో!

డాక్ట:- ఆ నర్సంటావా ?

రజిని:- నో !

డాక్ట:- మరి ఈ లోకంలో ఎవరో ఒకరుంటా రంటావు. అంతేనా ?

రజిని:- అంతే ?

డాక్ట:- కనుక ఎవరో ఒకవ్యక్తి చేసిన అక్రమానికో, అన్యాయానికో, పొరబాటుకో, నువ్వు సంఘాన్నంతా తిడతానంటావు. దానికోసం సంఘం మీదంతా ఒక శాసనం చేస్తానంటావు-ఏం?

రజని:- అలాంటివాళ్ళు చాలామంది ఉంటారు.

డాక్టర్:- అలాంటివాళ్ళు కానివాళ్ళు కూడా చాలా మంది ఉన్నారు ఉదాహరణకి-ఈ అమ్మాయి పరిస్థితులేవో మనకు సరిగా తెలియవు. కాని ఈ అమ్మాయికన్నా హీనమయిన స్థితిలో ఉన్నవాళ్ళు ఉన్నారంటావా, లేదా? ఏం!

రజని:- ఉన్నారు.

డాక్టర్:- మరి వాళ్ళందరూ యీ దొంగబ్రతుకు బ్రతకలేదేం? ఇలా బిడ్డల్ని కని చంపలేదేం? ఇలా విషంతాగి చావాలనుకో లేదేం? నేనెందరినో చూచాను. డబ్బు, గౌరవం, హోదా, చదువు, అన్నీఉండీ నైతికంగా పతనం పొందినవాళ్ళను, ఇవేవీలేకున్నా హాయిగా నీతిని అంటిపెట్టుకొని, సంతోషంగా తృప్తిగా జీవిస్తున్న వాళ్ళనూ చూచాను. దీని కేమంటావు?

రజని:- ఇంతకూ మీరనే దేమిటి—

డాక్టర్:- నైతిక జీవనం కేవలం వ్యక్తిగతమైనది. అది తప్పి పోవడానికి ఒక్కొక్క కారణం ఉంటుంది. ఆ కారణాలన్నీ మనం తీర్చలేం. ఇదంతా సంఘం నెత్తిమీదరుద్ది, ఏదో వుద్ధరించాలనుకోవడం వెర్రి, అంతే.

రజని:- నా వాదనకూడా కాస్త వినండి.

డాక్టర్:- ధారాళంగా చెప్పు.

రజని:- ప్రపంచంలో జరిగే దేదీ కారణం లేకుండా జరగదు. ఒప్పుకుంటారా?

డాక్టర్:- ఓ యస్! కాని కొన్ని కారణాలు మనకు తెలియవు.

రజని:- తెలిస్తే అలాంటివి జరక్కుండా ఆపవచ్చు - కాదంటారా?

డాక్టర్:- అదే పొరపాటు.

రజని:- మీరు డాక్టరుగా ఉండీ ఇలా వాదిస్తే నాకు ఆశ్చర్యంగా ఉంది.

[ఇంతలో నర్సు వచ్చింది]

సిస్టర్:- డాక్టరుగారండీ!

డాక్ట:- ఏమండీ !

సిస్టర్:- ఈవిడ మూటలో ఈ ఫొటో దొరికిందండి.

డాక్ట:- ఫోటో !

రజని:- ఏం ఫొటో?

సిస్టర్:- అవునండి, ఎవరో ఒక మగవాడి ఫొటో.

డాక్ట:- ఓ చాలాఉందే ! ఈవిడ ప్రేమకలాపాలకి ఫొటోలు కూడానా ? ఊం- ఇంకా ఏమున్నాయి?

సిస్టర్:- ఏవో ఉత్తరాలు-రికార్డులు ఉన్నాయండి.

డాక్ట:- వాట్!!!

సిస్టర్:- అవునండి.

డాక్ట:- అయితే యిదేదో పెద్ద కేసే.

రజని:- మనం అనుకున్నంత తేలి క్కానట్టుంది.

డాక్ట:- ఊం- ఏదీ ఫొటో.

సిస్టర్:- ఎవరో కాని అందంగానే ఉన్నాడండీ

డాక్ట:- ఎవడో లోఫర్.

రజని:- ఎవడో ముందు తియ్యని మాటలుచెప్పి, ప్రేమలోకి దింపి దగాచేసిన వెధవై వుంటాడు.

డాక్ట:- ఎవడో స్కౌండ్రల్.

సిస్టర్:- అలా లేదండి చూస్తే.

డాక్ట:- మొగవాళ్ళు చూట్టానికి చాలా మంచిగానే ఉంటారులే ... ఏదీ యిలా ఇవ్వు చూద్దాం...పూర్కె ఫొటో చూచి అంత మురిసిపోతున్నా వేమో !

సిస్టర్:- కావాలంటే మీరే చూడండి.

డాక్ట:- (ఫొటోతీసి చూసింది. తెల్లబోయింది. ముఖంలో నెత్తురుచుక్క లేదు. ముఖం శతవికారాలు పోయింది. తన కళ్ళను నమ్మలేక పోయింది) డామిట్! ఏం, నాతో ఆట్లాడుతున్నావేం !

సిస్టర్:- (భయంతో) లేదండి.

డాక్ట:- వాట్ లేదండి! ఈ ఫోటో నీ కెక్కడ దొరికింది ?

సిస్టర్:- ఆవిడ మూటలోనే

డాక్ట:- నిజంచెప్పు.

సిస్టర్:- నిజంగానండి!

రజని:- ఏమిటి డాక్టర్—

డాక్ట:- (ఆత్రంగా చూచింది. మళ్ళా ఫోటోవంక చాలాసేపు చూచింది.) నో! నో! ఇది నిజంకాదు. నే నమ్మలేను. ఇందులో ఏదో మోసం ఉంది! ఇది దగా! ఇదేదో కుట్ర. నో! కానేకాదు...ఇది నిజంకాదు. కానేకాదు.

రజని:- డాక్టర్...డాక్టర్!

డాక్ట:- (కూలబడింది) ఓ! సిస్టర్...సిస్టర్...పరుగెత్తు...మా యింటికి పరుగెత్తు ... ఇదుగో తాళంచెవి ... నా డ్రాయరులో ... నా బెడ్ రూమ్‌లో...ఎడంచేతివైపు ...ఒక ఆల్బం ఉంది. పరుగెత్తు... త్వరగా పట్రా' క్విక్. రన్ అప్...ప్లీజ్ రన్ అప్...

[సిస్టర్ నిజంగానే పరుగెత్తుతుంది]

రజని:- డాక్టర్! ఏమిటిది—

డాక్ట:- నో! కాస్త ఉండు...నన్ను ఊపిరిపీల్చుకోనీ...నా కళ్ళనే నే నమ్మ లేకుండా ఉన్నాను...ఈ ఫోటో దీని మూటలోకి ఎలా వచ్చింది చెప్మా—

రజని:- ఎవరిదండీ యీ ఫోటో—

డాక్ట:- ఓ! హారిబిల్! ఉండు రజనీ! కాస్త ఉండు...నన్ను బాగా కాస్త గిల్లిపెట్టు

రజని:- ఎందుకు డాక్టర్—

డాక్ట:- చెప్తా...బాగా...

[రజిని నిజంగానే గిల్లింది]

డాక్ట:- (బాధపడి) నేనీ లోకంలోనే ఉన్నాను. ఏ పొరబాటులేదు. అయితే... అయితే...యీ ఫోటో...

[నర్సు పరుగెత్తుకుంటూ వచ్చింది]

డాక్ట:- దొరికిందా—

సిస్టర్:- దొరికిందండి.

[డాక్టర్ ఆల్బం తీసుకొని, ఆత్రంగా కొన్ని పేజీలు తిప్పి, ఒక పేజీలో వున్న ఫోటోతో తన దగ్గరున్న ఫోటోను సరిచూచుకొని అలాగే స్తంభించిపోయింది ]

రజిని:- ఎవరిది డాక్టర్ ఫోటో...(తానే ఆల్బంతీసి చూసింది) ఎవరీయన—

డాక్ట:- అది నా భర్తది.

రజిని:- ఆఁ......,

సిస్టర్:- ఆఁ......

[ఒక్క-క్షణం నిశ్శబ్దం]

డాక్ట:- సిస్టర్!

సిస్టర్:- డాక్టర్!

డాక్ట:- చూడు...ఆ పేషెంట్ మేలుకుందా చూడు...

సిస్టర్:- చూస్తా డాక్టర్ (పేషెంట్ దగ్గరికివెళ్ళి చూచింది) అమ్మా, అమ్మా! (పేషెంట్‌ను కుదిపింది)

పేషెంట్:- ఆఁ... (తటాలున లేచి కూచుంది)

సిస్టర్:- ఓ! డాక్టర్!

[అందరూ తటాలున తిరిగి చూచారు ఆశ్చర్యంగా. శవం లేచి కూచున్నంత కంగారు పడ్డారు]

పేషెం:- ఏం - ఎందుకలా చూస్తారు - శవం లేచికూచున్నట్లు కంగారు పడతారేం - నేను చావలేదు. బ్రతికే ఉన్నాను. నాకింకా తెలివి

తప్పులా. తెలివిగానే ఉన్నాను అడగండి చెప్తా. ఏంకావాలో అడగండి (మెల్లగా పక్కమీదనుంచి లేచింది. సిస్టర్ బిత్తరపోయి వెనకడుగు వేసింది.)

రజిని:- డాక్టర్! ఈమెకు పిచ్చిపట్టిందేమో!

సిస్టర్:- నిజం డాక్టర్! పిచ్చెక్కింది...

పేషెం:- నాకేం పిచ్చిలేదు. మీకే పిచ్చి. బతుకంటే ఏమిటో తెలియకుండా పట్టి నీడ వెంబడిపడి పరుగెత్తుతూ, అదే బతుకనుకుంటున్నారే మీరు - మీకూ పిచ్చి, నాకుకాదు! నేను బతుకంటే ఏమిటో, పిచ్చి లోకమంటే ఏమిటో, దాని లోతుపాతులు, అన్నీ చూచా! అడగండి... (ముందుకు నడుస్తూంది) ఇంతవరకు నన్ను గురించి మీరు మాట్లాడుకున్నదంతా విన్నాను. నేనిలా కావడానికి మీరెవరూ కారణం కాదనికదూ మీరనుకోవటం - పొరబాటు. మీరందరూ కారణమే! మీకు తెలిసో, తెలియకో మీరందరూ తలా ఒక రాయి వేశారు! నువ్వు - నువ్వు-నువ్వు - నా జీవితం నాశనం చేశారు. నన్నీస్థితికి తెచ్చారు. (పక్కన ఉన్న పక్కమీద పేషెంటు లేచింది. ఆమెను చూచి) నువ్వు - ఏం తెల్లపోతావేం - మీరందరూ కారణమే నా స్థితికి...తెలిసిందా—
(అందరూ తెల్లబోయారు డాక్టర్‌వైపు నడుస్తూ) నాకొక జీవితం అంటూ లేదూ - నేను సంఘానికి చీడపురుగునా - దేశానికి తీరని మచ్చనా... ఏం—
(డాక్టర్ ఊపిరి గట్టిగా పీలుస్తూంది. కాస్త దమ్ము తెచ్చుకుంటుంది) అందరూ తెల్లముఖాలు వేశారేం - ఇంతసేపూ వాగిన నోళ్లు పడిపోయినాయా! (వికారంగా నవ్వింది. కుర్చీలో కూలబడింది.)

డాక్ట:- (కాస్త ధైర్యం తెచ్చుకొని) ఈ ఫోటో నీ దగ్గరకెలా వచ్చింది—

పేషెం:- ఆ ఫోటో నీ భర్తదికదూ?

డాక్ట:- అవును.

పేషెం:- నా మూటలో దొరికింది కదూ?

డాక్ట:- అవును.

పేషెం:- అది ఎలావచ్చిందో చెప్పమన్నావా—

డాక్ట:- చెప్పు.

పేషెం.- వీళ్ళందరి ఎదుట చెప్పమన్నావా - మళ్ళా బాధపడి లాభంలేదు. ముందుగా చెప్తున్నా.

రజిని:- నేను బైటకు వెళ్ళనా—

పేషెం:- ఆగు, నీ బండారం కూడా ఉందిలే? నువెక్కడికి కెళ్తావ్.

రజిని:- ఏయ్... ఏమిటా వాగుడు!

పేషెం - తిట్టకు.

రజిని:- నాకూ నీకూ ఏం సంబంధం—

పేషెం:- (పెద్దగా నవ్వుతూ ఆమె దగ్గరకొచ్చి బుజం మీద తడుతూ) పిచ్చి తల్లి! పాపం! ఇంత చదువుకున్నావే, ఈ మాత్రం తెలీదూ - నీకూ నాకూ ఏం సంబంధం! నువ్వూ నేనూ ఆడవాళ్ళం కావడమే సంబంధం! తెలిసిందా-

2వ పేషెం:- డాక్టర్! ఏమిటీ గోల - నాకు నిద్రొస్తూంది.

పేషెం:- నిద్రొస్తుందా తల్లీ - చొచొచొ (వెర్రిదానిలా ఆమెను వీపుమీద తడుతూ) జో...జో...లాలి నా చిట్టితల్లీ లాలి వుళ వుళ ఆయీ...

2వ పేషెం:- డాక్టర్... డాక్టర్!

సిస్టర్:- ఇదుగోమ్మా... యిలారా... తాపీగా కూచోని మాట్లాడు...ఇది హాస్పిటల్...గోల చేయకూడదు.

పేషెం:- లేదమ్మా బంగారమ్మా... ఏదీ కాస్త ఆగు... సరిగా చూడనీ నిన్ను... ఆఁ... నువ్వేనా... నీ పేరు... మిస్... పద్మాజోసఫ్ కదూ—

సిస్టర్:- (తెల్లబోయి) అవును...

పేషెం:- ఏం - అలా చూస్తారేం - ఈమె పేరు ఎట్లా తెలుసు నాకు అనేనా, ఈమె పేరు...ఈమె పెళ్ళి చేసుకోదలుచుకొన్నతని పేరు... వీళ్ళ నాన్న పేరు... అన్నీ తెలుసు నాకు...

సిస్టర్:- డా...డా...డాక్టర్!

రజని:- ఓ! ఇదేదో నాటకంగా ఉంది.

పేషెం:- అంతా నాటకమే. జీవితమే ఒక నాటకం... మనమంతా వేషాలు వేస్తున్నాం...నాటకాల్లో వేషాలు వేసేవాళ్ళు రంగులు తుడిచేసి, బయట తిరుగుతారు. మనం రంగులు వేసుకొనే ఇంటా బయటా అంతా తిరుగుతాం-అంతే తేడా!

డాక్ట:- సిస్టర్! లెట్ హెర్ స్లీప్! లెట్ హెర్ టేక్ రెస్ట్ మనం పోదాం రండి, రా రజనీ...

పేషెం:- (అధికార స్వరంతో) ఏయ్... ఆగండి... ఎక్కడికి వెళ్తారు, ఆగండి... (అందరు బొమ్మల్లా ఆగిపోతారు) ఉండండి. మీ అందరి కథా చెప్తాను. (ఫోటో డాక్టరు చేతిలోంచి లాక్కొని) ఈ ఫోటో ఎవరిదన్నావు—

డాక్ట:- నా భర్తది.

పేషెం:- నీ భర్తకి... ఈ పురుషసింహానికి నీ భర్త కాకముందు నా భర్త తెలుసా—

డాక్ట:- నాన్ సెన్స్!

పేషెం:- తిడితే తెలుగులో తిట్టు.

డాక్ట:- నువ్వబద్ధం చెప్తున్నావు.

పేషెం:- నిజం నీకు తెలీదుకనుక, నువ్వు అబద్ధం అంటున్నావు ... నీ భర్త బెజవాడలో పుట్టేడు...పెరిగాడు... చదువుకున్నాడు. అవునా—

డాక్ట:- అవును

పేషెం:- దుర్గాకళామందిరం దగ్గర ఇల్లు

డాక్ట:- అవును.

పేషెం:- ఆ పక్కనే ఇప్పుడొక పాడుపడిన కొంప ఉంది. చూచావా—

డాక్ట.- చూచాను.

పేషెం:- అదే మా యిల్లు.

డాక్ట:- అం... కమలవా నువ్వు—

పేషెం:- (నవ్వి) అబ్బ-ఎంత సేపటికి గుర్తుకొచ్చాను...జ్ఞాపకమున్నానా—

డాక్ట:- కమలా! నువ్వా-ఇలా అయ్యావు – నువ్వేనా-ఎందుకు ఆత్మహత్య చేసుకోవాల్సి వచ్చింది–

పేషెం:- మీరెందుకు బతుకున్నారో తెలుసా - తెలీదు. చావలేక-బతికున్నారు. నే నెందుకు చావాలనుకున్నానో తెలుసా - బతకలేక చావాలనుకున్నాను - అంతే.

రజిని:- డాక్టర్... మీకీమె తెలుసా—

డాక్ట:- తెలుసు... నాతోపాటు స్కూల్లో చదువుతుండేది... ఆడుకునే వాళ్ళం..

పేషెం:- ఈమె భర్తగారు మొదట నన్ను ప్రేమించారు.

డాక్ట:- కమలా!

పేషెం:- నేను పోయేముందు నా కథ అందరికీ చెప్పిపోతాను. మేము చాలా పేదవాళ్లం. కట్నాలిచ్చుకోలేం... వాళ్ళ నాన్నకి కట్నాలు కావాలి...మీరు డబ్బుగలవాళ్లు... ఈమె భర్తను డబ్బిచ్చి కొనుక్కున్నది... ఆ మగాడూ డబ్బుకాశపడ్డాడు... ప్రేమ గీమా అంతా పోయింది... నన్ను నట్టేట్లో ముంచాడు. ఈమెను పెళ్ళి చేసుకున్నాడు... కొన్ని నెలలు గడిచినాయి... నాకంతవరకు ఏమీ తెలియదు...ఆ తరువాత తెలిసింది నేనొక బిడ్డతల్లి కాబోతున్నానని...మా నాన్నకు గుండెలు పగిలాయి... మా అమ్మ మంచం పట్టింది... నేను అనాధ నయ్యాను. వీధులు పట్టాను...

డాక్ట:- కమలా! ఇదంతా నాకేం తెలీదు సుమా.

పేషెం:- అబద్ధం! అంతా తెలుసు. నీకంతా తెలుసు. కాని డబ్బు మదం... ఎదుటి ఆడదాని జీవితం గడ్డిపోచలా చూచావు. నీకు జ్ఞాపకముందా మీ నాన్న నాకు భోగందానికిచ్చినట్లు డబ్బివ్వటానికొచ్చాడు...(చాల తీక్షణంగా అడిగింది)

డాక్ట:- ని...జం...క...మలా!

పేషెం:- నా జీవితం కూలిపోయింది ... అమ్మా నాన్నా పోయారు ... బతుకుతెరువు కోసం బయల్దేరాను (రెండవ పేషెంటు దగ్గరకు పోయి) నీకు నేను గుర్తులేదూ...బాగాచూడు...మీ ఇంట్లో చాకిరీ చేయటానికొచ్చాను... మీ మామ గారు...అరవైఏళ్ల ముసలాడు... నాకు తాతలాంటివాడు ..

2వ పేషెం:-అప్పుడు నీ పేరు జయకదూ—

పేషెం:- పేరేదైతే ఏం లే ! నేనే జయను...కమలను...ఇంకా ఇంకా చాలా పేర్లున్నాయి...నేనే...

రజిని.- డాక్టర్...ఇదంతా ఏదో కట్టుకథగా ఉంది...

సిస్టర్:- మనల్నింతా పిచ్చివాళ్ళను చేసి ఆడిస్తూంది డాక్టర్ !

పేషెం.- షటప్ - నాకు ఇంగ్లీషు ఇంకా జ్ఞాపకముంది. చిన్నప్పుడు ఎప్పుడో, చదువుకునే రోజుల్లో ఎన్నో కలలు కన్నాం. (2వ పేషెంటుతో) నీకు జ్ఞాపకం ఉందా ? నీ భర్త కళ్ళారా చూచాడు ... ఆ రోజు వంటింట్లో పని చేస్తున్నాను. 60 ఏళ్ళ ముసిలాడికి కూడా నేనంటే చులకనై పోయింది. దిక్కులేనిదాన్ని కనుక నామీద (ఏడుస్తూంది) ...ప్రపంచంలో అందరూ చెడ్డవాళ్లు కారు. కొందరైనా ఉంటారు, అనాధలను చూచి అయ్యో అనేవాళ్ళు. నీ భర్తకు నామీద కనికరం కలిగింది. నువ్వది ఓర్చుకోలేక పోయావు...నీ వెధవబుద్ధి పెడ అర్థాలు తీసింది. మా ఇద్దరికి ఏవేవో సంబంధాలు కలిపించి, మామ గారితో కలిసి, ఇంట్లోనుంచి తరిమేసేదాకా, ఒంటికాలిమీద నిల్చావు. చూడు! ఇప్పుడు తృప్తిగా ఉందా-

2వ పేషెం:- జయా! నేను చేసేపని ఇంతదూరం వస్తాదనుకో లేదు సుమా!

పేషెం:- అదే చాలామందికి తెలీదు. వాళ్ళు చేసేపనులు ఎంతదూరం పోతాయో, ఎందరి జీవితాలు పాడు చేస్తాయో, ఎన్ని తరాలవారికి దాని ఫలితం ఉంటుందో ఎరగరు. ఆ బాధ్యతే కనుక తెలిస్తే ప్రపంచం ఎన్నడో బాగుపడేది. (నర్సువైపుచూచి) నువ్వింకా అనాదున్నంత అందం గానే వున్నావా-ఒక్కసారి అద్దంలో చూచుకో.

నర్సు:- నా అందంతో నీ కేంపని-

పేషెం.- నాకేం పంలేదు - కాని నీ కంటే ఒకప్పుడు నేను అందంగా ఉండే దాన్ని. అదిచూచి నీవు ఓర్వలేక పోయావు. నీకు జ్ఞాపకం లేదూ - ఆ ఫ్యాన్సీషాపు కట్టేశారా, ఇంకా ఉందా-

సిస్టర్:- ఏ ఫ్యాన్సీషాపు-

పేషెం.- అదే శాంథోమ్‌లో, ఆ హాస్టలుకు ఎదురుగా.

సిస్టర్:- ఉంది - ఉంటే ఏం?

పేషెం.- అక్కడ నువ్వు నన్ను ఎప్పుడైనా చూచావా-

సిస్టర్:- నిన్నా (కాస్తా ఆలోచించి) నీవు ఇందిరవు కదూ-

పేషెం:- అఁ...ఇందిరనే.

రజని:- ఓ మై గాడ్ ! ఎన్ని పేర్లు.

డాక్టరు:- షి సీమ్స్ టు బి ఎ చీట్ చూస్తే బలే మోసగత్తె లాగుంది

రజని:- ఎ స్కౌండ్రల్ కూడా!

2వపేషెం:- వట్టి దొంగముండండీ.

డాక్టరు:- అవునవును. చూస్తేనే తెలుస్తూంది.

రజని:- ఇక్కడేదో నాటకం ఆడి, మనల్నంతా దబాయించాలని చూస్తోంది.

నర్సు:- ఇప్పుడిది కొత్తఎత్తు వేసిందండీ దీని కథంతా నాకు తెలుసు. దీని వృత్తే ఇది మా ఫ్యాన్సీషాపులో చేరి ఎలాగైనా ఆయనకు మత్తు మందుపెట్టి బుట్టలో వేసుకోవాలని చూచింది నాకా మాత్రం తెలీదూ! ఒక్క రోజులో తెల్సుకున్నా దీన్ని సంగతేమిటో. చెంపలు వాయించి బయటకు గెంటించా.

రజని:- మంచిపని చేశావు.

2వపేషెం:- వీళ్ళను చేరిస్తే సంసారాల్లో నిప్పే!

పేషెం:- (ఒక్కసారిగా లాగి చేత్తో బల్లమీద కొట్టి) ఆపండి. ఏమిటి నువ్వు తెల్సుకొన్నది! ఈవిడ నన్నెందుకు గెంటేసిందో తెలుసా ... నేను

షాపులో నౌకరీ కున్నాను. ఆడవాళ్లున్న షాపులో వ్యాపారం ఎలా జరుగుతుందో మీకు తెలుసు. నావల్ల ఆయనకు మంచి లాభాలు వచ్చాయి కాని జీతంమాత్రం పెరగలే. ఒకరోజు ఈమె షాపుకు వచ్చింది. ఒక నెక్లెసు తీసి వేసుకొని అద్దంలో అందం చూచు కొంటోంది. నిజంగా కోతిలాగే ఉంది. కాని నేనామాటలు అనలేదు. ఆయనే అన్నాడు తనకంటే నాకే ఆ నెక్లెసు బాగుంటుందని. దానితో అహంభావం పడగెత్తింది. నన్ను గెంటేయించింది. పోతే పోనీ...నన్ను గురించి తెలుసుకుంటే తెలుసుకున్నావు గాని, నీవు ప్రేమిస్తున్న నీ శామ్యూలు విషయం తెలుసుకున్నావ్? చూడు! పో! కావాలంటే నా మూటలో అతను వ్రాసిన ఉత్తరాలు ఎన్ని ఉన్నాయో!

నర్సు:- శామ్యూల్ ఉత్తరాలు వ్రాశాడా!

పేషెం:- అవును రాశాడు. రాసినంతసేపూ నిన్ను తిట్టేడు - నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు, ప్రేమిస్తున్నా నన్నాడు. అయితే అదంతా నేను నమ్మలేదులే! మొగవాళ్ళ మాటలు నమ్మేకాలం పోయింది. నేనప్ప టికి చాలా మందిని చూచాను. (నర్సు పరుగెత్తుతుంది) అయి పోయింది. నా కథ ఇక ఎంతో లేదు. ఐదే ఐదు నిమిషాలు. నేను చచ్చిన తరువాతైనా మీరంతా ఒప్పుకుంటారు; నేనీస్థితికి రావడానికి మీరందరూ కారణమని. బయటకు చెప్పకపోయినా అంతరాత్మలో అనుకుంటే చాలు. నా జీవితంవల్ల ఇంకా లాభం లేకపోయినా మీ కెవరికీ తెలియని ఒక సత్యం చెప్పిపోతాను ... ప్రపంచంలో జరిగే ప్రతిదానికి మనందరం బాధ్యులం, భాగస్వాములం. మనకేం సంబంధ మని చేతులు కడుక్కోటానికి చూడకండి...నేను శీలాన్ని అమ్ము కున్నాను. నేను పతితను. నీతులు మాట్లాడే మొగాళ్ళందరు నా కోసం ఒకప్పుడైనా వచ్చిపోయారు. నేనిప్పుడు జీవచ్ఛవాన్ని, రోగిష్టిని. రోగంతో, కడుపులో బిడ్డతో మహిళా సంఘానికి వచ్చాను. (రజనితో) నువ్వప్పుడక్కడే ఉన్నావు.

రజని:- అవును...ఉన్నాను.

పేషెం:- నీ కాళ్ళమీదపడి బతిమాలాను. మెడబట్టి గెంటించావు.

రజని:- అవును, మహిళాసంఘం నీబోటి వ్యభిచారిణులకు కాదు.

పేషెం:- ఓ ! నీవు నీతి మాట్లాడుతున్నావా ? పోనీలే ! నిన్నని ఏంలాభం? ప్రపంచంలోని సంఘాలన్నీ డబ్బుకలవాళ్ళకోసమే ! కాని ఒక విషయం గుర్తుంచుకో. నువ్వు సహాయం చెయ్యని దానివల్ల నన్నే కాదు, ఏ పాపం ఎరుగని ఒక పసిప్రాణాన్ని కూడా చంపేశావు. నీ బూటకపు నీతి, నీ మహిళా సంఘం; నీ అధ్యక్ష పదవి, అన్నీ శాశ్వతంగా ఉండనీ ! మీటింగులు చేయండి ! పూలమాలలు వేసు కోండి ! పత్రికలలో బొమ్మలు వేయించుకోండి! ఇంకా వీలైతే అసెంబ్లీ మెంబర్లు కాండి! నేను - నాబోటి వాళ్ళు - నా బిడ్డల లాంటి బిడ్డలు...వందలు...వేలు...లక్షలు చస్తూంటాం... ఓ ! చావనీరు ...చావటం కూడా తప్పే! బతకటానికి వీల్లేదు-చావటానికి హక్కు-లేదు-ఏమిటీ ప్రపంచం? ఎవరు మీరంతా ? మనం మనుష్యులమేనా? (పెద్దగా నవ్వి) బతక్కూడదు...చావకూడదు......చావకూడదు (పడిపోయింది)

[రెండవ పేషెంటు కెవ్వుమని కేకవేసింది. అందరూ వికృతంగా అరిచారు. నర్సు పరుగెత్తుకుంటూ వచ్చింది]

నర్సు :- డాక్టర్ ! డాక్టర్ ! ఇది నాటకం కాదు. ఇదంతా అక్షరాలా నిజమే డాక్టర్ !

[తెర పడుతుంది]



## పాత్రలు

ప్రొఫెసర్
పూజారి
కాసులు
పిచ్చిది
కంట్రాక్టరు గుమాస్తా
అయ్యవారు
ఒకటవ విద్యార్థి
రెండవ విద్యార్థి

సమయం : ఒక రాత్రి

కాలం : వర్తమానం

[స్టేజికి ఒక వైపున సత్రం ముందుభాగం కనిపిస్తూంటుంది. సత్రానికెదురుగా ఒక మునిసిపల్ దీప స్తంభం. దానికి చేరువలో ఒక పడక కుర్చీ... వెనుక భాగాన కనీకనిపించనట్లు ఒక దేవాలయం...

రంగస్థలానికి రెండోవైపున ఒక రావిచెట్టు. దాని క్రింద చిన్న చలిమంట. చలిమంటముందు ఒక ముసల్ది. అదొక సజీవ ప్రాణిలా కనిపించదు. ఏదో ఒక బస్తా పడేసినట్లుంటుంది.

తెర లేచినపుడు రంగస్థలమంతా చీకటిగా నిశ్శబ్దంగా ఉంటుంది. చలిమంట వెల్తురు, చంద్రుడులేని నల్లని ఆకాశంలో మిణుక్కుమనే చుక్కల కాంతి తప్ప మిగతా పెద్ద వెల్తురేమీ రంగస్థలం మీద పడదు... ఒక క్షణం గడిచాక సత్రంలోంచి ఒక ముసలాడు హరికేన్ లాంతరు పట్టుకొని మెల్లగావచ్చి అగ్గిపెట్టెతీసి ఆరిపోయిన మ్యునిసిపల్ లాంతరు వెలిగిస్తాడు. ఆ వెలిగించేటపుడు దూరంగా దేవాలయంనుంచి గంటలు వినిపిస్తాయి. వాటి శబ్దం క్రమేపీ క్షీణిస్తుండగా ఎక్కడినుంచో ఒక మతిలేనివాడి పాట, తంబూరు మీద వినిపిస్తూంటుంది.]

## పాట

స్వర్గలోకం పోదామన్నా; మార్గమేది అన్నయా?
స్వర్గలోకపు దారులెపుడో; స్వర్గమయ్యెర తమ్ముడూ!
స్వర్గలోకపు దుర్గములలో; ప్రజలు ఉన్నా రన్నయా?
స్వర్గలోకపు దుర్గములలో; ఖడ్గ మృగములు చేరెరా!
స్వర్గ పురిలో స్వార్థమన్నది; అర్థమైనా ఉన్నదా?
అర్థమూ మరి స్వార్థమూ; పరమార్థమైనవి ప్రజలకూ!
దిక్కుమాలిన పశులన్నీ; ఎక్కడున్నవి అన్నయా?
దిక్కుతోచక పిచ్చి ఎక్కి—నక్కి ఉన్నవి తమ్ముడూ!

సాధుశీలికి, జ్ఞానశీలికి స్థానమన్నది ఉన్నదా?
దానవత్వం నిండి లోకం; కానగలదా జ్ఞానినీ!—
మరి కానిపించే కాంతి అంతా; ఎటుల వచ్చెర అన్నయో?
అస్థులూ, ప్రజ నెత్తురూ; అది మిళితమైన భ్రాంతిరా!

(బిచ్చగాడు పాట పాడుకుంటూ రంగంమీద లాంతరు స్తంభానికి-చలిపుంటకూ సిద్ధంగా కూర్చొని ఉండొచ్చు లేదా పాట నేపధ్యం నుంచి వినిపించవచ్చు— లేదా పాట డిలిట్ చేయవచ్చు — అది వీలునుబట్టి ప్రదర్శకులు ఏర్పాటు చేసుకోవచ్చు)

[ముసలాయన ఈలోగా దీపం వెలిగించి చిమ్నీ పెడతాడు.]

పాట అయిపోతుంది—
పిచ్చివాడి నవ్వుతుంది—

ముసలాడు పిచ్చిదానివైపు చూచి, హరికేన్ లాంతరు సత్రంయొక్క-స్తంభానికి వేలాడదీసి సత్రం రెండోవైపునకు వెళ్ళిపోతాడు. క్షణం నిశ్శబ్దం—

(తరువాత బయటనుంచి, పూజారి శ్లోకాలు వల్లించుకుంటూ వస్తాడు— సరాసరి "కాసులూ" అని కేకలు వేసుకొంటూ సత్రం లోకి వెళ్తాడు—సత్రంలో ముసలాడు కనిపించకపోగా బయటకివచ్చి మళ్ళీ "కాసులూ" అని పిలుస్తాడు. సమాధానం రాదు.)

పూ:- ఎక్కడ చస్తాడో? ఏవిటో— వెధవ మనుషులూ, వెధవ నడతలూనూ! ఆ కాస్తంత నౌఖరీ దొరికేవరకు పిటీషన్లూ, ఊరేగింపులు, ఉపన్యాసాలూ, నానా అల్లరిచేసి— అది కాస్తా దొరికాక ఇదీ వరస.

కాసు:- (సత్రం పెరటివైపు నుంచి వచ్చి) ఎవర్తో బాబయ్యా అట్టా మాటే దేసుకొంటున్నారు?

పూ:- వచ్చావూ?— అవును. వాస్తావ్ వాస్తావ్! నాకు తెలుసులే! చచ్చిన ప్రతివాడూ పునర్జన్మ ఎత్తుతాడని!...... ఇంతవరకూ ఎక్కడ తగలడ్డావని?—

కాసు:- వల్లకాట్లో బాబయ్యా—

పూ:- శివ శివా! ఏవయ్యా కాసులూ— నీ కీ నౌకరు ఉద్యోగం ఎలా దొరికిందయ్యా?— నానా ఆగచాట్లూ పడి నానా వాళ్ళచేత అయ్య వారి దగ్గర రెకమెండేషన్లు చేయించుకొంటేనే గదా నీ కీ నీడ దొరికింది.

కాసు:- అదేంటి బాబయ్యా అట్టా మాటాడతారు. ఇక పుట్టినోడికి ఈ గడ్డ మీద నౌకరీలే దొరకనట్టు— నాకు నౌకరీ దొరక్కపోతే నా పాపమని ఏడిసేకాలం పోనాదండోయ్ పూజారిగరూ! రోజులు మారాయి.

పూ:- హరి! అవన్లే... నిన్ననవల్సిన పని లేదులే!— ఈ మితవాదులంతా కల్సిచేరి ఏదో ఉద్ధరించేసేట్టు "ఆకలినీ" అభ్యుదయాన్ని ఆ ఎర్ర జెండాలవాళ్ళ పాలిట చెయ్యడమొచ్చింది—

కాసు:- ఉత్తిపున్నానికి ఆల్ల నాడిపోసుకుంటా వేంటయ్యా పంతులూ! ఏదో సామెత సెప్పినట్లు మాటాడుతున్నావ్...
అమ్మ పెట్టా పెట్టదు—

పూ:- ఆ! ఆ! సర్లే! నెత్తివరకు ఎక్కినవాడికి ఎవరు చెప్పగలరు? చూడు ఈవేళ సత్రానికి ఎంతమంది యాత్రికులు వచ్చారు?

కాసు - సానామంది—

పూ:- ఊహూ! ఎంత సంపాయించావేమిటి వాళ్ళందరి ముందూ చెయ్యి చాచి?—

కాసు:- ఏం, వాటా కావాలంటారా?—

పూ - శివ, శివా! ఎంతమాట?—

కాసు:- ఏమో? అయ్యవారిదగ్గర అలవాటుపడ్డ పాణం గందా అని—

పూ:- [భుజాలు తడుముకుంటాడు]

పిచ్చిది:- [నవ్వుతూ లేస్తుంది] పిచ్చివాళ్ళు— పిచ్చిలోకం! మీరంతా పిచ్చి మనుష్యులు— అలవాట్లకు, పొరపాట్లకు అర్థంలేదు ప్రపంచంలో. (కాసులుతో) ఒరే అబ్బీ! నీయంత అన్యాయకుడు లేడురా లోకంలో-

(పూజారితో) పూజారిగారూ! తమలాంటి పుణ్యాత్ముడు లేడు ప్రపంచంలో. అమాయకులూ, పుణ్యాత్ములూ ఒక్క దగ్గర ఉండలేరురా! వేలూ, లక్షలూ, కోట్లూ అమాయకుల కంఠాలు మూగవోతేగాని, మీలాటివాళ్ళు పుణ్యాత్ములు కాలేరు— పాపం, పుణ్యం శ్లేషార్థాలూ......

[ఏడుస్తూ, నవ్వుతూ బయటకు పోతుంది.]

పూ:- ఒరే కాసులూ! ఈ పిచ్చిముండ నిక్కడ చేరనివ్వద్దని నీ కెన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదేవిట్రా—

కాసు:- రావఁ! రావఁ! ఆ యమ్మ పిచ్చిదా? మీకు నోరెట్టా వచ్చిందయ్యా పూజారిగోరూ? సేమేసరం బాబే బతికుంటే ఆ యమ్మ కాగతి పట్టుండేదా, మీరీమాట అనగలిగి ఉండేవారా?

పూ.- (తడువుకుంటాడు— చిరునవ్వుతో) పిచ్చివాడా! బండ్లు ఓడ లవు తాయిరా— ఓడలు బండ్లవుతాయి- మార్పుకి తగ్గట్టు నడచుకోవడం మానవ లక్షణంరా.

కాసు:- బహు బాగుందయ్యా పూజారీ, ఈ యేదాంతం.

[సత్రంలోకి పోతాడు.]

పూ - (కాసులు నిష్క్రమించినవైపే చూస్తుంటాడు.)

[కంట్రాక్టర్ గుమాస్తా ప్రవేశిస్తాడు]

కంIIగు:- పూజారిగారూ!

పూ:- అయ్యా!

కంIIగు:- అయ్యవారున్నారా?—

పూ:- ఏ అయ్యవారు?—

కంIIగు:- ఏ అయ్యవారు!...ఇక్కడెందరు అయ్యవార్లున్నా రేమిటి?—

పూ:- ఇద్దరు—

కంIIగు:- ఇద్దరా?-

పూ:- ఆఁ! ఒకరు దేవాలయంలోని అయ్యవారు శ్రీ శ్రీ శ్రీ శివశంకర స్వామివారు... శిలామూర్తి... రెండు— వారి ఆలయానికి అధిపతి మా అయ్యవారు— శ్రీమాన్ జగన్నాథస్వామి నాయుడుగారు- సాక్షాత్తు సజీవమూర్తి—

కం॥గు:- బాగుంది... బాగుంది... సరే - శిలామూర్తి శివశంకరస్వామి ఆలయానికి అధిపతి అయిన తమ అయ్యవారు ఎక్కడున్నారు?-

పూ:- వారి ఆలయములో—

కం॥గు:- ఎంతసేపట్లో వస్తారు?

పూ:- ఏముంది- ఈవేళ వచ్చిన ఆదాయాలకూ, వ్యయాలకూ గిట్టింపు సరిగ్గా సరిపోయిన తక్షణం వచ్చేయ్యొచ్చు—ఏమిటికథ- అంత తీక్షణంగా అడుగుతున్నారు—

కం॥గు:- ఆ! ఏం లేదు! [పొడుం పీల్చి] ఈ మధ్య యాత్రికుల రాకపోకలు మరీ హెచ్చయి పోయాయనీ, ఈ ఆలయ శిల్ప సౌందర్యాన్నీ, మహాత్మ్యాన్నీ మెచ్చుకొంటూ పాశ్చాత్యులు కూడ తరచు రాకపోకలు సాగిస్తున్నారని-ఏవిటి - వారి సౌకర్యార్థం ఆలయావరణలో ఏవో కొత్త వసతులు నిర్మించేందుకు టెండర్లు కోరారట.

పూ:- అవును, మొన్న పత్రికల్లో ప్రచురించాం,

కం॥గు:- అవునా? అదిగో దాని కోసమని మా కంట్రాక్టర్‌గారు మీ అయ్య వారిని—ఏవిటీ—కల్సుకోమని పంపించారు.

పూ:- దానికిలా సంప్రదింపు లేవిటండీ?

కం॥గు:- సాంప్రదాయకమే లెండి.

పూ:- అయితే వెళ్ళి ఓ దరఖాస్తు పెట్టుకోమనండి.

కం॥గు:- ఈ విషయాలు మీకు బొత్తిగా కొత్తలా వున్నాయి.

పూ:- కొత్తా! నాకా? అయ్యా! తమకింకా సరిగ్గా తెలుసునో లేదో! మా పితామహుల దగ్గర నుండి ఈ ఆలయాన్ని రక్షిస్తూ, ఈ దేవుణ్ణి కొల్చుకొంటూ వస్తూన్నామండీ ఇప్పుడంటే అవేవో ప్రజాస్వామ్య విధానాలట-అవి ప్రవేశపెట్టి; పుణ్యస్థలాలకు కూడ ఎలక్షన్లు, నామి నేషన్లు, కమిటీలు నా బొందా చేసి యిదుగో నిజమైన హక్కుదార్ల మైన మమ్మల్నిలా శక్తిహీనులుగా చేసేశారు.

కం॥గు:- అహఁహఁ! నిజం శెలవిచ్చారు కదటండి. పూర్వంలో ఈ కంట్రాక్టర్లు, బ్రోకర్లు అనే వాళ్ళుండేవారా మరి? ఇప్పుడంటే ప్రజాస్వామ్య

విధానాలు ప్రవేశపెట్టడం తరువాయిగా నాయకులు, వారితో బాటే వినాయక స్వరూపాలు, వారి అల్లుళ్ళూ, బావమరదుల బాదరబందీ అన్నీ హెచ్చయిపోయి బావగార్లు, మామగార్ల సహాయంతో కుబేరులై పోతున్నారుగాని-

పూ:- సరిసరి...రోలొచ్చి మద్దెల్తో మొరపెట్టుకున్నట్టుంది మీ సంగతి. అయితే ఆ కంట్రాక్టు మీకు ఖాయం చెయ్యాలంటారు-

కం॥గు:- చిత్తం.

పూ:- కాని అయ్యవారు సమ్మతించరేమోనని—

కం॥గ:- అబ్బెబ్బే! అసలలా ఉంటే పీల్లేదు నూటికి 30 వంతులు అయ్యవారికి ఇవ్వడానికి మా కంట్రాక్టరుగారు నిర్ణయించుకొన్నారు.

పూ:- మంచిపని చేశారు. సిగ్గు బుద్ధిలేదటయ్యా! ఆయన గారేదో నూటికి 80 వంతులు స్వార్థం కొద్దీ కస్తానంటుంటే తగదునమ్మా అని మీరు మధ్యవర్తిత్వం రాయబారాలు సాగిస్తున్నారా? (రహస్యంగా) సమయంలో సమయం ఇలాంటి అదనులోనే మనలాంటి వాళ్ళు సంపాదించుకోవాలయ్యా నాలుగు రాళ్ళు—ఏవంటారు?

కం॥గు:- అయ్యో! ఎంత మాటెంత మాట (రహస్యంగా) తల వెంట్రుక వాసి మనం కూడా స్వాహా చెయ్యకపోతే అది ప్రజాధనం ఎలా అనిపించుకొంటుంది చెప్పండి? ఆహా! మనలో మాట. పెద్దవాళ్ళు పర్వతాలను ఫలహారం చేస్తే? ఏవిటి? మనలాంటి వాళ్ళం ఆ రాళ్ళ ముక్కలన్నా 'హరీ' చేయొద్దటండీ? ఏవిటి?

పూ:- (నవ్వి) ఇప్పుడనిపించుకొంటావయ్యా ప్రయోకరు గుమాస్తావని. అది సరే—ఇందులో మన వాటా?

కం॥గు:- అయ్యో అదేమిటండీ! పూజారికి లేని నైవేద్యం ప్రభువులకా? ముందు మనం కాస్తంత రుచిచూచి 'సర్టిఫై' చెయ్యందే ప్రభువుల వారి 'ఫైనల్' ముద్ర అందుమీద పడదు—పడకూడదు—ఏవంటారు?—

పూ:- నిజం తెలివిచ్చారంటాను—మరి నా వాటా ఏమిటో తేల్చారు కాదు—

కం॥గు:- ముందు ఆ కంట్రాక్టంతా మా కంట్రాక్టర్‌గారికి వచ్చేట్టుచేయండి—
ఆ తరవాత—

పూ.- మొండి చెయ్యి చూపిస్తారు.

కం॥గు:- అమ్మమ్మమ్మ! ఎంతమాట ఎంతమాట! అలా మోసం చేస్తే పురుగులు
పడి ఛస్తారు—

పూ:- (వికటంగా నవ్వి) ఎప్పటిదోయ్! అలా పెద్దమాటే ఉపయోగించారు. రోజులు మారాయి గుమాస్తాగారూ, రోజులు మారాయి. నన్నడగండి—నేను చెప్తాను—ఈ నా ౬0 ఏళ్లు నిస్వార్థంగా ఈ దేవుని కర్చనకని వినియోగించాను! కాని ఒక్కనాడు కూడా, ఈ మా దేవుడు, నిజం చెప్పుకోవాలంటే, అన్యాయం చేసిన వాళ్ళను శిక్షించినట్లు కనిగాని, వినిగాని ఎరుగను. పైగా ఆయన ఆలయానికి వచ్చి ''ఈశ్వర్ ఉల్లా తేరేనామ్ సబ్‌కో పెర్మిట్ దే భగవాన్'' అని సహస్ర కలశాభిషేకం చేయించె సరికల్లా ఆ ముండా దేవుడు కాస్తా అలా అలా కరిగి నీరై చిరునవ్వుతో శిలాహస్త మెత్తి చల్లని అభయహస్తమిస్తాడు. అందుకని అన్యాయానికి గురైన ఏ నాలాంటి అమాయకప్రాణీ దేవుడో అని మొరబెట్టుకో బోతుంటే మ్రెండు నాకే తగలనిస్తున్నాడు. అందువల్ల—అయ్యా కంట్రాక్టర్ గుమాస్తా గారూ, ఆ యిచ్చేదేదో ముందే సమర్పించుకొంటే, అన్యాయమో, న్యాయమో మరి, ఆ కంట్రాక్టంతా మీకే వచ్చేట్టు చేసే పూచీ నాది.

కం॥గు:- ఊఁ సరే! ఎంత కావాలంటారు?

పూ:- ఏదో తమరే శెలవియ్యాలి?

కం॥గు:- అహఁ ఎంతమాట! పుచ్చుకొనేవారు తమరు.

పూ:- అబ్బెబ్బె! ఇచ్చేవారు తమరు.

కం॥గు:- (క్షణం సేపు ఆలోచించి) సరే—వంద!

పూ:- వంద? ఓహ్! బోడివంద! ప్రజాస్వామిక విధానాల ననుసరిస్తున్న మా పుణ్యస్థలిలో కేవలం దక్షిణ పుచ్చుకొనేంత వెర్రిబాగులా డెవ డున్నాడు చెప్పండి బాబూ! ఏదో తమరు అనాలని అంటున్నారు గాని—

కం॥గు:- సరే—పోనివ్వండి—వెయ్యి !

పూ:- అయ్యా ! ఇంతెందుకు? నేనొకటి చెబుతున్నాను. కంట్రాక్టంతా మొత్తము ఐదారు లక్షలు విలువ చేసేది అవునా?

కం॥గు:- అవునండి.

పూ:- అందులో కనీసం లక్షన్నరైనా మీ కంట్రాక్టరి లాభం—అవునా?

కం॥గు:- చిత్తం—ఉండొచ్చండి.

పూ:- నూటికి 30 చొప్పున మా అయ్యవారికి వస్తుంది. ఇది సర్వులకూ తెలిసిన తతంగమే, మీకూ్కడా తెలుసు. మీకు తెలుసునని మాకూ తెలుసు.

కం॥గు:- చిత్తం.

పూ:- అవునా? మరి అయ్యవారిచేత ఒప్పించి సంతకం చేయించి సదరు ఆమోద పత్రాన్ని సురక్షితంగా మీకు చేరవేసే బాధ్యత నాదే గాబట్టి, ముఖ్యుణ్ణి నేనే గాబట్టి, నాకు మీ లాభంలో 15 వంతులు ఇవ్వటం సబబు.

కం॥గు:- 15 వంతులే! అంటే (వేళ్ళు లెక్కబెట్టి) 20 వేలు......!

పూ:- అదేమిటయ్యా! డబ్బంతా నువ్వే ఇచ్చేట్లు అలా కళ్ళు తేలేస్తున్నావ్?

కం॥గు:- అది కాదండి !

పూ:- ఏమి కాదూ? అసలు మేనేజరు దగ్గరుండి ఆ కట్టడాలన్నిటినీ కరక్టుగా కట్టిస్తే రెండు లక్షల్లోపునే అయిపోతుంది. కాని, అవి మా స్వార్థాలో మీ స్వార్థాలో ఎవరిదో ఒకరిది— మొత్తానికి అంచనాలు రెట్టింపుచేసి మీకు కంట్రాక్టు యిప్పిస్తుంటే మా మొహంమీద ముష్టి 20 వేలు పారెయ్యడానికి నీకు బాధటయ్యా !

కం॥గు:- అబ్బే, మీరు నన్ను సరిగా అర్థం చేసుకోలేకపోతున్నారు—

పూ:- అర్థం చేసుకొన్నాం, ఇంత లాభం చూపిస్తే కోటి మంది ముందు కొస్తారు వెళ్ళవయ్యా ! (వెళ్ళబోతాడు)

కం॥గు:- (అడ్డపడి) అబ్బే! మీరలా అంటేకాదు—సరే- ఒప్పుకొన్నాం—

పూ:- సరే-ఖాయం చేస్తాం వెళ్ళండి. అదిగో అయ్యవారు వస్తున్నారు.

కం॥గు:- అయ్యావారా? నేను మాట్లాడుతాను.

పూ:- (దీర్ఘం తీస్తూ) ఏవిటీ?

కం.గు:- అయ్యవారితో కంట్రాక్టు విషయం......

పూ:- ఓహో! చాలావరకూ వచ్చిందే? నాతో మాటాడింది చాలక ఇహ వారితో కూడానా? పిచ్చివాడా! నేను కాదంటే వారు అవుననగలరా? నేను దేవునికి పూజారినే కాదోయ్! ఆ దేవుని ఆలయంయొక్క అధికారికి అంతరంగిక కార్యదర్శిని కూడాను, ఇహ దయచెయ్.

కంగు:- మరి మీరు ఎలాగైనా ఖాయం చెయ్యాలి.

పూ:- తప్పకుండాను. వెళ్ళండి.

[కం.గు నిష్క్రమిస్తుండగా అయ్యవారు ప్రవేశం. కం గ. అతనికి నమస్కరిస్తాడు వాడెక్కడ మాటాడేస్తాడేమోనని, కం గు.ని పూజారి బయటకు నెట్టేస్తాడు అయ్యవారువెళ్ళి కుర్చీలో, లాంతరు స్తంభం చేరువన కూర్చొంటాడు.]

అయ్య- కాసులూ?

పూ.- ఒరే కాసులూ! అయ్యవా రొచ్చారు. కాస్తంత చన్నీళ్ళు పట్రా (అయ్యవారితో) చన్నీళ్ళు చాలంటారా?

అయ్య:- ఊఁ.

పూ:- నాకు తెలుసు తమ మనోగతభావాలు (కేకవేస్తూ) కాసులూ-మరీ చల్లని నీళ్ళు కావు.

అయ్య:- శాస్త్రీ!

పూ:- అయ్యా!

అయ్య:- ఈవేళ సత్రంలోకి ఎందరు యాత్రికు లొచ్చారు?

పూ:- కాసుల్ని కనుక్కోవాలండి, కాసులూ! ఆ ఖాతా పుస్తకాలు కూడా పట్రా.

[ముందే తెలుసు నన్నట్టు, ఖాతా పుస్తకం, గ్లాసుతో మంచినీళ్ళు తెస్తాడు కాసులు మంచినీళ్ళు అయ్యవారు, పుస్తకం పూజారీ అందు కొంటారు.]

పూ:- (పుస్తకంచూచి) 75 కుటుంబాలండి.

అయ్య:- ఊ.

పూ:- వచ్చిన ఆదాయం 50 రూపాయలు

అయ్య:- అంత తక్కువ

పూ:- అవునయ్యా! కాసులూ—వచ్చిన కుటుంబాలు 75 అయితే డబ్బు ఏతయ్యే వస్త—

కాసు:- అల్లివ్వటం లేదండి.

పూ:- ఏం?

కాసు:- ''అవును ఇది ధరమ సత్రం గదా, రోజుకి గదికి రూపాయిన్నర ఎందుకివ్వాలేం'' అని అడుగుతున్నారండి.

పూ:- అడుగుతున్నారూ? అడగరూ మరి! ఈ ప్రజాస్వామ్య సిద్ధాంతాలు వచ్చి హరిజనుడికికూడా ప్రశ్నించే హక్కును కలుగచేస్తున్నాయి గాని—మరి నువ్వు ఒత్తిడి చెయ్యలేదటయ్యా?

కాసు:- చేస్తే రశీదు ఇమ్మంటున్నారండి.

పూ:- మరి ఇవ్వలేక పోయావ్—

అయ్య:- శాస్త్రీ...కాసులూ! రేపట్నించి గదులు ఖాళీగా లేవని బోర్డు వ్రాసి పెట్టేయ్.

పూ:- (కాసులతో) అర్థమైందా? ఏవిటి?

కాసు:- గదులు కాలీగా ఉన్నా లేవనెయ్యాలి.

పూ:- ఎందుకో తెలుసా?

కాసు:- (వెటకారంగా) తెలుసునండి.

పూ:- అవసరమై కావాల్సినవా డెవడో రూపాయిన్నర ఇచ్చిఉంటాడు... అంతేనంటారా?

అయ్య:- ఊం.

పూ:- (కాసులతో) ఇహ నువ్వు వెళ్ళు.

[పుస్తకం, గ్లాసు పట్టుకొని సత్రంలోకి పోతాడు కాసులు]

అయ్య:- శాస్త్రీ! బెండర్లేమైనా వచ్చాయా?

పూ.- వచ్చాయండి. కుప్పలు. కాని మనకు అనుకూలంగా ఉన్నది మాత్రం ఒక్కటీ రాలేదు.

అయ్య.- ఊఁ!

పూ:- అయితే నేనే స్వయంగా వెళ్ళి కొందరు కంట్రాక్టర్లను కలుసుకొన్నాననుకోండి—

అయ్య:- వాళ్ళేమంటారు?

పూ:- అంతా అనుకూలంగానే వున్నారు. కాని వచ్చేదాంట్లో 'మనకు' రావల్సిన—

అయ్య:- ఊఁ!

పూ:- అదే అదే 'తమకు' రావాల్సిన వాటా సరిగ్గా తేల్చటం లేదు. అయితే ఒకర్ని మాత్రం కుదిర్చానులేండి.

అయ్య.- శాస్త్రీ! పనిలో పనిగా కొంత దిగువన నాకో బంగళా కట్టించాలని వుందోయ్-

పూ:- ఇంకా ఉందని మెల్లగా అంటారేవిటండీ! 'శుభస్య శీఘ్రం' అన్నారు పెద్దలు. రేపటికి మన కీ పదవులు వుంటాయో ఊడతాయో ఎవరు చెప్పగలరు? వెలుగుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. అయితే దాని కయ్యే ఖర్చు మాటంటారా? అబ్బే! ఒక సున్నా కుడివైపున ఇరికించి సరిపెడ్తే ఎవరు చూసేవాళ్ళు, అడిగేవాళ్ల-

అయ్య:- ఊఁ అదీ నీ చేతిమీదే కానీయ్!

పూ:- అయ్యో! అదెంతమాట!

అయ్య:- అయితే, ఇంతకూ ఆ కంట్రాక్టరు ఎంతిస్తానంటాడు?

పూ - నూటికి ఇరవై వంతులు యిచ్చేందుకు ఒప్పుకొన్నాడు.

పిచ్చిది:- (ఛద్రున బయటినుంచి వస్తుంది) అబద్ధం. నూటికి 20 కాదు. ఈ దొంగ పూజారి అబద్ధ మాడుతున్నాడు-పట్టి అబద్ధం-అవునయ్యో పూజారి! ఇదెలానూ ప్రజల సొమ్మేకదా, నూటికి 200 మీ వాటా తీసుకుంటే నీ సొమ్మేం పోయింది?

అయ్య:- శాస్త్రీ!

పూ:- అయ్యా! పిచ్చిదండి- ఆ మాటలు అంతగా పట్టించుకోనవసరం లేదు.

పిచ్చిది:- లేదూ? అవును-అవసరం లేదు-నేను పిచ్చిదాన్నే (నవ్వుతుంది) నేను పరమ వెర్రిదాన్ని. లోకమంతా పిచ్చిదే. అలా మార్చేశారు లోకాన్ని మీరంతా కల్సి. మీరంతా దొంగలు (ప్రేక్షకుల వైపు తిరిగి) వీళ్లు దొంగలు—— వీళ్లు ఈ గుడికి అధికారులు——వీళ్ళను మీరు మంచివాళ్ళనుకొని ఎన్నుకొని ఆ పదవిలో కూర్చోబెట్టారు. కాని వీళ్లు చేస్తున్నపని చూశారూ? మీ మ్రొక్కుబడి డబ్బునీ, దమ్మిడీ దమ్మిడీ చొప్పున కూడబెట్టుకొన్న, సమర్పించుకొంటూన్న దక్షిణను ఏం చేస్తున్నారో?

పూ:- ఏమమ్మా!

పిచ్చి:- ఏం పసివడా? రహస్యాలు చెప్పేస్తున్నానని కోపమెందుకు! మీరు చేస్తున్న దొంగపనులు ఏం తెలీడం లేదనుకోకండి.

అయ్య:- తెలిస్తే తెలీనియ్యమనవయ్యో శాస్త్రీ!

పూ:- అవును మామ్మా! తెలిస్తే తెలీనీ?

అయ్య:- మధ్య తన కంఠశోష తప్పిస్తే యిందులో ఆమెకు అవగింజైనా లాభం కూడా వుండదని చెప్పవయ్యో శాస్త్రీ?

పూ - అవును మామ్మా! పిసరంతైనా లేదు?

పిచ్చి:- అవున్నా అవును. ఈ ప్రజలంతా అమాయకులు, అశక్తులు. అన్నీ తెలిసి ఏం చెయ్యడం? మీకు గుణపాఠం చెప్పే శక్తి వాళ్ళల్లో వున్నా మీ కల్లిబొల్లి మాటలు నమ్మి మళ్ళా మీ పంచనే చేరుతారు కదా!

అయ్య:- అవునా! అందుకే నువ్విలా వీధినపడి అరవటం లాభంలేదు తులిశమ్మా?

పిచ్చి:- తులిశమ్మా! ఎవర్రావారు? నా పేరుపెట్టి పిల్చే ధైర్యం ఎవరికుందిరా? (అయ్యవార్ని ఎగా దిగాచూచి) నువ్వా దేశోద్ధారకా! దీనజన రక్షకా! నువ్వేకదూ నా కొంప కూల్చిన రాక్షసుడవ్? నువ్వేకదూ నన్ను పిచ్చిదాన్ని చేసిన పాపాత్ముడవ్? నువ్వేకదూ నా అయిదో తనాన్ని కాళ్ళ రాసిన కసాయివాడవ్?

అయ్య:- శాస్త్రీ!

పూ:- మామ్మా!

పిచ్చి:- నోర్మూయండి. మొహాలకు సిగ్గులేకుండా మాట్లాడుతున్నారు. అసలు మీకు సిగ్గులనేవి ఉన్నయ్యా! నా మతిమరుపు మండ. మీకు సిగ్గులనేవి లేవని తెలుసుండి కూడా మీతో వాదా లేస్తున్నా నేవిటి? ఛీ! ఛీ! మీరు నాకు శత్రువులు-శత్రుశేషం, ఋణశేషం ఉంచకూడదు. (అయ్యవారితో) నువ్వు-నువ్వు జగన్నాథస్వామి నాయుడవు కదూ! అవును నాయుడవే— నాయకుడవ్— తడిగుడ్డల్తో పీకలుకోసే కోమల హృదయం నీదే— నువ్వే నా బ్రతుకుని బండలు చేశావ్, నా దేవుణ్ని బలి చేశావ్. నా అయిదో తనాన్ని మంట కలిపావ్— నా సంసారంలో చిచ్చుపెట్టావ్—

అయ్య:- శాస్త్రీ!

పూ:- మామ్మా! కాలం మూడి నీ భర్త పోతే ఎదుటి వాళ్ళ నాడిపోసుకుంటావేం?

పిచ్చి:- కాలం మూడి పోయారా? మీరంతా కలసి ఆయన్ని చంపలేదూ? మీ సుగుణాలకోసం, సౌఖ్యాలకోసం, విలాసాలకోసం, స్వార్థంకోసం, మీరంతా ఒక్కుమ్మడిని ఆయన రక్తమాంసాలను పిండి, పిప్పిచేసి, గిల కొట్టుకొని చచ్చిపోయేట్టు చేయలేదూ? ఇది హత్యకదూ? ఏం మాటాడరేం? ఇది చిత్రవధకాదూ?

పూ:- అయ్యో! అయ్యో! మనం యిక్కడిలా యీ పిచ్చిదానితో వాదా లేసుకు కూర్చుంటే లాభంలేదు.- లోపలికి పోదాం రాండి.
(యిద్దరూ సత్రంలోకి పోతారు)

ప్రొఫె:- (మాసిన గడ్డం, చిరిగిన దుస్తుల్తో ప్రవేశించి) ఎవరమ్మా? నువ్వు?

పిచ్చి:- (చిత్రంగా చూచి) పిచ్చిదాన్ని...నువ్వు పిచ్చివాడవేనా?

ప్రొ.- ఆఁ !

పిచ్చి:- అయితే ఏడు— అదిగో ఆ కనిపించే పుణ్యస్థలిలో అధికారం హస్తగతం చేసుకొని, ఎవరి ఆక్రందనలనీ లెక్కచేయకుండా గంతులేస్తున్న యీ రాక్షసుల మెడలు కూలి మన్ను కలిపేంతవరకూ ఏడు— ఊఁ ఏడవ్వేం ?

ప్రొ:- ఏడుపు ఆడవాళ్ళ నైజం.

పిచ్చి:- ఆఁ అలాగా! అయితే నువ్వు ఏడ్వని మగవాడివా? మరి పిచ్చివాడి వెలా అయ్యావ్ ?

ప్రొ:- అన్యాయాలను ధిక్కరించినందుకు—

పిచ్చి - ఓహో అలాగా! అన్యాయాలకు గురయ్యేవాళ్ళు— ధిక్కరించే వాళ్ళు-పిచ్చివాళ్ళే నన్నమాట— సరి సరి— నీ పేరేమిటి నాయనా ?

ప్రొ:- చిదంబరం.

పిచ్చి:- ఏ ఊరు ?

ప్రొ:- ఈ పుణ్యస్థలే.

పిచ్చి:- కాబట్టే పిచ్చివాళ్ళ మయామయ్యా! అది సరే! నీకు పెళ్ళయిందా?

ప్రొ.- లేదు—

పిచ్చి:- భేష్— మంచిపని చేశావ్? నువ్వు ఛస్తే, నువ్వు పిచ్చివాడవైతే మరోశక్తిలేని అమాయక ప్రాణి నీ ప్రాణానికిపడి ఏడవకుండా మంచిపని చేశావ్! ఈ దేశముంది చూశావ్... ఆడదాని పాతి వ్రత్యంగురించి ఏదో ప్రచారం చేసుకోంటోంది. కాని మగాడు

చస్తే ఆ ఆడదానికి మాత్రం చేయూతనివ్వదు నా బ్రతుకు చూడు ఏమయ్యిందో? నా దేవుడు ఈ ఆలయంలో పనిచేసేవారు—ఆయన్ని వాళ్ళు చంపేశారు—

ప్రొ:- చంపేశారా ?

పిచ్చి:- చంపడమంటే కత్తితో పొడిచి చంపాలటయ్యా! ప్రొద్దుపొడిచింది మొదలు, కృంకేవరకు కష్టపడే మనిషికి యీ వెధవలిచ్చే రెండు రాళ్ళు ఎందుకు పనికొస్తాయి? ఆకలి... ఆకలి... అది చాలదూ చిత్రవధ చెయ్యటానికి?

ఒక్క క్షయరోగం వస్తుంది. ఒక్క పెద్దరోగం వస్తుంది ఒక్క పక్షవాతం వస్తుంది. ఆదే చిత్రహింస. ఆయన్ని చంపేశారు. నాకు దిక్కులేదు. నేను పిచ్చిదాన్ని కాక చేసే దేముంది చెప్పు? అబ్బాయి! పిచ్చివాళ్లుగా మారిపోవడంలో ఒక మంచి ఉంది సుమా! వాళ్ల భోగాల నాశించరు. విలాసాలు కావాలనరు. పంచభక్ష్య పరమాన్నాలు కోరరు. స్వస్థలాలు, స్వగృహాలు అవసరంలేదు. ఎంగిలాకులు తిని తృప్తిపడతారు. చెట్లక్రింద నిద్రపోతారు. కావాలంటే పట్టపగలు నడిరోడ్డుమీద దిగంబరంగా పడుకోగలుగుతారు-వాళ్ళతో ఎవరికీ పేచీ ఉండదు. వీళ్ళు ఎవర్నీ అడగరు, ప్రశ్నించరు, విమర్శించరు అలా చేస్తే పిచ్చివాళ్ళని లెక్క చేయరు.

ప్రొ:- నేనలాంటివాణ్ణి కాదమ్మా!

పిచ్చి:- మరి? మరింత మదపిచ్చివాడవా?

ప్రొ:- కాదు నేనవుగుతాను, నీ భర్త పోయాక నిన్ను గాంకి వదిలేసిన యీ సమాజాన్ని విమర్శిస్తాను.

పిచ్చి:- అందుకే నీది మదపిచ్చి అన్నాను. నాకు తెలుసు నాయనా! అన్నం తిన్నావా ?

ప్రొ:- [తల అడ్డంగా త్రిప్పుతాడు లేదన్నట్లు]

పిచ్చి:- అయ్యో! నాయనా! నువ్వు మా పిచ్చివర్గం సభ్యుడివేగా? రా తిను.
[కొన్ని రాళ్ళిస్తుంది... ప్రొఫెసర్ బాధగా నవ్వుతాడు]

కాసు:- [సత్రంలోంచి వస్తూ] ఏయ్! ఎవరక్కడ? ఆ? యినిపించుకోరేం? పొండి [దగ్గరగా వస్తాడు] అమ్మా! ఆ కర్కోటకోళ్లు మిమ్మల్నిలా ఉండనివ్వరమ్మా. మీ రిక్కడినుండి ఎల్లిపొండి.

ప్రొ:- ఎందుకు ?

కాసు:- ఎల్లిపోవాలి బాబయ్యా.

ప్రొ:- ఇది ధర్మసత్రంగా—

కాసు:- అని మీరనుకొంటే పొరపాటే బాబయ్యా—

ప్రొ:- ఏం? పద్ధతులు మారాయా?

పిచ్చి:- కాదు. ప్రభువులు మారారు. నేను వెళ్ళనురా చెప్పు ఆ రాక్షసులతో.

ప్రొ:- నువ్వీ సత్రానికి నౌఖరువా?

కాసు:- అవును బాబయ్యా!

ప్రొ:- అందుకేరా నీలో ఇంకా మానవత్వం బ్రతుకుంది. నువ్వు మనిషి గానే చచ్చేంత కాలం బ్రతకాలంటే నువ్వు నౌఖరుగానే ఉండాలిరా! కాని ఆజన్మాంతం నౌఖరుగానే ఉండకు సుమీ!

కాసు.- ఉండక ఏం చెయ్యగలను బాబయ్యా!

ప్రొ:- తిరగబడు.

కాసు·- ఎవరిమీద!

పిచ్చి·- దేవుడిమీద.

కాసు:- దేవుడేనాడో సచ్చిపోనాడు తల్లీ !

ప్రొ:- చచ్చిపోలేదు పూర్తిగా ... చంపే ప్రయత్నంలో ఉన్నారు చంపే స్తారు కూడా బహుశా. ఒరే! అబ్బి, అధికారంరా, డబ్బురా! అర్థం కాని అధికారం, అర్హతకు మించిన ఐశ్వర్యం అల్పుడికి సంక్రమిస్తే పర్యవసాన మింతేరా. నువ్వు కళ్లు తెరు నిన్ను నువ్వు తిరగేసుకో, కోసుకో, నీ రక్తం చూచుకో. నీ కళ్ళు తెరవబడతాయి. అదే ఆత్మ జీవం. అదే ఆధ్యాత్మిక చింతన, దాన్ని వాళ్ళు ఏవేవో వాదాలంటారు.

అవన్నీ నీ కనవసరం. నీకు కావలసింది ఒక్కటే, అడగటం నేర్చుకో, అడుగు, ఆకలేస్తు-దను, ఇవ్వరూ—మొండిగా ప్రవర్తించు. తప్పులేదు కావలసింది అడిగి అనుభవించు. లేనివాడి బ్రతుకూ ఒక బ్రతుకేనా?

పిచ్చి:- కాదు. కాదు. ముమ్మాటికి కాదు. వాడిది పిచ్చి బ్రతుకు ప్రొఫెసర్!- అబ్బాయ్, నువ్వేలాగూ పిచ్చివాడవై పోయావనుకో. ఈ పిచ్చినంతా ఈ అమాయక లోకానికి రుద్దుతావా? (కాసులుతో) ఒరే అబ్బీ! ఇతను పిచ్చివాడురా ఇతని మాట వినకు, నోటి దగ్గర కూడు పడిపోతుంది.

కాసు:- అమ్మా! మీరింక లోపలకు వచ్చేయండమ్మా, ఇల్లు చూస్తే లాభం లేదు (ప్రొఫెసర్‌తో) మీరు యోగులా బాబూ ?

ప్రొ:- మీసాలూ, పెరిగిన గడ్డాలూ, యోగులకు చిహ్నాలంటోయ్?

పిచ్చి:- కాదు-కాదు, అతను సన్యాసి కాదు. దేశదిమ్మరి చిదంబరమంట.

కాసు:- చిదంబరం...చిదంబరమంటే...ఈ బల్లో మాష్టారు.

ప్రొ:- (చిరునవ్వు) నేనింకా జ్ఞాపక మున్నానటయ్యా?

కాసు:- ఎందుకు లేరు బాబయ్యా? మారాజులు తమకు పిచ్చెక్కిందనీ, మతి సెడిందనీ, ఆ పూజారి- అయ్యగోరూ ఊం ఒక్కటే దండోరా ఏసినారు బాబయ్యా, తమరు ఎల్లిపోనాక. కాని, నేను నమ్మలేదు బాబయ్యా తరువాత తమరు సచ్చిపోనారని యిన్నాను.

ప్రొ:- నిజమే ఇది పునర్జన్మ (నట్టూర్చి) నడు కాసులూ !

(ముగ్గురూ సత్రం రెండోవైపుకి నిష్క్రమిస్తారు. క్షణం సేపు స్టేజీ ఖాళీ. తదుపరి ఇద్దరు విద్యార్థులు ప్రవేశిస్తారు )

1వి:- ఏమిటోయ్. నాకే అర్థం కావటంలేదు. మనం ఇలా పాట్నా యూని వర్శిటీనుంచి వస్తున్నట్టు వ్రాసిన లేఖలుగాని వీళ్ళకు అందలేదా యేమిటి? స్టేషనుకు ఒకరూ రాలేదు.

2వి:- ఎందుకంటవోయ్? మనల్ని స్టేషన్లో ఎవరూ గుర్తించలేకన్నుకుంటాను,

1వి:- అవును. అదీ నిజమే కావచ్చు. ఆఁ ఆ కనిపించేది ధర్మసత్రం లాగుంది (సత్రం దగ్గరగావెళ్ళి) పూజారిగారూ! పూజారిగారూ!

2వి:- అదేమిటోయ్ పూజారిని పిలుస్తావ్? మన హోదాకు తగ్గట్టు పుణ్యస్థలి అధికారిని పిలవాలిగాని—

1వి:- ఓహ్! నీకు లౌక్యం తెలీదయ్యా! ఈ నాటి ప్రభువులంతా పర్సనల్ సెక్రటరీల నెందుకు పెట్టుకుంటున్నారు? వాళ్ళకు కాస్త కార్యభారం తగ్గేందుకేనా!— అందుకే నేను పూజారిని పిలుస్తున్నాను. పూజారిగారూ!

పూ:- (సత్రంలోంచి) అయ్యా, పిల్చారా!

2వి:- ఆఁ.

పూ:- తమరు యాత్రికులా!- గదులు ఖాళీగా లేవు.

2వి:- మేము వ్రాసిన లేఖ మీకందలేదూ?

1వి:- మేము పాట్నా యూనివర్సిటీ విద్యార్థులం. ఆంధ్ర శిల్పకళని పరిశీలించి, పరీక్షించి, థీసిస్ వ్రాసే నిమిత్తం ఇక్కడకు వస్తున్నామని లేఖ వ్రాశాం-

పూ:- (ఖంగారుగా) అయ్యయ్యో! తమరా? తమకోసం ధూమశకట విరామ ధామానికి తైలభక్షక శకటాన్ని పంపించామే! (సత్రంలోకి చూస్తూ) అయ్యా జగన్నాధస్వామిగారూ, రండిబాబూ రండి (మెల్లగా) కొంప మునిగింది.

అయ్య:- (వస్తూ) ఏమిటయ్యా శాస్త్రీ? వీళ్ళెవరు?

పూ:- వీళ్ళేనండీ పాట్నా విద్యార్థులు. మన పుణ్యస్థలిని చూచి, మన ప్రగతిని వీక్షించి, మన శిల్పాలను పరీక్షించి, మన మనతనూ, ఉత్కృష్టతనూ, ఔన్నత్యాన్ని, ప్రపంచానికి చాటమని మన మాహ్వానించిన మన పాశ్చాత్య అతిథులు.

అయ్య:- అయ్యో! తమరా! తమకోసం స్టేషనుకు కారు పంపించామే. వాళ్ళు మిమ్మల్ని కలుసుకోలేదా?

1వి:- లేదు - పోనివ్వండి. జరిగిందేదో జరిగిపోయింది.

పూ:- అబ్బే! అలా అంటే ఎలా! చాలా పొరపాటైంది. క్షమించాలి.

2వి:- ఫరవాలేదులెండి.

అయ్య:- తమరలా నిలబడే ఉన్నారు. కాసులూ?

పూ:- ఒరే కాసులూ! (చిరునవ్వుతో విద్యార్థుల నుద్దేశించి) మా ఆంధ్రలో నౌకర్లకూ, యజమాన్లకూ పేర్లు ఒకేలాగున ఉంటాయిలెండి.

అయ్య:- అందుకేనండి. ఇహనుంచి నౌకర్లకూ, అధికార్లకూ భేదం తెంపేందుకు రెండురకాల పేర్ల జాబితా తయారుచేస్తున్నాం. మా పుణ్యస్థలిలోని నౌకర్లంతా ఆ జాబితాలోని నౌకరుపేర్లే ఉపయోగించాలి.

పూ:- ఉదాహరణకు నౌకర్లపేర్ల జాబితాలోని రావన్న, సోమన్న ఎంకన్న పుల్లయ్య, నూకయ్య, పిచ్చయ్య, ఎల్లయ్య, సోవులు, రావులు, గంగులు, తలుపులు, లంగాలు వగైరా, వగైరా అనుకోండి. ఆ పేర్లు చప్పినట్లు నౌకర్లే పెట్టుకోవాలి.

అయ్య:- అధికార్లకు మాత్రం వారి వారి హోదానుబట్టి ఏ బిరుదో ఒకటి ముందు తగిలించి తదుపరి వారి హోదాను తెలియపరుస్తాం.

పూ:- ఎలాగంటే— ఒక అధికారి ఉన్నారనకోండి. అతని పేరు ఏ పాపేస్వరమో, స్వార్థేశ్వరమో అనుకోండి. అతని పేరు ముందర ఏ "పు స్థ. రత్న" బిరుదో ఏ "పు.స్థ. వజ్ర" బిరుదో తగిలించి మొత్తమంతా "పు స్థ.రత్న పాపేశ్వర కొత్వాల్" అని వ్యవహరిస్తాం. "పు స్థ." అనే సంగ్రహానికి పుణ్యస్థలి అని విపులార్థం.

1వి: [చిరునవ్వు] కానీ అలా భేదం చెయ్యకుండా ఉంటేనే మంచిదేమో?

2వి: ఎందుకండీ. ఈ మీ పుణ్యస్థానం శ్రేయోప్రదేశమనీ, ఇక్కడ సర్వులకు సమానస్థాయి ఉందని ప్రతీతి. ఆ మంచిపేరు కాస్తా ఈ విభేదాలతో చెడిపోతుందేమో!

పూ - నిజం, నిజం — వారన్నదికూడా నిజమే సుమండీ!

అయ్యః:- ఆఁ తమరింకా అలా నిలబడి ఉన్నారే!— పూలదండలైనా కనీసం లేవే!

[అటూ, ఇటూ చూసి, చేరువలో పూలదండల్లాంటివి ఏవీ కన్పించక పోగా మెడలోని కండువాతీసి ఒక విద్యార్థికి వేస్తాడు. అదిచూసి పూజారి తన గావంచా తీసి మరో విద్యార్థికి వేస్తాడు ]

పూ-: మా ఆంధ్రుల ఆచారాలు మీకు వింతగా ఉండొచ్చు—మాపుణ్యస్థలిలో మాత్రం మేం మా కుటీర పరిశ్రమలకు విలువ నిస్తాం. కాబట్టే తమ కంఠాన్ని చేనేత వస్త్రం హారంతో అలంకరింప జేసాం.

1వి:- మీ కుటుంబ పరిశ్రమలంటే మీకింత అభిమానమా ?

అయ్యః:- అవునండీ !

పూ:- అవునండి—చచ్చేంత అభిమానం.

2వి:- కాని ఈమధ్య మీరేదో మా ముంఫేర్‌లో పాతరేకులకని చాలా డబ్బు పాడుచేశారని విన్నాం.

అయ్యః:- అబ్బే! అది...పూర్వం ఉన్న పూజారి దురాశాపరుడై అలాంటి స్వార్థపు పనులు చేశాడు. (మాట మారుస్తూ) ఆ మాటకేంలెండి. తమరు కూర్చోండి (పూజారితో) వాళ్ళ కాపరాలు చూపించవయ్యా!

పూ:- ఉరే కాసులూ! ఎక్కడ తగలడ్డావురా ?

కాసు:- (వచ్చి) అయ్యా!

పూ.- ఇంతవరకూ ఎక్కడ తగలడ్డావయ్యా? ''నౌకరు కాసులూ ?''

కాసు-: ఎక్కడ తగలడతారు బాబయ్యా? వల్ల......

పూ:- చాల్చాల్లే! వెళ్ళి రెండు కుర్చీలు పట్రా! [కాసులు నిష్క్రమించును ]

అయ్యః:- తమ రాకవల్ల పుణ్యస్థలికి నిజంగా సందుదనం వచ్చింది.

2వి:- అబ్బే మాదేముందండి. మీ పుణ్యస్థలిని పొగిడేందుకు ఆ ఆదిశేషు డైనా పనికిరాడు.

1వి:- ఆ శిలాఫలకాలూ, ఆ ఆలయ ప్రాంగణాలూ, ఆ నియమాలూ, ఏమని వర్ణించడం—

పూ:- మీరేదో అతిగా వర్ణించేస్తున్నారుగాని అందులో మాదేముందండీ (కాసులు కుర్చీలు తెచ్చాడు) అవి అలా వెయ్ (కుర్చీలు వేసి నిలబడతాడు కాసులు.)

1వి:- అహఁ అలా అనకండి. పారిశ్రామికంగా మీ ఆంధ్ర చాలా వెనకబడి ఉన్నా, నైతిక విలువల్లో మటుకు మా బీహారుకంటే మీరే గొప్ప వారు. పొగడ్తలు కాదు, మనసులో మాట.

2వి:- ఈ దశాబ్దంలోనూ, మీరు సాధించిన ఘనకార్యాలు. పారిశ్రామికంగా ముందంజ వేసిన మేంకూడా సాధించలేకపోయాం. మీ రెండేళ్ళ తేలిక ప్రణాళికలూ—

1వి:- మూడున్నరేళ్ళ బరువు ప్రణాళికలూ—

2వి:- మీ పుణ్యస్థలి ప్రగతికి వేసిన సోపానాలు, మా ప్రణాళికలుకూడా వెయ్యలేకపోయాయి.

అయ్య:- ఏదో తమలాంటి విద్యాధికులూ, ప్రగతిశీలురూ, అభ్యుదయ వాదులూ, మాలాంటి చిన్నవాళ్ళకు చేదోడు వాదోడుగా ఉండాలి గాని—

1,2వి:- అబ్బే! అదెంతమాట?

పూ:- ఒరే కాసులూ, అలా బెల్లంకొట్టిన రాయిలా నిలబడతావేంరా? మన వాళ్ళకు కాస్తంత పాడియాలూ, పలహారాలూ పట్రా.

కాసు:- (వెళ్ళబోతూ రక్కున ఆగి) అయ్యా! దేశవాళీ సరుకు పట్రమ్మంటారా?

1:- అదేం, విదేశులెవరైనా వస్తే మీ ప్రదేశం సరుకు నివ్వరా?

కాసు:- మా తెలుగోళ్ది అదో నాసిరకం బుద్దిలెండి బాబయ్యా. మా చేతి పనులగాని, మా యింట తయారీగాని మీకు నచ్చవని, గోంగూర నుండి గోదువులు వరకూ-అంతెందుకు, వంటోళ్ళనికూడా నెంకు రెండువేలిచ్చి మీ ప్రాంతాల్నిచే తప్పించుకొంటాం.

2వి:- మాకు మీ ఆంధ్రదేశమంటేనే యిష్టం. దేశవాళీ సరుకే తీసుకురా, (కాసులు నిష్క్రమణ, అయ్యవారు పూజారిని ఎర్రగా చూస్తాడు. విద్యార్థులు కూర్చుంటారు.)

అయ్య:- ఆఁ మీరీ రెండువారాలూ మా పుణ్యస్థలినంతా ఆమూలాగ్రం పరీక్షగా చూడాలి.

పూ:- ఈ పదేళ్ళలోనూ, మా పుణ్యస్థలిలో వచ్చిన మార్పులూ, కూర్పులూ తమరు సూక్ష్మంగా పరిశీలించాలి.

అయ్య:- అందుకోసం మీ పర్యటన వివరాలుకూడా ముందే పథకం వేసి ఉంచాం (జేబులోంచి కాగితంతీసి చదువుతూ) ఆఁ మొట్టమొదట మీరు మా పుణ్యస్థలి పరిపాలకవర్గం సభ్యులతోనూ—

పూ:- అధికార, అనధికార వర్గాలవారితోనూ—

అయ్య:- పరిచయం చేయబడతారు.

పూ:- తదుపరి తేనేటి విందు.

అయ్య:- రెండు— మీరు చిన్న ఉపన్యాసమిస్తారు.

పూ:- తరువాత ఫలహారాల విందు.

అయ్య:- మూడు— అంతా కలిసి మా సాంప్రదాయసిద్ధమైన కూచిపూడి నాట్యాలను వీక్షిస్తారు.

పూ:- ఆ వెనక అల్పాహార విందు.

అయ్య:- నాలుగు— మీ నాట్యాల సాంప్రదాయాలమీద, మా ఉపన్యాసాలూ.

పూ:- తదుపరి ఉపాహార విందు.

అయ్య:- ఆఁ మర్నాడు—మా పుణ్యస్థలి ఆవరణలో మేం శ్రమదానంతో కట్టుకున్న క్రొత్త కాలేజీ, శిక్షణాలయం, మీకు చూపించబడతాయి. ఈ కళాశాల విధాన మంతటమీద మా పుణ్యస్థలి కమిటీ అధికారమే. కనక—

పూ:- ఆ విధానాలమీద తమ అమూల్యాభిప్రాయాన్ని వెలిబుచ్చాక, మా పుణ్యస్థలి ఆవరణలో మేం స్వయం కృషి మీద పండించిన పండ్లరసముల విందు.

అయ్య:- తదుపరి మా పుణ్యస్థలి నడుపుతున్న సూక్ష్మస్టీల్ కార్ఖానా మీరు వీక్షిస్తారు. అందులో—

పూ.- అందులో కమ్మరి కుమ్మరి పనుల దగ్గరనుండి, బట్టలు, బుట్టలు నేత వరకూ పరిశోధనలు జరుపుతారు.

అయ్య:- ఆ లఘుపరిశ్రమల మీద తమరు చిన్న ఉపన్యాసమిచ్చాక—

పూ:- ఆరుబయట విందు.

అయ్య:- తదుపరి మా పూర్వీకులు ఎప్పుడో శతాబ్దాలక్రితం కట్టించిన ఈ శిల్పాలను పరిశీలించిన—

పూ:- తక్షణం చల్లని పానీయముల విందు.

అయ్య:- ఈ మా పుణ్యస్థలి ప్రక్కనుండే ''ప్రభావతి'' అనే పిచ్చేరు ప్రవహిస్తుంది.

పూ:- అది సాలీనా రెండుమూడు సార్లు సరదాగా ప్రళయ నృత్యం చేసి, ఏటా ఒక్క ఇరవైకోట్ల రూపాయల్ని, ఒక్క రెండు మూడు వందల మంది ప్రజల్ని మాత్రం పొట్టన బెట్టుకుంటుంది.

అయ్య:- ఆ బీభత్సాన్ని అరికట్టే నిమిత్తం సదరు పిచ్చేరు మీద మేం కట్టిన కట్టడం—

పూ:- అది ఈమధ్య వచ్చిన వరదకు కొట్టుకుపోయిందిలెండి.

అయ్య:- నువ్వుండవయ్యా శాస్త్రీ! ఆ ఆ కట్టడం, కొయ్యవంతెన పరిశీలించాక కొబ్బరిబొండాల-

పూ:- విందు.

(అయ్యవారు పూజారిని ఎగాదిగా చూస్తాడు. అంతలో కాసులు రెండు గ్లాసులు పానీయాతో వస్తాడు. అయ్యవారు వాటిని విద్యార్థులకందిస్తాడు.)

1వి:- (తాగుతూ) అమృత మంటే నమ్మండి.

2వి:- ఇది ''బీరా''! అండీ?

కాసు:- కాదు బాబయ్యా! మంచినీళ్ళు

(అయ్యవారూ, పూజారీ కోపంగా చూస్తారు.)

1వి:- మీ రాష్ట్రంలో మంచినీళ్ళు కూడా ఎంత అమృతప్రాయంగా వుంటాయి.

పూ:- అందుకే మా ప్రజలందరూ యథేచ్ఛగా త్రాగేందుకు రామపాద సాగారాన్ని మూలకునెట్టి, గోదావరి నలుగురికి అందుబాటులో వుండేటట్టు యీ దేశం మీద వదిలేశాం.

(సత్రం వెలుపల్నించి ప్రొఫెసర్ ప్రవేశిస్తాడు. కంగారులో కాసులు నిష్క్రమించాడు )

ప్రొ:- అయ్యా, నాకూ్కడా పానీయమిస్తారా? దాహంగా ఉంది.

పూ:- (ఆశ్చర్యంగా చూస్తూ) ఎవరయ్యా నువ్వు?

ప్రొ:- కాందిశీకుణ్ణి.

అయ్య:- ఎక్కడినుండి వచ్చావ్?

ప్రొ:- ఎక్కడినుండి వస్తాను ? కాందిశీకుల పుట్టినిల్లయిన ఈ పుణ్యస్థలి నుండే వచ్చాను.

అయ్య- అయితే ఇక్కడి కెందుకొచ్చావ్?

ప్రొ:- ఆకలేస్తోంది.

పూ:- ఏడ్చినట్టుంది. గతిలేనివాళ్ళందరకు ఇదొక సంతర్పణ కేంద్ర మనుకున్నావా?

ప్రొ:- ఎలా అనుకుంటాను బాబూ? ఇక్కడ దాహానికి ప్రజారక్తాన్ని అతి చవగ్గా ఇస్తారనీ, అన్నార్తులకు నరమాంసం ఉచితంగా సంతర్పణ చేస్తారనీ——

పూ - ''విని'' వచ్చావా ?

ప్రొ:- కాదయ్యా, అనుభవంమీద తెల్సుకుని వచ్చాను.

2వి:- ఎవరండీ వీరు?

1వి:- కనిపించటంలేదూ? పిచ్చివాడై యుంటాడు.

ప్రొ:- చూశారా? అనుమానం మీకూ ఎంతలో కలిగిందో. అనుమానించండి. అనుమానం విద్యార్జనకు మొదటి మెట్టు... అన్నట్టు తమ పరిచయం—

2వి:- విద్యార్థులం.

ప్రొ:- పాశ్చాత్యులా ?

1వి:- కాదు. బీహారీలం.

ప్రొ:- అదేనయ్యా— ఇతర రాష్ట్రీయులంతా మా రాష్ట్రీయులకు పాశ్చాత్యులే అవుతారు. ఇక్కడి కెందుకు వచ్చారు? మీరు—

పూ:- అవన్నీ నీ కనవసరం.

ప్రొ:- మీరు చెప్పకపోతే నాకు తెలిదా? అంత దూరంనుండి శ్రమపడి ఈ వందల మైళ్ళు ఎందుకు వస్తారు? మా పుణ్యస్థలిని సందర్శించేందుకు, సందర్శించినదాన్ని అతిశయోక్తులతో చరిత్రలోకి ఎక్కించేందుకు, అందుకేనా ? అయ్యా ! మీరీ పుణ్యస్థలిలో ఏమిటి చూశారు ?

2 వి:- ఇప్పుడే మేం వచ్చాం.

ప్రొ:- ఎప్పుడొచ్చినా ఫరవాలేదు. మీరు మా పుణ్యస్థలిని పరీక్షించదల్చుకుంటే— అధికార హోదాలో పరిశీలించకండి నాతో రండి చూపిస్తాను. ఊఁ రండి.

అయ్య:- వెళ్ళకండి. అతను పిచ్చివాడు

ప్రొ:- విన్నారా— ఆ పెద్దమనిషి మాట ? పిచ్చివాని అభిప్రాయాలన్నీ పిచ్చిగానే ఉంటాయట. మరి వారిలాంటి స్వార్థంగానే ఉంటాయిగా?,

అయ్య:- శాస్త్రీ !

పూ:- అయ్యా! (ప్రొఫెసర్‌తో) ఏమయ్యా శాస్త్రి చిన్నా పెద్దా, మంచీ మర్యాదా అవసరం లేదటయ్యా ? నోటికి వచ్చినట్లల్లా మాటాడేసెయ్యడమే?

ప్రొ:- నేను పిచ్చివాణ్ణి శాస్త్రిగారూ! నాకు మంచీ— మర్యాద ఏమిటి?

[విద్యార్థుల చేతులు పట్టుకొని లేపి] రండి బ్రదర్స్! ఆ కనిపించే దేవాలయం చూడండి. అదే పుణ్యస్థలి. అదే మా జీవితకేంద్రం. అదే మిమ్మల్నీ, మిగతా లోకాన్నీ, తన సౌందర్యంతో, ఘనతతో, శిల్పాలతో ఆకర్షిస్తోంది.

ప్రొ:- దాన్ని ద్దం పెట్టుకుని — చూడండి — (అయ్యవారినీ, పూజారినీ చూపిస్తూ) ఎందరు స్వార్థపరులు బ్రతుకున్నారో మీకు తెలీదు — దాని మహత్వమనే ఎర చూపించి, దాని శిల్పమనే ఇతిహాసాన్ని వినిపించి, దాని ప్రభావమనే భయాన్ని కల్పించి, కొందరు కసాయి వాళ్లు, వందలూ — వేల అమాయక ప్రాణుల కుత్తుకలు కోసి కొరతలు వేస్తున్నారు. అర్థమైందా? ఏమిటి? - మీకర్థంకాదు. ఆ దేవాలయాల పునాదుల క్రింద ఎందరు సజీవంగా సమాధి చెయ్య బడ్డారో! — మీరు గ్రహించలేరు. ఆ రాళ్ళను ఎన్ని వేల — లక్షల మానవుల రక్తాలతో సిమెంట్ చేసి నిలబెట్టారో మీ రూహించలేరు. ఆ శిల్పాల లోపల ఎందరు జీవుల అస్థిపంజరాలనూ, ఆక్రందనలనూ బంధించి వాటిమీద శిలాఫలకాలను అతికించారో —

పూ:- ఏయ్ — పిచ్చి మనిషీ! నీ కేమన్నా బుద్ధి ఉందటయ్యా?

ప్రొ:- పిచ్చివాడికి బుద్ధెక్కడుంటుందండీ పూజారిగారూ? బహుశ మీకు కంట్రాక్టర్ల చేతినుండి వేలూ, లక్షలూ కొట్టేసినప్పుడుండే తెలివీ, మెలుకువా మనుష్యుల్ని గుర్తించేటప్పుడు ఉండవనుకుంటాను.

అయ్య:- కాసులూ! [కాసులు ప్రవేశం] ఆ వెధవను బయటకు గెంటెయ్యరా! (కాసులు కదలడు. కంగారుగా ప్రొఫెసర్ని చూస్తాడు.)

ప్రొ:- (నవ్వి) నన్ను శ్రీమాన్ జగన్నాథస్వామినాయుడు గారైన సాక్షాత్ తమరే ఒకానొకప్పుడు నాశనం చెయ్యలేకపోయారే — ఇహ నెలకు 25 రూపాయల జీతగాడు వాడేం చెయ్యగలడు?

పూ:- ఎవరు నువ్వు?

ప్రొ:- గుర్తుపట్టలేదూ? నా కళ్ళలోకి చూడండి. నా మండిపోతున్న గుండె నడగండి. నా జ్వలించిపోతున్న నా హృదయాన్ని ప్రశ్నించండి.

మీ అన్యాయాలకు గురై నోరెత్త లేక నలిగి నశించిన అభాగ్యుల సమాధుల నడగండి—సమాధానం చెప్తారు.

కాసు:- వారు మన చిదంబరంగారు బాబయ్యా!

[నిష్క్రమణ]

1వి:- ఆఁ ప్రొఫెసర్ చిదంబరంగారా!

2వి:- పుణ్యస్థలి కాలేజీ ప్రిన్సిపాల్.

ప్రొ:- ఆఁ ఆఁ Proffessor and Ex. Principal చిదంబరం ఈ పిచ్చివాడే—ఈ వెర్రివాడే—(పూజారి, అయ్యవారితో) అవును—కదూ? మరబారా? అనాడు మీ కాలేజి ప్రిన్సిపాల్‌ని చేస్తామని నా ఉద్యోగానికి రాజీనామా ఇప్పించి (పూజారి బయటకు జారుకుంటాడు) నా స్వశక్తితో, నా తెలివితేటల్తో ఆ కాలేజీని పైకి తీసుకువచ్చిన తరువాత, నీ మేనల్లుడు, తదుపరి — అల్లుడైన, ఏపీఁలోకజ్ఞానం తెలీని ఆ కుర్రాడికి ఆ పదవిచ్చి, నే నడిగితే— నీ పదవి నీకిచ్చిన అధికారంతో, హోదాతో వచ్చిన పలుకుబడితో నన్ను అధః పాతాళానికి అణగద్రొక్కి సర్వనాశనం చెయ్యబోయావే ఆ చిదంబరమే—ఆ ప్రొఫెసర్ చిదంబరం, M. A. D. Litt వాడే ఈ పిచ్చివాడు.

2వి:- తమరు చనిపోయారని విన్నాం.

1వి:- తమకు మతి చలించనట్లు పత్రికలు వ్రాసాయి.
(అయ్యగారు మెల్లగా సత్రంలోకి జారుకుంటాడు,)

ప్రొ:- అవును ఇంకా వ్రాస్తాయి, స్వకీయ విలేఖరి ఎలా లిఖిస్తే అలా ప్రచురిస్తాయి, పత్రికలు. పాపం వాటికేం, తెలుసు.

2వి:- ఇన్నాళ్ళూ మీరెక్కడున్నారు?

ప్రొ:- దేశ పర్యటన—బ్రదర్స్! దేశమంతా తిరగండి. అధికార హోదాతో కాదు, సామాన్య మానవుడిలా. సాధ్యమైతే నాలా— పిచ్చివాడి వేషంలో తేనీటి విందులూ, అల్పాహార, ఉపాహారాలూ, ఇవేవీ వద్దు.

పార్టీలూ, ఉపన్యాసాలూ, ఇంటర్వ్యూలూ — అలాంటివి వద్దు. కుళ్ళు కాల్వల ప్రక్క నిద్రపొండి—ఒక్క రాత్రి— రావి చెట్టుక్రింద దుంపలమ్ముకొనే చావలేక - బ్రతకలేక సతమతమయ్యే ముసలిదాని అడుగుజారిన కుండలో నీళ్ళు త్రాగండి. రోడ్డు ప్రక్క ఈగల్తో—దోమల్తో యుద్ధంచేసే కుష్ఠురోగి గోనె సంచుల్లో నివసించండి— ఒక్కగంట! అప్పుడు మీ కర్థమవుతుంది - ఈ పుణ్యస్థలిలో సామాన్యుని జీవితమెట్టిదో? పల్లకి నెక్కే ప్రభువుల ముఖంలో ఏముందయ్యా—అది మోసిన బోయీల భుజస్కంధాల్ని తడివి చూడండి.

1వి:- ఈ విషయాలేం మాకు తెలీవు.

ప్రౌ:- తెలీకకాదు — తెలుసుకొనే తాపత్రయం లేక. Gentlemen— Self reali station—నిన్ను నువ్వు తిరగేసుకో, నువ్వు వ్రాసిన వ్రాతలు తిరిగి చదువుకో, నువ్విచ్చిన ఉపన్యాసాలు జ్ఞప్తికి తెచ్చుకో- ప్రపంచం ముందుకు పోతుంది లోకం మారుతోంది. దాని ప్రగతిని గుర్తించు. దాని క్రాంతిని చూడు. ఈ స్వార్థాలూ, స్వాభిమానాలూ, ఈ సంకుచిత భావాలూ, ఈ స్వోత్కర్షలూ, ఈ బంధుమిత్ర వర్గ పక్షపాతం నీ ఒక్కడి వక్రబుద్ధికే సంబంధించినవైతే దానికి కోటి కోట్ల కంఠాలు తెగిపోతవే!

పిచ్చిది:- [సత్రం పెరట్నుంచి ప్రవేశించి] "నిజంగానే నిఖిలలోకం నిండు హర్షం వహిస్తుందా? మనవాళికి నిజంగానే మంచికాలం వహిస్తుందా?" మానవాళికి నిజంగానే మంచికాలం వహిస్తుందా?" ఎవరు వీళ్ళు... మీరూ పిచ్చివాళ్ళేనా?

ప్రౌ:- కాదమ్మా! యాత్రికులు- మన ప్రగతినీ, గతినీ వీక్షించడానికి వచ్చిన మన "పాశ్చాత్య" విద్యార్థులు.

పిచ్చిది. వీక్షించారా? ఏ(మ)ంటారు?

ప్రౌ - అనుభవరహితులు — వాళ్ళకేం తెలుస్తుంది? దూరం నుంచి చూస్తున్నారు. కనిపించే ప్రతి వెలుగునీ మనం సాధించిన ప్రగతే

అనుకుంటున్నారు కాని, ఆ రశ్మి సామాన్య ప్రజ కెంత ఉపయోగ కరంగా ఉంటుందని యోచించటం లేదు.

పిచ్చిది: అవును. ఎలా యోచిస్తారు? విందులు—విందులపై విందులు ఆరగించేసరికి ఉక్కిరిబిక్కిరై పోతున్నారుగాని—దుష్టులార—భ్రష్టులార—బాధాసర్ప దష్టులారా—ఏడవం డేడవకండి. మీకోసం వాళ్ళు వచ్చి, మీ బ్రతుకులు వాళ్ళు చూసి, మీ దేశం విందు లారగించి మీకోసం, మీకోసం, మీకోసం-అరుగో అరు గరుగో నాయకుల్, వినాయకుల్—జగన్నాథ, జగన్నాథ రథచక్రాల్ వలె వస్తున్నారు. వాటికింద మీరు నలిగి, మీ రక్తం చిందించి, హరోం హర హర యని చావండి.

[బయటకు పోతుంది]

1వి:- ఎరావిడ ప్రొఫెసర్?

ప్రొ:- కనుపించటంలేదూ! పిచ్చిది — ఒకరి స్వార్థం...పర్యవసానం మరొకరి సర్వనాశనం.

2వి:- ఆమె పిచ్చిమనిషిలా కనిపించటంలేదు.

ప్రొ:- పిచ్చివాడా! మా పుణ్యస్థలిలో ఒక సామాన్య మానవుని జీవితం ఎంత సున్నితమైందో తెలుసా? ఉద్యోగం ఉన్నంతకాలం వాడికి ప్రాణం ఉంటుంది. అది పోయిన వెంటనే వాడు చస్తాడు. చావాలి లేదా వాడిమీదికి ఒక క్షయ, ఒక పక్షవాతం, ఒక ఉబ్బసం ఉరుక్కుపడతాయి. అతను పోయాడు. ఆమెను ఈ అధికారు లెవరు ఆదరించలేదు. ఈమె పిచ్చిదైంది. కాని వ్యభిచారి మాత్రం కాలేదు సుమా! అలాగే ఊరిమీద హాహాకారాలు చేసుకుంటూ తిరుగుతుంది. కాని—ఈ ప్రజ, ఈ సమాజం, ఈ దేశం ఈమెకు చేయూత నివ్వలేదు.

2వి:- మా కీ విషయాలేవీ తెలీవు. క్షమించండి ప్రొఫెసర్!

ప్రొ:- కాని, మీ దేశస్తుల్లోమటుకు ఈ మా పుణ్యస్థలిని గురించి నీచంగా ప్రచారం చెయ్యకండేం.

1వి:- అబ్బే! ఎంతమాట!

2వి:- వెళ్ళొస్తాం.

కాసు:- (సత్రం పెరట్నుంచి ప్రవేశించి) కాస్తంత మంచితీర్థం పుచ్చుకుంటారా బాబయ్యా!

1వి:- అవసరం లేదోయ్, ఇప్పుడే త్రాగాం.

ప్రొ:- అవి మంచినీళ్ళు కావు మద్యపానం. అందుకే మీ కవి అంత రుచిని పించాయి.

[తమకా రహస్యం తెలుసన్నట్టు చిరునవ్వుతో నిష్క్రమణ.]

ప్రొ:- (నిట్టూర్చి) కాసులూ! చూశావా—విద్యార్థులై ఇక్కడకు వచ్చిన వాళ్ళ కళ్ళకు కాటుకరాసి ఎలా మభ్యపరుస్తున్నారో.

కాసు.- అంతే బాబయ్యా? ఊల్లంతా గాదిలో పందికొక్కుల్లాగ తెగ తిన మరిగి ఇన్నూ మన్నూ కానకుండా ఒండకావరం ఎక్కి నడుస్తు న్నారు. ఆ పూజారి పంతుల్ని సూడండి బాబయ్యా! బామ్మల్లో సెనబుట్టాడు దేవాలయంలో ఏవో కొత్త దేవిడీలు కడతారని ఇందాక చెప్పినాను గందా! దాని కసఖు రెండు లచ్చలకంటే ఎక్కువ అవ్వవట, ఆల్లు మాటాడుకుంటుంటే యిన్నాను. జగన్నాథస్వామి నాయుడుగారికి సొంతానికి కొండడిగువన ఇంత బంగాళాకూడా కావాలట దానికయే కరుసుకూడా ఇందులోనే పులివేసి కొంత నాథం ఏసుకుని అయిదు లచ్చలు కంట్రోక్టరీ యిచ్చినారు బాబయ్యా!

ప్రొ:- అంతే కాసులూ అంతే! చుక్కానిలేని నావలాగా, నాయకుడులేని వర్గంలాగ, భగవంతుడులేని స్వర్గంలాగ, ప్రాణికోటి నిస్సత్తువగా, నిర్వీర్యంగా, ఎక్కడికో, ఎందుకో, ఎలానో పోతోంది. వెనక్కి దారిలేదు కాబట్టి ముందుకు పోతుంది ప్రజాసమూహం గొర్రెల మందలా, ఆకలెస్తుంది...అరవలేదు. దాహమేస్తుంది — కంఠం పూడుకుపోయుంది. మూగితనం, ఊంగితనం అలవాటై తను తన తరాలుకూడా అన్యాయాన్ని ఎదిరించే శక్తిని కోల్పోయేడు మాన వుడు. ఏమిటో ఈ మానిసి. ఎప్పుడో వీడికి ముక్తి.

(ఇద్దరూ సత్రం పెరటి వైపుకి పోతారు. క్షణం తరువాత దొంగలా ప్రవేశిస్తాడు పూజారి.)

పూ:- పోయారూ! హమ్మయ్య... అరే, మా అతిథులు కూడా పోయారే! అయ్యో! చిదంబరమా! పిచ్చెక్కినవాడివి పిచ్చెక్కినట్టుండక మాకూ, మా అతిథులకూ నీ పిచ్చెక్కించి వదలిపెట్టావే! (సత్రంలోకిచూస్తూ) అయ్యా జగన్నాథస్వామిగారూ! ఇంకా లోపలే ఉన్నారా? రండి, కొంప అంటుకు పోతున్నాయి.

అయ్య:- (సత్రంలోంచి వస్తూ) ఏం? ఏం? పోయారా?

పూ:- పోయారు బాబూ పోయారు. ఆ పిచ్చిది కూడా పోయింది, సరాసరి పోలీస్‌స్టేషన్‌కి.

అయ్య:- ఆఁ.

పూ:- అవును బాబయ్యా! అది పిచ్చిదికాదు. మన బ్రతుకుల గుట్టు మట్టులన్నీ దాని చేతులో ఉన్నయ్. దానికి మన కాంట్రాక్టు తతంగం గురించి పూర్తిగా తెలుసు.

అయ్య:- అది పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళటం నువ్వు చూశావా?

పూ:- చూశాను బాబూ చూశాను—సాక్షాత్తు ఈ నా రెండు పాపిష్టి కళ్ళతోనే చూశాను అయ్యా—మీ మాట విని మీకోసం నేను చెయ్యరాని పనులన్నీ చేశాను. మోసాలు, లంచాలు, దోపిడీలు, కుతంత్రాలు, పాపాలు- ఒకటేమిటి లక్షలు చేశాను. ఇప్పుడవన్నీ బయటపెడితే మనకు దేహశుద్ధి కాదు-

అయ్య:- సర్లేవయ్యా! ఎక్కడ దొరికావో గాని పిరికి బ్రాహ్మడవ్.

పూ:- అదేవిఁటండీ! అంత ఇదిగా తీసి పారేస్తారు—నేను పిరికివాణ్ణా! పుణ్యస్థలి ఎన్నికల్లో తమరిని ఎన్నుకోమని రాత్రనక పగలనక ప్రజల్లో ప్రచారంచేసి పిలులేనిచోట ఓటుకో నోటిచ్చి, మిమ్మల్ని గెలిపించిన నేనా పిరికివాణ్ణి? మీరు పనిలోకి వచ్చాక మన ఆటలు సాగటం లేదని ఆ తులసమ్మ భర్త సోమేశ్వరాన్ని పనిలోంచి తొలగించే పథకాన్ని తయారుచేసిన నేనా పిరికివాణ్ణి? ఈ రహస్యం

ఎక్కడ బయటేస్తుందోనని ఆమె పిచ్చిదనీ, వెర్రిదని లోకం నమ్మేట్టు దండోరా వేయించిన నేనా పిచ్చివాణ్ణి? మీ మేనల్లుడూ, తత్రాపి అల్లుడయి కూర్చున్న ఏవీ లోకజ్ఞానం తెలీని ఆ కుర్రాణ్ణి, ఈ కాలేజీ ప్రిన్సిపాల్‌ని చేసేందుకు విద్యాధికుడు, నిగర్వి, నిజమైన వ్యక్తిత్వంగల ఈ ఓదంబరాన్ని పదభ్రష్టుణ్ణి చేసిన నేనా పిచ్చివాణ్ణి? ఈ నాలుగేళ్ళ హయాంలో మీ Bank Account అయిదు లక్షలకు పెరిగించిన నేనా పిరికివాణ్ణి? తమకు నోరెలా వచ్చింది నాయుడుగారూ!

అయ్యః:- ఊరుకోవయ్యా శాస్త్రీ! అవన్నీ తవ్వకు. నన్ను క్షమించు. ఏదో ఆవేశంలో అనేశా. నువ్వు చేసినవన్నీ నేను కాదన్నానా? నీ ఉపకారం మరువగలనా శాస్త్రీ? ఆ పిచ్చిది నిజంగానే పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళటం చూశావా?

పూ:- (తన బాధనుండి వెంటనే తేరుకోలేదు) చూశాను. ఈ నా రెండు పాపిష్టి కళ్ళతో చూశాను.

పిచ్చిది:- (బయట్నుంచి వస్తుంది) వట్టిది. ఈ పూజారి అన్నీ అబద్ధాలే ఆడతాడు. నేను పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళానా?

(పూజారీ, అయ్యవారూ మొహాలు చూసుకుంటారు.)

పూ:- ఇహ మనం దీన్నిలా వదిలేస్తే లాభం లేదు.

అయ్యః:- ఏం చెయ్యాలి?

పూ:- రండి (పిచ్చిదాన్ని సమీపించి) తులసమ్మా! నీకిదే చెబుతున్నాను, ఈ ప్రదేశాన్ని విడిచి పోతావా లేదా?

పిచ్చిది:- ఎక్కడికి? పోవాలా? ఎక్కడికిరా?

అయ్యః:- నీ యిష్టమైన చోటుకి—

పిచ్చిది:- నా కిష్టమైన చోటు యిదే, ఇదేరా. ఇది నా జన్మస్థలం. ఇక్కడే నా జీవితం గడిచింది. ఇక్కడే బంధువులూ, కుటుంబాలూ, సంతానాలూ ఉన్నయ్. వీళ్ళను విడిచి ఎక్కడికి పోవాలిరా? ఎందుకు పోవాలి?

పూ:- మేం నిన్ను బహిష్కరిస్తున్నాం.

అయ్య:- నీకు పిచ్చెక్కింది.

పూ:- నీవు ప్రజల్లో కల్లోలాన్ని కలిగిస్తున్నావ్. పిచ్చిని వాళ్ళ కంటిస్తున్నావ్.

అయ్య:- ఈచోట శాంతి భద్రతలకు భంగం కలిగిస్తున్నావ్.

పూ:- ప్రజలుకూడా నీలా పిచ్చెత్తిపోతే—

పిచ్చిది:- మంచిదేగా! మీరే ఈ పిచ్చి రాజ్యాన్ని ఎన్నికలు లేకుండా ఏలొచ్చు. నోరు మూసుకుని సిగ్గుపడండి.

అయ్య:- శాస్త్రీ!

పూ:- మామ్మా! నువ్వు పోతావా? పోవా?

పిచ్చిది:- పోను! పోను!- మువ్మాటికీ పోను (ఏడుపు) పోవాలా! ఎక్కడికి? ఎలా? నా పసుపుకుంకుమ ఏది? ఆనాడు సన్నాయి మేళాలతో సుమంగళిగా వచ్చి, ఈనాడు బోడి చేతుల్తో, తెంపేసిన మంగళ సూత్రంతో ఎలా వెళ్ళాలి? నా అయిదోతనం ఏది?

పూ:- అవన్నీ మాకేం తెలుసు?

పిచ్చిది:- తెలీదూ? మీరు కాదూ ఆయన్ని చంపింది? మీరు కాదూ ఆయన్ని చిత్రవధ చేసింది? మీరు కాదూ ఆయన్ని మీ హోదాలకూ, స్వార్థాలకూ బలియిచ్చి ఆ రక్తంతో మీ పదవుల్ని నిలబెట్టుకున్నది ?

అయ్య:- శాస్త్రీ!

పూ:- మామ్మా...

పిచ్చిది:- నేనో పిచ్చిదాన్నిరా! మామ్మను కాదు. నేను నడి వయస్సులోనే నీకు అమ్మమ్మనయ్యానురా? (ఏడుపు) నాకు దిక్కులేదు, నాకు త్రోవ తెలియదు. భగవాన్! నేను వచ్చేస్తా— నీ సన్నిధికి వస్తున్నా భగవాన్! నన్ను నీలో ఐక్యం చేసుకో. ఈ స్వార్థపు గడ్డమీద నే నెందుకు బ్రతికుండాలి ? నేను పోతానురా. చచ్చిపోతా. చచ్చేముందు మిమ్మల్ని చంపి మరీ చస్తాను—

పూ:- ఆఁ అయితే నువ్వన్నంత పనీ చేశావన్నమాట (అయ్యవారితో) అయ్యా! ఇది పోలీసులకు చెప్పేసింది. దీన్నిలా విడిచి పెడితే లాభంలేదు. రండి.

(పూజారి ఆమె చేతులు పట్టుకొని లాగుతాడు. ఆమె అరుస్తుంది. అయ్యవారు ఆమె నోరు మూస్తారు. ఆమెను సత్రంలోకి లాక్కు పోతూండగా ప్రొఫెసర్ వస్తాడు.)

ప్రొ:- వదలండి నీచులారా! (వాళ్ళమీదకు వెళతాడు.)

అయ్య:- సమయానికి వచ్చాడు. మనకు అడ్డం వచ్చేవాళ్ళ నందర్నీ నాశనం చేసేద్దాం.

(ప్రొఫెసర్ అయ్యవారి మీదకు వెడుతుండగా పూజారి అతన్ని అక్కడ పడివున్న కర్రతో నెత్తిన బాదుతాడు.)

పిచ్చిది:- బాబో! చంపేశార్రో! (అరుస్తుంది)

(పూజారి అదే ఆవేశంతో ఆమెనూ బాదుతాడు. ఇద్దరూ నేల కొరుగు తారు కాసులు ప్రవేశిస్తాడు.)

కాసు:- బాబయ్యా! అమ్మగోరూ! అమ్మ బాబో చంపేశారు.

ప్రొ:- (వణికే కంఠంతో) కా...సు...లూ!

కాసు:- బాబయ్యా, బాబయ్యా, ఏంటిది. బాబయ్యా ? ఇలాంటి సావు సావ డానికేనా, ఇక్కడి కొచ్చారు. బాబయ్యా! పున్యాత్ములు మీ కిలాంటి సావా?

పిచ్చిది:- భగవాన్...నా...మొర...విన్నావా? వచ్చే స్తున్నా...ఇదిగో... వ-చ్చే-స్తు...న్నా...(చచ్చిపోయింది.)

కాసు:- అమ్మా తులసమ్మగోరూ! (ఏడుస్తాడు)

ప్రొ:- పోయావా తల్లీ...(బలహీనంగా చేతులెత్తి నమస్కరిస్తాడు. కాసులు ఏడుపు విని) కాసులూ ... ఏడుస్తున్నావా?... పిచ్చివాడా!... నే నొక్కడ్నీ చచ్చిపోతే......సకల చరాచర......ప్రకృతీ...... స్తంభించిపోతుందనుకుంటున్నావా ... నన్నుపోనీ...నేనుపోవా...లి నాలాంటి ... లక్షలు...కోట్లు ... ప్రాణులు... రక్తంలో ... గిం

గిలా... కొట్టుకుంటూ... వీళ్ళ ... ఆత్మాశలకూ ... అహంకారాలకూ...స్వార్థాలకూ... స్వోత్కర్షలకూ...బలి కావాలి.........

కాసు:- బాబయ్యా!

ప్రొ:- వెళ్లు .. కాసులూ... ఏడవకు..., నీ జీవితాన్ని... వాళ్లు .. సర్వనాశనం చేస్తారు...

కాసు:- చెయ్యనియ్యండి బాబయ్యా! ఇలాంటి కసాయోల్ల దగ్గిర బతికేకంటే సావటం మేలు.

ప్రొ:- చావు, చావు, చావు...చస్తున్న... మేం... ఏం... సాధిస్తున్నాం? చచ్చి... సాధించగలిగే... దేముంది?... బ్రతుకు... కాసులూ... బ్రతుకు...శరవేగంగా...బ్రతుకు... అదుగో...అటుచూడు... ఆ చీకట్లని...దూసుకుంటూ...ఎలా...వచ్చేస్తున్నారో...

కాసు:- (సూన్యంవైపు చూస్తూ) ఏంటి బాబయ్యా!

ప్రొ:- కనిపించటం... లేదూ... అదిగో... మహా ప్రళయం... ఝంఝ తితో...భైరవ...నృత్యం...చేస్తూ...ఎలా... విజృంభిస్తుందో... ఆ... అంతరిక్షాల... దహన...జ్వాలా... ప్రచండత్వంలో...ఈ ద్రోహాలూ... దోషాలూ...... దుర్మార్గాలూ......దౌర్జన్యాలూ... దాస్యాలూ...దానవత్వాలూ...దారుణనృత్యాలూ...సమూలంగా... నాశనమై......స్వాతంత్ర్యం... సమభావం......సౌభ్రాత్రం... సౌహార్దం...పునాదులై ...ఇళ్లులేచి...జనావళికి...శుభం...పూచి. . శాంతి...శాంతి...శాంతి...శాంతి...జగాన్నంతా...నింపుతుంది .. జగాన్నంతా...హసింప జేస్తుంది...నా స్వప్నం ఫలిస్తుంది...నా ఆశలు ఫలిస్తాయి.

(మెడ వాలిపోతుంది. కాసులు ఏడుస్తూ సత్రంలోకి నిష్క్రమణ.)

తెర



## పాత్రలు

చిదంబరం
సీను
కాంపౌండర్
అబ్బాయి
చతుర్భుజం
కంట్రాక్టర్
పోయిన కుక్కపిల్ల

[పరిశుభ్రంగా అలంకరించబడిన ఒక గది, ఒక మూల టెలిఫోను వున్నది. గోడకు ఎదురుగా పటాలూ, కాలెండర్లూ వున్నై. కాలెండరుకు దిగువగా "కుక్క వున్నది జాగ్రత్త!" ("Beware of Dog") అనే బల్ల వ్రేలాడుతున్నది. తెర లేచేసరికి స్టేజిమీద మనుషులెవరూ లేరు. కాసేపటికి టెలిఫోన్ మ్రోగింది. ఇంట్లోంచి నౌకరు "సీను" అనే కుర్రాడు వచ్చాడు. వచ్చి ఫోనుతీసి-)

సీను:- ఎవరండీ ఆఁ... అయ్యా, లేరండి... అవునండి... అయ్యగారు లేరు... తెలీదండి... తెలీదండి ఏదీ తెలీదండి... (కాసేపు విని కుక్కపిల్లకు అన్నంపెట్టే ఒక గిన్నె ఒక మూలవుంటే వెళ్ళి దానికేసి దీనంగా చూస్తున్నాడు. ఫోను మళ్ళీ మ్రోగింది. వెళ్ళి తీసి) ఎవరండీ?... నేనేనండి... అయ్యా - - అయ్యగారూ తమరా— ఎక్కడనుంచీ మాట్లాడుతున్నారు? ఈ ప్రక్క నుంచే!... చిత్తం దొరకలేదండి... లేదండి తమరు రండీ. తమరు రావాలంటాను. మాటిమాటికీ తమరట్లా "దొరికిందా దొరికిందా" అంటే ఎట్లా?... ఐదునిముషాలు కిందటేగా అడిగారు— అవును అడిగారు లేదన్నాను అవునండీ లేదన్నాను... చిత్తం (విసిగిపోయినట్టు ఠపీమని పెట్టాడు. అటూ ఇటూ చూసి గదంతా సర్దుతున్నాడు. బయటనుంచి కాస్సేటిలో యింటి యజమాని చిదంబరం హడావుడిగా వచ్చాడు. 50 సంవత్సరాల ప్రాయం. సూటు వేసుకున్నాడు. వస్తూనే నెత్తి మీద టోపీ తీసి బల్లమీద విసిరాడు).

చిదం:- అబ్బబ్బబ్బ ... రామచంద్రా ... శ్రీరామచం ... (ఆగి గోడకు తగలించివున్న 'Beware of dog' బోర్డుకేసి చూసి) ఈ బోర్డు ఇక్కడ తగలించడంలో నీ ఉద్దేశం? (ఆగి, చూస్తూ) ఈ బోర్డు ఇక్కడ తగిలించడంలో ఏమిటి నీ ఉద్దేశమూ అనిఅడుగున్నాను— చెప్పు సమాధానం... చెప్పూ?

సీను:- ఉద్దేశం ఏముంటుందండీ?

చిదం:- ఈ బోర్డు 'ఇక్కడ' ఎందుకు తగించావురా వెర్రిపీనుగా?

సీను:- ఉండిపోయిందిగదా అని—

చిదం:- అంతేనా?

సీమ:- అంతేనండి?

చిదం:- అంతేగద... ఇంతకూ దాని అర్థం ఏమిటో నీకు తెలుసా? అదే-ఆ బోర్డుమీద వున్న ఇంగ్లీ అక్షరాలలోని గూఢార్థం? (సీను తెలియదని తల వూపబోగా) 'తెలీదని' తల వూపక్కర్లేదులే— నాకు తెలిసిందిలే నీకు తెలీదని! 'ఇక్కడో కుక్క వుంది... జాగర్త!' అని దాని అర్థం, అర్థం నీకు తెలీదు కాబట్టి ఆ బోర్డు ఇక్కడ కట్టినందుకు వూరుకుంటున్నాను. వెధవాయా 'ఇక్కడో కుక్క వుంది— జాగ్రత్త' అనే బోర్డు తెచ్చి ఈ గదిలో పెడితే మనిద్దరిలోనూ ఆ కుక్క ఎవరం అవి నీ అభిప్రాయండా?...మాట్లాడకు... మాట్లాడకుండా దాన్ని అక్కడ నుంచి తీసెయ్యి. అసలెందుకు తెచ్చి పెట్టావు దాన్నిక్కడ?

సీను:- అర్థం తెలీకనేనండి... తెలిస్తే లోపల మీ గదిలోనే వుంచేసే వాడిని కదండీ!

చిదం:- నా గదిలో వుంచే వాడివా— లేక గోడకు వ్రేలాడగట్టేవాడివా!

సీను:- రామ రామ! అర్థం తెలిసిన తర్వాత ఇప్పుడెందుకు చేస్తానండీ ఆ పని?

చిదం:- ఉంతకు పూర్వం ఐతే అదికూడా చేసేవాడివే నన్నమాట!

సీమ:- అనుకున్నానండి, మీ గదిలోనే పెట్టేస్తే జాగర్తగా వుంటుంది గదా అని—

చిదం:- ఏడిశావ్‌గాని—దాన్నితీసి బల్లక్రిందపెట్టు. పెద్దమనుషులెవరన్నా వస్తారు (సీను కియ్యటానికి పోబోతున్నాడు) ఆ బోర్డును అసలు అక్కడనుంచి ఎందుకు కదలించావ్?

సీను:- కుక్కపిల్ల లేదుకదా, దాని బోర్డుమాత్రం ఎందుకని?

చిదం:- అటువంటప్పుడు తెచ్చి పడెయ్యక గోడకు ఎందుకు తగిలించావ్?

సీమ:- పోనీ, ఏదో పటాలమాదిరి అదీ ఉంటుంది కదా అని—దానికి వేలాడ తియ్యటానికి తాడొకటి వుంది మరి—

చిదం.- సరే తీసేయ్ (సీమ తీసి బల్లమీద పెట్టాడు.) బోర్లించు (బోర్లించాడు) దానిమీద ఏదన్నా కప్పు (అటూ ఇటూ చూసి సీను కొత్త వార్తాపత్రిక తెచ్చి కప్పబోయాడు) ఉండుండు— అట్లా కప్పితేనే అనుమానం. ఒకటి చెయ్యి — టేబిల్ క్లాత్ క్రిందపెట్టు సరిపోతుంది. (సీమ టేబిల్ క్లాత్ క్రింద పెట్టాడు) ఏదో ఎత్తుగా వున్నట్లు కనిపిస్తోందిరా. నా మాట విను. ఇక్కడ నుంచి లోపలకు తీసుకుపోయి నా గదిలో ... నా గదిలో వొద్దు, అవతల గదిలో పడెయ్, జాగ్రత్త, దాని అవసరం ఐపోలేదు. (సీను వెళ్ళాడు. చిదంబరం కోటు తీసేసి చిరాగ్గా కూలబడ్డాడు. సీను వచ్చాడు.) ఏమయిపోయిందిరా మన కుక్కపిల్ల? దొరక నట్టే? ఇల్లంతా చిన్నబోయిందిరా — ఎంత ముద్దు. నన్ను చూస్తే ఒక నిమషం వదిలేదికాదు ఎంత దూరంలో వున్నా ఇట్టే అనవాలునట్టి తోక వూపేది... నేను బిస్కట్లు తీసుకు రాకపోతే వెధవకెంత కోపం— పాపం— ఎక్కడుందో— ఏమయిందో!

సీను:- విచారించకండి సార్ ! మన కుక్కపిల్ల మనకు దొరుకుతుంది కాని— అది లేకపోతే నాకేం తోచటంలేదు సార్! (అమాయకంగా) ఎంతమంచి కుక్కపిల్ల సార్ అది! ఎవ్వర్నీ ఏమీ అనేది కాదు. దొంగల్ని చూసినా ఎంతసేపూ అరిచేదేకాని కరవటానికి నోరే వచ్చేది కాదు సార్... అరిచే కుక్క కరవదంటారని— అరుపు తగ్గిద్దామని ప్రయత్నించాను. అరుపు తగ్గించేది. ఐతే 'ఒకర్ని కరిచి బాధిస్తానా' అన్నట్టు నోట్లో చెయ్యిపెట్టినా విదిలించుకొని పారిపోయేది!

చిదం:- సీనూ! ఆ కుక్కపిల్ల మనకు ఎట్లా వచ్చిందో తెలుసురా నీకు?

సీను:- తెలీదు సార్!

చిదం.- చెబుతా విను. బెంగుళూరునుంచి వస్తూంటే మధ్య ఒక స్నేహితుడు నాకు బహూకరించాడు. అంతకుపూర్వం కుక్కపిల్ల కోసం తెగ ప్రయత్నించాను. చిన్నప్పట్నుంచీ కుక్క పారాలు తెగ చదవటం వల్ల, కుక్కలమీద బాగా మక్కువ కలిగింది. ఏం చేస్తాం? మా

నాన్నగారికి కుక్కలంటే, కోపం—భయం! ఎందాతంటే ఆయన తండ్రిగారు కుక్కకాటువల్ల చచ్చిపోయాట్ట ఆ భయంవల్ల మా నాన్నగారు ఇంట్లో కుక్కబొమ్మ కూడా ఉంచేవాడుకాడు. గ్రామ ఫోను పాటలకోసం రికార్డులు కొంటే 'వెధవా, హిజ్ మాస్టర్స్ రికార్డులు కొనవద్దని చెప్పానా, లేదా?' అంటూ అవన్నీ తీసికెళ్ళి బయటపారేసేవాడు. నీళ్ళుపోసి—ఆ బొమ్మను వూడదీసి ఇంట్లోకి తెచ్చుకొనేవాడిని. వీధిలో కుక్క అరుస్తే నౌకర్ను పంపి ఆ కుక్కను ఊరవతలిదాకా తరుముకు పోయొచ్చి ఇంట్లో కాలుపెట్ట మనేవాడు! అంత చాదస్తపు మనిషి! నాకా చాదస్తమూ లేదు, భయమూలేదు సరికదా—అదేమిటో ఆయన 'వద్దు' అంటున్న కొద్దీ నా మనస్సు కుక్కలమీదికే పోయేది! 'కుక్క విశ్వాసముగల జంతువు' అనే మాట నా మెదడులో ఎప్పుడూ పనిచేస్తూవుండేది. అందాత బెంగుళూరు నుంచి వస్తున్నప్పుడు నా స్నేహితుడిని ఆ కుక్కపిల్లను నాకు బహూకరించమన్నాను. ఆ బహూకరణతోపాటు ఓ కాగితం కూడా యిచ్చాడు. 'ఆకలివేస్తున్న కుక్కకు అన్నం పెడితే అది నిన్ను కరవదు—కుక్కకూ, మనిషికీ వుండే పెద్ద భేదమల్లా ఇదొక్కటే!' అని 'మార్క్‌ట్వేన్' అనే మహానుభావుడి కొటేషన్ ఆ కాయితం మీద రాశాడు. ఎంత మంచి వాక్యం అను కున్నావు...ఆ కాగితం మాత్రం పెట్లో మిగిలిపోయింది.

సీను:- మ్చ్...ఏంచేస్తామండీ—ఖర్మ!

చిదం:- ఖర్మేమిట్రా నీమొహం! (ఆగి) అసలు నువ్వే కారణం అది పోవ టానికి—

సీను:- నేనాండీ?

చిదం:- అవును నువ్వే. ఆ కుక్కకోసం, దాని పోషణకోసం నిన్ను ఏర్పాటు చేశాను. దానికి తల్లీ తండ్రీ అన్నీ నువ్వే అనుకోమని చెప్పాను— 'వూఁ, వూఁ' అని దాన్ని వొదిలేశావ్!

సీను:- నాకు తెలీకపోకొ! తెలిసి తెలిసి ఎందుకొదిలేస్తానండీ?

చిదం:- వెధవా-ఇరవైనాలుగ్గంటలూ దాన్ని నువ్వు కనిపెట్టుకుని కూచో నక్కర్లా?

సీను:- అది మన యిల్లు కాయాలని వీధిలో వుంచారు, దాన్ని కాస్తూ నేనూ అక్కడే కూచోనా?

చిదం:- ఏం, నువ్వు వెధవపనులు చెయ్యకుండానూ, పారిపోకుండానూ నేను నిన్ను కాస్తున్నాను కానూ? ఐనా నిన్ను అనేం లాభం? నీవంటి తెలివితక్కువ దద్దమ్మను నౌకరుగా ఉంచుకున్నందుకు నా బుద్ధి ననాలి!—అసలు ఎట్లా పోయిందిరా కుక్కపిల్ల?

సీను:- నేను చూడలేదుసార్-మొన్నరాత్రి మామూలుగానే అన్నం తిన్నది.

చిదం:- సరిగ్గానే తినేసిందా ?

సీను:- మరి కాస్త ఎక్కువపట్టే పట్టింది—ఎట్లాగూ పోతాను కదా అని. అన్నం తిన్నాక గొలుసుతో స్తంభానికట్టేను. మామూలుగా నేను నిద్రపోయాను. సగంరాత్రికే లేదు, గొలుసుమాత్రం ఉండిపోయింది.

చిదం:- ఆ గొలుసు ఓసారి తీసుకురా. (సీను లోపలికి వెళ్ళి గొలుసు తెచ్చాడు. చిదంబరం పరీక్షగా చూసి) గొలుసు కొరుక్కొని పారి పోలేదు......విప్పేసివుంది. అంటే ఎవరో విప్పేశారన్నమాట! నువ్వసలు మెడకు గట్టిగా కట్టావా?

సీను:- గట్టిగానే కట్టానండీ—ఇంకాస్త బిగిస్తే గుటుక్కుమనేటంత గట్టిగా కట్టాను.

చిదం:- ఐనా పారిపోయింది—ఏ దొంగ వెధవో ఎత్తుకుపోయాడు! దాని మానాన అది పోయివుంటుందని నేను అనుకోను. నిన్న పత్రికల వాళ్ళకు ప్రకటన యిచ్చాను. పోలీసు స్టేషన్‌లో గంటసేపు కూచు న్నాను ఊరంతా వెతికాను. కనిపించిన స్నేహితులందర్నీ అడిగాను. మాకు తెలీదంటే మాకు తెలీదనేవాళ్ళేగాని 'చూదాం' అని ఒక్కళ్ళనలేదు—ఇంకెందుకూ వెధవ స్నేహితులు?

సీను:- పోలీసులు ఏమన్నారండీ?

చిదం:- "నీ మొహం అన్నారు. 'మీ కుర్రాడిచాత వెదికించండి' అన్నారు. నువ్వే వెతికి దాన్ని వాళ్ళకు వప్పజెప్తే—అప్పుడు నా చేతికిచ్చి 'మేమే పట్టుకున్నాం' అని గొప్పగా చెప్పకోటానికి కాబోలు! 'మీ కుక్క ఏదన్నా దొంగతనం చేసిందా?' అని వో పోలీసు అడిగాడు. 'లేదు' అన్నాను. 'ఐతే మాకేం సంబంధం లేదు—దొంగతనంచేస్తే పట్టుకునే బాధ్యత మాది' అంటాడు. ఇంకోడు 'ఎవర్నన్నా చంపి పారిపోయిందా?' అంటాడు. నా మొహం! అది కరవనే కరవదంటున్నావు నువ్వు! అది దొంగతనంచేసి పారిపోయుంటేనూ, ఎవర్నన్నా హత్యచేసి పారిపోయుంటేనూ, వాళ్ళు నిమిషాలమీద వెళ్ళి పట్టుకుని ఉందురట! 'మోసగాళ్ళను కూడా పట్టుకుంటారు కదా మీరు?' అని అడిగాను. 'ఓ' అన్నారు. ఐతే నా దగ్గర నమ్మకంగా వుంటూ నన్ను మోసంచేసి ఓ కుక్కపిల్ల పారిపోయింది.. పట్టుకోమన్నాను. నన్నుచూసి వాళ్ళంతా ఒకటే నవ్వు! 'కుక్కపిల్లల్ని కూడా మేమెక్కడ వెతగ్గలం?' అంటాడు ఒకడు. నాకు వళ్ళమండి 'కుక్కపిల్లను వెతికి పట్టుకోడం కూడా మీకు చాతకాదు—పొండి' అని వాళ్ళ మొహంమీద అనేసి పారిపోయొచ్చాను.

సీను:- మీ వెనకాల పరుగెత్తి రాలేదు సార్ పోలీసులు ?

చిదం:- ఏమో! గభాలున ఆ పక్కనే ఓ సందుంటే అందులో దూరిపోయాను.

సీను:- మంచిపనిచేశారు సార్! లేకపోతే ఏమయిపోయారోనని మిమ్మల్ని కూడా వెతుక్కునే స్థితికి వచ్చేవాడిని!

చిదం:- నిన్న రాత్రంతా ఒకటే కల, దాన్ని ఎవరో ఎత్తుకుపోయినట్టూ, కొడుతున్నట్టూ, పెద్ద పెద్ద కుక్కలన్నీ దాన్ని కరుస్తున్నట్టూ! అబ్బ—భయం వేసిందిరా!......పాపం, ఇప్పుడెక్కడుందో, ఏం చేస్తోందో...చిన్న వెధవ...ఎవడన్నా తిండి పెడుతున్నాడో లేదో-'కుంయ్ కుంయ్' మని మూలుగుతుందిగాని మాటాడలేదు కదా—నోరులేని జీవం.

సీను:- సార్! ఆమధ్య మీ స్నేహితుడొకాయన అడిగారు కదండీ?

చిదం:- అవును అడిగాడు—లక్షమంది అడిగారు, ఏం?

సీను:- ఆయనగాని...

చిదం:- అబ్బే! కుక్కను ఎవడు ఎత్తుకుపోతాడ్రా? ఈ యింట్లో దానికి స్వతంత్రం లేదనో, ఇక్కడ సుఖం లేదనో అర్ధరాత్రివేళ పారిపోయుంటుంది. ఎవరికన్నా దొరకదా?... అన్నట్టు పత్రికలో ప్రకటన వేశారా?

సీను:- వేశారు సార్— మీరు రాగానే చూపిద్దామనుకున్నాన— మరిచేపోయాను. (పత్రిక తెచ్చి యివ్వబోయాడు)

చిదం:- నువ్వే చదువు.

సీను:- (చదువుతూ) 'కుక్కపిల్ల కనబడుట లేదు. తెల్లని రంగూ, కోలముఖమూ, కుచ్చువంటి పొట్టితోకా గల కుక్కపిల్ల కనబడుట లేదు. మెడలో తోలుపటకా యున్నది. వెతికి తీసుకు వచ్చిన వారికి నూటపదహారు రూపాయలు బహుమాన మిచ్చెదను. జి. డి. యస్. చిదంబరం...''

చిదం:- (ఆపుతూ) ఏమిటేమి చేమిటి... మళ్ళీ చదువు (సీను మళ్ళీ చదివాడు. చిదంబరం జాగ్రత్తగా విన్నాడు) 'కుక్కపిల్ల కనబడుటలేదు—' మళ్ళీ చదువు— (సీను గడగడా చదివి, చిదంబరం కేసి చూసి మళ్ళీ మొదలెట్టబోయాడు.) చాలుచాలు— మరి చదవక్కర్లేదు— ఆ ప్రకటన చాలు. నూటపదహారు రూపాయిల బహుమతి కోసం ఎవడన్నా వెతుకుతాడు.

సీను:- కుక్కపిల్ల ఖరీదు అందులో నాలుగోవంతు వుంటుందా సార్?

చిదం:- పోరా వెర్రిమొహం— నూటపదహారు కాదు రెండు నూటపదహార్లిస్తే మాత్రం అటువంటి కుక్కపిల్ల మనకు మళ్ళీ ఎక్కడ దొరుకుతుంది? మన అడ్రసంతా 'క్లియర్'గా వుందా పేపర్లో?

సీను:- వుంది సార్!

చిదం:- చూద్దాం, నాలుగురోజులు ఓపికపడదాం... కాస్త కాఫీ తీసుకొచ్చి యిస్తావూ?

[సీను లోపలకుపోయి ఫ్లాస్కు, గ్లాసు తెచ్చి కాఫీ పోస్తున్నాడు.]

సీను.- నిన్నట్నుంచీ కాఫీమాటే మరిచిపోయారు సార్ మీరు.

చిదం:- నిన్నట్నుంచీ ఆ కాఫీ అందులోనే అట్లావుందా యేమిటి?

సీను:- అబ్బే... నిన్నటిది అప్పుడే ఐపోయింది సార్! ఆహాఁ... చెబుతున్నాను— మీకు ఎంత మనస్తిమితం లేకుండా పోయిందోనని!

చిదం:- కాదురామరీ— కుక్కపిల్ల ఐతేమాత్రం మనింట్లో ఓ పిల్లగా వుంటూ మన చెంత తిరుగుతూ— మనం అంటే ప్రాణం పెట్టే పిల్ల— కనిపించకపోతే మనస్తిమితం వుండకపోవటం యేమిటి, పిచ్చే ఎత్తాలి! (కాఫీ తాగుతున్నాడు.)

సీను:- (సంశయిస్తూ) సార్......

చిదం:- ఏమిట్రా?......

సీను:- ఏంలేదుసార్— చిన్న కోరిక......

చిదం:- కోరికా! కోరిక అడిగితే తీర్చే దేవుణ్ణి అనుకుంటున్నావేమిట్రా— తీరా ఎదుట ప్రత్యక్ష మయితే దేవుడే తీర్చడు! ...... అడుగు—

సీను:- ఏంలేదు సార్... మా నాన్న రెండోపెళ్ళి చేసుకుంటాడట— వో వందరూపాయలిప్పించాలి సార్—

చిదం:- ఏమిటీ! మీ నాన్న రెండోపెళ్ళి చేసుకుంటే నేను వంద రూపాయలివ్వాలా! మీ నాన్నకు రెండోపెళ్ళేం— అక్కర్లేదు వూరుకోమను!

సీను:- అదికాదు సార్—నా జీతంలో విరక్కోసు కుంటానండి!

చిదం:- నాన్‌సెన్సు— మీ నాన్నకు రెండోపెళ్ళి నువ్వు డబ్బెట్టి చేయిస్తావా? మతిలేదురా నీకు? డబ్బుపోసి సవతితల్లిని కొనుక్కుంటావురా వెధవా?

సీను:- పోనీండి సార్— మా అన్నయ్యే చేసుకుంటాడు యివ్వండి సార్!

చిదం:- పోరా ఇడియట్— తమాషాలు! ఐ.నా— కుక్కపిల్లపోయి నేనేడుస్తూ వుంటే, నీ పెళ్ళి, వందరూపాయలు గుమ్మరించటానికి నేనేమన్నా 'బ్యాంకీ' అనుకున్నావా— వెళ్ళు అవతలకు వెళ్లు!

సీను:- పోనిండి, కుక్కపిల్ల దొరికిన తర్వాతన్నా...

చిదం:- ఆలోచిస్తాలే—

[సీను నెమ్మదిగా బయటకు వెళ్ళాడు. పత్రిక తీసి చిదంబరం ప్రకటన చూశాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. సీను బయటనుంచి వచ్చి]

సీను:- ఎవరో ఒక అబ్బాయి వచ్చాడు సార్!

చిదం:- మనింటికా?

సీను:- అవును సార్!

చిదం:- మనింటో కుర్రాళ్ళెవరూలేరు పొమ్మను

సీను:- కుర్రాళ్ళకోసం కాదుసార్—తమకోసం!

చిదం:- [ఆలోచిస్తూ] నాకోసం? కుర్రాడు?...రమ్మను!
(సీను బయటకు వెళ్ళి కుర్రాడిని తీసుకొచ్చాడు. ఆ అబ్బాయికి 14, 15 ఏళ్లుంటాయి. అబ్బాయి వచ్చి కూచున్నాడు. పత్రిక అడ్డు పెట్టుకొని చదువుకుంటున్న చిదంబరాన్ని గమనించలేదు.]

అబ్బా:- [సీనుతో] పిలవ్వోయ్— పిలువ్—

సీను:- ఎవర్నండీ?

అబ్బా:- చిదంబరంగార్ని!

చిదం:- (పత్రిక పక్కకు పెట్టిచూచి) నేనే-నేనే చిదంబరాన్ని. ఏం కావాలి?

అబ్బా:- మీరేనా చిదంబరంగారు!

చిదం:- నేనేనమ్మా... ఎప్పుడూ నా ఫొటో అన్నా పేపర్లో చూడలేదా నువ్వు?

అబ్బా - మీ ఫోటోనా-మాడలేదే. మీరు బ్రతికేఉన్నారుగా- ఎవరి ఫోటోలన్నా చచ్చిపోయిన తర్వాతే పేపర్లో పడతాయట. మా నాన్నగారంటారు.

చిద - మీ నాన్నగారి పేరు?

అబ్బా:- అదెందుకుగాని. నేను మీతో పనుండి వచ్చా [illegible]



చిదం:- [అయోమయంగా అబ్బాయికేసి చూసి] చదువుకుంటున్నావా?

అబ్బా:- స్కూల్ ఫైనల్ !

చిదం:- అబ్బో- సరే ఐతే-పాస్ అయినతర్వాత వస్తే కాలేజీలో చేరటానికి ఒకటో రెండో సాయం చేస్తాలే. పో (తిరిగి పత్రిక చూడటంలో పడబోయాడు)

అబ్బా:- (బల్లమీద చేత్తో చరిచి) నాన్ సెన్స్! ఒకటో రెండో సాయంచేస్తారా? ముష్టెత్తుకోడానికి రాలేదు. నా సొమ్ము నాకివతల పారెయ్యండి

చిదం:- (ఆశ్చర్యంగా చూసి) అబ్బాయ్- నీకేమన్నా పిచ్చా...?...

అబ్బా:- పిచ్చియితేనేం - కాకపోతేనేం - అదంతా మీ కనవసరం. నా డబ్బు నాకిచ్చి మాట్లాడండి.

చిదం:- నీ డబ్బేమిటి-నా దగ్గర వుండటమేమిటి? నువ్వేమోచూస్తే వెలెదు లేవు 'డబ్బు' 'డబ్బు' అని ఒకటేపోరేస్తున్నావు. నాకేంఅర్థం కావటంలేదు.

అబ్బా:- నేను వేలెడు లేకపోయినంత మాత్రాన నా డబ్బు నాకివ్వరటండీ?... నేను ఎవర్నను కున్నారు? అన్యాయంగా నన్ను మోసగిస్తున్నారని పోలీసులకు ఫోన్ చేస్తాను. (ఫోన్ దగ్గరకు వెళ్ళబోయాడు)

చిదం:- అబ్బాయ్... అబ్బాయ్... వుండుండు... ఆ ఫోను పనిచెయ్యదు

అబ్బా:- పనిచెయ్యదా?... పనిచెయ్యనప్పుడు మీకెందుకండీ అంత అదుర్దా (ఫోను తీశాడు)

చిద:- సీనూ, సీనూ! (వెళ్ళి ఫోను తీసుకుని) నీ డబ్బిస్తాను. రా-కూచో?

అబ్బా:- (కూచున్నాడు)

చిదం:- చూడూ, కొన్ని ప్రశ్నలడుగుతాను. సమాధానం చెప్పవా నీ డబ్బు నీకిచ్చేస్తాను

అబ్బా:- లేకపోతే ఇవ్వరా?

చిదం:- ఇస్తాలే-చెప్పు మీ యిల్లెక్కడ?...కోప్పడకు, చెప్పు - ఫరవాలేదు. మీ యిల్లు ఆసుపత్రిలా ఉంటుందిక మా-అక్కడ కొందరు మనుషులు కేకలు వేస్తూ అరుస్తూ వుంటారు కదూ?

అబ్బాయి:- అర్థమయింది పిచ్చాసుపత్రి మా యిల్లా? (ఆలోచిస్తూ) అంటే పిచ్చాసుపత్రినుంచి నేను వచ్చేనని మీరు అనుకుంటున్నారా - (గట్టిగా) నేను పిచ్చివాణ్ణా?

చిదం.- కాదుకాదు-కూచో!

అబ్బా:- ఆఖరుసారి అడుగుతున్నా డబ్బిస్తారా, ఇవ్వరా?

చిదం:- ఎంతివ్వాలి?

అబ్బా.- ఎంత యివ్వాలి? ఏమని వేశారు పేపర్లో?

చిదం:- పేపర్లో వేశానా?

అబ్బా.- అహ్హా! తెలిసింది మీకే పిచ్చి. ఈ రోజు పేపర్లో వెయ్యలేదటండీ నూట పదహార్లు ఇస్తానని—

చిదం:- అవును. మా కుక్కపిల్లను వెతికి తీసుకొచ్చిన వారికి నూటపదహారు రూపాయలు బహుమాన రూపంగా ఇస్తానని ప్రకటించాను గాని పూరికినే కాదు..

అబ్బా:- పూరికినే ఇమ్మనటానికి నేనేం పిచ్చివాణ్ణి కాదు నానాశ్రమలూపడ్డాను —మీ కుక్కపిల్లను వెతికాను—తీసుకొచ్చాము.

చిదం:- తెచ్చావా—ఏదీ—ఆ మాట మొట్టమొదటే చెప్పలేదేం? ఏదీ—ఏదీ నా కుక్కపిల్ల?

అబ్బా - తెస్తాను. ముందు నాకు మాటివ్వండి.

చిదం:- ఏమని?

అబ్బా:- నా డబ్బు నాకు అణా పైసంతో సహా వెంటనే ఇస్తానని!

చిదం.- ఎందుకివ్వను బాబూ! తప్పకుండాఇచ్చేస్తాను కుక్కపిల్లను తీసుకరా [అబ్బాయి అదోకలాగచూసి బయటకు వెళ్ళాడు. నల్లగావున్న కుక్కపిల్ల మెడకు తాడొకటికట్టి బరబరా లాక్కొచ్చాడు]

అబ్బా:- (వస్తూనే) ఇదిగో—మీ కుక్కపిల్ల.

చిదం:- (తెల్లబోయి చూస్తూ) ఇదా!... ఇది నా కుక్కపిల్లకాదు...!

అబ్బాయి:- కాదూ (కూచున్న కుర్చీకి తాడుకట్టాడు) ఆమాట అవొద్దని మొదటే చెప్పాను. తప్పించుకోడానికి ఎత్తులు వెయ్యకండి. నన్ను కుర్రాడిని చేసి నాటకం ఆడారంటే జాగర్త! ఎంత కష్టపడ్డాను దీన్ని వెతకటం కోసం? తిండి, నిద్ర, చదువూ అన్నీ మానేశాను. మా నాన్నగారు తిడుతూ వున్నా సరే. యెండలో బయల్దేరి వూరంతా తిరిగి పట్టుకున్నాను. ఇది మీది కాకుండా యెట్లా వుంటుంది? తీసుకొని దబ్బివ్వండి. నేను త్వరగా వెళ్ళాలి.

చిదం:- అబ్బాయ్! కుక్కపిల్ల ఏదో ఒకటి తీసుకొస్తే దబ్బిస్తానని నేనేం రాయలేదు. నా కుక్కపిల్ల రంగువేరు. జాతివేరు. ఎబ్బే, అది ఇట్లా ఇంత అసహ్యంగా వుండదు!

అబ్బాయి:- మరి తిండీ తిప్పలూ లేక ఎండలో మాడితే అసహ్యంగా కాక ఎట్లా వుంటుంది! నేను ఎండలో తిరిగి ఇంటికివోగానే మా నాన్నగారూ ఆ మాట అన్నారు, కొట్టబోయారుకూడా!

చిదం:- దానిమాట కేంగాని—ఈ కుక్కపిల్ల నాదికాదు—తీసుకుపో.

అబ్బాయి:- తీసుకుపోనా? ఏం మాట!...సరే, దబ్బివ్వక్కరలేదులెండి. మీ కుక్కపిల్లను మీరే వుంచుకోండి—వెళుతున్నాను.

చిదం:- బాబూ! నువ్వుచూస్తే భూమికి జానెడు లేవు నీ మాటలూ, నీ చేష్టలూ చూస్తుంటే నాకు మతిపోతోంది. నువ్వు వెళ్లు. కుక్కపిల్లను కూడా తీసుకువెళ్లు ఎక్కడ తెచ్చావో అక్కడే వొదిలెయ్యి.

అబ్బాయి:- సరేనండి, ఐతే, ఈ మాత్రందానికి ప్రకటన వేసి మోసం కూడా ఎందుకు చేశారు? వెళుతున్నాను. (కోపంగా కుక్కను తీసుకుపోతూ మళ్ళీ తిరిగివచ్చి) ఈ కుక్కపిల్లను దాని తల్లిదగ్గర ఒదిలి పెట్టాలంటే నేను నానా శ్రమా పడాలి. మంచి బాగానే చేశారు థాంక్స్. పోనీండి—కాలేజీలో చేరాక వస్తే ఒకటో రెండో సహాయం చేస్తానన్నారు—అప్పుడొస్తే అదన్నా యిస్తారా—కట్లాగే పొమ్మంటారా?

చిదం:- లేదులేదు—తప్పకుండా యిస్తా, ఇప్పుడు వెళ్ళు, (అబ్బాయి సీరియస్‌గా చూసి, సణుక్కుంటో బరబరగమ్మని కుక్కపిల్లను లాగుతూ

బయటకు పోయాడు. బయట కుక్కపిల్ల 'కంయ్' మనే అరుపు వినిపించింది. చిదంబరం 'ష్' అని కూలబడి లేచి)

అబ్బా:- ఒరే సీనూ...సీనూ...వెధవ ఎక్కడ చస్తున్నాడో—సీనూ! (ఫ్లాస్కులో కాఫీ పోసుకుని తాగుతున్నాడు. ఇంకోవ్యక్తి ప్రవేశించాడు ఆధునిక పద్ధతిలో వున్నాడు)

వ్యక్తి:- (నమస్కారం చేస్తూ) ఈ యింటికి యజమాని మీరేనా—

చిదం:- ఆహా, సాక్షాత్తూ ఈ యింటికి యజమానిని నేనే. ఏం సెలవు.

వ్యక్తి:- (కూమన్నాడు) ఎబ్బే — ఓ చిన్న పనిమీద వచ్చాను.

చిదం:- చెబుదురుగాని వుండండి. (కాఫీ పూర్తిగా తాగేసి, గ్లాసు వుంచేస్తూ) ఏం పనిమీద వచ్చానంటారు?

వ్యక్తి:- ఈ యిల్లు ఏ సంవత్సరంలో కట్టారండి-బయట చాలా 'హోప్లెస్'గా వుంది. (పైకి చూసి) అరె, సీలింగ్ అంతా పూర్తిగా పాడయి పోయింది!

చిదం:- పాడయితే పాడవనివ్వండి. ఈ యింటిని మీకు నేనేం ధారాదత్తం జేసెయ్యటంలేదు!

వ్యక్తి:- అందుకాదండి. ఇంట్లో కాలుపెట్టిన తర్వాత ఇల్లు కలకల్లాడక పోతే ఎందుకు చెప్పండి! ఈ వూళ్ళో చాలా ఇళ్ళు చూశాను. వట్టి మురికి కూపాలు. మళ్ళీ మహా మహా ఎంజినీర్లు కట్టిన యిళ్ళు, వేలూ, లక్షలూ పోసి కట్టించిన ఇళ్ళు!... ఇల్లు— కట్టించిన మర్నాటికే ఇంటికి పూసిన రంగంతా వెలవెలా పోటం ప్రారంభిస్తుంది. ఇంట్లో ఎక్కడ చూసినా సున్నం రాలిపోతూ వుంటుంది—అడుగున అంతా బీటలువారిపోతూ వుంటుంది. అదంతా కట్టేవాళ్ళల్లో వుంటుందండీ- ఎంజినీర్లు ఏంచేస్తారు పాపం! వాళ్ళంతా జాగ్రత్తగానే ప్లాన్ వేసి కట్టిస్తారు. ఏం లాభం! కట్టిన తాపీపనివాళ్ళు సరిగ్గా పనిచెయ్యరు. అదంతా వీళ్ళ చేతుల్లోనే వుంటుంది. వీళ్ళు సరిగ్గా కట్టాలిగాని ఎంజినీరు ఏంచేస్తాడు? "ఇల్లు కట్టిన ఇంజనీరు కాదోయ్—దానికి ఇటికలు పేర్చి, తాపీచేసిన పనివాడెవ్వడు?" అని మా స్నేహితు

డాకరు గేయాలు రాశారు. అంచాత— చెప్పొద్దూ— 'పనివాడిలో'
పస వుండాలి లేకపోతే మీ యిల్లులాగానే తయారవుతుంది!

చిదం:- ఇంతకూ మీరెవరో, ఏం పనిమీద వచ్చారో చెప్పారు కాదు.

వ్యక్తి:- నేను ఇళ్ళకు మైనర్ రిపేర్స్ (Minor repairs) చేయించే కంట్రాక్టర్నండి. నా కింద అమోఘమయిన పని చెయ్యగలిగిన వాళ్ళు నలభై మంది వున్నారు. ఆ రోజుల్లో శ్రీరామచంద్రుడేం కట్టించాడండీ—వారధి? ఐదు నిమిషాల్లో మా వాళ్ళు అటువంటివి తొంభై తొమ్మిది కడతారు, చూస్తారా!... ఐతే, మేము ప్రస్తుతం అంతా మైనర్ రిపేర్స్ మీదే ఎక్కువగా కృషి చేస్తున్నాం. ఊరికే పెద్ద యిళ్ళు కడతామని ఎగబ్రాకటం— చెయ్యలేకపోవటం, సరే, అదంతా ఎందుకు—ప్రతీ యింటికి మరమ్మత్తులు చేయించటం ఎంతో అవసరం. ఆ పనివల్ల యింటికి గట్టితనం. ఓ హుందా అవన్నీ వస్తాయి.

చిదం:- ఐతే ఏమంటారు మీరు

కంట్రా.- అనటాని కేముందండి! మీ యింటికి అవతల వీధిలోవున్న రేణుకమ్మ గారి యింటిని మరమ్మత్తు చేశాం, వాళ్ళింటి ప్రక్కవున్న రాజారావు గారి యిల్లూ చేశాం. తర్వాత... చైర్మన్‌గారూ, వాళ్ళూ ఆర్డర్లు ఇచ్చారు. (సంచిలోంచి 'ఆర్డరు బుక్' తీసి చూపుతున్నాడు)

చిదం:- చైర్మన్‌గారు తన యింటికే ఇచ్చి వూరుకున్నారన్న మాట! ఆ స్కూలు పడిపోడానికి సిద్ధంగా వుందికదా, దానికో ఆర్డరు వేయించుకోలేకపోయారా?

కంటా:- ఇస్తారుసార్, అదీ యిస్తారు ఎట్లా? ముందు తనయిల్లు చక్కచెట్టుకుని కదా రెండోయింటికి వెళ్ళాలి. (పుస్తకం చూపుతూ) చూడండి, ప్రస్తుత ఎనిమిదిళ్ల కంట్రాక్టు తీసుకున్నాను. వర్కు జరుగుతున్నది నాలుగిళ్లు లోగడ చేసిన వర్కుకూడా... (కాయితాలు వెనక్కు తిప్పుతున్నాడు)

చిదం - అఖ్కర్లేదులెండి...ఆఁ ...మీరు కేవలం ఇళ్ళే మరమ్మత్తు చేస్తారా, ఇంకేమన్నా కూడా మరమత్మత్తు చేస్తారా?

కం|ట్రా:- (గడగడా) ఇళ్ళూ, భవనాలూ, వంతెనలూ, రోడ్లు, సైడు కాలు వలూ...

చిదం:- ప్రస్తుతం నా మెదడు చాలా ఒడిదుడుకుల్లో వుంది. దాన్నేమన్నా మరమ్మత్తు చేయగలరా ?

కం|ట్రా:- (తెల్లబోయి, సర్దుకుని నవ్వి) చంపేశారు. మీరట్లా అడిగితే నేనేం చెప్పేది? దాన్ని 'రిపేర్' చెయ్యటానికి ప్రత్యేకం హాస్పిటలూ, డాక్టర్లూ వుంటారుగాని...

చిదం:- ఐతే, ఓ గొడ్డలి తీసుకొని ముందు నా యిల్లంతా ఇవాళ పగల గొడతాను, మీరు రేపురండి—మరమ్మతు చెయ్యొచ్చు.

కం|ట్రా:- మీరు చాలా చిత్రంగా మాట్లాడుతున్నారు. మీ యిల్లు మరమ్మత్తు కోరుతోందికదా అని అన్నాను. ఒక్కసారి వీధిలోకి వెళ్ళి చూడండి. గోడలన్నీ ఎంత పాలిపోయి వున్నాయో ! ఎంతో అవదు. చాలా చిన్న మొత్తం ! రోజుకు మీకయే కాఫీ ఖర్చు.

చిదం:- నాకు రోజుకయే కాఫీ ఖర్చు రెండణాలు, ఇదిగో (ఇస్తూ) తీసుకుని చెయ్యవలసిన మరమత్తేదో చేసుకోండి.

కం|ట్రా:- (చాలా విచిత్రంగా చూశాడు)

చిదం:- క్షమించండి నేను చాలా చిక్కుల్లో వున్నాను. అదయ్యాక రిపేర్ విషయం ఆలోచిద్దాం. ఇప్పుడు నన్ను మరి కొరుక్కుని తినేయకండి!

కం|ట్రా:- ఏమిటి-అంత మనోవ్యధలో వున్నారా ?

చిదం:- మీకు పత్రికలు చదివే అలవాటు లేదా?

కం|ట్రా:- చంపారు ! న్యూస్ పేపర్ చదవటం నాకో వ్యసనం లాంటిది. ఏ రోజు పేపర్ లేకపోయినా మరి నాకు నిద్రపట్టదు.

చిదం:- చూడండి-పేపర్ చదివితే కేవలం మీ రాజకీయాలేకాదు- ఇతర ప్రకటనలు కూడా చూడాలి. ఈ రోజు పేపర్లో ఓ ప్రకటన ఇచ్చాను. మా యింట్లో ఓ పిల్లలాగ తిరుగుతూ నా ప్రేమకు పాత్రు రాలయిన నా కుక్కపిల్ల 'రోజా' కనిపించకుండా పోయింది. అది దొరికేదాకా నాకు తోచదు. వెతికి తీసుకు వచ్చిన వారికి నూట

పదహారు రూపాయల బహుమానం యిస్తానని ప్రకటన వేశాను. (పత్రిక చూపాడు)

కంట్రా:- (చూసి) అట్లాగా-చిదంబరంగారంటే మీరే అన్నమాట! పాపం? ఎంత కష్టం అండీ-నిజమే నండీ-ఇంట్లో తిరగుతున్న కుక్కపిల్లే కాదు-నాలుగు రోజుల్నుంచీ ఇంట్లో వున్న ఓ చిన్న చీపురు కనిపించక పోయినా అదేమిటో మనసు బాధపడుతున్నది. మీరెట్లా తమా యించుకోగలిగారో ఏమిటో!

చిదం:- ఏం చెయ్యమంటారు - చచ్చినట్టు బాధపడుతున్నాను. నిన్ననంతా తిరిగాను - ఇవాళ తిరిగాను- ఎక్కడా కనిపించలేదు ఏమయిందో ఏమిటో ...సీనూ!...పాపం, నా నౌఖరు కూడా దానికోసం బెంగ పెట్టుకొని కృశించిపోతున్నాడు. వాడే దానికి తల్లి దండ్రీ!

కంట్రా:- బహుమానం కోసం కాదు కానీండి - నేనూ ప్రయత్నిస్తానండి. ఎక్కడ కనిపించినా తీసుకొచ్చి మీకు వప్పజెబుతాను. గుర్తులన్నీ తెలిశాయి కదా— ఆ మధ్య యిట్లాగే మా అబ్బాయి తప్పిపోయాడు పేపర్లో ప్రకటన వెయ్యలేదుగాని— దొరికాడు. దొరుకుతుందండీ— మన సొమ్ము ఐనతర్వాత మనకు దక్కకుండా పోతుందా!

చిదం:- సొమ్ము అంటారేమిటి? అది నా ప్రాణంతో సమానం. మీకు కనిపిస్తే మాత్రం తీసుకొచ్చి వప్పజెప్పండి— మీ మేలు మరిచిపోను.

కంట్రా:- ఎంతమాటన్నారండీ - ఇందులో పెద్ద మేలు ఏముంది? పనికట్టుకుని కూడా వెతుకుతాను...నన్ను...వెళ్ళమంటారా?

చిదం:- చిత్తం, మీరు వెళ్ళండి. కుక్కపిల్ల దొంకిందనగానే ఎట్లాగూ పండగ చేస్తాను. ఇంటి రిపేర్ చేయించక తప్పదు. అంతవరకూ మాత్రం నన్ను బాధపెట్టకండి. ఇన్నాళ్ళూ లేనిది ఈ రెండురోజు ల్లోనూ ఈ కొంప కూలిపోతుందనే భయం నాకేం లేదు!

కంట్రా:- సరే, వస్తానండి. కాని రిపేర్స్ చేయించటంవల్ల లాభం మీరే తెలుసు కుంటారు. ఎంతో అవదు మీకు. ఒకవేళ కర్మంచాలక మీ కుక్క పిల్ల దొరక్కపోయినా ఇల్లు మరమ్మత్తు చేయించటం మాత్రం

మరచిపోకండి. అదికాకపోతే వెధవది మరొక్కటికును కొనుక్కుం టాంగాని—కలకాలం నిలబడాల్సింది 'ఇల్లు!'

చిదం:- చేయిస్తానని చెప్పానుగదండీ! మీరు మరీ ఇన్సూరెన్సువాళ్ళలాగ నా ప్రాణాలు తీసేస్తే నా శక్యమా? చేయిస్తాను. ఈ ఒక్కయిల్లేనా మరో నాలుగయిదిళ్ళు చేయిద్దాం!

కంట్రా:- సెలవు (వెళ్ళి, మళ్ళీవచ్చి) మీ రోజా డీటైల్స్ చెప్పండీ కొద్దిగా! (చిదంబరం పత్రిక యిచ్చాడు కంట్రాక్టరు తీసుకొని ''రైట్'' అని వెళ్ళాడు)

చిదం:- (అటూ యిటూ చూసి ఫోన్ తీసి) హలో... ఆఁ ... నేను చిదంబరాన్ని మాటాడుతున్నాను. ... ఆఁ? ... దొరకలేదు ... నీకూ దొరలేదా ... ప్రయత్నించమని చెప్పు ... ప్రయత్నించమనీ ..., చెప్పూ ... దాని ఫోటో లేదయ్యా — నేనూ అదీ కలిసి తీయించుకున్నది ఒకటుందిగాని నా మొహం కనిపిస్తున్నంత బాగా అది కనిపించటంలేదు. అది పనికిరాదులే...ఐనా ఫోటో ప్రకటించాలిసిన అవసరంలేదులేదు. వివరాలన్నీ పూర్తిగా ఇచ్చాంగా. ఆఁ...అందుకే పిల్చాను. ఏం భోజనం నా మొహం!...వుంటాను మరి! (రిసీవర్ పెట్టాడు. సీను వచ్చాడు) దొరికిందా సీనూ?

సీను:- వీధిలో పోతున్న కుక్కపిల్లలన్నిటినీ పట్టి పట్టి మరీ చూశాను సార్- దేనికీ మన రోజా పోలికలున్నా లేవు!

చిదం:- ఏం అదెందుకు?

సీను:- అందాకా దాంతోనన్నా కాలక్షేపం చెయ్యొచ్చుగదా అని. అదీ గాక, కుక్కపిల్ల లేకపోతే నాకీ యింట్లో పనివుండదు. అది లేదని ఉద్యోగం లాగేసి పొమ్మంటారని నా భయం!

చిదం:- నీ కాభయం ఏమీ అక్కర్లేదు. ఏం, ఇవాళ కాకపోతే రేపటికన్నా దొరకదా?

సీను:- దొరక్కపోతే మాత్రం నాకోసమన్నా ఓ పిల్లను కొనాలి సార్!

చిదం:- నోరుముయ్యరా మన పిల్ల మనకు దొరక్క ఏమవుతుంది?

సీమ:- దొరుకుతుందండీ-దొరికినదాకా నాకు మరి మతి బాగుపడదు. ఏదో వాగేస్తూంటాను ఆ మతిమరుపువల్ల. కోప్పడకండి సార్!

చిదం:- అవునురా—ఆ ప్రేమ అట్లా అనిపిస్తుంది. అన్నట్టు యిందాక ఓ కుర్రాడొచ్చాడు. చూశావా—వాడో నల్లటి పిల్లను లాక్కొచ్చి, నా యెదాన్నికొట్టి "ఇదే నీ కుక్కపిల్ల తీసుకో — తీసుకొని నా నా డబ్బు నాకివ్వు" అని ఒకటే గోలపెట్టాడు.

సీను.- పోనీ—అందాకా దాన్నన్నా తీసుకున్నారు కారు!

చిదం:- నీ మొహం! దాన్ని చూస్తే డోకొచ్చింది. అసహ్యంగా వుంది. వాడెవడో దేవాంతకుడులాగ వున్నాడు. చూట్టానికి పదిహేనే ళ్ళన్నా లేవు, కబుర్లు మాత్రం ఆకాశానికంటేటట్టు చెప్పాడు. తను చాలా శ్రమపడి వెతికి తీసుకొచ్చాట్ట—పో పొమ్మన్నాను.

సీను:- మంచిపని చేశారు. నాతో చెప్పారు కారు, ఒకటిచ్చుగుని బయటకు తోసేద్దును.

చిదం:- పోనీ పోయాడులే. మరొక్కసారి అట్లా బయటకుపోయి చూసి వస్తాను. నువ్వు జాగ్రత్తగా—కుక్క కాసినంత జాగ్రత్తగా యిల్లు చూస్తూవుండు. ఎవరన్నా నా కోసంవస్తే వుండమని చెప్పు. (కోటు వేసుకొని బయటకు పోబోతూ వుండగా సన్నగా, పొడుగ్గా వున్న వ్యక్తి ప్రవేశించాడు.)

వచ్చిన మనిషి:- మీరేనండీ చిదంబరంగారు?

చిదం:- నేనే.

ఆయన:- నమస్కారం నా పేరు కోదండం. నేను తమతో పనివుండి వచ్చాను.

చిదం:- తమరు యిళ్ళకు మేజర్ రిపేర్స్ చేయించే కంట్రాక్టరా — లేక ఏ కంపెనీకన్నా ఏజెంటా?

ఆయన:- క్షమించండి. నేను ఒకాసుపత్రిలో కాంపౌండరు ఉద్యోగం చేస్తున్నాను.

చిదం:- ఏ ఆసుపత్రిలో? (షాక్ తిన్నట్టు)

కోదం:- ప్రయివేట్ హాస్పిటల్ లెండి, డాక్టరు రమేశ్‌గారికి కుడిభుజం వంటివాడిని.

చిదం:- నేను మీ డాక్టరు దగ్గిర ఎప్పుడూ మందు తీసుకోలేదు. మీ బిల్లులు నేనేం ఇవ్వక్కర్లేదు నాకు పనుంది వస్తా (వెళ్ళబోయాడు)

కోదం:- బావుందండీ. కాంపౌండర్లంత సేపూ బిల్లులు వసూలు చెయ్యటానికే వస్తారనుకుంటున్నారేమిటి? అవా, నా రాక వేరు నేను వేరేపనిమీద వచ్చాను. వూరికే మీకు తెలియాలని నా ఉద్యోగం చెప్పాను

చిదం:- ఆ పనేమిటో త్వరగా చెప్పండి. అవతల నాకో అర్జంటు పనివుంది.

కోదం:- ఇటువంటి పరిస్థితుల్లో అర్జంటు పనేమిటండీ? ఓ మూల కుక్కపిల్ల పోయిందని ప్రకటన ఇచ్చారు గాదా — ఇంకోమూల విచారంతో క్రుంగిపోవలసిన సమయంలో మీకు అర్జంటు పనా?

చిదం:- నా ప్రకటన చూశారా యేమిటి? నిజమే. విచారంతో బాధపడుతున్నాను. ఏంచెయ్యను? ఇప్పుడు అర్జంటు పనంటే అదే. ఆ పని మీదే వెళ్తున్నాను.

కోదం:- శునకాన్వేషణే అన్నమాట! అక్కర్లేదు. మీరింక బయటకు పోనక్కర్లేదు. మీ కుక్కపిల్ల మీ ంటిని వస్తోంది

చిదం.- యేమిటీ—(కూలబడుతూ) మీకు జ్యోతిషం కూడా తెలిసినట్టుంది. కూచోండి (కుర్చీ చూపాడు.)

కోదం:- (కూచుని) జోతిష్యం కాదండి—యదార్థమే. మీ కుక్కపిల్లను అతి శ్రమపడి—వెతికి, విసిగి వేసారి—తిరిగి వెతికి వెతికి—పట్టుకుని తీసుకొచ్చాను

చిదం:- ఏదీ?

కోదం:- కుక్కపిల్ల ఇంట్లో ఎందుకుంటుంది—బయట దానిచోటులో అది కట్టబడివుంది.

చిదం:- నిజంగా! సీనూ, వెళ్ళి తీసుకురా. (సీను పరుగెత్తాడు) చాలా థాంక్స్. మీ ఋణం తీర్చుకోలేను. పాపం, ఎంత శ్రమపడ్డారో? అసలది కులాసాగా వుందా?

కోదం:- నిక్షేపమల్లేవుంది. దానికేం-ఐతే మొదట కొద్దిగా డీలా ఐపోయినట్లు కనిపించింది కాంపౌండర్ను కదా! దాని వ్యాధి కనిపెట్టి ప్రథమ చికిత్సచేసి కొద్దిగా మందిచ్చి పాలుపట్టి జాగ్రత్తగా తీసుకొచ్చాను. అయినా ఆ పాలఖర్చూ మందుఖర్చూ మీరేం యివ్వక్కర్లేదనుకోండి!

చిదం:- ఎంతమాట! మీ ఋణం వుంచుకుంటానా చెప్పండి! చూశారా, అదంటే నాకు ప్రాణం. దాన్ని పోగొట్టుకొన్నాక నా మనస్సు ఎంత బాధపడిందో తెలుసా?

కోదం:- పాపం! ఆఁ. నాకు చెక్కిస్తారా, కాష్ యిస్తారా?

చిదం:- దేనికి? ఓహో, మీ బహూమానం సంగతా! చెక్కు యిమ్మంటారా?

కోదం:- వద్దండీ, అర్జంటుగా సొమ్ము అవసరంకూడా వుంది ఇప్పుడు బ్యాంకి మూసివేసివుంటారు. రొక్కంగా యిప్పించారంటే ఉచితంగా యిచ్చినట్టుంటుంది. రేపు ఆ చెక్కు మార్చుకునేదాకా ఆగటం కష్టం, కొన్ని అర్జంటు ఖర్చులున్నాయ్.

చిదం:- చంపారే. అంతమొత్తం రొక్కం నా దగ్గరలేదు మీ పని చక్క బెట్టుకోటానికి 50 ఇస్తాను. మిగిలింది చెక్కు రాస్తాను.

కోదం:- అట్లా అంటారా... మీ యిష్టం...

చిదం:- (చెక్కు పుస్తకం తీసి) మీ పేరు?

కోదం:- యం కోదండం (చిదంబరం రాయబోయాడు.)

సీను:- (చివాలున కుక్కపిల్లతో వస్తూ) సార్ సార్, మన రోజాకాదు సార్ యిది!

చిదం:- (షాక్ తిని) ఆఁ!

సీను:- చూడండి. ఇదేదో చవటకుక్క, వీధిలోతిరిగే వట్టి చెత్తరకం.

చిదం:- (చూసి) ఎంత పని! ఇది నాది కాదండి!

కోదం:- ఏమన్నారు మీరు పేపర్లో? తెల్లనిరంగూ, కుచ్చువంటి పొట్టి తోకాగల కుక్కపిల్ల అన్నారు. ముఖం కోలగా వుంటుందన్నారు. దీని మొహం ఏమన్నా గుండ్రంగా వుందా? తెల్లని రంగు అన్నారు. కుక్కపిల్ల

తప్పిపోయిన సమయానికి అది తెల్లగానే వుండేది. ఈ ఎండల్లో తిరిగితిరిగి నల్లబడిపోయింది. కుచ్చువంటి పొట్టితోక కాక ఇదేమన్నా పొడుగుతోకా? కుచ్చు అంటారా అది నా తప్పేలెండి. ఏమిటో నాకు నచ్చక కత్తెరతో కత్తిరించి పారేశాను. కావాలంటే ఆ ... [జేబులు తడుముకున్నాడు.]

సీను:- మా రోజా మెళ్ళో బెల్టు వుండాలి.

కోదం:- బెల్టు వుంటుందటయ్యా వీధిలోకొచ్చిన కుక్కమెడలో? అదెవడు కొట్టేశాడో! పోనిండి-బెల్టుధర ఆరణాలు, ఆ ఆరణాలు కొట్టేసుకుని, నూటపదిహేను రూపాయల పదిఅణాలూ ఇప్పించండి-ఏంచేస్తాం?... దానిగురించి నేను పెట్టిన ఖర్చు ఎట్లాగూ అడగలేదు!

చిదం:- చూడండి కోదండంగారూ — నా కుక్కపిల్ల కోసం నేను నానా శ్రమ పడుతున్నాను. అది దొరికిందంటే నాకు పరమానంద మవుతుంది. నేను ప్రమాణం చేసి చెబుతున్నాను. ఇది నా కుక్కపిల్లకాదు. మీరు లక్ష చెప్పండి. కోటి చెప్పండి. దాన్ని పెంచి పెద్దచేసిన మా సీనుగాడు—వీడే సాక్ష్యం.

కోదం:- అయ్యా—మీరు 'కాదు' అని కొట్టిపారేస్తే నేనేం చేసేది? మీరు పత్రికలో ప్రకటన వెయ్యగానే చూశాను. ఆసుపత్రీ, డాక్టరుగారూ, పేషెంట్లూ అందర్నీ వొదిలి వూరిమీద పడ్డాను. ప్రతిచోట చూశాను. తోటలూ, వీధులూ, పార్కులూ, రోడ్లూ-అవీ—ఇవీ—ఒకటేమిటి; ఇంటింటికి తిరిగాను. ఆ తిరగటంలో ఎంత శ్రమపడ్డానో మీకు నోటితో చెబితే తెలీదు అంత శ్రమపడ్డాను. అవతల డాక్టరుగారు తిడుతున్నా పేషెంట్సు ఏడుస్తున్నా, నా ఇంట్లో నా భార్యా పిల్లలు నాకోసం కలవరిస్తున్నా అన్నీ లక్ష్యపెట్టక పరోపకారబుద్ధితో కేవలం పరోపకార బుద్ధితోనే - ఎండనక వాననక తిరిగాను. మీరే ఆలోచించండి. దారిలో ఓ లక్ష పిల్లలు కనిపించినై. అవేవీ మీవి కావు ఆ మాత్రం పోలిక పట్టలేనా — ఎంత కాంపౌండర్నయితే మాత్రం! ఆఖరుకు పట్టుకున్నాను.

చిదం:- బాగా పోలిక పట్టారు! నా కుక్కపిల్లకోసం మీరు పడిన శ్రమను నేను మరచిపోను. ఈ కుక్కపిల్లను తీసుకువెళ్ళండి. (సీను బయటకు కుక్కతో వెళ్ళాడు) ఇది మాత్రం నాదికాదు! నా కుక్కపిల్లను తీసుకురండి—నిమిషాలమీద సొమ్మిచ్చేస్తాను.

కోదం:- మంచి పెద్దమనిషేనండోయ్ మీరు! నిన్నట్నుంచీ శ్రమపడి వెతికి తీసుకొస్తే కాదు పొమ్మని పైగా-మళ్ళీ వెదకాలా? బావుంది. నా కవతల పనీ పాటూ లేదనుకున్నారా—నేనేమన్నా కేవలం కుక్కల్ని వెదికే వెధవ ఉద్యోగం చేస్తున్నాననుకున్నారా?

చిదం:— అదంతా నాకేం తెలీదు. మీ కవతల పనీ పాటూ లేదని నేనేం అనలేదు. ఆ పనంతా మానుకొని కుక్కపిల్లను వెతికి తీసుకొస్తే నేగా, నూటపదహార్లిస్తానన్నది?

కోదం:- బాగా ఇచ్చారు. ఇంత మోసం ఎక్కడా చూడలేదండి. ఆరునెల్ల క్రిందట పిల్లవాడొకడు తప్పిపోతే వెతికి పట్టిచ్చి రెండువందల రూపాయలు పుచ్చుకున్నాను. ఆయన ఏమన్నా ఇటువంటి పేచీ మనిషయితే చచ్చివుందును. 'నా కుర్రాడు కాదు పొ'మ్మన్నాడా? ఎంత మర్యాద చేశాడు — ఎంత ఆదరించాడు! కుర్రాడు నాకు ఏలూరు ప్లాటుఫారం మీద దొరకాడు, ఏలూరునుంచి సెకండు క్లాసులో తీసుకొస్తే ఆ ఖర్చుకూడా యిచ్చి వాళ్ళింట్లో నాలుగు రోజులుండమని మరీ బతిమాలారు-ప్చ్!—మనకెందుకు — మన ధర్మం ఏదో మనం నిర్వర్తించాలి. వాళ్ళ అబ్బాయిని వాళ్ళకు వప్పగించాం-అంతే!

చిదం:- ఆ అబ్బాయి వాళ్ళవాడు. కాబట్టే ఆయన మీ ఋణం వుంచుకోలేదు. ఈ కుక్కపిల్ల నాదికాదు. ఇదేదో వూరిమీద తిరిగేరకం. మీరు డబ్బుకోసం ఆశపడి తీసుకొచ్చి ఇస్తున్నారు. దయచేసి వెళ్ళండి!

కోదం:- (ఉగ్రుడై) ఏమండోయ్! ఇదేం మర్యాదగా లేదు. మిమ్మల్ని మోసగించి మీ దగ్గిర డబ్బెత్తుకు పోవాలనే చచ్చు ఉద్దేశంతో వచ్చాననుకుంటున్నారా? కావలిస్తే మీకు కావలసినంత డబ్బు గుమ్మరిస్తాను. పోనీగదా అని పనీపాటు మాని, ప్రాణం పోతున్నా

లక్ష్యపెట్టక కుక్కను వెతికి తీసుకొస్తే కాదుపొమ్మని కొట్టిపారేస్తారా? ఇదేనా పెద్దమనిషి తరహా?

చిదం:- (విసిగి కోపంగా) ఇది నా కుక్కపిల్ల కాదు మహాప్రభో-నీకు శత సహస్ర నమస్కారాలు. వెళ్ళు. కుక్కపిల్ల దొరక్క నానా బాధ పడుతున్నాను. నా రోజా ఐతే తీసుకోటానికి నాకేం తెగులా? నిక్షేపంగా తీసుకుంటాను. వెళ్ళు — వీలయితేనే నా రోజాను తీసుకురా !

కోదం:- ఏమంటోయ్—ఇక లాభంలేదు. అంతా దగా. మోసం! మీ మీద పోలీసు రిపోర్టు ఇస్తాను.

చిదం:- ఏమని ఇస్తారు రిపోర్టు?

కోదం:- ఏమని యిస్తాను? ఫలానా చిదంబరం అనే ఆసామీ కుక్క పిల్లను వెతికి తీసుకొస్తే నూటపదహార్లు యిస్తామని ఆశ పెట్టి తీరా తీసు కొచ్చాక డబ్బివ్వక అల్లరి పెట్టాడని. తెలిసిందా?

చిదం:- (దిరాగ్గా చూసి) ఇవ్వవయ్యా ఇవ్వు—రిపోర్టు ఇచ్చుకో. అదిగో ఫోన్—వూఁ...చెయ్యి ఫోన్' చెయ్?

కోదం:- (తెల్లబోయి సర్దుకొని) అంతే పన్నుమాట! అనవసరంగా చిక్కుల్లో పడిపోతారా? ఫోన్ చెయ్యలేక వూరుకోటం కాదు. బావుండదు-మీ పెద్దమనిషి తరహాకు మచ్చరావటం నా కిష్టంలేక వూరుకుంటున్నాను.

చిదం:- మంచిపని చేశావ్—'నా కుక్కపిల్ల కాదూ'అని శత పోరుతూ వుండే ఆ దిక్కుమాలిన వెధవ కుక్కను నా నెత్తిన రుద్దాలనుకుంటున్నావు గదా-నువ్వేమంత పెద్దమనిషివి? నీమీద నేను మాత్రం పోలీసు రిపోర్టు ఇవ్వలేనూ? ఇస్తే నువ్వేమవుతావో తెలుసా? డబ్బుకోసం మోసంచేసి, నన్ను పీడిస్తున్నాడంటే పోలీసులు వాయువేగ మనోవేగంతో వస్తారు. సబ్ఇన్స్పెక్టరు నాకు దగ్గర స్నేహితుడు కూడాను!

కోదం:- అయ్యో; మనకూ, మనకూ భేదాభిప్రాయాలెందుకు! ఈ వెధవ కుక్క తగూ పోలీసులందాకా ఎందుకు! నిజంచెప్పండి...నిజంగా ఇది మీ కుక్కపిల్ల కాదా!

చిదం:- ఇంత సేపూ చెప్పినదంతావిని మళ్ళీ మొదటికొస్తారేం—మూడుసార్లు చెబుతున్నాను వినండిమరి, ప్రశ్న వేయకండి. మీకు నమ్మకం లేక పోతే ఇదిగో ప్రమాణం కూడా చేస్తున్నాను. (తలమీద చెయ్యిపెట్టుకొని) ఇది నా కుక్కపిల్లకాదు—ఇది నా కుక్క పిల్లకాదు-ఇది-నా—కుక్క పిల్ల—కాదు (చెయ్యితీసి) సరా?

కోదం:- మీరంతగా చెబుతూవుంటే నేనేం చెయ్యను. కాని మీ ప్రకటన చూసిన దగ్గర్నుంచీ నేనెంత కష్టపడ్డానో—ఎంత బాధపడ్డానో మీ రెరుగరు?

చిదం:- ఎరక్కేం—ఇంత సేపూ పాడుతూనే వున్నారుగా?

కోదం:- క్షమించండి, బీదవాణ్ణి. దీన్ని వెతకటంకోసం నాకొంత డబ్బు ఖర్చయింది. శ్రమమాటకేం—తమరా ఖర్చులు యిప్పించారంటే...

చిదం:- బావుందయ్యా—ఒకవేళ అది నా కుక్కపిల్ల ఐనప్పటికి నేనా ఖర్చు ఇవ్వను గదా—కాకుండా ఖర్చు కూడా ఇవ్వాలా? వెళ్ళువెళ్ళు—నన్ను మరి విసిగింపకు!

కోదం:- మీకో నమస్కారం పెడతాను! పిల్లబుగలవాణ్ణి. ఎదిగిన పిల్లకు పెళ్ళి చెయ్యాలి-రెండోవాడు చదువుకుంటున్నాడు—మూడోపిల్ల...

చిదం:- ఉద్ధరిస్తోంది! నా దగ్గిర 'పంచ' ప్రాణాలున్నాయ్, నీకొవాలంటే ఒకటో రెండో పట్టుకుపో గాని—నన్ను వేధించకు!

కోదం.- అమ్మమ్మమ్మ — ఎంత మాట-ఎంత మాట ! వెధవ డబ్బు కోసం మీ ప్రాణం తీస్తానా?

చిదం - ఇంకా ఏం తియ్యాలయ్యా రామచంద్రప్రభో! ప్రాణం పట్టుకుపోయే ముందు యమకింకరులన్నా 'ఇంత' బాధ పెట్టర్రా బాబూ! ముక్కకు ముక్క చొప్పున కొరుక్కు తినేస్తున్నావ్.

కోదం:- మీకు ఇంత బాధ కలిగిస్తున్నానని నేను అనుకోలేదు. ఆఖరు సారిగా మనవి చేస్తున్నాను...ఒక్క పాతిక రూపాయలిప్పించారంటే...

చిదం:- అబ్బబ్బబ్బ ... నీనూ ... నీనూ! ... వెళ్ళవయ్యా వెళ్ళు. పాతిక రూపాయలు కావాలా, ఎక్కడన్నా ఎత్తుగొచ్చి యిస్తాను. వెళ్ళు నమ్మకం చాలకపోతే ఈ రాత్రి నాతో కూడా రా.

కోదం:- పోనీ, ఇరవై రూపాయలన్నా ఇప్పించండి.

చిదం:- ఇదేం కర్మం వచ్చిందిరా ఇవాళ భగవంతుడా? వెళ్తావా, పోలీసుకు ఫోన్ చెయ్యమన్నావా? చెప్పు.

కోదం:- [కాళ్ళమీద వాలుతూ] నన్ను చంపెయ్యకండి. మీ సహాయం మరిచిపోను. పిల్లలుగలవాడిని. మీకేం తోస్తే అదే యిప్పించండి. మీకు జన్మజన్మాలు బానిసనై పడివుంటాను. అనవసరంగా నాకు ఖర్చయిపోయింది. ఎట్లా చెప్పండి? అది నేను మళ్ళీ సంపాదించా లంటే నా తరం కాదు. కటాక్షించండి. మీకేం తోస్తే అదిప్పించండి, వెంటనే వెళ్ళిపోతాను.

చిదం.- [ఆలోచించి] వెంటనే పోతావు గదా!

కోదం:- ఒక్కనిమిషంకూడా మరి నిలబడను.

చిదం:- [పర్సుతీసి ఐదురూపాయల నోటు యిస్తూ] మాట్లాడకుండా ఇది తీసుకుపో...మరింకేమి వేధించకు వెళ్ళు మరేం బేరం సారం చెయ్యకు. వెళ్ళు వెళ్ళు.

కోదం:- [నోటు జేబులో పెట్టుకుంటూ, నీరసంగా] కానీండి, ఏం చేస్తాం... సెలవు [వెళ్తున్నాడు]

చిదం:- నీ కుక్కపిల్లనుగూడా తీసుకుపో మరచిపోయి ఇక్కడ వదలి పెట్టేవు గనక!

కోదం:- అదెక్కడ దొరికిందో అక్కడే వొదలిపెట్టాలంటే నాకు మళ్ళీ పది రూపాయల ఖర్చు...ఈ పక్క వీధిలో పారేస్తాను [వెళ్ళాడు]

చిదం:- ఏదో ఏడుపు—(కూలబడి) ష్, రామ రామ...ఒరే సీనూ...సీనూ... (సీను వచ్చాడు) వాడు పోయాడా?

సీను:- పోయాడుసార్, కుక్కపిల్లను తీసుకొనే పోయాడు సార్ !

చిదం:- ఇంతసేపూ నువ్వెక్కడ చస్తున్నావ్?

సీను:- చాపటం ఖర్మం ఏమిటండి-అవతల రూమని కుక్కపిల్లను అరిస్తున్నాను.

చిదం:- ఆ వెధవ కుక్కనే!

సీను:- ఏదో ఒకటి అలవాటయిపోయింది సాబ్-కుక్కతో ఆడుకోవటం!

చిదం:- చూశావా! వూరిమీద తిరిగి, ఆ దిక్కుమాలిన కుక్కపిల్లను తీసుకొచ్చి మనదేనంటాడు ఆ వెధవ! 'కాదురా పోరా యమధర్మరాజా' అంటే ప్రాణాలు పీక్కుని తిని ఐదురూపాయలు పట్టుకుపోయాడు!

సీను:- మీరు మరీనండి! ఆ మాత్రందానికి ఐదురూపాయలిచ్చేశారా! పెళ్ళి కోసం అడిగితే లేదన్నారు!

చిదం:- (చిరాగ్గా) ఇస్తానన్నాను కాదురా, ఇస్తానులే...(తలుపుతోసుకుని భీకరంగావున్న మనిషిఒకడు వచ్చాడు. అతనిపేరు చతుర్భుజం. చేతిలో కుక్క పిల్ల వుంది. దాని తోకకు గుడ్డముక్క చుట్టబడివుంది. రక్తం కారిన మరకలు ఆ గుడ్డమీద కనిపిస్తున్నై.)

చతు:- (కుక్కపిల్లను బల్లమీదపారేసి, సీరియస్‌గా) ఇదిగో మీ కుక్కపిల్ల-ఇవ్వండి నా నూటపదహారు రూపాయలు. వెంటనే ఇవ్వండి. (రుమాలుతో మొహం వొత్తుకున్నాడు.)

చిదం:- (తెల్లబోయి చూశాడు)

చతు:- అట్లా చూస్తారేం—తీసుకోండి మీ పిల్లను.

సీను:- (కుక్కను తీసి) ఇది మన రోజా కాదు సార్!

చతు:- నవ్వూరుకోవయ్యా—నీ కెందుకూ. ఇది మీ రోజా కాదూ? రోజా కాకపోతే దాని 'బాబు'!...త్వరగా యివ్వండి—వెళ్ళాలి.

సీను:- ఈ తోకకు రక్తం యేమిటి?

చతు:- ఏమిటో ఎవడి నడుగుతావ్-ఏమంది చిదంబరంగారూ - ఇవ్వండి పోవాలి!

చిదం:- ఎక్కడికి పోతారు?

చతు:- మా యింటికి—(తనను చూపుకుంటూ) చతుర్భుజంగారిల్లు అంటే అందరికీ తెలిసిందే!...కష్టపడి మీ కుక్కను వెతికి తీసుకొస్తే మర్యాదా మంచీ లేకుండా మాట్లాడతారేం—కమాన్-నా డబ్బు!

చిదం:- మీ కుక్కపిల్లను తీసుకెళ్ళండి. ఇది నాది కాదు.

చతు:- ఏమిటీ—కాదూ! మీ గుర్తుల ప్రకారం పొట్టితోకా, ఇదిగో పొట్టితోక!

సీను:- పొడుగు తోకుంటే కత్తితో తెగేసి పొట్టిచేశాడు సార్!

చతు:- నోరుముయ్యి! మనకా గతిపట్టలేదు. తిండిలేక ఆకలితో మాడిపోతూ, ఏమీ దొరక్కపోతే, అదే దాని తోకలో చిన్న ముక్క కొరుక్కు తినేసి వుంటుంది! ఇంకా నయం. నేను గనక కట్టు కట్టాను. ఆ తర్వాత తెల్లరంగు అన్నారు మొదట్లో ఇది తెల్లగానే వుండొచ్చు. బురదలో మట్టికొట్టుకొని ఇట్లా తయారయింది.

చిదం:- అసలది నా కుక్కపిల్లేకాదు, తీసుకెళ్ళండి.

చతు:- వాహ్వారే ఎత్తూ! మంచి ఎత్తు ఎత్తారు! ఏదీ (కుక్కను తీసుకుని, కూచుని) ఆ ఎత్తులేం మనదగ్గిర పనిచెయ్యవు. మర్యాదగా కుక్కను తెచ్చి యిస్తున్నాను. మర్యాదగా నా డబ్బివ్వండి.

చిదం:- (కోపంగా) ఇవ్వకపోతే ఏం చేస్తావయ్యా—తంతావా-కొడతావా-నరుకుతావా?

చతు:- ఎందుకవన్నీ! గోటితోపోయే వ్యవహారం...మీ కుక్కపిల్లను జాగ్రగా వుంచాలి. ఎక్కడ దానిచోటు? (బయటకు పోయి కుక్కను వుంచేసి, వచ్చి సీనుతో) గొలుసుతో కట్టేసిరావయ్యా-ఇట్లా చూస్తావేం దొంగ వెధవను చూసినట్టు! ...పో...(సీను భయంగా వెళ్ళాడు ఏమండీ మాట్లాడరేం?...

చిదం:- కుక్కపిల్ల పోయినమాట వాస్తవమే-దాని కోసం నేను బెంగ పెట్టుకున్నమాట వాస్తవమే - అది దొరికేదాకా నేను భోజనం ముట్టుకోనన్నదీ వాస్తవమే! ఐతే, ఇది నా కుక్కపిల్లకాదు. ఇంతకు పూర్వం ఇట్లాగే ఇద్దరొచ్చారు. అవి నా కుక్కపిల్లలు కావంటే వెళ్ళిపోయారు!

చతు:- నేనట్లా పోవల్సినవాడిని కాదండీ! ఈ కుక్కపిల్ల మీది కానప్పుడు నాకు దమ్మిడీ ఇవ్వద్దు 'మీదే' అని నిదర్శనాలు చూపించాను. అన్నీ సరిపోయినై...మీరు నా శ్రమ వుంచుకుంటే అనుభవిస్తారు.

చిదం:- ఇంకా ఎప్పుడో అనుభవించటంవాకా ఎందుకు – అనుభవిస్తూనే వున్నాను. (ఫోన్ మోగింది. చిదంబరం తీసి) ఎవరు?...ఆఁ.... ఏవయ్యా—లేదయ్యా! ఇద్దరు ముగ్గురొచ్చి చూపారుగాని, వాటిల్లో మనదిలేదు...నీకూ దొరకలేదా...చేస్తానలే, భోజనం మాటకేం— ఎట్లాగన్నా వెతికి పట్టుకో!...కొద్దిగా శ్రమపడు. అది లేకపోతే నాకు నిమిషం తోచదు...దొరికిన వెంటనే పిలిచి చెప్పు...ఆఁ.... (ఫోన్ వుంచి ఏదో గుర్తుకొచ్చినట్లు చరచరా లోపలికి పోయాడు. బయటనుంచి ఇళ్ళ కంట్రాక్టరు వచ్చాడు. వేషం మారివుంది. మీసాలు, తలపాగా వున్నయ్, భుజాన సంచీ వున్నది.)

కంట్రా:- చిదంబరంగారు లేరా?

చతు:- లేనట్టే—

కంట్రా:- అంటే?

చతు:- ఉన్నా, ఆయన ఎవరితోనూ ఇప్పుడు మాటాడరు. చాలా నిరుత్సాహంగా వున్నారు!

కంట్రా:- కుక్కపిల్ల దొరక్కేనా?

చతు.- దొరక్కేం—దొరికింది !

కంట్రా:- దొరికిందా?

చతు:- దొరికింది!

కంట్రా:- ఎట్లా దొరుకుతుంది? అదేదో ఇంకో పిల్ల ఐవుంటుంది. అసలు కుక్కమాత్రం అదికాదు.

చతు:- ఎవరయ్యా మీరు-వూరికే అట్లా మాట్లాడుతారు! అసలుకుక్క అది కాదంటే మీరేమన్నా చూశారా!...అసలు ఇంతకూ మీరేం పనిమీద వచ్చారు?

కంట్రా:- వారితో వ్యక్తిగతంగా పనుండి వచ్చాను-మీరెవరో తెలుసుకోవచ్చా?

చతు:- నేనా? నేనూ ఓ పనిమీద వచ్చాను. నా పని ఐనతర్వాత మీకొస్తే బావుంటుంది. అందాకా అవతల బెంచీ వుంది చూశారా—దానిమీద కూచోవచ్చు. ఏమీ అనర్థం!

[చిదంబరం వచ్చాడు]

చిదం:- (వస్తూనే కంట్రాక్టరును చూచి) ఎవరది?...ఏమిటయ్యా...నువ్వా వో కుక్కపిల్లను తీసుకొచ్చావా—వెళ్లు—నాకేం చూపించకు!

చతు:- అతను కుక్కపిల్లను తీసుకురాలేదండి!

కంట్రా:- తీసుకురాలేదూ—ఇంకా నయం!

చిదం:- తెచ్చావూ—వద్దులే పో...కుక్కపిల్లను నాకు చూపించకుండానే వెళ్లు

కంట్రా - మీ కుక్కే—సార్ ఇది! (సంచిలోంచి తియ్యబోయాడు.)

చిదం:- సంచిలో కూడా పెట్టావూ? తియ్యకు, నీకు పుణ్యం వుంటుంది. నా మాట వినండి, మిమ్మల్ని బ్రతిమాలుకుంటాను-వెళ్ళండి.

కంట్రా:- కుక్కపిల్లను చూడనన్నా చూడకుండా వెళ్ళమంటారేమిటండీ! ఇది మీ కుక్కపిల్లేనండీ!

చిదం:- అవును. నా కుక్కపిల్లే...కాలవప్రక్కను పొర్లుతూవుండే ప్రతీ. వెధవకుక్క నా రోజాయే. నా రోజా కాదంటే మీకు కోపం కూడా వస్తుంది. అదంతా ఎందుకు...మీరు ముందు దయచెయ్యండి ... వెళ్ళండి...(ముందుకొచ్చి తరమబోయాడు)

కంట్రా:- చూడండి సార్, ఇది మీదేనండి...(వెనక్కునడుస్తూ) మీ కుక్కే... పొట్టితోకా-తెల్లని రంగూ-

చిదం:- (ముందుకు నడుస్తూ) కోలముఖమూ, కుచ్చుతోకా అవును - అదే! అదే, నాకక్కర్లేదు వెళ్ళండి!

కంట్రా:- వినిపించుకోండి...చూడండి!

చతు:- వెళ్ళవయ్యా - వద్దో అంటూవుంటే వినిపించదూ? అదికాదు వారి కుక్కపిల్ల అవతల గుమ్మంలో వుంది చూసుకో!

కంట్రా:- (బయటకు వెళ్ళాడు)

చిదం:- (కుర్చీలో కూలబడ్డాడు)

చతు:- చెబుతూవుంటే వినిపించుకోకుండా ఒకటే గోల! కుక్కపిల్ల దొరికినాకూడా 'మీదే మీదే' అట. ఎక్కడ వూడిపడ్డాడో దయ్యంలా గా-

పాపం చాలా బాధపెట్టాడు మిమ్మల్ని ? (విసనకర్ర తీసుకొని విసురుతున్నారు)

కంట్రా:- (బయటనుంచి వచ్చాడు. చేతిలో అతను తెచ్చిన కుక్కపిల్ల వుంది. తలపాగా జారిపోయివుంది. వెనకనుంచి సీనుకూడా వచ్చాడు) అది మీ కుక్కపిల్ల కాదు సార్-ఇదిగో ఇదీ మీది

చిదం:- ఇదేమిటి మిమ్మల్ని చూసినట్టుంది. ఇళ్ళకు రిపేర్స్ చేసేవ్యక్తి ఎవరన్నా మీకు అన్నదమ్ముడా?

కంట్రా:- కాదండి-నేనే ఆ వ్యక్తిని!

చిదం:- ఇదొకటి. ఇదో మోసం!

కంట్రా:- కాదండి నేనేనండి ఆ కంట్రాక్టరును ఇంతకుముందే మీ దగ్గిర కొచ్చానుగా—మరచిపోయారా! ఇదిగో 'ఆర్డర్ బుక్' (సంచిలో చెయ్యిపెట్టి తియ్యబోయాడు)

చిదం:- మిమ్మల్ని కంట్రాక్టరు కాదని నేనేం అనలేదు. మీరు కంట్రాక్టరేకాని మీరు మరో వేషంలో వచ్చినందుకు మోసం అంటున్నాను.

కంట్రా:- అది ఊళ్ళోవాళ్ళు ఏమన్నా అనుకుంటారేమోనని గాని!......సరే ఇదిగో మీ కుక్కపిల్ల!

చిదం:- (చూసి) ఇందాకే చెప్పాను వెళ్ళమని! ఇది నాదికాదు - నన్ను మరి వేధించకండి!

కంట్రా:- మీదేసార్. జాగ్రత్తగా చూడండి! ఇదిగో తెల్లని రంగూ, ఇదిగో కోలముఖమూ-(సీనుతో) నువ్వు చూడబ్బాయ్!

సీను:- (తీసుకుని వేలితో తాకి) ఇది తెల్లనికుక్క కాదుసార్-నల్లకుక్క మీదే సున్నం పూశారు

కంట్రా:- సున్నం పూశారా — నువ్వు వళ్ళు దగ్గిరపెట్టుకునే మాటాడుతున్నావా—సున్నం పూశారట సున్నం ...... యిది మీదేనండి! ఇందాకా మీ దగ్గిర గుర్తులన్నీ తీసుకున్నాను. నా సాయశక్తులా వెతికి తీసుకొస్తానని చెప్పాను. తీసుకొచ్చాను, మీ కుక్కపిల్లను మీరు తీసుకొని నా డబ్బు నా కివ్వండి

చతు:- ఇంకా ఏం కుక్కపిల్లయ్యా? ఎక్కడ ఎత్తుకొచ్చావ్ దాన్ని. ఒరే అబ్బాయి. దాన్ని తీసుకెళ్ళి బయటపారేయ్. వూఁ చూస్తావేఁ పో (సీను కుక్కను తీసుకొని పోయాడు.)

కంట్రా:- ఒరే అబ్బాయ్! పారేశావంటే వుద్యోగం వూడిందనే లెక్కవేసుకో అది మీదే సార్! నేను అబద్ధం చెప్పటంలేదు

చిదం:- మీరు నిజమే చెబుతున్నారు. నేనే అబద్ధం ఆడుతున్నాను. నేను వట్టి మోసగాడిగాని. దొంగను-సరా-ఇహ దయచెయ్యండి (చరచరా లోపలికి పోయాడు)

చతు:- అవునయ్యా! నీకేం మతీ సుతీ లేదూ. ఊరిమీద తిరిగే ఆ చెత్త కుక్కపిల్లను తీసుకొచ్చి ఆయనదేనంటూ యివ్వజూపుతావా? మాంచి వాడివేనయ్యా!

కంట్రా:- అవతల కట్టివున్న కుక్కను నువ్వు తెచ్చావల్లేవుంది!

చతు:- కాక?

కంట్రా:- ఐతేమరి నువ్వు మోసంచేసి ఏదో కుక్కపిల్లను తెచ్చి ఆయనదే అని అంటగడుతున్నావ్. నిజంగా చెప్పు. అది ఆయన కుక్కా?

చతు:- నువ్వు నిజంగా చెప్పు, నువ్వు తెచ్చింది మాత్రం ఆయన కుక్కా?

కంట్రా:- నిజంగా నేను తెచ్చింది ఆయన కుక్కే. పోలికలు చూసుకో.

చతు:- నాదయ్యా అసలు కుక్క. నా మాట విని దాన్ని నువ్వు తీసుకు వెళ్లు! నామాట వినవా?

కంట్రా:- బావుంది నీతో నాకేమిటి మధ్య! ఏమండీ చిదంబరంగారూ! మీ కుక్కపిల్లను తీసుకుని బాబ్బాబూ! నా డబ్బిచ్చి పంపేద్దురూ!

చతు:- అయ్యా చిదంబరంగారూ! నేను వెళ్ళాలి. త్వరగా నా డబ్బివ్వండి!

కంట్రా:- అవతల అర్జంటు పనులున్నాయండీ అవన్నీ వదిలిపెట్టి వచ్చాను. (చతుర్భుజంతో) ప్రస్తుతం ఎనిమిది తొమ్మిదిళ్ళు మరమ్మత్తు చేయించాలి. చిదంబరంగారు కుక్కను తీసుకుంటే ఈ యిల్లు కూడా చెయ్యాలి. (పైకి చూస్తూ) నా డబ్బిచ్చేసి ఎంతకూ పంపరు.

చతు:- (చురచుర చూసి) నోట్లు లెక్కపెడుతున్నారేమో, కాస్సేపాగూ? లేకపోతేనూ నాదబ్బట 'నా దబ్బు!'

కంట్రా:- నాది దబ్బుకాదు. నీదే డబ్బు! నువ్వే తెచ్చావు కుక్కపిల్లను. (లేస్తూ లోపలకు చూస్తూ) చిదంబరంగారూ!

చతు:- చిదంబరంగారూ! (చరచర లోపలకు వెళ్ళారు. కంట్రాక్టరు కూడా వెనకాలే వెళ్ళాడు.)

చిదం: (ఆత్రుతగా లోపల్నుంచి వచ్చి కూర్చున్నాడు.)

చతు:- (వస్తూ) ఏమండి సార్! ఏమిటిది?

కంట్రా:- మీరు జాగ్రత్తగా పరీక్షించి మీ కుక్కను నిర్ణయించుకోండి సార్!

చతు:- నిర్ణయిస్తారుండవయ్యా, ఏమండీ...

చిదం:- ఏమిటి, ఏమిటి మీ వుద్దేశం? (మండిపోతూ) పోలీస్‌కు ఫోన్ చేస్తాను (లేవబోయాడు.)

చతు:- (కూచో పెడుతూ) ఆc, ఎందుకండీ అంతపని? ఈ మాత్రం దానికి వాళ్ళదాకా ఎందుకు!

చిదం:- ఎందుకేమిటి, లేకపోతే ఏమిటీ అల్లరి! ఇంకాస్సేపు పోతే పిల్లి పిల్లల్ని కూడా తెచ్చి 'మీ కుక్కేనండి' అంటారు పోతారా? పోలీసును పిలవమంటారా?

కంట్రా.- కూచోండిసార్! (ఫోన్ వెనక్కి జరిపి, పత్రిక కప్పాడు.)

చతు·- అయ్యా క్షమించండి. ఇది మీ కుక్కపిల్లకాదని మీ ఒక్కమాటతో కొట్టిపారేస్తే మేమెట్లా బతగ్గలం? మేం దొంగలంకాము, దోచుకోము. చాలా కష్టపడి వెతికి తెచ్చాము.

కంట్రా:- నేను చాలా కష్టపడ్డాను. మీరు కనిపెట్టండి ఎవరిదెంత కష్టమో!

చిదం:- మీ కష్టాలమాట దేవుడెరుగు నన్ను నానా కష్టాలు పెట్టి, ఇంతా అంతా బాధ పెడుతున్నారా మీరు! ష్ ఏం గోలవచ్చిందిరా భగవంతుడా! వెధవకుక్క నేరక తప్పింది. సీనూ, సీనూ, పోతేపోయింది కుక్కపిల్ల, నాకు మరి అక్కర్లేదు. మీరిద్దరూ వెళ్తారా వెళ్ళరా? (లేచాడు.)

చతు:- తమరు ఒక కంట చూడాలి! లేకపోతే చచ్చిపోతాను.

చిదం - ఏమంటావయితే?

కంట్రా:- అనటానికేముందండీ, ఏదో మా శ్రమకుతగ్గ ప్రతిఫలం...

చిదం:- (సీరియస్‌గా, విసుగ్గాచూసి పర్సుతీసి ఐదు రూపాయలనోటు యిస్తూ) వెళ్ళండి, మాట్లాడకండి (ఇద్దరూ సంశయిస్తూ ఒకరి మొహం ఒకరు చూసుకుంటున్నారు. చిదంబరం ఈ పాటికే పూర్తిగా విసిగిపోయి వున్నాడు ఆయాసపడుతున్నాడు. విసుగూ, కోపం హెచ్చిపోయినవై) చాలదూ! తీసుకోండి. పర్సులో వున్నది ఇదే! గుల్లచెయ్యండి, పొండి, (రెండయిదులూ ఒకడికిచ్చి, 10 రూపాయల నోటు ఇంకోడికిచ్చి పర్సుదులిపాడు.) పొండి, మీ కుక్కలూవద్దు నక్కలూవద్దు. వెళ్ళరేం! (ఇద్దరూ నడుస్తున్నారు. కంట్రాక్టరు ఆగి, వెనక్కితిరిగి యింటికప్పుకేసి చూస్తూ జాలిగా చిదంబరాన్ని చూశాడు. చిదంబరం కూడా చూసి నుదుటిమీద కొట్టుకుని కూల బడ్డాడు. ఇద్దరూ పోయారు.)

చిదం:- (తేరుకుని) సీనూ, (గట్టిగా) సీనూ, (చూస్తూ) దిక్కుమాలిన వెధవ, దిక్కుమాలిన వెధవా అ..!

సీను:- (రొప్పుతూ వచ్చి) అదెవ కోసార్ అవతల, నించున్నాడు. కాదంటే వినడు, పేద్దకుక్కను తీసుకొచ్చి మనదేనంటాడు ఎంత పొమ్మన్నా పోడు'

చిదం:- (చటుక్కున లేచి, ఆత్రంతగా) చంపావ్‌రా, ఏడీ! వస్తున్నాడా కొంపతీసి! నువ్వు త్వరగా ఆ తలుపు వెయ్. గడియవేసెయ్! (నమస్కరిస్తూ) అక్కర్లేదు, కుక్కపిల్ల అక్కర్లేదు, ప్రాణాంతో మరి వుండనిచ్చేట్టు లేదు. (సీను తలుపువేసి వచ్చాడు.) చూడూ, కాస్సేపు పోయినతర్వాత వెళ్ళి 'కుక్కపిల్ల దొరికింది' అని రాసి బోర్డు గుమ్మానికి కట్టు!

సీను:- దొరికిందా సార్? (సంతోషంగా.)

చిదం:- కట్టరా వెర్రిపీనుగా, బాగ దొరికావ్!

సీను:- (ఇంట్లోకి పోయాడు.)

చిదం:- (ఫోన్‌తీసి విసుగ్గానే) హలో...ఆఁ...ఎడిటర్‌గారున్నారా—మీరేనా ...సరే చూడండి...'కుక్కపిల్ల కనబడుటలేదు' అని ఈరోజు మీ పత్రికలో ప్రకటన వేశారు. ఆఁ, ఆఁ...ఆ ప్రకటన నేనే యిచ్చాను. అవును చిదంబరాన్నే...ఈ రోజు పేపర్లో ఆ 'కనబడుటలేదు'అన్న చోట కుక్క పిల్ల 'దొరికింది' అని వెయ్యండి! అవును దొరికింది. ఎవరో తెచ్చియిచ్చారు ధర్మాత్ములు. బాబ్బాబూ...వెంటనే వేసి పెట్టండి! 'కుక్కపిల్ల దొరికింది' అని పెద్దక్షరాలలో వేసి 'ఫలానా చిదంబరంగారి పోయిన కుక్కపిల్ల దొరికింది' అని వెయ్యండి. దొరికిందని వెయ్యటం ఎందుకంటారా? వెయ్యండి, నా స్నేహితులు చాలా మంది ఆతురత పడుతున్నారు. దొరికిందంటే సంతోషిస్తారు. ఎంత డబ్బయినాసరే పంపిస్తున్నాను. దొరికిందని మాత్రం వెంటనే వెయ్యండి. థాంక్స్.

[ఫోన్ క్రిందపెట్టి, నిస్సారంగా కుర్చీలో కూలబడ్డాడు. సీను లోపల్నుంచి ఒక బల్లమీద పెద్ద అక్షరాలలో 'కుక్కపిల్ల దొరికింది' అని రాసి ఆ బల్లపట్టుకుని, వీధివేపు పోతూ వుండగా తెర]



## పాత్రలు

పురుషుడు
స్త్రీ
శిశువు

ప్రశ్నలు :

ఎవ్వరూ కనీ వినీ ఎరుగని, ఏనాడూ ఊహించని ఒక భయంకర మారణ సంగ్రామం చెలరేగి చరాచర ప్రకృతిని స్తంభింప జేస్తే ?—

అందులో నరులూ, నాగరికత సమూలంగా నాశనమైతే?—

మానవ యుగాంతవేళ ప్రారంభమైతే ?

[ ప్రపంచంలో ఏదో ఒక ప్రాంతంలో ఒక శిథిలమైన ఇంటిలో- గతానుభవాల వ్యాధులతో కుములుతున్న ఒక వృద్ధుడు; నవయౌవనావేశంతో పొంగిపోతున్న యువతి, ఒక బోసినోటి పసిపాప ఇంకా బ్రతుకీన్చడానికి యాతన పడుతున్నారు. వెనక చీలిన గోడలోనుంచి, బయట దిక్చక్రంవరకూ భూతాలవంటి మేఘాలతో దట్టంగా నిండిన ఆకాశం కింద; కూలిన భవనాలు, విమానాలు, అస్థిపంజరాలు కన్పిస్తున్నాయి. వాటిలోనుంచి అస్తమయ సూర్యుడు ఏడ్చిఏడ్చి కందిన పసిపాప ముఖంతో దీనంగా ఎర్రగా వాలుతున్నాడు— ఇంటిలో కొయ్యముక్కలతో అమర్చిన బల్లమీద సగం పగిలిన రేడియో ఒకటుంది- దానికి ఇరుప్రక్కల ఒక విరిగిన బెంచీ, ఒక విరిగిన కుర్చీ వున్నాయి-

బల్లమీద ఎర్ర సిరా బుడ్డిలో కలం ముంచుతూ వృద్ధుడు తదేక ధ్యానంతో ఏదో వ్రాస్తున్నాడు.

దూరంగా, అతిదూరంగా, ఏవో గద్గద కంఠాల కరుణాత్మక సంగీతం ప్రారంభమవుతుంది-]

ఇదిగో ఇదిగో హెచ్చరిక !
అవని కిదే మా హెచ్చరిక !
అందరికీ తుది హెచ్చరిక !
అనంతకాలపు అంతరాత్మలో
అంకురించినా ప్రాణ కిరణమే

ఆవరించే నీ శోకపు జెల్లలు !
ఆశించెను మహదనంత సీమలు !
నరులకు శత్రువు ప్రచండ మృత్యువు
ప్రపంచమే బలిచేసిన నాడు
నేలకు వాలిన నిండు ప్రాణులం
జీవం విడువని అంతరాత్మలం !

విసండి ఇది మా హెచ్చరిక !
విశ్వానికి తుది హెచ్చరిక !

మానవులారా! మొలకెత్తండి!
దశ దిశలా తలయెత్తండి!
శాంతిసౌఖ్యం సౌభాగ్యాలతో
జగతిని హాయిగ వర్ధిల్లండి
ఆద్యంతాలే లేని మహాద్భుత
మానవోత్సవం సాగించండి.
నిండుగ హాయిగ జీవించండి
నిత్యం సత్యం స్థాపించండి
మృత్యువు మర్మం ఛేదించండి

ఇదిగో ఇదిగో హెచ్చరిక!
అవని కిదే మా హెచ్చరిక!
అందరికీ తుది హెచ్చరిక !

పురు:- [ఆ గానం వింటూ భయపడుతూ లేస్తాడు] ఏమిటా సంగీతం! మళ్ళీ విన్పిస్తోంది? శ్రీమతీ శ్రీమతీ! నిన్నే! ఏమిటా సంగీతం! నిన్నే...

శ్రీమతి:- [లోపలినుంచి వచ్చి] ఏమిటా కేకలు! ఊరుకోండి. పాప నిద్ర పోతున్నాడు.

పు:- అదిగో, ఎక్కడిదా సంగీతం? అబ్బబ్బ! రాత్రింబగళ్ళు నన్ను వేధిస్తోంది. ఎవరిదా మరణఘోష !

శ్రీ:- ఏమిటలా వణికిపోతారు! (జాలిగా నవ్వుతూ) ఏమిటీ వెర్రి భయం! లోకమంతా శిథిలాలతో, శవాలతో, శ్మశానంగా మారినా మీకింకా భయమేనా?

పురు:- నేను భరించలేను. శ్రీమతి! అదీ... ఆ పాపానికి బాధ్యత నాదే అయినట్టు... నాకు గతమంతా జ్ఞాపకం వస్తోంది. నన్ను బాధిస్తోంది. అబ్బా! ఎవరు వాళ్లు?

శ్రీ:- (అతనివంక చూడకుండానే) ఏవో పనులు చూసుకుంటూ) మీరే అన్నారుగా, అది అంతరాత్మల ఆక్రందనమని.

పు:- అది నిజమేనా? సంగ్రామ సంక్షోభంలో చితికిన అంతరాత్మల ఆవేదనేనా అది?

శ్రీ:- అవును. ఆదర్శం నశించిన అంతరాత్మల ఆక్రందనం.

పు:- అబ్బ! యుద్ధం ముగిసిన మరుక్షణం నుంచీ నన్ను మేలుకువలో, నిద్రలో ఎందుకిలా వేధిస్తుంది? ఇది నాకు శాపమా? శిక్షా? (సంగీతం ఆగిపోయింది.)

శ్రీ:- (కొంచెం నిర్లక్ష్యంగా) ఏదైనా సరే, మీరు అనుభవించవలసిందే!

పు:- తప్పదా ?

శ్రీ:- (నిశ్చయంతో) ఎలా తప్పుతుంది?

పు:- ఏమిటి శ్రీమతీ! నాకంటె ఇంత చిన్నదానివి ఇంత కాఠిన్యం నీకెలా వచ్చింది?

శ్రీ:- (అతని కెదురు నిలిచి) ఎందుకురాదూ! తల్లిని; జీవితాన్ని రక్తంతో పోషించే తల్లిని; ఇంత విధ్వంసం చూసిన తర్వాత ఇంకా కరుణ ఎలా వుంటుంది? పురుషుల పుణ్యఫలం ఇది. స్త్రీలు పెంచి, లాలించి, పోషిస్తే పురుషులు సాధించిందిదే-విధ్వంసం.

పు:- (లాలిస్తూ) శ్రీమతీ! చూడు, ఎందుకంత ద్వేషం? రా, అంతా మళ్ళీ మార్చి వ్రాశాను. విను.

శ్రీ:- ఇదంతా ఏమిటి? దేనితో వ్రాశారు?

పు:- అక్కడొక లేడిపిల్ల కన్పిస్తే చంపాను.

శ్రీ:- (అతి జాలిగా) పాపం! ఇదంతా ఆ పసిలేడి లేత రక్తమా? చంపారా ? దాన్నికూడా చంపేశారా ? (తన కోపాన్ని అణచు కొంటూ) ఒక ప్రశ్న అడుగుతాను. సమాధానం చెపుతారా?

పు:- అడుగు. తప్పకుండా అడుగు. నీవూ, నేనూ తప్ప ఈ లోక వేదిక మీద ఎవరున్నారు?

శ్రీ:- (గాద్గదికంగా ఎన్నో ఏళ్ళ నుండి దాచుకున్న బాధను వెలిబుచ్చు తున్నట్లు) మానవుడు చేసిందేమిటి? మీ ఆహారం కోసం, మీ ఆద ర్శాల కోసం ఆది యుగంనుండి అంతిమ కాలంవరకు ప్రతిదాన్ని పరిమార్చారే! మీకేం హక్కుంది? (కోపంతో) ఎవరు మీరు?

పు:- (లేనిధైర్యం తెచ్చిపెట్టుకుని గర్వం నటిస్తూ) శ్రీమతీ! ఆ ప్రశ్న వెయ్యకు. లోకంలో ఒక మహోన్నత నాగరికతను నిర్మించడానికి, ప్రాణమైనా, పాషాణమైనా, ఏది అడ్డువచ్చినా సరే నిర్దాక్షిణ్యంగా వధించాము. మా ఆదర్శం గొప్పది. మా మానవ సంస్కృతిని...

శ్రీ:- (వెగటుగా) హుం! ఈ భూగోళాన్ని బూడిద ముద్దగా మార్చడమా మీ సంస్కృతి? చూడండి. ఇప్పుడేమైంది? లోకమంతటా నేలకూలిన నగరాలు ఆల్లాడే ప్రాణాలు వదిలిన పసిబిడ్డలూ...ఛీ! అన్నీ నాశన మైపోయాయి. కాని మీ అహంకారం మాత్రం అంతం కాలేదు.

పు:- (సిగ్గుపడుతూ తన దైన్యస్థితి వెంటనే జ్ఞాపకం వచ్చి) అవును, శ్రీమతీ! అవును. నా దుఃఖం నీకేం అర్థమౌతుంది? ఆనాటి సంస్కృతి, సంగీతం, సంతోషం, అన్నీ నాశనమైపోయాయి. అబ్బా! దగ్ధమైపోతున్న నగరాలు; స్త్రీలు, శిశువులు! ఆ మరణ ఘోషలు, ఆ మనుషుల అంతిమకాలంలో ఎంత ఆల్లాడిపోయారో! (వణికిపోతూ) నా గుండె జలదరిస్తోంది. భయంకర మృత్యువు నోట పడి విలవిలలాడే శిశువీ ఘోరం ఇప్పుడిది విషకిరణాల పంజరం. భూమాత గుండె చెదిరిపోయింది గంట గంటకూ భూకంపం, రాత్రిం బగళ్ళు తుఫాను. (భయపడుతూ ఆమె దగ్గరగా వచ్చి, ఆసరాగా

ఆమెను పట్టుకుని) మనం ఒంటరిగా ఎలా బ్రతుకుతామో, ఎన్నాళ్ళు బ్రతుకుతామో! ఇది విను. ఇది మన ఆశాస్వప్నం! ఆదర్శజ్యోతి!

శ్రీ:- తర్వాత చదువుదాం. ఇవాళైనా పాలకోసం వెతికిరండి. మళ్ళీ పాప నిద్రలేస్తాడు.

పు:- తెస్తానుగా! తప్పకుండా ఎంత దూరమైనా వెళ్ళి పాలు తెస్తా శ్రీమతీ! విను; వాణ్ణి గురించి గూడా వ్రాశాను.

శ్రీ:- (ఆతురతగా) అలాగా? ఏదీ చదవండి!

పు:- (గర్వంగా ఒక ప్రకటన చదినట్టు) ఆగామి మానవులకు ఆదిదంపతుల శుభాభివందనాలు. మానవులారా! సహజంగానో అసహజంగానో ఈ భూమి మీద ప్రాణం ఉదయించించి.

శ్రీ:- ఉదయించడం సహజమే; ఈ అస్తమయమే అపహాస్యంగా వుంది.

పు:- (ఆమెవంక చూసి ఏమీ అనలేక మళ్ళీ చదువుతాడు) క్రమక్రమంగా అనేక శతసహస్ర శతాబ్దాలు గడిచి మానవుడు పెంపొందాడు. బాహ్యలోకాన్ని, మనోలోకాన్ని పూర్తిగా తన వశం చేసుకోడానికి ప్రయత్నించాడు. ఆ మహాయత్నం ప్రారంభం కాకముందే అంతః కలహాలు బయలుదేరాయి.

శ్రీ:- త్వరగా చదవండి. మూడు రోజుల్నుంచీ పసిపాప ఆకలితో నీరసమై పోతున్నాడు.

పు:- (ప్రాధేయపడుతూ) విను శ్రీమతీ; ఇది మన వీలునామా! "మానవునిలో అహంభావం వ్యాపించి, అసాధ్యాలు సాధిస్తానని గర్వించి, కన్నూ మిన్నెరుగక, తన మృత్యువును తనే సృష్టించుకున్నాడు. దీనంతటికీ కారణం- అవిభక్త మానవ కుటుంబం రెండుగా చీలి, మారణ యుద్ధం సాగించడం. ఆ ప్రచండ సంగ్రామంలో సృష్టించిన హైడ్రోజెన్ బాంబుల వంటి మారణాస్త్రాలు, మానవవృక్షాన్నే సమూలంగా నాశనం చేశాయి. అన్నిటికంటే భయంకరమైనది మృత్యు ఫిరంగి. దాని పేరే రాడార్ కానన్. లోకంలో మనిషి ఎక్కడున్నాసరే, అతని రక్తనాళ స్పందనను అది పసికడుతుంది.

ఎన్నివేలమైళ్లు అయినాసరే, తనంతతాను నిరాఘాటంగా ప్రయాణం చేసి వెళ్ళి వెంటాడి వేటాడి హతమారుస్తుంది. మానవుడు అంతిమ దశలో తయారు చేసిన మారణాయుధం అవి. యుద్ధం ముగిసిన తర్వాత ప్రాణాలతో మిగిలిన ప్రజలందరినీ. ఆ మృత్యుకిరంగులే హత్య చేశాయి. (అతి దీనంగా) అందరూ-అందరూ చనిపోయారు. అద్భుతమైన మానవ జీవితం అంతమయింది, అందరూ అపరాధులే. అందరూ తమ శిక్ష ననుభవించారు.

శ్రీ:- (ఉద్వేగంతో) చదవండి. దిగులుపడి ఏం చేస్తాం?

పు:- (ఆమె వంక చూసి అవునన్నట్లు తల పంకించి) ఇది మన క్షమా పత్రం శ్రీమతి!

శ్రీ:- అంతే కాదు; ఆదేశం కూడా చదవండి.

పు:- మేమే చరిత్రలో తుది దంపతులం. ఆగామి మానవులారా! మీ తల్లి దండ్రులం మేమే. మమ్మల్ని క్షమించండి. పరితాపాగ్నిలో మా పాపం భస్మమైపోయింది. మమ్మల్ని క్షమించండి మీరు పెంపొందాలనీ, తిరిగి లోకాన్ని పునరుద్ధరించాలనీ, పూర్వ మహోన్నతిని మళ్ళీ నిర్మించాలనీ ప్రార్థిస్తున్నాం! మా పసిబిడ్డకు మా ప్రాణాలు రంగరించిపోస్తున్నాం. పెంచి పెద్దవాణ్ణి చేస్తున్నాం. ఈ పసిబిడ్డే మీకు మూలపురుషుడు! ఎక్కడో ఒక చోట వెతికి తెచ్చి ఇతనికి ఒక సుందరాంగిని వివాహం చేస్తాం. మా ధర్మం మేము నెరవేర్చుతాం, వారు సంతానం కంటారు. చరిత్ర మళ్ళీ ప్రారంభమవుతుంది. మళ్ళీ లోకమంతా మానవ వదనాలతో కళ కళ లాడుతుంది. మానవ జీవితం మహా ప్రవాహంగా సాగుతుంది. మానవుడు అమరుడు. ఇదే మీకు మా శుభాభివందనాలు.''

శ్రీ:- (సంతోషంతో కన్నీరు తుడుచుకుంటూ) ఎంత బాగుంది. ఇదంతా నిజంగా జరుగుతుందా?

పు:- తప్పకుండా. ఆ అనంతకాలం చివరి అద్భుత మానవుడు మన అభివందనా లందుకుంటాడు (లేస్తూ ఆమెను కౌగిలించుకోబోతూ)

మన కల నిజమవుతుంది నిర్జీవమైన ఈ బూడిదలోంచి నిర్మలమైన మానవ పుష్పం ఉదయిస్తుంది. ఆ మానవత్వ పరిమళం, ఆ సుందర వదన కాంతి ఈ గోళాన్ని ముంచెత్తుతాయి. నవ్వులతో, కేరింతలతో, నృత్యం చేసే మానవులతో, మన మాతృగోళం విశ్వాంత రాళంలో సగర్వంగా విహరిస్తుంది. ఈ విశాల విశ్వానికి చక్రవర్తి మన పాప! ఎందుకిలా పులకించి పోతున్నావ్!

శ్రీ:- (ఉద్వేగంతో పూర్తిగా తన్మయమైపోయి) మనిద్దరం కలిసే వుందాం ఈ విషాదం మరచిపోదాం. నీవు నిజమైన భర్తవు.

పు.- (ఆ మాటకు పరవశమైపోయి) నీవు... నీవు... నీవు నిర్మలమైన భార్యవు శ్రీమతీ! నేను వృద్ధుణ్ణి. నా అంతరాత్మ గతజీవుల తప్పి దాలతో చితికిపోయింది. కాని నీవు యువతివి, పడుచు రక్తం పొంగెత్తుతూ పచ్చని తోటల్లో వెన్నెల కాంతుల్లో విశృంఖలంగా విహరించాలని కలలుగనే యువతివి. నీ ఆశ ఫలిస్తుంది మన రక్తం మానవదేహాల్లో శాశ్వతంగా ప్రవహిస్తుంది మన స్వప్నం మానవ జీవితాలలో శాశ్వతంగా రూపొందుతుంది మన ఆశ మన ఆనందం, ఆదర్శం నిరంతరం మానవ హృదయాల్లో స్పందిస్తాయి. మనిద్దరం కలిసివుందాం. మన ధర్మం. ఇది మన ధర్మం. (పెద్ద తుపాను గాలి వీస్తుంది. మెరుపులూ వురుములూ ఆకాశాన్ని ఆవరిస్తాయి సాయంత్రపు సూర్యకాంతి ఎర్రగా గదిలోకి వచ్చి పడుతుంది. తర్వాత చివరివరకు క్రమంగా సూర్యాస్తమయం కనిపిస్తుంది)

శ్రీ:- (భయంతో) అదిగో ఉరుముతుందే? తుపాను లాగుందే? (బిడ్డ యేడుపు వినిపిస్తుంది) మన పాప లేచాడు; పాపం! రెండు రోజుల నుంచి పాలులేవు. ఇవాళన్నా వెళ్ళి రండి.

(ఆమె లోపలికి వెళుతుంది)

పు:- వెదకా తప్పకుండా. ఏదో ఒక జంతువు బ్రతికుంటే చాలు; పాలు తెస్తా; పోషిస్తాం శ్రీమతీ!

(డ్రాయరు సొరుగు తెరిచి చూసి జాగ్రత్తగా వున్నది గదా అని మనస్సు స్తిమిత పర్చుకుంటాడు) ఏదీ తీసుకురా, పాపను. తీసుకురా చూద్దాం.

శ్రీ.- (బిడ్డ నెత్తుకొని వస్తుంది)చూడండి,ఆకలివల్ల ఎంత నీరసమైపోయాడో. వెళ్ళిరండి.

పు:- అయితే ఇవాళ ఆహారం ఎలా మనకు? నేనీ ఆకు అలముా తిని వుండ లేను. నాలో ఓపికలేదు. శక్తిలేదు,

శ్రీ:- ఏం చెయ్యగలం. యిద్దరం కృశించిపోతున్నాంగా.

పు:- చూడు (పావురాన్ని చూపిస్తూ) చాలా అందంగా వుంది గదూ. అది చాలా రుచిగా వుంటుందనేవారు- నిజమేనేమో.

శ్రీ:- (విసుగుపడుతూ) ఎన్నిసార్లు అడుగుతారు. ఎన్నిసార్లు కాదని పించుకుంటారు. మీ పురుషులంతా పుట్టుకతోనే కసాయి వాళ్ళను కుంటా. మీకు తెలియదూ అదే నాకు మనశ్శాంతి కలిగించే అమృత మూర్తి.

పు:- ఏం చేస్తాం మరి! ప్రాణముంటే గదా మనశ్శాంతి. మరి ఎలా బ్రతు కుతాం. బయట ఎంత వెతికినా అస్థి పంజరాలు తప్ప ఏమీ కన్పించడంలేదు: నువ్వు పాలివ్వడానికి యిష్టపడితే నాకీ యాతనంతా వుండదు కదా?

శ్రీ:- (తప్పనిసరై తలవంచుకుని చెప్పేస్తుంది) వాడి పుట్టుక నాటి నుంచి ఒక్క చుక్క పాలు కూడా యివ్వలేదు.

పు:- ఏం? ఎందుకని?

శ్రీ:- (సిగ్గుపడుతూ) ఏం చెప్పను. పాలు లేవు. మొదటి నుంచీ లేవు.

పు:- పర్వాలేదు. శ్రీమతీ, నేను వెతుకుతా... ఎంత దూరమైనా పర్వా లేదు. మన పాపకోసం ప్రాణమైనా యిస్తా.

(తమ పరిస్థితికి తామే ఆశ్చర్యపడుతారు ఇద్దరు. ఈ లోకంలో బిడ్డ ఏమైపోతుందోనని యిద్దరికి భయమే.)

(చెప్పులు తెల్లగా వుంటాయి. ఆమె విడుస్తుంది. అతను తొడుక్కొని వెళ్ళిపోతూ మళ్ళీ తిరిగి వచ్చి)

పు:- చూడు. ఇదిగో, ఆ డ్రాయరు తెరిచేవు సుమా ?

శ్రీ:- ఎందుకు ప్రతీసారీ చెపుతారు! అందులో యేముంది?

పు:- అదంతా నీకెందుకు? ప్రతి విషయంలోనూ నీ మాట పాటిస్తున్నా! ఇదొక్కటే నా కోరిక. ఇది నా ఆజ్ఞ.

శ్రీ:- ప్రతిసారీ అదేనా సమాధానం?

పు:- అవును. (పావురాన్ని చూపిస్తూ) ఇది నీకెంత అవసరమో? అందులోనివి నాకంత ముఖ్యం రేడియో జాగ్రత్త. అది పొరపాటున పలికినా వినొద్దు. సరేనా?

శ్రీ:- వినడమా? ఎవరున్నారు? ఎక్కడున్నారు వినడానికి! మీ భయం చావదు. ఎవరో ఎక్కడోవుండి మాట్లాడితే అది రేడియోలో వినిపిస్తే! అప్పుడెక్కడో వున్న రేడియో గన్ మీకోసం వెతుకుతూ వస్తూందా ఏం?

పు:- శ్రీమతీ! నీకర్థంకాదు. మన పాపకోసమైనా జాగ్రత్తగా వుండాలి గదా.

శ్రీ:- (వెగటుగా నవ్వుతూ) ఇంకా ప్రపంచంలో మనుష్యులున్నారంటారా?

పు:- (అనుమానంగా) లే...రనుకో!

శ్రీ:- నమ్మకమేనా?

పు:- (సమాధానం చెప్పలేక ఆగి) నమ్మక ఏంచేస్తాం? (వెళ్తాడు)

శ్రీ:- (అతను వెళ్ళినవైపుచూస్తూ అవ్యక్తంగా) వెళ్ళిరాపో! పిరికివాడా! పో! కారడవుల్లో తిరిగే ఆదిమానవుడు గూడా ఇలాగే భయపడి బెదిరిపోయాడా! ఇలాగే తిండికోసం వేటకు వెళుతూ భార్యాబిడ్డలేమౌతారోనని గడగడ వణికి పోయాడా? (ఆశ్చర్యంతో తలపంకిస్తూ) జీవితం ఎంత అద్భుతంగా ప్రారంభమయిందో, ఎంత హాస్యాస్పదంగా పరిణమించిందో! (బిడ్డవంక తదేకదీక్షతో పొంగిపొరలుతున్న ప్రేమతో బిడ్డకు అర్థంకాదని తెలిసికూడా ఎంతో జాలిగా పలకరిస్తుంది) నిద్రపోతున్నావా? నీకెవ్వరు లేకపోయినా ఏమీ భయం లేదు. నేనున్నాను. మీ నాన్న వున్నారు. నువ్వే మా మోహాలమొలక,

మా ముద్దుల చిలక. పిచ్చితండ్రి. ఎంత అందంగా నవ్వుతావురా? నీ నవ్వుతో నా మనస్సులో అమృతం కురుస్తుంది నాన్నా! ఏమిటాపిచ్చి నవ్వు? కల వచ్చిందా నాన్నా! చక్కని కల వచ్చిందా! యీ లోకం నీ యిల్లయి, నువ్వు సుఖంగా ఓ యింటివాడివై, భార్యతో కాపురం చేస్తూ, బండెడు సంసారంతో నీ కొడుకులూ, కూతుళ్ళూ, అల్లుళ్ళూ, కోడళ్ళూ, మనుమలూ, మునిమనుమలూ! ఈ లోకం నీ యిల్లయి, ఇల్లంతా పిల్లలతో కిలకిలలాడుతూ సంతోషంతో నువ్వు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, పూలతోటలో పచార్లు చేస్తూన్నట్లు కల వచ్చిందా. నాన్నా! చల్లని కల వచ్చిందా, నాన్నా! నా మాట వినవూ? వద్దు నాన్నా! మళ్ళీరోషాలు, కలహాలు, కుట్రలు, కదనాలు వొద్దు, వొద్దు. నా సంతానం సంతోషపుటుయ్యాలలో సల్లాపాలాడుకుంటూ హాయిగా పాడుకుంటూ ఆడుకుంటూ. కల వచ్చిందా నాన్నా! నాచిట్టి, నా చిన్నీ, నిద్రపో, నిద్రపో. (బిడ్డను చేతుల్లోనే వూపుతూ పాడుతూ నిద్రబుచ్చుతుంది)

మా కంటివెలుగా।
మా యింటి దీపమా।
నిదురించు హాయిగా।
మా యింద్రచాపమా।
గతమంత నీ జాలి కన్నీటిజాలులే।
ఇలలోన నీ కలలు నిజములై తీరులే।
బ్రతుకు పెంపొందులే, జీవితమె విందులే।
నిండుగా హాయిగా నిదురించవోయీ।
భువి నుదుట నీ ముద్దు తిలకమద్దునులే।
నీ చలువ చూపులే మాంగల్యమౌనులే।
నవ యౌవనాంగి ఈ అవని నీ అర్ధాంగి।
నిండుగా హాయిగా నిదురించవోయీ।
దివ్యమూర్తీ! విశ్వమందు జీవితమే।
ఆద్యంతములులేని ఆనందనృత్యమే।

మా కంటివెలుగా! మా యింటి దీపమా।
నిండుగా హాయిగా నిదురించవోయీ।

మళ్ళీ నవ్వుతున్నావా? అంతా నిద్రలో! ఏమిట్రా నీనవ్వు? పిచ్చి నవ్వు! (పాపను తనివితీర ముద్దుపెట్టుకుంటుంది. హఠాత్తుగా రేడియోలో లైటు వెలుగుతుంది. అందులోంచి ఒక గొంతుక భయంతో ఉన్మాదిలాగా కేకలు పెడ్తుంది)

గొంతుక:- ఎవరు? ఎవరు? లోకంలో ఎవరైనా ఎక్కడైనా వున్నారా? వినండి! వినండి! నేను ఉత్తరాగ్రంనుండి పిలుస్తున్నా. సముద్రం పొంగుతుంది. భయంకరమైన తుఫాను చెలరేగుతుంది. భూమ్యాకాశాలు సిటితో ఇసుకతో మూసుకుపోయినై-అబ్బబ్బ, యేమిటది? మీకు వినిపిస్తుందా? అది రేడియో ఫిరంగి. అవును. వస్తుంది. ఓహో! యేమి జీవితం. ఇటు ప్రళయంగా పొంగెత్తివచ్చే మహాసముద్రం, అటు భయంకరంగా పరుగెత్తి వస్తున్న ఘోర మృత్యువు. మానవుడా! ఇది నా తుది హెచ్చరిక! వస్తుంది. రేడియో ఫిరంగి వస్తుంది. ఆ, వదలవద్దు ఆయువు నిలుపుకో! అమరత్వం సాధించు, మృత్యువును జయించు. ఇది నా తుది విజ్ఞప్తి. ఇది నా తుది హెచ్చరిక హెచ్చరిక. హెచ్చరిక. (పెద్దకేక. ఆ స్వరం హఠాత్తుగా ఆగిపోతుంది. ఇంతసేపు బిడ్డ నిద్రపోతుంది. ఆమె భయంతో గజ గజ వణికిపోతుంది. బిడ్డనెత్తుకొని భద్రంగా గాఢంగా కౌగలించుకొంటున్నది. ధ్వని ఆగగా ఆమె కన్నీరు తుడుచుకుంటుంది. బిడ్డ వంక చూస్తుంది. బిడ్డ స్పర్శలో శీతలం కమ్మినట్లు గ్రహించి హడలిపోతుంది. ఏడుస్తూ మాట్లాడుతుంది)

స్త్రీ:- ఏమిటిది, వొళ్ళంతా ఇలా చల్లబడిందేమిటి? ఏమిటి నాన్నా! నావంక చూడు. అమ్మో, శీతలంకమ్మిందే నాన్నా, నాన్నా! (బిడ్డను వెచ్చ చెయ్యాలని కాగితాలకోసం గది అంతా వెతుకుతుంది దొరకవు. తర్వాత జ్ఞాపకంవచ్చి సొరుగు తెరుస్తుంది దానినిండా నోట్లకట్టలు చూసి నిశ్చేష్ఠురాలౌతుంది.)

డబ్బు! అమ్మో! డబ్బు! డబ్బు! దాచిపెట్టాడు నాన్నా! ఎందుకీడబ్బు నాన్నా! ఎందుకీడబ్బు అంతా, మూర్ఖుడు, కొనవూపిరితో కొట్టు కుంటున్న ప్రాణాలకు డబ్బు. ఎందుకీడబ్బు! ఏంచేసుకోను? (ఒక రివాల్వరు చేతికి తగులుతుంది. తీసి చూస్తుంది భయంతో వణికి పోతుంది.)

అమ్మో నాతో ఎన్నడూ అనలేదే? ఎవరిని హత్య చేయడానికి? ఛీ! (రివాల్వరును నేలకేసి కొడ్తుంది) నాన్నా! నువ్వు పెద్దవాడివి కాగానే ముందు నీ తల్లిదండ్రుల్ని నిర్దాక్షిణ్యంగా హత్యచెయ్యి నాన్నా. లేక పోతే, భయం చావదు. ఆశ చావదు! ద్వేషం చావదు. ఛీ (బయటకు చూస్తూంది. పురుషుడు కంగారుగా వస్తున్నాడు చూసి వెంటనే రివాల్వరును డ్రాయరులో పెట్టి మూసివేస్తుంది. నోట్లకట్లలు తీసు కొని బిడ్డనెత్తుకొని త్వరగా లోపలికెల్లింది. పురుషుడు ప్రవేశిస్తాడు. అతని చేతిలో గ్లాసులో సగానికి పాలు, పూలగుత్తులు, వివిధ ప్రభుత్వ చిహ్నాలతో కుట్టబడిన ఒక పతాక వుటాయి. ఆ గ్లాసు, పూలగుత్తులు బల్లమీదపెడ్తాడు. ఆ సిల్కు పతాకవిప్పి జాగ్రత్తగా చూస్తూ గోడకున్న మేకుకు వేళాడకడ్తాడు. ఆమె వస్తున్నదేమోనని లోపలికిచూసి జేబులోంచి నోట్ల కట్టలు తీసి సొరుగులో పెడ్తాడు. లోపలినుంచి ఏదో మంట కనిపిస్తుంది).

పు:- శ్రీమతీ! శ్రీమతీ! ఏమిటక్కడ మంటపెడుతున్నావ్, ఎందుకూ పాపకు వెచ్చని పాలివ్వాలనా? ఇదిగో తెచ్చాను (పతాకంచూపిస్తూ) ఇది చూశావా! దీనితో మనవాణ్ణి కొత్తపెళ్ళికొడుకులాగ ముస్తాబు చేద్దాం! రా! శ్రీమతీ!

శ్రీ:- (బైటకు వస్తుంది. ఆమె స్వరంలో కర్కశత్వం గోచరిస్తుంది) ఏమిటిది?

పు:- ఇది పాపం రెడ్‌క్రాస్‌వాళ్ళది ప్రపంచంలోని ప్రభుత్వాల పతాకా లన్నీ దీనిమీద చక్కగా కుట్టారు చూడు.

శ్రీ:- (వెగటుగా) ప్రభుత్వాలు, పతాకాలు పతనమైన పతాకాంమీద, ప్రపంచాన్ని నాశనంచేసిన ప్రభుత్వాలమీద ఆలోకంమీద షీకింకా గౌరవం పోలేదు కదా!

పు:- ఆ! ఆ! ఎంతమాటన్నావే శ్రీమతి! మారోజుల్లో ప్రభుత్వమంటే అబ్బో భగవంతుడితో సమానం. ఇవిగో పాలు (చాలా వుత్సాహంగా) ఇవాళొక ఆవు కనిపించింది తెలుసా? ఆవు!

శ్రీ:- (సంతోషంగా) నిజంగానా? ఆరోగ్యంగా వుందికదా?

పు:- ఓ! మనఅదృష్టం శ్రీమతీ! అదిగో ఆ గుట్టదగ్గిర పచ్చని రంగువేసిన టాంకులేదూ! దానికి కట్టేశాను. అది పచ్చిక అనుకొని భ్రమపడి ఎక్కువ పాలిస్తుందని.

శ్రీ.- పాలు రుచి చూశారా, లేకపోతే నేను...

పు:- వద్దు. వద్దు. నేను రుచి చూశా! మనవాడికేం పర్వాలేదు. ఈ పూలు తీసుకోవే?

శ్రీ:- (సంతోషంతో పొంగిపోతూ) పూలా? చాలాబాగున్నాయి. ఇంత అందమైన పూలు యింకా పూస్తున్నాయా?

పు:- ఒక పడిపోయిన విమానం రెక్కలమధ్య ఒకే ఒక పూలమొక్క పెరిగింది. నీకోసం, పాపకోసం తెచ్చా.

శ్రీ:- (నవ్వుతూ హాస్యంగా) పురుషులు ఎంత దీనావస్థలోగూడా సంసార సుఖం మరిచిపోరనుకుంటా.

పు:- (వెటకారంగా) ఎన్ని బాధల్లోవున్నా స్త్రీలు అలంకారం మర్చిపోరను కుంటా. (ఎంతో ఉద్రేకంగా ప్రారంభించాడు) శ్రీమతీ! పురుషుడు స్థాపించి పాలించిన ఏకైక వుత్తమసంస్థ సంసారం. అది చక్కని పూలమొక్కలాగా పెరిగి పెద్దదై నలుమూలలా శాఖలు విస్తరించి భవిష్యత్తు దానికి చిరుమొగ్గలుగా, విరిసిన పూలగుత్తులుగా, వ్యాపించిన తియ్యని పరిమళంలా...

శ్రీ:- (సిగ్గుపడుతూ) చాల్లెండి! శృంగారానికి సమయాసమయాలు వుండొద్దూ? (లోపలికి వెళుతుంది)

పు:- (చాలా పెద్దగా నవ్వుతాడు) ఎందుకంత సిగ్గు? ఇంతకంటే మంచి సమయం ఎప్పుడొస్తుంది? నీకు పూలు, పాపకు పాలూ తెచ్చాను. ఇంతకంటే నాకానందం ఏమిటుంది? ఈ చీకటిలోకంలో నీ జీవిత

మొక మెరుపువంటిది. ఆ శిథిలాలలో ఎక్కడో ఏడుస్తూ తిరుగుతున్న నిన్ను కావాలని తెచ్చి పెంచుకున్నాను. ఎందుకు? వివాహం చేసుకున్నాను. ఎందుకు? సంతానం కన్నాను. అందుకు. చూడు పాప యెంత మంచివాడో ఏడవకుండా పాలుతాగుతాడు! ఆకలితో ఏడవడు. ఆనందంతో పొంగిపోడు వాడు వేదాంతి శ్రీమతీ! ఆ గుణాలన్నీ నావే కాదూ? నీవా? సరే అలాగే అనుకుందాం. పూలుదండ గుచ్చివెయ్యి. శ్రీమతీ! యివ్వాళ పాలకోసం వెడుతుంటే ఎంత భయం వేసిందో? అడుగుతీసి అడుగు పెట్టలేకపోయాను. ఎర్రని ఎండ భూమ్యాకాశాలనిండా వ్యాపిస్తే, ఆనాడు వరదపారిన రక్తం మళ్ళీ పైకుబికి ప్రవహిస్తున్నదేమోనని ఇళ్ళన్నీ పడిపోయిన యిసుక గూళ్ళలాగున్నాయ్. అక్కడ ఆ విగిరిగినసోఫాలో మిగిలిన అస్థిపంజరం అక్కడ భయంకరంగా నిశ్శబ్దంగా తాండవించేమృత్యువు. ఈగోళాన్నే కర్కశంగా కౌగిలించి నమలివేసే ఆ మృత్యువు, శ్రీమతీ! పాపను బాగా అలంకరించు. చాల్లే, పూలమాల అలావుంచితే చాల్లే. మన మోహాలమూట, మన ఆశాస్వప్నం, ఆదర్శ జ్యోతి, ఏం ఆశిల్పపతాకకప్పితే కాళ్ళతో తన్నేస్తున్నాడు? వాడికిష్టంలేదేమో? సరే వద్దులే! అమాయకులైన అసంఖ్యాక ప్రజల్ని అబద్ధాలతో రెచ్చగొట్టి వేటకుక్కలుగా మార్చి వధించిన ఈ ప్రభుత్వాల పతాకాలు నీకెందుకు? నువ్వు నిర్మలంగా, హాయిగా, గనగనగన జ్యోతిలాగా బ్రతుకు నాన్నా, నీపెళ్ళికి నేనుంటానో, వుండనో? మీ అమ్మ నిన్ను దీవిస్తుందిలే! (ఆమెలోపలినుంచి సంతోషంగా వస్తుంది)

శ్రీ:- ఊరుకోండి. ఏమిటా పిచ్చిమాటలు? మీరు లేకుండా నేను జీవించగలనా?

పు:- చూడు, నీకు నామీద యెంత గౌరవమో ఎంత అభిమానమో? (పిలుస్తూ) శ్రీమతీ! (దగ్గరకు వస్తుంది)

శ్రీ:- (ప్రేమతో) ఏమిటది?

పు:- (లాలనగా) వింటావా! నా మాట కాదనవుగా?

శ్రీ:- ఎప్పుడు కాదన్నాను?

పు:- (పావురాన్ని చూపిస్తూ) దాన్ని వంటచెయ్యి. యివ్వాళ్ళ మనం గొప్ప విందు చేసుకొని...ఆనందంగా...

శ్రీ:- మనవాడు ఆడుకోడానికైనా మిగిలిందదేగా? అంతకంటే మనకు బంధువు లెవరున్నారు చెప్పండి?

పు:- మరి ఇక మిగిలింది ఒక్కటే గదా! అవు ఈ అవునుగూడా చంపితే, అప్పుడు పాపకు పాలో? అప్పుడు వాణ్ణి ఎలా పోషిస్తాం? (ప్రాధేయ పడుతూ) నాకాకలౌతుంది శ్రీమతీ! ఐతే నేనిట్లా ఆకలితో అలమటించి చనిపోతే అప్పుడు నీ కళ్ళు చల్లబడతాయా?

శ్రీ:- (జాలిగా) నాకుమాత్రం ఆకలిగా లేదూ? పదేపదే చెపితే మీరు బాధ పడతారేమోనని చెప్పలేదు. (కన్నీరొలుకుతూ) కొంచమాలస్యమయినా ఏదో ఒకటి వెతికి తీసుకురాకపోయారా ? ఆరోగ్యంగావున్న జంతు వొక్కటీ కూడా కనపళ్ళేదా?

పు.- అసలేదీ కనపళ్ళేదు ఆ అవుతప్ప, దాని పాలు పిండుతూ రుచి చూశాను. మరేమిటో! ఏమిటిది? నిజమేనా? ఏమిటి కళ్ళు మసక పారుతున్నాయి? నాకేదో మగత కమ్మినట్టుంది.

శ్రీ:- లేదులెండి. పోతుందిగా. ఆకలివల్లనేమో ?

పు:- (దీనంగా వేడుకుంటూ) శ్రీమతీ! నామాట విను (ఈసారి తప్పకుండా వప్పుకుంటుందన్న నిశ్చయంతో) పోనీ, యిది తీసుకోవాలంటే యింకా దబ్బిస్తా! ఇంత బంగారంవుంటే పూర్వం మహాభోగమనుభవించే వాళ్ళం. తీసుకో! నువ్వే అంతా తీసుకొని దాచుకో !

(ఆమె ముఖం కోపంతో ఎర్రబడుతుంది. ద్వేషం పట్టలేక పైకి అనేస్తుంది.)

శ్రీ:- బంగారమా? తవ్వి తెచ్చుకుంటున్నారా? దాచిపెట్టుకుంటున్నారా? ఎందుకీ బంగారం? ఎవరినుద్ధరిస్తుంది? ఇది మనుష్యులకు పట్టిన మహావ్యాధి. ఇంతకంటే భయంకరమైన వ్యాధి లోకంలో ఏనాడూ రాలేదు. ఛీ, ఆ లోకపు దురాశ దుర్మార్గమంతా మీలో యింకిపోయింది. లేకపోతే ఆ నోట్లకట్టలు, ఆ రివాల్వర్...

పు:- (హఠాత్తుగా నేరం బైటబడిన ముద్దాయిలాగా కంగారు పడతాడు. అతనిలో ద్వేషానలం చెలరేగింది) రివాల్వర్. ఆ రివాల్వర్ నీకు కనిపించిందా? ఆ నోట్లకట్టలు తీశావా? ఏం చేశావ్, ఎక్కడ పెట్టావ్? నావి నాకిచ్చేశేయ్.

శ్రీ:- తగలబెట్టాను. మంటపెట్టి మన పాప ప్రాణం నిలబెట్టాను.

పు:- పాప అసలెవరు తియ్యమన్నారు నిన్ను? ఆ డబ్బెందుకు ముట్టు కున్నావ్? అది నా ఆస్తి. నా స్వంతం, అవి తగలబెట్టడానికి నీకేం హక్కుంది?

శ్రీ:- (నిర్లక్ష్యంగా నవ్వుతుంది) హక్కు. ఎవరికేం హక్కుంది? ఎవరికి హక్కులుంటే ఏం ప్రయోజనం? యీ హక్కులు నిర్ణయించే వాళ్ళెవరు? డబ్బట డబ్బు మీడబ్బు మీఆస్తి మీపెన్నిధి ఈనాడు పిడికెడు మట్టితో సమానం తెలిసిందా?

పు:- శ్రీమతీ! యెంత పనిచేశావ్! ఆస్తి కోసం మనుషులెంత యాతన పడ్డారో నీకేం తెలుస్తుంది. ఆ డబ్బుకోసం మనుషులు వొళ్ళు అమ్ము కొని, మెదడమ్ముకొని, ఆఖరుకు మాన ప్రాణాలే అమ్ముకొని బ్రతి కారని నీకెలా తెలుస్తుంది. ఎంతపని చేశావ్? నాకు తిండిపెట్టకపోగా నా డబ్బు కూడా కాజేస్తున్నావా? నాకు ఈనాటికి నీవే నాశత్రు వైనావా?

శ్రీ:- పర్వాలేదు (లోపలికి వెళ్ళిపోతుంది)

పు:- (రహస్యంగా) నా మాట వినవూ? నిన్నింత కష్టపడి కంటిలో పాప లాగా పెంచుకున్నానే! నిన్నే ప్రాణంగా చూచుకున్నానే? మన పాప కోసమైనా నన్ను (ఆమె తనయెదుట లేదని గ్రహించి) శ్రీమతీ! ఎక్కడ? ఏం చేస్తున్నావ్? (లోపలికి వెళ్లబోయి బల్ల తగిలి పడి పోతాడు. అతనిలో ఏదో ఆందోళన బైల్దేరుతుంది) శ్రీమతీ! నాకేమీ కనబడటం లేదు. లోకమంతా చీకట్లు కమ్మినట్టుంది. ఏదో ప్రమాదం జరిగింది శ్రీమతీ! రా! నాదగ్గరకురా! ఏదీ ఒక్కసారి పాపను చూడనీ. నన్ను పాప దగ్గిరికి తీసుకుపో! నాకేదో భయంగా వుంది.

శ్రీమతీ! వస్తావా! రావా! (కోపంగా పెద్దగా కేక పెడ్తాడు) శ్రీమతీ! (ఈ లోపల రేడియో టేబిల్ దగ్గరికి వస్తాడు) శ్రీమతీ! ఏది? నా రివాల్వర్ ఎక్కడ బెట్టావ్ ? (సొరుగు తెరుస్తాడు. అతిని చేతికి రివాల్వర్ తగుల్తుంది. బైటకు తీస్తాడు. ఒకానొక నిశ్చయంతో క్రూరంగా మాట్లాడుతాడు) కృతఘ్నురాలా! లోపలికి పోయి దాక్కున్నావా? నీ ప్రాణం రక్షించుకోవడానికి తాపత్రయపడుతూ పైగా నేను దుష్టుణనీ దుర్మార్గుణ్ణనీ నిందిస్తున్నావా? వస్తున్నా నీకు తగిన ప్రాయశ్చిత్తం చేస్తున్నా

శ్రీ:- (ఏడుస్తూ బైటకు వస్తుంది) మన పాప. మన పాప. ఏమిటీ విపరీతం, రండి! చూడండి! మన పాప ఒళ్ళంతా పచ్చగా మారిపోయింది. కళ్లు తేలవేస్తున్నాడు. చూపు కనపడడం లేదు.

పు:- (నిర్ఘాంతపోయి) నిజమేనా? నాకు పాలు రుచి చూచినప్పటి నుంచి భయంగానే వుంది. నిజమేనా!

శ్రీ:- రండి. మీరే తాకిచూడండి. మీరు చూస్తే యేదైనా వుపాయం చూడగలరేమో?

పు:- (జాలిగా) నేను గుడ్డివాణ్ణి శ్రీమతీ! అందుకేనేమో? పాలు రుచి చూడ్డం వల్లనేనేమో! నాకేం తెలుసు? త్రోవలో ఏ విషకిరణాలంటుకున్నాయో అని భయపడ్డాను. ఇంటికి రావడానికే నానాయాతన పడ్డాను. లేకపోతే వెతకనూ. నీకు నాకు తిండి వెతకడానికి నాకేం కష్టం. మన దురదృష్టం శ్రీమతీ! మన దౌర్భాగ్యం.

శ్రీ:- (ప్రాధేయపడుతూ) ఏం చెయ్యాలి మనమేం చెయ్యాలి. బిడ్డను కాపాడే వుపాయం చెప్పండి. మీకాళ్ళు పట్టుకుంటాను. ఈ యింటి దీపం నిలబెట్టండి.

పు:- (అవ్యక్తంగా తనను సంబోధించుకున్నట్లు) ప్రపంచంలో అంతా నశిస్తే కొనవూపిరితో మిగిలివున్న తుది సంసారం యిది. ఈ, కట్టకడపటి దీపం కూడా కటిక చీకటి మింగుతుంది. నేనంధుణ్ణి. నేనేం చేస్తాను. ఒళ్ళంతా నిజంగా మారిపోయిందా? అంత లేత శరీరం

అంత చక్కని నవ్వు. అంత సుకుమారంగా పెంచుకున్నామే! నిజ మేనా శ్రీమతీ!

శ్రీ:- నిజమే! నిజమే! వాడి వొళ్ళెంత కాలిపోతుందో తెలుసా. ఆ పాలే వాడి ప్రాణం తీస్తున్నాయ్. యేంచేద్దాం చెప్పండి.

పు:- (గత్యంతరం లేని స్థితిలో మనస్సు కరుడు గట్టుకపోయి నిర్దు కంగా) అయితే నిజమేనా? అయితే గత్యంతరం లేదన్నమాట. నాకేం తోచడంలేదు నాకంతా చీకటిగా వుంది. శ్రీమతీ! రా. ఒక్కక్షణం ముందు నీమీద కోపంవచ్చి నిన్ను చంపెయ్యాలనుకున్నాను. నేను జీవించాలనుకున్నాను. నిజమే నాది స్వార్థమే! మానవుల్లో జ్ఞానం నశించి పశుత్వం మిగిలింది. ఇప్పుడు మనం మనుష్యులమో కాదో? మనకే తెలియదు. ఇదిగో ఈ నన్ను కాల్చు తీసికో! ఇది నా ఆజ్ఞ! నేను నీ ప్రాణదాతన. నీ కర్తవ్యం నిర్ణయించా. ఇందులో ఒక్కటే వుంది. నా జీవితం అంతంచెయ్యి. (ఆమె రివాల్వర్ తీసుకుంటుంది. బయట సూర్యుడు సగం దిగిపోయాడు. భోరున తుపాను గాలి వీస్తుంది. ఉరుము మెరుపులతో భూమి కంపిస్తూంది)

శ్రీ:- మనమెందుకు కలిసి జీవించాం! ఎందుకు నడిపాం యీ సంసారాన్ని? పాపకు నయంకాదా? ఎప్పటికీ? నా ప్రాణాం యిస్తాను. యేమైనా చేస్తాను. చెప్పండి. చెప్పండి, మన బిడ్డ బ్రతకడూ?

పు:- బ్రతుకుతాడు.

శ్రీ:- ఆయితే మనిద్దరం జీవించవలసిందే వాడు పెద్దవాడయితే నిండుగా, కన్నుల పండువుగా, ఈ లోకమంతా హాయిగా-

పు:- శ్రీమతీ! (కరినంగా) మన బిడ్డ బ్రతుకుతాడు. కనీసం ఒకవారం. ఈ వారమంతా చిత్రహింస అనుభవించడానికి, మన పాపం భరించ డానికి బ్రతుకుతాడు.

శ్రీ:- (గుండెపగులు ఏడుపుతో) అంతేనా? ఆశ లేదా ? ఈ దుఃఖం నేను భరించలేను. తల్లిశోకం మీకర్థంకాదు. ఇదిగో, నన్నెందుకు పెంచి పెద్దదాన్ని చేశారు? ఒద్దు ఒద్దు. మీరే బిడ్డను పోషించండి. మీరే,

మీరే సృష్టించారు. మీరే ఆశించారు. మీరే అనుభవించండి! (ఆమె లోపలికి పోబోతుంటే ఒక భయంకర యంత్రధ్వని దగ్గరగా విన వస్తుంది ఆమె హఠాత్తుగా ఆగుతుతుంది. పురుషుడు గడగడలాడి పోతాడు)

పు:- శ్రీమతి! ఓ శ్రీమతి! ఏమిటది చూడు? అదేనా? అదేనా? వస్తూందా? ఎటు? ఎటు?

శ్రీ:- (ఆందోళనగా బైటకుచూసి) ఆ అదే. అదే. మృత్యుఫిరంగి. ఏమిటా ధ్వని. ఇటేఇటే వస్తుంది. మనపైపే.

పు:- నువ్వు రేడియో పలికించావా?

శ్రీ:- అదే పలికింది.

పు:- ఎంతపని చేశావ్. అదే. అదే, నన్ను హత్య చెయ్యి. లేకపోతే, ఏదీ ఆ రివాల్వర్.

శ్రీ:- ఆగండి. ఇక మన జీవితం అంతమైనట్లేనా? అదిగో వస్తుంది. అదే రేడియో ఫిరంగే... మనం అది రాకమునుపే-

పు:- మన జీవితం కాదు. మానవ చరిత్రే అంతమైనట్లు. (ఆమె లోపలికి వెళుతుంది) ఇది విచిత్ర ప్రహసనం. ఇది విషాదాంత నాటకం. ఇది చరమాంకం. శ్రీమతీ! ఓహో! చివరికి నేనే మిగిలినా? కాటిలో కాలుతూ కూడా ఆశాంతను వ్యక్తుకొని బైటకు రావాలని యాతనపడే వృద్ధుణ్ణి. అటు శిశువు ఉచ్ఛ్వాస నిశ్వాసాంతో ఆశా స్వప్నాలు వెలి బుచ్చే అమాయకమైన శిశువు. వెర్రి చిరునవ్వుల్తో భావి మానవ సౌందర్యాన్ని వెల్లడించే పసిబిడ్డ. ప్రతి రక్తనాళ స్పందనలో మానవ చరిత్రలోని శాంతి సౌఖ్యాలను జీవిత మహాసముద్ర సంగీతాన్ని స్పందించే పసిపాప. ఓహో! శ్రీమతీ! ఈ లోకం మనకు వీడ్కోలిస్తుంది. (రివాల్వర్ పేల్చిన ధ్వని వినిపిస్తుంది. భయపడి పెద్దగా పిలుస్తాడు) శ్రీమతీ! శ్రీమతీ! ఏమిటది? ఏమిటది? ఏం చేశావ్? ఆ అబ్బా! నాచూపుతోపాటు మాటకూడా పడిపోకూడదూ? నీవు నన్నే హత్యచేయకూడదా? (పెద్దగా కేకవేస్తూ) శ్రీమతీ!

శ్రీ:- (విగ్రహం నశించినట్టు బైటికి వస్తుంది. చేతిలో రివాల్వర్ వుంటుంది) ఎందుకు పిలుస్తున్నారు?

పు:- ఏమిటది? ఏమి చేశావ్? మనపాపకోసమైనా— —

శ్రీ:- (అతికర్కశంగా అతి నెమ్మదిగా) పాప లేదు.

పు:- (నమ్మలేక) ఆ, ఏమన్నావ్?

శ్రీ:- లేదు, పాప లేదు. లేదు. ఆశ లేదు. ఇక ప్రపంచానికి భవిష్యత్తు లేదు. హు (వికృతంగా ఒక చిరునవ్వు విసిరి) ఇంకా యిక్కడే వున్నావేం?

పు:- ఎవరు? నేనా? ఎక్కడికెళ్ళామంటావ్? యేం చెయ్యమంటావ్?

శ్రీ:- ఇంత విధ్వంసం చూసినవాడివి నీ ఆశకూడా నాశనమైన తర్వాత ఇంకా యిక్కడెందుకు? పో! బైటకుపో!

పు:- (ఆశ్చర్యంతో) వెళ్ళమంటావా నన్ను? ఎక్కడికి? ఎందుకు? బైటికి వెళ్ళి ఈ శ్మశానానికి కాపలా కాయమంటావా? ఎందుకూ? ఎందుకు వెళ్ళడం?

శ్రీ:- ఈ నాటితో నీ ఆదర్శం నిరాశాగ్నిలో దగ్ధమైపోయింది. ఇక మనకి సంసారం వద్దు. ఇన్నేళ్లూ నీ వింతకష్టపడినందుకు నాకు జాలి వేస్తుంది నీ ఆశ చావదు. ఇక మనకు ఆశలేదు. వెళ్ళిపో.

పు:- శ్రీమతీ! యేమిటామాటలు? నేను వెళ్ళిపోతే ఒంటరిగా స్త్రీవి నువ్వే మౌతావ్? ఎలా బ్రతుకుతావ్? ఈ ఇల్లూ, నువ్వూ, ఇంత బంగారం, ఈ ఆస్తంతా...

శ్రీ:- ఇదే మీ జీవితానికి ముప్పు తెచ్చింది. ఇది మీ యిల్లా! మీ దురాశే. ఈ బంగారమే మీ ప్రపంచానికి పతనం తెచ్చింది మానవ జీవితాన్ని ధ్వంసం చేసింది.

పు:- కాదు. కాదు. యిది దురాశ కాదు. మనుషులు చీమల్లాగా కూడబెట్టడమే కాదు, శ్రీమతీ, మహానాగరికతను నిర్మించారు.

శ్రీ:- ఛీ! చీమలు మనకంటే నయం. దోమలు మనకంటే నయం మీరు వాటినీ పొట్టన పెట్టుకున్నారు. యిది మానవుని ఆత్మహత్య.

పు:- అయితే ఆ బాధ్యత అంతా మొగవాళ్లదేనంటావా?

శ్రీ:- (లోని ఆలోచనను అవ్యక్తంగా ప్రకటిస్తున్నట్లు) తప్పకుండా, స్త్రీలు సృష్టికర్తలు, పురుషులు లయకారులు. పాపం యెవరిదైనా ఫలితం అందరూ అనుభవించాల్సిందే?

(బంగారం ముద్దతీసి విసిరేస్తుంది. అతని దృష్టిలో అంతకంటే కోప కారణం మరొకటుండదు)

పు:- ఏమిటిది? ఈ లోకాన్ని తూలనాడుతున్నావ్. నిన్ను పోషించి పెంచి పెద్దచేసినదిందుకేనా? నా సంసారం నిలబెడతావనుకున్నా. నా సంతానం వృద్ధిచేస్తావనుకున్నాను నా వృద్ధాప్యంలో నాకు సేవలుచేసి నా బ్రతుకు సుఖంగా వెళ్ళిపోయే మార్గం చూస్తావనుకున్నాను. ఇప్పుడు నన్నే వెళ్ళిపోమంటున్నావా?

శ్రీ:- అవును.

పు:- (దిగులుగా వెళ్ళిపోతూ కుర్చీ తగిలి తూలిపడి లేచి వెళ్ళబోతాడు) శ్రీమతీ! మళ్ళీ మనం కలుసుకోలేంగదూ! ఇక లోకం ఇంతే గదూ! నా కళ్లు కనబడక పోయినా నాచెవులు వినపడక పోయినా, నా దేహం కీళ్ళు సడలి వాలిపోతున్నా...

శ్రీ:- (తనలో మళ్ళీ ఆశ అంకురిస్తుందేమోననే భయంతో) ఎందుకు నన్ను వేధిస్తావ్. ఎందుకు మళ్ళీ మళ్ళీ తిరిగొస్తావ్?

పు:- ఎందుకేమిటి? నామాట విను శ్రీమతీ! మళ్ళీ ఒక పాప కలిగితే దాన్ని నా ప్రాణమిచ్చి పోషిస్తా!

శ్రీ:- (వెగటుగా) యింకా బిడ్డలు కావాలా?

పు:- నా మీద దయతలచవూ?

శ్రీ:- మీరే దయతలచాలి. ఇక నాకు సంతానం కలుగదు ఇక నేను కననే లేను.

పు:- నిజమా! నాతో ఎన్నడూ చెప్పలేదేం?

శ్రీ:- చెపితే మీ ఆశ నశించి పోతుందని చెప్పలేదు. మీ ఆశను అంతం చెయ్యడం యిష్టంలేకనే ఆ రహస్యం మీకు చెప్పలేదు. నాకు తెలుసు మీ ఆశ చావదు ప్రాణం వున్నంతవరకు ఆశ చావదు.

పు:- అదే మమ్మల్నింత కాలం నడిపించిన మహాజ్యోతి. అందుకా వెళ్ళిపొమ్మంటున్నావ్? అయితే నాతోనే మానవ చరిత్ర అంతమైపోతుందని తెలుసుకొని- తెలిసి గూడా ఒంటరిగా ఆ శ్మశానంలో కాంక్ష తీరని భూతంలాగా తిరగడం ఎంత దుర్భరంగా ఉంటుందో. అదిగో దగ్గరకొస్తుంది రేడియోగన్! నా ప్రాణం తీస్తుంది. శ్రీమతీ! ఈ సమయంలో నన్ను నిర్దాక్షిణ్యంగా గెంటేస్తావా? నీకు హృదయం లేదూ? గెంటేస్తున్నావా?

శ్రీ:- (నవ్వుతుంది) అవును. గెంటేస్తున్నాను వెళ్లు. నిన్ను జీవితాన్నుంచి తరిమేస్తున్నాను. నీ భార్యనుకాదు- కాదు నేను ప్రకృతిని మీ మానవుల వికృత ప్రవర్తనతో విసిగివేసారిన ప్రకృతిని. వెళ్లు మానవులకు జీవించే హక్కు లేదని శాసిస్తున్నాను. వెళ్ళు మీ సంసారం, సంతానం, సంస్కృతీ మీ స్వార్థానికి మారు పేర్లు ఇవన్నీ నీతోనే నశించనీ. మీ జీవితం యీ విశ్వానికే కళంకం. పోపో. వెళ్ళిపో.

పు:- నీవు నా శ్రీమతివికాదు స్త్రీవికాదు. అద్భుతమైన ప్రకృతి శక్తివి. నిత్యయవ్వనంతో జీవిస్తూ మానవుణ్ణో, జంతువునో వృక్షాన్నో సృష్టిస్తూ సత్యాన్వేషణచేస్తూ నిండుగా నిర్విరామంగా జీవిస్తూ నువ్వు ఈ క్షణంలో నాకు మూర్తీభవించిన ప్రకృతివి

శ్రీ - ఇప్పుడు తెలిసిందా? ఇది మీకు శిక్ష. ఇక చీమలో, తేనెటీగలో, క్రిములో ఈ భూమి నావరిస్తాయి అవి కూడా మీలాగే వెర్రి యత్నాలుచేస్తే నశిస్తాయి. మీరు మాత్రం నిష్క్రమిస్తారు. తప్పదు.

(పంజరం తెరిచి పావురాయితో చెపుతుంది )

పో అమ్మా, నీవైనా వెళ్ళిపో నీవైనా స్వేచ్ఛగా ఆ నిర్మలాకాశంలో విహరించు మాఖాధాగ్నిలో నీవెందుకు భస్మమైపోతావు? (పావురాయి

నిశ్చలంగా వుంది. ఆమె అతనివంక చూస్తుంది. అది గూడా చని పోయింది )

పు:- శ్రీమతీ! నీవు ప్రకృతి మాతవు! నన్ను క్షమించవూ? నీవు క్షమిస్తే అదే నా ఆత్మకు శాంతి!

శ్రీ:- (ఏడుపుతో రెండు చేతులు ముఖానికి అడ్డం పెట్టుకొని) క్షమించడమా! నేనా! మనిద్దరినీ యీ విశ్వమే క్షమించాలి. ప్రచండశక్తి, పరమదయామయీ! ఓ విశ్వ సంసారమా! క్షమించు క్షమించు. అవును మానవుడే. ఇదంతా మానవుని మహాపరాధం. ఆది నుండి తుది వరకూ అహంకారంతో విరగబడ్డాడు. మృగాలను వధించాడు జంతువుల్ని బానిసల్ని చేశాడు. పక్షుల్ని నేల కూల్చాడు. స్త్రీలను ఆటబొమ్మల్ని చేశాడు. ఈ భూగోళాన్నే శిశువు మాదిరిగా మృత్యు సముద్రంలో ముంచి ఉక్కిరి బిక్కిరై యేడిస్తే యిది మానవుడు చేసిన మాతృహత్య. రా అమ్మా రా. క్షణ క్షణంలోకాన్నే ఆక్రమించి ముంచెత్తే ఓ మహా మృత్యువా! అమ్మా! రా. ధగ ధగ వెలిగే ఈ శత సహస్ర నక్షత్రాలలో అద్భుత నృత్యంలో ఈ గోళం అనాధయై ఏడుస్తూ ఈడ్చుకుంటూ ప్రయాణిస్తుంది. పాపం. పాపం పాపం మానవుడేం పాపం చేశాడు? మానవులంతా శైశవంలో తెలియక చేసిన చిలిపి చేష్టలకు ఇంత ఘోరంగా శిక్షిస్తారా? ఎవరు? ఎవరు?...... దినం దినం మా యింటిని దర్శిస్తూ మా శోకంలో, సౌఖ్యంలో పాలుపంచుకున్న ఓ సూర్యుడా క్షమించు తల్లిగర్లే మానవులను చల్లని నీడకిలో లాలించిన చంద్రుడా క్షమించు ప్రతి క్షణం నిన్నార్పక భూకంపంలో పెనుతుపానులో, కరవులో కదనంలో మా లోకం కాచిన తారలారా! కన్నీటితో లోకాన్ని పునీతం చేసిన ఓ వర్షమా! కౌగిలించి. లాలించిన ఓ వాయువా. క్షమించండి, క్షమించండి, ఈ విషాదాంత నాటకంలో చరమాంకం మాతోనే అంతమౌంది. ఇవే మీకు మా అభినందనాలు.

(సూర్యుడు పూర్తిగా ఒరిగిపోతాడు. చీకటి దట్టంగా వ్యాపిస్తుంది. తుపాను గాలి. ఉరుములు మెరుపులతో భూమ్యాకాశాలు దద్దరిల్లుతాయి.

ఆమె తలవంచుకుంటుంది కళ్ళు మూసుకుని పాపను ముఖానికెత్తు కొని ముద్దు పెట్టుకుంటుంది. అతను నిశ్చేష్టుడై ఆమె వంక తలెత్తి చూస్తుంటాడు. దూరంగా రేడియో ఫిరంగి ప్రేలిన శబ్దం దిగంతాలలో మార్మోగుతుంది)

(మళ్ళీ అంతరాత్మల ఆక్రందన సంగీతం మార్మోగుతుంది).

నరులకు శత్రువు ప్రచండ మృత్యువు.
ప్రపంచమే బలిచేసిననాడు.
నేలకు వాలిన నిండు ప్రాణులము
జీవం విడువని అంతరాత్మలం.

వినండి యిది మా హెచ్చరిక
విశ్వానికి తుది హెచ్చరిక.

మానవులారా మొలకెత్తండి.
దిశదిశలా తల యెత్తండి.
శాంతి సౌఖ్యం సౌందర్యంలో
జగతిని హాయిగ వర్ధిల్లండి.

అద్యంతాలే లేని మహాద్భుత
మానవోత్సవం సాగించండి.

నిండుగ హాయిగ జీవించండి.
నిత్యం సత్యం స్థాపించండి!

మృత్యువు మర్మం భేదించండి
యిది మీ ధర్మం జీవించండి.
వినండి ఇది మా హెచ్చరిక
విశ్వానికి తుది హెచ్చరిక.

( తెర )

## పాత్రలు

వాసుదేవరావు
దొంగ
కామయ్య
ఇన్‌స్పెక్టర్

రంగాలంకరణ :- శ్రీమంతుడైన ఓ వ్యక్తి డ్రాయింగ్ రూం. రంగానికి మధ్యగా ఓ సోఫా, దానికి రెండువైపులా రెండు చిన్న సోఫాలు. ఒక వైపున రెండు ద్వారాలు ఉంటాయి ఒకటి వంటింట్లోకి, రెండోది బంగళా అంత ర్భాగంలోనికి, మరోవైపు ద్వారం వీధిలోనికి — ఈ మూడు ద్వారాలకూ తెరలు ఉంటాయి గోడకు ఒక ఇరవై ఏళ్ళ ప్రౌఢ తైలవర్ణ చిత్రం. గాలి వీచేటప్పుడు వీధిద్వారా తెరలు ఊగుతూ ఉంటాయి.

తెర లేచేసరికి పెద్ద సోఫాలో ఒక వ్యక్తి కూర్చొని, దినపత్రిక తిర గేస్తూ ఉంటాడు. వయసు నలభై అయిదు. కాని, ఏదో బాధ, వ్యధ, అతన్ని కృంగదీసినట్టు కనిపిస్తాడు. జీవితంలో అమూల్యమైన వాటన్నిటినీ పోగొట్టుకొని చావలేక బ్రతుకుతున్న మనిషి. ఆ నైరాశ్యం అతనికి మనశ్చాంచల్యాన్ని కలిగించింది పరధ్యానంగా మాట్లాడుతాడు, అదీ అతిగా మాట్లాడుతాడు.

తెరలేచిన కొద్దిక్షణాలవరకూ అతను వక్కపొడి నోట్లో వేసుకుంటూ, పత్రిక చదువుకుంటూ ఉంటాడు. అంతలో వీధి ద్వారం తెరలు కొద్దిగా గాలికి ఊగుతాయి. గాలి హెచ్చుతుంది

అతను ఒకసారి ద్వారంవైపుచూసి, మళ్ళీ పత్రిక చదవడంలో నిమగ్న దవుతాడు. కాని, ఈసారి మెరుపుమెరిసి, గాలి హెచ్చుకావడంతో అతను పత్రిక దింపి, ఓచేత్తో కళ్ళజోడుతీసి, వంటింటివైపు చూస్తాడు. అతని పేరు వాసుదేవరావు

వాసు:- కావయ్యా! (సమాధానంలేదు) కావయ్యా!

కావ:- (వంటిట్లో నుంచి) అయ్యా!

వాసు:- ఎక్కడున్నావయ్యా?

కావ:- ఇక్కడేనండి. ప్రమదావనంలో.

వాసు:- (అర్థంకాదు) ప్రమదావనం!

కావ:- అదేనండి, వనితాలోకంలో.

వాసు:- వనితాలోకం? (అర్థమయినట్టు) ఓహో! అదా! సరి సరి! భగవంతుడు నిన్ను ఆ వర్గంలోనే సృష్టించకుండా చాలా పొరపాటే చేశాడు సుమా. ఇలా రావయ్యా!

కావ:- (ప్రవేశిస్తాడు. వంట బ్రాహ్మడి వేషం) అయ్యా!

వాసు:- గాలివాన వస్తూంది. తలుపులు మూసేయ్.

కావ:- చిత్తం (తలుపులు మూసేసి, వంటిట్లోకి వెళ్ళబోతూ ఉంటాడు.)

వాసు:- కావయ్యా!

కావ:- అయ్య! (వెనక్కి తిరుగుతాడు)

వాసు:- మూసేశావా?

కావ:- అయ్య.

వాసు:- కాని, (పత్రిక పడేసి మెల్లగా చిత్రం దగ్గరికి వెళ్ళి) ఒకవేళ అమ్మాయిగాని వస్తే...

కావ:- (ఏ అమ్మాయో చప్పున స్ఫురణకు రాదు. కాని, వాసుదేవం మెల్లగా లేచి, తైలవర్ణ చిత్రం దగ్గరికి వెళ్ళగానే, అర్థమయినట్టు) అమ్మాయిగారా? వస్తే నేను లేనటండీ — తలుపులు తియ్యడానికి?

వాసు:- (చిత్రంవైపుచూస్తూ) కావయ్యా!

కావ:- అయ్య! (దగ్గరగా వెడతాడు)

వాసు: అమ్మాయి వెళ్ళడం నీకు జ్ఞాపకముంది కదూ?

కావ:- అయ్యో! లేకేమండీ?

వాసు:- అవాళ కూడా ఇలా గాలివానే! నా కసలు ఇష్టంలేదు—అమ్మాయిని నాతోబాటు తీసుకెళ్ళడానికి. కాని, తీర్థం చూస్తానని ఒకటే గోల, పాపిష్టివాడ్ని. [కంఠం వణుకుతుంది]

కావ:- అయ్య!

వాసు:- [తేరుకొని] కావయ్యా! ఆ అమ్మాయి ఏ క్షణాన వచ్చినా రావచ్చు. తలుపులు తీసుంచడం మంచిదనుకుంటాను.

కావ:- ఫర్వాలేదండి! నే నున్నానుగా? అమ్మాయిగారి కంఠం ఇలా వినపడే సరికి ఆలా తలుపులు తెరిచెయ్యనూ?

వాసు:- ఉహుఁ! అప్పటికి మన మెవ్వరం ఈ గదిలో లేకపోతే? గాలివాన హెచ్చితే ప్రమాదంకదూ?

[తలుపులు తీసేస్తాడు. గాలి రయ్యిన కొడుతుంది. మెరుపులు కొద్దిగా హెచ్చుతాయి. ఒక్క క్షణం అలా వీధిలోకి పిచ్చిగా చూస్తాడు.]

సరే, కావయ్యా! ఇహ నువ్వు వెళ్ళు.

[కావయ్య వంటింట్లోకి వెడతాడు. మరో రెండు క్షణాలిలా ఉరుముల్నీ, మెరుపుల్నీ చూస్తాడు. ఒక పెద్ద మెరుపు మెరుస్తుంది. రంగంమీద దీపాలన్నీ ఆరిపోతాయి. వాసుదేవం కంగారుగా 'కావయ్యా!' అని వంటి-ట్లోకి వెడతాడు. ఒక్క క్షణం రంగం ఖాళీ. మెరుపుల వెలుతురు తప్ప రంగం మీద ఎలాటి వెలుతురూ ఉండదు. బయట పెద్ద కోలాహలం...అది రాను రానూ హెచ్చవుతుంది. చివరికి "దొంగ...దొంగ...పట్టుకోండి!" అన్న కేకలు హెచ్చుతాయి. ప్రేక్షకులనుంచి ఒక వ్యక్తి కంగారుగా రంగంమీదికి ప్రవేస్తాడు. మాసిన తల, మాసికల బట్టలు, చేతిలో నెక్లెస్— మెరుపు వెలుగులో కనిపిస్తుంది. రంగంమీద దొంగలా పిచ్చిగా ఇటూ, అటూ తిరుగుతాడు—దాక్కునేందుకు. చివరికి వంటింటివైపు వెళ్ళి, అక్కడ మనుష్యుల అలికిడి విని, చప్పున రంగంమీదికి వచ్చేస్తాడు.)

వాసు:- [లోపలనుంచి వస్తూ] వెధవది గాలివాన ఇలావస్తేచాలు. స్కూలు కుర్రాళ్ళలా, ఈ మునిసిపల్ కరెంట్‌కూడా సెలవు పుచ్చేసుకుంటుంది. ఇక ఈ ప్రదేశ్‌కి నాగార్జునం వస్తేనేం, రామపాదసాగరం వస్తేనేం?

[మళ్ళీ దీపాలు వెలిగాయి దొంగ చప్పున పెద్ద సోఫా వెనక్కి వెళ్ళి దాక్కుంటాడు.]

వాసు:- ఆఁ! వచ్చేశాయీ! వెరీగుడ్! అర్జునిని పేరు స్మరిస్తే ఉరుము లాగుతాయో—లేదోకాని, రామపాదసాగరం పదం వినిపించేసరికల్లా దీపాలెలా వెలిగిపోయాయో! (వీధి ద్వారం దగ్గరకొచ్చి, బయటకు చెయ్యిచాచి చూసి) అబ్బే! ఇంకా వర్షం పడటంలేదు. (అనుకొంటూఉండగా, పోలీస్ ఇన్స్పెక్టర్ చేతిలో పిస్టల్‌తో ప్రవేశిస్తాడు.)

ఇన:- (రొప్పుతూ) ఈ ఇంట్లోకి ఎవరైనా వచ్చారా?

వాసు.- (అతసవైపు తేరిపార చూస్తాడు)

ఇన:- ఏవండీ, వచ్చారా ?

వాసు:- ఆఁ.

ఇన.- ఎక్కడ?

వాసు:- ఇదిగో, ఇక్కడే. (అతన్నే చూపిస్తాడు)

ఇన:- హాస్యంకాదు.

వాసు - అవును హాస్యంకాదు; మీరే ప్రస్తుతం వచ్చారు.

ఇన: అదికాదు సార్... సారీ ఫర్ ది డిస్టర్బెన్స్. ఇప్పుడే ఒకడ్ని తరుముకుంటూ వచ్చాం. వాడు ఈ ఇంట్లోనే దూరడం చూశాం. మీరుగాని చూసినట్టయితే—

వాసు: మిమ్మల్ని తప్ప మరో ద్విపాదజీవ మేదీ చూసెరగను మహాశయా! ఇంతకీ ఆ మనిషెవరు?

ఇన:- దొంగ! నిన్నరాత్రి చైర్మన్ చంగయ్యగారింట్లో దొంగతనం చేసి, ఆయన్ని చంపడానికి ప్రయత్నంచేసి పరారై పోయాడు.

వాసు.- దొంగతనం నిన్న జరిగితే,దర్యాప్తు ఇవాళ చేస్తున్నారా? బాగుంది— బాగుంది! ఏదో సామెత చెప్పినట్టు— (ఇన్స్పెక్టర్ ఏదో చెప్ప బోతూ ఉంటే) ఇంతకీ, ఇప్పుడు మీరు తరుముకొచ్చిన మనిషెవరు?

ఇన:- వాడే— దొంగండి. ఇవాళ బజార్లో వాడు నెక్లెస్ అమ్మబోతూ ఉంటే, మా పోలీసులు కనిపెట్టి...

(సోఫా పక్కనున్న వ్యక్తి ఉలిక్కిపడి, చేతిలోని నెక్లెస్‌ను చప్పున జేబులో వేసుకుంటాడు.)

వాసు:- అక్కడే పట్టుకోలేక తరమడం ప్రారంభించారన్నమాట ! మర్చా ! పోలీస్ ఉద్యోగానికి స్పోర్ట్స్‌లో ఎఫిషియెన్సీ ఒక ఆడిషనల్ క్వాలిఫి కేషన్‌గా?

ఇన:- అదికాదుసార్ !

వాసు:- ఏదికాదు? పోలీస్‌వాళ్ళతో ఉన్న పెద్ద చిక్కే ఇది. దొంగల్ని పట్టుకోమని ఉద్యోగమిస్తే రోడ్‌మీద రన్నింగ్ రేస్ చూపిస్తారు. సైకిల్‌కి లైట్ లేకపోతే, పూజారి దక్షిణకు చెయ్యి చాచినట్టు ఎడం చెయ్యి; దొంగ సారాకేసుకి కుడిచెయ్యి చాస్తారు.

ఇన:- (కోపాన్ని దిగమింగుకుంటూ) ఎక్స్‌క్యూజ్‌మి సార్! మీరు అతిగా మాట్లాడేస్తున్నారు... మరి మేం వస్తాం.

వాసు:- అహ! పోలీస్ శాఖవాళ్ళు వట్టి చేతుల్తో తిరిగి పోకూడదు. రండి. (వాసుదేవం అతని చెయ్యిపట్టుకొని తీసుకెళ్ళి సోఫాలో కూచో బెడతాడు.)

వాసు:- కావయ్యా! (కేక వేస్తూ)

కావ:- (వచ్చి) అయ్యా!

వాసు: చూడు! ఇన్‌స్పెక్టర్‌గా రొచ్చారు! రెండు కప్పులు కాఫీ తీసుకురా. (ఇన్‌స్పెక్టర్ కంగారుపడతాడు)

కావ:- చిత్తం.
(ఇన్‌స్పెక్టర్ స్థిమిత పడతాడు. కావయ్య వెడతాడు.)

వాసు:- ఇప్పుడు చెప్పవయ్యా తీరిగ్గా...... ఛైర్మన్ చంగయ్యగారింట్లో నిన్నను దొంగతనం జరిగింది! గుడ్ ఈవాళ దొంగ, బజార్లో నెక్లేస్ అమ్ముతూవుండగా మీరు చూడటం జరిగింది. వెరీగుడ్. అతన్ని మీరు పట్టుకోబోతే అతను తప్పించుకు పారిపోవడం జరిగింది. బేడ్‌లక్... అతను మీకంటే గొప్ప స్పోర్ట్స్‌మన్‌లా ఉన్నాడు. దొరికితే ఒకసారి అతన్ని ఇక్కడికి తీసుకురండి. సన్మానం చెయ్యాలి చూశారూ, నాకు స్పోర్ట్స్ అంటే మహాపిచ్చి.

ఇన:- ఇది పరిహాసాలకు సమయం కాదు.

వాసు:- సారీ! పరిహాసాలు మానేసి అసలు విషయానికి వద్దాం. ఏమయింది? దొంగతనం జరిగింది. అయితే, సదరు దొంగకు ఆ యింట్లో దొంగ తనం చేయాల్సిన అవసరం ఎందుకు కలిగింది? ఆ దుర్బుద్ధి వాడికి కొత్తగా కలిగిందా, లేక ఎప్పటినుంచో ఉందా? అలా అయితే,

వాడు దొంగతనం చేయాల్సిన కారణాలేమై ఉంటాయి? దొంగతనం చేయడానికి వెళ్ళినవాడు హత్య చేయడాని కెందుకు పూనుకున్నాడు?

ఇన:- (విసుగెత్తి) అయ్యా, వాసుదేవంగారూ! తమరు వకీలు కాబట్టి ఇలాంటి ప్రశ్నలు వేస్తున్నారు. కాని, నేను పోలీస్ ఉద్యోగిని కాబట్టి నా ధర్మం కేవలం ఆ నేరానికి కారకులైనవారిని వెదికి బంధించడం- కాని, ఇవన్నీ యోచించడం కాదు.

వాసు:- అవునవును మరిచాను. నువ్వు పోలీస్ వికదూ? (నవ్వి) ఏదో, పాత కేళ్ళనుంచి అలవాటుపడ్డ ప్రాణంకదూ, నాయనా? పొరపాటున హత్యమాట విన్నా, చోరీ మాటవిన్నా లక్ష యక్ష ప్రశ్నలు వేయడం అలవాటై పోయింది. అంతెందుకు? (బాధగా) ఒక పుష్కరం క్రితం మా అమ్మాయి (చిత్రం దగ్గిరకి వెడతాడు) కోటిలింగాల తీర్థంలో తప్పిపోయినప్పుడూ ఇలాంటి ప్రశ్నలే వేశాను — నా మనస్సుని.

ఇన:- [లేచి, చిత్రం దగ్గిరకి వచ్చి] మీ అమ్మాయి తప్పిపోయిందా?

వాసు:- [కంగారుపడి కోపంగా] ఎవరన్నారు. తప్పిపోయిందని? తీర్థాల్లో తప్పిపోయేంత అమాయకురాలేంకాదు, మా అమ్మాయి. ఇదిగో చూడు! ఈ చిత్రం మా అమ్మాయిదే. ప్రస్తుతం విశాఖలో మెడిసన్ చదువుతోంది. ఫైనలియర్ అయిపోయింది, ఈవేళో-రేపో రావచ్చు. అసలు ఇప్పుడే వచ్చేసినా వచ్చెయ్యొచ్చు. అందుకే గాలివాన వస్తున్నా — తలుపులు తీసివుంచాను. (ఇన్‌స్పెక్టర్ చిత్రంవైపు చూస్తూ వుంటాడు) అబ్బాయ్!

ఇన:- (ఉలిక్కిపడి) ఏమండి?

వాసు:- ఏం చదువుకున్నావు?

ఇన:- ఆనర్స్.

వాసు:- అయితే, అబ్బాయ్.

ఇన:- అయ్యా!

వాసు - మా అమ్మాయి ఎలా వుందంటావ్?

ఇన:- (కొంత సిగ్గు) ఆమె కేముంది? చాలా బావుంది.

వాసు:- అయితే, పెళ్ళి చేసుకుంటావా?

ఇన: (కంగారు పడతాడు) నే... నాం...డి?

వాసు:- నువ్వేనయ్యా! అమ్మాయి రూపంలో ఎంత సౌందర్యరాశో, గుణంలో కూడా అంతే! చదువా! నీకు ఇంతకు పూర్వమే చెప్పాను. ఎమ్. బి., బి. ఎస్. పాసయిందని.

ఇన:- అయ్యా, వాసుదేవంగారూ!

వాసు:- నువ్వు మధ్యలో ఆపకయ్యా, విను. మా వంశమా? రామజోస్యుల వారంటే తెలీని ఆంధ్రుడుండడు. ఈ ప్రదేశ్‌లో సంస్కృతి, సభ్యత, గౌరవ మర్యాదలుకల కొద్ది కుటుంబాల్లో మాది మొదటిది.

కావ:- [రెండు కప్పులతో ప్రవేశం] అయ్యా, కాఫీ!

వాసు:- ఇలా టేబిల్ మీద పెట్టు.

కావ:- [టేబిల్ మీద పెట్టి వెడతాడు.]

వాసు:- రావయ్యా అల్లుడూ! కాఫీ సేవిద్దాం.

[ఇద్దరూ వెళ్ళి సోఫాల్లో కూచొని, కప్పులు తీసుకుంటారు.]

వాసు:- నా తదనంతరం నా ఆస్తి కంతటికీ వారసురాలు అమ్మాయే! అందు వల్ల ఆ ఆస్తి ఆమెను వివాహం చేసుకున్నవారికి చెందుతుంది. నా ఆస్తి ఎంత ఉందనుకున్నావ్? [ఒక గుటక కాఫీ] ప్లీడరీ చేసి నాలుగు 'ల' కారాలు సంపాయించాను— ఫోర్ లాక్స్! [మరో గుటక] అదికాక స్థిరాస్థి ఈ ఇల్లు మరో 'ల' కారం చేస్తుంది. ఒన్ మోర్ లాక్! [ఇంకో గుటక] పిటికితోడు ఈ జిల్లాలో నా పేర వందెకరాల మాగాణి. [ఇన్‌స్పెక్టర్ కళ్ళు తేలేసి గుటకవేసి ఉక్కిరి బిక్కిరై పోయి, కాఫీ తాగకుండానే టేబిల్ మీద ఉంచేస్తాడు.]

వాసు:- అదేవిటయ్యా, కాఫీ తాగకుండా అలా దిగబెట్టేశావ్?

ఇన:- [మాట వినిపించుకోకుండా లేచిపోయి] వస్తానండి.

వాసు:- (కాఫీ కప్పు టేబిల్ మీద పెట్టేసి, లేచిపోలా) ఇంత త్వరగా ?

ఇన:- (బయటకు పోబోతూ) ఇహ భరించలేనండి

(చమటపట్టిన ముఖం తుడుచుకొంటాడు)

వాసు:- ఫర్వాలేదు... ఆ ఆస్తి నీకు రాయనులే, అమ్మాయిని పెళ్ళాడు.

ఇన:- వద్దుసార్; వద్దండి.

వాసు:- పోనీ, అమ్మాయిని కూడా చేసుకోవద్దులే! కాఫీ తాగు.

ఇన:- ఆకలిగా లేదండి.

వాసు:- పోనీ, కాఫీ తాగొద్దు, నీ దొంగను పట్టుకునేందుకు ఇల్లంతావెతుక్కో.

ఇన:- వద్దండి, బయటే ఉంటాను. వాడీ ఇంట్లో ఉంటే గింటే—బయటకు ఎప్పటికైనా వస్తాడు. అప్పుడే పట్టుకుంటా. వస్తా. గుడ్‌నైట్ సార్! (నిష్క్రమణ.)

వాసు:- గుడ్‌నైట్! వెర్రిపిల్లాడు 'ం' కారం చెవినిపడగానే గుండె బేజారెత్తి పోయిన మనిషి ఇహ ప్రభుత్వకార్యాలయాల్లో ఎలా పనిచేస్తాడో?... కావయ్యా! (వంటింటివైపు వెడతాడు)

కావ:- (లోపల్నుంచే) అయ్య...

వాసు:- చూడూ! వర్షం ఇంకా పడడంలేదు. ఇలాంటి సమయంలో వేడి వేడి పకోడీలు తింటే బావుంటుందయ్యా.

కావ:- (లోపలే) చిత్తం.

వాసు:- కాస్త ఉల్లిపాయలు ఎక్కువ వెయ్యి.

(ఈ సంభాషణ అవుతున్నప్పుడు, సోఫా వెనుక దాగున్నదొంగ మెల్లగా లేస్తాడు. అంతలో ఉరు మురుముతుంది. వెనక్కి తిరుగు తాడు వాసుదేవం. దొంగ మళ్ళీ సోఫా పక్కకి నక్కిపోతాడు. వాసుదేవం మెల్లగా వెనక్కివచ్చి పెద్ద సోఫాలో కూచొని, పత్రిక తీసుకుంటాడు ఇదే సమయమని దొంగలేచి, బయటకు వెడతాడు. కాని, బయట వీధిలో ఇన్‌స్పెక్టర్ని చూసి, మళ్ళీ వెనక్కి కంగారుగా రంగం మీదికి వచ్చేస్తాడు, సోఫా వెనక్కి నక్కిపోవాలనుకొంటుం

డగా ఉరుము ఉరుముతుంది వాసుదేవం వెనక్కి తల తిప్పి చూస్తాడు.)

వాసు:- ఎవరు?...ఎవరది?

రాం:- (తడబడుతూ) నే...నే—నండి...

వాసు:- నువ్వా! ఎవరు? ఎవరు కావాలి?

రాం:- అబ్బే! ఎవరూ, ఎవరూ...

వాసు:- ఓహో! గాలివాన వస్తుందేమోనని వచ్చావా?

రాం:- అవును...అంతేనండి.

వాసు:- రా అయితే, ఇలా వచ్చి ఈ కాఫీ తీసుకో!

[ఇన్‌స్పెక్టర్ వదలిపోయిన కాఫీ చూపిస్తాడు.]

రాం:- అబ్బే! వద్దండి.

వాసు:- ఫర్వాలేదు తీసుకో?...ఇంతకుముందాక పోలీస్ ఇన్‌స్పెక్టర్ వచ్చాడు అతనికిస్తే తాగకుండా పోయాడు (లేచి, దొంగ దగ్గరగా వస్తాడు అదేమిటబ్బాయ్, ఆలా గుడ్లు మిటకరించి చూస్తావ్?

రాం:- అబ్బే! ఏం లేదండి.

వాసు:- ఏం అబ్బాయ్, వాలకం అలావుంది?

రాం:- అబ్బే! ఏం... లేదండి.

వాసు:- మాటకూడా తడబడుతోంది.

రాం:- అబ్బే! లేదండి...

వాసు:- గొంతుగ్గూడా తగ్గిపోతోంది.

రాం:- లే...లేదం...డి!

వాసు:- ఏమిటి లేదు? కొంపతీసి నీకుగాని వంట్లో బాగుండలేదా ఏం?

రాం:- అవునండి. మూడు రోజుల నుంచి జ్వరం.

వాసు:- అయ్యో పాపం! జర్వంలో ఎక్కడికి బయలుదేరావ్? (దొంగ మాట్లాడడు) డాక్టర్ దగ్గరికా?

రాం:- అవునండి.

వాసు:- కనిపించాడా? (తల త్రిప్పుతాడు దొంగ) ఇంజెక్షన్ ఇచ్చాడా, ఆప రేషన్ చేశాడా? లేక రెండునా?

రాం:- అబ్బే! రెండూ లేవండి. మందిచ్చాడు

వాసు:- నీళ్ళ మందా?

రాం:- కాదండి. మంచిమందే. జ్వరం పోయిందండి వెంటనే

వాసు:- అయితే, అతను డాక్టరయి ఉండడు...సరే! ఇలారప్పి కూచో. [సోఫాలో కూచుంటాడు. దొంగ కూచోడు. భయంగా వీధివైపు చూస్తుంటాడు.] అబ్బాయ్! ఎంతవరకు చదువుకున్నావు?

రాం:- అబ్బే! లేదండి, అసలు చదువే రాదండి.

వాసు:- అసలు చదువేం రాదా? ఇంకేం నీకు ముఖ్యమంత్రి అయ్యేంత క్వాలి ఫికేషన్ ఉంది. నాకు మంత్రులంటే చాలా ఇష్టం సుమా!

రాం:- మేం మంత్రులం కాదండి, కాపులం.

వాసు:- మరీ మంచిది. మీ భుజాలమీదే భారతదేశం— ముఖ్యంగా ఆంధ్ర దేశం ఆధారపడిఉంది. నాకు వందెకరాల మాగాణి ఉంది. సేద్యం చెయ్యగలవా?

రాం:- మాకు సేద్యం రాదండి. మేం చాలాకాలంగా పట్నంలోనే స్థిరపడి పోయాం.

వాసు:- దేశద్రోహీ! ఇంతా పారిశ్రామికంగా ఈ రాష్ట్రం వృద్ధికాకముందే దేశానికి వెన్నెముకైన పల్లెపట్టుల్ని విడిచిపెట్టేస్తున్నావుంటే, నువ్వు ఇహ— ఊఁ— సర్లే— ఇక్కడ నువ్వేం పనిచేస్తున్నావ్?

రాం:- ఏం లేదండి.

వాసు:- అంటే? ఏం లేకపోవడంకూడా ఒక పనా? సరే— ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజ్‌లో పేరు నమోదు చేయించుకున్నావా?

రాం:- లేదండి.

వాసు:- పోనీ, పూర్వజన్మలో నైనా చేయించుకున్నావా? అక్కంకాలే? వెరీ గుడ్! నువ్వు చాలా బుద్ధిమంతుడవైన పౌరుడిలా ఉన్నావ్. మరినీకెలా గడుస్తోంది?

రాం:- మా నాన్న పని చేస్తున్నాడండి.

వాసు:- ఆయన పనిచేస్తుంటే నీకెలా? హోమ్ మినిస్ట్రీ అంతా డిక్టేటర్‌లాంటి మీ నాన్న చేతిలో ఉంటే నీ చేతిలో డబ్బెలా ఆడుతుంది? ఫర్వాలేదంటావా? ఆ జేబులూ, ఆ ఛరిణలూ తడిమేస్తానంటావా? వెరీగుడ్! ...ఆఁ మీ ఇంట్లో జనాభా ఎంత?

రాం:- నేనూ, మా నాన్న, మా అమ్మ, మా చెల్లాయీ.

వాసు:- ఒక్కరేనా?

రాం:- అవునండి.

వాసు:- బ్రతికావ్... ఆ చెల్లెలికి పెళ్ళయిందా?

రాం:- లేదండి.

వాసు:- చచ్చావ్...పోనీ, నీకు పెళ్ళయిందా?

రాం:- లేదండి.

వాసు:- అయితే, చచ్చి బ్రతికేవ్. నీకొచ్చే కట్నంతో ఆదేదో లేదనిపించెయ్యొచ్చులే... సరే? పెళ్ళి చేసుకుంటావా?

రాం - (కొంత వింత, కొంత సిగ్గుతో చూస్తాడు)

వాసు.- ఓస్! సిగ్గు. సర్లే- చేసుకోవచ్చులే! అలా చూడు [చిత్రం చూపిస్తూ] మా అమ్మాయి...అందంగా ఉంది కదూ? ఒక్కతే కూతురు విశాఖపట్నంలో ఉంది— ఆసుపత్రిలో ... పిచ్చాసుపత్రిలో కాదు— డాక్టర్ చదువుతోంది. ఇంకా వివాహం కాలేదు. చూడు, ఎంతయినా తండ్రిని కాదూ? ఆరేడు లక్షల ఆస్తి ఉంటేనేం, అమ్మాయి పెళ్ళి చేయాల్సి వచ్చేటప్పటికి నేనూ మామూలు మనిషిలానే బేజారెత్తిపోతున్నాను. ఆఁ- అన్నట్లు నీ పేరేమిటి?

రాం:- రాంబాబు సార్!

వాసు:- ఏమిటి? రాముడికి బాబువా? [నవ్వు] నువ్వు చాల మంచివాడిలా కని పిస్తున్నావ్... ... 'ఆఁ చూడూ, అమ్మాయికి ఎన్నో సంబంధాలు చూస్తున్నాను. ఎక్కడా కుదరడంలేదు. ఇందాక ఒక పోలీస్ ఇన్ స్పెక్టర్ వచ్చాడు. ఆనర్స్ చదివాడట! బాగుందనుకున్నాను. అడిగాను —అమ్మాయిని చేసుకుంటావా అని. చేసుకోవాలని ఉందనుకుంటాను; ఆశగా చూశాడు. పెదవులు తడుపుకున్నాడు. కాని, నా ఆస్తిమాట వినేసరికి గుండె బేజారెత్తిపోయి, అదే పరుగు లంకించుకున్నాడు. డబ్బంటే చూడు అతనికి ఎంత భయమో! సరే, నీకు డబ్బంటే భయమేనా ? (ఇంతసేపూ రాంబాబు భయంగా వీధివైపు బెదురు చూపులు చూస్తూనే ఉంటాడు.)

రాం:- అవునండి (అని కాదన్నట్టు తల ఊపుతూ)

వాసు:- అదేమిటి? గొంతుక ఒకలా పలుకుతూఉంటే, తలొకలా తిరుగు తోంది? కొంపతీసి నీకు నరాల బలహీనత లేదుకదా?

రాం:- అబ్బే !

వాసు:- సరే, నీకు డబ్బుకావాలి. ఆగు. అమ్మాయికికూడా పెళ్ళి పూర్త వాలి. ఎం. బి. బి. యస్. చదివిందా? దానికి కనీసం ఐ.ఏ యస్ నన్నా వెదకి పట్టుకోవాలి! చూస్తున్నాను. వేస్తున్నా గాలం. చిక్క టంలే దెవ్వరూ!... నువ్వు ఒప్పుకుంటావా?

రాం:- దేనికండి?

వాసు:- మా ఇంట్లో ఉండేందుకు.

రాం:- ఎందుకు?

వాసు:- అమ్మాయి పెళ్ళయ్యేవరకూ ఆ పనీ, ఈ పనీ చేస్తూ ఉండవుగాని. పాపం, ఆ కాపయ్య ఒక్కడూ ఎంతకని చస్తాడు!... భయపడ కులే, జీతం ఇస్తాను... ఎంత కావాలి?

రాం:- ఏమిటి బాబూ?

వాసు:- నెల జీతం?

రాం:- మీ... మీ... ఇష్టం—

వాసు:- గుడ్! చాలా మంచివాడవ్, సరే, నెలకి అరవై... యిష్టమేనా— చాలా? వారంలో ఒక దినం సెలవు. సంవత్సరానికి ఇరవై దినాలు ప్రివిలేజ్ లీవు. అవికాక దేశ నాయకుల బర్త్‌డేలకూ, Death డేలకూ వారి దేశ పర్యటన దినాన— వెరసి మొత్తం రెండు వందల దినాలు సెలవు సాలుకి. జ్ఞాపక ముంచుకో... తర్వాత ట్రేడ్ యూనియన్లూ, గ్రేడ్ యూనియన్లూ అంటే లాభం లేదు.

రాం:- తమ ఇష్టం సార్!

వాసు - వెరీ గుడ్! అయితే, అలా అని తర్వాత రాస్తాను. వేలు ముద్ర వేద్దువుగాని...కావయ్యా!

కా - (వస్తాడు) అయ్య.

వాసు:- కావయ్యా! ఇతను మనకు కొత్త- (ఏమని పిలవాలో అర్థంకాక క్షణంసేపు రాంబాబుని చూసి) అబ్బాయ్! నీ పోర్ట్‌ఫోలియో ఏమని ఉంచా లంటావ్?

కా:- ఎవరు బాబూ, ఈ కుర్రాడు? (అనుమానంగా చూస్తాడు)

వాసు:- అదేనోయ్... ఏ డిజిగ్నేషన్‌తో పిలవాలా అని ఆలోచిస్తున్నాం. (క్షణం ఆలోచించి) ఆఁ, నీ డిజిగ్నేషన్ 'నౌర్'...ఆఁ కావయ్యా. ఈ అబ్బాయి మన కొత్త 'నౌర్'— తల్లి తండ్రులు పెట్టిన పేరు రాంబాబు అట!

కా:- 'నౌర్' ఏమిటి బాబూ?

వాసు:- అదేనోయ్, 'నౌకర్'. ఈ మధ్య... కొన్ని ఫోర్త్‌క్లాస్ స్టాఫ్‌వారి హోదాల పేర్లు, కూలీని 'మజ్‌దూర్'గా మారుస్తున్నారుగా? అలాంటిదే ఈ అబ్బాయి మనింట్లో నౌకర్ పనిచేస్తున్నా నౌకర్'లో 'క' కొట్టేసి 'నౌర్'అని పిలుద్దాం.

కా:- ఏమిటి బాబూ! ఆలోచించే చేస్తున్నారా? వాడివాలకం చూస్తూవుంటే పచ్చి పోకిరీలాగా, పండిన దొంగలాగా, మ డిరిపోయిన ఘ్నూటా కోర్‌లాగా కనిపిస్తున్నాడు.

వాసు:- మొదట్లో నువ్వూ నా కంటికి అలానే కనిపించావయ్యా. తర్వాత కదా మారిపోయావ్?

రాం:- క్షమించండి, బాబుగారూ! నాకు మీ నౌకరీవద్దు మీ పనీ వద్దు, నా మానాన నన్ను పోనివ్వండి.

వాసు:- విన్నావటయ్యా! భర్తృహరి నుడివిన అభిమానవంతుడు నేటికీ అబ్బాయిలో కనిపించాడు. ఇరవై ఏళ్ళనుంచి నువ్వూ ఉన్నావ్! ఎందుకు?...అబ్బాయ్ ఈ ఇంటికి యజమాని ఎవరు—నేను. నేను నిన్ను పిలిచి ఉద్యోగ మిస్తున్నాను.

రాం:- అవును బాబుగారూ!

వాసు:- ఆ మాత్రం గుర్తించగలిగినపుడు, నీ కతనితో పేచీయే లేదు... ఆఁ, కామయ్యా, ఈ అబ్బాయిని లోపలికి తీసుకువెళ్ళి స్నానం చేయించి కొత్త బట్టలూ అవీ-

కా:- బాబూ, బాబూ! నేను పదహారణాల బ్రాహ్మణ్ణి బాబూ!

వాసు:- నాకు తెలుసునయ్యా నీ ఆత్మకథ. నువ్వు ఒక్క అణా అయినా తక్కువ కాకుండా, పరిపూర్ణబ్రాహ్మడవు కాబట్టే, నిన్ను వంటింటికి ప్రధానమంత్రిని చేశాను.

కా:- [ఏమీ అనలేక] కాని, బాబుగారూ! ఆ కుర్రాడు మాత్రం వంటింట్లోకి రాకూడదనే ఆంక్ష విధించండి బాబూ!

వాసు.- సర్లే! చూడు, నౌకర్! నువ్వు కామయ్యగారు చెప్పినట్టు వంటింట్లో తప్ప మిగతా గదుల్లో తిరగకూడదు.

కా:- బాబూ!

వాసు - ఇక మీరు విశ్రమించండి కామయ్యగారూ!

[కామయ్య, రాంబాబువైపు కోపంగా చూసి, వంటింట్లోకి వెళతాడు. వాసుదేవం నవ్వుతుంటూ "నువ్వూ అతని వెనకాలే వెళ్ళు" అన్నట్టు రాంబాబుకి సైగ చేస్తాడు. రాంబాబు భయపడుతూనే వంటింటి వైపు వెళతాడు. కామయ్య కస్సుమంటాడు]

కా:- నా వెనగా ఎక్కడికి వొచ్చేస్తున్నావ్? అలా ఆ గదిలో నుంచి పెరట్లోకి తగలడు, (రాంబాబు రెండో గదిలోకి వెళతాడు) ఖర్మరా భగవంతుడా! (అనుకుంటూ వంటింట్లోకి పోతాడు. వాసుదేవం నవ్వుకుంటాడు చుట్ట వెలిగించి, సోఫాలో కూచుంటాడు. మెరుపు మెరుస్తుంది. వీధివైపు చూస్తాడు. నిశ్శబ్దం. ఎవరో చిన్నపిల్ల ''నాన్నగారూ'' అన్నట్టు వినిపిస్తుంది. ఉలిక్కిపడతాడు. చిత్రం వైపు చూస్తాడు. చుట్ట పారేసి, మెల్లగా లేచి చిత్రం దగ్గరికి వెళ్ళి, చాలా సేపు ఆ చిత్రాన్ని తదేక దీక్షగా చూస్తాడు. నిట్టూర్పు విడుస్తాడు. మెరుపు మెరుస్తుంది. ఇన్‌స్పెక్టర్ మళ్ళీ వస్తాడు. యూనిఫారమీద రెండు మూడు వర్షపు చినుకులు పడతాయి)

వాసు:- ఎవరు?

ఇన:- నేనండి.

వాసు:- ఓహో! ఇన్‌స్పెక్టర్‌గారా? రా, రా...కాఫీ తాగుతావా? (అతను విడిచిన కాఫీ కప్పునే చూపిస్తాడు)

ఇన:- అబ్బే, వద్దండి.

వాసు:- పోనీ, అమ్మాయిని పెళ్ళాడతావా?

ఇన:- అబ్బె—అబ్బె! (నసుగుతాడు)

వాసు:- పోనీ, అస్తి రా పరతే.

ఇన:- క్షమించాలి, నన్ను మీకు అర్థం చేసుకోలేకపోతున్నాడు.

వాసు:- అర్థం చేసుకోలేకపోతున్నావా? వెయిట్ ఎ బిట్, నీ పేరేమిటన్నావు?

ఇన:- ప్రతాపం.

వాసు:- (పక్కనున్న షెల్ఫులోంచి నిఘంటువు తీస్తాడు) ప్రతాపం ఈజ్ ఈక్వల్ టు ధైర్యం. సాహసం, వీరత్వం ఎట్సెటరా......అర్థమయిందనుకుంటాను ... ... నవ్వావు అర్థమయ్యావు. సూర్యరాయాంధ్ర నిఘంటువుతో భద్రంగా (పేజీ చూసి) 706వ పేజీలో దాక్కొని ఉండేవాడివి నాకెలా అర్థమవుతావయ్యా?

ఇన:- మీరు హాస్యబ్రహ్మలండి.

వాసు:- ఇంకేం! బిరుదిచ్చావ్! సన్మానం చెయ్యాలిసుంటుంది. ఆఁ లెట్ అజ్ కమ్ టు ది పాయింట్...ఏమిటన్నావ్?

ఇన:- నేను ఏమీ అనలేదు. బయట వర్షం వచ్చేటట్టు ఉంది-చినుకులు కూడ పడుతూ ఉంటే—లోపలికి వచ్చాను, వర్షం తగ్గగానే వెళ్ళిపోతాను.

వాసు:- వెళ్ళిపొమ్మని నేననను గాని, ప్రస్తుతం ఉండమంటున్నా.
[అని వాసుదేవం లోపలికి పోతాడు. ఇన్‌స్పెక్టర్ "థాంక్స్" అని వంటింటికి వెళ్ళి చూసి, వచ్చి పత్రిక తీస్తాడు. ప్రకటన కాలమ్స్ చదువుతూ ఉంటాడు.]

వాసు:- (వచ్చి చూసి) 'మిస్సింగ్ కాలమ్' చదువుతున్నారు - ఎవరైనా మీవాళ్ళు తప్పిపోయారేమిటి?

ఇన:- నాకు మా వాళ్ళనేవా రెవరూ లేరు లెండి,
[భావగర్భితంగా చిత్రంవైపు చూస్తాడు]

వాసు:- అదేం? జైళ్ళలోని వాళ్ళంతా మీవాళ్ళేగా? వాళ్ళు కూడా లేరా?

ఇన:- [నవ్వుతూ] మీరు బహు చతురులండి.

వాసు:- చతురులంటే జ్ఞాపక మొచ్చింది — ఒక పట్టు చతుర్ముఖ పురాణం వేసుకుందామా?

ఇన:- అబ్బె! నాకు రాదండి.

వాసు:- నిజంగా రాదా? లేక ఆ నీ యూనిఫామ్‌కి భయపడుతున్నావా? ఫర్వాలేదు? రావయ్యా! వర్షం పడేటప్పుడు తింటే పకో... కావయ్యా! పకోడీలు. వర్షం పడేటప్పుడు తింటే పకోడీలు తినాలి. చతుర్ముఖ పురాణమాడాలి (ముక్కలు కలుపుతూ) కమ్ ఆన్. మూడుముక్కలాట ఆడుకుందాం. అన్నిటి కంటే ఈజీ. ఆఁ విను. మూడాసులు అన్నిటికంటె పెద్ద; తదుపరి మూడు కింగ్స్; తర్వాత మూడు క్వీన్స్, తర్వాత మూడు టెన్స్, తర్వాత మూడు నైన్స్—

ఇన:- ఎక్స్‌క్యూజ్ మి, సార్. నా కసలు పేక ముక్కలు పట్టుకోవడమే చేతకాదు.

వాసు:- చేతకాదూ? పేకాడ్డం చేతకాకుండా నవ్వే అనభవంతో ఆది తప్పని వాళ్ళను అరెస్టు చేస్తున్నావ్?

ఇన:- అది నా డ్యూటీ సార్.

వాసు:- డ్యూటీ! ఎస్. ఎస్...అది సరేగాని, ఇందాక నేనేదో అడిగితే, నువ్వేదో సమాధానం చెప్పావు—అది నిజమా?

ఇన:- ఏదండి?

వాసు:- అదేనయ్యా, నేనేదో అడిగాను, సరిగా జ్ఞాపకంలేదు. నువ్వేదో సమాధానం చెప్పావ్—అదీ జ్ఞాపకం రావడంలేదు.

ఇన:- ఏమిటై ఉంటుంది, చెప్మా; (జ్ఞాపకం తెచ్చుకొని) ఓహో! అదా?

వాసు:- ఆఁ...ఆఁ, అదే! ఏమిటది?

ఇన:- [చిత్రంవైపు చూస్తూ] మీఅమ్మాయి విషయం.

వాసు:- (చప్పున లేచిపోయి) ఏమిటి? కనిపించిందా? దొరికిందా?

ఇన:- ఎవరు, ఎవరండి? (మెరుపు, ఉరుము)

వాసు:- అదేనయ్యా, మా శారద—పద్నాలుగేళ్ళయింది కదా తప్పిపోయి? అప్పుడు ఆరేళ్ళు అమ్మాయికి...వెతికించాను; నేనూ వెతికాను. మీ వాళ్ళతో మొరెట్టుకున్నాను. పాపం, మీవాళ్ళ కిలాంటి అలవాటు లేకపోయినా వెతికారు. చాలా వెతికారు. పత్రికల్లో పబ్లిష్ చేయించాను. (పెదవి విరుస్తాడు)

ఇన:- మీరంటున్నది నాకు అర్థంకావడంలేదు.

వాసు:- ఏం? తెలుగులోనే మాట్లాడుతున్నట్టున్నానే ఇప్పటివరకూ? బహుశా మీకు రాజభాషా వ్యామోహం సామాన్య పౌరుడికంటే ఒక మోతాదు హెచ్చయిపోయినట్టుంది — తెలుగు వింటుంటే పరధ్యానం వృద్ధవు తోంది. ఆఁ, ఈ చిత్రం చూశావూ— మా అమ్మాయిది—ప్రస్తుతం ఇరవై ఏళ్ళ ముసలిది— ట్వెంటీ ఇయర్స్ ఓల్డ్, పద్నాలుగేళ్ళ క్రితం తప్పిపోయింది! ఫోర్టీన్ ఇయర్స్!

ఇన:- ఇందాక...విశాఖలో...ఆమె...మెడిసన్ చదువుతోందన్నారు?

వాసు:- ఎవరు ?

ఇన:- మీ అమ్మాయే,

వాసు:- మా శారదా? విశాఖపోనా? మెడిసిన్ చదువుతోందన్నానా? (జ్ఞాపకం వచ్చింది) ఓహో! ఆఁ ఆఁ! చదువుతోందికదూ? [మెరుపు] గాలి వాన వస్తోందికదా, తిరిగి వచ్చేస్తుంది. [మెరుపు ఉరుము] అవాళ కూడా ఇలా గాలివానే...నాకసలు ఇష్టంలేదు. అమ్మాయిని నాతో బాటు తీసుకెళ్ళడానికి. కాని, తీర్థం చూస్తానని ఒకటే గోల...తీసుకెళ్ళాను. నేను తీసుకెళ్ళాను, పోపిష్టివాణ్ణి (కంఠం వణుకుతుంది)

ఇన:- వాసుదేవంగారూ!

వాసు:- చూడుబాబూ, ఒక బరువంటూ తలమీద ఉన్నాక, దాని భారాన్ని ఎంత త్వరగా వదిలించుకుందామా అని ముసలివాళ్ళు పడే ఆవేదన వయస్సులో ఉన్న నీకు అవగాహన కాదు. అమ్మాయికి సంబంధాలు చూస్తున్నాను. నాకు నచ్చిన ప్రతివాళ్ళనూ అడుగుతున్నాను. కాని, ఎందుచేతనో ప్రతివాళ్ళూ నిరాకరిస్తున్నారు. నువ్వుకూడా నిరాకరించావ్...

ఇన:- నేను నిరాకరించలేదండి, మాటవరసకి అన్నాను.

వాసు:- [చిరునవ్వుతూ] నాకు తెలుసు యువకులతో ఉన్న పెద్ద చిక్కే ఇది. అయితే, నువ్వు నా 'లా' లో కొడుకువి—ఐమీన్, సన్-ఇన్-లా-అయేందుకు అంగీకరించావన్నమాట!

[రాంబాబు వస్తాడు. వదులైన తెల్లచొక్కా, షరాయి—నీటుగా ఉంటాడు ఇన్‌స్పెక్టరు వాణ్ని చూస్తాడు. చూస్తూ అలానే ఉండిపోతాడు. రాంబాబు ఇన్‌స్పెక్టర్ని చూసి భయపడి, మళ్ళీ వచ్చినట్టే ఇ ట్లోకి పోబోతాడు. ఇంతలో వాసుదేవం వెనక్కి చూస్తాడు.]

వాసు:- నౌర్! [రాంబాబు ఆగుతాడు] ఇలారా [జంకుతూ వస్తాడు] యితను మా కొత్త నౌర్', బుద్ధిమంతుడిలా అగపించాడు. పైకొచ్చే గుణమేదో ఇతనికో ఉందని, పిలిచాను. దానికిగాను మనం కష్టమనుకోకుండా పడను పడితే, రేపు ఏ ఫారిను ఎంబాసిడరుగానో అయిపో వచ్చు. ఏమంటావ్?

[ఇనస్పెక్టరు రాంబాబు వైపు చూస్తాడు. వినిపించుకోకుండా వాసు దేవం పిలుస్తూ వాసుదేవం యిన్స్పెక్టరువైపు ఒకసారి చూస్తాడు.]

వాసు:- ఏందేమిటయ్యా, అలా చూస్తావ్?

ఇన:- అబ్బె, ఏం లేదు... ఇతను మీ యింట్లో పనిచేసే కుర్రాడా?

వాసు:- ఆc— ఏం అలా అడుగుతున్నావ్?

ఇన:- అబ్బె, ఏం లేదులెండి...ఏమీ లేదు.

వాసు:- ఆc, నౌకర్. నువ్వు వెళ్ళి, వంటయ్యతో చెప్పి రెండుకప్పుల కాఫీ పట్రా. ఆ, యిదిగో ఈ కాఫీ తీసుకుపో.

[ఇనస్పెక్టరు తాగకుండా విడిచిపెట్టిన కాఫీ కప్పునే చూపించి, వాసుదేవం లోపలికి వెళతాడు. రాంబాబు దాన్ని తీసుకోవడానికి భయంగా యినస్పెక్టరు మొహంలోకిచూస్తూ కప్పు దగ్గరికి వస్తాడు. ఇనస్పెక్టరుకూడా రాంబాబు మొహాన్ని చూస్తూ కప్పు దగ్గరికి వస్తాడు. రాంబాబు గభాలున కప్పు తీసుకుని వంటింటోకి వెడతాడు వడిగా.]

వాసు:- (లోనినుండి వస్తూ) ఆ,... 'లా' లో కొడుకా! పెళ్ళి అమ్మాయి వచ్చిన తక్షణం జరిగిపోవాలి. మరి అమ్మాయి ఇష్టపడుతుందో-లేదో అని నీకు సందేహం అవసరంలేదు. ఆమె తరపున నే చెపుతున్నా.

కావc:- (రాంబాబును తీసుకొని రమ్మేన వస్తూ) ఏమిటండీ ఈ అఘాయిత్యం? ఒక తడనిలేదు; మునసిలేదు. వాడెవడో తెలుసుకోకుండా మొదట నౌఖరీ యిచ్చేశారు. తర్వాత యిప్పుడు కులగోత్రాలు తెలుసుకోకుండా వంటింట్లోకి కూడా ప్రవేశింప జేస్తున్నారు. రేపు—

వాసు:- ఏమయ్యా, నౌర్! నీ కింవాకి చెప్పలేదటయ్యా? వంటిల్లుతప్ప మిగతా గదుల్లో తిరగటం నీకు నిషేధమని?

కావc:- బాబూ, వాసుదేవంగారూ! ఈ యింట్లో నే నెంత వంట బ్రాహ్మణు డ్నైనా యిలా జాతులూ, వర్ణాలూ తెలుసుకోకుండా అడ్డమైనవాళ్ళ నందర్నీ యింట్లోకి రప్పించేస్తుంటే, నేను చూస్తూ వూరుకోలేను.

ఏదో చదువులేదు కాబట్టి నా ఎదురుగానే బ్రాహ్మణ్యం మంటకలసి పోతూవుంటే నేను సహించలేను.

ఇన:- మీ రంతలా ఆవేశపడకండి కావయ్యగారూ! యింతకీ ఈ అబ్బాయి ఎవరు?

కావ:- ఏమో బాబూ! నాకేం తెలుసు? పిలిచారు; తీసుకొచ్చారు, పనిచ్చారు.

వాసు:- మొదట్లో ఆయన్నికూడా అలానే పిలిచి, తీసుకొచ్చి, పనిచ్చాను.

కావ:- అందుకే బాబూ, నాకు తగిన శాస్తి చేస్తున్నారు.

ఇన:- ఏయ్ అబ్బాయ్! యిలా రా. (రాంబాబు వణికిపోతాడు) యిలా రమ్మంటూంటే? ఎవరు నువ్వు? మాట్లాడవేం?

వాసు:- నెల జీతగాడ్నని చెప్పవయ్యా నౌకర్..., అయినా అల్లుడూ, నీ కెందుకయ్యా ఈ క్రాస్ ఎగ్జామినేషన్! వాళ్లల్లో వాళ్ళు ఎప్పుడూ ఇలానే కీచులాడుకుంటూ వుంటారు. యాచకో యాచక శ్శత్రువు.

కావ:- అదిగో, అదే ఎద్దంటూంట! నేను యాచకుణ్ణా? నేను, ఈ జంధ్యప్పోగు వేసుకున్న ద్రావిడప్పిండాన్ని, నేనా యాచకుణ్ణి? వాడూ (రాంబాబుని చూపిస్తూ) యాచకుడు. యాచక నిర్వచనానికి వాడు తగిన ఉదాహరణ——

వాసు:- అబ్బ! అంతలా ఆవేశపడకండి, కావశాస్త్రిగారూ! ఆ పిలకా, ఆ యజ్ఞోపవీతం, ఆ గావంచా, ఆ విభూతిబొట్లూ మీ యాచకత్వాన్ని సూచిస్తాయని లోకం నమ్మొద్దటండీ? ఒకవేళ నమ్మితే, అది నా తప్పుకాదు... అసలీ గొడవంతా వాడిమూలాన కదూ వచ్చింది? నౌకర్! నువ్వా యింట్లోకిపో... (రాంబాబు పోవును) సరే, యిహ తమరా ప్రమాదవనంలోకి నిష్క్రమించండి.

కావ:- యాచకుణ్ణట, యాచకుణ్ణి! [గొణుక్కుంటూ వంటింట్లోకి వెళతాడు.]

వాసు:- పిచ్చి బ్రాహ్మడు! ఈ కావయ్య ఏ పరిషత్తులోనూ నటించడు గాని, నటిస్తే ఉత్తమ హాస్యనట శేఖర బిరుదు తగిలించవచ్చయ్యా?

ఇన:- ఆ అబ్బాయి మీ యింట్లో ఎంతకాలంగా పనిచేస్తున్నాడు?

వాసు:- ఏ అబ్బాయి నౌరా చాలా సేపటి నుంచి పని చేస్తున్నాడు

ఇన:- ఏ పనులు చేస్తుంటాడు సాధారణంగా?

వాసు:- వంట పనులు తప్ప మిగతా పనులు చేయవలసి ఉందదు— యింకా సరిగా ప్రోగ్రామ్ ఫిక్స్డ్ చెయ్యిలేదనుకో. ఏమిటి కథ, అంత తీక్షణంగా అడుగుతున్నావ్ వాడిగురించి? కొంపతీసి వాడిమీద ఏ చోరీ నేరమో మోపవు కదా?

ఇన:- అబ్బె! అదేం లేదులెండి. (రాంబాబు వెళ్ళిన గదిలో ఏదో పడిన శబ్దం) ఆ గదిలో ఏదో చప్పుడవుతోంది!

వాసు:- ఏ గదిలో?

ఇన:- అదేనండి వాడు దూరిన గదిలో.

వాసు:- నౌర్ స్వగతంలో కావయ్య అన్న మాటలకు విచారిస్తున్నట్టున్నాడు... కుర్చీలు, బెంచీలు సానుభూతి చూపిస్తున్నాయి. రండి పోయి చూసివద్దాం.

[ఆ గదిలోకి 'నౌర్' అనుకుంటూ వెడతాడు. ఇన్స్పెక్టరు అతనితో బాటే వెడతాడు. కాని, ద్వారం దగ్గరకి వెళ్ళగానే ఏదో ఉపాయం తోచినట్టు, వాసుదేవం ఆ గదిలోకి వెళ్ళగానే వంటింటి వైపు వెళ్ళి, కావయ్యని పిలుస్తాడు.]

ఇన:- కావయ్యగారూ! కావయ్యగారూ!

కా:- (వస్తాడు) ఏమిటండీ-: ఇంకా కాఫీ తయారుకాలేదు బాబూ...... మరోక్షణం కూర్చోండి మరగేసి ఇస్తాను.

ఇన:- మీ కాఫీ బంగారంగానూ, కాఫీ గురించి కాదయ్యా మిమ్మల్నిప్పుడు పిలిచింది. మాట— యిలా రండి. (కావయ్య దగ్గరగా వస్తాడు) ఆ కుర్రాడు ఎవరు?

కావ:- ఏమో— నాకేం తెలుస్తుంది— చెప్పండి? బాబూ, అడ్డమైన వాళ్ళకంతా ఈ కొంప ధర్మసత్రమైపోయింది. గుంటూరులో ఉన్నప్పుడు ఎంత కరెక్ట్‌గా ఉండేది! యిప్పుడదంతా పోయింది. అమ్మగారితోనే... ఒక అప్రాచ్య దొస్తాడు— వాడికి కాఫీ తగలెట్టాలి. షరో లేకివా

డెవడో వస్తాడు. వాడికి ఉద్యోగమిస్తారు. మరో అనామకు డెవడో వస్తాడు. వాడికి (చిత్రంచూపిస్తూ) ఆ అమ్మాయిని అంటగడతారు. మరి ఆ వచ్చేవాళ్ళే పిచ్చివాళ్ళో, లేక ఈ మాట్లాడే వకీలుగారే పిచ్చివారో తేల్చుకోలేక మధ్య నేను పిచ్చివాడ్నయిపోతున్నాను బాబూ! మీరు పోలీసు మనిషిలా అగుపిస్తున్నారు. ఎంతో పుణ్యం చేసుకొని పుట్టి వుంటారు. ఆ ఉద్యోగం దొరికింది. దొరికిన ఆ ఉద్యోగ హోదాతో మమ్మల్ని వేధించకండి, మహాశయా! నా మానాన నన్నిలా ఆ ప్రమాదవనంలో పిండివంటలు చేసుకోనివ్వండి.

ఇన:- నన్ను అపార్థం చేసుకొంటున్నట్టున్నారు. కామశాస్త్రిగారూ! నేను అడుగుతున్నది ఆ కుర్రాడి గురించి— యిందాక ఒక దొంగను తరుముకొచ్చాం.

కావ:- దొంగనా ?

ఇన:- వాడు దొంగే కాదు; ఖూనీ చెయ్యబోయాడు కూడా!

కావ:- ఖూనీయే! ఖు—ఖు—ఖూనీ...

ఇన:- సమయానికి మేము కనిపెట్టి వాడ్ని తరుముకొచ్చాం......వాడీ యింట్లో దూరడం స్వయంగా చూశాం.

కావ:- ఈ యింట్లోనే?...దొంగే!

ఇన:- మీరు భయపడకండి. శాస్త్రిగారూ! నా దగ్గర పిస్తోలుంది.

కావ:- ఆ పిస్తోలు మిమ్మల్ని రక్షిస్తుంది, కాని, మమ్మల్ని రక్షించదు... బాబూ! పోలీసుబాబూ! మీకు పుణ్యం ఉంటుంది. వెంటనే ఇల్లంతా గాలించండి బాబూ! ఆ దొంగ యిహ నీకొంపలో ఏం దోచుకు పోతాడో—ఎందర్ని ఖూనీ చేసిపోతాడో!

ఇన:- భయపడకండి, కావయ్యగారూ! మీరు నాకు చిన్న సహాయం చేసి పెడితే, దొంగ యిట్టే దొరికిపోతాడు.

కావ:- ఏమిటి త్వరగా చెప్పండి బాబూ! గొంతు కెండిపోతోంది.

ఇన:- ఆ కుర్రాడెవరు?

కావ:- నాకు తెలీదు బాబూ! ఆయన పిలిచారు, ఉద్యోగమిచ్చారు.

ఇన:- ఎప్పటినుంచి పనిచేస్తున్నాడీ యింట్లో?

కావ:- నాకు తెలిసినంతవరకూ, వాడు ఈ క్షణంనుంచే పనిచేస్తున్నాడు.

ఇన:- ఈ క్షణంనుంచా? అంటే ఈవేళ క్రొత్తగా చేరాడనా మీ ఉద్దేశం?

కావ:- చేరడమేమిటి బాబూ! ఎవడో దారినపోయే దానయ్యను ఈయన పిలిచి ఉంటారు. ఇహనేం, మా దానకర్ణయ్య ఉద్యోగం యిచ్చేశారు!

ఇన:- వాడిక్కడికి వచ్చినప్పుడు బికారిలా ఉన్నాడా?

కావ:- ఆఁ, అంతకంటే ఘోరంగానే ఉన్నాడు. చిరిగిన దుస్తులు, యిప్పుడంటే ఆ గుడ్డలు కట్టుకొని టింగురంగాలా...

ఇన:- ఓ! ఐసీ! వాసుదేవంగారికి వాడి విషయం తెలుసా?

కావ:- తెలిసుండదు బాబూ, తెలిసుండదు. ఆయనకు ఒకళ్ళ గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలనే తాపత్రయం ఎప్పుడూ లేదు. పిలుస్తారు, ఏదో అంటారు. అమ్మాయి చిత్రం చూపిస్తారు. బాగుందా అంటారు. పెళ్ళాడతావా అంటారు. ఆ వచ్చినవాడు ఆ చిత్రంలోని అమ్మాయి అందానికీ, ఈయన డబ్బుకీ లొంగిపోయి పెదవులు తడుపుకొంటాడు. ఎగిరి గంతేస్తాడు. అలా వాళ్ళ కుప్పిగంతులు చూసి ఆనందించడం ఆయనకో సరదా!

ఇన:- [బెదరి] అంటే......, వాసుదేవంగారు అమ్మాయి ఫోటోను చూపించి, కుర్రాళ్ళను ఏడిపిస్తుంటారంటారా?

కావ:- కుర్రాళ్ళనే మాటేమిటి? మొన్న శతవృద్ధు డొకడు తప్పిజారీ యింటికొస్తే, ఆయనకా ఫోటో ఆశా, తన ఆరేడు లక్షల ఆశా చూపించి, ప్రధానం చేసేసి, అప్పటికప్పుడు పెళ్ళి సరంజామా అంతా తయారుచేయించేసి, తీరా ఆ ముసలాడు పీటంమీదకూచునే సరికి, ఆ ఫోటోను తీసుకొచ్చి ఆయన్ని మంగళసూత్రం కట్టమన్నారు.

ఇన:- ఆయన ఉద్దేశమేమిటి అలా చెయ్యడంలో ?

కా:- ఉద్దేశం? ఆ ముసలాడి ఉద్దేశ మేమిటి, ఆయన పిచ్చి మాటలు నమ్మి పెళ్ళిపీటలమీద కూచోడంలో? [యిన్‌స్పెక్టర్‌కి అర్థంకాదు; ఫోటో వైపు చూస్తాడు.] వాసుదేవం బాబుగారు గొప్ప చిత్రకారులు బాబూ! ఆయిన భార్య గుంటూరులో పోయిన దగ్గరనుంచీ కూడా అయిన అదోలా మారిపోయారు. పిచ్చి పిచ్చిగా ఎవేవో మాట్లాడతారు; ఏవేవో బొమ్మలు వేస్తారు, అన్నీ ఒకేలాగున ఉంటాయి. అన్నీ ఆ అమ్మాయి చిత్రాలే, వాటిని వచ్చిన వాళ్లందరికీ చూపిస్తారు.

ఇన:- ఇంతకీ, ఆ ఫోటో ఆ అమ్మాయిది కాదంటావా ?

కా:- అహఁ! వారి అమ్మాయిదే నని వాసుదేవంబాబుగారి ఊహ. ప్రస్తుతం ఆమె అలానే ఉండేదని వారి భావం.

ఇన:- ఆమె విశాఖలో డాక్టరీ చదువుతోందన్నారు?

కా:- ఓహో! మీకుకూడా చెప్పారన్నమాట! బాగుంది. బాగుంది! అయితే, పెళ్ళాడేందుకు మీ రొప్పుకున్నారా ? అహఁ— ఎందు కొప్పుకోర్లెండి అందం; డబ్బు—

ఇన:- అబ్బే? అదేం లేదులెండి... మీరు నిజం చెప్పండి ఆమె నిజంగా విశాఖలో ఉందా?

కా:- ఉండాలనేది బాబుగారి ఆశ. ఆమెను డాక్టర్ని చదివించి, ఎక్కడో సీమలకు పంపించి పెద్ద చదువులు చదివించాలని వారి ఆశయం. [లోన దగ్గు] కాని, పాపం— [ఆగిపోతాడు]

ఇన:- కాని, ఏమిటి కావయ్యగారూ ?

కా:- అదిగో— బాబుగారొస్తున్నారు !

వాసు:- [వస్తూ] అల్లుడూ! నిష్కారణంగా మా 'నార్'ని బెదిరించేశావోయ్. నీ ఎదుట పడటానికి భయపడిపోతుందేనూ! (కావయ్యతో) ఏమయ్యో కావయ్యా! పకోడీలు, రెండు కప్పుల కాఫీ తీసుకురమ్మనమని నీకు చెప్పుకనగా చెప్పానయ్యా? (గాలి) అదిగో, గాలివాన వొస్తున్నట్టుంది, తలుపు మూసేస్తా. (కావయ్య వంటింట్లోకి వెడతాడు. వాసుదేవం

వీధివైపు వెళుతూ) అహఁ! గాలివాన హెచ్చితే ప్రమాదం కదూ? అమ్మాయి వస్తూందీవాళ్ళే! (మెరుపులు, ఉరుములు. ఇన్‌స్పెక్టర్ వాసుదేవాన్ని చూస్తూ, ఆలోచిస్తూ నిలబడతాడు. మెరుపులు ఘోరంగా మెరుస్తాయి. చాలాసేపు ఆలోచించాక మెల్లగా వాసుదేవం దగ్గరకి వస్తాడు.)

ఇన:- వాసుదేవంగారూ!

వాసు:- (వెనక్కి తిరక్కుండానే) ఆఁ.

ఇన:- మిమ్మల్నో విషయం అడుగుతాను, చెప్తారా?

వాసు:- (వెనక్కి తిరగడు) అడగండి, వింటాను.

ఇన:- వినడంకాదు; సమాధానం చెప్పాలి.

వాసు:- (తిరక్కుండానే) ఊఁ?

ఇన:- ఈ గాలివానకూ, మీ అమ్మాయికీ సంబంధమేమిటి?
[మెరుపూ, ఉరుమూ ఒకేసారి. చప్పున తిరుగుతాడు వాసుదేవం]

వాసు:- [తిరిగి] వ్వాట్ !

ఇన:- అహఁ— అడుగుతున్నా ... ఈ గాలివానకూ, పద్నాలుగేళ్ళనాటి కోట్లింగాల తీర్థానికీ, మీ అమ్మాయి ప్రస్తుతం మెడిసిన్ చదవడానికీ సంబంధ మేమిటి?

వాసు:- ఏమీలేదు— నథింగ్.

ఇన- మీ అమ్మాయి ఈవేళే వస్తుంది.!

వాసు:- ఎవరు చెప్పారు?

ఇన:- నాకు తెలుసు.

వాసు:- నీకేం తెలుసు? యు నో నథింగ్.

ఇన:- అని, మీ రనుకుంటున్నారు. కాని, నాకు మీ అమ్మాయి బాగా తెలుసు.

వాసు:- నువ్వు చూశావా?

ఇన:- ఆఁ.

వాసు:- ఎక్కడ?

ఇన:- గుంటూరులో.

వాసు:- అబ్సర్డ్. ఆమెను విశాఖ పంపించాలనుకుంటున్నాను.

ఇన:- ఎందుకు?

వాసు:- మెడిసిన్ చదివించడానికి.

ఇన:- మెడిసిన్‌కి విశాఖే ఎందుకు పంపించాలి? గుంటూరులో కూడ మెడికల్ కాలేజీ ఉందిగా?

వాసు:- గుంటూరు పేరెత్తకు. ఐ హేట్ గుంటూరు.

ఇన:- ఏం?

వాసు.- మీకు తెలీదు. గుంటూరు నా భార్యను బలి తీసుకొంది. అది టైఫాయిడ్‌తో మంచమెక్కితే, గుంటూరు దాన్ని బ్రతికించ లేక పోయింది! అది బాధతో నావైపు ఎంత దీనంగా చూసేదనుకున్నావ్? ఒక్క డాక్టర్ కూడా దానిని సజీవం చెయ్యలేకపోయాడు. అది పోయింది—రెండేళ్ళ శారదను (చిత్రం చూపిస్తూ) నా చేతుల్లో పెట్టి నా జానకిని బలి తీసుకున్న గుంటూరులోనా శారదను డాక్టరీ చదివించడం? నో! అబ్సర్డ్.

ఇన:- ఆ షాకుతో మీరు శారదను డాక్టర్ చేయాలనుకున్నారు.

వాసు:- అవును. అవునని నీకు చెప్పినట్టున్నాను. ఓ! ఐయామ్ సారీ! నీకాదు; మా కావయ్యకు లాగుంది చెప్పాను... నౌకర్! నౌకర్! [రాంబాబు వస్తాడు] వెళ్ళి, ఆ కావయ్య ఏం చేస్తున్నాడో త్వరగా పకోడిలు, రెండుకప్పుల కాఫీ తీసుకరమ్మనమను.

[రాముడు వెడతాడు. వంటింటి బయటనుంచే కేకేస్తాడు.]

రాం:- కావయ్యగారూ!

ఇన:- వాసుదేవంగారూ! ఈ కుర్రాడెవరో మీకు తెలీదనుకుంటాను! [వొంగి అతని చెవిలో] వీడు దొంగ!

వాసు:- దొంగ! కనీసం ఏ ఘరానా మహనీయుడైనా కాకుండా దొంగ బిరుదు సంపాయించుకో గలిగాడంటే! ఎందుకు నేనిందాక చెప్పాను గా, ఈ అబ్బాయిలో పైకొచ్చే గుణా లున్నాయని - లెట్ మి కంగ్రాచ్యులేట్ హిమ్...
[పిలుస్తాడు] నౌర్!

రాం:- [వస్తూ] ఆయన వస్తున్నారండి

వాసు:- ఆయన కాదుగాని, నువ్విలారా! నువ్వు ఎవ్వరితో చెప్పకుండా చాలా గొప్పవాడివై పోయావే!

రాం:- ఏమిటి, బాబుగారూ?

వాసు:- నువ్వు దొంగవని ఈ పోలీస్ ఇన్‌స్పెక్టరు డిస్కవర్ చేశారు.
[రాంబాబు తొట్రుపడతాడు. వాడి ప్రవర్తనను సునిశితంగా కని పెడుతూ ఉంటాడు ఇన్‌స్పెక్టరు] నీలో రాజకీయ నాయకుడయ్యే గుణాలున్నాయని నేను కనిపెడితే, ఈయన నీలోని 'దొంగ బుద్ధి'ని డిస్కవర్ చేశారు... అదేమిటలా కంగారు పడతావ్? 'దొంగ బిరుదు' వచ్చినంతలో నువ్వేం గొప్పవాడివై పోలేదులే! [రాంబాబు కంగారు అర్థంకాక ఇన్‌స్పెక్టరువైపు చూస్తాడు- వాళ్ళిద్దరూ తన మాటలు వినడంలేదని] అదేమిటయ్యా అల్లుడూ, అతన్నలా పట్టిపట్టి చూస్తావు?

ఇన:- అదేనండి, ఎలా అరెస్టు చెయ్యడమా అని ఆలోచిస్తున్నా.

వాసు:- అరెస్టా, సన్మానమా?

రాం:- నేను దొంగను కాదు బాబూ! నేను దొంగతనం చెయ్యలేదండీ

వాసు:- అదేమిటోయ్! పిలిచి నీ దొంగబుద్ధికి మెచ్చుకొని, 'భాగవతరత్న' అనే బిరుదిస్తూంటే! నేను దొంగను కాదు అని నీ ఘనతను నువ్వే రెఫ్యూజ్ చేసేసుకొంటున్నావు?

ఇన:- [వాసుదేవం మాటలు వినిపించుకోడు, పళ్ళు కొరుకుతూ] దొంగ తనం చెయ్యలేదూ? సరే, నువ్వెక్కడికి తప్పించుకు పోలేవు. నేను బయటే ఉంటా. న్యాయంగా ఒప్పేసుకొని లొంగిపో, లేదా నీచేత ఎలా ఒప్పించడమో నాకు తెలుసు. (పోతాడు)

వాసు:- వెళ్ళిపోతున్నావా? సన్మాన సభ ఎప్పుడు?

కా:- అయ్యో! కాఫీ! (రెండు కప్పుల కాఫీతో ప్రవేశం)

వాసు:- (చూసి) అల్లుడూ, కాఫీ!

ఇన:- వద్దు! థాంక్స్! (పోతాడు)

వాసు:- పోనీ, అమ్మాయిని పెళ్ళాడు.

ఇన:- వెరీ మెనీ థాంక్స్ (పోతాడు)

కా:- ఆ పోలీసతనికి కూడా పెళ్ళి చేస్తామన్నా రేమిటి?

వాసు:- ఆఁ చూడూ, తండ్రిసికదా? (ఒక కప్పు అందుకొని) ఆఁ! నౌర్! నువ్వో కప్పు తీసుకో! ఫర్వాలేదు; సర్వ సమానత్వం.

కా:- అవ్వ! అవ్వ! ఇది బ్రాహ్మణ కొంపండి!

వాసు:- ఇతను ఇప్పుడు మనకంటే గొప్పవా దయ్యాడయ్యా- ఇతనికి పోలీసులు మంచి సన్మాన సభ ఏర్పాటు చేస్తున్నారు.

కా:- ఎందుకు?

వాసు:- దొంగతనం చేశాడట!

కా:- దొంగతనమే!!

రాం:- నేను దొంగతనం చెయ్యలేదు బాబూ—— మీ పాదాల సాక్షి.

వాసు:- చూశావా? గొప్పవాళ్ళంతా తమ గొప్పతనాన్ని ఎలా ఒప్పుకోరో?

కా:- బాబూ! నాకు మొదటినుంచీ తెలుసు. వీడి వాలకం చూస్తూవుంటే నా కలానే అనిపించింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఆ పోలీసతన్ని పిల్చి వీణ్ణి అప్పజెప్పేయండి.

రాం:- మీ కాళ్ళు పట్టుకుంటాను. కావయ్యగారూ! భగవంతుడి సాక్షిగా నేను దొంగను కాను. నన్ను వాళ్ళ కప్పజెప్పితే వాళ్ళు నన్ను బ్రతకనివ్వరు.

వాసు:- అదేమిటోయ్, అలా భయపడిపోతావ్? గొప్పవాడయ్యే గుణాలు ఎవడి దగ్గ రున్నాయో వాడల్లా పోలీసువాళ్ళచేత వళ్ళు మాలిష్

చేయించుకోవాలి. పర్వాలేదులే; జైల్లో పద్దం ఒక సర్టిఫికేట్- అయి దెకరాల పారితోషికం ముట్టేందుకు.

కా:- బాబూ, మీ వెర్రి మీదే! దొంగలతోకూడా మీ హాస్యాలా? మీరు పాముని చేరదీశారు. దానికి పాలుపోసినా కరవక మానదు.

రాం:- నే నలాంటివాడ్ని కాదు బాబూ- మీ పాదాలు పట్టుకొని చెబుతున్నా.

కా:- మరి, నీ వెనకాల పోలీసు లెందుకు పడ్డారు?

రాం:- నేను దొంగతనం చేశానని, ఎవర్నో ఖూనీ చెయ్యబోయానని...

వాసు:- ఇహనేం, నీకు ఇంటర్నేషనల్ ఫేమ్ వచ్చేస్తుంది!

కా:- మీ రూరుకోండి బాబూ! ఆలస్యంచేస్తే వీడు మనల్నీ హతమారుస్తాడు. పోలీసుల్ని పిలుస్తా. (పోబోతాడు)

రాం:- (అడ్డుపడి కాళ్ళు పట్టుకొని) నేను నిజం చెబుతున్నాను బాబూ! నేను ఖూనీ చెయ్యలేదు; దొంగతనం చెయ్యలేదు.

కా:- మరి, ఏమీ చెయ్యకపోతే, పోలీసువాళ్ళు నీ వెనకాలెందుకు పడ్డారంట?

వాసు:- పనిలేక. ఆంధ్రప్రదేశ్ వచ్చేశాక పోలీస్‌వాళ్ళకి తిండి ఎక్కువై పని తక్కువై పోయిందికదా, అందుకని—

కా:- నువ్వెక్కడుంటున్నావ్?

రాం:- చంగయ్యగారింట్లో మా నాన్న పని చేస్తున్నాడు బాబూ!

వాసు:- చైర్మన్ చంగయ్యా! వెరీగుడ్! చాలా ఉదార స్వభావుడాయన. మొన్న మునిసిపల్ ఎన్నికల్లో పేదలందరికీ ఓటుకో నోటు సంతర్పణ చేశాడని పత్రికలన్నీ ఆయన్ని వేనోళ్ళ కొనియాడాయి కూడా ఆ మధ్య.

కా:— నువ్వాయన ఇంట్లో ఎంతకాలంగా ఉంటున్నావ్?

రాం:- నేను పుట్టక పూర్వంనుంచీ కూడా మా నాన్న ఆయన దగ్గర నౌఖరీ చేస్తున్నాడు బాబూ!

వాసు:- జీతం ఎంతిస్తుంటా డాయన?

రాం:- నాకు తెలియదు బాబూ!

వాసు:- పోనీ, ప్రివిలేజ్ లీవు?

రాం:- ఏమో బాబూ!

వాసు:- పోనీ, నాయకులు పుట్టిన దినాల్లో కాని—

కా:- మీ రూరకోండి బాబూ! నవ్వు చంగయ్యగారింట్లోనేనా దొంగతనం చేసింది?

రాం:- అది దొంగతనం కాదు బాబూ!

వాసు:- అవును, నాకు తెలుసు.

రాం:- నాకో చెల్లెలుంది.

వాసు:- అవును, పెళ్ళి అదీ అయిందన్నావు కదూ?

రాం:- లేదు బాబుగారూ; పెళ్ళి కాలేదు.

వాసు:- వయస్సెంత?

రాం:- ఇరవై.

వాసు:- అయితే, చచ్చావ్. ఆ పిల్ల నింకెవ్వరూ చేసుకోరు. డబ్బున్నవాళ్ళ ఇళ్ళల్లో ఆడపిల్లలు ముదిరిపోయినా ఫర్వాలేదు కాని, మీలాంటివాళ్ళ ఇళ్ళల్లో ఆడపిల్లలు దోరగా ఉండగానే ఆ మూడు ముళ్ళూ వేయించాల్సొంటుంది.

రాం:- మా నాన్న అలానే అంటూండేవాడు. కాని, మా అమ్మే అభ్యంతరం పెట్టేది.

కా:- ఏం?

రాం:- మా అమ్మ కర్కోటకపుది బాబూ! మా చెల్లెల్నెప్పుడూ తన కూతురిలా చూసేది కాదు. ఎప్పుడూ ఆ చంగయ్యగారి గదిలోనే ఉండమనేది.

వాసు:- ఎందుకు?

రాం:- ఎందుకంటే ఏం చెప్పాలి బాబూ! కడుపు చించుకొంటే కాళ్ళమీద పడుతుంది.

కా:- విన్నారా బాబూ ? ఇలాంటి వెధవలకిక పుట్టగతులుంటాయా? కడుపున పుట్టిన పిల్లల్ని సైతం పడుపువృత్తిలోకి దించే జాతి—

రాం:- (అరుస్తాడు) కావయ్యగారూ!

కా:- (భయపడుతాడు)

రాం: మేము పేదవాళ్ళమయ్యాము. కాని, మాకా బుద్ధులు లేవు బాబూ!

కా:- మరి ఇదేవిటోయ్?

రాం:- ఖర్మ, బాబూ ఖర్మ. ఈవేళ తింటే—రేపు పస్తు. ఆకలీ, దాహంకి కూడా మామీదే కసి! ఎంతకని కడుపులో కాళ్ళెట్టుకొని పడుకుంటాం? ఎంతకని మంచినీళ్ళతో కాలం గడుపుతాం?

కా:- అందుకని ఆడకూతుర్లని అమ్ముకు బ్రతుకుతారన్రా?

రాం:- నోర్ముయ్!

వాసు:- నువ్వు నోర్మూసుకోవయ్యా, కావయ్యా! కథ మంచి సస్పెన్స్‌గా ఉంది. ఆ తర్వాత ఏవయింది? మీ చెల్లెలికీ, చెంగయ్యకూ—

రాం:- బాబూ, మీరూ ఆదేమాటా? (చిత్రం చూపిస్తూ) మీ కూతురే ఆ స్థితిలో ఉంటే—

వాసు:- నా కూతురా? నా కూతురెప్పుడో పోయింది. నా శారదమ్మ ఏనాడో తప్పిపోయింది. పిచ్చివాడా!

రాం:- నాకా సంగతి తెలీదు బాబూ.

వాసు:- నీకేకాదు. ఎవరికీ తెలీదు నా బాధ!

రాం:- అవును బాబూ! ఎవరిబాధ ఎవరి కర్మమవుతుంది? ఆ చెంగయ్యబాబు మా లక్ష్మిమీద కన్నువేశాడు. ఆయన గది లక్ష్మే తుడవాలట; అలంకరించాలట...మా అమ్మ తుడిచినా, నేను శుభ్రం చేసినా కసురుకొనేవాడు,

కా:- పాపం! అలవాటైపోయుంటుంది మరి...

రాం:- (కోపంగా చూసి) అవును బాబూ, అలవాటే ... ఒకనాడు మా చెల్లెలికి జ్వరంవచ్చి ఆయన గది ఊడ్వడానికి వెళ్ళకపోతే, ఆయన

తిన్నగా మా కొంపకి వచ్చేశాడు. మూడు దినాలూ మా దగ్గరేఉండి, డాక్టర్ని రప్పించి మందు లిప్పించాడు.

వాసు:- చంగయ్య చాలా ఉదార స్వభావుడోయ్—ఇందాక అన్నావుగా?

కా:- పాపం! మీ చెల్లెలంటే ఆయనకెంత ప్రేమో!

రాం:- ప్రేమకాదు బాబూ! ఏదో కోరిక. మొన్న సాయంకాలం మా చెల్లెలు ఆయన గది ఊడ్వడానికి వెళ్ళింది. గది ఊడుస్తున్నప్పుడు ఆయ నొచ్చాడట! తలుపు వేసేశాడు. మా చెల్లెలు ఎంత ప్రతిమాలుకున్నా వినిపించుకోకుండా ఆమెను బలవంతం చేశాడు.

వాసు:- బలవంతం చేశాడా? ఆయన చాలా మంచివాడని అనుకుంటున్నానే

రాం:- ఆయన అనుభవిస్తున్న మంచి మాకు తెలుసుబాబుగారూ! ఆయన మాటకు ఎదురాడలేక లోలోపలే కుళ్ళిపోతున్న పేదవాళ్ళకు తెలుసు...ఆమె అరవబోయిందట. ఈయన నోరు మూసేశాడు. అయిదారేళ్ళుగా ఆయనలో ఉన్న కోర్కెను వెళ్ళగక్కాడు. లక్ష్మి ఏడ్చి కాళ్ళమీద పడిందట. ఆయన వినిపించుకోలేదు. ఆమె గట్టిగా అరిచేసరికి నోటితోబాటు పీక కూడా నొక్కేశాడు.

వాసు:- నోరు నొక్కేశాడా?

కా:- చచ్చిపోయిందా?

రాం:- దేవుడు మా పాలిట ఉన్నాడు బాబూ! అది తప్పించుకొని బయటకు వచ్చేసింది. లక్ష్మి ఇంటికి వచ్చి ఒకటే ఏడుపు. అమ్మ దాన్ని ఓదార్చడం పోయి, తిట్టడం మొదలెట్టింది. 'కాళ్ళ దగ్గరికి సిరి వస్తూంటే తన్ను కొచ్చేశావటే - ఇలాంటి అవకాశం కోసమే ఇన్నాళ్లు ఎదురుచూశా,' అని ఆమె ఒకటే తిట్టడం. చివరికి ఆమె లక్ష్మిని కొట్టింది కూడా! అంతవరకూ మా అమ్మ—దాన్ని అమ్మా అనేందుకుకూడా నోరు రావడంలేదు—కాని, నిజరూపం తెలీదు. ఊహించుకొనే కొద్దీ అమ్మమీద కోపం, కసి హెచ్చిపోయింది. అమ్మ లక్ష్మిని తిట్టేకొద్దీ నా వొళ్లు మండిపోయింది. లేచాను. నాకు అంతా చీకటనిపించింది. నాకంటె పెద్దది, నన్ను నవమాసాలూ మోసి,

కని, పెంచిన నా తల్లిని— ఏం చేస్తున్నదీ తెలుసుకోకుండా ప్రక్క నున్న కర్రతో చావమోదాను. చెప్పండి— నేను చేసింది తప్పా? ఆడకూతుర్ని పడుపు వృత్తిలోకి దింపాలని ప్రయత్నం చేసిన పాపి నాకు తల్లయితేనేం, ఎవరైతేనేం—

వాసు:- నువ్వు చాలా తప్పు చేశావోయ్, రాంబాబూ!

కా:- మీ అమ్మకు యెట్లా వుంది?

రాం:- ఇప్పుడు దాని తల దిమ్మంతా తగ్గిపోయి ఏడుస్తోంది.

వాసు:- మరి నువ్వు చెంగయ్యను ఖూనీ చెయ్యబోయినట్టు ఇన్‌స్పెక్టర్ గారు చెబుతున్నారు.

రాం:- ఖూనీ కాదు బాబూ! ఆయన అలాంటి అపనింద మోపారు. ఆ వేళ లక్ష్మిని ఆ బాబు బలవంతం చేసేటప్పుడు పెనుగులాటలో దాని మెళ్ళో గొలుసు తెగి పడిపోయింది. అది తిరిగి తీసుకొనేందుకు ఆ రాత్రి ఆయన గదిలోకి దూరాను దొంగతనంగా. ఆ గొలుసు లక్ష్మి మాకు దొరికినప్పుడు దాని మెళ్ళోఉన్న గొలుసు. (మెరుపు)

కా:- లక్ష్మి మీకు దొరికిందా? నీ సొంత చెల్లెలు కాదూ?

రాం:- కాదు బాబూ! స్వయానా నా చెల్లెలే అయితే, మా అమ్మ దాన్నలాంటి నీచపు పని చెయ్యమని బలవంతంచేసి ఉండేదా?

వాసు:- నిజమే, నే నలానే అనుమానించాను సుమా!

కా:- మీ రాగండిబాబూ... ఆ అమ్మాయి మీ కెక్కడ దొరికింది?

రాం:- మా నాన్నకు రాజమండ్రిలో దొరికిందట!

(ఉరుములు, మెరుపులు)

కా:- రాజమండ్రిలోనా?

వాసు:- ఎక్కడా !!!?

కా:- బాబూ ! బాబూ! మన శారదమ్మేమో! [మెరుపు]

వాసు:- అవునోయ్! కాని, మన శారదే అయితే, ఒకనాడు కాకపోతే ఒక నాడైనా మనింటికి రాదటయ్యా?

కా:- అదికాదు బాబూ! మీరాగండి. ఆఁ, రాంబాబూ! ఆ అమ్మాయి ఎలా ఉంటుంది?

రాం:- ఎర్రగా, సన్నగా—

కా:- చిల్లు బుగ్గలా?

రాం:- ఆఁ. నవ్వితే—

కా:- (పొంగిపోయి) కుడి చెక్కిలిమీద పుట్టుమచ్చ—?

రాం:- ఆఁ, ఉంది.

కా:- ఎడం చేతిమీద గాయం మచ్చ—?

రాం:- అవును బాబూ! ఉంది.

వాసు:- ముక్కుకి, ముక్కుపుడక పెట్టుకునేందుకు రంధ్రం—

రాం:- లేదు బాబూ—

కా:- (ఆనందంతో) అవును బాబూ, లేదు. చిన్నప్పుడు అమ్మగారే వద్దని గొడవపెట్టారు.

వాసు:- అవునోయ్—కాని, పేరు లక్ష్మి అంటున్నాడు.

కా:- మీ లక్ష్మి బంగారంకానూ, పేరులో ఏముందండి, మార్చుకొని ఉండొచ్చు.

వాసు:- ఓ, ఐసీ! ఆఁ, రాంబాబూ! ఇప్పుడు మీ చెల్లాయి (చిత్రం చూపిస్తూ) అలా ఉంటుందా?

రాం:- (లేదని తల అడ్డంగా తిప్పుతాడు)

వాసు:- అయితే శారద కాదు.

కా:- మీ రాగండి బాబూ!...నువ్వు ప్రస్తుతం వెంగయ్య గారింట్లోనేనా ఉంటున్నావ్?

రాం:- అవును బాబూ!

కా:- నీ లక్ష్మి ఎక్కడుంది?

రాం:- అక్కడే బాబూ!

కా:- అయితే నడు, నే వస్తా. లక్ష్మిని నే నానవాలు పట్టగలను.

వాసు:- అయితే నడు. తండ్రిని నేను, నేనూ వస్తాను.

(ముగ్గురూ బయలుదేరుతారు. ఇన్‌స్పెక్టర్ ఎదురువస్తాడు.)

ఇన:- ఆగండి, వాసుదేవంగారూ! వీడి మాటలు నమ్మి మీరు వీడి వెనకాల వెడుతున్నారా?

వాసు:- ఏం? కావయ్య ఏదో "క్లూ" లాగుతున్నాడు. లెట్ హిమ్ ట్రై.

ఇన:- కాదు. వొట్టిది, ఆలా మీతోబాటు బయటకొచ్చి, అక్కడ్నించి తప్పించుకు పారిపోడానికి ఇవన్నీ వీడు వేసిన ఎత్తులు. ఏరా, రాస్కెల్! నిజం చెప్పు. (మీదకు వస్తాడు)

రాం:- నిజం చెప్పాను బాబూ! నా మాట నమ్మండి బాబూ! దైవసాక్షిగా చెబుతున్నాను.

ఇన - పైగా ఇదొకటా! వెధవా, దొంగతనం చేసింది చాలక ఇంకా ప్రమాణాలుకూడా చేస్తున్నావా?

(పట్టుకుంటాడు. ఒకటి కొడతాడు)

రాం:- (వాసుదేవం, కావయ్యతో) బాబూ, కావయ్యగారూ? నా మాట నమ్మండి— నే చెప్పినవన్నీ నిజం. లక్ష్మి నా చెల్లెలు.

ఇన:- నోర్మూయ్!

రాం: (వాసుతో) బాబూ! మీరైనా నా మాట నమ్మండి బాబూ! రక్షించండి బాబూ! నన్ను నిష్కారణంగా చంపేస్తారు. మీ పాదాల సాక్షిగా దొంగతనం చెయ్యలేదు.

ఇన:- నోర్మూయ్!...దొంగతనం చేసిన ప్రతి వెధవా ఇదే ఏడుపు.

కా:- (వాసుతో) బాబూ! వాడి ఏడుపు చూస్తూంటే నాకెందుకో వాడు దొంగతనం చేశాడంటే నమ్మకం కలగడం లేదు.

వాసు:- నాకూ అలానే అనిపిస్తుందనుకో. (ఇన్‌స్పెక్టర్‌తో) చూడు అల్లుడూ!

ఇన:- మీరు మధ్యకు రాకండి.

కా:- వాడు దొంగతనం చెయ్యలేదు మొర్రో అంటూంటే, మీకు కనికరం వెయ్యదటండి.

ఇన:- కాపయ్యా! తమరు ఊరుకోవాలి.

వాసు:- ఇన్‌స్పెక్టర్! ఆ అబ్బాయిని విడిచిపెట్టు.

ఇన:- సారీ! మీరీ విషయంలో జోక్యం కలుగజేసుకోకండి. అనవసరంగా ఇబ్బందుల్లో పడతారు.

వాసు:- ఏమిటి? ఇబ్బందుల్లోనా? 'లా' క్షుణ్ణంగా తెలిసిన నన్నటయ్యా నువ్వు బెదిరిస్తున్నది? అయితే సరే, ఏదీ ఏ అధికారంతో నువ్వు, ఒక పెద్దమనిషి ఇంట్లో ఉన్న ఒకానొక వ్యక్తిని బలవంతంగా లాక్కెడుతున్నావ్?

ఇన:- వాడు దొంగ.

కా:- ఋజువు?

ఇన.- చెంగయ్యగారి రిపోర్టు.

వాసు:- అయితే, నా రిమార్కు లెక్కలేదా? అసలు నా అతిథిగా ఉన్న ఒక వ్యక్తిమీద నా ఎదురుగానే చెయ్యి చేసుకునే అధికారం నీకెవరిచ్చారు? చెప్పు నీ పేరేమిటి?

ఇన:- మీరు చాలావరకు వెడుతున్నారు.

వాసు:- ఆన్సర్ టు ది పాయింట్! నా అతిథిని ఏ వారంటూ లేకుండా నువ్వెలా అరెస్టు చేస్తున్నావ్?

[ఇన్‌స్పెక్టర్ రాంబాబు చెయ్యి విడిచిపెడతాడు. వాడు చప్పున వాసుదేవం వెనక్కివచ్చి రక్షణ తీసుకుంటాడు]

వాసు:- చెప్పు. ఊం, చెప్పు— వాటీజ్ యువర్ నేమ్? ...... కాపయ్యా! నువ్వు వెంటనే పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చెయ్యి— ఒక పెద్దమనిషి ఇంట్లోకి జొరబడి పోలీస్ ఇన్‌స్పెక్టర్ నానా అల్లరి చేస్తున్నాడని...

కా:- [వెళ్ళబోతాడు] ఆగు! [ఆగుతాడు]

రాం:- నేను దొంగను కాదు బాబూ:

వాసు:- నువ్వు నోర్మూయ్...చెప్పు...అలా తెల్లమొహం వేసి చూస్తావేం?

ఇన:- ఐయామ్ సారీ...వీడు పచ్చిదొంగ.

వాసు.- అదే రాంగ్ అండ్ ఫాల్స్ఎలిగేషన్‌తో, ఇండియన్ డొమినియన్ లోని—బ్రైబర్ - పౌరుడైన ఒక వ్యక్తిని దుయ్యపడుతున్నావని పరువునష్టం దావా వేస్తే, నీ జీవితం ఏమవుతుందో ఆలోచించావా?

ఇన:— వాసుదేవంగారూ! మీ ఎదురుగానే వాడ్ని దొంగ అని ఋజువు చేస్తాను.

రాం:- వొట్టిది బాబూ! నేను దొంగతనం చెయ్యలేదు. చెంగయ్యగారింట్లో మా చెల్లెలు నెక్లెసు పడుంటే తీసుకొచ్చెయ్యడానికి వెళ్ళాను బాబూ!

ఇన.- విన్నారా?

వాసు:— విన్నాను. నెక్స్ట్!

రాం:— కాని, దురదృష్టంకొద్దీ చెంగయ్యగారికి మెలకువ వచ్చేస్తే, భయపడి పారిపోయాను.

వాసు:— (ఇన్‌స్పెక్టర్‌తో) విన్నావా? ఏ పరిస్థితులో, ఏ బాధతో వాడా ఇంట్లోకి దూరాడు? డుయునోది బాక్‌గ్రౌండ్ ఆఫ్ దిస్ డ్రమెటిక్ అండ్ రేదర్ ఫెన్‌టాస్టిక్ ఎపిసోడ్? పెర్‌హాప్స్ యు డోన్టు; యు డోన్టు ఈవెన్ బాదర్ టు ఎప్రిహెండ్ ఇట్ - థరోలీ... డియర్ సర్, ఐ నో యువర్ కాంప్లెక్స్ – పోలీస్ కాంప్లెక్స్ – డు యు అండర్‌స్టాండ్ వాట్ ఐ మీన్?

ఇన:- కాని, ఆ నెక్లేస్ చెంగయ్యగారింట్లోనుంచి దొంగతనం చేశాడు.

కా:— ఏ నెక్లేసు?

ఇన:— వాడ్నే అడగండి.

రాం:- ఆ నెక్లెసు మా చెల్లెలిదండి.

ఇన:— విన్నారా? పూటకి గతిలేనివాళ్ళకు బంగారపు గొలుసు ఎక్కడ్నించి వస్తుంది— అడగండి—ఎక్కడుందో?

రాం:- అది నా దగ్గరే ఉంది బాబూ! అది లక్ష్మి రాజమండ్రి తీర్థంలో మాకు దొరికినప్పుడే దాని మెళ్ళో ఉంది.

వాసు:- రాజమండ్రి తీర్థంలోనా?

రాం:- అవును బాబుగారూ! కోట్లింగాల తీర్థంలో లక్ష్మి మా నాన్నకు దొరికిందట ఆ నెక్లెసుతోనే... బాబుగారూ, కడుపుకు లేకపోతే మంచినీళ్ళన్నా తాగాం గాని, ఆ గొలుసుమాత్రం ముట్టుకోలేదు.

కా:- ఆ నెక్లెసేది?

(రాంబాబు మొల్లోనుంచి నెక్లెసు తీస్తాడు. కావయ్య అందు కుంటాడు. ఉరుములు, మెరుపులు)

కా:- (పరీక్షగా చూసి) బాబూ! సరిగా చూడండి, ఇది మన శారదమ్మగారిదే. [ఇస్తూ] సందేహం లేదు. నాకు బాగా తెలుసు. అది మీరు స్వయంగా రెండు తులాల బంగారం వేయించి చేయించారు.

[వాసుదేవం నెక్లెసును పరీక్షగా చూస్తుండగా, ఉరుములు మెరుపులు అతనికి ఏవేవో గత స్మృతులు]

కా.- ఇంకా సందేహం ఎందుకు బాబూ? రాంబాబు చెల్లెలు సాక్షాత్తూ మన శారదమ్మే. [ఉ॥ మె॥] బాబూ! భగవంతుడు కూడా సాక్ష్యం పలుకుతున్నాడు. [ఉరుములు, మెరుపులు]

ఇన:- ఏవిఁటి మీ రంటున్నది?

(అతనికి సమాధానం చెప్పరు.)

కా:- (నెక్లెస్‌ని బ్రమానులా చూస్తూ ఉండిపోయిన వాసుదేవాన్ని కదుపుతూ) బాబూ! బాబూ! ఇంకా ఆలోచిస్తున్నారా? మన శారదమ్మ దొరికి పోయింది. దేవుడున్నాడు బాబూ! మన శారదమ్మ బ్రతికే వుంది. రండి బాబూ! ఆ నెక్లెస్ మీరే స్వయంగా, ఆవాళ పుట్టిన రోజు పండక్కి ఆమె మెళ్ళో వేశారు. (మెరుపులు. ఉరుములు)

వాసు:- (హడిగా) కావయ్యా......తలుపులు మూసెయ్......తలుపులు మూసెయ్...శారద తప్పిపోతుంది.

కా:- కాదుబాబూ! దొరికిపోయింది. రండి బాబూ!

(పెద్ద శబ్దంచేస్తూ ఉరుముతుంది. భరించలేని వెలుతురు. గోడ మీది తైల వర్ణచిత్రం పడిపోతుంది. వాసుదేవం ఒకటే అరుపు అరుస్తాడు.)

వాసు:- అమ్మా! శారదా! అమ్మా! శారదా! వస్తున్నాను... తల్లీ— వస్తున్నా...వస్తున్నాను. (అని పిచ్చిగా బయటకు పరుగెత్తుతాడు. వెనకాలే కావయ్య, రాంబాబూ పరుగు తీస్తారు. ఇన్‌స్పెక్టర్‌కి అర్థంకాక తేరిపార చూస్తూ ఉండగా)

( తెర )



## పాత్రలు

పరమానంద

సుల్తాన్

రాంగిరి

దేవుడన్న

గాలెన్న

శాంతయ్య

పటేల్

మల్లన్న

(అది తెలంగాణాలోని ఒక మారుమూల కుగ్రామం. రంగస్థలం కుడివైపున పరమానంద పూరిగుడిసె, ఎడమవైపున రాంగిరి పూరిగుడిసె ఉంటాయి. ఈ పూరి గుడిసెల చుట్టూ ఏవో చెట్లు, మొక్కలుంటాయి. రంగస్థలము ఎడమ వైపున ఉన్న పూరి గుడిసెలో రాంగిరి ఒక మట్టి పాత్రలో గంజి తాగుతూ ఉంటాడు-గంజి త్రాగి చుట్ట కాల్చుకుని బైటకు వచ్చి, పరమానంద గుడిసె వంక చూస్తూ ఉంటాడు. ఇంతలో పరమానంద భార్య కుండ చంక బెట్టుకొని నీళ్ళకు పోతుండగా, రాంగిరి ఆమెను ఆపి]

రాంగిరి:- ఏమమ్మ! రేత్రెల్ల ఎందుగట్ల బరికెల్తొ గొట్టి బాదల్ బెట్నదు?

సుల్తానీ:- [పరమానంద భార్యకు పేరు లేదు-దిక్కులేనిది-ఆ తరువాత సీనులో అనగా రెండవ రంగంలో ''సుల్తానా'' లేక సుల్తానీగా పిలువబడుతుంది.]

బత్తెగొడ్లు గోగుల మొక్కలు దిన్నవట (కుండ క్రిందబెట్టి.)

రాంగిరి:- బత్తె గొడ్లు గోగుల మొక్కలు దిన్నవని, బెండలు బచ్చినవని చీటికి మాటిగిట్ల గొట్టుకుంటరా, పోయెగాల బుద్దులు గానీ—ఈతడా గాలెన్న సావాస మెన్నదు బట్నదో ఆనాదే అనుకున్నను, ఈతడు గాలై పోతడూ అని-(వెళ్ళిపోతూ) యీతడు గాలై పోతడూ అని (వెళ్ళిపోతాడు.)

సుల్తానీ:- (క్రింద ఉన్న కుండ చేత బట్టుకోబోగా - దూరంనుండి గురువు చింతయ్య గోరు తత్వం పాడుతుంటే వింటూ)

చింతయ్య:- (తత్వం) ''ఇల్లు ఇల్లనియేవు-ఇల్లు నాదని యేవు-నీ యిల్లు ఎక్కడే చిలుకా నీయింట కట్టెలే. చుట్టాలు కట్టెలే బంధువులు కన్న తల్లెవ్వరే చిలుకా ''నీ''

సుల్తానీ:- గురువు చింతయ్య గోరు యీ పదం నాకోసమే పాడతున్నట్టున్నరు.

చింతయ్య:- ''నీవు కాలిపోయిన దాక కావలుందురు గాని వెంట నెవ్వరు రారె చిలుకా''

బిచ్చగాడు:- (లోపల) అమ్మా! బిచ్చమేస్తరా?

సుల్తానీ:- ఏస్తనయ్యా-ఏస్తనా-తప్పుకేస్తను. (లోనికి వెళ్ళబోయి-కొంగుముడి వూడదీసి)...నూకలు నిండుకున్నయి వానికి జెప్పటం మరిసిన్న.

చింతయ్య:- (లోపల నుండి) నూరేండ్లు నిలిసి బతకండి తల్లి-నూరేండ్లు నిలిసి బతకిండి,

సుల్తానీ:- గెట్లు బత్కుతనయ్య-ఎవల్ బత్క సిస్తరయ్య-నన్నెవల్ బత్క నిస్తరు (కుండ తీసుకుని-నీళ్ళకు పోబోతుండగా - పరమానంద ప్రవేశం)

పరమానంద:- (గునపంతో వచ్చి క్రిందవేసి) ఓయ్యో గట్లబోతావ?

సుల్తానీ:- నీళ్ళకు బోతున్నను.

పరమానంద:- వాయి యెనక్కి మల్లదూ-గంజిబువ బెట్టి పోదేందయో!

సుల్తానీ:- ఏదది?

పరమానంద:- ఏమైనడి? పీకలం గంట దాగేశ్నివా? వాయ్యో పలకదేందయ్యో!

సుల్తానీ:- రేతిరి ఉండదంత నీకె బోస్తినిగ. తిరిగిస్తే గాస్తను (పోబోతుంది)

పరమానంద:- ఇప్పుడు గాస్తవ్? - సుక్క బొడిసినప్పుడు బోయి, గోగుల దిబ్బెంత తిరగబెట్టి బండెడాకల్తా నేనొస్తే, యింకెప్పుడు గాస్తవ్-యింగెన్నడు బోస్తవే?

సుల్తానీ:- (వచ్చి చెప్పలేక నిలబడి ఉంది.)

పరమానంద:- పొయ్యిలా అగ్గినుప్పేస్నివాని (మండిపడి) నాయ్యో! గుడ్లమ్మలా గట్లగుడ్లు మిట్కరిస్తావేందయో!

సుల్తానీ:- నూకలు నిండుకున్నయి.

పరమానంద:- మరి నాకు జెప్నివా?

సుల్తానీ:- మరిసిన్న.

పరమానంద:- కంచెడు దినటం మరువలేదేమె-నిన్ను మెకందినిపోను-నిన్నా గుట్టమీని నరసిమ్మ సామెన్నడు నిన్ను యికసక దింటడె! నిన్ను మారెమ్మ మింగిపోను-నూకలై పోయినాయె-(అని కొట్టబోతాడు)

గాలె:- (ప్రవేశిస్తాడు) ఏందన్న! మల్లి రగడ జేస్తున్నట్లున్నదే?

పరమానంద:- అరె ఏం జెప్పిన గాలెన్న-దినం జరిగేటి కతేగా!

గాలెన్న:- వరె దీని శనిముగం జావ, దీన్నేడ దెచ్చిన వేరి?

పరమానంద:- ఒరె కాసుల పేరు యిచ్చి మరి దెచ్చుకున్ననురా యీ శనెమ్మను, యిది కాలు బెట్నది, నా దిబ్బలన్నీ జస్తున్నాయి-ఇది గిట్లా కొంపలో కాలు బెట్టినది నాకు దరిద్రం బట్టినది. ఇది గిట్లా కాలు బెట్టినది నా పాకిబత్రి జచ్చినది. మర్నాటేదు నా పెద్దన్న బిడ్డ జచ్చినాడు. నాకు కూటిగ్గూడ జంపుతున్నది. గింత పొద్దాయె. గింతదనుక నూకలు గాయలె! గిప్పుడగ్గి నుప్పేస్తున్నదట చూడరి...ఏమమ్మో గడిసెకో కూకొని పల్కుతున్నవ్. పొయ్యిల అగ్గినుప్పేస్నివా? ఏమమ్మా పల్కగుంటున్నావ్?

సుల్తానీ:- (లోపల్నించి) మండిస్తున్నయ్యా! మండిస్తున్నను.

పరమానంద:- ఏలకింత గంజిదాగి నాల్గేండ్లయినదిరా గాలెన్నా! దీని పేనాన్కి జడి జస్తున్న ననుకో! అఁ-దిబ్బలెట్లున్నయిరా? కోతిమీర మళ్ళి గట్నవా? రామముల్గలేశ్నవా?

గాలెన్న:- వరె రామ ముల్గంటే యాద్ వచ్చినది. నీకు మాలావ్ రాంచిల్కన్ దెచ్చిన్నయ్యో!

పరమానంద:- అరె! ఏడ జిక్కినదిరా?

గాలెన్న:- నిన్న దగిల్నది, నువ్ గానరాలె.

పరమానంద:- నే దిబ్బకాడ జచ్చిన-గెట్లగుంటదిరా?

గాలెన్న:- వరె జూడు మరి గత్తె-పంచవన్నెల్ రాంచిల్కయో! యీాడైనాద్రు మొగఁడనుకుంటున్నావా? సక్కంగ జూస్కుంటడు సన్నగుంటడు, సై అంటాడు అన్నను!

పరమానంద:- గెట్ల పడగొట్టినావు?

గాలెన్న:- మారాజు సక్కగుంటను, సన్నబట్టలిస్తక. నీవు సై అకతు సై అంటడు అన్నన.

పరమానంద:- ఏమన్నడి?

గాలెన్న:- సై అన్నాది. నీ పీన్కి ఉరకలేస్తున్నది జిలక. పరుగు దీ స్తనంటరి.

పరమానంద:-నేను కూడా సై అంటున్నను. మరిజిల్కాను చూడ పోదంరి.

గాలెన్న:- పోదాం రారి.

పరమానంద:- నీవు పదరి. నేవస్తను.

గాలెన్న:- వరె వరె వరె......పైసలు అంటున్నది జిల్కా.

పరామానంద:- గపడె పైసలు అంటున్నది జిల్కా. ఆగాలెన్న. ఇదిగీ యిత్తడి జెంబు ఎత్తుకుపోయి కల్లుదూకానంలో లింగయ్య వుండట వానికి తెగనమ్మి పైసలు దీస్కొని జిల్కాకు వాసన సబ్బు పౌగదరు రబ్బి కాపి ఉప్మలు తెత్తపో...గుమ్మ్మ చేయాలి జిల్కాను.

గాలెన్న:- హరె గుమాగుమ్మ్మ చేస్తను.

పరమానంద:- ఏమమ్మో! జల్దిగ మంట బెట్టు... నూకల్ దెస్తను (సుల్తానీ బయట కొస్తుంది) గింత కిరసన్‌బొయి బేగి మండ్తది- గాలెన్న నేవస్తున్నను (వెళ్తాడు)

సుల్తానీ:- దేముదన్నొస్తున్నడు- దేముదన్న- దేముదన్న, బాగున్నవా?

భజనపోళ్లు:- బాగున్నమమ్మా- బాగున్నం- మీ పెనిమిటి బార్కలు బాగున్నరా?

సుల్తానీ:- బాగున్న మన్నా- బాగున్నం- ఆ- మీ పదమిని ఎంతకాలమయె- ఇనిపిస్తవామరి.

భజనపోళ్లు:- ఇనిపిస్తనమ్మ- ఇనిపిస్తము- మరిగత్తె పట్టెదన్నం బెడ్తవా మరి!

సుల్తానీ:- పట్టెదేందన్నా- పొట్టనిండబెడ్తను- మరి గింత తాలిరండి, ఉడుకు బువ్వ మరింత బెడ్తను. పదం పాదన్నా-

దేవుడన్న:- సల్లంగుండుతల్లీ-సల్లగుండనీ.

భజనపాట- శ్రీరాముల సతిసీతమ్మ- శెరబట్టిండు రావనుడు.
సెరబడినా సీతమ్మ- రాములదల్సుక యిలపించె.

సుల్తానీ:- సీతమ్మ తల్లీ గట్ల యిలపించె నాదాన్న?

దేవుడన్న:- రాములయ్య గూడ యిలపించి, అనుమంతు దోలిండు.

సుల్తానీ:- ధోలిండూ?

దేవుడన్న:- ఆఁ అమయిని, అనుమంతులయ్య ఏం జేస్నిడంటే

అనుమంతుడే ఎగిరిందు
సంద్రాలే దాటిందు
లంకాపూరికి జేరిందు
అసోక వన మే జూసిందు

సుల్తానీ:- అనుమంతలయ్య, సీతమ్మ తల్లిని జూస్నడా ?

దేవుడన్న:-సీతమ్మను జూస్నడు, రాములయ్య యిలాపమెల్ల జెప్నడు' జెప్పి రాములయ్య బంపిన ఆనవాలు యిచ్నడు, అది జూ స్నెరు రాకాసులు

సుల్తానీ:- వాయ్యో జూ సెవ్రా?

దేవుడన్న:-రాకాసులది జూసింద్రు

అనుమంతులపై దూకిన్రు
రెక్కలబట్టి గట్టిన్రు
తోకకు నిప్పు బెట్టిన్రు

సుల్తానీ:- వాయ్యో దోకకు అగ్గిని నిప్పెట్టిన్రా ? అనుమంతులయ్య ఊరకున్నడా మరి?

దేవుడన్న:-గెట్లూరు కుంటడు తల్లీ! రామో

కోదండ రామునే దలిసినడు
కొర కొర - కొర కొర జూసినడు
ఆకాశానికి బెరిగినడు (విశ్వరూపం)
కట్లను బట బట దెంపినడూ

సుల్తానీ:- కట్లను బట బట దెంపేస్నిడూ ?

దేవు-: ఆ॥ లంకాపురిపై ఎగిరిందు

లంకకు నిప్పే బెట్టిందు
ధగ ధగ భగ భగ మంటలురేగె

పరమానంద:- (వచ్చాడు) వరె వరె వరె! గుడిసె తగల్బెట్టిన్రా - గుడిసె తగల్బెట్టిన్రా! గుడిసె. ఎవ్రరసువ్ ? అన్నంతింటు న్నవా ? గడ్డితింటున్నవా ? ఆడవాళ్ళకింత భజన పిచ్చి పెడ్తర్రా [ఢమరుకం పారేసి]

భజన పిచ్చిపెడ్తర్రా?

దేవు:- సీతమ్మ కథ జెప్తున్నను.

పరమానంద:-సీతమ్మ కథ జెప్తున్నరా? సింగమ కదజెప్తున్నరా? పొయిరాజే మని నేబోతే-భజన బెట్నివ్? యీ భజనపోల్లేద దొరికినరే నీకు? నిన్ను మారెమ్మ మింగిపోను. నిన్నామల్క మా లచ్చెమ్మ ఎక్క పోకున్నదేందె! (లోనికిపోయి) గుడిసె తగల్బెట్టినది వాయ్యో! గుడ్డ బట్టటూ తగల్బెట్టినది. నేనెట్ల బతికేది! నేనెట్ల జచ్చేది!

సుల్తానీ:- గుడిసె అంటుకున్నది నే జూడలె దొరా!

పరమానంద:- గుడిసె అంటుకొనడం నువ్వు జూడలె—నువ్వు జూడలె?

గాలెన్న:- (ప్రవేశించి) ఏమన్నా! గుడిసె తగల్బడెనె? మనవాండ్లిం కల్లం తాగాల్ బోతిగ జెప్పుకుంటున్నరు-గెట్లు ధగల్బడితది?

పరమానంద:- ఈ దైద్రమొగంది గాదు—పోయి రాజేమని నేను కల్లుకి బోయన్నా ఈకే భజన బెట్టింది ఆ భజనపోల్లు ఏ చుట్ట బీడి కాల్చి గుడిసెమీన పారేసిరో—ఇదిగానోరాలా! (కొట్టబోతాడు)

రాంగిరి:- (వచ్చి) పరమానందా! ఆడబిడ్డనుకున్నావా? బత్తెగొడ్డనుకున్నావా? ఎందుగిట్ల గొడ్తవ్?

పరమానంద:- రాంగిరి! నీ గుడిసెలో నీవు బడివుండక నిన్నెవల్ రమ్మన్నరు?

రాంగిరి:- దేముడు రమ్మన్నడు.

పరమానంద:- దేముడే పొమ్మంటడు జూడు మరి.

రాంగిరి:- ఆఁ దేముడే తిరిగి రమ్మంటడు జూడు మరి, ఏమనుకుంటున్నవో దినదినం జూస్తున్నను. నివ్వా బిడ్డను పెట్టేటి నరకం—కులపోల్లంతా గిట్లనే ఏలుకుంటున్నరా వాండ్ల పెండ్లాములను.

పరమానంద:- కులపోల్ల పెండ్లములంత గిట్లనే గుడిసెలు దగల్బెడతున్నా గిట్లనే భజనపోల్లతో భజనల్ జేస్తున్నరా—గిట్లనే చిందుల్ దొక్కి ఏవాలో జేస్తున్నారే?

గాలెన్న:- గిట్లనే గుడ్డగుడ్సులు పెట్టె బేతెలు తగల్బెడతున్నరా?

పరమానంద:- చెప్పుమరి?

రాంగిరి:- కొండాల్ జెప్పుమస్రీ? గుడిసె తగల్బెట్టినాడి? నాట్కపోల్లతో నాట్క మాడుతున్నాది. ఏమమ్మా! గిట్లంటరు.

సుల్తానీ:- రాంగిరన్నా! మా దేముడు నూకలకుబోయిండు-పొయ్యిల అగ్గి ను ప్పేసిన్ను! కిరసిన్‌బుడ్డి పొయ్యి దగ్గర ఉంది-గింతలో దేము డయ్యొచ్చిండు. సీతమ్మ కద జెప్తున్నాడు-నే గట్లనె యినుకుంటు న్నను-పొయ్యిలో కిరసిన్‌బుడ్డి బడి మంటలేస్నిదేమో, నే జూడలే పొయ్యి గుడిసె కంటిన్నది.

పరమానంద:- పొయ్యి గుడిసె కంటిన్నాదే? పొయ్యి గుడిసె కంటిన్నాదె? నాల్గేండ్లబట్టి లేని గుడిసె యీ దినమే గుడిసె కంట్నాదె! యీ దినం గుడిసెకు బాకినాదె. తన్నుకు జస్తవ్- ఏదకి జస్తవో జావ్- కదల మంటుండులే (రాంగిరి గుడిసె లోనికి పోతాడు)

సుల్తానీ:- నా కెవరున్నరనిబోను, ఏడకు బోను?

పరమానంద:- నీ కెవలున్నరో నాకెట్ల తెలుస్తదే, ఏదకు జస్తవో జావు.

సుల్తానీ:- నాకెవరున్న- నీకు సమానమైతరా?

పరమానంద:- ఈ సింగమ్మ సీతులు నాకిక జెప్పకూ, ముందు మూట ముల్లె గట్టు.

సుల్తానీ:- యీతప్పు గాయమంటున్నానగా!

పరమానంద:- ఎపల్ గాస్తరు?

గాలెన్న:- నాల్గేండ్ల వట్టి గాస్తున్నడు మారాజు, ఇంకెంత గాలం గాయాలే- అదు షుట్క బుట్టిలె పక్క గుడిసె తగల్బెట్టినావు (లోనికి చూపిస్తూ)

పరమానంద:- మరి నూ జెప్పర గాలెన్న, నీకు తెలియకున్నదే-యింటు న్నవా? మనవాండ్లెల్లా యేమంటున్నరో! కదల్నురీ!! (చెయ్యిపట్టి లాగుతాడు)

రాంగిరి:- పరమానంద, ఎల్లదండు. ఆ బిడ్డ సోకులు దెబ్బలు నే జూడలేను. మీ వాండ్లెట్ల రమ్మా నాకు జెప్ప నేదిస్క పోతన.



సుల్తానీ:- నా కెవ్వలూ లేరయ్యా, నేపుట్టంగనే మా అమ్మయ్యాలు జచ్చిపోయి[నని మీ బోండ్లయ్యాలు బెంచి పెద్దాన్ని చేస్నె[నని గింత ఓలె బుచ్చుకోని యీ అయ్యకొప్ప జెప్పి[నని- యీ దేముడే జెప్తై యున్నను. నా కెవలున్నరని బోను- ఏడికనిబోను?

(లెంపలేసుకొని ఏడుస్తుంది)

పరమానంద:- ఏడికిబోతావోపో; గెట్లనట్ల పరమనంద పక్కన, గుడిసెలో కూసుని, కుల్కుదమనుకుంటున్నవేమో! అది కుదర్దు- ముందు మూటముల్లెగట్టు.

రాంగిరి:- పరమానంద; ఎందుగిట్ల పాపం మూట గట్కుంటవ్, ఏదో జరా తప్పు జేసెన్నని లెంపలేసుక్కుంటున్నది, కాల్లబడుతున్నది— కాల్ల మొక్కుతున్నది. నీవు గొడ్తె గొడ్తదా! తిడితే తిడ్తదా! నీ పెండ్లమయ్యా పెండ్లము. "పెండ్లాన్ని గొట్టిన, గోవును గొట్టిన, ఒక్కటే నంటరు" ఆ పాపము పది జన్మలకు బోదు, ఏమనుకుంటు న్నవో?

పరమానంద:- బోకుంటెమానె.

గాలెన్న:- పుట్టిందయో! పున్నె పురుసుందు.

రాంగిరి:- గాలెన్న, నా పున్నె పురుసత్వం- నూ జెప్పనక్కర్లే. మంది జెప్పు కుంటున్నరులె; నీ పురుసత్వం. రంగురంగుల రాంచిల్కలదెచ్చి, మందికి గుదిర్చి; మంది కొంపలు గూలుస్తున్నవటగా;- నాకు, నాకు పేరుపెట్టొచ్చినావురా రాంచిలకలయ్యా—

పరమానంద:- రాంగిరి!

రాంగిరి:- వీండ్ల కొంపదీస్తున్నది నువ్వుగామరీ?

గాలెన్న:- వాయ్! గెంత మాటన్నడు.

పరమానంద, గాలెన్న :- రాంగిరి.

రాంగిరి:- వీండ్ల కాపురముల నిప్పులబోసిన్నది నీవుగాదురి!

గాలెన్న:- రాంగిరి! (గుడిసెలోనికి బోతాడు చిన్నబుచ్చుకొని)

పరమానంద:- నోరుమూస్క పడుండు. రాంగిరీ—మా కులపోనివా- తలపోనివా?— ఎవలు పిలువకుండగనె పెద్దమనిసి తీర్గవొచ్చినవ్. కాదనలే! వచ్చినవానివి గెట్లగనో వచ్చినవ్—నిన్ను పెద్దమనిషివిగనె అడుగుతున్నను— చెల్లు చీట్లిప్పిస్తవా? లేకుంటే యీ రగడిట్లనె పెద్దది జేస్తవా?

సుల్తానీ:- చెల్లు చీట్లిప్పిస్తవా రాంగిరన్నా?

పరమానంద:- మరి ఏం జేస్తడు?

రాంగిరి:- పరమానందా! నువు మనిసి పుట్క బుట్టలె! పసరం పుట్కపుట్టినవే. అసల్ నీవొక మెకమై పుట్టుండాలె! గెట్లిమ్మంటుండవయ్య చెల్లు చీట్లు ? నీ నోరెట్లాడినద్రే! పున్నెం జేస్కొని పుట్టినదీ బిడ్డ, నువ్ గిట్లనే అంటె నీ నాల్క చీల్కలుజేస్తను.

పరమానంద:- ఏం గూసినవ్?

రాంగిరి:- పరమానంద......ఎల్లదుండు...... ఆ బిడ్డనే మనకు. మీవాండ్లేడున్నరమ్మ? నాకు జెప్పు, నేను తీస్కపోతను.

రాంగిరి:- మరి బల్కకు మరి!

పరమానంద:- ఏంజేస్తవ్ రి?

రాంగిరి:- పండ్లూడగొడ్తను.

పరమానంద:- గొట్టురామరి (చెంపమీద కొడ్తాడు).

సుల్తానీ:- రాంగిరన్నా! నేననుకుంటూనే వున్నను గిట్లనైతదని. యెల్లిపో అన్నా! గెట్ల నైతదో గట్లనే అయితది.

రాంగిరి:- ఎల్తానమ్మ, ఎల్తను. ఇన్నేండ్లకు వీనితో చెంపదెబ్బ తిన్నను, మంచి కోసరందినలె! పరమానందా! ఎల్తున్ననయ్యా! ఎల్లున్నను. సుల్తానీ ఎల్తున్ననమ్మా, ఎల్తున్నను - ఇకనే వుండరాదు - మీ రగడిట్లనే పెద్దది జేసిన వాడినైతనేమో ! వాని కెట్ల జెప్పుకుంటువొ - నీవె జెప్పుకునాలె. ఎల్తున్ననమ్మా - ఎల్తున్నను (వెళ్ళిపోయాడు)

సుల్తానీ:- రామ్ గిరన్నా! యింగ నేనెట్ల బతికేదన్నా ?

గాలెన్న:- (గుడిసెలో నుండి వచ్చి రాంగిరిని మండిపడి చూస్తుంటాడు)

పరమానంద:-ఎట్ల బతుక్తావా? ఇదిగో, కాసులు అమ్ముకదిని. ఏడ బతుక్తావో బతుక్పో! (కాసులు మూటలో బెదగాడు)

సుల్తానీ:- (తెల్లబోయి చూస్తూవుంటుంది)

పరమానంద:- ఏమట్ల చూస్తవే? జల్దీగా చెల్లు చీట్లచ్చి ఎల్లవా ఎల్లు — లేకుంటే ఈ జెట్టు కొమ్మకు ఉరివేసో్కని యీడే జస్తను. అట్లనైన నిన్ను గట్కపోతరు - గాలెన్నా, తాలుర.

గాలెన్న:- (వచ్చాడు)— తాలుర (చెల్లు చీట్లుదీసి - యిద్దరి చేతివేలి ముద్రలు వేయిస్తాడు) (వేలిముద్రలు వేయించిన తరువాత) వరె ఎల్లదుండు రగడ జేస్తావ్? మీకు మనసు గుదురదు, మాట గల్వదు. ఎవరి దారి వాళ్ళది.

సుల్తానీ:- వద్దు - దొర - వద్దు - నేబోలేను - నే బోలేను. (మూట తీసుకుని నడుస్తు వుంటుంది) నీవే సుకంగవుండు.

పరమానంద:- ఏమమ్మో మరిగత్తె అట్లనే బోతవా? ఓలె ఇచ్చినే గట్టిన మరి ఆ తాలెబొట్టు? గాలెన్నా నీవు జెప్పినట్లుగనే జేసిన దాని సూత్రం దెంపుకొచ్చి ఎల్లగొట్టిన నాకు జిల్కను గట్టబెట్నాలే

గాలెన్న.- గట్లనె—గట్లనె

సుల్తానీ:- ఏం జేయాలె?

పరమానంద:- యీడ బెట్టి పోవాలె!

గాలెన్న:- తాలి బొట్టీడ బెట్టకుంటె యీచెల్లు చీటీలు జెల్లవుగ మరి-జెప్ప.

పరమానంద:- మరి! యిన్నవా మన కుల కట్టకి?

సుల్తానీ:- తాలిబొట్టు యీడబెట్టి పోవాలె!

పరమానంద·- తాలె బోట్టు యీడ బెట్టి పోకుంటె, నీవు నాకు చెల్లెట్ల అయితదే? ఎవరి పెండ్లానివే అంటే ఎవరి పెండ్లాన్నని జెప్తవ్! పెండ్లా మండగా బెండ్లామిస్తరా మరి! అందుకీడబెట్టి బోవాలె!

(అని ముందుకు బోతాడు)

సుల్తానీ - వద్దు దొరా! ఇది గోర పాతకమన్నా! యీ సూత్రముంచండి— లేకుంటే లోకులు నన్ను జిత్ర చిత్రంగ జూస్తరు - లోకుల కండ్లు నే మూయలేను దొరా! నీ పేరు నే నేడ జెప్పను.

(పరమానంద సూత్రంపై చెయివేస్తాడు) దొరా! (పెద్దగా అరుస్తుంది) నీ పెండ్లాన్నని యెవరికి జెప్ప......

పరమానంద:- గాలెన్న, నీవు జెప్పినట్లుగనే జేసిన - దాని సూత్రం దెంపు కొచ్చి ఎల్లగొట్టిన నాకు జిల్కను గట్ట బెట్టాలె.)

గాలెన్న:- గట్లనె...గట్లనె

(తెర పడును)

## 2 వ రంగం

(''సుల్తాన్'' గుడిసె)

సుల్తాన్:- (తొమ్మిది గంటలు వినపడగా) అరె!!! టాణామే ''నౌ'' బజె గొట్టెను. అభీతక్ ''నాష్తా'' దేలే; పేట్‌మే ఒఖ్హైలీ; ఖోట్లో శాంతమ దొర అంట్లను అర్గ దోమిస్తున్నదేమో! ఒరాచార్ దాగాలె (పొయ్యి దగ్గరకు పోయి) అరె జోగులంక్క జెప్తదే,

యె ''నమ్మకరాం లడ్కా దీన్ని నమ్మకు అన్నా అని, నైనై ''బహత్ బోలే ఖాలీహై''

(చాయి త్రాగబోతుండగా సుల్తానీ కేక)

సుల్తానీ:- చాయి దాగకు, అన్నం దెస్తున్ననూ! (దూరంనుంచి కేక.)

సుల్తాను:- అరె బహత్ దేరైనది; ఇంతదనుక ఏంజేస్తున్నవ్!

సుల్తానీ:- అమ్మగారేదో పండ్గి జేస్కున్నరూ (ప్రవేశం) ఏదో పండ్గ జేస్కున్నరూ (సుల్తాన్ సుల్తానీ బరువు దింపుతూ) అన్నంపులుసు లెన్ని బెట్టెంద్రో జూడన్ని (సుల్తాన్ సుల్తానీ బరువు దింపుతాడు)

సుల్తాన్:- వరె! చాన్ చాన్ జేసిన్రె. వంటల్లబాటు అంటల్‌గూడ ఎక్కువై ఉండాలె (నవ్వుకుంటారు, వారెవా! పెద్ద పండ్గజేస్కున్నరా! అరె చాన్‌దెచ్చనవ్.

సుల్తానీ:- శాంతమ్మ తల్లంటే ఎవులనుక్కుంటున్నవ్? చల్లని తల్లి! మనల పూరగ దినమన్నది.

సుల్తాన్:- వరె, జల్దిదే; నే దినాలె, మరి బాగదినాలె.

సుల్తానీ:- ఇదే బొప్పట్లురి - ఇదో పూర్ణం బూరె - ఇదో పరమాన్నం. ఇది అన్నం - ఇది పప్పుబులుసు.

సుల్తాన్:- మరి పులావ్ బెట్టలె?

సుల్తానీ:- ఛీ! ఛీ! బేమ్మర్లు పులావుల్ జేస్తరా? పాశాల్ జేస్తరుగాని.

సుల్తాన్:- పెద్దపండ్గకు గూడ జెయరా మరి.

సుల్తానీ:- (నోరుకు చెయ్యి అడ్డంపెట్టి, అటు ఇటు చూచి) పండ్గుద్వగొ త్తరు అయ్యగారిన్నరంటె-ఎమనుక్కుంటున్నవో!

సుల్తాన్:- (ఇద్దరూ నవ్వుకుంటారు) నాకు దెల్వదా? (అని చెవి పట్టుకుంటాడు)

సుల్తానీ:- ఏయ్! ఏయ్! (నవ్వుతుంది)

సుల్తాన్:- ఏమ్! ఏమ్! అంటువ్నావ్; భైన్ననుకుంటువ్నావా!

సుల్తానీ:- ఏమనాలె?

సుల్తాన్:- పేరు బెట్టి పిల్వాలె.

సుల్తానీ:- ఏ పేరున బిల్వాలె?

సుల్తాన్:- "సుల్తాన్" అని బిల్వాలె!

సుల్తానీ:- (నేను బిల్వను అన్నట్టుగా తలవూపి సిగ్గుగా) ఏమని బిల్వాలె? (తనలో "సుల్తాన్" అని అనుకొంటు సిగ్గుపడుతుంది) ఏమో నే పిల్వను. సిగ్గైతున్నది.

సుల్తాన్:- సిగ్గైతున్నదిర ? ఎందుగ్గైతది ?

సుల్తానీ:- మగని పేరు పెండ్లాము జెప్తదా ? మాకు జెప్పరు.

సుల్తాన్:- మాకు జెప్పాలె [చెయ్యిపుచ్చుకొని] జరూర్ జెప్పాలె - [అని గట్టిగా చెయ్యి నొక్కుతాడు]

సుల్తానీ:- అబ్బా జెప్తను—జెప్తను— సు...ల్తా...న్

సుల్తాన్:- (నవ్వుకుంటాడు) మరి నీ పేరు జెప్పవా ?

సుల్తానీ:- (ముఖంవాడి పోతుంది-మాటరాదు) నాపేరు...ఏమని చెప్పాలె ? (అని తల వూపుతుంది)

సుల్తాన్:- ఏమని జెప్తవ ? నే జప్త యిను— "సుల్తానీ" అని జెప్పాలె ?

సుల్తానీ:- (నెమ్మదిగా తనలో) సుల్తానీ ... (చిన్నబోతుంది)

సుల్తాన్:- (తనను చూపుకుంటూ) సుల్తాన్ (సుల్తానీని చూపి)సుల్తానీ (నవ్వుతాడు) సుల్తానీ ! బడగిర్లా నా ట్కపోల్లు నాట్క మేస్తున్నరంట— జూడపోదాంరి (పొయ్యి దానిని అంటి ఉన్న గుడిసె చూచి)

సుల్తానీ:- నాట్కపోల్లు నాట్క మేస్తున్నరా ? (పొయ్యిచూచి కంగారుపడి)— నేరాను — నాకు నాట్కమంటె గుబులయితున్నది — నేరాలేను దొరా !

సుల్తాన్:- వరె నాట్కమంటె, యిత్న ఘాబ్రయినవ్ — క్యోంరి ? ఇంతెన్నడు జెప్పనులె ! (బయటకు పోయే వానివలె బిగ్గరగా) ఆ బకాల్ సాబ్ దుకాన్‌కు బోయెచ్చి ఖానా తింటాను — పంద్రా బుట్టల్క పైసలియ్యాలె — పరసోం యిస్తనన్నడు. ఆజ్ తక్ యియ్యేలె ? జల్ది పోయి పైసల్ నూకొస్తను (చూచి) వరె ! ఏంగట్లనైనవ్ ! బీమార్ ఉన్నది క్యా !

సుల్తానీ:- (లేదన్నట్లు తలూపుతుంది) నై

సుల్తాన్:- అరె ! జరా చాయి తాగు — బీమార్ గీమార్ సోబ్ దౌడ్ తీయాలె (అని హుషార్‌గా వెళ్తాడు)
(పొయ్యి దగ్గరకు పోయి కంగారు పడి చూస్తూనే ఉంటుంది)

(పరమానంద వాలిపోయిన పెదిమలు, పిచ్చిఅవతారంతో ప్రవేశిస్తుంటాడు)

పరమానంద:-(ప్రవేశం) బాగున్నవా?

సుల్తానీ:- (బిత్తరపోయి చూస్తూంది)

పరమానంద:-బాగున్నవా?

సుల్తానీ:- ఏదో, గిట్లున్నను.

పరమానంద:-అగరి-యెల్లకు-సుల్తానీ అని బెట్కున్నవటగా నీ పేరు?

సుల్తానీ:-ఏదో గట్లన్నరు. ఎందుగిట్లొచ్చినవ్? (చాలా సేపు తెల్లబోయి చూచి)

పరమానంద:-ఏమిలె!!

సుల్తానీ:- ఏమీలేకుంటె యీాడ కెందుగొచ్చినవ్?

పరమానంద:-ఊకనె వచ్చిన్ను-ఏంజేస్తువ్‌రి?

సుల్తానీ:- ఏదొ జెయాలిగ-పొట్టతిప్పలుక, అంట్లు తోముకు బతుకుతున్నను.

పరమానంద:-అంట్లదోమక బతుకుతున్నా వేం? ఏమంత ఖర్మబట్టె,నా కాసులపేరు అమ్మకోని బత్కమన్నానుగా.

సుల్తానీ:- నీ కాసులు నాకెందులకు. నా రెక్కల కష్టమే నాకున్నది. ఏం గట్ల నయినౌ?

పరమానంద:-కాయలా బడిన్నుగ. మనవాండ్లెల్లరు బత్కవన్నరు-గుండెనంజ న్నరు-అశార్లయ్య గులికెమాత్ర లిచ్చిండు-బతికిన-నిన్ను జూసె టాన్కి రుణమున్నది. బతికొచ్చిన వాయినెంత దిరిగెను.

సుల్తానీ:- ఏదొ జర రోగంజేస్తె మట్టు గిట్లొస్తరారా?

పరమానంద:-నీ వొచ్చినవ్. నీతో నా దశె తొలగిపోయినది. నా లచ్మిదేవే పోయినది అంటున్నరు.

సుల్తానీ:- అందుకు నేనేం జేయాలె?

పరమానంద:-మన పల్లెకు పోదాంరారి!!

సుల్తానీ:- పరమానందా! సుల్తాన్ పగ పొంపగ. అతడు నిన్ను జూసినదంటె బొడిసి పారేస్తడు, నీదార్నబో! అసల్ నే గెట్లొస్తను - నీకు నాకు చెల్లయినదిగా!

పరమానంద:- అది జెల్లదన్నరు. నీవు బోంగనె కులపెద్దలంత-నన్ను రచ్చకీడ్చి నరు-బలవంతాన ఆ పిల్లతో జెల్లు చీట్లు దీస్కుంటవా అని చింపి పారేస్నరు. నిన్ను తిరిగి దీస్కరమ్మంటున్నరు. ఎల్దాం రారి.

సుల్తానీ - పరమానందా! సుల్తాన్ నన్నుగట్టుకున్నడు—నన్ను నమ్ముకున్నడు.

పరమానంద - వాయ్ గట్లనంటది, మన ఒంపోల్లెల్ల జేరి నామీద కులకట్టడి జేసెన్రు. గుట్టమీద నన్నిల బెట్టేన్రు - నాకు బంతిలో బువబెట్నం టన్నరు - బాయిల నీలు ముట్ట నీనంటున్నరు. ఎల్లాం రారి.

సుల్తానీ:- పరమానందా! ఏముకం బెట్కొని కమ్మంటున్నవ్? దిక్కుమాలిన దాన్ననుకున్నవ్- నోరులేని దాన్ననుకున్నవ్-గాలెన్న సావసం బట్టి నవె-సోబత్తుల్ కుల్కినవ్ - గాదన్ననా - జెల్లు జీటీలిమ్మన్నవ్. అది యివ్వనన్నను - గెట్లగైతానె యిప్పించుకున్నవ్ - "పెండ్ల ముండగ పెండ్లమొస్తదా"—తాలిబొట్టివ్వమన్నవ్? ఇవ్వనన్నను; పండ్లు పటపట గొరికి పటుక్కున దెంపినవ్ (ఏడుస్తుంది) జాలలె? ఇంగేమ నొచ్చినవ్. వచ్చినదారినె బో—అతడొచ్చే కాలమయినది.

పరమానంద:-అట్లగనకు. ఎనకటి కత లెల్లదిగగబెడ్తది. ఈ తప్పుగాయలె- ఇయి చేతులు గాదు (చెయ్యి పట్టుకోబోతాడు)

సుల్తానీ:- పరమానందా! నా చెయి ముట్టకు - ముట్టుకున్నవో - ఏదముట్టు కున్నవో, అదకు గోసిపారేస్తను - ఏమనుకుంటున్నవో – నీ దారినెబో - అతడొస్తడు.

పరమానంద:- పోతను - గట్లనేబోతను-నీవులేకుంటే నన్ రానీనంటున్నరు- నిన్ను దుక్కపెట్టను- కడమాటొక్కటి జెప్పిబోతును-ఎందుగిట్ల చికుకల్ బెడ్తవు? నేను వల్లొస్తను - నా గతి జెప్ప - నేబోతను - తిరిగొస్తను - తిరిగిగొస్తను (ఏదో చెప్పబోయి - జోగి) సరె పోతను.

(పోతాడు)

జోగులక్క:- (నెత్తిమీద మూట వగైరాతో ప్రవేశం) (ఈ ఇద్దరిని చూస్తుం టుంది) ఏమమ్మో, సుల్తానమ్మా ! !

సుల్తానీ:- ఏందివ్వే లప్డు దిగి వ్?

జోగులక్క:- (పరమానంద వెళ్ళిపోగానే) ఇద్దిపుడె దిగిన్న. ఎవలాతడు?

సుల్తానీ:- (నోరాడక)... ఆతడు...

జోగులక్క:- (గ్రహించి) పాత జుట్టమా! ఎవలన్న?

సుల్తానీ:- (బరువుగా) అదే...పాదైన జుట్టము-కితంనే జెప్పలే...ఆతడు

జోగులక్క:- పేరు జెప్పవ్?

సుల్తానీ:- (ఒక్కసారిగ కంగారుగా) పరమనంద.

జోగులక్క:- ఊ! .... (పెద్దరాగం తీస్తుంది) బాగున్నది. "రామేశ్వర మొచ్చిన శనేశ్వ్రమొదల్లే" (గడ్డంమీద చేయి వేలుంచి).

సుల్తానీ:- (తెల్లబోయి) ఎందవ్వ గట్ల నన్నవ్? (జోగులమ్మను ఊపస్తుంది).

జోగులక్క:- ఏమీలే!!

సుల్తాన్:- (ప్రవేశిస్తూ) వరె! జోగులకొ్కచ్చినదే. ఏమక్క, కాన్ రావైనవ్?

జోగులక్క:- దీపాలమాస్కు మిరియల్ గుడి యెల్లెన్నన్న, మా పెద్దన్న రమ్మన్నడు. పండక్కి యెన్నెన్ని, పాశాల్ జీసెన్రు, గెన్నెన్ని టపాసుల్ గాల్చెన్రు.

సుల్తానీ:- (సరసంగా) మరిగత్తె మాకేమైనా టపాస్లు దెచ్చినవా?

జోగులక్క:- మా సుల్తనన్నకు దేకుంటవామరి (అని చిచ్చుబుడ్డి తీసి) అగ్గి నుప్పున్నదా?

సుల్తానీ:- (హేళనగా) జోగులక్కా, యీడ చిచ్చుబెట్టకు!! గిపు డిపుడే నిల్బెట్టు కుంటున్నంమా కాకి గూడు (అందరూ నవ్వుతారు) జోగులక్క! సిచ్చుబెట్టినదా? శివునకైనా సివా లెత్తాలె (అంతా నవ్వుతారు. జోగులక్క చిన్నబోయి నవ్వినట్లు నటిస్తుంది. సుల్తానీ కడవ చాంతాడుతో యింటి దగ్గర నున్న నూతికి నీళ్ళకు పోతుంది. సుల్తానీ వెళ్ళినవైపు జోగులక్క చూస్తూ వుంటుంది)

జోగులక్క:- (సుల్తానీవైపు చూస్తూ) ఎంత చిత్రగత్తెవె? మా అన్న మెత్కదనం జూసి చిత్రచిత్రం జేస్తున్నవు.

సుల్తాన్:- సూపుం గట్లనే వుంటది జోగులక్కా!!

జోగులక్క:- సూపుల గట్లనే ఉంటదా? వట్టి సూపులకు.

సుల్తాన్:- జోగులక్కా! (ఆశ్చర్యం)

జోగులక్క:- వట్టి సూపులకు (అని నవ్వుతూంది)

సుల్తాన్:- జోగులక్కా ?

జోగులక్క:- ఒక్క సూపుంకేగాదయ్యో! చేతలుగూడ అట్లనే జేస్తున్నది. చిత్రనాట్కం జేస్తున్నది.

సుల్తాన్:- వరె! ఏమి జేస్తున్నది జోగులక్కా?

జోగులక్క:- ఏమన్నా? సుల్తానీ సూడ సక్కనిదన్నవు? పెద్దలకు సుద్దుల్ జెప్తదన్నవ్—(నవ్వుతూ) ఏందేందో బార్లకు బారలు-మార్లకు మరల జెప్పినవ్ !

సుల్తాన్:- వరె! ముజె పాగల్ జేస్తున్నవు క్యా?......ఎందుగట్ల నయితన్-నేనెం ఎప్పులకు జెప్పుకున్ననా.

జోగులక్క:- ఎప్పులకు జెప్పుకోరే! ముచ్చటకు జెప్పుకున్నవు! బాగయెను. సుల్తానన్నా మోటార్ బస్ దిగి యింటికెల్తున్నను. యీదెల జనం మూగెన్రు - సుల్తానీ మొగుడొచ్చిండు- మన పల్లెనె వుంటున్నడు. మిరాయిల్ పంపిస్తున్నడు. అంటున్నడు-వరె! ఏమా! జనం గిట్లంటున్నరు-నీవు లేవేమోనని సీదగ నీయింటి కొచ్చిన్నా-పరమ నందున్నడు. ఎందుకట్ల బిగల్ బిగల్ పడ్తవు? నే తిరిగొస్తనుగా నిన్ను దీస్కపోతను రా అంటున్నడు. ఇన్నను - ఇని గుడ్లనీరు గుడ్లకే కుక్కుకొన్నను. మరి యీ సుక్కలమ్మ సూపులెట్ల దిప్పుకొంటవో మరి!

సుల్తాన్:- బద్మాష్ పరమనంద; ఫిర్ వస్తున్నదన్నమాట.

జోగులక్క:- ఇది పిల్వనంపకపోతే వాడెందుకొస్తదన్నా. పిచ్చెక్కి తిరగుతున్నదట యీడ.

సుల్తాన్:- ఏడకు బోయింది? దాని పేగు త్రీస్తర.

జోగులక్క:- బాయెకు నీంకు బోయిందిగా (అటు యిటు చూచి) ఇక ఒస్త దేమో? నే బోతనన్నా! (తింగి బుట్టనెత్తిన ఎత్తుకొనబోయి)

జోగులక్క:- ఏమన్నా? నాకు జిత్రమైనదే? పైసల్ నూకి వాసికిస్తున్నదేమో? రాత్రింబగల్ బండెడు చాకిరి జేస్తరు? నూర్లకు నూర్లు బుట్టలల్లరు? యీ వగల బొమ్మ అంట్లు దోమి, అన్నం బులుసుల్ దెస్తది. జీతం పైసల్ దెస్తది! ఇదంతేమైతున్నదన్నా? ఎప్పుడన్నా అప్పుతే జెప్పుకుంటమా? అసల్ పైస లెక్క సిగ్గ దీస్తున్నవా మరి?

సుల్తాన్:- (నీరైపోయి) పైస లెక్క సిగ్గ దీస్తున్ననా? నై......నై......

జోగులక్క:- ఏమన్నా! అసల్ ఎరగట్లు జెప్తవ్? రూకలన్నీ కాసుల్ జేసి, కాంతయ్య దొర యింట్ల దాపరికం బెట్నదటగా?

సుల్తాన్:- ఏవల్ జెప్పెనె నీకు జోగులక్కా?

జోగులక్క:- కాంతయ్య దొరా ...... పటేలయ్యతో జెప్తుంటే మీ బావ ఇన్నడంట.

సుల్తాన్:- నిజం జెప్పు జోగులక్కా!

జోగులక్క:- నీ తోడన్నా! మీ బావ అబద్ధం జెప్తడా మరి?

సుల్తాన్:- ఆ పెద్దమన్సి ఝూటా బాత్ లెందుక్క జెప్తడు-ఇన్నటికి దెల్సుకున్న పూరగ దీని కత—

(సుల్తానీ ప్రవేశిస్తుంది—జోగులక్క సుల్తానీని చూడదు)

జోగులక్క:- సుల్తానీ యీడ పాదం బెట్టి న్నాడే అనుకున్ననన్నా ఇది సుద్దుల్ జెప్పి...సుక్క నామాల్ బెడ్తదని......

సుల్తానీ:- జోగులక్కా! (కోపంగా సుల్తాన్‌తో) యీ పుగ ముంతను యింత దన్ కీ దెందు కుంచినవు? ఛీ! అని కొడ్తె కుక్కయి నా మాయింట్ల కాలు బెట్టదు!

జోగులక్క:- ఎవరే పుగముంత? నివ్వు? కుక్కను నే సట్ల యితను? నీ వైతవు - నీ పరమనం దైతదు!

సుల్తానీ.- జోగులక్కా!

జోగులక్క:- చెంపను గొ_త్తరు ఏమనుకుంటున్నవో? యిస్మంటివి అన్నీ యింటె మేము కుక్కలు గాక మరేమైతం?

(అని వగలమారి ఏడ్పుతో వెళ్తుంది)

సుల్తాన్.- జోగులక్కా! జోగులక్కా!! టయిరీయే-జర్రా టయిరీయే (సుల్తానీతో) ఏంగూసినవ్? ఏంగూసినేరి?

సుల్తానీ:- గిట్ల కొంపలకు నిప్పుల్ బెట్టే టోండ్లనేమనాలె?

సుల్తాన్.- నోర్ బంద్ జెయ్యాలె (మీదకు వెళ్ళి) వారెవా! చిత్రం జేస్తున్నవె చిత్రం-ఇదెన్నట్నుంచి జేస్తున్నవ్? పరమనందను దింపినవటగ?

సుల్తానీ:- రామరామ. మనింట్ల ఉప్పుకారాలు ఎత్కపోయి జోగులక్కకు నేనంటె గిట్టకున్నది. (చెవులు మూసుకుని) జోగులక్కా!! పాపాల మూట్ల నీవు మొయ్యకురి!

సుల్తాన్:- వరె, చుప్! నాకు జెప్తవ్-ఏక్ హి ఏక్‌బాత్ అడ్గతనూ? నిజం జెప్పు. పరమనంద వచ్చిందా?

సుల్తానీ:- (చెప్పలేకపోతుంది.)

సుల్తాన్:- పరమనంద వచ్చిందా అంటున్నను?

సుల్తానీ.- (ప్రాణాలు బిగపట్టుకొని) వచ్చిండు—

సుల్తాన్.. వానితో నువు గుస గుసల్ జేస్నవా?

సుల్తా:- (దీనంగా)గుసగుసల్ జెయ్యలే. గట్టిగనే జెప్పిన్న—బుద్ధి జెప్పిన్ను.

సుల్తాన్:- బుద్ధివానికి జెప్పలె-నాకు జెప్పినవ్-నా కండ్లు దెరిపించినవ్ - సంగ జెప్పు?- ఇంట రూకలెన్నున్నయ్?

సుల్తానీ:- (ఏమి లేవన్నట్టు తలవూపుతుంది) ఏడనున్నయ్?

సుల్తాన్:- వరె! ఏమైనయ్?

సుల్తానీ:- (దీనంగా) రూకలన్నీ నీవె దాసుకుంటున్నవుగా!

సుల్తాన్ - (వికటంగా) జోగులక్క ఝూటాబాత్ లెందుక జెప్తది? శాంత యు? దొర యింట్ల కాసు శేమాత్రం జేసినవ్?

సుల్తానీ:- కాసుల దండైతె ఉన్నది. ఆ కాసులెన్నో నే లెక్కబెట్టలె

సుల్తాన్:- (కడుపుమండి) ఇన్నటికన్న నిజం జెప్పినవు సుల్తానమ్మా - నీకు సలాం బెడతున్నను-అయిబట్కరా-నే పండ్గ జేస్కునాలె —— —— (బిగ్గరగా) తీస్కరమ్మంటున్నను

సుల్తానీ:- గెట్ల తెస్తను? ఆ ముష్టి కాసులు ఆ పరమనందకె ముట్టాలె!!

సుల్తాన్:- చుప్!–ఫిర్ అన్నవంటె నాల్కె జీలస్తను.

సుల్తానీ:- పూరగ ఇనకుండగా జీలుస్తవా?

సుల్తాన్:- కామోష్!! (మతిపోయినట్లుగా) పూరగ యిన్నను. ఫిర్ వినకక్కర్లే, ఆ కాసులు పరమానందకు ముట్టాలె? ఎందుక్క ముట్టాలె?

సుల్తానీ:- పరమనంద నన్నెల్లగొట్టెను - అయిదిని బత్కమన్నడు-ఆ కాసులు నే ముట్టను-ఆ ముష్టి కాసులు నే ముట్టాలె?

సుల్తాన్:- సుల్తానీ! (అరుస్తాడు) కాసుల్దెమ్మంటె! ఎన్ని తిరకాసుల్ బెట్నవు? ఎన్ని సుద్దులు జెప్పినవు, ఇంతకు నీ ఏదాంతమేవుంది-నా కంట్లో కారంజల్లి–వానికి కాసులదండ యిస్తనంటవు? జల్దీ పోయి పట్కరా!

సుల్తానీ:- నే బోను.

సుల్తాన్:- (జెయ్యి పట్టుకొని క్రింద పడేసి - వేప చువ్వతో కొడ్తాడు) (కొట్టి వెళ్ళిపోతూ) బేగి తిరిగొస్త. కాసుల దెమ్మంచు. లేకుంటే జూడు మరి-కాసుల పరమనందకు ముట్టాలె?

సుల్తానీ:- నె నెల్లను. వా య్యో! సస్తి - సస్తిని (దుఃఖముతో) జోగులక్క యెంత పని జేసినవు—— జోలక్క నెన్నడైన ఏమన్న గింత మాటన్ననా—— నా కొంప గూలస్తున్నది దోగులక్క! (ఏడ్చుచు క్రిందపడి ఏడుస్తూ ఉంటుంది)

కాంతయ్య:- (ప్రవేశించి) సుల్తానీ ..సుల్తానీ!

సుల్తానీ - ఎవలూ?

కాంతయ్య:- నేను సుల్తానీ!

సుల్తానీ:- (కళ్లతుడుచుకుంటూ) మీ ఖాంచెను, ఏందొర గిట్ల వచ్చిన్రు?

శాంతయ్య - ఏమమ్మా, మళ్ళీ యీపూట గూడ అంట్లు దోమటానికి రాలేదేమీ?

సుల్తానీ:- (ఆపుకోలేని దుఃఖంతో) వొంట్లోఖాగలేదు దొరా! (ఏడుస్తుంది)

శాంతయ్య:- పోనీ, మీ అమ్మగారికి కబురు చెయ్యకపోయావా? మందు పంపించేది.

సుల్తానీ:- వద్దు- దొర- వద్దు- గట్లనే తగ్గిపోతది.

శాంతయ్య:- సరే నీయిష్టము (వెళ్ళబోయి ఆగి) ఆ! సుల్తానీ చాలా రోజుల్నుంచి చెప్పాలీ! చెప్పాలీ అనుకుంటాను?...

సుల్తానీ:- దొరా! పెద్ద దొరలు మన్నించాలె- నా పేరు సుల్తానీ కాద్దొర.

శాంతయ్య:- పోనీ! నీ అసలు పేరే చెప్పు-అలాగే పిలుస్తాగా!!

సుల్తానీ:- (కుమిలిపోయి దుఃఖంతో) నా కసల్ పేరేమిటున్నది. మా అమ్మ అయ్యలు నా పేరేం బెట్టిన్రొ? — మా అమ్మయ్య లేదనున్నారని బోసు? లేరయ్య- శాంతయ్య దొర!- లేరయ్య- చచ్చిపోయిన్రు- ఓ అమ్మా నా పేరేం జెప్పినవ్ అమ్మా- దొరలడుగుతున్నరమ్మ!

శాంతయ్య:- ఏడవకు సుల్తానీ- ఏడవకు ''దిక్కులేని వాళ్ళకు దేవుడే దిక్కు'' నీ కథ పూర్తిగా యిపుడు తెలిసింది. అసలు నీ పేరేమిటో ఎవరికెరుక-వాలి?......సుల్తానీగానే పేరు పొందావు- సుల్తానీ అనే పిలుస్తాను.

సుల్తానీ:- తమ చిత్తమొచ్చినట్లు పిలవండి దొరా! నేదుఃఖపడి తమని బాధ పెట్టిన్న-మన్నించాలె దొర— మీ కాల్ మొక్తను (కాళ్ళమీద పడుతుంది)

శాంతయ్య - (వంగి నమస్కరిస్తున్న సుల్తానీని - వళ్ళంతా దెబ్బలు చూచి) అదేమిటే- ఆ! వళ్ళంతా దెబ్బలు?

సుల్తానీ:- కట్టెలకు గట్టపై కెల్తె; కొమ్మలు గీసుకున్నయ్, అంతే దొర

శాంతయ్య - నాదగ్గరెందుకే దాస్తావు-తప్పతాగి ఆ సుల్తాన్ వెధవ మళ్ళీ యీ పూట కూడ నిన్ను కొట్టిపోయాడన్న మాట

సుల్తానీ:- దొర తమిరికి దెలియందేమున్నది దొరా! (ఏడుస్తుంది)

శాంతయ్య:- అబ్బ! అలా దుఃఖపడకే— ఎందుకే అలా ఏడుస్తావు-ఏడవకు-నా మాటవిను తల్లీ, ఇప్పటికైనా ఆ త్రాగుబోతు వెధవ సుల్తాన్ని విడిచి పెట్టు; సుఖపడతావు-ఎన్ని దెబ్బలని తింటవే వాడిచేతుల్లో? వేళకు యింత అన్నంతిని "కృష్ణ రామ" అనుకుంటూ హాయిగా మాయింట్లో పడివుండు. నిన్ను మా బిడ్డను చూచుకున్నట్లు చూచుకుంటాం—— నా మాట విను తల్లీ! మీ అమ్మగారు కూడా అదే చెప్పారే!!

సుల్తానీ:- అమ్మగారు చెప్పిన్రు-తమరు గూడ అదే జెప్పుత్రను - మీ దయకు దణ్ణం బెడ్తును (దుఃఖంతో) దొర, యీ యిల్లు సుల్తాన్ కిచ్చిన్ను- ఆడుదాన్నేల్కుంటడో కోస్కుంటడో - తన్నుకుంటడో వాని యిట్టం మెట్లుంటె అట్టజేస్కుంటడు-నా ఇల్లిడిచి నేనెట్లరాను దొర?

**శాంతయ్య:- (నివ్వెరబోతాడు) ఆ!......**

సుల్తానీ:— (నెమ్మదిగా దగ్గరకు బోయి) తమ మాటకు అడ్డు జెప్పిన్ను. మన్నించండి!! నేనేమి తప్పు జేసిన్నా దొర?

శాంతయ్య!:- నీ వెన్నటికీ తప్పు చెప్పవు. సుల్తానీ! నేనే తప్పు జెప్పానను కుంటున్నాను - సరె - నీ యిష్టం - వస్తాను (దూరంపోయి - వెను దిరిగి) ఆ సుల్తానీ! మీ అమ్మగారికి ఒక్కసారి కనిపించి పోవే కలవరిస్తోంది!

సుల్తానీ:- దేవునిదయ వుంటె గట్లనే వస్తను దొరా!

శాంతయ్య:- (వెళ్ళిపోతాడు)

సుల్తాన్:- ఆహాహాహై - దోస్తు - ఆహాహాహై (తాగివస్తాడు) (మైకంగా వుండి ప్రవేశం) కాసుల దెచ్చినవా?

సుల్తానీ:- (నివ్వెరబోయింది)

సుల్తాన్:- నా తమ్ము కొకతో - నన్ను కొడుత్నాడు - కోస్తున్నడు-ఇంకెంత కాలం మిట్లుంటావే - నాదారి నే జూసుకుంటను - అని జెప్పినట ?

సుల్తానీ:- ఎవ్వల్ జెప్పిన్రు?

సుల్తాన్:- విన్నవాండ్లె జెప్పిన్రు.

సుల్తానీ:- నే గట్ల చెప్పలె.

సుల్తాన్:- వరె! నీ వెట్ల జెప్తె నాకేం ? ఏం జస్తె నాకేం? అడ్గొ దోస్తొచ్చెటి ఏలైనది, ఖుషీ జేస్కోవాలె !! లేకుంటె నాకు నామోసైతది - నా లీసైతది - జల్ది బోయి పట్కరా !

సుల్తానీ:- ఆ కాసులు నేనెట్లు దేవాల్నో - నాకు తెలియకుంటున్నది.

సుల్తాన్:- (ఏడుస్తూ) నీ కెట్ల తెలుస్తది? నీ కేం తెలుస్తదంటే, నే లేకుంట జూసి పరమనందని పిలిపించడం తెలుస్తది - వాని పొట్టకు నా రూకల్ బెట్టటం దెలుస్తది -నజుగుర్ల నన్ గేలి జేయడం తెలుస్తది- జల్ది బొమ్మంటున్నన.

సుల్తానీ:- నే బోను.

సుల్తాన్:- బోవారె.

సుల్తానీ:- బోను (సుల్తాన్ - సుల్తానీ పీక నులిమి క్రింద బడద్రోయును)

సుల్తాన్:- పరెలయ్యోతో జెప్తను — నాపైసల్ నూకి పరమనందకిస్తున్నదని. నిల బెట్టి తుక్కు మారగొట్టిస్తను జూడు మరి !

(అని గాబరాగా వెళ్ళిపోతాడు)

**సుల్తానీ:-** (లేవలేక లేచి కళ్ళు తెరవలేక తెరచుచు—నీళ్ళు త్రాగుటకు పోయి తాగలేక - దోసిలి చూపుతూ ఒరిగిపోతుంది) దాహ మేస్తున్నది. సుల్తాన్ దప్పికైతున్నది మరి ఏం జప్తవో జెప్పు—ఆ గరినే దెస్తను.

పరమానంద - ఓయి! దాహమేస్తున్నదా! ఆ కుండ కడప పోశేవు-నేతెస్త జర దాగన్ని -

సుల్తానీ:- నే ముట్టను —ముట్టను—ముట్టను.

పరమానంద:- (సుల్తానీ ముట్టను) సుల్తానీ! నాకు బుద్ధిజెప్పినవు—నాబుద్ధి దిద్దుకున్నను-సుల్తాన్నిన్ను గట్కున్నడ - నిన్న నమ్మకున్నడు అన్నవు -

నా కడనేవుండం్రడి — నేనే బోతను (పోబోయి) నాకెవలున్నరని బోను-ఏడ కనిబోను—నీకు బడ రుణమున్నను— యీడనే ఏడ నైనా జరా నీకు సాయమై బిచ్చ మెత్తుకొని బతుకుతాను. నే పరమ నందని ఎవలికి జెప్పను — కాదనకు — దన్నం బెట్టి అడుగు తున్నను (దీనంగా)

సుల్తానీ:- పరమనందా, నాకు దన్న బెట్టకం్రడి, యిన్నటికి నీ బుద్ధి దిద్దుకున్నవా పరమనంద?

పరమానంద:- ఆ మరసిన. జరా నీర్ తాగం్రడి—దప్పికైతున్నట్లున్నది (నీళ్ళు తెచ్చి యిస్తాడు) నే నిప్పటికే సగం జచ్చిన, నన్ను మరింత జంప కం్రడి.

సుల్తాన్:- (ప్రవేశించి) పరమనందా? బద్మాష్! ఎందుకొచ్చినవు?

పరమానంద:- ఊరకనే. దాహ మంటన్నది...యిస్తున్నను......

సుల్తాన్:- దాహమంటున్నది ... ఇస్తున్నవు ... గాదనలె...నా పెండ్లమును ఎందుక్కు ముట్టుకున్నవు అంటున్నన్.

పర:- నీ పెండ్లమా-(నవ్వి) నీ పెండ్లమే గాదనలే! సుల్తాన్ ఎందుకా కత్తిదెస్తవ్?

సుల్తాన్:- జోగులక్క జెప్పలె నీ కత! ఏడకు బోతవురా?

(కత్తి విసురుతాడు. పరమానంద పారిపోతాడు)

(లోపల మల్లన్న అరుస్తాడు) పటేల్‌సాబ్!

మల్లన్న:- (లోపల) అరెరెరే! మా పటేలయ్యను జంపినర్రా-జంపినర్రురా! (వస్తాడు) ఎవర్లా కత్తి యిసిర్నడు? పటేలయ్యగ్గుమ్ముకున్నది.

సుల్తానీ:- మల్లన్నన్నా! పటేలయ్య గ్గుచ్చుకున్నవాన్న!

మల్లన్న:- (చూచి) అద్గో పటేలయ్యొస్తున్నడు-ఏం జెప్పుకుంటరో జెప్పుకొండి, మీ గుడ్లు దీస్తడులే!

పటేల్:- (ప్రవేశం) మొగరా! నా మీదకు కత్తి యిసిర్నడు?

సుల్తాన్:- తమ మీదిక్కు యిసర్లే ద్దొర.

పటేల్:- ఎవలి మీన్కి యిసిర్నవు?

సుల్తాన్:- పరమానంద మీన్కి.

పటేల్:- ఎందు కిసిర్నవు?

సుల్తాన్:- నా పెండ్లాంకు నాకు లడాయైనది. నేగొట్టైన్నా......

పటేల్:- మాకొచ్చి జెప్పినవుగ!

సుల్తాన్:- గింతల పరమనందొచ్చి, నీలుదాపించడం-కూకోబెట్టడం జేస్తన్నడు —గింతలోనే వచ్చిన్న- నా పెండ్లామును వాడు ముట్కుంటడా దొరా! కోపం బట్టలేక వానిపై కత్తి యిసిర్నను. ఆ బద్మాష్ దప్కున్నడు. తమకు దగిల్నది! మన్నించాలి దొరా!

పటేల్:- (తన్ని) వరె! వాడు నీ పెండ్లామును ముట్టుకుంటె మాకు జెప్పాలె- మరి మామీనకు కత్తెవిసుర్త వన్నమాట! మా మీనకు (కర్రతో కొడ్తాడు)

సుల్తానీ.- (అడ్డుపడుతుంది. కర్ర తలపై తగిలింది) అబ్బా! దొరా!

పటేల్·- సుల్తానీ! గెంతపనిజేసినావె-గెంతపనిజేసినావ్. వానిదెబ్బ నీవెందుకు దిన్నవ్? మల్లన్నా-సుల్తాన్ను బట్కరా-బట్కరా వాన్ని - మల్లన్న అడగో, సుల్తాన్ ఉరుకుతున్నడు-బట్కరా వాన్ని-రానాకి బట్కరా వాన్ని.

మల్లన్న·- గట్లనే దొరా!!

శాంతయ్య:- ఇదేమి ఖర్మమే? వాడు నిన్ను కొట్టింది చాలక వాని దెబ్బలు కూడా నీవెందుకు తిన్నావే? ఆ త్రాగుబోతు సన్యాసి నాకెదురై చెప్పి అట్లా పారిపోతున్నాడు.

సుల్తానీ:- దొర! దొర!! (బావురుమంటుంది)

శాంతయ్య:- సుల్తానీ... నీవు సామాన్యురాలివికావు. మహాసాధ్వివి. నిన్ను చూచింది మొదలు నీలో ఏదో తేజస్సు వుందని నాకు తెలుసు.

కర్మ శేషంకోసం యీ మొరటుమృగాల చేతులలో పడ్డావ్. యిప్పటి కైనా నామాట వినమ్మా-సుల్తానీ- యీఅంటువెధవ సుల్తాన్ను విడిచి పెట్టు, నిన్ను మా బిడ్డను చూచుకొన్నట్లు చూచుకుంటాము; భగ వంతుని ధ్యానంచేస్తూ మా యింట్లో కాలం గడుపు.నామా టవిను తల్లీ!

సుల్తానీ:- అయ్యో! అయ్యో!! నా బ్రతుకే నాకు బరువైనది. తిరిగి తమరికి నేను మరిగింత బరువైతను - తమరెప్పుడు నన్నొక బిడ్డగనె-జూసు కున్నరు - అంట్లదానిగ జూడలె-అతడు గట్ల జేస్నిడ-యీతడిట్ల జేస్తున్నడు-(తన్మయత్వం బొందుతూ) దేవర! దేవుడిప్పుడే నా తలలో దిగిండు!! (ఆవేదన,... భగవంతుడు తనలో ప్రవేశించి నట్లు-అందరిని కలయ చూచి) ఏమో చెప్తున్నడు, ఏదకో రమ్మంటు న్నడు (వినయ బాష్పాలతో) మీ కెల్లరకిది ఎట్ల జెప్పాలో మాటలు దెలియకుంటున్నయ్ (లీలగా నవ్వుతూ) శాంతయ్య దొర! తమర్ని ఒక్కటి గోర్తాను.

శాంతయ్య:- ఏమిటది సుల్తానీ ?

సుల్తానీ:- తమరి కడ — రేదాసిన కాసులు ఆ పరమానంద కిచ్చెయ్యండి — నేనా తనితో జతబట్టినపుడు అతడు సంపాదించినదు— నన్నెల్లగొట్టి నపుడు — తిని బత్కు మన్నడు. ఇది తిని బత్కు మన్నడు దొర ! (వినరన్నట్లు తలూపుతుంది)

పరమానంద:- (ప్రవేశించి సుల్తానీని చూస్తాను) సుల్తానీ ! ! ఏంగట్ల నున్నవు ?

సుల్తానీ:- పరమానందా ! నీవేవచ్చినవా ? నీకె పిలవనంపాలె అనరకుంటు న్నను (శాంతయ్యతో) దొరా ! ఆకాసులు వీనికి ఇవ్వుమ్రి.

పరమానంద:- నా తొద్దు. దొర! నా తొద్దు. ఆ కాసులు సుల్తానీకి ఇంవాలె. ఆ కాసులు సుల్తానీకే. ఇవ్వని మీ కాళ్ మొక్తను.

సుల్తానీ:- ఆ కాసులు నా కెందుకు? నా కా వడ్డికాసుల వాండే వున్నాడు ఏడు కొండల వాడా!

శాంతయ్య, పరమానంద:- సుల్తానీ!!!...

సుల్తానీ:- వేంకటరమణా!

శాంతయ్య, పరమానంద:- సుల్తానీ!!...

సుల్తానీ:- వడ్డి కాసుల వాడా! వేయి నామముల వాడా! (భగవంతునిలో ఐక్యమైపోతుంది)

శాంతయ్య, పరమానంద:- సుల్తానీ!!...

పరమానంద:- (ఒక క్షణము ఆగి) సుల్తానీ, ఏంట్ల నైనది! వాయో, ఊపిరే పీల్చదు—మాట జెప్పదు (అని పూరుకుంటాడు) సుల్తానీ!

శాంతయ్య:- ఇంకెక్కడి సుల్తానీ—సుల్తానీ ఇక మనకు లేదు. పూర్వజన్మ సుకృతం వల్ల ఆ ''వేయి నామముల'' వానిలో ఐక్యమైపోయింది. (తెర జారుతుంది. అందరూ దుఃఖంతో ఉంటారు)

చింతయ్య:- ''నీవు కాలేనాడు కావలందరు గాని, వెంటనెవరూ రారు చిలుకా'' (అని పాడుతూ వుంటాడు.)

[తెర]



[రంగము : ఇంటి మధ్యభాగం. హాలు మధ్యన పేముకర్చీలు, టీపాయ్; ఒక ప్రక్కగా ఈజీచైర్, వెనుక భాగంలో టేబుల్, టేబుల్‌పైన అలారం టైంపీస్, మేగ్‌జైన్స్, శంకర్ ఫొటో, రేడియో. గోడలకు రకరకాల ఫోటోలు, వర్ణ చిత్రాలు. ఇంటిలోనికి, బయటకు వాకిళ్ళు. తెర ఎత్తేసరికి శంకర్ కుర్చీలో కూర్చున్నాడు. సన్నగా, పొడుగ్గా వున్నాడు. ముఖమంతా స్ఫోటకం మచ్చలతో వికృతంగా ఉంది. కళ్ళు రెండూ గ్రుడ్డివి. వయస్సు 28-30. చేతిలో వంకె కర్ర పట్టుకొని వున్నాడు. రేడియో నుండి తక్కువ స్థాయిలో సంగీతం వినిపిస్తూ వుంటుంది. కొంచె మాగి నౌకరు చంద్రయ్య కాఫీ తీసుకొని వచ్చాడు. వయస్సు 45; నెరిసీ నెరవని జుట్టు...]

చంద్రయ్య:- బాబూ!

శంకర్:- ఊఁ!

చం:- టీ తీసుకోండి (అందించాడు. శంకర్ టీ త్రాగి కప్పును అతనికి ఇచ్చాడు. శంకర్ ఏదో వెదుకుతున్నాడు టేబుల్‌పైన) ఏమిటి బాబూ?

శంక:- సిగరెట్.

చం:- (సిగరెట్ కేసునుండి సిగరెట్ తీసియిచ్చి అగ్గిపుల్ల ముట్టించాడు)

శంక:- చంద్రయ్యా!

చం:- బాబూ!

శంక:- టైమెంతయింది?

చం:- ఐదున్నర దాటింది బాబూ!

శంక:- ఐదున్నర! (గట్టిగా శ్వాసతాగి) యివ్వాళ గడియారం ముందుకు జరగటల్లేదు.

చం:- కాస్సేపు వరండాలో కూర్చుంటారా బాబూ?

శంక:- వద్దులే. ఇక్కడే హాయిగా ఉంది.

చం:- (కొంచెమాగి) బాబూ!

శంక:- ఊఁ.

చం:- మీరు రోజు రోజుకు చిక్కిపోతున్నారు బాబూ!

శంక:- నిజంగానా చంద్రయ్యా?

చం:- నిజంగానా అంటారేం బాబూ! బొమికల గూడులా అయిపోయారు.

శంక:- (చిరునవ్వు నవ్వాడు)

చం:- మీరు దిగులు పడకండి బాబూ; ఎలా జరగాలో అలా జరుగుతుంది.

శంక:- నేనేం దిగులుపట్టంలేదే!

చం:- (విసరుతూ) నాకు తెలుసు బాబూ, మీరెంత కృంగిపోతున్నారో నాకు తెలుసు. ఏం పాపం చేశారని మీ కీ ఖర్మ రాయాలి?

శంక:- దైవ నిర్ణయాని కెవరేం చేస్తారు చంద్రయ్యా?

చం:- దైవ నిర్ణయం! మీలాంటి ధర్మరాజుకు కష్టపోగొట్టటం, ఇదేనా భగవంతుడి న్యాయమంటే......(కంఠం రుద్ధమైంది) నా గుండెలు తరుక్కుపోతున్నయ్ బాబూ, మిమ్మల్ని చూస్తుంటే.

శంక:- ఎందుకు చంద్రయ్యా, ఈ నిర్భాగ్యుడిపైన నీకంత మమకారం? (లేదాడు)

చం:- మీరుతప్ప నా కింకెవరున్నారు బాబూ లోకంలో. నా అనేవాళ్ళంతా నట్టేట కలసి, మతిచెడి తిరుగుతున్న నన్ను దగ్గరకు తీసి మళ్ళీ మనిషిని చేశారు. మీరే లేకపోతే యెప్పుడో దిక్కులేని చావు చచ్చి వుండేవాణ్ణి. నేను అడుగుబెట్టింతర్వాతనే మీకీ ఖర్మ రాసింది.

శంక:- చంద్రయ్యా!

చం:- అవును బాబూ! నా మొఖం చూస్తేనే శని పట్టుకుంటూంది. నేను రాకపోతే మీకీ...

శంక:- చంద్రయ్యా! ఏం మాటంవి? నా ఖర్మకు నీవేంచేస్తావు చంద్రయ్యా? ఏ పూర్వజన్మ పాపఫలమో ఈ జన్మలో అనుభవిస్తున్నాను. (క్షణం నిశ్శబ్దం)

చం:- మీకిక చూపు రానట్లేనా బాబూ?

శంక:- అంతా అలానే అంటున్నారు.

చం:- అంతేనా నాకు బావొస్తే ఎంత బాగుణ్ణుబాబూ ?

శంక:- ఎంత స్వార్థం చంద్రయ్యా నీది!

చం:- బాబూ!

శంక:- అవును చంద్రయ్యా! ఈ స్థితిలో నువ్వు కూడా లేకపోతే నాకు దిక్కెవరు చెప్పు ?

చం:- (కళ్లు తుడుచుకుంటూ) పోను బాబూ, మీకోసం బ్రతికే వుంటా.

శంక:- ఆత్మీయులంతా దూరమయ్యారు. నువ్వొక్కడివే మిగిలావు. ఈ స్థితిలో నువ్వే లేకుంటే నాగతేమయ్యేది?

చం:- (కొంచెమాగి) ఏమిటో బాబూ, అంతా అయోమయంగా వుంది. మీరు చూస్తే ఇలావుంటిరి; అమ్మగారికి చీమకుట్టినట్లయినాలేకపోయె. ఎప్పుడూ ఆ నాటకాలు, సినిమాలు, షికార్లు దప్ప...

శంక:- ఆమెకు మాత్రం బాధ లేదంటావా చంద్రయ్యా?

చం:- అంతమాట నేనెందుకనాల్లే బాబూ. కనబడుతూనే వుందిగా.

శంక:- (బాధను కప్పిపెట్టుకుంటానికి ప్రయత్నిస్తూ)చిన్నతనంలేచంద్రయ్యా!

చం:- హుఁ, చిన్నతనం. ఇంకో ఆడకూతురయితే ఈపాటికి మంచ మెక్కకపోయిందా దిగుల్తో.

శంక:- వెళ్ళు చంద్రయ్యా, నీ పని చూసుకో.

చం:- వెళతానులే బాబూ, కాసేపు చల్లగాలిలో కూచోండి, ఉక్కటోస్తోంది.

శంక:- ఇక్కడే బావుందిలే. (కుర్చీలో కూర్చున్నాడు)

చం:- (అతనివంక జాలిగా చూస్తూ లోనకెళ్ళబోయి ఆగాడు) ఆ రేడియో అన్నా పెట్టుకోండి, బిక్కుబిక్కుమంటూంది.

శంక:- (చిరునవ్వుతో) సరే.

[స్విచ్ ఆన్ చేసి చంద్రయ్య లోనికెళ్ళాడు. రేడియోలో సన్నని వయొలిన్ నాదం. కొంచెమయిన తర్వాత బయట కారాగిన శబ్దం. కిల కిల నవ్వులు... శంకర్ రేడియో ఆపేశాడు. నిర్మల కూని రాగంతో వచ్చింది. సన్నగా, అందంగా వుంది. వయస్సు 20-22. వేనిటీ బాగ్ త్రిప్పుకుంటూ సరాసరి లోనికెళుతుంది]

శంక:- ఎవరు ? నిర్మలా!

నిర్మ:- (ఆగి) ఓ, యిక్కడున్నారా ?

శంక:- యెవరు బయట మాట్లాడుతూంది ?

నిర్మ:- శెక్రటరీ మూర్తి.

శంక:- లోనికి రాలేదేం ?

నిర్మ-: పనుందని వెళ్ళాడు, ఆఁ వస్తా, డ్రస్ ఛేంజి చేసుకోవాలి (వెళ్ళింది).

[శంకర్ సిగరెట్ ముట్టించి అటు ఇటు తిరుగుతున్నాడు. మురళి బయటనుంచి వచ్చాడు. వయస్సు పాతికేళ్ళకు పైగా ఉంటుంది. టిప్‌టాప్‌గా వున్నాడు].

ముర:- (వస్తూనే) హల్లో, శంకర్! How are you?

శంక:- యెవరు ? మురళీ!

ముర:- yes, నిర్మల వుందా?

శంక:- లోపలుంది. కూర్చో మురళీ! (శంకర్ తడువుకుంటూ సోఫా దగ్గరగా వస్తున్నాడు. మురళి ఎదురుగా వెళ్ళి అతన్ని నడిపించుకొచ్చాడు. యిద్దరూ కూర్చున్నారు) విశేషాలేమిటి మురళీ! నాటకం ఎంత వరకొచ్చింది ?

ముర:- వచ్చే నెలలో స్టేజి చెయ్యగల మనుకుంటున్నాం. థియేటర్ యానివర్సరీ కూడా వచ్చేనెల్లోనేగా.

శంక:- ఐ సీ.

ముర:- (సిగరెట్ అందిస్తూ) సిగరెట్ కాల్చు శంకర్! (సిగరెట్ యిచ్చి అగ్గిపుల్లగీసి ముట్టించాడు. తనూ కాల్చుకొని పొగవదలి తాపీగా) ఏమిటో ఈ జీవితాలు. నిరుడీ రోజుల్లో అందరం కలసి ఎంతో సరదాగా నాటకం ప్రాక్టీసు చేస్తున్నాం. అప్పుడు కనీసం ఊహించ గలిగామా నువ్విలాగయిపోతావని.

శంక:- విధికృతాన్ని ఎవరు తప్పించుకోగలరు మురళీ!

ముర:- నిజం చెబుతున్నాను శంకర్! నువ్వులేని లోటు మాత్రం మా కెన్నటికీ తీరదు. నీ సంగతి గుర్తుకొచ్చినప్పుడల్లా చాలా యిదిగా వుంటుంది.

శంక:- థ్యాంక్స్ (అస్పష్టంగా)

ముర:- ఈ నాటకం కాగానే మన మొకసారి కలకత్తా వెళ్ళొద్దాం శంకర్!

శంక:- దేనికి ?

ముర:- అక్కడ సతీష్ అనే మా ఫామిలీ ఫ్రెండ్ ఒకాయన వున్నారు, "ఐ" స్పెషలిస్ట్. ఆయన కొకసారి నిన్ను చూపిద్దామనుకొంటున్నాను.

శంక:- నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి మురళీ! కాని నాకు తిరిగి చూపు వస్తుం దనే నమ్మకం లేదు.

ముర:- అలా అనకు శంకర్! నీకు తప్పకుండా చూపు వస్తుంది. నాకా నమ్మకం వుంది.

నిర్మ:- (వస్తూ) హలో మురళీ, ఎంత సేపయింది వచ్చి ?

ముర:- జెష్ట్, ఇప్పుడే, నువ్వు క్లబ్బులో వున్నావేమో ననుకున్నాను.

నిర్మ:- (కూర్చుంటూ) క్లబ్బులో కూర్చొని కూర్చొని విసుగెత్తి వచ్చేశాను బాబూ ...... (లోనికి చూచి) చంద్రయ్యా!

చం:- (లోపలినుండి) అమ్మా!

నిర్మ:- టీ పంపించు.

ముర:- నిజంగా యీ నాటకంలో మన నిర్మల యాక్టు చేస్తోంది శంకర్; అబ్బ ఏం చెప్పనలే. (వ్యంగ్యంగా అన్నాడు.)

శంక:- అంత బాగా యాక్టు చేస్తోందా?

ముర:- బాగా అంటావేమిటి? నిన్న క్లయిమాక్సు సీనులో నా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయంటే నమ్మ.

నిర్మ:- అబ్బ! ములగ చెట్టెక్కించకయ్యా బాబూ! (చంద్రయ్య టీ తెచ్చి టీ పాయ్‌మీద పెట్టాడు.)

ముర:- అసలు శంకరే ఆ "రవి" పాత్ర ధరించివుంటేనా.

నిర్మ:- (అందిస్తూ) టీ త్రాగు ముందు.

ముర:- థ్యేంక్సు. (అందుకున్నాడు)

నిర్మ:- (శంకర్‌కు కప్పు అందిస్తూ) టీ తీసుకోండి.

శంక:- వద్దు. యిప్పుడే తాగాను.

నిర్మ:- ఫర్వాలేదు కొంచెం తీసుకోండి.

ముర:- మా కోసం కొంచెం తీసుకో శంకర్! (శంకర్ కప్పు అందుకున్నాడు. చంద్రయ్య లోనికెళ్ళాడు. మురళి కప్పు దింపేస్తూ) మన ప్రయాణం శంకర్‌కు చెప్పావా?

నిర్మ:- ఇంకా లేదు. (చెప్పమన్నట్లు సైగ.)

శంక:- ప్రయాణమేమిటి?

ముర:- మహాబలిపురం పిక్నిక్ వెళుతున్నాంలే.

శంక:- ఎవరెవరు?

ముర:- అంతా పదిమందివరకుంటాం. దాదాపు థియేటర్ మెంబర్సంతా కదుల్తున్నారులే

శంక:- అలాగా,

ముర:- మూడు రోజులు ప్రోగ్రాం (నిర్మలవంక కొంటెగా చూచారు. ఆమె మూతి త్రిప్పింది వెక్కిరిస్తున్న ధోరణిలో. మురళి ఆమె బుగ్గపై లాలనగా వ్రేలితో మీటాడు. ఆమె సుతారంగా వెనక్కు సర్దుకుంది. మురళి సిగరెట్ తీసి) సిగరెట్ కాల్చు శంకర్!

శంక:- వద్దు. (లేచి నిలబడి) చంద్రయ్యా......

ముర:- ఏమిటి శంకర్?

శంక:- అఁ ఏం లేదు. తలనొప్పిగా వుంది. కాసేపు రెస్ట్ తీసుకోవాలి. మీరు మాట్లాడుతూ వుండండి...

ముర:- ఏదైనా "టేబ్లెట్" వేసుకుంటే...

శంక:- అక్కర్లేదులే...చంద్రయ్యా!

చం:- బాబూ (వచ్చాడు).

శంక:- నన్ను లోనికి తీసుకెళ్ళు. (చంద్రయ్య లోనికి తీసుకెళ్ళాడు.)

ముర:- ఏమిటో పాపం! శంకర్ బ్రతుకిలా అయింది. ఎలాంటి వాడెలా అయిపోయాడు. (అతను వెళ్ళినవైపే చూస్తూ జాలిగా అన్నాడు.)

నిర్మ:- (ధోరణి మారుస్తూ) అ, మరచాను ఇవ్వాళ పిక్చరు ప్రోగ్రాం......

ముర:- సారీ, నేనా మాటే మరచాను. సెకండ్ షోకెళదాం. యింక నే వెళ్ళిరానా మరి?

నిర్మ:- (కొంటెగా చూస్తూ) నే రమ్మంటే వచ్చావా, నన్నడిగి వెళ్ళటానికి.

ముర:- ఊఁ (ఆమె బుగ్గపైన చిటిక వేశాడు.)

నిర్మ:- హుష్......(వెనక్కి జరిగింది)

ముర:- ఎన్నాళ్ళు నిర్మలా. యీ దొంగ బ్రతుకు?

నిర్మ:- ఏం చేద్దామంటావ్?

ముర:- నువ్వు పూర్తిగా నా దానివి కావాలి. మన మధ్య అడుగోడ ఉండటం నా కిష్టంలేదు నిర్మలా!

నిర్మ:- అందుకేం చేదాం! చెప్పు మరి. (వయ్యారంగా అటు ఇటు తిరుగుతూంది.)

ముర:- (ఆమె ననుసరిస్తూ) నాకేం తోచడంలేదు.

నిర్మ:- అబ్బ! ఎంత అమాయకులు "వెన్న పెడితే మింగలేరు, వేలు పెడితే కొరకలేరు" అవునా? ఊఁ! (నవ్వింది.)

ముర:- ఎగతాళి కాదు నిర్మలా! నన్నేం చెయ్యమంటావు చెప్పు. నీ కోసం గంగలో దూకటానికైనా సిద్ధమే.

నిర్మ:- నిజంగానా?

ముర:- ఆ...చెప్పు నిర్మలా. (చెయ్యి పట్టుకుంటాడు.)

నిర్మ:- అయితే, వెంటనే......

ముర:- ఊఁ... వెంటనే

నిర్మ:- పెళ్ళి చేసుకుందాం.

ముర:- పెళ్ళా!

నిర్మ:- ఏం?

ముర:- మరి...శంకర్.

నిర్మ:- అది నీ కనవసరం. అయినా ఆయన నాకు తాళి గట్టలేదుగా - (వెళ్ళి కుర్చీలో జారబడింది.)

ముర:- ని-ర్మ-లా (అస్పష్టంగా అన్నాడు.)

నిర్మ:- ఏం యిష్టం లేదా?

ముర:- అదికాదు నిర్మలా, నీకోసం తనవాళ్ళ నందరినీ వదులుకొని వచ్చేశాడుగా పాపం. యీ స్థితిలో నువ్వు వదిలిపెడితే శంకర్ ఏమైపోవాలి?

నిర్మ:- (లేచి దగ్గరకు వచ్చింది) శంకర్‌పై నాకూ అభిమాన ముంది మురళీ! అతను నాకోసం త్యాగం చేశాడు. నే నా మాట కాదన్ను ... ఒక

విధంగా నేనూ అటువంటి త్యాగమేచేశానేమో?...అదంతా వదిలేయ్. ఆయనంటే నాకు చాలా గౌరవముంది. కాని...కాని ఆ కురూపి కోసం నా యవ్వనం బలిపెట్టుకోలేను మురళీ!

ముర:- నిర్మలా!

నిర్మ:- అవును మురళీ! యీనాడు ఆయనవల్ల ఏ విధంగానూ సుఖపడ లేను...ఆ రూపం...ఆ వికృతరూపం తలుచుకుంటేనే వళ్ళు జలద రిస్తుంది. అందుకే ప్రతిక్షణం ఆయన్నుండి తప్పించుకు తిరుగు తున్నాను.

ముర:- (శంకర్ ఫోటో దగ్గరగా వెళ్ళాడు)

నిర్మ:- (అతని దగ్గరగా వెళ్ళింది) ఆలోచించు మురళీ! నాదేమంత పెద్ద వయస్సు కాదుగా. యీ వయస్సులో కోరికలన్నీ కాల్చివేసుకొని బ్రతికేకన్నా మృత్యువునే వరించడం మంచిది గాదా!

ముర:- నిర్మలా!

నిర్మ:- యింకేం చెప్పకు మురళీ! నా కిప్పుడు నీ ధ్యానం తప్ప వేరేమీ లేదు. (అతని భుజంపై తలవాల్చింది) నీ ధ్యానంలోనే సర్వం మరచిపోతున్నాను మురళీ! ఏది ఏమైనా నాకు నువ్వే కావాలి. నీ కోసం యే పాపానికైనా, ఏ త్యాగానికైనా సిద్ధమే మురళీ! నువ్వు లేందే నేను బ్రతకలేను మురళీ! (తన్మయత్వం జెందుతూ మాట్లా డింది)

ముర:- (దగ్గరకు తీసుకొని) పిచ్చిదానివై పోతున్నావు నిర్మలా!

నిర్మ:- నువ్వు నన్నిలా చేశావు మురళీ!

ముర:- నిర్మలా... (లోపల చప్పుడవుతుంది. యిద్దరూ దూరమయ్యారు చంద్రయ్య వచ్చాడు) నే వెళ్ళొస్తా నిర్మలా! (తడబడుతూ అన్నాడు.)

నిర్మ:- ఆఁ ఊఁ, (మురళి వెళ్ళాడు. చంద్రయ్య ఖాళీ కప్పులు తీసుకొని అదో విధంగా చూస్తూ లోనికి వెళ్ళాడు. నిర్మల సన్నగా పాట పాడుతూంది. చంద్రయ్య లోపలినుండి మళ్ళీ వచ్చాడు.)

చం:- అమ్మా!

నిర్మ:- (మేగజైన్ చూస్తూనే) ఏమిటి?

చం:- బాబుగారు బెంగపడి పోతున్నారు తల్లీ!

నిర్మ:- (యాదాలాపంగా) దేనికి?

చం:- మీరు తప్ప వారి కింకెవరున్నారు చెప్పండి.

నిర్మ:- అంటే?

చం:- వారి బాగోగులు మీరు చూడకపోతే ఇంకెవరు చూస్తారు.

నిర్మ:- ఆయితే నే నిప్పుడొదిలేశానంటావా?

చం:- అది కాదమ్మా.

నిర్మ:- ఏది కాదు (తీవ్రంగా అడిగింది.)

చం:- మీరు కోప్పడితే నేనేం చెప్పేది.

నిర్మ:- కాకపోతే ఏమిటి మరి? (కఠినంగా) ఆలుసిచ్చినంత మాత్రాన అంతస్థులు మరవటం మంచిదికాదు.

చం:- అంతస్థులు మరచి నేనేమన్నాను తల్లీ, ఆ మహారాజుని చూస్తుంటే కడుపు తరుక్కుపోయి నోరువిప్పానుగాని.

నిర్మ:- బయల్దేరావులే పెద్ద దయానిధివి.

చం:- (కొంచెం సీరియస్‌గా) నా దయాధర్మాలతో ప్రయోజన మేమిటి లేమ్మా! గ్రుడ్డి కన్ను మూసినా తెరచినా ఒక టేనని...

నిర్మ:- ఆలా అనుకున్నవాడివి నోరు మూసుకొని కూచోవాలి...

చం:- అంతకన్నా నేను చేయగలిగేదేమున్నా ఆనందంతో చేసి వుండేవాణ్ణి. ఏం చెయ్యలేకనే ఏవెలా జరుగుతున్నా ఏమీ జరగనట్టే కాలం వెళ్ళబుచ్చుతున్నాను.

నిర్మ:- (సీరియస్‌గా) ఏమిటి జరిగేది?

చం:- జరిగేదేమిటో ఒక్కసారి ఆలోచించుకుంటే అంతా మీకే తెలుస్తుంది.

నిర్మ:- చంద్రయ్యా, వాళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడడం మంచిది.

చం:- ఆపండి. (సీరియస్‌గా) మాటజారేముందు కొంచెం వెనకాముందు ఆలోచించుకోవటం మంచిది.

నిర్మ:- ఆఁ, ఎంత పొగరు! మాటకు మాట అనే వరకూ వచ్చిందే.

చం:- ఎందుకనరు! ఆ యింటికి ఈ యిల్లెంతో ఈ ఇంటికీ ఆ యిల్లంతే. ఆ మహారాజుపై వున్న విశ్వాసంతో యిక్కడున్నాగాని మీతో మాటలు పడటానికికాదు.

నిర్మ:- (కొంచెం స్థాయి తగ్గించి) కూటికోసం పంచన జేరి మాకే నీతులు చెప్పటానికి తయారయ్యావు.

చం:- అందరు ఆ స్థితిలో వున్నవాళ్ళే మొదట. కాకపోతే శంకరంగారి పుణ్యమాని ఈ రోజు...

నిర్మ:- నోర్ముయ్ (చెయ్యెత్తి, కొట్టకుండానే ఆగిపోయింది)

చం:- (తీవ్రంగా) ఆగారేం? మీమీద నాకింకా అభిమానం పోలేదుగాబట్టే యింతకుమించి ఏమీ అనలేక పోతున్నాను. లేకుంటే. (వెళ్ళాడు.)

నిర్మ:- (కుర్చీలో కూలబడి రొప్పుతూ) వె...ధ...వ.

శంక:- (లోపలినుండి వచ్చి) ఏమిటి నిర్మలా గొడవ?

నిర్మ:- ఏముంది, అలుసిచ్చి నెత్తినెక్కించుకుంటే సరి.

శంక:- ఎవరి సంగతి?

నిర్మ:- యింకెవరున్నారు, తెచ్చిపెట్టారుగా పోతురాజుని.

శంక:- చంద్రయ్యేనా? ఏమన్నాడు?

నిర్మ:- ఏమయినా అంటాడు. వళ్ళు కొవ్వితే సరి.

శంక:- పోనివ్వు నిర్మలా. ఏదో పెద్దవాడు, బ్రతికి చెడ్డవాడు.

నిర్మ:- మీరిలా అనే వాడికి కళ్ళు నెత్తికి తెచ్చారు. (చరచర లోనికెళ్ళింది.)

[శంకర్ అటు యిటు తిరుగుతున్నాడు]

చం:- (లోపలినుండి చేతిలో సంచితో వచ్చారు) బజారు కెళ్ళి పళ్ళు తెస్తాను బాబూ!

శంక:- ఊఁ (చంద్రయ్య వెళుతున్నాడు) చంద్రయ్యా!

చం:- ఏమిటి బాబూ?

శంక:- నిర్మలనేమయినా అన్నావా?

చం:- లేదు బాబూ!

శంక:- మరేమిటి యింతకు ముందు...

చం:- ఏదో పెద్దతనం. ఒకటి చేయబోయి మరొకటి చేస్తుంటాను. అందు కని ఏదో కోప్పడ్డారులెండి, వస్తా. పొద్దుగూకుతోంది. (వెళ్ళారు.)

శంక:- (ఆలోచిస్తూ టేబుల్ వద్దకు నడిచాడు. సన్నగా దగ్గు)

నిర్మ:- (వచ్చి) తలనొప్పి తగ్గిందా?

శంక:- ఆఁ (టేబుల్ పైన వెదుకుతున్నాడు)

నిర్మ:- ఏం కావాలి?

శంక:- సిగరెట్.

నిర్మ:- (రేడియో ప్రక్కనున్న సిగరెట్ కేస్, అగ్గిపెట్టె తెచ్చియిచ్చి) అబ్బ, ఎందుకీ పాడు సిగరెట్లలా తగలేస్తారు? ఆరోగ్యం చెడిపోదూ!

శంక:- (బరువుగా) ఇంకా చెడేదేముంది, బ్రతుకే పూర్తిగా చెడిపోయిందిగా! (దగ్గుతూ సిగరెట్ ముట్టించాడు. నిర్మల ఏదో అనబోయి ఆగింది. క్షణం నిశ్శబ్దం) నిర్మలా! (అటూ ఇటూ నడుస్తాడు.)

నిర్మ:- ఏమిటండి?

శంక:- నన్ను మా వూరు పంపించు నిర్మలా!

నిర్మ:- (గతుక్కుమంది) అదేమిటి?

శంక:- నే నిక్కడ వుండలేను నిర్మలా!

నిర్మ:- ఏం?

శంక:- యీ రోజు- యింత దీర్ఘకాలం తర్వాత, నాకు మా వూరు, నా స్వజనం గుర్తుకొస్తున్నారు. వాళ్ళ దగ్గర కెళ్ళాలని మనస్సు తహ తహలాడుతోంది.

నిర్మ:- స్వజనం! నేను పరాయి దాన్నా, (ఉద్రేకంలేకుండా అడిగింది.)

శంక:- అంత మాటనగలనా నిర్మలా? యిన్నాళ్ళూ నీవు నాపైన చూపిన ప్రేమ, అనురాగం ఎలా మరువగలను? భగ్న హృదయు డనై వ్యధచెందుతున్ననాకు నీసాహచర్యం లభించటంతో ఎడారిలో అమృత వర్షం కురిసినట్లయింది. మోడువారిన బ్రతుకు మరల చిగురించింది. నీతో కలసి స్వర్గసౌఖ్యా లనుభవించాను. నీ నుండి చాలా పొందగలిగాను.

నిర్మ:- మరి...

శంక:- జీవితమంతా ఆ వెన్నెల అలా నిలచిపోతుందని భ్రమించాను. బ్రతు కులో అమావాస్య రాదని ఆశించాను కాని...కాని ...

నిర్మ:- ఏమిటండీ ఈ ధోరణి (దగ్గరగా వచ్చి చెయ్యి పట్టుకుంది) యిప్పుడే మయింది?

శంక:- (ఆవేదనగా) విధి నా కెదురయింది నిర్మలా! నేనిక్కడ నుండి... శాశ్వతంగా వెళ్ళిపోవా లనుకుంటున్నాను.

నిర్మ:- శాశ్వతంగానా!

శంక:- అవును.

నిర్మ:- కారణం!

శంక:- చెప్పలేను.

నిర్మ:- కారణం చెప్పకుండా వెళతాననటంలో అర్థంలేదు.

శంక:- నిర్మలా...ఒక్క మాటడుగుతాను నిజం చెప్పగలవా?

నిర్మ:- ఎందుకు చెప్పలేను.

శంక:- నీవు నన్ను యింకా ప్రేమిస్తూనే వున్నావా? (నిర్మల షాక్ తిన్నట్ల యింది) చెప్పు నిర్మలా! (భుజం పట్టుకొని వూపాడు.)

నిర్మ:- అర్థంలేని ప్రశ్న (తీవ్రంగా అంది.)

శంక:- (సన్నగా నవ్వాడు) అవును అర్థంలేని ప్రశ్నే! తెలుసు నిర్మలా, నిజాన్ని వప్పుకునే ధైర్యం నీకు లేదు.

నిర్మ:- ఏమిటా నిజం?

శంక:- నీకు నామీద రోత పుడుతోంది. నా నుండి దూరంగా తప్పుకోటానికి ప్రయత్నిస్తున్నావు. ఇది నిజం కాదా నిర్మలా ?

నిర్మ:- మీకు పిచ్చిపట్టలేదు కదా.

శంక:- అవును పిచ్చే పట్టింది.

నిర్మ:- కాసేపు రెస్ట్ తీసుకోండి.

శంక:- నీ తప్పేమీలేదు నిర్మలా. నిజంగా నేను నీకు తగను. ఈ వికృత రూపాన్ని, ఈ కటోదిని నువ్వెలా ప్రేమించగలవ్?

నిర్మ:- మీకు మనస్సెందుకో పాడయింది. నా మాట విని కాస్సేపు రెస్టు తీసుకోండి. రండి లోనికెళదాం. (చెయ్యి పట్టుకుంది.)

శంక:- (ఆమె చేయి తన అరచేతుల్లోకి తీసుకుంటూ) మనం కలుసుకొన్న తొలిరోజులు గుర్తున్నయ్యా నిర్మలా ? (నిర్మల జవాబియ్యదు. అతను శూన్యంలోకి చూస్తూ) యింత సర్వనాశనం తర్వాతకూడా ఆ మధుర క్షణాలు నా స్మృతిపథం నుండి తొలగిపోవటం లేదు నిర్మలా. ఎంత తియ్యని రోజులవి? ఎంత కమ్మని కలలు. ఆ వెన్నెల రాత్రులు-ఆ సముద్రతీర విహారాలు. అబ్బ! యెంత మధురాతి మధురం నిర్మలా, ఆ జీవితం. (నిర్మల శూన్యంలోకి చూస్తూ తన చేతిని అతని చేతులమధ్య నుండి తీసుకోటానికి ప్రయత్నించింది. ఆమె చేయి మృదువుగా స్పృశిస్తూ) ఉండు నిర్మలా, ఒక్క రెండు నిమిషాలిలానే వుండు. ఆ మధురక్షణాలు స్మరించుకొందాం...మనం కలుసుకొన్న తొలిరోజులు గుర్తుకొస్తున్నాయా నిర్మలా! అప్పుడు నువ్వు పొట్టకోసం కిరాయి నాటకాల్లో వేషాలు వేస్తుండేదానివి. అప్పటికి నాకింత పేరూ లేదు. మామూలు నటుణ్ణి.

చిన్న రచయితను. సరదాకోసం నాటకాలాడుతుండేవాణ్ణి. నువ్వు తరుచు నా నాటకాల్లో పాల్గొంటుండే దానివి. ఆ రోజుల్లో అవ్యక్తమైన భావంతో నువ్వు నా కళ్ళల్లోకి చూస్తూండేదానివి. నీ చూపుల్లో (క్రమంగా చేయివదలి శూన్యంలోకి చూస్తూ) అర్థంగాని ఏదో ఆశ నా హృదయాన్నాక్రమించింది. ఒకరోజు నీవు చెప్పావు...నా అర్ధనిమీలిత నేత్రాలు నిన్ను ఏదో లోకానికి తీసుకెళుతున్నవనీ... నా కళ్ళల్లోనికి చూస్తూంటే లోకాన్నే మరచిపోతున్నాననీ... కాదా నిర్మలా? (నిర్మల ఆలోచిస్తూ నిలబడిపోయింది) నిరాశల సుడిలో అణిగిపోతున్న నాలో ఆశలు పునరుజ్జీవింప సాగినయ్. తరలిన వసంతం మరలివచ్చింది. (రెండడుగులు వేసి) మన మధ్య అనురాగ లత పెరిగి పెద్దదై, రెండు హృదయాలను బంధించి వేసింది. నీకోసం నేను, నాకోసం నీవు సర్వస్వం త్యజించాము. సంఘాన్నెదిరించి ఆత్మీయులందర్నీ వదిలేసి యిక్కడ కొచ్చాం. ఒకరికోసం ఒకరం బ్రతుకు బ్రద్దలు చేసుకొన్నాం. (నిర్మల ఆలోచిస్తూనే అతనివైపు రెండడుగులు వేసింది) కష్టంలో, సుఖంలో ఒకరి హృదయంలో ఒకరం తలదాచుకొన్నాం. నిష్కల్మష ప్రేమీ ప్రేమికుల మని గర్వించామప్పుడు. మూడు సంవత్సరాలు చీకూ చింత లేకుండా కాలం వెళ్ళబుచ్చాం. బ్రతుకుబాటను నందనవనంగా మార్చుకున్నాం. (నిర్మల అతని చేయి స్పృశించింది.) ఎంత తీయని కల నిర్మలా అది...ఆ కల కరిగిపోకుండా శాశ్వతంగా నిలచిపోతుందని భ్రమించాను. వెలుగు చీకట్లు సహజమన్న సత్యాన్ని విస్మరించాను నిర్మలా...(నిర్మల అతని చేయి వదిలేసింది) విధి నా అదృష్టాన్ని, ఆనందాన్ని చూచి ఓర్వలేకపోయింది తన వక్ర దృష్టి నాపైన ప్రసరించింది. (నిర్మల ఎడంగా జరిగింది) నా బ్రతుకుబాటల్లో (ఆవేదనగా) చీకటితెరలు దిగజార్చింది. అనుకోకుండానే నాకీ స్ఫోటకం వచ్చింది. నీవు ఎంతగానో ప్రేమించే నా అర్ధనిమీలిత నేత్రాలు మూసుకుపోయినయ్. నేను శాశ్వతంగా గ్రుడ్డివాడినయ్యాను. (దగ్గు)

నిర్మ:- అబ్బ, ఏమిటండీ హింస! (మొహం కప్పుకొని ఏడ్చింది.)

శంక:- దానితో మనిద్దరి మధ్యా అగాధం ఏర్పడింది. నా నేత్రాలలాగే మన హృదయాలు మూసుకుపోయినయ్. ఈరోజు నీవు నన్ను చూస్తుంటే భయపడుతున్నావు. నా నుండి దూరంగా తప్పుకోటానికి ప్రయత్నిస్తున్నావు.

నిర్మ:- (దుఃఖంతో) లేదండి, మీరు అపార్థం చేసుకుంటున్నారు.

శంక:- ఆత్మవంచన మహాపాపం నిర్మలా! ...నీ కోరిక న్యాయమైనదే. ప్రతిజీవి తన జీవితం స్వర్గతుల్యం కావాలనే కాంక్షిస్తుంది. బ్రతుకు బాట నందనవనంలా వుండాలనే కోరుకుంటుంది. కోరికోరి కంటకావృతమైన మార్గాన్నెవరూ వరించరు నిర్మలా!

నిర్మ:- నన్ను క్షమించు శంకర్ (పాదాలపై వ్రాలింది)

శంక:- (తల నిమురుతూ) నీ తప్పేమీలేదు నిర్మలా! నా కోసం నీ బ్రతుకుని బలెట్టుకోమని కోరేటంత స్వార్థపరుణ్ణి గాను. నీ వేం కోరుతున్నావో నాకు తెలుసు. నీ ఆనందానికి నే నెప్పుడూ అడ్డురాను. రేపే నే నిక్కడనుండి వెళ్ళిపోతున్నాను నిర్మలా! (వెళుతున్నాడు లోనికి, దగ్గుతూ)

నిర్మ:- వద్దండీ...మీ (ఏదో చెప్పబోయింది కాని మాట పెగల్లేదు)

శంక:- (ఆగి) ఒక్క సత్యంమాత్రం చెప్పక తప్పదు నిర్మలా! జీవితం మాత్రం నవలలా, సినిమాలా హాయిగా వుంటుందనుకోవటం తప్పు. జీవిత గమనంలో అడుగడుగునా అవరోధా లనేకం ఉంటాయ్. ఒక్క అడుగు పొరపాటు వేశామో అధో లోకానికి జారిపోతాం... (స్థాయి తగ్గించి) నువ్వు వట్టి అమాయకురాలివి నిర్మలా! మెరిసేదంతా బంగారం కాదు. మేడిపళ్ళు చాలా వుంటయ్! త్యాగబుద్ధి త్యాగం చేసే శక్తి మనుషులందరిలో వుండటం చాలా కష్టం. జాగ్రత్త...నా బ్రతుకేలాగూ మంట కలిసింది, నీవైనా సుఖంగా వుంటేనే నాకు కొంతయినా మనశ్శాంతి. (దగ్గుతెర వచ్చింది)

నిర్మ:- మీ...రు...

శంక:- నిండు హృదయంతో నిన్నా శీర్వదిస్తున్నాను. నా కన్నా నీ మేలు కోరేవాళ్ళీ ప్రపంచంలో ఎవ్వరూ లేరు నిర్మలా—వస్తా (కర్రతో తడుముకుంటూ చకచకా లోనికెళ్ళాడు. నిర్మల అచేతనంగా అలానే నిలబడింది. దూరాన్నుంచి వయొలిన్ సముద్రపు హోరులా మొదలయింది. నిర్మల సోఫాలో కూలబడింది. క్రమంగా వయొలిన్ ఆగింది. నిర్మల కొంచెం ఆలోచిస్తూంది. బయటనుండి మురళి వచ్చాడు)

ముర:- హల్లో నిర్మలా, రెడీయేనా?

నిర్మ:- (తల ఎత్తి అతనివంక చూచి మళ్ళీ దించేసింది)

ముర:- (దగ్గరకొచ్చి) ఏం అలా వున్నావ్ (మాట్లాడలేదు) నిర్మలా...(భుజం మీద చేయి వేశాడు.) నిర్మల నెమ్మదిగా అతని చేతిని తీసివేసింది. ఆశ్చర్యపడ్డాడు.) ఏంజరిగింది నిర్మలా! (సిగరెట్ నలిపివేశాడు) చెప్పు నిర్మలా! ఎందుకిలా వున్నావ్ (ఆమెలేచి నిలబడింది) చెప్పవూ? (గోముగా) శంకరేమైనా...

నిర్మ:- ఆయనకంతా తెలిసిపోయింది.

ముర:- ఆఁ! (జేబుగుడ్డతో ముఖం తుడుచుకున్నాడు. క్షణం మౌనం) సరే వస్తా, రేపు కలుద్దాం.

నిర్మ:- (మురళి రెండడుగులు వేస్తాడు. దీర్ఘంగా ఆలోచిస్తూనే) మురళీ!

ముర:- (ఆగి) ఏమిటి?

నిర్మ:- కూర్చో, నీతో మాట్లాడాలి.

ముర:- (వెనక్కు వచ్చి) శంకర్...మళ్ళీ...

నిర్మ:- (అతనివంక చూడకుండానే) మురళీ, ఒక్క మాటడుగుతాను నిజం చెబుతావా?

ముర.- ఏమిటది?

నిర్మ:- నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా?

మురః- ఆ అనుమాన మెందుకొచ్చింది?

నిర్మ:- నా ప్రశ్నకు జవాబు చెప్పు మురళీ,

మురః- త్రికరణ శుద్ధిగా!

నిర్మ:- ప్రేమిస్తున్నావు గదూ?

మురః- సందేహమేముంది, ఆ వస్తా నిర్మలా...శంకర్ వస్తే...

నిర్మ:- అయితే నేనొక్కటి చెబుతాను చేస్తావా?

మురః- చెప్పు.

నిర్మ:- మనిద్దరం ఈ రాత్రే బాంబే వెళ్ళిపోదాం.

మురః- దేనికి?

నిర్మ:- అవన్నీ తర్వాత మాటలు. ముందిక్కడనుండి వెళ్ళిపోవటం అవసరం.

మురః- అదంత మంచిపనికాదు నిర్మలా!

నిర్మ:- మురళీ! (దగ్గర కొచ్చింది) శంకర్ ముందు యింకొక నిమిషంకూడ వుండలేను. ఇంత జరిగినతర్వాత ఏమీ జరగనట్లు నటించలేను. నన్ను ఎక్కడికైనా తీసుకుపో మురళీ!

మురః- ఉద్రేకపడకు నిర్మలా! సావధానంగా ఆలోచించు.

నిర్మ:- అంతా ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను.

మురః- మరి...శంకర్ గతి!

నిర్మ:- వాటన్నిటికీ సమాధానం చెప్పే స్థితిలో లేను మురళీ! ఏమంటావు మురళీ?

మురః- క్షమించు నిర్మలా, నే నందుకు సిద్ధంగా లేను.

నిర్మ:- మురళీ......

మురః- అవును నిర్మలా! మనం వెళ్తే లోకం ఏమనుకుంటుంది?

నిర్మ:- లోకంతో మనకేం పని మురళీ, నా మాట విను మురళీ?

ముర.- ఏంలేను నిర్మలా!

నిర్మ:- యింతేనా నీ ప్రేమ? నాకోసం ఏమైనా చేస్తానన్నావు గదూ.

ముర:- ప్రేమ పేరుతో పశుప్రాయుణ్ణి కాలేను.

నిర్మ:- ఆడదాన్ని నీ ఆనందానికి ఆటవస్తువుగా వినియోగించుకోగలవు. అంతేనా?

ముర:- ఎలా అన్నా ఫర్వాలేదు. అయినా ఆ విషయంలో నా తప్పేమీ లేదేమో.

నిర్మ:- నువ్వింత దగాకోరువని కల్లోగూడా అనుకోలేదు.

ముర:- నిర్మలా!

నిర్మ:- (ఆవేదనగా) నిన్నెంతగా ప్రేమించాను! హృదయమిచ్చి ప్రేమించి నందుకు బాగా బుద్ధిచెప్పావు.

ముర.- ప్రేమ (వికటంగా నవ్వాడు) ఆ మాట ఉచ్చరించే అర్హత కూడా నీకు లేదు నిర్మలా!

నిర్మ:- (కోపంగా) మురళీ!

ముర:- అబద్ధం కాదు నిర్మలా! ఒకప్పుడు శంకర్‌ను ప్రేమించానన్నావే! వలపు నటించి వల పన్నావు, నీ వ్యామోహంలో అతను తనవాళ్ళ నందర్నీ దూరం చేసుకున్నాడు. నీకోసం బ్రతుకు బ్రద్దలు చేసుకున్నాడు. ఈ రోజు తన స్థితి మారిపోయింది. నీవు వాంఛించే అందచందాలు యిప్పుడతనిలో కొరవయ్యాయి. అది కారణంగా అంధత్వంలో అసహాయుడై అల్లాడుతున్న అతణ్ణి నిర్దాక్షిణ్యంగా నెట్టి వేస్తున్నావు. యిప్పుడు నీ ఆనందానికి మరో బొమ్మ కావాలి. అందుకు నామీద వల పన్నుతున్నావు. రేపు నామీద మోజు తగ్గగానే...

నిర్మ:- మురళీ! (కోపంగా వణికిపోతూ వుంది.)

ముర:- నీ ఆనందంకోసం, అవసరాల కోసం ఎంతటి నీచానికైనా దిగజారతావు. నీకన్నా పడుపుకత్తె నయం. పడుపుకత్తె తన కిష్టమున్నా

లేకున్నా గత్యంతరం లేక ఆ వృత్తిని చేపడుతుంది. కాని నీవో ఇచ్ఛికంగానే బాహాటంగా వ్యభిచారాన్ని సాగిస్తున్నావు.

నిర్మ:- యూ (స్కౌండ్రల్. షటప్. (లాగి చెంపమీద కొట్టింది.)

ముర:- (క్షణకాలం స్తంభించిపోయాడు. తెప్పరిల్లి చెంప తడుముకుంటూ) ఫర్వాలేదు నిర్మలా, నీ బలహీనతను చాటుకొన్నావు.

నిర్మ:- యూ గెటవుట్!

ముర:- వెళతాను కాని ఒక్కమాట. ఈనాడు ఈ స్థితిలో వుండటానికి కారణమెవ్వరో ఒక్క సారి ఆలోచించుకో. శంకర్ లేకపోతే నీ జీవిత మెలా వుండేదో ఊహించుకో. అతని నిర్మలత్వాన్నీ, అతను నీకై చేసిన త్యాగాన్నీ ఒక్కసారి స్మరించుకో. నీలో మానవత్వ మేమూలనైనా మిగిలివుంటే, అతని ఋణాన్ని తీర్చుకొనేందుకు ప్రయత్నించు. మానవ సహజమైన బలహీనతకు లోనై నీతో సాంగత్యం చేసినందుకు బాధపడుతున్నాను. వస్తా. గుడ్‌బై! (వెళుతున్నాడు.)

నిర్మ:- (ఇంతవరకూ గంభీరంగా ఆలోచిస్తూ నిలబడింది.) మురళీ!

ముర:- (ఆగాడు.)

నిర్మ:- ఎంత విచిత్రమైన మనిషివి మురళీ! ఈ ధర్మోపన్యాసాలన్నీ యింత కాలం ఎక్కడ దాచావు?

ముర:- (ఆమె వంక చూచాడు. తిరిగి వెళ్ళటానికి ఉపక్రమించాడు)

నిర్మ:- వెళ్ళబోయేముందు నిన్ను ఒక్కటిమాత్రం కోరుతున్నాను మురళీ! మనం చేసిన ఈ పాపంలో ఈ మహాపాపంలో బాధ్యత ఇద్దరికీ సమంగా వున్నదన్న సత్యాన్ని నా యెదుట ఒప్పుకోకపోయినా నీ అంతరాత్మ ఎదుటనైనా ఒప్పుకో. అంతకన్నా నిన్నేమీ కోరను. ఆవేశంలో నీమీద చెయ్యి చేసుకున్నాను. అందుకు నన్ను క్షమించు. గతాన్ని మరచిపో. వెళ్ళు...వెళ్ళు మురళీ! (రుద్ధకంఠంతో? ...రువెక్కిన హృదయంతో) మాట్లాడింది. మురళి తలవంచుకు వెళ్ళిపోయాడు. దూరా

న్నుండి సముద్రపుహోరులా భయంకరమైన ఆలాపన విన్పిస్తుంది. నిర్మల భరించలేక రివ్వున వెళ్లి కుర్చీలో కూలబడి ముఖం చేతులతో కప్పుకుంది. ఆలాపన క్రమేణా సన్నగిల్లింది. చంద్రయ్య వచ్చి నిర్మలకు కొంచెం ఎడంగా నిలబడ్డాడు. ఆమె వంక జాలిగా చూశాడు. నిర్మల అది గమనించలేదు. చంద్రయ్య లోనికెళ్ళాడు. ఆలాపన పూర్తిగా ఆగిపోయింది. నిర్మల లేచి నిలబడింది. శంకర్ ఫోటో దగ్గరగా వెళ్ళి నమస్కరిస్తూ) క్షమించటానికి వీల్లేని అపరాధం చేసి కూడా మీ ఔన్నత్యాన్ని తెలిసిన దాన్ని కావడంవల్ల మిమ్మల్ని క్షమాభిక్ష వేడటానికి సాహసిస్తున్నాను. నన్ను క్షమించండి (క్షణకాలం అలానే నిలబడిపోయింది. వికృతమైన నవ్వు విన్పించింది. నిర్మల త్రుళ్ళిపడి రెండడుగులు వెనక్కు వేసింది.)

ధ్వని.- "నిర్మలా, నీవు మహాపాపివి. నీవు క్షమాభిక్ష కర్హురాలవు గాదు. నీవు వ్యభిచారిణివి. కులటవు. నీకిక్కడ స్థానం లేదు. ఇది దేవతలు నివసించే పవిత్రమైన ఆలయం. పాపుల కిక్కడ స్థానం లేదు. వెళ్లిపో, వెళ్ళిపో. (భయంకరమైన నవ్వు. నిర్మల భయంతో లోనికిపరుగెత్తింది. కొన్ని క్షణాల తర్వాత చిన్న సూట్‌కేసుతో లోపలనుండి వచ్చి నిదానంగా బయటకు వెళ్ళిపోతోంది. వీధి వాకిలి దగ్గరకు వెళ్ళేసరికి వెనకనుండి 'అమ్మా' అంటూ చంద్రయ్య వచ్చాడు.)

చం:- అమ్మా (నిర్మల ఆగింది) ఎక్కడికమ్మా!

నిర్మ:- నేను మహా పాపాత్మురాల్ని. నా కిక్కడ స్థానం లేదు చంద్రయ్యా!

చం:- అలా అనకమ్మా. తప్పుగదూ (దగ్గరగా వచ్చాడు.)

నిర్మ:- భగవంతునిలాంటి వారికి తీరని అపచారం చేశాను నా పాపానికి నిష్కృతిలేదు చంద్రయ్యా! (ఘోరుమంది.)

చం:- నా కంతా తెలుసు తల్లీ. జరిగిందానికి విచారించి ప్రయోజనం లేదు. నా మాట విని లోని కెళ్ళండి.

నిర్మ:- వద్దు. పవిత్రమయిన ఆలయాన్ని కలుషితం చేస్తూ ఇక్కడ వుండలేను. నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోక తప్పదు.

చం:- దానికిది మార్గం కాదమ్మా. యిది పిరికితనానికి చిహ్నం.

నిర్మ:- చంద్రయ్యా!

చం:- అవునమ్మా. తప్పులు అందరమూ చేస్తూంటాం. చేసిన తప్పును గుర్తించినప్పుడు దాన్ని దిద్దుకోటానికి ప్రయత్నించాలి. కాని యిలా జీవితంలోనుండి పారిపోవటం అవివేక మనిపించుకొంటుంది.

నిర్మ:- యింతకన్నా నాకు మార్గంలేదు చంద్రయ్యా!

చం:- ఉందమ్మా! నీలో పశ్చాత్తాపం బయలుదేరి అది నిన్ను దగ్ధం చేస్తుంటే దానికి పరిహారం తప్పకుండా వుంటుంది, (శంకర్ ఫోటో దగ్గరగా వెళ్ళి ఫోటో చేతిలోనికి తీసుకున్నాడు.) యీ పవిత్ర మూర్తి పాదసేవలోనే నీ పాపాలు పటాపంచలవుతయ్. నీ జన్మకు నిష్కృతి యిక్కడే తల్లీ!

నిర్మ:- (గాద్గదికంగా) మీరంతా దేవతలు చంద్రయ్యా.

చం:- అంతా మనస్సులోవుంది తల్లీ! మనస్సే మనకు మానవత్వాన్నీ దానవత్వాన్నీ ఆపాదిస్తుంది. దాన్ని సవ్యంగా నడిపించుకోగలిగిన నాడు మానవుడు అమరుడౌతాడు. (కొంచెమాగి) జీవితంలో ఇలాంటి క్రీనీడలు తొంగి చూస్తూనే వుంటాయ్. వాటిని తప్పుకొని వెలుగులోనికి రావటానికి ప్రయత్నించాలి. అప్పుడే జీవితం సార్థకమౌతుంది. గతాన్ని మరచిపోయి రేపటి జీవితాన్ని సార్థకం చేసుకోటానికి ప్రయత్నించు. రండమ్మా, లోనికెళదాం.

[ఇద్దరూ రెండడుగులు లోనికి నడిచారు. లోపలినుంచి 'ధన్' మని పిస్టల్ పేలింది. నిర్మల కెవ్వుమంది. చంద్రయ్య రెండడుగులు ముందుకు వేశాడు. అదర్దాగా, శంకర్ తూలుతూవచ్చి గుమ్మం దగ్గర పడిపోయాడు. రొమ్మునుండి రక్తం స్రవిస్తోంది.)

నిర్మ:- శంకర్!

చం.- బాబూ!

[ఇద్దరూ శంకర్ దగ్గరగా వెళ్ళారు ]

చం:- ఎంత ఘోరానికి తలపడ్డారు బాబూ!

[శంకర్ ప్రక్కనే కూలబడి ఏడుస్తున్నాడు.]

నిర్మ:- నా పాపానికి ప్రాయశ్చిత్తమిదా శంకర్! (ఏడుస్తోంది.)

శంక:- (ఒక చేత్తో గాయాన్నదిమిపట్టి, రెండవ చేత్తో నిర్మలను స్పృశిస్తూ) నిర్మ...లా! నేను...నీ సుఖంకోరే...వెళుతున్నాను...చంద్రయ్యా!

చం:- బాబూ!

శం:- (అతని చెయ్యి పట్టుకుని) నిర్మల...జాగ్రత్త. శెలవు...చంద్రయ్యా! అబ్బా! ని...ర్మ...లా!
(బాధగా మూలిగి ప్రాణం విడిచాడు.)

చం:- బాబూ! ఎంత అన్యాయం చేశారు బాబూ! (ఏడుస్తున్నాడు.)

నిర్మ:- (గంభీరంగా కూర్చునివుంది.) నువ్వే అదృష్టవంతుడివి చంద్రయ్యా నీకు ఏడవటానికి కన్నీళ్ళయినా మిగిలినాయ్! నాకు...నాకేమీ మిగల్లేదు. నేను సర్వం పోగొట్టుకున్నాను (శంకర్ మొహంలోనికి చూస్తూ) ఎంత కఠినమయిన శిక్ష విధించావు శంకర్! ఈ శిక్ష నేను భరించగలనా?

(శూన్యంలోకి చూస్తూ) నా బ్రతుకులో శాశ్వతంగా చీకటి తెరలు దిగజార్చావా భగవాన్!

[తెర జారుతోంది. దూరాన్నుండి:]

''అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.''

— తెర పూర్తిగా జారింది —



## పాత్రలు

విశ్వం
శేఖరం
శేషు
రంగయ్య
విశాల (సరోజ)
చిట్టి

(అది ఒక కలిగినవాళ్ళ ఇంటి మేడమీద హాలు. హాలుకు ఎడమ వైపున వెలుపలకు వెళ్ళే ద్వారం. కుడివైపున లోనికివెళ్ళే ద్వారం. మధ్యన మరో గదిలోకి వెళ్ళేందుకు మరొక ద్వారం. ఈ ద్వారాల మధ్యనున్నది రంగస్థలం హాలులో మూడు సోఫాలు. సోఫాల ముందర మూడు టీపాయ్‌లు. కుడివైపు మూలన ఒక టేబిలు, టేబిలుమీద ఒక రేడియో, ఎడమవైపు మూలన ఒక టేబిలు. టేబిలుమీద పూలకుండీ, టేబిలుముందు కుర్చీ వుంటాయి. గోడల నిండా అందమైన ఫొటోలు. చూడడానికి గదంతా అందంగా ఉంటుంది. తెర లేచేసరికి రేడియోలో పాట వినిపిస్తూ వుంటుంది. విశ్వం త్రాగి సొమ్మసిల్లి మధ్యనున్న సోఫాలో కూర్చుని టీపాయ్ మీదకు జారగిలబడి మగతగా వుంటాడు. ప్రక్కన బ్రాందీ సీసా గ్లాసు వుంటాయి. చీకటిగావున్న గదిలో చేతిలో వెలుగుతున్న సిగరెట్టు తప్ప మరేమీ వుండదు. (ఇక్కడ స్పాట్ వినియోగిస్తే బావుంటుంది) పాట జరిగేకొందికి విశ్వం పాటకు అనుభూతి పొందు తుంటాడు. పాట ముగిసేటప్పటికి విశ్వానికి చికాకు కలుగుతుంది. లేచివెళ్ళి విసురుగా రేడియో ఆపుచేస్తాడు)

పాట

దుర్భరం మహాభరం
బ్రతుకంతా వేతనపెయం ॥
చితికిన ఆశలు నిండిన వెతల కథల జీవితాలు
పగిలిన మీ జీవితాలు ఆపినీటికి పునాదులు ॥దు॥

అనుబంధం, అనుతాపం, అనురాగం ఆజ్యంగా
ఎదలో వ్యధలై రగిలే ఆ నుసురాలాలే
కనుగొలకులలో ఆశలు బాష్పకణాలై
సెగలై మదిలోనిలచి రగులును జ్వలితజ్వాలై
రగులును జ్వలితజాలై, రగులును జ్వలితజ్వాలై ॥దు॥

విశ్వం:- (విసురుగా లేచివెళ్ళి రేడియో ఆపి) ట్రాష్! ఎక్కడ చూచినా బాధ, ప్రపంచమంతా బాధలతో విలవిలలాడుతున్నట్టు కవిత్వం, సంగీతం,

అన్నిటిలో బాధ. చూస్తే బాధలేని బ్రతుకే లేదనిపిస్తుంది. (మళ్ళీ సోఫా దగ్గరకువచ్చి బ్రాంది సీసా చూచి) ఏదైతే నాకెందుకు! అయినా నాకీ తర్కం అనవసరం. మధువును మించిన సంపర్కం మరొకటి వద్దు. అంతకుమించిన ధ్యేయం అంతకంటే అక్కరలేదు. (ఇంతలో లోపలనించి చిట్టి 'బాబాయ్! బాబాయ్' అని కేక వేస్తుంది. విశ్వం పలుకడు. చిట్టి లోపలనుండి వచ్చి గదిలో లైటు వేస్తుంది)

చిట్టి:- (విశ్వాన్ని చూచి) అమ్మ దొంగా, ఇక్కడుండేనా పలక్కుండా కూర్చున్నావ్ (విశ్వం పలకడు) బాబాయ్! (చెవి దగ్గరకు వచ్చి) బాబాయ్ !

విశ్వం:- (తేరుకొని) చిట్టీ! ఎంతసేపయిందమ్మా వచ్చి ?

చిట్టి:- ఇప్పుడే! ఏమిటి బాబాయ్, అలావున్నావ్? ఒంట్లో బాగోలేదా!

విశ్వం:- లేదమ్మా.

చిట్టి:- మరి బాగులేదంటూనే విషం త్రాగుతావేం?

విశ్వం:- విషమా ?

చిట్టి:- అవును, అది విషమని నిన్న నీవేగా చెప్పావ్. అప్పుడే మరచి పోయావా ?

విశ్వం:- అవునవును! మరచిపోయాను.

చిట్టి:- బాబాయ్, విషం త్రాగితే మనుషులు చచ్చిపోరూ?

విశ్వం:- ఎందుకుపోరూ ?

చిట్టి:- మరి నువ్వెందుకు తాగుతున్నావ్?

విశ్వం:- బ్రతకలేక.

చిట్టి:- అయితే నిన్ను త్రాగనివ్వను. (చిట్టి టేబులుమీది బ్రాందీసీసా లాక్కొని దూరంగా వెళుతుంది)

విశ్వం:- చూడమ్మా! ఈ విషం త్రాగితే మనుష్యులంత తొందరగా చచ్చిపోరమ్మా! క్రమేపీ చస్తారు. రేపు నీకు బోలెడు చాక్లెట్లు కొనిపెడతాగా! ఆ సీసా ఇలా ఇవ్వమ్మా!

చిట్టి - నే నివ్వను.

విశ్వ :- మా అమ్మవు కదూ! రేపు నీకు బొమ్మలు కొనిపెడతాగా! ఇలా ఇవ్వమ్మా.

చిట్టి:- నాకేమీ అక్కర్లేదు, నేనేమీ ఇవ్వను

విశ్వం:- సరే అలాగే! రేపటినుంచి మానేస్తాగా, ఇవ్వాళిటికి త్రాగనీయమ్మా.

చిట్టి:- నిజంగా రేపటినుంచి మానేస్తావా?

విశ్వం:- ఓ! తప్పకుండా.

చిట్టి:- ఒట్టు.

విశ్వం:- ఒట్టు.

చిట్టి:- ఊహూ, అలాకాదు; చేతిలో చెయ్యివేసి చెప్పాలి.

విశ్వం:- సరే అలాగే! ఒట్టు (చేతిలో చెయ్యి వేస్తాడు) మరి ఇలా ఇవ్వు సీసా (పాప కాసేపు ఆడించి సీసా ఇస్తుంది. విశ్వం త్రాగుతుంటాడు)

చిట్టి:- బాబాయ్! మొన్న కొన్న చెప్పులు ఏమీ బాగా లేవు. రేపు నాకు బూట్లు కొనిపెడతావా?

విశ్వం:- అలాగే.

చిట్టి:- మరేం బాబాయ్. పక్కింటివాళ్ళ సరోజ...

విశ్వం:- చిట్టీ! (కోపంగా అంటాడు)

చిట్టి:- ఏమిటి బాబాయి? అలా అన్నావ్?

విశ్వం:- ఏమీలేదు చెప్పమ్మా.

చిట్టి:- అదే! వాళ్ళ సరోజ కొనుక్కోలేదూ? అలాంటి బూట్లు కావాలినాకు. మరేం బాబాయ్, అవి రంగు రంగులుగా ఎంత బాగున్నాయనుకున్నావ్!

విశ్వం:- అలాగా!

చిట్టి:- మరి నాకు కొనిపెడతావా?

విశ్వం:- కొనిపెడతానన్నాగా! (మళ్ళీ త్రాగబోయి సీసా చూచి అందులో సగమే వుండటం గమనించి) రంగయ్యా! రంగయ్యా!

చిట్టి:- ఇప్పుడు వాడెందుకు బాబాయ్!

విశ్వం:- పనుందమ్మా.

చిట్టి:- నా బూట్లు కొనుక్కురావడానికా ?

విశ్వం:- ఈవేళప్పుడు బూట్లెక్కడ దొరుకుతాయమ్మా. రేపు కొనిపెడతాగా! నీవు లోపలికెళ్ళి చదువుకో!

చిట్టి:- నేను పోను, నేనిక్కడే కూర్చుంటా ! నేను నిన్నటి ఇంగ్లీషు పద్యం ఒప్పజెప్పాగా! కావాలంటే ఇప్పుడే చెబుతాను. కాక్స్ క్రో ఇన్ ది మార్నింగ్ టు టెల్ అజ్ టు రైజ్.

రంగ:- (లోపలకువచ్చి) పిలిచారాబాబూ!

విశ్వం:- ఆఁ! షాపుకువెళ్ళి రెండు బాటిల్స్ పట్టుకురా.

రంగ:- అలాగే. బాబూ. ఏరకం తెమ్మన్నారు బాబూ!

విశ్వం:- (విసుగ్గా) ఇదిగో ఇలాంటివి చూశావా? ఇలాంటివే రెండు సీసాలు తీసుకురా!

రంగ:- చిత్తం. (వెళ్ళబోయాడు)

విశ్వం:- రంగయ్యా!

రంగ:- బాబూ.

విశ్వం:- టైమెంతైంది?

రంగ:- ఆరున్నరదాటుతోంది బాబూ! (వెలుపలకు వెళ్ళిపోతాడు)

చిట్టి:- బాబాయ్, రేపటినుంచి మానేస్తానన్నావుగా! మళ్ళీ అదెందుకు?

విశ్వం:- నీకు తెలియదమ్మా. తర్వాత చెబుతాగా!

చిట్టి:- అబద్ధం! అన్నీ అబద్ధాలే. నువ్వు మానెయ్యవు. నాతో అబద్ధాలాడుతున్నావ్.

విశ్వం:- లేదమ్మా, నే మానేస్తాగా, నువ్వు వెళ్లు

చిట్టి:- అయితే ఇప్పటినుంచే మానెయ్యాలి (సీసా తీసుకుంటుంది)

విశ్వం:- అలాగే మానేస్తాగా. ఆ సీసా ఇలా ఇవ్వు.

చిట్టి:- నేనేమీ ఇవ్వను.

విశ్వం:- ఇవ్వవూ!

చిట్టి:- ఇవ్వను ఇవ్వను ఇవ్వను.

విశ్వం:- నాకు కోపమొస్తే కొడతాను

చిట్టి:- అయితే నే నీ విషంత్రాగి చచ్చిపోతాను (చేతిలోని బ్రాందీసీసాను నోటిదగ్గర పెట్టుకుంటుంది)

విశ్వం:- చిట్టీ !

చిట్టి:- బాబాయ్, కొట్టబాకు బాబాయ్. ఇచ్చేస్తాను బాబాయ్. (విశ్వం సీసా లాక్కొని అవతల పెట్టేస్తాడు)

విశ్వం:- భయపడ్డావా అమ్మా?

చిట్టి:- (మరింత భయపడుతుంది) బాబాయ్, మరెప్పుడూ తీసుకోను. అసలు నేనిక ముట్టుకోను, కొట్టకు బాబాయ్—

విశ్వం:- చిట్టీ! (దగ్గుతెర వస్తుంది. గుండెపోటుతో సొమ్మసిల్లి సోఫాలో సొక్కిపోతాడు. కొద్దిక్షణాలు నిశ్శబ్దం తరువాత)

చిట్టి:- బాబాయ్! (విశ్వాన్ని తాకి చూస్తుంది. విశ్వంలో చలనముండదు) నాన్నా! నాన్నా!

(ఇంతలో శేఖరం వెలుపలనుంచి వస్తాడు)

శేఖ:- ఏమిటమ్మా? ఎందుకు? ఎందుకేడుస్తున్నావు!

చిట్టి:- (ఏడుస్తూ) నాన్నా, బాబాయ్ విషం త్రాగి చచ్చిపోయాడు నాన్నా!

శేఖ:- (ఖంగారుగా) విశ్వం! విశ్వం!

విశ్వం:- ఊఁ!

శేఖ:- లేదమ్మా, బాబాయ్ నిద్రపోతున్నాడు. పిచ్చితల్లీ, బాబాయ్ విష మెందుకు త్రాగుతాడు?

చిట్టి:- మరి బాబాయి రోజూ త్రాగేది విషమేనని బాబాయే చెప్పాడుగా!

శేఖ:- బాబాయికేమీ భయంలేదుగాని నీ వెళ్ళి చదువుకో. (చిట్టి పోదు. నవ్వుతూ శేఖరం వాకిలిదాకావచ్చి చిట్టిని కుడివైపు గదిలోపలకు పంపిస్తాడు)

శేఖ:- (తిరిగివచ్చి) విశ్వం! విశ్వం!

విశ్వం:- (తేరిచూచి) నువ్వా శేఖరం! ఏమిటి?

శేఖ:- ఏమిటలా వున్నావు? మళ్ళీ గుండెపోటు వచ్చిందా?

విశ్వం:- ఊఁ!

శేఖ:- డాక్టర్ని పిలుస్తానుండు.

విశ్వం:- ఊఁ! డాక్టర్లేం చెయ్యగలర్రా. వాళ్ళు వ్యాధికి వైద్యం చేయగల వాళ్ళేగాని వేదన చల్లార్చలేరుగా? ఇది నా అంతు చూచిగాని పోదు. అది నాకు తెలుసు.

శేఖ:- అన్నీ తెలిసికూడా ఇదేమిటి చెప్పు?

విశ్వం:- ఏమిటది?

శేఖ:- ఈ త్రాగుడు. నానాటికీ పెరిగిపోతున్న రోగాన్నిసైతం లెక్క చేయకుండా రాత్రింబవళ్లు ఈ త్రాగుడెందుకు విశ్వం? నా మాట విను. ఇకనైనా ఈ త్రాగుడు మాను.

విశ్వం:- శేఖరం! అది నా వల్లగాని పని. నువ్వు చేసిన సహాయానికి నా సర్వస్వం, కడకు నా ప్రాణాన్నయినా బలిపెడతాను. కానీ త్రాగుడు మానమనిమాత్రం నన్నెప్పుడూ బలవంత పెట్టకు. నిత్యంజ్వలితజ్వాలలా హృదయంలో రేగే తీరనిబాధ నేను భరించలేను. ఆవేదన సహించలేను. నాకయినవాళ్ళను నా కళ్ళముందే నిత్యం చూస్తూ ఏ సంబంధం, అనుబంధం లేనట్టుగా, దూరదూరంగా బ్రతకడం ఎంత

కష్టమో నీకు తెలియదు శేఖరం! అంతకంటే హింస ప్రపంచంలో లేదు. గత్యంతరంలేక అనుభవిస్తున్న చిత్రహింస ఇది విదిలించుకు బయట పడదామన్నా వీలుపడని వల ఈ వేదన. దీనికంతులేదు, అవధిలేదు, ఇది ఈ జన్మకు తీరదు. సుడిగాలిలో ఎండుటాకులా గిలగిలలాడి ఎప్పుడో ఎక్కడో రాలిపోతేనే గాని ఈ వ్యథ తీరదు. నాకీ బాధనుండి విముక్తిలేదు. (కళ్ళు చెమరుస్తాయి.)

శేఖ:- విశ్వం ఏమిటిది, పసివాడిలా?

విశ్వం:- (రిలేక్స్ అయి) ఏమీలేదు. ఏవో జ్ఞాపకాలు.

శేఖ:- పోనీ విశ్వం! రోజూ ఇలా వేదనతో వేగిపోకపోతే నిజం చెప్పెయ్యరాదూ?

విశ్వం:- శేఖరం! మరెప్పుడూ ఆ మాట నీ నోట అనకు. అది నేను కలలో కూడా అంగీకరించను. నిర్మలమైన సెలయేరులా ప్రవహించే జీవితంలో కలుషితాన్ని కాలేను. అపరంజిలాంటి ఈ పవిత్ర జీవితంలో పాపపుఛాయలు పడనీను. నా కడపటి శ్వాసవరకు నే కాంక్షించేదదేరా? (బాధతో ఉద్రేకపడతాడు)

శేఖ:- ఏమిటో అర్థంలేకుండా మాట్లాడుతావు.

విశ్వ:- (పూర్తిగా రిలేక్స్ అయి) ఈ తాగుబోతు మాటలకు అర్థమేముంటుందిలేరా (మాటలు మార్చే ధోరణిలో) నా ధోరణిలో మరిచే పోయాను. నీ విషయమేమైంది?

శేఖ:- నా విషయమా?

విశ్వం:- అదే ఇవ్వాళేదో మంత్రివర్గ నియామకం జరుగుతుందన్నావు.

శేఖ:- ఆఁ! అవునవును, అది చెబుదామనే వచ్చాను. కాని నేను వచ్చేటప్పటికి...

విశ్వం:- నేను త్రాగి తూలుతున్నాను. నేను త్రాగినా మైకం తలకెక్కదు. అదే నేను ఈ పదేళ్ళుగా త్రాగుడులో సంపాదించిన అనుభవం. నరాలు తూలిపోతున్నా మనస్సులో స్వరం వినిపిస్తూనే వుంటుంది. చెప్పు ఏమయింది?

శేఖ:- నన్ను మన మంత్రివర్గములో ఒకర్నిగా ఎన్నుకున్నట్టు ప్రకటించారు.

విశ్వం:- సంతోషం. ఆ దేవుడనేవాడుంటే, మనః పూర్వకంగా నీకు ఉజ్వల మైన భవిష్యత్తును ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను. కంగ్రాచ్యులేషన్స్.

శేఖ:- థాంక్స్ విశ్వం. ఇదంతా నీలాంటివాళ్ళ ఆశీర్వాదఫలమే. ఈ రోజు ప్రజలు నాకు చేసిన గౌరవం, చూపిన ఆదరణ చూస్తుంటే జన్మ తరించిందనిపించింది. ఆ ఆనందం అలాగే నిలచిపోతే అంతకంటే మరేమీ అక్కర లేదనిపించింది.

విశ్వం:- శేఖరం! ఈ ప్రజలనెప్పుడూ నమ్మకు. వాస్తవంలో ఈ ప్రజలు గొర్రెలమందలాంటివాళ్లు ఒకటి కంచె దూకితే అన్నీ దాన్ని అనుసర స్తాయి. వాటికీ వీళ్ళకూ అట్టే తేడాలేదు శేఖరం! ఈ ప్రజలున్నారు చూశావ్? మహారాజ మన స్తత్వం వీళ్ళది.

శేఖ:- అంటే?

విశ్వం:- అదే చెబుతున్నాను. వాళ్ళ వృన్నతికోసం జీవిత సర్వస్వాన్ని ధార పోసినా, ఒక చిన్న తప్పిదం పొరపాటున జరిగినా వాళ్లు మనిషిని మన్నించలేరు. కనీసం తోటి మానవుడన్న సానుభూతితో కూడా చూడరు. భూషించిన నోటితోనే దూషిస్తారు. అందలమెక్కించిన వాళ్ళే అధః పాతాళానికి తోసేస్తారు. నా సంగతే చూడు. వెనక నేనూ ఒక గొప్ప రచయితను. అన్నిటికన్నా మిన్నగా సాహిత్యసేవే ధ్యేయంగా పెట్టుకున్నాను. అందుకోసం బ్రతుకునే బలి పెట్టుకున్నాను. అందుకు ఫలితంగా నాకు లభించినదేమిటో నీకు తెలుసుగా? త్రాగు బోతునన్న ఒక మచ్చ. ఈ మచ్చతో నాలోని మేధస్సు, శక్తి ఎందుకూ కొరగాకుండా పోయాయి. చివరకు ప్రపంచంలో విశ్వం త్రాగుబోతుగానే మిగలగలిగాడు.

శేఖ:- నా ఉద్దేశ్యం అదికాదు.

విశ్వం:- మరి?

శేఖ:- ఈ రాజకీయరంగంలో ఉన్నతమైన స్థాయి నందుకోవాలనుకున్నాను. ఆ కారణంగానే పాపాయిల్లా పెంచిన రూపాయలను పానకంలా

పంచిపెట్టాను. ఆ తెగువే నాకీ రాజకీయాలలో ఉన్నత పథాన్నం దించింది. ఇప్పుడు నా శ్రమకు ఫలితం లభించింది. నేను వెచ్చించిన దానికి పదింతలు హెచ్చుగా నా ముందు వాలింది.

విశ్వం:- ఏమిటది? సూటిగా చెప్పు.

శేఖ:- నేనేం వ్యంగ్యంగా మాట్లాడటం లేదే! ఈ స్థాయికి చేరాలని నేనెంతో ఖర్చు పెట్టాను. ఉన్న డబ్బును పేలాల్లా కాకుల్లాంటి యీ మూకలకు వెదజల్లాను. ఇప్పుడు నాకు అంతస్థు, హోదా వొనగూడాయి. నేను నా పరిధిలో యేమయినా చేయగలను. డబ్బును నా యింట్లో దిబ్బలు పొయ్యగలను.

విశ్వం:- శేఖరం! ఏమిటి నువ్వనేది?

శేఖ:- నేను వెలపోసింది మళ్ళీ నిలదీసుకోగలనంటున్నాను.

విశ్వం:- ఎంత స్వార్థం? ఇంత సంకుచితంగా ఆలోచించగలవని నే నెన్నడూ వూహించలేదు.

శేఖ:- విశ్వం!

విశ్వం:- చూడు శేఖరం! ఎవరు ఏ రంగంలో శ్రమ చేసినా, మరే విధమైన కృషిచేసినా స్వార్థప్రయోజనాలకు కాకూడదు. స్వార్థచింతనతో మంచిచేసినా మంచనిపించుకోదు. అది చెడే అవుతుంది. నమ్మి నీ కండగా నిలబడ్డవాళ్ళను వంచించడం ఆత్మవంచనే అవుతుంది. ఒకరి మంచికోసం పదిమందిమీద మట్టి చల్లడం మంచిదికాదు శేఖరం! అందులో ఒక రాష్ట్రాన్ని ఏలవలసినవాడివి, నీ కిలాంటి ఆలోచనలు కలగడం సిగ్గుచేటు.

శేఖ:- మరి నే ఖర్చుపెట్టిన సొమ్ము సంగతి?

విశ్వం:- నే నిస్తాను.

శేఖ:- నువ్వా?

విశ్వం:- ఏం, యివ్వగూడదా? మనిద్దరం అన్నాతమ్ములం కాకపోయినా అంతకుమించిన బాంధవ్యం మనకుంది. స్నేహితులుగా ఒకరి

బాగోగులు మరొకరు విచారించవల్సిన బాధ్యతవుంది. నీవు పెడ మార్గాలుపట్టిపోవడం నేనెప్పుడూ సహించలేను. ఎంత ఖర్చుచేసినా తరగని డబ్బు నాకున్నది. ఈ డబ్బంతా యేం చేసుకోను? ఒక స్నేహితుడిని మంచి మార్గానికి మరల్చడానికంటే మించిన ప్రయోజనం ఆ డబ్బుకు కలుగుతుందని నేననుకోను. పైగా నువ్వు చేసిన సహాయానికి నే నెంతో ఋణపడి వున్నాను. ఈ రూపేణానన్నా ఆ ఋణం తీర్చుకోనీ! నా మాట కాదనకు. పవిత్రంగా గడపాల్సిన జీవితాన్ని వ్యర్థంచేసుకోకు

శేఖ:- (నిర్ఘాంతపోయి చూస్తుంటాడు.)

విశ్వం:- ఏమిటలా చూస్తావు? ఈ త్రాగుబోతు మాటలు నమ్మవచ్చునా అని ఆలోచిస్తున్నావా?

శేఖ:- విశ్వం... (ఉద్రేకంలో మాటలాడలేకపోతాడు)

విశ్వం:- ఏమిట్రా అది?

శేఖ:- నీవు మనిషివికావు, దేవుడివిరా? స్పర్శతోనే పాపాన్ని రూపు మాపగల పవిత్రమూర్తివి.

విశ్వం:- మరీ నీ పొగడ్తలతో ఆకాశానికెత్తెయ్యకు. కాలుజారితే అగాధంలోకి జారిపోతాను.

శేఖ:- పొగడ్తకాదు విశ్వం, వాస్తవం.

విశ్వ:- అంతగొప్పతనం నా దగ్గరేమీలేదు. ఉన్నదల్లా ఒక్కటే. త్రాగుబోతును. (టీపాయ్‌మీద సీసా తీసుకుంటాడు. దగ్గు తెరవస్తుంది. ఊగుతూ లోపలకుపోబోగా శేఖరం ఆసరాగా ప్రక్కన నిలుచుని నడిపించుకొని మధ్య గదిలోపలకు తీసుకువెళతాడు. వెలుపలనుండి విశాల వస్తుంది. హాలంతా ఒకసారి కలయజూస్తుంది. డైరీచూస్తూ కూర్చోబోగా మధ్యగదిలోనుండి శేఖరం వస్తాడు)

విశాల:- (శేఖరాన్ని అదాటున చూచి) నమస్కారమండీ!

శేఖ:- నమస్తే.

విశాల:- నా పేరు విశాల. 'ధ్వని' పత్రికా విలేఖరిని.

శేఖ:- ఓహో! రండి, కూర్చోండి. ఏం పనిమీద వచ్చారు?

విశాల:- మీతో యింటర్వ్యూ చేద్దామని.

శేఖ:- అలాగా. రంగయ్యా, రంగయ్యా! వీడు సమయాని కుండడు. వుండండి. కాఫీతెస్తాను.

విశాల:- మీ కనవసర శ్రమ కలిగిస్తున్నా ననుకుంటున్నాను.

శేఖ:- ఇందులో శ్రమే మున్నదండి. పాపా, పాపా!

చిట్టి:- (లోపలినుంచే) ఏమిటి నాన్నా?

శేఖ:- అక్కడి ఫ్లాస్కూ, గ్లాసులు యిలా పట్రామ్మా!

విశాల:- ఈ విధంగా మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించాలి.

శేఖ:- భలేవారే! ఈ మాత్రానికే ఇంత ''ఇన్‌కన్వీనియెన్స్'' ఫీల్ అయితే యిక పత్రికా విలేఖరిగా ఎలా నెగ్గుకొస్తున్నారండి. (పాప ఫ్లాస్కుతో వస్తుంది. పాప కాఫీ పోయబోతుండగా)

విశాల:- నేను పోస్తా నిలా యివ్వమ్మా!

శేఖ:- ఎందుకండి, పాప పోస్తుందిలెండి.

విశా:- ఫర్వాలేదు (పాపచేతిలో ఫ్లాస్కు అందుకుని రెండు గ్లాసులలో పోసి ఒకటి శేఖరానికిచ్చి, మరొకటి పాప కివ్వబోతూ) త్రాగమ్మా!

చిట్టి:- నేను భోజనం చేశాగా, భోంచేసిం తరువాత కాఫీ త్రాగడం మంచిది కాదని మా బాబాయి చెప్పాడుగా.

విశాల:- అలాగా. మంచి తెలివైనపిల్ల. ఏమండీ ఈ పాప...

శేఖ:- మా పాపేనండి.

విశాల:- (పాపను దగ్గరకుతీసుకొని) ఏం చదువుతున్నావమ్మా?

చిట్టి:- సెకండ్ ఫారం.

విశాల:- ఊఁహుఁ!

(విశాల, శేఖరం కాపీ త్రాగుతూ ఒకరి నొకరు చూచు కుంటూ వుంటారు పాప వారి మధ్యన నిలబడి యిద్దర్నీ పరికించి చూచి

పక్కన నవ్వుతుంది, శేఖర్ విశాలలు కూడా శ్రుతికలుపుతారు. ఇద్దరూ కాఫీ త్రాగడం ముగిస్తారు.)

శేఖ:- ఇవి తీసుకెళ్ళి నువ్వు పడుకో పోమ్మా.

చిట్టి:- మరి నువ్వో?

శేఖ:- నే తరువాత వస్తాగా!

చిట్టి:- తర్వగా వచ్చెయ్యాలి మరి (పోతూ పోతూ విశాలను వెక్కిరిస్తుంది. విశాల పాపను పట్టుకోబోతుంది. కానీ పాప జారిపోతుంది. విశాల పాప వెళ్ళినవైపే ఆప్యాయంగా చూస్తూవుంటుంది)

శేఖ:- ఇహ మీరు మొదలుపెట్టవచ్చు.

విశాల:- (తెప్పరిల్లుకొని) ముందు మీరు నా ప్రశ్నలు కొన్నిటికి సమాధానం చెప్పాలి.

శేఖ:- అందుకు అభ్యంతర మేముంటుంది?

విశాల:- [గొంతు సవరించుకొని] మీ పూర్తి పేరు శేఖరమేనాండి?

శేఖ:- కాదండి, చంద్రశేఖరం మిత్రులు అభిమానంతో శేఖరం అని పిలుస్తారు

విశాల:- మీరే కులానికి చెందినవారో చెబుతారా?

శేఖ:- ఈ యుగంలో కులాలేమిటండి. ఈ భేదాన్ని రూపుమాపుదామనే ప్రజలూ, ప్రభుత్వం కూడా తీవ్రమైన కృషి సల్పుతున్నారు. అలాంటప్పుడు...

విశాల:- అయినా ఉద్యోగ దరఖాస్తులలో ఇంకా కులాన్ని ప్రస్తావిస్తూనే వున్నారుకదా?

శేఖ:- అవుననుకోండి...అది వుద్దేశించి చేస్తున్నది కాదు. పూర్వపు మూఢాచారాల్లాగే అదీ ఓ అలవాటయి పోయింది. అంతకంటే మరో ప్రత్యేకత ఏదీ వున్నదనుకోను.

విశాల:- అంటే మీకు కులప్రసక్తి లేదంటారు?

శేఖ:- ఆనటమే కాదు, ఆచరణలోకూడా చూపిస్తాన. నేను పుట్టి బుద్ధి యెరిగిన నాటినుంచి, ఎవ్వరితో కులంచెప్పి ఎరుగను. అయినా దాని వల్ల ఒరిగేముంది చెప్పండి?

విశాల:- అవునులెండి, పోనీ దీనికైనా సమాధానం చెబుతారా?

శేఖ:- ఏమిటది?

విశాల:- మీ కుటుంబం బాగా వున్న కుటుంబమేనా?

శేఖ:- పెద్దగా ఉన్న కుటుంబమేమీ కాదనకోండి. అయినా బొత్తిగా లేదని చెప్పడానికికూడా లేదు.

విశాల:- [చిన్నగా నవ్వుతుంది] ఇపుడు మీ వయస్సెంతండి?

శేఖ:- ముప్పదిమూడు సంవత్సరాలు.

విశాల:- అయితే యింకా యువకులే నన్నమాట?

శేఖ:- [పేలవంగా నవ్వుతాడు.]

విశాల:- మీకు పెళ్ళయి ఎన్ని సంవత్సరాలయిందో?

శేఖ:- పన్నెండు సంవత్సరాలు దాటింది.

విశాల:- మీ భార్యగారు...

శేఖ:- లేరు.

విశాల:- పుట్టింటికి వెళ్ళారా?

శేఖ:- కాదు.

విశాల:- మరి... (చేతిమీద చేయివేయబోయి) ఐ యామ్ సారీ?

శేఖ:- ఆమె చనిపోయి చాలాకాలమైంది.

విశాల:- ఏదైనా వ్యాధితో మరణించారా?

శేఖ:- అహ. ప్రసవించడంలో. తొలికాన్పు కావడంతో ప్రసవించడం కష్టమైంది కనడం కష్టమై కన్నుమూసింది. నా భార్య నాకు దూరమైపోయింది. ఆమె బ్రతికివుంటే యీనాడు ఎంత ఆనందించివుండేదో? (విశాల మూర్ఛపోతుంది. శేఖరం చూచి) ఏమండి, ఏమైందండి?

(తాకి చూచి) అరె! ఫిట్ లో పడిపోయినట్టుందే (విశాల కదులుతుంది) అరె, యీ మాత్రానికే బెంబేలెత్తి పోయారేమిటండీ? మీరు ఒట్టి సెంటిమెంటల్ ఉమన్‌లా వున్నారే!

విశాల:- ఐ యామ్ సారీ! (అని కదలబోయి మళ్ళా పడిపోబోతుంది. శేఖరం పట్టుకుంటాడు. విశాల శేఖరం మెడమీద చేయి వేస్తుంది. ఇంతలో వెలుపల ద్వారంవద్ద ఫ్లాష్‌బల్బు వెలుగుతుంది.)

శేషు:- (లోపలకు కెమెరా సరిచేసుకుంటూ నవ్వూ, వండర్‌ఫుల్! నేను బ్రహ్మాండమైన పోజు కాప్చర్ చేశానన్నమాట.

శేఖ:- ఎవరు మీరు?

శేషు:- నన్ను మీకు తెలియదూ? నన్ను, ఓహ్, వాట్ ఏ పిటీ! శేషును తెలియనివాళ్ళింకా యీ ప్రపంచంలో వున్నారంటే ఓ గాడ్, మిజరబుల్!

శేఖ:- మీరు...

శేషు:- మీ కింకా తెలియదన్నమాట? నన్ను మీరు క్రిటికల్ జన్‌చర్‌లో పెట్టేశారండి బ్రూటస్‌కుమల్లే.

శేఖ:- నేనా?

శేషు:- మరి? ఈ సిచ్యుయేషన్‌లో స్వరబ్బా కొట్టుకోవలసిన గతి పట్టింది నాకు. ఏమిటలా చూస్తారు? నేనేం లాటిన్ మాట్లాడటం లేదు. ఓ- అదా? స్వరబ్బా అన్న పదానికి అర్థం తెలియలేదన్నమాట మీకు? వెధవ కంట్రీ ఇడియమ్స్, ఎవడన్నా పీటికో డిక్షనరీ వ్రాసిపడేసినా బావుండును. ఆఁ, ఏమిటి? స్వరబ్బాకదూ? చూశారూ! ఈ యుగంలో అంటే మధ్యయుగంలో-నో, నో. మనభావకవులన్నట్లు దాని పేరు యస్. సంధియుగం. ఈ సంధి యుగంలో మనుష్యుల గొప్పలు చాటుకోవడానికి మూడే మూడు పద్ధతులున్నాయని మనవాళ్ళు డిటెక్ట్ చేశారు. వరుసగా చెబితే అవి-స్వరబ్బా! పరబ్బా!! పరస్పర డబ్బా!!! ఇందులో వస్తు బిట్టే మీకర్థం కాలేదుకాబట్టి క్రమాలంకారంలో కుదించి వాటి అర్థం నేనే చెబుతాను. స్వరబ్బా

అంటే తన్నుగురించి తాను గొప్పలు చెప్పుకోవడం. ఈ జాతి మనుష్యులు ఎక్కువగా మనకు కవులలో కనిపిస్తారు. కావాలంటే మీరు ఏదైనా గ్రంథంలో ముందుండే నామాటలోనో, వెనుక అట్ట మీద రచయిత బొమ్మక్రిందో చూడండి, మీకే తెలుస్తుంది. ఇక పర డబ్బా అంటే ఒకళ్ళనుగురించి మరొకళ్ళు పొగడ్డం. ఇలాంటిది జరగాలంటే వాడిమీద వీడికి ప్రేమో, అభిమానమో, అలాంటి జబ్బు మరేదో వుండితీరాలి. లేకపోతే యిలాంటిది జరుగదుకదా మరి! వాళ్ళే మర్డరర్స్ ఆఫ్ కీట్స్. ఏమిటలా చూస్తారు? ఇదీ అర్థంకాలేదా? విమర్శకులండీ, క్రిటిక్స్, కాకుల్లాపొడిచి కీట్సు మహాకవిని లోకాని కాకుండా చేశారు. ఈ జాతి మనుష్యులు ప్రపంచమంతటా కుక్క-గొడుగుల్లా అంగుళాని కొకడున్నాడు లేకపోతే మన తెలుగువాళ్ళు తీసే అర్థంలేని సినిమాలకు బాగున్నాయనే పొగడ్తలు, వాటికి డబ్బులు ఎలా వస్తాయి చెప్పండి! పోతే పరస్పరడబ్బా. ఇటీజ్ ఓన్లీ ఎ మూచ్వల్ అండర్‌స్టాండింగ్, ఈ కోవ మనుష్యులు ఎక్కువగా మీ జాతీయ నాయకులలో కనిపిస్తారు. ఎందుచేతనంటే-ప్రతి నాయకుడికీ ఒక గ్రూపు, ఆ గ్రూపులో కొందరు శిష్యవర్గం వుండటం ఒక క్వాలిఫికేషన్. మరి గురువుగారు శిష్యుల్ని, శిష్యులు గురువుగార్ని పొగుడుకోవటం, అందులో పబ్లిక్ ప్లాట్‌ఫారమ్స్ మీద, పెద్దపెద్ద మందలముందు పరిపాటయిపోయింది. ఇదీ స్థూలంగా చెప్పాలంటే వాటి డిఫనిషన్. ఇకపోతే...

శేఖ:- అసలు మీరెవరో చెప్పారుకాదు.

శేష:- ఐ యామ్ సారీ. కమింగ్ టు ది పాయింట్. నా పేరు శేష. అసలు పేరు ఆదిశేష. ఆద్యంతాలు తెలియని ప్రపంచంలో "ఆది" ఎందుకు సోదిలే అని, అంతవరకు కట్‌చేసి శేష అని షార్టుగా మార్చేశాను. (విశాలవైపు చూచి) క్షమించాలి. ముఖ్యంగా ఆడవాళ్ల పిలవడానికి. ఆడవాళ్ళమధ్య పేరు పొడుగ్గా వుంటే ప్రేమించడం మానేశారులెండి. ఇకపోతే యక్స్-రే పత్రికకు కరస్పాండెంటుని. ఫొటోగ్రఫీ నా హాబి ఆ హాబీ చేతులో వుంది కాబట్టే, ఇందాక జాలీగా మీరిచ్చిన పోజు కూల్‌గా కొట్టేశాను. అయితే అయిందిగాని

బ్రహ్మాండమైన పోయింది. రాత్రి బోహారీలో కాలక్షేపం చేసి ఉదయం కాల్‌షీటుల్‌లో కలుసుకున్న సినిమా హీరో హీరోయిన్లకు కూడా వల్లగాని పోజ్లు చే నమ్మండి (విశాలను చూచి) క్షమించాలి. అతిగా మాట్లాడేస్తున్నట్లున్నాను.

విశాల:- (వ్యంగ్యంగా) లేదు చాలా తెలివిగా మాట్లాడుతున్నారు.

శేషు - వాట్ ఆప్టార్‌ల్ వర్డ్స్. చేతలు అంతకంటె తెలివిగా వుంటాయండి. నిజంచెప్పాలంటే దేశంలో జనాభా నన్ను శీనియన్ ఆఫ్ ది జర్నలిస్టు అంటారు...అందుకే ఎందరో మిత్రులు బ్రెయిన్‌ని భీమా చేయించమన్నారు. చచ్చు ప్రేమకూడా భీమా వచ్చిన ఈ రోజులలో ఆ పని చెయ్యడం బిసీత్ మై ప్రిస్టేజ్ అని ఆ థాట్ తుడిచి పెట్టేశాను.

శేఖ:- ఇంతకూ మీ రెందుకు వచ్చారో చెప్పారు కాదు.

శేషు - అది చెప్పబోతుండగానే మీరు తొందరపడి అడిగేశారు. అయితే మాత్రం ఏంలెండి. ఉత్సుకత అలాంటిది. తినబోతూ కూరరుచి అడగడం మన ఆంధ్రులకు అలవాటే. నేనిక్కడకు వచ్చింది మిమ్మల్ని అభినందించాలని. తరువాత ప్రెస్ కో స్టేట్‌మెంటు తీసుకుందామని. ఆ తరువాత హాబీకి, జాబ్‌కి పనికొచ్చేటట్లు మచ్చుకో పోజు పుచ్చుకెళదామని వచ్చాను. వచ్చిన పని వాకిట్లోనే అయిందనుకోండి.

శేఖ:- మీ రనేదేమిటో నా కర్థం కావటం లేదు.

శేషు:- అర్థంకానివే అందంగా వుంటాయి సార్! ఫర్ ఎగ్జాంపుల్. అందని అమ్మాయిని కళ్ళల్లో నింపుకొని కవిత్వం చెబితే కమ్మగా వుంటుంది.

శేఖ:- అయ్యా; అదిశేషుగారూ! త్వరగా తెమల్చండి. అవతల ప్రొద్దు పోతుంది.

శేషు:- జస్ట్ ఏ మినిట్. ఫస్ట్ ఆఫ్ ఆల్ మీ విజయానికి నా అభినందనాలు. ఇకపోతే మీ ఇద్దరి పేర్లు. మీపేరు తెలిసేవుంది కాబట్టి, మీ సతీమణి పేరుకూడా సెలవిస్తే పేపర్లో ప్రచురించి నాటికాయలంత

అక్షరాలతోటి, గొప్ప రాజకీయవాది గృహస్థ జీవితం అని మీ ఆనందమయ సాంసారిక జీవితాన్ని గురించి కరుకుల్లాంటి కుర్ర వాళ్ళచేత పది కీకాలమ్స్ నింపిస్తాను.

శేఖ:- ఏమిటయ్యా నువ్వనేది?

శేషు:- అదేనండి. ఇందాక మీరూ, మీ శ్రీమతి ఆనందంగావున్న సమయంలో...

శేఖ:- నా శ్రీమతా?

శేషు:- అవును. ఇంత అన్యోన్య దాంపత్యం ఎంతమందికి లభిస్తుంది చెప్పండి. ఇంతకుముందే నే తీసిన ఫోటోయే అందుకు నిదర్శనం.

శేఖ:- మిస్టర్ ఆదిశేషూ!

శేషు:- పోనీ వారినే అడిగి తెలుసుకుంటాను. ఎక్స్క్యూజ్ మీ, మీ పేరేమిటో తెలవిస్తారా?

విశాల:- విశాల.

శేషు:- మీకూ, మంత్రిగారికి వివాహమై యెంతకాలమైందో చెబుతారా?

శేఖ:- ఆమె నా భార్యకాదయ్యా బాబూ!

శేషు:- కాదూ?

శేఖ:- కాదు.

శేషు:- అయితే నా ఫిలింలో ఒక ఫ్రేమ్ వేస్టయిందన్నమాట. ఇంకా మీరిద్దరూ దంపతు లనుకొని బ్రహ్మాండమైన స్టిల్ తీశాను. (చిన్నగా నవ్వి) వేస్టయినా మోస్టు వండర్‌ఫుల్‌గా వుంది. వాస్తవంలో బానర్ మారిందేగాని ఎఫెక్టు అంతకు పదిరెట్లు పెరిగింది.

శేఖ:- ఏమిటది?

శేషు:- ఏముంది. వర్లగింజలో బియ్యపుగింజ ప్రముఖ రాజకీయవాది రహస్య జీవితం అన్న బేనర్ వేసి ఈ ఫోటో క్రింద వేస్తే ఎలా వుంటుం దంటారు?

శేఖ:- తమాషాగా మాట్లాడుతున్నారా?

శేషు:- పోనీ సీరియస్‌గానే మాట్లాడుతున్నా ననుకోండి

శేఖ:- తల తిరుగుతోందా?

శేషు:- నా కెందుకు తల తిరుగుతుందండి? చాటుమాటున ఇలాంటిపనులు చేసే మీకు తిరగాలి.

శేఖ:- నేను తలచుకుంటే నిన్నేం చేస్తానో తెలుసా?

శేషు:- ఏమీ చెయ్యలేరు. నన్ను మ్రింగితే నీ పళ్ళు రాలగొడతా నన్నదిట వెనకటికో యెలుక పిల్లితో. అయ్యా మంత్రిగారూ! మీ పరువు ఈ కెమెరాలో వుంది. మీ పరువు నిలబడాలంటే దీన్ని మీరు కొనక్కోవాలి. పెద్దగా ఏమీ అక్కరలేదు. ఒక్క పదివేలు చాలు.

శేఖ:- చిల్లిగవ్వకూడా ఇవ్వను.

శేషు:- ఇది మీకు పెద్ద నష్టమేమీ కాదు. అందులో మీరు మంత్రులు, భవిష్యత్తులో లక్షలకు లక్షలు ఆర్జించగలవారు. ఈ పదివేలు మీ కేపాటిది? బాగా ఆలోచించే చెప్పండి.

శేఖ:- ఆ అవసరం నాకులేదు, రాదు. నీ అబద్ధాలు క్షణంలో రూపుమాప గలను. ఆమెచేత వాస్తవాన్ని చెప్పించి నిన్ను జైలుకు పంపుతాను. (విశాలవైపు తిరిగి) ఏమండి! ఏమంటారు? (విశాల పలుకదు.)

శేషు:- మంత్రిగారితో-అందులో భార్యా విహీనుడై వున్న వానితో సంబంధం వున్నదని ప్రచారం జరగడంకంటె మించిన అదృష్టం ఆడదానికి ఇంకేముంటుందండి చంద్రశేఖరంగారూ!

శేఖ:- యూ షటప్, ఏమండి! మిమ్మల్నే. మాట్లాడరేం?

(శేషు, విశాల ఇద్దరూ కలసి పగలబడి నవ్వుతారు.)

శేఖ:- అర్థమైంది. మీ యిదరూ కలిసే ఈ నాటక మాడారన్నమాట. ఇద్దరూ కూడబలుక్కునే వచ్చారన్నమాట.

షు:- అవును. మీరన్నది అక్షరాలా నిజం.

ఖ:- వంచన, మోసం. స్కాండల్.

శేషు:- దానికి మీరేం పేరుపెట్టినా నా కభ్యంతరంలేదు, అడిగినపస్తేసరి

శేఖ:- నా కంఠంలో ఊపిరుండగా ఇవ్వను.

శేషు:- ఇవ్వవేం, అదీచూస్తా. 10 నిమిషాలు టైమిస్తున్నాను. అప్పటివరకు విశాల ఇక్కడే వుంటుంది. నిదానంగా ఆలోచించే పంపు. విశాలా! యిలారా. దీన్ని దగ్గరుంచు. (నెగిటివ్ యిస్తాడు) డబ్బిస్తే ఇదిచ్చి డబ్బు తీసుకురా! కాని పక్షంలో ఏం చెయ్యాలో తెలుసుగా?

విశాల:- ఆఁ!

శేషు:- నే వస్తామరి. బై బై మినిస్టరుగారూ! (వెళతాడు.)

విశ్వం:- (లోపలినుండి) శేఖరం! ఏమిటాగొడవ?

శేఖ:- (కంగారుగా) కాసేపు ఆ గదిలో కూర్చో. ఆయన చూస్తే అసహ్యంగా వుంటుంది. వెళ్ళు. ప్లీజ్, (విశాలను కుడివైపు గదిలోకి పంపిస్తాడు.)

విశ్వం:- (లోపలకువస్తూ) ఎవరితో గొడవ పడుతున్నావు?

శేఖ:- ఏమీలేదే.

విశ్వం:- నా దగ్గరకూడా దాపరికమెందుకు! నే నంతా వింటూనేవున్నాను.

శేఖ:- నువ్వూ వింటూనేవున్నావా?

విశ్వం:- శేఖరం, చిత్తుగాత్రాగినా మనస్సుకు మత్తెక్కదు. నీకూ వాళ్ళకు మధ్య జరిగిన సంభాషణంతా వింటూనే వున్నాను. ఇంతకూ ఏం నిర్ణయించుకున్నావ్?

శేఖ:- నిర్ణయించుకునే దేమిటి?

విశ్వం:- డబ్బిచ్చి పరువు నిలుపుకుంటావా? డబ్బు దాచుకుని పరువు నమ్ముకుంటావా? మాట్లాడవేం?

శేఖ:- ఏమైనాకానీ, నే నివ్వను.

విశ్వ:- తెల్లవారితే పరువు వీధిలో వుంటుంది. వెర్రిఊహాలు కట్టిపెట్టి దానికి డబ్బిచ్చి పంపించు.

శేఖ.- నేనివ్వను ఇలా ఒకసారి అలవాటుచేస్తే ఇది వాళ్ళకు అలవాటవు తుంది.

విశ్వం:- పోనీ, నేనిస్తాను

శేఖ:- ఎవ్వరేమీ యివ్వనక్కరలేదు.

విశ్వం:- [కోపంగా] శేఖరం! వెళ్ళు ఆ మనిషిని పంపించు.

శేఖ:- అదికాదు విశ్వం.

విశ్వం:- యిక వాదం అనవసరం. వెళ్ళి చెప్పినట్టు చెయ్యి. [శేఖరం తికుక్కురు మనకుండా వెళుతుంటాడు.] ఇదుగో శేఖరం ! ఆ టేబిల్ మీద చెక్‌బుక్ యిలాపడేసి నువ్వు వెళ్ళి భోజనం చెయ్యి. అసలే ప్రొద్దు పోతుంది. [చెక్‌బుక్కిచ్చి శేఖరం వెళతాడు. విశ్వం త్రాగు తుంటాడు. విశాల వస్తుంది. విశ్వాన్ని చూచి భయపడి సోఫా వెనుకగా బయటకు పోబోతుంది. వాకిటదాకా పోనిచ్చి]

విశ్వం:- నీ పేరేమిటన్నావ్? విశాలకదూ? విశాల. [ఆగుతుంది.] ఈ వ్యాపారం ఎంతకాలంగా సాగిస్తున్నావ్? అడదానివికదా! కడుపులో చల్ల కదలకుండా పెళ్ళిచేసుకొని పిల్లల్నికంటూ కూర్చోక ఈ అవస్థెం దుకు చెప్పు? చూస్తే బాగా అందంగా వున్నట్టున్నావ్? ఇంత నిక్ళ ష్టంగా బ్రతికేకంటే ఎవడితోనన్నా లేచిపోవడం మంచిది తెలుసా ? ఒక పనిచేస్తావా? నాతో లేచొస్తావా? పోనీ, నన్ను పెళ్ళిచేసుకొంటావా? డబ్బుకేమీ ఇబ్బందిలేదు. నా దగ్గర కావలసినంత డబ్బుంది. ఏం ? ఇష్టం లేదా ? మీకు మంచెందుకు నచ్చుతుందిలే దాలిగుంటలో పడేకుక్క ఆలయంలో వుండమంటే వుంటుందా? పోనీలే, ఒకటి మాత్రం గుర్తుంచుకో. మరెప్పుడూ ఇలాంటి పని చెయ్యకు. ముఖ్యంగా ఇక్కడ తలుపుకుంటే ఇక్కడ నిన్నేమయినా చెయ్య గలను. ఆడదాని వయిపోయావు. అందులో డబ్బుకు యిబ్బంది పడుతున్నట్లున్నావు. పాపం! ఇదిగో నీ డబ్బు. ఆ నెగిటివ్ యిలా ఇవ్వు. ఊఁ- [విశాల నెగిటివ్ ఇవ్వబోతుంది. విశ్వం విశాలచేతిని చూచి.]

విశ్వం:- ఎవరునువ్వు? (విశాల పరిగెత్తబోతుంది. వెనుకనుంచి విశ్వం పట్టుకుంటాడు. విశాల ముఖాన్ని చేతులతో దాచుకుంటుంది.) నిజం చెప్పు. ని పేరేమిటి? నిన్నే, మాట్లాడవేం? (గట్టిగా లాగుతాడు. విశాల గదిమధ్యకు వచ్చిపడుతుంది) నీవు విశాలవుకాదు, సరోజవు అవునా?

విశాల:- (ఏడుస్తూ అవునన్నట్లు తల ఊపుతుంది.)

విశ్వం:- అబ్బ! ఇంత నికృష్టమైన దశలో నిన్ను చూడవలసి వస్తుందని కలలోకూడా అనుకోలేదు ఏం పనిచేశావు సరూ!

విశాల:- క్షమించండి, మీకు అన్యాయం చేశాను. ఈ జీవితంలో మీకు ఈ ముఖం చూపించవలసి వస్తుందని నేనెన్నడూ ఊహించలేదు. నన్ను మన్నించండి. (కాళ్ళమీద పడుతుంది. విశ్వం దూరంగా పోతాడు. విశాల నిరాశగా వెలుపలకు వెళ్ళబోతుంది.)

విశ్వ:- సరూ! (విశాల ఆగుతుంది.) నువ్వు నన్ను విడచి యెందుకు వెళ్ళి పోయావు? నేనేం తప్పుచేశానని యిలా చేశావు సరూ? తెలిసి నే నెప్పుడూ నీపట్ల కర్కశంగా ప్రవర్తించలేదే! ఇలా యెందుకు చేశావు సరూ?

విశాల:- ఇందులో మీ తప్పేమీలేదు. అజ్ఞానంలో నన్ను నేనే బలిపెట్టుకున్నాన. నా జీవితాన్ని చే జేతులా నేనే నాశనం చేసుకున్నాను. మిమ్మల్నీ మీ మంచితనాన్నీ అర్థం చేసుకోలేకపోయాను. ఫలితంగా జీవితాంతం వ్యథతో వేగిపోతున్నాను.

విశ్వం:- లేదు సరూ! నేనే నిన్నర్థం చేసుకోలేకపోయాను. కవితాదాహంలో కళ్ళు మూసుకుపోయి, నిన్ను నిర్లక్ష్యం చేసి, నీ జీవితాన్ని బొమ్మలా పగులగొట్టాను. ఆ కైపులో ప్రపంచంలో డబ్బుంటే లేని ఆనందం మరొకటి లేదనుకున్నానే గాని, అంతకుమించిన ప్రేమబంధం దాంపత్యానికి అవసరమన్న విషయాన్నే విస్మరించాను. అది తెలుసుకునేటప్పటికే అంతా ముగిసిపోయింది. నువ్వేమో ఎడారిలో ఎండమావుల చూపించి ఎటో ఎగిరిపోయావు. ఆ స్థితిలో అర్థం కాని

ఆయోమయ దశలో యీ బ్రతుకెంత కాగిపోయిందో నీకు తెలియదు సరూ!

**విశాల:-** ఏమండీ, బాధపడుతున్నారా? ఈ పాపిష్టిదాని పొందు మీకు లేకుండా పోయిందని చింతిస్తున్నారా? అందుకోసం మీ బ్రతుకును బ్రద్దలు చేసుకుంటున్నారా!

**విశ్వం:-** సరూ! నేనిప్పుడు నీవు నాకన్యాయం చేశావని బాధపడటం లేదు. నీ బ్రతుకిలా ఎందుకూ కొరగాకుండా పోయిందేమో అనే బాధపడుతున్నాను సరూ! తప్పు చెయ్యడం మానవ సహజం! తెలిసి దాన్ని దిద్దుకోవడమే మానవత్వం. ఒకసారి ఏదో తెలియని దశలో తప్పటడుగు వేస్తే, మళ్ళీ దాన్ని దిద్దుకునేందుకు అవకాశమున్నదని ఊహించలేని నిన్ను చూస్తే నాకు జాలేస్తోంది.

**విశాల:-** క్షమించండి. మీ మంచితనాన్ని వంచించలేను. పాపం ఘనీభవించిన ఈ జీవితంతో మిమ్మల్నీ మీపవిత్రతనీ కించపరచలేను. దేవతలాంటివారు మీరు. వాడి రాలిన మొగలిరేకును నేను. పరిమళ భరితమే అయినా మొగలిరేకు పూజకు పనికివస్తుందా?

**విశ్వం:-** అవన్నీ మానవులం మనం నిర్మించుకొన్నవి. వాటికోసం బ్రతుకులు బలి చేసుకోనక్కరలేదు.

**విశాల:-** ఎన్నయినా చెప్పండి. నేను మాత్రం అంగీకరించను. నిర్మలమైన మీ జీవితంలో మాలిన్యపు మచ్చలను కలిగించలేను. కానీ నా దొక ప్రార్థన. నా కారణంగానే యీ త్రాగుడు మొదలెట్టారు. ఈ పాడు వ్యసనంతో మిమ్మల్ని మీ రెందుకు హింసించుకుంటారు? నా మాట విని ఈ త్రాగుడు మానెయ్యండి.

**విశ్వం:-** క్షమించు సరూ! అది ఈ జన్మకిక సాధ్యపడదు. అదే లేకపోతే ఈ మనస్సుకి శాంతిలేదు నీవు నా దరిలేకపోయినా ఆ వెలితి నది కప్పిపుచ్చుతోంది.

**విశాల:-** (ఏడుస్తుంది)

విశ్వం:- సరూ! ఈ జీవిత మెలాగూ శిథిలమైపోయింది. నీ జీవితాన్నయినా బాగుచేసుకో. నీకు కావలసినంత డబ్బిస్తాను. పెడమార్గాలు వదిలి సవ్యమైన దారిలో బ్రతుకును వెళ్ళదీసుకో.

విశాల:- మన్నించండి. నా కీ జీవితంలో యే ఆశా, కోరికా లేవు. మృత్యువుకై యెదురుచూస్తున్నాను. నా ఈ పాపాలకు అదే సరైన శిక్ష.

విశ్వం:- సరూ!

విశాల:- కడసారిగా మిమ్మల్ని ఒక టడుగుతాను, కాదనరు గదా?

విశ్వం:- ఏమిటది?

విశాల:- పాప...మన పాపనొకసారి చూపించండి.

విశ్వం:- పాప. పొత్తిళ్ళలో వున్న పాపను వదిలి వెళ్ళినప్పుడు, పాపకెడమై బ్రతికిన ఇన్నాళ్ళు ఈ ప్రేమ, అనుబంధం, అనురాగం, వాత్సల్యం ఎక్కడికిపోయింది సరూ? ఆ బంధాన్నే నీవు గమనించివుంటే నీవూ, నేనూ కూడా యిలా పరాయి పంచన బ్రతుకవలసిన అవసరం ఏముంది చెప్పు?

విశాల:- మాటలతో నన్ను హింసించకండి. ఉద్రేకంలో ఏమో చేశానేగాని ఆ ఫలితాన్ని అనుభవించడానికి నేనెంత కుమిలిపోయానో, నా హృదయం పాపకోసం ఎంత పరితపించిపోయిందో మీకు తెలియదు. చేసిన తప్పుకు క్రుంగిపోయి, మీ ముఖం చూడలేక, మీ యెదుటపడ లేక, నాలో రగిలే మాతృత్వాన్ని బలవంతాన చంపుకున్నాను. ఏదైతే ఈ జన్మలో జరక్కూడదనుకున్నానో విధి బలీయమై అదే జరిగింది. నేను మీ ఎదుటపడ్డాను. యిక నాకీ జీవితం మీద కాంక్ష లేదు. మిమ్మల్ని బ్రతిమిలాడుకుంటాను. పాప నొక్కసారి చూపించండి.

విశ్వం:- వద్దు సరూ! ఈ మాలిన్యపు మేలిముసుగుతో పాప జీవితాన్ని, భవిష్యత్తును కంటకప్రాయం చెయ్యకు. తల్లి పతిత, తండ్రి త్రాగు

బోతన్న విషయాలు నీడల్లా జీవితాంతం వెన్నంటి పాప జీవితం సిగ్గుతో క్రుంగిపోయేలా చేయకు. పాపకు మనిద్దరమూ లేము. నీవు దూరంగావుండి లేకపోతే, నేను దగ్గరుండే పాపకు లేను. పాప జీవితంలో మనిద్దరం ఏనాడో చచ్చిపోయాం. ఇప్పుడు పాప మన బిడ్డ కాదు, శేఖరం బిడ్డ.

విశాల:- మీరు చెప్పినమాట కాదనడం లేదు. కాని ఒక్కసారి, చనిపోయే ముందు ఒక్కసారి పాపను కళ్ళారా చూచుకోనివ్వండి. కాగే నీటిలా పొంగే నా మాతృత్వాన్ని సంతృప్తిపరచుకోనివ్వండి. మీ పాదాలంటి ప్రార్థిస్తాను. నా మాట కాదనకండి. పాపను ఒక్కసారి కళ్ళారా చూడనివ్వండి. చూడనివ్వండి. (విశ్వం కాళ్ళు పట్టుకుని భోరున ఏడుస్తూంది. విశ్వం కరిగిపోతాడు.)

విశ్వం:- సరే, చూపిస్తాను. అయితే ఒక్క షరతుమీద.

విశాల:- ఏమిటి?

విశ్వం:- నువ్వు పాపను తాకకూడదు. పాపతో మాట్లాడకూడదు. మాతృత్వం ఒలికే మరే తీరులోనూ పాపముందు ప్రవర్తించకూడదు.

విశాల:- (ఏడుస్తూ) అలాగే! ఒక్కసారి నా పాపను చూపిస్తే అదే పదివేలు. (విశ్వం లోపలకు వెళ్ళి పాపను తెస్తాడు. విశాల ఏడుపు, నవ్వు మిశ్రితమైన ముఖంతో పాపను చూస్తూ వుంటుంది)

చిట్టి:- ఆమె ఎవరు బాబాయ్? ఎందుకు ఏడుస్తుంది? (విశ్వం పలకడు. బాధను మ్రింగుతాడు) చెప్పవేం బాబాయ్? ఆమె ఎవరు?

విశ్వం:- ఆమె...ఆమె, చిన్నప్పుడు నీకు పాలిచ్చి పెంచిన దాయమ్మ!

చిట్టి:- దాయమ్మా? అంటే అమ్మకదూ?

విశాల:- (బరస్ట్ అవుతుంది) పాపా! నా తల్లీ! నా బంగారు తల్లీ!

విశ్వం:- సరోజా!

విశాల:- (ఏమీ పట్టించుకోకుండా) నా చిట్టితల్లీ! ఎంతదానివయ్యావు? మా అమ్మే, నా చిన్నే (ఒళ్ళంతా ముద్దుపెట్టుకుంటుంది.)

విశ్వం:- సరోజా! (ఇద్దర్నీ విడదీస్తాడు) పాపా! నువ్వు లోపలకు వెళ్లు (పాప వెళ్ళిపోతుంది.)

విశాల:- ఏమండీ! నా పాపను ఒక్కసారంటే ఒక్కసారి గుండెలకు హత్తుకో నివ్వండి. ఆ ముద్దు చెక్కిళ్ళను ఒక్కసారి ముద్దు పెట్టుకోనివ్వండి. మీకో నమస్కారం చేస్తాను. మీ కాళ్ళు పట్టుకుంటాను. బ్రతికినంత కాలం మీకు ఋణపడి వుంటాను.

విశ్వం:- వీల్లేదు. అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు. (విసిరికొడతాడు) వెళ్ళు! నీ యిష్టం వచ్చినచోటికి వెళ్ళు. మరొకసారి నీ ముఖం పాపకు చూపించడానికి ప్రయత్నించకు, వెళ్లు.

(సరోజ కళ్ళవెంట జలజల అశ్రువులు రాలతాయి. యిద్దరూ ఏడుస్తూ కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఒకరిని ఒకరు చూచుకుంటారు. సరోజ నిరామయంగా వెలుపలకు వెళ్ళిపోతుంది. విశ్వం బాధగా సరోజ వెనుకే వాకిలిదాకా దగ్గుతూ వచ్చి, మళ్ళీ వెనక్కొచ్చి, చేతులను పిచ్చిగా టీపాయ్‌కు వేసి కొట్టుకుంటుంటాడు. ఇంతలో లోపలకు వచ్చిన శేఖరం విశ్వాన్ని చూచి)

శేఖ:- విశ్వం! ఏమిటిది పిచ్చివాడిలా? (చేతులు పట్టుకుంటాడు.)

విశ్వం:- నీకు తెలియదు శేఖరం, నన్ను వదులు. నేను మహాపాపం చేశాను. మాతృత్వానికీ మమకారానికీ మధ్య బంధనాలు తెగగొట్టాను. ఇవి చేతులుకావు. (మళ్ళీ కొట్టుకోబోతాడు.)

శేఖ:- (పట్టు విడవకుండా) విశ్వం!
(బయటనుండి బ్రాందీ బాటిల్సుతో రంగయ్య వస్తాడు)

రంగ:- బాబుగారూ, బాబుగారూ! ఎవరో ఆమె మన మేడమీదనుంచి క్రిందకు దూకిందండి. ఒళ్ళంతా చిదురు చిదురై పోయింది. పాపా, పాపా అని కలువరిస్తోందండి.

విశ్వం:- సరోజా! శేఖరం, వెళ్లు, ఆమెకు పాపను చూపించు. మరణించేవాళ్ళ కడసారి కోరిక తీర్చడం మానవధర్మం. వెళ్లు శేఖరం!

శేఖ:- సరోజా? సరోజెవరు?

విశ్వం:- ఆమే శేఖరం, ఇందాక వచ్చిందే విశాల.

శేఖ:- దానికి మన పాపను చూపించడం ఎందుకు? ఆ కళంకిని కళ్లపడితే పాప జీవితమే మైల పడిపోతుంది.

విశ్వం:- శేఖరం! ఇక మాట్లాడకు, ఆమె విశాల కాదురా. నా భార్య సరోజ. వెళ్ళు, పాపను చూపించు. మరణించే ముందైనా ప్రశాంతంగా మరణించనీ. వెళ్ళు, వెళ్లు శేఖరం! (శేఖరం, రంగయ్య పాపను తీసుకుని వెళ్ళబోతారు. విశ్వం పాపను కావులించుకొని అమ్మ అని చెప్పలేక అమ్మ అని భోరున ఏడుస్తాడు. టేబిల్ మీద వున్న బాటిల్ మూత నోటితోనే తెరచి గటగటా త్రాగుతుంటాడు. ఇంతలో రంగయ్య లోపలకు కంగారుగా వచ్చి)

రంగ:- బాబుగారూ, బాబుగారూ! అమ్మగారు పోయారండి. పాపను చూడకుండానే పోయారండి. (మళ్ళీ కంగారుగా బైటకు వెళతాడు.)

విశ్వం:- సరోజా! (దగ్గుతెర వస్తుంది. తూలుతూ ముందుకు నడవబోతాడు. దగ్గు మరీ ఉధృతమౌతుంది. సోఫా ఆధారం చేసుకుని కూర్చుంటాడు. టిపాయ్‌మీద బాటిల్ పెడుతుంటాడు. గుండె పట్టుకుంటుంది. టిపాయ్‌మీద సీసా దొర్లుతుందేగాని చేతిక్రింద ఇరుక్కుంటుంది. విశ్వం టిపాయ్‌మీద సోలిపోతాడు.)

నేపథ్యం: కనుగొలకులలో ఆశలు, బాష్పకణాలై
సెగలై మదిలో నిలచి రగులును జ్వలితజ్వాలై
రగులును జ్వలిత జ్వాలై-రగులును జ్వలితజ్వాలై॥
(గీతం వస్తూండగా, బాటిల్ నుండి బ్రాందీ చుక్కచుక్కగా పడుతుండగా, తెర బరువుగా జారుతుంది.)



## పాత్రలు

వల్లభరావు
పరశురామ్
రాజశేఖరం
పత్రికావిలేఖరి
సుభద్ర

కలవారింట ముందు హాలు. అలంకరణకు లోటులేదు. ఎదురుగా లోపలకు పోయే గుమ్మం. ఎడమచేతి వైపు ప్రక్కగదిలోకి పోయే గుమ్మం. టేబులు మీద రేడియో, ఫ్యాను, ఫ్లవరువాజూ, గాజుచేప, అగరువత్తుల స్టాండూ, యాష్‌ట్రే మొదలయినవి తీర్చిదిద్దినట్లు అమర్చివుంటాయి. మరోప్రక్క సొరుగులున్న బల్ల వుంటుంది. దానిమీద కుడిచేతిప్రక్కగా ఓ అరడజను ఫైల్సు పడివుంటాయి. ప్రాత పరికరాలూ, యాష్‌ట్రే మరోప్రక్క. హాలుమధ్యనున్న చిన్నబల్లమీద ఓ అమ్మాయి, ఓ అబ్బాయి ఒప్పులకుప్ప తిరగడానికి సిద్ధంగా చేతులు పట్టుకొనివున్న బొమ్మ, ఆ బొమ్మ చక్కని రోజ్‌వుడ్ బేస్‌మీద అమర్చి వుంటుంది. ఒక్కసారి యిలా త్రిప్పితే గిఱ్ఱున గ్రామఫోను ప్లేటులా తిరుగుతుందది. దానితో పాటు పైనున్న బొమ్మలు తిరుగుతూంటే చూడ ముచ్చటగా వుంటుంది.

తెర తీసేసరికి ఫైల్సువున్న బల్ల మీదవున్న టెలిఫోను మోగుతూంటుంది—

వల్లభరావు:- (లోపలనుంచి వస్తాడు. మధ్య వయస్కుడు. ఆర్థికంగా సంఘంలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించుకొన్న హుందాతనం కనిపిస్తుంటుంది. రిసీవరు అందుకుని) హలో!...ఆర్ డి ఓ. గారా? నమస్కారం సార్! ... సుభద్రాండి?...ఆ!...ఆ! రావటానికే సిద్ధమౌతోంది. నేనాండి...నాకు తీరిగ్గా లేదుసార్!... అయ్! Thanks! వుంటానండి. (రిసీవరు పెట్టేస్తాడు. డ్రాయరు సొరుగులాగి ఏ కాగితాల కోసమో వెతికి కనుపించక లోపలకు వెడతాడు. వెంటనే ఫోను మోగుతుంది.)

సుభద్ర:- (వెనుక ద్వారంగుండా వస్తుంది, అందం, చదువూ, సంస్కారం— ఈ మూటి తేజస్సుతో ముఖం కలకల లాడుతూంటుంది. చేతిలో వున్న ట్రే టీపాయ్‌మీద పెడుతుంది. భుజానికి తగిలించుకు వచ్చిన ఫ్లాస్కు వెనుక బల్లమీద పెడుతుంది. రిసీవరు అందుకుని) హలో!...ప్రొఫెసర్ భక్తవత్సలంగారా! నమస్తే!... పార్టీ కమెన్స్ అయిందాండి...(నవ్వి)...అయితే ఇహనే! పదినిమిషాల్లో రాలేకపోతానా? ... ఇక్కడేకదండీ!...మీ శ్రీమతిగారు వచ్చారా! ... ఇప్పుడే వస్తానని ఆమెతో చెప్పండి, రాజశేఖరంగారింటా రాత్రే

దండి!...అహఁ!... Thank you sir! (రిసీవరు పెట్టేసి వచ్చినదారినే వెడుతుంది...మళ్ళీ ఫోను మోగుతుంది.)

వల్లి:- (ఫైల్సుతో తిరిగివచ్చి, వాటిని బల్లమీద పడేసి, రిసీవరు అందుకుని) హలో!...సుభద్రగారా! టాయిలెట్ అవుతున్నారండి. అయిదు నిమిషాల్లో వస్తారు...రాజశేఖరం ఇక్కడ లేదండి...ఉంటా. (రిసీవరు పెట్టేసి, ఫైలు తెరిచేసరికి మళ్ళీ ఫోన్) హలో...సుభద్ర గారు వస్తున్నారు...రాజశేఖరం ఇక్కడికి రాలేదు. ఉంటా! (రిసీవరు పెట్టేసి ఫైల్లో ఓ కాగితం తిప్పేసరికి మళ్ళీ ఫోను) హలో... సుభద్ర వస్తుంది. రాజశేఖరం ఇక్కడ్లేడు. (అని విసుగ్గా ఫోను చప్పుడయేట్టు పడేసి ఫైలు గబగబ తిరగేస్తున్నంతలో మళ్ళీ ఫోను) హలో! ఇక్కడ ఎవరూలేరు. ఎవరూ - రారండి. (అని రిసీవరు చెవికి దూరంగా అలాగే పట్టుకొని, ఫైల్సు చూచుకుంటుంటాడు) సుభద్రారాజశేఖరం, సుభద్రారాజశేఖరం! (అని గొణుగుతుంటాడు)

సుభ:- (వస్తుంది) ఏవిఁటీ, మీ రిప్పుడా ఫైల్సు ముందేసుక్కూర్చున్నారు?

వల్లి:- (పరధ్యానంగా ఫోనులో) హలో! ఏవిఁటన్నారూ?

సుభ:- (నవ్వి) నేనండి! ఇక్కడ!

వల్లి:- (ఆమెనుచూచి, రిసీవరు పెట్టేసి) ఆఁ?

సుభ:- అవి తరవాత చూసుకోవచ్చు, లేచి డ్రెస్ చేసుకోండి.

వల్లి:- ఆఁ?...ఆఁ!

సుభ:- మరి లేవండిక!

వల్లి:- ఆఁ?...నేనా?...నేను రాను.

సుభ:- మీరెప్పుడూ యింతే!

వల్లి:- ఆఁ? నేను కదూ!...అవును, ఎప్పుడూ యింతే!

సుభ:- అబ్బ! ఏవిఁటండీ ఆ పరధ్యాస?...రండీ మీరుకూడా! (లాలనగా)

వల్లి:- నిజంగా రమ్మంటున్నావా? (ఆమెవంక చూస్తాడు)

సుభ:- మీ మాటలు నా కర్థంకావు బాబూ!

వల్లః- కావా? (అంటాడు. అంతలో అతని దృష్టి చీరెమీద పడుతుంది. పయిటకొంగు అందుకుంటాడు అతని ముఖంలో ఏదో చిత్రమైన రేఖ మెరిసింది) ఈ చీర...

సుభః- నా పుట్టినరోజు పండక్కి రాజశేఖరం ప్రెజెంట్ చేసింది-బాగుందా?

వల్లః- చాలా బాగుంది. పదిమంది పెద్దలు వచ్చే పార్టీలకు పనికి వచ్చేది. (అంటూ ఆమె భుజాలు గట్టిగా పట్టుకొని, ఆమె కళ్ళలోకి వింతగా చూస్తూ) కదూ? (అని తల తిప్పుకుంటాడు. అప్పుడతని ముఖంలో జుగుప్స పొంగివస్తోంది.)

సుభః- (అది గమనించకుండా, తన ధోరణిలో) మీరు మరీనూ! ఇంట్లో వున్నప్పుడు కట్టుకుంటే బాగుండదాయేం?

వల్లః- పదిమందీ మెచ్చితేనేకాని దాని అందం సార్థకంకాదు.

సుభః- చాల్లెండి.

(ఫోనుమోగుతుంది.)

వల్లః- (రిసీవరు అందుకుని) హలో!... ... సుభద్రగారు వస్తున్నారు... రాజశేఖరం యిక్కడికి రాలేదండి...నేనా? ... నాకు చాలా పనులుండిపోయాయండి... అలస్యమేమీ లేదండి, ఇదుగో బయలుదేరుతోంది...Thanks ! సెలవండి. (రిసీవరు పెట్టేస్తాడు.)

సుభః- అయితే మీరు రారన్నమాట?

వల్లః- ఊఁ!

సుభః- నాతో రావటం మీకు నామర్దాగావున్నా!... సరే, మీ యిష్టం. కాఫీ తాగండి.

(లోపలకు వెడుతూండగా.)

రాజశేఖరం:- (వస్తాడు. మధ్య వయస్కుడైనా యువకునిలా కనిపిస్తాడు. అలా కనిపించాలనే తహ తహ అతని దుస్తుల్లో, క్రాపులో కనిపిస్తూ వుంటుంది.) ఏమిటి సుభద్రా, నువ్వింకా రెడీ కాలేదా?

సుభః- (ఆగి) ఆయన రారట?

రాజ:- మామూలేగా! ఒకప్పుడు వచ్చాడాయే! పార్టీలూ, పిక్‌నిక్‌లూ అంటే తలనొప్పిగా! ఏం వల్లభం, అంతేనా?

వల్ల:- అంతే! అంతే!

రాజ:- డబ్బుతోనే యిహాన్నీ, పరాన్నీ కూడా సాధించగల వాడివి, ఇహ మనుష లెందుకు? ప్రపంచ మెందుకు నీకు? నిజానికి నువ్వలా రెండు చేతులా ఆర్జించటం నాకెంతో గర్వంగా ఉంటుంది.

వల్ల:- గర్వం?...గర్వం!...

రాజ:- ఏవిఁటి నువ్వలా నిల్చునే వున్నావు సుభద్రా? పుణ్యకాలం కాస్తా గడచిపోతోంది—తెములూ!

సుభ:- (లోనికి వెడుతుంది.)

రాజ:- అన్ని ఫైల్సు ముందేసు కూర్చున్నా వేవిఁటివాళ?

వల్ల:- నాకు క్షణం తీరిక లేదని మీకు తెలియడానికి!

రాజ:- ఆ!...ఓహ్! what a fine joke! హుషారుగా మాట్లాడతావు గానీ, ఆ హుషారు నీ ముఖంలోనూ, నీ ప్రవర్తనలోనూ కనిపించ నియ్యవు. నాకదే చిత్రంగా ఉంటుంది.

వల్ల:- నాకూ చిత్రంగానే ఉంటుంది.

సుభ:- (వేనిటీ బ్యాగుతో వస్తుంది.)

రాజ:- (ఆమెను చూచిన క్షణంలోనే) సరే వస్తాం వల్లభం! (అంటూ వెడతాడు.)

సుభ:- (రాజశేఖరాన్ని అనుసరించి గుమ్మం వరకూ వెళ్ళి, వెనక్కు తిరిగి భర్త దగ్గరకు వచ్చి) కాఫీ చల్లారిపోతోంది, తీసుకోండి. ఇంకా కావాలంటే flask లో ఉంది. (అని కప్పు అతని దగ్గిరికి జరిపి వెళ్ళిపోతుంది.)

వల్ల:- (ఫైలుని చప్పుడయేట్టు ఎత్తిపడేసి, గబగబా వెళ్ళి భడాల్న వీధి తలుపు వేసేస్తాడు అటే చూస్తున్నాడు - అనుమానంగా! అతని ముఖంలో ఏవో ఆలోచనలు రేఖలు మెరిసి మాయమవుతున్నాయి.

చివరకు అనుమానం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. తన భార్య పర పురుషునితో నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ స్వేచ్ఛా విహారం చేస్తున్నట్టు అతనికొక ఊహ వస్తుంది. ఆ ఊహ విస్తృతమై అతని మేధస్సునూ, కన్నులనూ ఆవరిస్తుంది. ఏదో మంత్రానికి లొంగి పోయినట్టు అవుతాడుమనిషి! — స్టేజిమీది లైట్లు ఆరిపోతాయి. అతని ఊహకు రూపకల్పన జరుగుతుంది. శేఖరమూ, సుభద్రా పకపకనవ్వుతూ చెట్టపట్టాలు వేసుకుని గిర్రున తిరుగుతున్నారు. భరించలేక బిగ్గరగా కేకవేస్తాడు - 'సుభద్రా' అని! — ఆ ఊహ చెదిరిపోతుంది. టేబిలుమీది బొమ్మ గిర్రున తిరుగుతూంటుంది. లైట్లువెలుగుతాయి. అతనిలో కలిగిన కల్లోలంలో అతనింతవరకూ గుర్తించలేకపోయాడు — ఎవరో తలుపు కొడుతున్నారని! అతని ముఖాన చెమటలు దిగజారుతున్నాయి. కన్నులు జ్యోతుల్లా వెలుగు తున్నాయి. నిలువునా కంపిస్తున్నాడు. తలుపు కొడుతున్న శబ్దం ఎక్కువైంది. ముఖం తుడుచుకుని మామూలుగా అవుదామనుకుంటు న్నాడు. ముఖంలోకి గాంభీర్యాన్నీ, చిరునవ్వునీ తెచ్చుకుంటున్నాడు. వెళ్ళి తలుపు తీస్తాడు.) ఎవరూ?

పరశురామ్:- (వస్తాడు. యువకుడు)

వల్లి:- (తేరబారిచూచి) ఎవరూ?

పర:- ఒకానొకనాడు జ్ఞాపకశక్తికి మీ ముందు మహా మహా మేధావులు కూడా ఎందుకూ పనికిరారని మిమ్మల్ని హృదయపూర్వకంగా పొగిడిన నన్ను గుర్తించటానికే మీ జ్ఞాపకశక్తి చాల్లేదా వల్లభరావు గారూ?

వల్లి:- (క్షణంసేపు నొసలు చిట్లించి ఆలోచించి, అంతలో పెద్ద సంతో షంతో) ఓహ్! ఓహ్!......నా జ్ఞాపకశక్తినే శంకిస్తున్నావా పరశు రామ్!...రా! రా!...వచ్చి ఇలా కూర్చో! ఆఁ! ఎక్కడుంటున్నా విప్పుడూ? ఏం చేస్తున్నావూ? అయిదు సంవత్సరాల కివాళ అమాంతం దర్శనమిచ్చావ్, ఏమిటి కథ?

పర:- అఖిల భారత ఔషధ పరిశోధన కేంద్రంవారిచే ఆమోదించబడిన స్కీమ్ ప్రకారం ఓ పెద్ద మందుల కంపెనీ పెట్టబోతున్నాను. ఒక టన్ను కాఫీ గింజల్లోనుంచి తీయబడ్డ ఒక్క చుక్క ఔషధం సేవిస్తే అయిదు సంవత్సరాలు నిద్రాహారాలు లేకుండా బ్రతకవచ్చు మనిషి!

వల్ల:- What a mystery ! అద్భుతం! మహాద్భుతం! ఇప్పటికేమాత్రం తయారుచేశావ్ ?

పర:- ఇంతవరకూలేదు. త్వరలో తయారౌతుంది. అయితే కొంత పెట్టుబడి అవసరం.

వల్ల:- దీనికి పెట్టుబడెందుకు పరశురామ్! గవర్నమెంటే ఇస్తుంది. ఈ దెబ్బతో అటు కాఫీ దురభ్యాసాన్నీ, ఇటు ఆహారసమస్యనీ రాకుండా అరికట్టవచ్చని గవర్నమెంట్ ఏ మాత్రం గుర్తించినా నీ క్కావల సిన పెట్టుబడికి నాలుగింతలు ఇస్తుంది—తొందరపడకు!

పర:- ఆ అవకాశం ఉంటే నేను వదులుతానా వల్లభరావుగారూ! 'నీ కంపెనీ యేదో నువ్వు మొదలుపెట్టి పని కానిస్తుండు-అర్ధాంతరంగా ఆగిపోయే పరిస్థితివస్తే నేనిస్తాను'— అంది గవర్నమెంటు.

వల్ల:- అయితే గవర్నమెంటు ఎత్తేమిటో నే చెప్పనా?

పర:- ఊఁ! చెప్పండి.

వల్ల:- నీ కంపెనీ పనిపాటల్లో పడగానే, వెంటనే దాన్ని కాస్తా నేషనలైజ్ చేసేస్తుంది.

పర:- గవర్నమెంటు ఎత్తు ఏమోగానీ, మీరు మాత్రం నన్నూ, నా విష యాన్నీ ఎటో లాక్కుపోతున్నారు.

వల్ల:- No, No, అదేంలేదు పరశురామ్! నాకు ఒకప్పుడు నువ్వు చేసిన సహాయాలు మరచిపోతానా— వ్యాపారస్థుణ్ని! విషయమేమిటో చెప్పు!

పర:- మీరలా అంటారని తెలుసు, అందుకే ఎందరు ఎంతెంత మొత్తాలు ఆఫర్ చేసినా ఖాతరు చెయ్యకుండా, ఆ కంపెనీమీద రాబోయే లాభ మేదో మీరే తింటారని మీదాకా వచ్చాను.

వల్లః- My dear పరశురామ్! నువ్వొక్క సంగతి గుర్తు పెట్టుకుంటే నీతో ఎంతసేపు మాట్లాడటానికైనా అభ్యంతరం లేదు

పర - ఏవిటో చెప్పండి.

వల్లః- వేరే ఏం లేదూ, నువ్వు పెట్టబోయే కంపెనీకి పెట్టుబడి మాత్రం నన్నడగద్దు అంతే! Then you are my friend!

పరః- చంపేశారు- వచ్చిందే ఆ పనిమీదే!

వల్లః- అయితే గుడ్‌బై!

పరః- అలా తేలిగ్గా అనకండి వల్లభరావుగారూ! మాటవరసకి అంటున్నా నిజం చెప్పక తప్పదు- చూడండి! నే నొకప్పుడు మీకు మహోప కారాలు చేశాను. చేశానని మీరే ఒప్పుకున్నారు. దానికి ప్రత్యుపకా రంగా నాకీ సహాయం చెయ్యండి.

వల్లః- చూడు పరశురామ్! ప్రస్తుతం నేనే క్లిష్టాలా చిక్కుల్లో ఉన్నాను. ఆర్థికంగా, సాంసారికంగా పరిస్థితులంత బాగాలేవు. ఇహ నువ్వు అట్టే మొహమాటపెట్టి, బాధ పడక ఇంతటితో ఆ మాటకి మంగళ గీతం పాడెయ్! నా మాట విను!

పరః- ఎంతండి... అట్టే ఆశపడి పెద్ద మొత్తమేమీ మిమ్మల్ని అడగటం లేదు- అంతా ఓ పాతిక!

వల్లః- వేలేనా? ఆ?

పరః- ఆ పైన ఐదువేలో, పదివేలో మీ సంతోషంకొద్దీనూ!

వల్లః- (పక పక నవ్వి) సరదాగా మాట్లాడతావోయ్ పరశురామ్!

పరః- అవును, సరదాగానే మాట్లాడుతాను. అంత సరదాగానూ మీరు పని పూర్తిచేస్తే సరదాగా వెళ్ళిపోతాను.

వల్లః- (సీరియస్‌గా) ఏవిటి, నువ్వునిజంగా అడుగుతున్నావా ?

పరః- అక్షరాలా నిజం!

వల్లః- ఎంత చెట్టుకి అంతగాలి! నా స్థితిగతులు తెలుసుకో పరశురామ్!

పర:- తెలుసుకున్నానండి వల్లభరావుగారూ! తెలుసుకునే వచ్చాను, కొత్తగా రెండు మిల్లులూ, ఓ సినిమాహాలూ కూడా కట్టిస్తున్నారని తెలుసుకునే వచ్చాను.

వల్ల:- నువ్వేన్నో తెలుసుకున్న మాట నిజమే! అయితే ఇన్నిట్లో ఒక్కటీ పూర్తికాక, పెట్టుబడి చాలక కంఠంలోతున దిగబడి మునగానాం, తేలానాంగా ఉంది నా పని!

పర:- నిజమే! ఇన్ని భారీ వ్యాపారాల మీదా వచ్చేదెంతో తెలియదు, పోయేదెంతో తెలియదు రోజులు మంచివి కావు, మనుషులు మాయవాళ్ళయిపోయారు. అందుకనే ఉభయతారకమైన మరోమాట చెప్పమంటారా ?

వల్ల:- ఏదో లిటిగేషనన్నమాటే!

పర:- అదేం కాదు. మీ వ్యాపారాలు మీ తలకు మించిన వంటున్నారు గదా! అందువల్ల ఆ మిల్లులమీద మేనేజ్‌మెంటో, ఆ సినిమాహాలు కట్టించే పనో నా భుజాలమీద పడెయ్యండి. ఓ సంవత్సరంపాటు మీరు తిరిగి చూసే పనిలేకుండా వప్పగించిన పని వప్పగించినట్లు సక్రమంగా మీకు వప్పగించే బాధ్యత నాది. నమ్మండి.

వల్ల:- నమ్మకమనేది చాలా గొప్పది పరశురామ్! అది దైవ స్వరూపం. అనుమానమనేది పెనుభూతం. (ఉద్రేకంగా) నమ్మకం వెనకాలే అనుమానం కూడా నీడల్లే ఉంటుంది. ఓ మనిషిని నమ్మామూ అంటే, వెంటనే అనుమానించామన్న మాటే! (ఇంకా ఉద్రేకంగా) అక్కడితో ఆ మనిషికీ మనకీ చెల్లు!

పర:- ఏమిటి మీరంత ఉద్రేకంగా మాట్లాడుతున్నారు?

వల్ల:- ఉద్రేకమే పరశురామ్! బంగారమని నమ్మి చేతికి తీసుకున్నాను. రత్నాలు పొదిగి ఉన్నాయనీ నమ్మి శిరోమణిగా ధరించాను. అది ఉండవలసినచోటు అదేనని నమ్మి గౌరవించాను-తీరాచూస్తే-పరశురామ్—అది బంగారమూ కాదు, రత్నహారమూ కాదు.

పర:- ఆఁ ? ?

వల్లి:- విషజ్వాలలతో నా శరీరాన్ని భగ భగ మండించి, కాల్చి పారేస్తున్న సర్పం.

పర:- మీరు కొంచెం నిదానంగా మాట్లాడండి.

వల్లి:- అలా మాట్లాడి చూశాను. లాభం లేకపోయింది.

పర:- ఆహఁ! అదికాదండి...

వల్లి:- నువ్వు కాదనకు పరశురామ్! నేను చెప్పేది నిజం. అందువల్లే నాకు మనుషులమీద నమ్మకంలేదు.

పర:- అంతా మీరనుకున్నట్లే ఉంటారుటండి! నూటికో, కోటికో ఈ పరశురామ్ లాంటి నమ్మకస్థులు కూడా ఉంటారండి!

వల్లి:- నాలోనే నమ్మకమనే పదార్థం నశించిపోతోంది పరశురామ్! ఇక యితరుల మీద నమ్మకాన్నెలా ఉంచగలను చెప్పు?

పర:- అయితే నాచేత మీరేపని చేయించుకోరన్నమాట!

వల్లి:- పాతిక వేలిచ్చి నీ చేత చేయించుకోవలసిన పనేవిఁటో నాకేం తెలీటం లేదు. అసలయినా నేను చెయ్యలేనిదీ, నువ్వు చెయ్యగలదీ ఏవిఁటో చెప్పు!

పర:- ఫోర్జరీ!

వల్లి:- (నవ్వి) అది నా వల్లకాదనే!

పర:- పోనీ, కామ్‌గా ఎవర్నయినా చంపి అవతల పారెయ్యమంటారా?

వల్లి:- ఆ!!!

పర:- ఆ! చెప్పండి, నిమిషాల్లో గోటితో గిల్లేస్తాను.

వల్లి:- చూస్తుంటే...అమెరికా ప్రెసిడెంట్ కెనెడీని నువ్వే చంపినట్టున్నావే!

పర:- నేను కాకపోతే మా కిరాయి హంతకుల ముఠాకి చెందినవాడు మరొకడు. అయినా ఒక్క కెనడీనన్న మాటేవిఁటి? అబ్రహాం లింకన్ని, మహాత్మాగాంధీని చంపినవాళ్ళు నా జాతి వాళ్ళు కారూ! మహా పురుషుల్ని చంపి ఆ మహా పురుషులతో పాటు చరిత్రలో

శాశ్వతంగా నిల్చిపోయారు. అలాగే చిరస్థాయిగా నా పేరు కూడా నిల్చిపోయే యేర్పాటు చేయండి.

వల్లి:- ఇష్! ఊరొక్క. ఎవరైనా వింటే మన్ని ఆ దేవుడుకూడా రక్షించలేడు.

పర:- పోనీలెండి, మెల్లిగా మాట్లాడుకుందాం. (మెల్లిగా) ఎవరా అదృష్ట వంతుడు?

వల్లి:- ఏమిటి నువ్వనేది, నా బుఱ్ఱ పాడుచేస్తున్నావ్ పరశురామ్!

పర:- మీ బుఱ్ఱ నేను వచ్చేసరికే పాడైంది కదండీ!

వల్లి:- ఆ !

పర:- అవును ఇహ చెప్పండి. ఎవరా శత్రువు?

వల్లి:- నాకు శత్రువు లెవరయ్యా, నన్ను వేధించకు.

పర:- మీరలా అనగానే మీరు అజాత శత్రువని నేను అనుకుంటాననుకుంటండి! ఫరవాలేదు చెప్పండి. ఎవరు ఈ లోకంలో నుంచి నిష్క్రమిస్తే మీ హృదయంలోకి ఆనందం ప్రవేశిస్తుందో, ఎవరు శాశ్వతనిద్రపోతే మీకు అనంత శాంతి లభిస్తుందో, ఎవరు పరమపద సోపానాలు ఎక్కితే మీరు రాతిబండనే హంస తూలికా తల్పంగా భావించి గుండెంమీద చెయ్యి వేసుకుని నిద్ర పోగంరో - ఆ వ్యక్తి పేరు చెప్పండి. చెప్పలేకపోతే సావధానంగా వ్రాయండి. మీకు మేలు చేయటం, తద్వారా మీ మేలూ, మెప్పూ పొందటం నా విధి!

వల్లి:- ఏమో అనుకున్నాను గానీ పరశురామ్! నువ్వు... నువ్వు...

పర:- నాకు సరిపడే మాట మీరెంత వెతుక్కున్నా దొరకదు గానీ, ఇక చెప్పండా వ్యక్తి ఎవరో, ఐదు నిమిషాల్లో ఖండ ఖండాలుగా ఖండించి... ...

వల్లి:- ఆ ! !

పర:- ఏం? ఖండించ వద్దంటారా? పోనీ, ఓ పిస్టల్ సప్లయి చెయ్యండి. కామ్‌గా కాల్చిపారేసి, మీ గార్డెన్‌లో నిలువు లోతున పాతేస్తాను.

వల్లి:- ఇదిగో పరశురామ్! నాకు పిస్టలూవుంది. దానికి లైసెన్సూవుంది. అయితే నాకి పిస్టల్సూ, కత్తులూ, శవాలూ అంటే ఏమీ [illegible] అసహ్యం. తెలిసిందా?

పర:- అలా అయితే మీ కళ్ళముందు చంపను. చచ్చేవక్తి చావుకేకగానీ, చివరి మూలుగుగానీ మీ చెవుల పడనివ్వను. పిస్టలు ఇలా పడెయ్యండి.

వల్లి.- (డ్రాయరు నొరుగు తాళంతీస్తూ) పరశురామ్ జరగవలసిన పనిని సక్రమంగా జరుపు. ఆ తరువాత ఏం జరిగినా నా సంపతి నీకు శివచంగా ఉంటుంది. గుర్తుంచుకో. (పిస్టలు బల్లమీద పెడుతూంటే-పరశురామ్ తీసుకుంటాడు.)

పర:- ఈ ప్రపంచంలోకి మనిషి ప్రవేశించటం ఎంత కష్టమో నిష్క్రమించటమూ అంతే! అయితే మీ పనిని అవలీలగా పూర్తిచేసేందుకు ఈ పరశురామ్ దీక్షతో నిల్చున్నాడు. అందులో సందేహం లేదు. మీరిక వెళ్ళి నాకు యివ్వవలసిన పైకం యావత్తూ పదులూ, ఐదులుగా మార్చి జాగ్రత్తగా ఓ bag లో పెట్టి పట్టుకురండి. ఆ డబ్బుని మీరు నాకు బుద్ధిపూర్వకంగా, కేవలం నాకు సహాయం చేయాలనే సదుద్దేశంతో ఇచ్చినట్టు ఓ కాగితంలోనూ వ్రాస్తే చాలా మంచిది.

వల్లి:- కాగితా లెందుకు, నా మాట చాలదా?

పర:- నమ్మకాన్ని గురించి మీరు చెప్పిన మాటలు విన్నాక నాలో మీ మీద నమ్మకం పోతోంది వల్లభరావు గారూ!

వల్లి:- సరే నీ యిష్టం.

సుభ:- (గబగబా వస్తూ, పర పురుషుణ్ణి చూసి [illegible] పమిట కప్పుకుని లోపలకు వెడుతోంది.)

వల్లి:- సుభద్రా!

సుభ:- (ఆగింది.)

వల్లి:- ఇతన్ని పరిచయం చేస్తానిలా రా! (ఆమె వస్తుంది.) ఇతని పేరు పరశురామ్ (పరశురాంతో) ఈమె నా భార్య సుభద్ర. (మళ్ళీ భార్యతో) ఇతను మనకీ, మన వ్యాపారానికీ ఎంతో కావలసినవాడు. ఒకసారి గూడూరు దగ్గిర మన ధాన్యం లారీలను అకారణంగా ఆఫీసర్లు పట్టుకుంటే, ఇతను ఎంతో ప్రయత్నించి, తన మాట నెగ్గించుకుని, ఆ లారీలను ముందుకు నడిపించాడు. ఇంకా ఎన్నో ఇలాంటి చిక్కుల్లో అడ్డుకున్నాడు.

సుభ:- నమస్కారమండి.

పర:- నన్ను గురించి యింత చెపితేగానీ నాకు నమస్కారం చెయ్యాలనిపించ లేదన్నమాట!

సుభ:- (పేలవంగా నవ్వి) అబ్బే! అది కాదండి!... క్షమించండి. ఇప్పుడే వస్తాను (అని లోపలకు వెడుతుంది.)

పర.- (ఆమె వెళ్ళిన వైపుకి చూస్తూ) ఏవిఁటి అదోలా వున్నారు?

వల్లి:- ఒక్కొక్క మనిషికి ఎన్నోరకాల మానసిక రుగ్మతలు పరశురామ్!

పర:- నిజం నిజం? ఆవేలేకపోతే అంతా ఆ శ్రీరామచంద్రులే!... ఆ సీతా మహా లక్ష్ములే!... ఏవిఁటలా బెంగగా పడుతున్నారు?

వల్లి:- ఆ?... ఆ!... నే నింతవరకూ నీకో చెప్పింది...

పర:- What? ఈమెను గురించా...!

వల్లి:- (తల వూపుతాడు.)

పర:- మీ భార్యనా?... వల్లభరావుగారూ! నా డబ్బు కోసం నేనీ పని చెయ్యడానికి సిద్ధమే ననుకోండి. అయినా మీ భార్య మీద మీరు చూపుతున్న కాఠిన్యానికి కారణం తెలుసుకోవచ్చా ?

వల్లి:- నిజమే! కారణం నువ్వు తెలుసుకోవలసిన పని లేదు. అయినా చెప్పటానికి నాకు అభ్యంతరంలేదు. నీకు ఆశ్చర్యం కలిగించిన నిజానికి వెనుక ఓ అగ్నిపర్వతం బద్దలయింది... ఎంతో మృదువుగా ఉండే

ఘాళి మనుష్యుని పాదాక్రాంతం పడి నిరంతరాంతరంగమైపోతుంది. సున్నితమైన మానవ హృదయం కూడా ఎదురుదెబ్బలకు బాధించబడి కఠిన పాషాణమై పోతుంది. పరశురామ్!...నా పని అంతే అయింది. నేను ఆదరించి సంతోషపెట్టినా, వాత్సల్యంతో లాలించినా నానుంచి దూరమై నన్ను ప్రేమించేందుకు ఇష్టపడకుండా నన్ను కష్టపెట్టాలని చూసే వాళ్ళ మనః ప్రవృత్తి గమనించే సరికి నేను రాక్షసుణ్ణయిపోతున్నాను. నాకు తప్పటం లేదు. నన్నలా మార్చేస్తున్నారు. వాళ్ళు మారిపోయి నన్ను మార్చేసి, మార్చి మసి చేసి నన్నీ స్థితికి తీసుకొచ్చారు. ఇద్దరూ కావలసినవాళ్ళే! ఏ సంఘంలో వాళ్ళు సభ్య మానవులుగా బ్రతుకుతూ గౌరవ పురస్కారాలు పొందుతున్నారో ఆ సంఘంలో వాళ్ళకి అటువంటి స్థానం కలిగించింది నేనూ నాలోని స్వతంత్రభావాలూ! అయితేయేం? ఎక్కివచ్చిన మెట్లు కూలదోసుకునే స్వభావం వాళ్ళది. ఆ భావాన్ని సమూలంగా నాశనం చేయాల్సిందే! అది... తప్పదు.

పర:- మీ మాటే నమ్మకమనేమిటి?

వల్ల:- తర్కించకు పరశురామ్! తర్కిస్తే అబద్ధం నిజమైపోదు. ఈ తర్కాలు నన్నింకా పశువుని చేస్తాయి... నేను వెళ్ళి డబ్బు ఏర్పాటు చేస్తాను... నీ విధీ, అవసరమూ నీకు తెలుసు. వస్తా... (వీధిలోకి వెళ్ళబోతున్నాడు.)

పర:- ఆ! వల్లభరావుగారూ! ఒక మాట.

వల్ల:- ఏమిటి?

పర:- మీ పార్ట్‌నర్ ఒకాయన ఉండాలి-ఆయన యిప్పుడెక్కడుంటున్నారు?

వల్ల:- ఆ! ఉన్నాడిక్కడే! అతనితో నీ కేంపని? అతను నాతో విడిపోయి వేరే వ్యాపారం చేసుకుంటున్నాడు. ఏం?

పర:- తరువాత చెపుతాను. వెళ్ళిరండి.

వల్ల:- (EXIT)

పర:- (వెళ్ళి తలుపు వేసివస్తాడు.)

సుభ:- (లోపలనుంచి కాఫీ తీసుకొస్తుంది.) ఏరండీ యీాయన ?

పర:- పనుందంటూ వెళ్ళారు. ఇలా చీటికీ మాటికీ కాఫీ తెచ్చేలోపలా, భోజనం వడ్డించే లోపలా పనుందంటూ వెళ్ళిపోయే మనిషితో ఎలా వేగుతున్నారండీ?

సుభ:- ఎప్పుడూ అలా వెళ్ళరండీ. వెళ్ళినా వెంటనే వచ్చేస్తారు. కూర్చోండి. మీరు కాఫీ తీసుకోండి.

పర.- (కూర్చుంటూ) మీరు కూడా... (ఇద్దరూ కూర్చుని కాఫీ తాగుతున్నారు.) మీరు బి.యే. అనుకుంటాను?

సుభ:- అదే అనర్థాలకు కారణం!

పర:- ఏం? అలా అన్నారు?

సుభ:- నేను బి.యే. చదివి ప్రయోజనం లేదు కదండీ! ఏ పేదరాలో ఈ చదువు చదివి వుంటే ఏదో ఉద్యోగం చేసుకుని తన కుటుంబానికి ఆసరాగా నిల్చేది.

పర:- ఏం చేస్తాం? పదవుల్లాగా ఈ డిగ్రీలని త్యాగం చెయ్యటానికీ, ట్రాన్స్‌ఫర్ చెయ్యటానికీ వీల్లేదు కదండీ? తప్పని సరిగా భరించాల్సిందే!...ఆ! చూడండి, మాటిమాటికీ గుర్తుచెయ్యటం మంచిది కాకపోయినా చెప్పక తప్పదు. నేను మీ భర్తగారికి పూర్వం ఎన్నో సహాయాలు చేశాను.

సుభ:- అవును, ఆయనే ఆ మాట చెప్పారుగా!

పర:- దాన్ని ఆధారంగా చేసుకుని ఇప్పుడు నేనే ఆయన సహాయాన్ని కోరుతూ వచ్చాను.

సుభ:- ఏమన్నారు?

పర:- నేనే ఆయన సహాయాన్ని కోరుతున్నా నంటున్నాను.

సుభ:- అది కాదండీ, అందు కాయన ఏమన్నారంటున్నాను.

పర:- అదా మీరడిగింది! మొదట ఆయన ఒప్పుకోలేదు. నానుంచి ఆయన ఏ ప్రతిఫలమూ కోరకుండా ఒప్పుకుంటారను కున్నాను. కాని ఆయన ఓ షరతు పెట్టారు.

సుభ:- వ్యాపార విషయమైతే మీరు నాకు చెప్పి ప్రయోజనంలేదు.

పర:- డబ్బుకి ప్రతిఫలంగా దేన్నికోరినా-అది వ్యాపారమేనని మీరు ఒప్పు కుంటే-ఇదీ వ్యాపార విషయమే!

సుభ:- ఇంతకీ ఆయన చెయ్యమన్న దేవిఁటి?

పర:- ఇదంతా బిజినెస్సే గనుక నేను స్ట్రెయిట్‌గానే చెప్తాను. ఆయన ఓ మనిషిని కామ్‌గా చంపెయ్యమన్నారు.

సుభ:- ఛ! ఛ! ఆయన ఎన్నడూ అలాంటి పని చెయ్యమనరు.

పర:- అది మీ నమ్మకం!

సుభ:- మీ Joke నాకాట్టే నచ్చలేదు.

పర:- నెవర్ మైన్డ్! అయినా నేను చెప్పేది నిజం. మీ భర్తగారికొక బద్ధ శత్రువున్న మాట నిజం! ఆ శత్రువుని కాల్చి చంపమని నన్ను నియమించిన మాట నిజం! అందుకు నేను పాతికవేలు అడిగిన మాట నిజం!...మీ భర్తగారు సరేనన్నారు నేను అందుకు సిద్ధంగా ఉన్నాను. ఇన్ని విధాలుగా నిజమైన ఓ విషయాన్ని ఒప్పుకోడానికి మీకేవిఁటి అభ్యంతరం?

సుభ:- నిజమా? నమ్మలేకుండా ఉన్నాను. ఇదే నిజమైతే ఎంత ఘోరం! ఆయనకి ఇటువంటి ఆలోచన వస్తుందని కల్లోకూడా అనుకోలేదే!

పర:- ఆయనచేసే ప్రతిపనీ ముందుగా మీ కల్లోకి రావాల్సిన పనేముంది చెప్పండి! పోతే, ఇహ యీ పని నాచేతి మీదుగా జరగ బోతున్నా— అందుకు బాధ్యత మీ భర్తగారిదే! ఆయన్ని చిక్కులోనుంచి తప్పించాలంటే ఒక్కటే మార్గముంది—మీరు ఒప్పుకుంటే!

సుభ:- ఏవిఁటది?

పర:- ఏముంది, ఆ పాతికవేలు మీరు ఇచ్చేస్తే నా దారిన నేను కామ్‌గా వెళ్ళిపోతాను. ఏమంటారు?

సుభ:- నేనా!...పాతికవేలా?...క్షమించండి. ఇది నావల్ల అయే పనికాదు. పైగా ఆయన కిలాంటి ఆలోచన రాకుండా ప్రయత్నించటం నా విధి

గానీ, ఆయన పనిని మరో విధంగా నేను కాకుండా చేయటం మంచిది కాదు. ఆయన మనస్సు మార్చటానికి ప్రయత్నిస్తాను. నా వల్ల అయేదంతే.

పర:- అయితే మీ ప్రయత్నం నిష్ప్రయోజనం. ఒకవేళ ఆయన మనసు మారినా నాకేం లాభం? ఉత్త పుణ్యానికి నాకు పాతికవేలు యివ్వడుగదా! అంతా మంచి వాళ్ళుగా మారిపోతే నాపనేంగాను?

సుభ:- అందుకని మనుషుల మనసులో విషాన్ని నింపుతారా? ప్రాణాలతో చెలగాట మాడతారా?......

పర:- ఆగండి. పూర్తిగా చెప్పాక ఏకంగా ఒక్కసారే తిట్టేదురుగాని! ఆగండి.

సుభ:- ఏమిటి? ఇంకా ఉందా? ఇంకేం ఘోరాలు చెయ్యటానికి ఒప్పుకున్నారు?

పర:- మీరు మీ భర్తగారిని అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నారు గదా... అలాంటప్పుడు మీరు పర పురుషునితో......

సుభ:- షటప్!

పర:- యస్, మేడమ్!

సుభ:- మీరేం మాట్లాడుతున్నారో మీకే తెలీనట్లుంది.

పర:- ఎందుకు తెలీదు మేడమ్! మీరా పురుషునితో సినిమాలూ, షికార్లూ, పిక్‌నిక్‌లూ, పార్టీలూ—అన్నీ తెలుసు మేడమ్!

సుభ:- ఆఁ! ఎవరు చెప్పారు మీకు?

పర:- ఎవరో చెపితే ప్రచారం చెయ్యడం నా పని కాదు. మీ భర్తగారే!

సుభ:- అన్యాయం!

పర:- మీరు తప్పుదారి తొక్కినట్టు ఆయన మనస్పూర్తిగా నమ్ముతున్నారు.

సుభ:- అబద్ధం!

పర:- శ్రీ పతి కాని భార్యతో ఒక్క క్షణంకూడా గడపలేనన్నారు.

సుభ:- (కన్నీటితో) ఆ మాట పదేపదే అని నన్నెందుకు హింసిస్తారు? స్త్రీకి స్వాతంత్ర్యం యిచ్చామనీ, వాళ్ళలో కల్చర్ వృద్ధి చేస్తామనీ మీరు చెప్పే ఉపన్యాసాలన్నీ-ఆఖరికి భార్యని అనుమానించేందుకు ఉపయోగిస్తున్నారన్నమాట!

పర:- నేనా?

సుభ:- మీరంటే మీరుకాదు - మగవాళ్ళు. చదువుకున్న భార్య కావాలని పెళ్ళికి ముందు గొప్పకబుర్లు చెప్పి, పదిమందితో కలిసి మెలిసి తిరగమని ప్రోత్సహించి, తీరా ఆ భార్య ఏ మగాడితో మాట్లాడినా, కాలక్షేపానికి కలిసి తిరిగినా అనుమానించి, హింసించాలనే మీ ప్రవృత్తి ఏమిటో అర్థం కావటంలేదు. తిరగకపోతే పదిమందిలో నామర్దా అని గోల, తిరిగితే ఫలితం ఇది. తన భార్య ఇల్లు కదల కూడదు. తాను పరస్త్రీల వెంట తిరగొచ్చు. దాన్ని సమర్థించుకుంటూ తిరిగే వాళ్ళు కొందరు. అవును. శేఖర్‌తో చనువుగా ఉన్నాను. కలిసి తిరిగాను. తిరిగి ఇవాళ శేఖర్ తత్వం ఏమిటో, ఈయన తత్వం ఏమిటో తెలుసు కున్నాను. నిజానికిందులో నా దోషం ఏమీ లేకపోయినా నాది తప్పేనని ఒప్పుకుంటున్నాను. పెళ్ళయిన ఆడది పర పురుషుని వెంట తిరగటం ముమ్మాటికీ తప్పే! అది మన సంస్కృతికే విరుద్ధం. అందుకే నా మనసు ఎదురు తిరుగుతూండేది. అయినా నా యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఆయన తిరగమని ప్రోత్సహించారు... పరశురామ్‌గారు! ఇంతకీ ఆయన ఇదంతా రచ్చకీడ్చి నన్నేం చెయ్యదల్చు కున్నారట?

పర:- (పిస్టల్ తీసి బల్లమీద పడేసి) దీనితో మిమ్మల్ని కాల్చి చంపమన్నారు.

సుభ:- ఆఁ!

పర:- అవును, ఆయన నన్ను చెయ్యమన్న పని యిదే! మీ ప్రాణం విలువ పాతిక వేలు!

సుభ:- (గద్గద స్వరంతో - నిబ్బరంగా) పరశురామ్‌గారూ! స్త్రీ విలువ ఏమిటో ఈనాడే తెలుసుకున్నాను. ఈనాడు నా జీవితంలో రెండు

ప్రధాన సంఘటనలు జరిగాయి రెండూ గుణపాఠాలు నేర్పాయి. భర్తచేత అనుమానింపబడి, అవమానించబడ్డ స్త్రీకి కర్తవ్యం ఒకరు బోధించక్కర్లేదు. (అంటూ పిస్టల్ తీసుకుంటుంది.

పర:- ఆఁ! ఆఁ! (పిస్టల్ లాక్కొని) ఏమిటది? మంచివారే! మీరు ఆత్మ హత్య చేసుకుంటే నా గతేంకాను! మీరు ప్రాణాలు అలా నిర్ప్రయోజనంగా తీసేసుకుంటూంటే చూస్తూ ఊరుకునే దద్దమ్మను కానండీ! మీరు ఆత్మహత్య చేసుకుంటే నాకు చిల్లిగవ్వ దక్కదు నేను మిమ్మల్ని చంపాలి మీ భర్తగారు తృప్తిపడి, సంతోషపడి నా డబ్బు నాకు పారెయ్యాలి. అదీ జరగ వలసింది, కథ అర్థం తిప్పకండి మరి!

సుభ:- మీ ఇష్టం వచ్చినట్టే కానివ్వండి. చస్తూనైనా ఒకరికి ఉపకారం చేసి చస్తాను. చంపండి.

పర:- (పిస్టల్ గురిపెట్టి - నిదానించి.) పోనీ సుభద్రగారూ! ఓ పని చెయ్యరాదూ!

సుభ:- ఇక నా వల్ల ఏమీ కాదు - చంపండి!

పర:- అది కాదండి. వృథాగా ప్రాణాలెందుకు తీసుకుంటారు? ఆ పాతిక వేలూ మీరే పారేస్తే మీదారిని మిమ్మల్ని వదిలేసి, నా దారిని నేను పోతాను.

సుభ:- దయతలచి నన్ను విడిచి పెడతారన్నమాట! పరశురామ్‌గారూ! భర్తచేత శీలాన్ని శంకించబడి, తిరస్కరించబడ్డ ఆడది పర పురుషుని దగ్గర ప్రాణాలు యాచించదు. ఇది గుర్తుంచుకోండి.

పర:- అవకాశాన్ని వదులుకోకండి, మీ నగానట్రా ఇవ్వచ్చు - Cash లేకపోతే!

సుభ:- మీ వల్ల కాకపోతే ఆ పిస్టల్ ఇలా పడెయ్యండి... నన్ను నరక యాతన పెట్టకండి - (ఏడుస్తుంది.)

పర:- నావల్ల కాకపోవడమా! Shame Shame!... పదండి తోటలోకి. తీరా కాల్చాక మిమ్మల్ని అంతవరకూ మోసుకు పోవటం నా వల్ల కాదు. పదండి.

(సుభద్ర వెనుతిరిగి లోనికి నడుస్తుంది పరశురామ్ అనుసరిస్తాడు. Pause. వీధి తలుపు చప్పుడౌతుంది. లోపలనుంచి పరశురామ్ వచ్చి తలుపు తీస్తాడు. వల్లభరావు - చేతిలో ప్లాస్టిక్ Bag తో వస్తాడు. ఆందోళనగా గదిలో అటూ యిటూ చూస్తాడు. తరువాత పరశురామ్ ముఖంలోకిచూసి, చూడలేక తల తిప్పుకుంటాడు.)

వల్ల.- ఏమైంది? ఏం చేశావ్?

పర:- ఇష్! (అని కూర్చోమని సైగచేసి గబగబా లోనికి వెడతాడు.)

వల్ల:- (ఆ గది గుమ్మం దగ్గరికి వెడతాడు. తలుపులు మూసి ఉంటాయి. అతని ముఖం క్రమంగా మారిపోతుంది భయంకరంగా, వికృతంగా తయారవుతుంది...ఏదో అనుమానం! వింత ఊహ!... అతని ఊహలో పరశురామ్, సుభద్రలు చెట్టపట్టాలు వేసుకొని గిఱ్ఱున తిరుగుతుంటారు. స్టేజీమీద లైట్సు ఆరిపోతాయి. అతని ఊహకి రూపకల్పన జరుగుతుంది. ముఖం మీద పడిన వెలుగలో అత నెంతో వికృతంగా కనిపిస్తుంటాడు. అంతలో తలుపు తట్టిన చప్పు డౌతుంది. అతని ఊహ చెదిరి పోతుంది. లైట్సు వెలుగుతాయి. అతను రొప్పుతుంటాడు. నిదానించి, తన్ను తాను సర్దుకొని వెళ్ళి తలుపు తీస్తాడు)

పత్రికా విలేఖరి:- (వస్తాడు.) నమస్కారమండి.

వల్ల:- ఎవరు నువ్వు?

ప. వి:- నేను 'హంతకుడు' అనే పక్ష పత్రికకు ప్రత్యేక విలేఖరినండి.

వల్ల:- ఆ! ఏం కావాలి?

ప. వి:- మీ రెందుకలా ఖంగారు పడ్డారు?

వల్ల:- అది నీ కనవసరం. ఎందుకొచ్చావు?

ప. వి:- మీ ఇంట్లో ఏదైనా హత్య జరిగిందా?

వల్ల:- హత్యా?

ప. వి:- అదుగో, మళ్ళీ ఖంగారు పడ్డారు!

వల్లః— పడ్తానా? పడితే పడతాను. నీ కెందుకు?

ప. వి :- పడండి, పడండి. ఇంతకీ ఇక్కడ హత్య జరిగిందా, లేదా?

వల్ల :- ఏవిఁటయ్యా నీ మాటలు ? 'ఇచ్చట హత్యలు చేయబడును' అని మా వాకిట్లో బోర్డు ఉన్నట్లు మాట్లాడతావేవిఁటి ?

ప. వి :- మీరు బోర్డు కట్టుకున్నంత కరెక్టుగా మాకు కబురు అందిందండి.

వల్ల :- ఎవడా చెప్పినవాడు ?

ప. వి : ఎవడో పౌరధర్మం తెలిసిన పెద్ద మనిషి !

వల్ల : ఉప్హా ! మరి నీ పౌరధర్మం ఎక్కడ తగం బెట్టావ్ ? వేళకాని వేళ తిని పరుగెత్తుకొచ్చి 'ఇక్కడ హత్యజరిగిందా?' అంటావ్?

ప. వి:- నాకేం పని లేదుటండీ పరుగెత్తుకు రావటానికి? ఎవరో పెద్ద మనిషి పనివేళా ఫోన్‌చేసి 'ఫలానా వీధిలో ఫలానా నెంబరుగల ఫోనుగల యింట్లో ఇప్పుడే హత్య జరిగింది- పరిగెత్తండి' అని చెప్పారు. మా వృత్తి మాది! ఎక్కడ ఏ హత్య జరిగినా పోలీసుల కంటే ముందుగా మాకు కబురు వస్తుంది- వాళ్ళకంటే ముందే మేం తయారవుతాం. ఇది ఆచారం!

వల్లః- వీటికూ్కడా ఆచారాలు తగలడ్డాయ్?

ప. వి:- అయ్యో! ఉండవటండీ మరి- ఆచారాలు! అసలు నన్నడిగితే- ఇటు వంటి బలవంతపు మరణాలకే కాక, బలవంతపు జననాలకు కూడా విధిగా ముందుగా మా వంటి పత్రికా విలేఖరులకు ఫోన్ చెయ్యాలనే రూలు ఉండాలంటాను, ఏవంటారు?

వల్లః- ఇక దయచెయ్యమంటాను.

ప. వి:- వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను. మీరేదో ఖంగారు పడుతూనే ఉన్నారు. సo, ఇక్కడొక హత్య తప్పని సరిగా జరిగుండాలి!

వల్లః- షటప్! (విసుగ్గా)

ప. వి:- నాలుగు వివరాలూ తెలుసుకుని చివరికి షటప్! ఇప్పుడే ఎలా?

వల్లః- నాయనా! నీ కిక్కడ వివరాలేమీ దొరకవు. దయచెయ్యి.

ప వి:- మీ ఇంటో మొత్తం members ఎంత మందండి?

వల్లి:- లక్షా తొంభైమంది! (విసుగ్గా)

ప. వి:- అయితే వెంటనే లెక్క పెట్టించండి- లక్షా ఎనభై తొమ్మిదిమంది మాత్రమే ఉంటారు.

వల్లి:- మొత్తానికి మీ జాతిబుద్ధి పోనిచ్చుకున్నావుగాదు.

ప వి:- ఏం జాతి? ఏం బుద్ధి?

వల్లి:- విలేఖరుల జాతి! మెడ పట్టుకు గెంటితేగాని పోనిబుద్ధి!

ప. వి :- మేం అలాంటి పట్టింపులు పెట్టుకుంటే ఎలా చెప్పండి. మాక్కావల సింది ఇన్ఫర్మేషన్ - కేవలం హెడ్ లైన్కి పనికివచ్చే ఇన్ఫర్ మేషన్! That's all! ఇంతకీ హత్య జరిగి ఎంత సేపయిం దన్నారు?

వల్లి:- మరీ యింత అభిమానంలేని బ్రతుకైతే ఎలాగయ్యా!

ప వి:- Thank you! ఆ! చంపబడ్డది స్త్రీయా! పురుషుడా?

వల్లి:- నీ ప్రశ్నలంతటితో కట్టిపెట్టి నే నడిగే దానికి జవాబు చెప్పు.

ప వి:- Yes ready sir!

వల్లి:- ఎవరు నీకు ఫోన్ చేసింది?

ప. వి:- తెలియదు.

వల్లి:- ఎక్కణ్ణుంచి ఫోన్ చేశారు?

ప. వి:- The same answer please!

వల్లి:- హత్య ఎక్కడ జరిగిందన్నారు?

ప. వి:- ఈ వీధిలోనే!

వల్లి:- అంటే రోడ్డుమీదా?

ప. వి:- No, no! పక్కని బిల్డింగ్లో!

వల్లి:- దాని door number?

ప. వి:- తెలియదు.

వల్లి:- మరి యిక్కడికెలా వచ్చావ్?

ప. వి:- బిల్డింగ్ గుర్తులూ, ఫోన్ నంబరూ చెప్పారు.

వల్లి:- ఎంత ఫోన్ నంబర్?

ప. వి:- ఫోర్, ఫోర్, సిక్స్.

వల్లి:- Oh! That's all right. Please get out; మా ఫోన్ నంబర్ ఫోర్, సిక్స్, ఫోర్ you see! Please get out!

ప. వి:- ఆ! నిజం! మీ ఫోన్ నంబర్ ఫోర్, సిక్స్, ఫోరా?

వల్లి:- Get out I say?

ప. వి:- సారీ సార్! వెరీ సారీ! ఇంతకీ ఫోర్, ఫోర్, సిక్స్ ఎవరి ఫోన్ నంబరండి?

వల్లి:- ఆ వివరం కూడా నేనే చెప్పాలి? ప్రక్క బిల్డింగ్ కూడా మా బిల్డింగ్ లాగే ఉంటుంది. వాళ్ళ ఫోన్ నంబర్ ఫోర్, ఫోర్, సిక్స్! వెళ్ళిరా!

ప. వి:- Thank you sir! Thank you (వెనుతిరిగి వెళ్ళబోతుండగా పిస్టల్ పేలిన శబ్దం వినిపిస్తుంది.)

ప. వి:- అదుగో సార్! హత్య జరిగింది!

వల్లి:- (ముఖం పాలిపోతుంది. భీతితో వణుకు తున్నాడు. ముఖాన్ని మరో ప్రక్కకు తిప్పుకుని నీరసంగా కళ్లు మూసుకున్నాడు. పెదవులు అదురుతున్నాయి.)

ప. వి:- పదండి సార్! చూద్దాం. హంతకుణ్ణికూడా పట్టుకోగలిగితే మన పేరు షెర్లాక్ హోమ్స్ పక్కన నిలబడుతుంది. హ్యారీయట్ ప్లీజ్! హ్యారీయట్!

వల్లి:- (మెల్లిగా) హత్య...జరిగింది!

ప వి:- అందుకే పదండి మరీ!

వల్ల:- నేను రాను.

ప. వి:- మీరు రాకపోతే నాకు తప్పుతుందా? (అంటూ లోపలకు వెడుతున్నాడు.)

వల్ల:- ఆటెక్కడికి?

ప. వి:- మరెటండీ?

వల్ల:- హత్య జరిగింది-మా యింట్లోకాదు. ప్రక్కబిల్డింగ్‌లో! ఫోర్, ఫోర్, సిక్స్ నెంబరు ఫోను గల ఇంట్లో!

ప. వి:- Oh! what a wonder! ఎంత కరెక్టుగా చెప్పి జరిగిందీ హత్య!...వస్తానండి. విషయం తెలుసుకునీ నాలుగు ఫుటోలు తీసుకుని మళ్ళీ మీ దర్శనం చేసుకుంటాను. (Exit)

వల్ల:- (గభాలున తలుపు వేసివచ్చి ఖంగారుగా లోపలి గుమ్మందగ్గరికి నడుస్తాడు.)

పర:- (తలుపు తీసుకుని ఇవతలకు వచ్చి, తలుపు గొళ్ళెం పెట్టి, ముఖం మీద పడ్డ జుట్టుని వెనక్కు తోసుకుంటాడు. చేతిలోఉన్న పిస్టల్ బారల్‌లోకి చూస్తూ) వల్లభరావుగారూ,...నా పని నెరవేర్చాను. ఏదీ నా bag!

వల్ల:- ......చంపేశావా, పరశురామ్!...చంపేశావా? ఆ అనుబంధం ఇవాళతో తీర్చిపారేశావా? పరశురామ్, తీర్చిపారేశావా? ... అయిపోయింది. అంతా అయిపోయింది. ... సుభద్రా! సుభద్రా!...నీకెందుకు పుట్టిందీ పాడుబుద్ధి? ... పచ్చని బ్రతుకులో నిప్పులు పోసుకుపోయావా సుభద్రా!... సుభద్రా!...(ఏడుస్తాడు)

పర:- (వల్లభరావువంక సానుభూతిగాచూసి కరుగ్గా) వల్లభరావుగారూ! చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభం లేదు. రాలినపూలు మళ్ళీ రెమ్మకు అతుకోవు. ఆ! డబ్బు కరెక్టుగా పెట్టారుగా! (బల్లమీదున్న bag తీసుకుని)

వల్ల:- (తన ధోరణిలో) సుభద్రా!...సుభద్రా! ...పోతాడు.)



పర:- (అతనికి అడ్డుగా నిల్చుని) చూస్తారా పల్లభరావుగారూ! రండి! చూడండి!... మధుర స్వప్నంలాంటి జీవితానికి భయంకరమైన మృత్యువే ముగింపు. ఆ మృత్యువు కొందర్ని మరింత భయంకరంగా ఆవరిస్తుంది. నన్నూ, నా చేతిలోని ఆయుధాన్నీ చూసి ఆమె భయపడి పారిపోలేదు. నిబ్బరంగా నిల్చున్న ఆమె గుండెలకు గురి పెట్టి ఒకే ఒక్కసారి కాల్చాను. ఫౌంటెన్‌లోంచి రంగునీరు ఎగజిమ్మినట్లు ఆమె గుండెల్లోంచి గోరు వెచ్చని నెత్తురు ఎగ జిమ్మింది. అంతే! దభాలున కిందపడి, ఈ ప్రపంచంలోనుంచి నిష్క్రమించటానికి రెండు మూడు క్షణాలు నరక యాతన అనుభ వించింది. మరుక్షణంలో సుఖ దుఃఖాలకు అతీతమైన జగత్తులో అడుగుపెట్టింది! చూస్తారా, రండి.

వల్లి:- ఆ!! చూశ్కేను.

పర:- చూస్తారా, రండి! పరువూ మర్యాదా లేకుండా పదిమంది మగాళ్ళతో చెట్టపట్టాలు వేసుకుని తిరిగి, మీ పరువు ప్రతిష్ఠల్ని మంట గలిపిన నరరూప రాక్షసి రక్తపు మడుగులో పడి గిలగిల తన్నుకుని శాశ్వత నిద్రపోతోంది—చూస్తారా, రండి.

వల్లి:- చూశ్కేను పరశురామ్! చూశ్కేను.

పర:- పదిమందినీ తన వాలు చూపులతో మత్తెక్కించిన వంచకి కనుగుడ్లు వెళ్ళుకొచ్చి వికృతమైన చావు చచ్చింది—చూస్తారా, రండి!

వల్లి:- చూశ్కేను, పరశురామ్! చూశ్కేను.

పర:- మీరు చూడలేరనే తలుపు వేశాను మీకు చూడాలని ఉండవచ్చు. అయినా చూశ్కేరు.

వల్లి:- చూడాలనికూడా లేదు పరశురామ్! ఆదరించి, నెత్తిని పెట్టుకుని గౌరవించినందుకు నన్నే మోసగించిన ఆ రాక్షసిని చూడాలని లేదు. నన్ను ఎవరూ మోసం చెయ్యలేదు. నే నెవర్నీ చంపలేదు, అంతే! ఏమీ జరగలేదు, ఏదైనా జరిగితే అది నా ఆనందంకోసం జరిగింది. ఇప్పుడు నాకు ఆనందంగా ఉంది (నవ్వూ, ఏడుపూ కలిసిన స్వరంతో) నా మనస్సు శాంతంగా ఉంది. ఎన్నడూ లేనంత

హాయిగా ఉంది. (కృత్రిమంగా వికృతంగా నవ్వుతాడు) హాయిగా ఉంది.

పర.- అంతే. అంతే! ఏమీ జరగలేదు. మీ రలా శాంతంగా కూర్చోండి.

పల్ల:- శాంతంగా కూర్చుంటాను. ఇంకొక్క పనిచేసి ఇంకా శాంతంగా కూర్చుంటాను. వాణ్ణి గుమ్మంలోకి రాకుండా చేసి, గుండెలమీద చెయ్యి వేసుకుని నిద్రపోతాను.

పర:- వాడెవడండి?

పల్ల:- ఇంకెవరు? రాజశేఖరం!

పర:- ఓ! మీ పార్ట్నరా? ఆయనేనా ఈ కథకి మూల పురుషుడు!

(తలుపు చప్పుడౌతుంది.)

పల్ల:- వాడే! వాడే నా సంసారానికి చిచ్చుపెట్టింది.

పర:- అదేమన్నమాట లెండి. మన బంగారం మంచిదైతే వాళ్ళేం చేస్తారు?

పల్ల:- అవును పరశురామ్!...అంతే! (తలుపు చప్పుడు ఆలకించి కొంచెం కంగారుగా) ఆ! అది సరే!...ఆ గదిలో...అలాగే ఉంచేశావ్!... ఎలా?

పర:- అదంతా నేను చూసుకుంటా లెండి. మీరు మాత్రం కాస్త నిబ్బరంగా ఉండాలి, మీ ఖంగారు ఎవరైనా చూస్తే......

పల్ల:- ఖంగారా? లేదు ... ఏమీలేదు ... నాకేం భయంలేదు. అసలు నేనే ... నా చేతులతో ఆ పని చేసేవాణ్ణి...కానీ...కానీ...

పర:- అవునవును! సెంటిమెంటల్ అబ్జక్షన్! నాకు తెలుసులెండి. (తలుపు చప్పుడు. పరశురామ్ వెళ్ళి తలుపు తీస్తాడు.

రాజ:- (వస్తాడు. ఇందాకటి చురుకుదనం కనిపించదు.)

పల్ల:- రా, శేఖరం! ఇతనిపేరు పరశురామ్! నాకు వ్యాపార విషయాల్లో చాలా సార్లు సహాయం చేశాడు. మంచి మేధావి...

పర:- చాల్లెండి. మీరా మాత్రం చెపితే మిగతాదంతా నేను చెప్పుకుంటాను.

రాజ:- మిమ్మల్నెక్కడో చూసినట్టుందండి. గుర్తురావటంలేదు.

పర.- నాకూ అలాగే అనిపిస్తోంది. అయితే మనం కలుసుకోకపోయినా మన ఫోటోలు ఎక్కడైనా కలుసుకున్నాయేమో!

వల్ల.- అదేవిఁటి పరశురామ్! ఇందాక నా పార్టనర్ ఎక్కడ ఉంటున్నాడని అడిగావుగా! ఇతనే రాజశేఖరం!

పర:- ఓ!...ఓహో!...మీరేనా? చాలా సంతోషం! చాలా సంతోషం!

రాజ:- నా గురించి మీ రెందు కడిగారు?

పర:- ఈయనకో పార్టనర్ ఉన్నాడని తెలుసు. అందుకే అడిగాను.

వల్ల:- మీ పరిచయం బాగానేఉంది. మాట్లాడుతూండండి, ఇప్పుడే వస్తా. (మధ్య గదిలోకి వెడతాడు.)

పర:- ఆ! మీకు పిల్లలెంత మందండి?

రాజ:- జనాభా లెక్కల కొచ్చారేమిఁటి?

పర:- అబ్బే!...చెప్పటానికి అభ్యంతరమా?

రాజ:- పిల్లలు లేరండీ!

పర:- కొంపతీసి మీరు బ్రహ్మచారులా?

రాజ:- పిల్లలులేని వాళ్ళంతా బ్రహ్మచారులైతే నేనూ బ్రహ్మచారినే!

పర:- అయితే పెళ్ళయిందన్నమాట! అత్తవారు ఉన్నవారేనా?

రాజ:- మీరు ఏవిఁటేవిఁటో అడుగుతున్నారు!

పర:- ఓ మనిషిని చూడగానే నాలో కొన్ని ఊహలు రేగుతాయి. అవెంత వరకూ నిజమో నాకు నేను నిర్ణయించుకోటం అలవాటు.

రాజ:- బాగుంది...మా అత్తవారు అంతగా ఉన్నవారు కాదులెండి.

పర:- మీ బిజినెస్ బాగా సాగుతోందా ?

రాజ:- ఏదో ఫరవాలేదులెండి, ఎలాగైనా వల్లభంతో విడిపోయాక నే నాట్టే సంపాదించలేదు.

పర.- అవసరానికి అడ్డుపడేవారేనా మీ అత్తగారు?

రాజ:- (వెంటనే జంకి-నిదానించి) నన్నిన్ని ప్రశ్నలు అడిగారుగానీ, మీరేం చేస్తుంటారో, ఎక్కడుంటారో ఒక్క ముక్కయినా చెప్పారూ?

పర:- చెప్పనా?

రాజ:- చెప్పమనేగా!

పర:- మీరు ఖంగారుపడతారేమోనని!

రాజ:- ఎందుకూ?

పర:- నేను ప్రొఫెషనల్ మర్డరర్‌ని!

రాజ:- ఆఁ!

పర:- అవును. నేను కోరిన డబ్బు ఇస్తే, మీరు కోరిన వ్యక్తిని...ఉష్!

రాజ:- Is it?

పర:- Yes yes!

రాజ:- మీరు జోక్ చేస్తున్నారు. నేను నమ్మను.

పర:- పరీక్షించి చూడండి.

రాజ:- ఎలా?

పర:- ఓ పాతిక వేలు ఇలా పారేసి ఓ మనిషి పేరు చెప్పండి చాలు!

రాజ:- What a hell!

పర:- (నవ్వి) ఖంగారు పడకండి. (ఫ్లాస్కులోని కాఫీ రెండు గ్లాసులలో పోస్తున్నాడు) అది నా వృత్తి. మీరు సిద్ధమేనా?

రాజ:- భలేవారే!...నాకు శత్రువు లెవరూ లేరు.

పర:- అంతా మొదట ఇలాగే అజాత శత్రువుల్లాగా మాట్లాడతారు - నా ముందు!...ఆ! కాఫీ తీసుకోండి. (అందిస్తాడు)

రాజ:- (తాగబోయి ఆగి, గ్లాసులోకి అనుమానంగా చూస్తాడు) కొంపదీసి ఎవరైనా మీకో పాతిక వేలిచ్చి నా పేరు చెప్పలేదు గదా!

పర:- అంటే మీకు శత్రువున్నారన్న మాట!

రాజు:- బోల్తా కొట్టించారు మొత్తానికి!

పర:- మొదట జుట్టు అందించి, తరవాత గుట్టు అందుకోటం నా అలవాటు! చెప్పండి. ఎవరా శత్రువు? మీరెవరినైనా ప్రేమించారా?

రాజు:- ఆహా!

పర:- ఆరు సంవత్సరాలు అహోరాత్రాలూ ప్రతిఫలంలేకుండా ప్రేమించారా?

రాజు:- అయితే మీకు నా పరిస్థితి అర్థంకాదు.

పర:- పరిస్థితుల్ని అర్థంచేసుకోడంలో పరశురామ్ తరవాతే ఎవరైనా! చెప్పండి, ఫాలో అవుతాను.

రాజు:- ఆరు సంవత్సరాలు నిస్వార్థంగా ఆరాధించాను. రాత్రి కలలు, పగటి కలలు కన్నాను. కన్ను మూసినా తెరిచినా ఆమె సుందరవిగ్రహాన్నే చూశాను. ఆమె తృప్తి కోసం, ఆనందం కోసం ఎన్నో చేశాను, ఎన్నెన్ని ప్రదేశాలలో తిప్పాను. ఎంతో ఖర్చు పెట్టాను. ఏ మహా భక్తుడూ ఏమాత్రం ప్రతిఫలాన్ని ఆశించకుండా నాలాగా ఏ దేవుణ్ణీ ఆరాధించి ఉండడు-పూజించి ఉండడు. ఆమె నోటిలోనుంచి మాట రాకపూర్వమే ఆమెకేం కావాలో గ్రహించాను. ఆమె కనుసన్నల్లో మెలిగాను. ఆమె మౌనం నన్నెంతో ముగ్ధుణ్ని చేసింది? ఆమె చిరునవ్వులు నాలో ఎన్నో ఆశలు రేకెత్తించాయి ... నా ఆరాధనకి రాళ్లుకూడా కరగవలసింది...ఏమంటారు మీరు ?

పర:- Sure, sure !

రాజు:- అవునా, ఇవాళ జరిగిన సంఘటన చెపుతాను వినండి. ఇక్కడికి నాలుగు మేడలకు అవతలి మేడలో ఇవాళొక పెద్ద పార్టీ జరిగింది. అంతా ఇంగ్లీష్ మోడల్‌లో ఏర్పాటు చేశారు. ఆ వాతావరణం ఉత్సాహకరంగా ఉంది. నాలో కూడా ఉత్సాహం పొంగి కట్టలు తెంచుకున్నది! నా ఎదుట ఆమె కూర్చుంది. ఆమె నవ్వులు నాతో

దోబూచులాడాయి. ఆమె కన్నులు నాలో ఆవేశాన్ని రగిలించాయి. ఆమె మాటలూ, చేష్టలూ-ప్రతి ఒక్కటీ నన్నామెకు సన్నిహితుణ్ణి చేశాయి. పిచ్చివాణ్ణి చేశాయి ఆ సందర్భంలో, ఆ ఆంగ్ల సంగీతం కలిగించిన మత్తులో ఆమెను దగ్గరకు తీసుకున్నాను ఆమె ముఖంలో ముఖం ఉంచాను...అంతే. అంతే. నా గూబ పగిలిపోయింది. పార్టీ ఆగిపోయింది! ప్రపంచం గిర్రున తిరిగిపోయింది. అంతా నిర్ఘాంత పోయి చూస్తున్నారు. లాయర్స్, డాక్టర్స్, high rank officials, పెద్ద పెద్ద వ్యాపారస్తులూ, ఉన్నతభావాలుగల వ్యక్తినిగా నన్ను మెచ్చుకుని గౌరవించేవాళ్ళు ఎందరో ఉన్నారు. అంతా నాకు కలిగిన అవమానాన్ని కళ్ళారా చూశారు. ఆ చూపులు నేను భరించలేక పోయాను. నా ప్రాణాలూ, నా వ్యక్తిత్వం, నా పరువు ప్రతిష్టలూ, నా ఉన్నత భావాలూ గిల్లార్చుకుపోయాయి. ఏం చెయ్యను? ఏం చెయ్యాలసలు?...నిలూనా కూలిపోయాను. రక్తం గడ్డ కట్టుకు పోయింది. నా ఆరాధన అంతా వ్యర్థమైపోయి, నా జీవిత వినాశనానికి దారి తీసింది. అది...అది స్త్రీయేనా? ... నా పట్ల ఒక ఆడది చూపిన యీ మర్యాదకి ప్రతిక్రియగా నేనేం చెయ్యాలి? ఆమెను ఏం చెయ్యాలి? మీరైతే ఏం చేస్తారు? ఇంత ఘోరంగా అవమానించిన ఆడదాన్ని మీరైతే ఏంచేస్తారు?

పర:- నిలూనా చీల్చేస్తాను.

రాజు:- అదే అనిపించింది. కానీ...కానీ-

పర:- కానీ మీరాపని చెయ్యలేరు. మీ చేతులా పనికి ఒప్పుకోవు!

రాజు:- అవును. అయినా ప్రతీకారం చేసి తీరతాను.

పర:- మీరేం చేస్తారు? మీవల్ల ఏమౌతుంది? దాని కెంత గుండె నిబ్బరం, ఎంత ఆత్మశక్తి కావాలి! అవన్నీ ఈ పరశురామ్‌కి ఉన్నాయి!

రాజు:- ఆ!

పర:- ఆ! ఓ పాతిక వేలేగా - పారెయ్యండి. పది నిమిషాల్లో పని ముగించేస్తాను. సై యేనా?

రాజు:- (ఉద్రేకంతో ఆలోచిస్తూంటాడు.)

పర:- ఆలోచించకండి. ఆలోచిస్తే అన్నంకూడా ముట్టలేం. గొప్పవాళ్ళంతా గొప్పగొప్ప పనులన్నీ ఆవేశంలోనే చేసేశారు,

రాజు:- (జేబులోనుంచి ఓ నెక్లెస్ తీసి) ఇది...ఇది ఆమెకోసం తెచ్చిన ప్రేమకానుక! ఇదిప్పుడామె ప్రాణాలు తియ్యటానికి ఉపయోగపడు తోంది...మీ దగ్గిరుంచండి.

పర:- అక్కర్లేదు. మీ దగ్గరే ఉంచండి. ఫరవాలేదు-అడ్వాన్సు ఇవ్వక పోయినా!

రాజు:- అయితే పని పూర్తిచెయ్యండి-పది నిమిషాల్లో డబ్బు తెస్తాను. (అంటూ వీధిలోకి వెళ్ళబోయి వెనుదిరిగి) ఈ సంగతి మరో మాన వుడికి తెలియకూడదు. అలా చెయ్యగలిగితేనే చెయ్యండి.

పర:- ఆ జాగ్రత్తలన్నీ నేను ఉగ్గుపాలతో తాగిన విద్యలు...ఆ!...పేరు.

రాజు:- ఓ!...(అంటూ జేబులోనుంచి ఓ కాగితాన్ని తీసి దానిమీద నాలుగు అక్షరాలు గిలికి పరశురామ్‌కి యిస్తూంటగా)

వల్లి:- (వస్తాడు)

రాజు:- వస్తా!...వస్తా వల్లభం!

వల్లి:- అప్పుడే వెళ్ళిపోతున్నావేం?

రాజు:- మళ్ళీవస్తా (EXIT)

వల్లి:- ఏవిఁటి వాడితో మంతనాలాడుతున్నావ్?

పర:- శత్రువులేని మనిషి నేను. నాలాంటి మనిషీ లేడు. కనుక మనుషు లందరికీ నాతో పనుంటుంది. అందరి రహస్యాలూ నాతో చెప్పు కుంటారు. వాళ్ళు చెప్పేదంతా ఓర్పుతో నేను వింటాను, అందువల్ల నేను అందరికీ ఆప్తుణ్ణి! నిజంగా నాలాగా ఏ ప్రజానాయకుడు డైరెక్టుగా ప్రజాసేవ చేస్తున్నాడో చెప్పండి. చూద్దాం!

వల్లి:- ఏవిఁటి పరశురామ్! వాడి దగ్గరకూడా డబ్బు తీసుకున్నావా?

పర:- తీసుకోలేదు. తీసుకోబోతున్నాను.

వల్లి:- ఆ!...అయితే వాడి శత్రువెవరో నాకు తెలుసు...నాకు తెలుసు!...

పర:- ఎవరు?

వల్లి:- నేనే!...నేనే వాడి శత్రువుని! నేనే వాడికీ వాడి ప్రియురాలికీ మధ్య రాక్షసుడల్లే నిల్చున్నాను. నేనే వాళ్ళ స్వేచ్ఛా విహారాలకు అడ్డు తగులుతున్నాను. అందుకే, అందుకే నా అడ్డు తొలగించుకుంటే వాళ్ళకి సంపూర్ణ స్వేచ్ఛ లభిస్తుంది. వాళ్ళిద్దరూ చిలకాగోరింకాల్లా కిల కిల్లాడుతూ ఉండచ్చు! (వెఱ్ఱిగా నవ్వుతాడు.) నా అడ్డు తొలగించు కుంటే—చీమలు నూకలు పోగుచేసినట్టు నేను కూడబెట్టిన ఆస్తినంతా ఇదరూ అనుభవించవచ్చు! (మళ్ళీ వెఱ్ఱినవ్వు) అంతేగా పరశురామ్! నాకు తెలుసు!...నువ్వు చెప్పక్కర్లేదు...అనుభవించమను! స్వేచ్ఛా విహారం చెయ్యమను! ఆ ప్రేతంతో బాల్‌రూమ్ డాన్స్ చెయ్యమను యిఱా! దర్టీ రోగ్స్!

పర:- అంతా అయిపోయాక ఎందుకలా ఆవేశపడతారు వల్లభరావుగారూ! అతను చంపమన్నది మిమ్మల్ని అవునో, కాదో నాకు తెలీదు. ఇంతలో తొందరపడతారెందుకు? చీటీరాసి యిచ్చి పోయాడు. నేను కూడా చూళ్ళేదు. (అంటూ చీటీ యిస్తాడు.)

వల్లి:- (చూస్తూ) ఆ! ఏమిటిది?

పర:- ఏముంది, మీ భార్యను చంపమన్నాడు, అంతేగా!

వల్లి:- సుభద్రనా?...ఎందుకు?...ఎందుకు?

పర:- ప్రతీకారం!

వల్లి:- (ఆయాసపడుతూ) ఎందుకూ?

పర:- అవమానించినందుకు ప్రతీకారం!

వల్లి.- సుభద్ర అవమానించిందా? శేఖరాన్ని అవమానించిందా? ఎందుకు?

పర:- నిప్పుని తాకితే కాలకుండా ఉంటుందా, వల్లభరావుగారూ?

వల్లః- నిప్పు!...నిప్పు!...ఎవరు?...సుభద్రా?

పరః- అవును తేలిగ్గా నిప్పు అంటే చాలదండీ... అది పవిత్రాగ్ని !

వల్లః- పవిత్రాగ్ని! నేను నమ్మను!

పరః- నమ్మను, నమ్మనని మీరెంత గొంతు చించుకుని అరిచినా నిజం నిజం కాకపోదు, వల్లభరావుగారూ! అక్కడ జరుగుతున్న పార్టీలో మీరు నిజంగా నమ్మలేని అద్భుత సంఘటన జరిగింది-ఇంతకు ముందే! ఆమె దేహువుని అపార్థం చేసుకున్న శేఖరం కల్మషంతో ఆమెని సమీపించారు. విషం పూసుకున్న చేతులతో ఆమెను తాకారు. అప్పుడేం జరిగిందో ఊహించ గలరా? పరస్త్రీల వెంట పిచ్చి కుక్కలా తిరిగినందుకు గూబ గుయ్యిమనిపించి పదిమందిలో శాశ్వత ముద్రవేసి, తన శీలం ఎటువంటిదో చాటుకుంది.

వల్లః- నిజమా?

పరః- మీరు నమ్మనివన్నీ నిజాలు కాకుండా పోవండి! మీ దృష్టిలో పది మందితో మెలగటం చేతకాని స్త్రీ బ్రూట్! ఆ బ్రూట్ అంటే మీకు మంట! ఇది ఒకనాటి మాట! అప్పట్లో ఆ అభిప్రాయంతోనే మీ భార్యని పదిమందికి పరిచయం చేశారు. సోషల్‌గా ఉండమని ప్రోత్సహించారు. ఉన్నత భావాలు గల వాడనీ, ఇంద్రుడనీ, చంద్రుడనీ, మీచేతా ఈ సొసైటీచేతా పొగడ్తలు అందుకుంటున్న శేఖరంతో చనువుగా ఉంది మీ భార్య! అది చూసేసరికి మీ మనస్సులో విషం పుట్టుకొచ్చింది. ఆ పాపం యీ నాటికి బద్దలై ఆమె చస్తేనేగానీ శాంతి లేదనుకునే వరకూ వచ్చింది. మీ కోరిక నెరవేర్చాను. నా అవసరం నాదీ తీరుతుంది! ఇక ఇప్పుడామె పవిత్రాగ్ని అయినా-సాక్షాత్తు ఆ సీతామహాదేవి అయినా చేసేదేమీ లేదు. అనుభవించండి.

వల్లః- పరశురామ్!... ఆమెను చంపటానికి ముందే నీకీ సంగతి తెలిసిందా?

పరః- ఆ!

వల్లి:- మరయితే ఎందుకు చంపావ్ ?

పర:- మరి నా డబ్బో ?

వల్లి:- డబ్బు ! డబ్బుకోసమని నిర్దోషని తెలిసుండి చంపుతావా! ఆమె తప్పుచేసిందని నేను మాయలో పడితే నిజం తెలిసినవాడివి నాకు చెప్పకుండా అమాయకురాల్ని నిలువునా కాల్చి చంపుతావా ? ... సుభద్రా!

పర:- మళ్ళీ మీరు పిచ్చిని పడుతున్నారు. ఆమె దోషి అయితే నాకేం ? నిర్దోషి అయితే నాకేం? నా వృత్తి నాది.

వల్లి:- పరశురామ్! అసలు నువ్వనే వాడివే కొంపలో అడుగు పెట్టకుంటా ఉంటే నాకీ సాహసం ఉండేది కాదు. ఈ గంటా గడిస్తే నిజం తెలుసుకుని నా సుభద్రని క్షమాపణ కోరేవాణ్ణి!...దీని కంతకీ కారణం నువ్వు, పరశురామ్ నువ్వు!

(అతని చొక్కా పట్టుకుని గుంజుతున్నాడు.)

పర:- (నిర్లిప్తంగా సిగరెట్ కాల్చుకుంటూ) సరే. మీరింతగా బాధ పడుతున్నారు గనక నేనో ఉపకారం చేస్తాను.

వల్లి:- ఏవిటది?

పర:- చెపితే ఏవిస్తారు?

వల్లి:- పరశురామ్! ... ఏవిటది? (ప్రాధేయపడుతూ) ఏవిటది చెప్పు పరశురామ్!...చెప్పు!...సుభద్రని చంపలేదని చెప్పు పరశురామ్! ...నీకేది కావాలంటే అదిస్తాను.

పర:- సరే, మీరు ఆపదలో ఉన్నారుగనక ఈ ఉపకారం ఫ్రీ!

వల్లి:- చెప్పు పరశురామ్!

పర:- ఆమె దోషి అనుకున్నారు గనుక కామ్‌గా పాతిపెట్టేస్తానన్నాను. ఇప్పుడు నిర్దోషి అనే తెలుసుకున్నారు గనుక ఆ శవాన్ని అలా వదిలేస్తాను-అట్టహాసంగా ఊరేగింపు జరిపి, బ్రహ్మాండంగా ఉత్తర క్రియలు జరిపించండి...

వల్లి:- పరశురామ్! (బిగ్గరగా అరుస్తాడు.)

(నిశ్శబ్దం)

రాజ:- (మెల్లిగా తలుపు తోసుకుని వస్తాడు.)

వల్లి:- (అతన్ని చూస్తూనే) రా, శేఖరం, రా! (విషంగా నవ్వుతూ ఆహ్వానిస్తాడు)...సుభద్రని ప్రేమిస్తున్నావా శేఖరం? ఆమెను అంటిపెట్టుకుని తిరిగి ప్రియుడి నవుదామనుకున్నావా శేఖరం! (పెరుగుతున్న ఉద్రేకంతో) ఆమె నీ సొత్తయినట్టు నటించి నాలో కార్చిచ్చు రగిలించావా శేఖరం!...చెప్పు, చెప్పు, ఆమె నీ ప్రియురాలా? చెప్పు!

రాజ:- ఆ రాక్షసి నా ప్రియురాలా?

వల్లి:- రాక్షసి!...రాక్షసి!...నిన్ను వశీకరించింది. నిన్ను యీ సంఘానికి చీడ పురుగ్గా విడిలించేసింది...అవునా శేఖరం!...అవును. అంతే!...పరశురామ్! నా భార్యని నేను అనుమానించేట్టు చేసి, ఆ అమాయకురాలి జీవితాన్నీ, నా జీవితాన్నీ నాశనం చేసిన ఈ రాక్షసుణ్ణి చంపేందుకేం తీసుకుంటావ్?...కాల్చి చంపటం కాదు. ఖండ ఖండాలుగా ఖండించేందుకేం తీసుకుంటావ్? ఒక్క క్షణం ఆలస్యం చేయకు. చంపిపారేయ్! ... వీధిమూలాన దేవతలాంటి భార్యని చంపుకున్నాను. చేతులారా చంపుకున్నాను. పరశురామ్! చంపుకున్నాను.

రాజ:- ఆ! సుభద్రని చంపేశారా?...సుభద్ర చచ్చిపోయింది. (విషంగా ఉన్మాదంగా నవ్వుతూ) నన్ను అవమానించినందుకు ప్రతీకారం జరిగిపోయింది...నేను చేయకుండానే జరిగిపోయింది. నాతో నిమిత్తం లేకుండానే జరిగిపోయింది...పరశురామ్‌గారూ! పాతిక వేలిస్తేనేగానీ సుభద్రని చంపనన్నారు.. చిల్లిగవ్వ ఖర్చులేకుండా నా కోరిక తీరిపోయింది. ఆరాధించిన నన్ను అవమానించిన పాషాణం బద్ధలయి పోయింది, ... (నవ్వి) చంపించింది నువ్వు! చంపింది నువ్వు! ... నాకేం సంబంధం లేదు. నాకేం సంబంధం లేదు, (అని వీధి తలుపు దగ్గరికి వెడుతూండగా)

ప.వి:- (వస్తూనే శేఖరాన్ని చూసి) హలో! మీరిక్కడున్నారేవిఁటి? (వల్లభంతో) ఈయన మీ friend అనుకుంటాను. ఇందాక బ్రహ్మాండమైన పార్టీలో ఒకామె ఈయన్ని ... ...

రాజు:- షటప్!

ప.వి:- విషయం పూర్తిగా చెప్పాక చివరికి షటప్! ఇప్పుడే ఎలా?...... అహాహా! నిజంగా పెద్ద టపాకాయ పేలినంత చప్పుడయిందనుకోండి. అహాహా!

రాజు:- You fool, get out!

ప.వి:- ఇక్కడ జరిగిన హత్యకి సంబంధించిన ఇన్‌ఫర్‌మేషన్‌కోసం వస్తే అప్పుడే get out ఏవిఁటండీ?

రాజు:- హత్యా?

ప.వి:- ఏవిఁటి మీరలా కంగారు పడుతున్నారు?

రాజు:- ఇక్కడ హత్య జరిగిందని మీకెలా తెలుసు?

ప.వి:- షేమ్ షేమ్! మాకు తెలియక పోవటమేవిఁటండీ! (వల్లభంతో) ఆ! ఏవండోయ్! మనం అనుకున్నట్టు ఆ ప్రక్క బిల్డింగ్‌లోకి వెళ్ళాను. కానీ మీరు చెప్పినట్టు అక్కడ హత్యజరగలేదు సరిగదా, ఆ ఇల్లు ఖాళీగా ఉంది. ఎవరో ఆకతాయి వెధవ ఫోన్ చేసివుంటాడు. నాకు మాత్రం మీ ఇంట్లో మీ అందరి కంగారు చూస్తుంటే హత్య జరిగినట్టే ఉంది. హత్యకీ, ఆందోళనకీ అంత చుట్టరికం! ఏవంటారు?

పర:- అవును. హత్య జరిగింది.

ప.వి:- మీరెవరు?

పర:- చెపుతాను. శిరసున ప్రతిష్ఠించుకుని ఆరాధించ వలసిన నారీ శిరోమణిని పతితగా అనుమానించి నిలువునా కాల్చి చంపమన్నదీయన! స్నేహితుని భార్యని ప్రేమించాననీ ఆరాధించాననీ దుబ్బా వాయించుకుని, ఆమెచేత దవడ పగల గొట్టించుకుని, ప్రతీకారంకోసం చంపమన్నదీయన! ఇద్దరూ చెరొక పాతిక వేలకి నన్ను మాట్లాడుకున్నారు. నే

నా మెను చంపాను—కేవలం నా అవసరం కోసం! మా ముగ్గురిలో ఎవరు హంతకులో, మాలో ఎవరి ఫోటో మీ పత్రికలో వేసుకోవాలో మీరే నిర్ణయించుకోండి.

ప.వి:- What a lucky day! హత్య జరిగింది. హంతకుడు దొరికాడు. కాదుకాదు. హంతకులు ముగ్గురు దొరికారు. ఓ! బ్రహ్మాండమైన హెడ్‌లైన్! ఈ కేమరా ఇంతవరకూ ప్రాణాలతో వున్న వాళ్ళని ఫోటో తియ్యలేదు. కనుక ఇది బయలుదేరినందుకైనా హత్య జరగవచ్చు!For its honour'...అ! ఇంతకీ శవం ఎక్కడుంది? నాలుగు ఫోటోలు తీసుకుపోతాను.

పర:- రండి చూపిస్తాను.

వల్ల:- పరశురామ్! నీకేమైనా పిచ్చెక్కిందా? వెళ్ళవయ్యా! ఇక్కడ హత్యలూ లేవు, శవాలూ లేవు!

ప వి:- కాదు, హత్య జరిగింది మీరే చంపారు. శవం వుంది. చూపించండి.

వల్ల:- నువ్వెవరసలు? ఫో, బయటికి ఫో!

పర:- ఆగండి వల్లభరావుగారూ! తొందరపడకండి (ప.వి.తో) రండి. (లోపలి తలుపు గొళ్ళెం తీసి, తలుపు బార్లగా తోసి) ఊ! తియ్యండి ఫోటో! భయపడకండి.

ప.వి:- (కేమెరా సరిచేసుకుంటున్నంతలో)

సుభ:- (లోపలినుంచి గబగబా వస్తుంది.)
[పత్రికా విలేఖరి చేతిలో flash వెలుగుతుంది. నిర్ఘాంతపోతాడు. ఆమెవచ్చి వల్లభం కాళ్ళమీద పడ్డది. పరశురామ్ మధ్య కుర్చీలో తాపీగా కూర్చుని సిగరెట్టు వెలిగిస్తాడు.]

సుభ:- నన్ను క్షమించండి. పాపిష్టిదాన్ని, ఇంతసేపూ మీరు పడుతున్న బాధంతా చూస్తూ కుమిలిపోతూ కూర్చున్నాను—ఆయన కూర్చోమన్నారని!...నన్ను క్షమించండి...మీకు అనుమానం కలిగేట్టు ప్రవర్తించటం నాదే తప్పు! నన్ను క్షమించండి. (ఏడుస్తుంది.)

పర:- వల్లభరావుగారూ! అది భయంకర సర్పం కాదు. మీ శిరోమణే!... ధరించండి... (అని నవ్వుతాడు.)

వల్లి:- (కన్నీటితో) సుభద్రా! (ఆమెను లేవదీసి) నువ్వే నన్ను క్షమించాలి సుభద్రా! ఇన్నేళ్లు నీతో కాపురం చేసి, నీ మనసెరిగి కూడా మాయలో పడ్డాను. (అని పరశురామ్ దగ్గరికి గబగబా వెళ్ళి, అతని రెండు చేతులూ పట్టుకుని) పరశురామ్! నీ ఋణం తీర్చుకోలేను పరశురామ్! నా సంసారాన్ని నిలబెట్టావ్ పరశురామ్!

పర:- నేను మీ సంసారాన్ని నిలబెట్టడానికి రాలేదు, వల్లభరావుగారూ! అది యాదృచ్ఛికంగా జరిగింది. నేను నా చెల్లెలి సంసారాన్ని నిలబెట్టుకోడానికి వచ్చాను. మా పెత్తండ్రి కూతుర్ని ఓ ధనవంతుడికిచ్చి చేశారు పరస్త్రీ వ్యామోహంలో పడి భార్యనే భారంగా భావించి పాతిక వేలు తెస్తేనే తన గుమ్మంలో అడుగుపెట్టమని ఆమెను పుట్టింటికి పంపేశాడాయన! మా వాళ్ళంతా కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయ పడినా ఆయన మనసు మారలేదు. దాంతో ఆమె బ్రతుకు బండలై పోయింది. ఇన్నాళ్ళూ పుట్టింట్లో అఘోరించి ఆఖరికి ఆత్మహత్యకు సిద్ధపడ్డది. చివరి ప్రయత్నంగా అస్సాంలో ఉంటున్న నాకు ఉత్తరం రాసింది. "నువ్విప్పుడు రాలేకపోతే ఆడదై పుట్టిన దౌర్భాగ్యానికి నీ చెల్లెలు బలి అయిపోతుంది. గుర్తుంచుకో" అని రాసింది. ఆమె ఆక్రోశం నన్నిక్కడికి లాక్కొచ్చింది. ఆమె ఆవేదన నన్నీ పనికి పురిగొల్పింది. ఇదుగో, ఇలా సంపాదించాను-పాతికవేలు!...మా చెల్లెలు తెలివి గలది. అందగత్తె! భర్తని పువ్వుల్లో పెట్టి పూజించే స్వభావం గలది...అలాంటప్పుడు ఏం తప్పుచేసిందని ఆమెను వెళ్ళగొట్టి, పరస్త్రీల వెంట తిరిగి, తలెత్తుకోలేని అవమానాలపాలై పాఠాలు నేర్చుకోవలసి వచ్చింది-రాజశేఖరంగారూ!

(అంతా నిర్ఘాంతపోతారు. పరశురామ్ బల్లమీద bag రాజశ్శేఖరం కాళ్ళ దగ్గిరకి విసిరి) ఇదిగో, మీరు కోరిన పాతికవేలు! నా చెల్లెల్ని అన్యాయం చెయ్యకండి. వస్తా! వస్తానమ్మా!

(వెళ్ళిపోయాడు.)

వల్లి:- పరశురామ్!

సుభ:- ఏవండీ!

ప. వి:- పరశురామ్‌గారూ! ఏవండోయ్! ఒక్క ఫోటో? (Exit)

రాజు:- (నిలూనా క్రుంగిపోతాడు. పశ్చాత్తాపం దహిస్తోంది. కన్నీరు జల జల రాలింది. మెల్లగా వంగి bag అందుకుని వల్లభరావు దగ్గరికి వెడతాడు. bag అతని చేతిలో ఉంచుతాడు. సుభద్రని చూస్తాడు. ఆమె అతనివంక సానుభూతిగా చూసి తల తిప్పుకుంటుంది. అతను ఆమె దగ్గరికి నడుస్తాడు. ఆమె ముఖంలోకి చూస్తాడు. చూడలేక తలతిప్పుకుని) సుభద్రా! (డగ్గుత్తికతో) సుభద్రా! మీ వదిన్ని తీసుకు రావటానికి ఇప్పుడే వెడుతున్నాను. (గిరుక్కున వెనుదిరిగి వెడు తుండగా అతన్ని వెంబడిస్తూ)—

—: తెర :—



# ఉరిపి కట్టె

రచన :

ఆవుల శ్రీనివాసరావు

## పాత్రలు

పాపయ్య
గోవిందు
శ్రీహరి
ప్రసాద్
రంగనాథం
రామరాజు
దొర
శేఖర్
కృష్ణవేణి

[తెర లేచేసరికి శ్రీమంతుని భవనంలోని ముందు హాలు కనిపిస్తూ ఉంటుంది. కుడిప్రక్క ఒక పేము మంచముపైన ఒక పరుపు పరచి ఉంటుంది. మరి ఒక పరుపు చుట్టబడి ఉంటుంది. మంచంమీద ఇంటి యజమాని పాపయ్య కూర్చొని దగ్గుతూ ఉంటాడు మధ్యలో రెండు కుర్చీలు, వెనుక మధ్య ద్వారం, ద్వారానికి తెరలు, నాయకుల, సినీ తారల, దేవతల చిత్రపటాలు గోడలపై వ్రేలాడుతుంటాయి]

పాపయ్య:-(దగ్గుతూ) గోవిందా గోవిందా...(జవాబు లేదు. గట్టిగా) గోవిందా... (దగ్గు తమాయించుకొంటూ) గోవిందా...

గోవింద:- అయ్యా...వస్తున్నా (అంటూ బిరబిర వచ్చి చేతిలోనున్న వేడినీళ్ళ సంచిని వీపుమీద పెడతాడు. బహుశా సంచిలోనివి తెల్లే నీళ్ళ యుంటవి)

పా:- అబ్బ! చంపేశావురా. నీ దుంపతెగ. తెల్లే నీళ్ళు పోసుకొచ్చావా!

గో:- కదుమరె...కదుమరె...ఎంత పొరపాటు ... ఎంత పొరపాటు... (సంచితో లోనికి పరుగుతీస్తాడు)

పా:- కృష్ణా...కృష్ణా...కృష్ణా...

కృష్ణవేణి:-వస్తున్నా నాన్నా...... (కాఫీ తొట్లించుకుంటూ వస్తుంది) నాన్నా, ఈ మాత్ర వేసుకొని కాఫీ త్రాగండి.

పా:- ఊరు పొమ్మంటుంది. ఏరు రమ్మంటుంది. ఇంకా ఎందుకమ్మా ఈ మందులు మాకులు?

కృష్ణ:- ఊరుకోండి నాన్నా. ఏమిటా మాటలు? మీరు ఆరోగ్యవంతులై హాయిగా వుంటే, ఈ ఇల్లు హాయిగా ఉంటుంది. ఈ ఇంటితోపాటు ఈ ఊరు హాయిగా ఉంటుంది.

పా:- (మాత్ర మింగి, కాఫీ త్రాగి దగ్గుతూ) నా ముఖంమీదనే తెల్లవారుతుందా ఏమిటి? పెద్ద చిన్న, భయం భక్తి ఏమీలేదు. ఎవరికివారు పెద్దలై పోయారు. నా మాట ఇంటిలోవారు వింటున్నారా? ఊరిలో వాళ్ళు వింటున్నారా? అయినా నా కెందుకొచ్చిన బాధ? నేను ఇంకెన్నాళ్ళు బ్రతుకుతాను? ఊరు పొమ్మంటుంది, ఏరు రమ్మంటుంది.

గో:- (సంచితో ప్రవేశిస్తూ) కదుమరె ...... కదుమరె (అంటూ సంచిని పాపయ్య వీపుమీద పెట్టబోతాడు)

పా:- ఒరేయ్...ఒరేయ్, వేడ సరిగా వుందా?

గో:- ఏమిటిబాబు మీరు మరీ ఇదైపోతారు. ఇప్పుడు చూడండి. (అంటూ సంచి వీపుమీద పెట్టి కాపటం కాస్తూ ఉంటాడు)

పా:- (దగ్గుతూ) శ్రీహరి శ్రీహరి శ్రీహరి.

శ్రీహరి:- (మధ్య వాకిలి నుంచి నల్లనికోటు వేసుకొంటూ ప్రవేశిస్తూ) యేం మామయ్యా.

పా:- నిన్నెవరు పిలిచారయ్యా?

శ్రీ:- శ్రీహరీ శ్రీహరీ అని మీరేగా యిప్పుడు పిలిచారు?

పా:- అబ్బా, ఈ ఇంటిలో దేవుని గూర్చి ధ్యానం చేయనుగూడా తప్పేనే!

శ్రీ:- ఓహో! మీరు వారిని తలంచుకొంటున్నారా ... తలంచుకొండి ... తలంచుకొండి. కృష్ణా, త్వరగా కాఫీ తీసుకురా. టైం అయిపోతూ ఉంది.

కృష్ణ:- (పకపక నవ్వుతుంది)

శ్రీ:- ఎందుకలా నవ్వుతావు?

కృష్ణ:- అదికాదండి. ఈరోజు ఆదివారంకదా. తమరు ఏ కోర్టుకెళ్ళాలో?

శ్రీ:- (తెల్లబోయి) ఓ, ఈరోజు ఆదివారం కదూ? (సిగ్గుపడుతూ లోని కెళ్ళబోతాడు కృష్ణవేణి చిన్నగా నవ్వుతుంది. గోవిందు పెద్దగా నవ్వుతాడు. శ్రీహరి కోపంతో వాడివంక చూచి వెక్కిరింపుగా నవ్వి) ఛీ నోరుమూయ్!

గో:- (నోరు మూసుకొంటాడు. శ్రీహరి లోనికెళ్తాడు) అయినా చినబాబు గారికి ముక్కుమీదుంటుందయ్యా కోపం.

పా:- ఆయనగారి కోపానికేంలే!

గో:- కదుమరే...కదుమరే?

(కృష్ణవేణి మూతి ముడుచుకొంటుంది)

పా:- గోవిందా!

గో:- అయ్యా!

పా:- నేను చాలా దురదృష్టవంతుణ్ణిరా!

గో:- అదేంటయ్యా అట్లా అంటుండారు?

పా:- అంతేరా. అంతే. (దగ్గు) నా హోదాకు తగిన అల్లుడు వస్తాడను కొన్నాను. కాని ఇంతటి పరధ్యానపు మనిషి, ఇంతటి అప్రయోజకుడూ నా అల్లుడౌతాడని కలలోకూడా అనుకోలేదు.

కృష్ణ:- నాన్నా! ఎందుకు వారిని అలా చులకనచేసి మాట్లాడుతారు? వారికి ఏమి వంక ఉందని? యం. ఎ. యల్.యల్.బి. ఫస్టుక్లాసులో ప్యాసయ్యారు.

గో:- కదుమరి.

పా:- (గోవిందువంక తీక్షణంగా చూస్తాడు. గోవిందు నోరు మూసుకొంటాడు) ఆఁ, ప్యాసయ్యాడు వారభోజనాలు తిని, వీధి దీపాల క్రింద చదివి. దానికే మురిసిపోవాలా?

కృష్ణ:- ఆ విషయం వారికిచ్చిన డిగ్రీలో వ్రాయలేదులెండి.

పా:- అవునవును. మాటలు బాగా నేర్చావు. మొత్తానికి వకీలు భార్యవనిపించుకొన్నావు. (దగ్గి) కృష్ణా, నేను నీ మేలుకోరే చెప్పుతున్నాను. అయినా నా కెందుకొచ్చిన బాధ? ఊరు పొమ్మంటుంది. ఏరు రమ్మంటుంది.

గో:- కదుమరి.

కృష్ణ:- మీరు చెప్పదలుచుకుందేదో సూటిగా చెప్పితే సరిపోతుందిగా. ఎత్తిపొడుపు మాటలు దేనికి?

పా:- ఎత్తిపొడుపు మాటలా నావి? అంతేనమ్మా అంతే. నా బాధ నీకెలా అర్థమవుతుంది? (దగ్గి) ఆయనగారి డిగ్రీలు చూచి నీవు మురిసి పోతున్నావు కాని, డిగ్రీ సంపాదించినంత తేలికా కాదమ్మా డబ్బు సంపాదించడం. అయినా నా కెందుకులే! ఊరు పొమ్మంటుంది, ఏరు రమ్మంటుంది.

కృష్ణ:- ఓహో! వారు డబ్బు సంపాదించడంలేదనా మీ బాధ నాన్నా? మన కిప్పుడున్నది చాలదా? ఇంకా ఎందుకు నాన్నా, మనకు ఆ పాపిష్టి డబ్బు?

పా:- ఏమిటీ, డబ్బు పాపిష్టిదా? డబ్బు పాపిష్టిదా? విన్నావట్రా గోవిందా! డబ్బు పాపిష్టిదట.

గో:- కదుమరి...కదుమరి.

పా:- ఓరి వెధవా. ఆ డబ్బు కోసమే కదరా నీ వీ చాకిరియంతా చేస్తుం దేది?

గో:- కదుమరి...ఈ పాపిష్టి పనులన్నీ చేస్తుండేది ఆ పాపిష్టి డబ్బు కోసమే కదయ్యా! (సంచితో లోనికి వెళతాడు. కృష్ణవేణి పకపక నవ్వుతుంది)

పా:- కృష్ణా, నేను ఇన్నాళ్ళు నానాగడ్డికరిచి సంపాదించింది మీ రిద్దరూ కూర్చొని తినడానికి కాదు. మీ ఆయనకు గట్టిగా చెప్పు.

కృష్ణ:- యేమని?

పా:- డబ్బు సంపాదించమని.

కృష్ణ:- సంపాదించకపోతే?

పా:- సంపాదించకపోతే! ఆ!...ఏమిటా ప్రశ్న...(దగ్గుతాడు) సంపా దించకపోతే—

కృష్ణ:- ఎక్కడికైనా వెళ్ళి బ్రతకమంటారు. అంతేనా? మీ కంత కష్టంగా ఉంటే చెప్పండి, ఇప్పుడే వెళ్ళిపోతాము.

పా:- ఏమిటి. మిమ్మల్ని వెళ్ళమంటానా? మిమ్మల్ని-ఎందుకే నన్నిలా అపార్థం చేసుకొంటావు. (దగ్గి) హుం? - ఇంతకీ నా ఖర్మ... మీ అమ్మ ఏ నాడు పోయిందో ఆ నాటినుంచే నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. అయినా నా కెందుకొచ్చిన బాధ, నే నెన్నాళ్ళు బ్రతకబోతాను? ఊరు పొమ్మంటుంది, ఏరు రమ్మంటుంది. శ్రీహరి...శ్రీహరి...

శ్రీ:- ఏం మావయ్యా!

కృష్ణ:- ఏమండీ, మీరు లోనికెళ్ళండి.

శ్రీ:- ఏం?

కృష్ణ:- అబ్బ వెళ్ళుదురూ.

శ్రీ:- అలాగే వెళతానుగాని, కాసిని కాఫీ నీళ్లు నా ముఖాన పడెయ్యమని చెప్పి ఎంత సేపయింది?

కృష్ణ:- తెస్తాను. (లోని కెళ్ళబోతుంది)

శ్రీ:- కృష్ణా! ఏమిటా కన్నీరు.

కృష్ణ:- ఏమిలేదండి, అమృతాంజనం...

శ్రీ:- అమృతాంజనం కళ్ళలో పెట్టుకొన్నావా?

కృష్ణ:- అవునండి. (లోనికెళ్ళుతుంది)

శ్రీ:- (నవ్వుతూ) మామయ్యా, కృష్ణవేణి వట్టి పిచ్చిది మామయ్యా!

పా:- అవును. పిచ్చిది కాకపోతే నిన్నెందుకు పెళ్ళి చేసుకొంటుంది?

శ్రీ:- కరెక్టు మామయ్యా! వాట్! ఏమన్నారు?

పా:- ఏమీలేదు. (ఆలోచనలో వుంటాడు)

శ్రీ:- యేమిటి మామయ్యా, అలా దీర్ఘంగా ఆలోచిస్తూ ఉన్నారు!

పా:- నా శార్ధాన్ని గురించి.

శ్రీ:- ఓ అదా! దానికేముంది మామయ్యా! మీరు తలచుకొంటే ఏదైనా దర్జాగా చేసెయ్యగలరు...వాట్, ఏమన్నారు?

పా:- యేమంటానా! నా నెత్తిన కొరివి పెట్టమంటాను.

శ్రీ:- మామయ్యా! ఇలాంటి మాటలు మాట్లాడవద్దని మీకు లక్షసార్లు బుద్ధి చెప్పాను.

పా:- అక్కడ కోర్టులో గుద్దుతున్నావు చాలదూ, ఇక్కడకూడా ఎందుకు? ఇదిగో శ్రీహరీ! నీ వ్యవహారం నాకేమీ నచ్చడం లేదు.

శ్రీ:- ఏమో అంత నచ్చకపోవడం.

పా:- కారణాలు చెప్పమన్నావా?

శ్రీ:- చెపితే వద్దన్నానా?

పా:- అయితే చెపుతాను విను. 1. నీవు ప్రాక్టీసుపెట్టి 6 మాసాలయినా నయాపైసా సంపాదించలేదు. 2. కూలీనాలీ చేసుకొనే దరిద్రపు గుంపును వెనుకవేసుకొని వాళ్ళ కేసులకు వకాల్తా పుచ్చుకొని వాదించి గెలవడంద్వారా ఊరి పెద్దలకంతా నీమీద ద్వేషం ఏర్పడింది. 3. నిన్ను అదుపులో పెట్టలేదని వాళ్ళంతా నామీద విరుచుకపడుతున్నారు. 4. నీ ప్రవర్తన వలన నా పరపతి, పలుకుబడి దెబ్బతిన్నది. 5...

శ్రీ:- స్టాప్. ఫుల్‌స్టాప్ మామయ్యా! ఇప్పుడు మీరు చేసిన ఆరోపణలకు సమాధానం చెప్పనీయండి. మరలా ఆరోపిస్తురుగాని. చూడండి, నేను ఆరు మాసాలనుండి ప్రాక్టీసు చేస్తున్నాను. ఈ ఆరు మాసాలలో నేను చేపట్టిన ప్రతి కేసు గెల్చాను. కోర్టులో నా వాదనలు విన్న వారంతా సెహబాష్ అన్నారు. ఇక డబ్బు విషయమంటారా, నా దగ్గరకు వచ్చిన పార్టీలన్నీ పేదవి గనక కొన్ని సందర్భాల్లో స్టాంపు ఖర్చులు కూడా నేనే భరించుకున్నాను. రెండు-నేను న్యాయవాదిని. న్యాయాన్ని అన్యాయంగా, అన్యాయాన్ని న్యాయంగా వాదించడం నా అభిమతం కాదు. అందువలన ఊరి పెద్దలకు నా మీద ద్వేషం కలిగి వలసిన అవసరం లేదు. మూడు - నేను మీ అల్లుడనైనంత మాత్రాన మీ అదుపాజ్ఞలో ఉండాల్సిన అగత్యం లేదు. నా మూలంగా మీ పరపతి, పలుకుబడి దెబ్బ తినాల్సిన అవసరం అంతకన్నా లేదు. ఇక కానివ్వండి.

పా:- మాటకు మాట జవాబు చెప్పడం కాదు నాకు కావలసింది. నీ పద్ధతులు మార్చుకుంటావా లేదా?

శ్రీ:- ఏ పద్ధతులు?

పా:- శ్రీహరీ! నీవు డిగ్రీలు సంపాదించావని, పేరు ప్రఖ్యాతులు సంపాదించుతున్నావని వుబ్బితబ్బిబ్బౌతున్నావు. యీ రోజుల్లో ఆడవాళ్ళు కూడా డిగ్రీలు సులభంగా సంపాదిస్తున్నారు. డిగ్రీలు సంపాదించినంత సులభం గాదయ్యా, డబ్బు సంపాదించడం.

శ్రీ:- మావయ్యా! డబ్బుకోసం గడ్డి తినడం నా చేతగాదు. అక్రమ సంపాదనకు నన్ను ప్రోత్సహించవద్దని మీకు లక్షసార్లు బల్లగుద్ది చెప్పాను.

పా:- డబ్బులేనివాడు డబ్బుకు కొరగాడని నేనుకూడా యీ పరుపుమీద గుద్దిగుద్ది చెప్పగలను. (దగ్గు) శ్రీహరి, నన్నెందుకిలా బాధ పెడతావ్? నేనింక ఎన్నాళ్ళు బ్రతుకుతాను? ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. ఈ అవసానకాలంలోనైనా ప్రశాంతంగా ఉండనివ్వవా?

శ్రీ:- అయితే, మీ ఇష్టానుసారంగా నడుచుకొని డబ్బు సంపాదించమంటారు.

పా:- అవసరంలేదు కాని, నా సొంత వ్యవహారాల్లో మాత్రం జోక్యం కలుగజేసుకోకుంటే అంతేచాలు.

శ్రీ:- మీ స్వంత వ్యవహారాల్లో నేనేమీ జోక్యం కలుగచేసుకోలేదే!

పా:- ఎందుకయ్యా, అట్లా వచ్చి అబద్ధాలాడ్తావ్? మన ఊరి చెరువు పూడిక తీయాలని మేమంతా నిర్ణయించుకొన్నాం. అలా పూడిక తీస్తే ఎక్కువ నీరు నిలుస్తుంది. ఎక్కువ పంటలూ పండుతవి. మన వూరూ బాగుపడుతుంది.

శ్రీ:- అందుకు కావలసిన పైకం దాదాపు లక్షరూపాయలదాకా రైతులవద్ద వసూలు చేశారుగా.

పా:- చేశాము. కాని మన వూరి చెరువు పూడిక తీస్తే రామాపురం చెరువుకు నీరు చాలదని ఆ వూరి రైతులు అడ్డు తగిలేరుగా.

శ్రీ:- తరువాత వారు రాజీపడ్డారుగా. పూడిక తీసుకోమన్నారుగా. లోతు పెంచుకోమన్నారుగా.

పా:- అదే అదే. వాళ్ళనల్లా రాజీపడేటట్లు చేసింది నీవుకదు. నీకెందుకొచ్చిన బాధ. అదేదో మేము కోర్టులో తేల్చుకోలేకపొయ్యామా?

శ్రీ:- అదా మీ బాధ మామయ్యా! యేటి నీరు మన చెరువేకాదు, రామాపురం చెరువేకాదు, సక్రమంగా ఉపయోగించుకొంటే యిలాంటి చెరువులు 30 అయినా నిండిపోతాయి. ఆ విషయం వారికి వివరించి చెప్పాను. అందుకు వారు సమ్మతిపడి రాజీ పడ్డారు. పైగా యీ స్వల్ప విషయానికి కోర్టుకెక్కి గ్రామ డబ్బును పాడుజెయ్యడం ఏం బాగుంటుంది? అంతేనా? దీనివల్ల గ్రామాల మధ్య కక్షలు పెరిగి ఎంత అనర్థానికి దారితీస్తుందో వూహించగలమా? ఇదంతా ఆలోచించే వాళ్ళను రాజీపడేటట్టు చేశాను. నేను మంచే చేశానగాని చెడ్డ చెయ్యలేదే.

పా:- చెయ్యలేదు? ఆ విధంగా రామాపురం వాళ్ళని రెచ్చగొట్టింది నేనేనని చెప్పలేదూ?

శ్రీ:- నేనా? ఎందుకు మామయ్యా, అలా బుకాలు తడువుకొంటూ నా మీద అభాండాలు వేస్తారు?

పా:- నేనా? బుకాలు తడువుకొంటున్నానా? నేన? శ్రీహరి! పిల్లి కళ్ళు మూసుకొని పాలు త్రాగుతూ తన్నెవరూ చూడటం లేదనుకొంటుందట. ఇది వూరుగాని, అడివికాదు. నీవు నా మీదచేసే దుష్ప్రచారమంతా యెప్పటికప్పుడు నాకు తెలుస్తూనేవుంది. ఈ వూరిలో కాలేజీ పడకుండా పోవడానికి కారణం నేనేనని చెప్పుతున్నావటగా. వూరి పెద్దలంతా కలిసిరాకపోతే నేనేం చేసేది? పైగా నేనే వాళ్ళల్లో ఐకమత్యం లేకుండా చేస్తున్నానని ప్రచారం చేస్తావా? ఇదిగో శ్రీహరీ! ఆఖరిసారిగా చెప్పుతున్నాను. అనవసరంగా నన్ను గురించి చెడ్డగా ప్రచారం చేస్తే మాత్రం బాగుండదు.

శ్రీ:- ఎందుకు మామయ్యా, అనవసరంగా ఉద్రేకపడతారు? మీరనుకొంటు న్నంత చెడ్డగా నేనేం చేయడంలేదే?

పా:- శ్రీహరి! నేను కృష్ణవేణినికాను నీ మాయమాటలకు మోసపోయి నీ వలలోపడి దొంగతనంగా పెళ్ళి చేసుకోడానికి. నేను పాప

య్యను. నా తాహత్తుకు తగ్గ ఇల్లుడివి కాకపోయినా, మీ పెళ్ళి నా కిష్టం లేకపోయినా, జరిగిందంతా మర్చిపోయి నిన్ను అల్లుడిగా స్వీకరించి నీ గౌరవానికి యే లోటు రాకుండా చూచుకొంటున్నాను. ఆ గౌరవాన్ని తుదివరకూ కాపాడుకుంటావో లేదో త్వరగా నిర్ణ యించుకో. (అని దగ్గుతూ విసురుగా లోనికి వెళ్ళాడు)

శ్రీ:- (కోపంగా చూస్తూ అటూ ఇటూ తిరుగుతూ సిగరెట్టు కాల్చి పారే స్తుంటాడు)

కృష్ణ:- (కాఫీ కప్పుతో ప్రవేశించి) కాఫీ తీసుకోండి.

శ్రీ:- ఊఁ! మీ నాన్నగారు నాకు గొంతుదాకా టిఫిన్ పెట్టారు. నీవేమో కాఫీ తీసుకోండి అంటూ వచ్చావ్. తీసుకోడానికి సందేది?

కృష్ణ:- ఏమిటండి, నామీద అనవసరంగా కోప్పడుతున్నారు?

శ్రీ:- అనవసరంగా కోప్పడుతున్నానా? అవును. నీకలాగే అనిపిస్తుంది. అయినా నా కోపానికేంలే. పేదవానికోపం పెదవికి చేటన్నారు.

కృష్ణ:- మిమ్మల్నిప్పుడు పేదవాడని యెవరన్నారు? కాస్త కాఫీ ఆలస్య మైనందుకే ఇలా ఎత్తిపొడవాలా? ఈ ఇంటిలో నన్నెవరూ అర్థం చేసుకోరు. అంతా బాధపెట్టేవాళ్ళే. (ఏడుస్తుంది)

శ్రీ:- అది, అది మీ ఆడవాళ్ళకు చేతనైంది అంతేగా, చీటికి మాటికీ భోరుమని యేడవడం, గోడలన్నీ ఖరాబు చేయడం.

కృష్ణ:- అవునవును. మీ మగాళ్ళకున్న వోర్పు మాకెలా వస్తుంది.

శ్రీ:- ఓర్పు అనేదానికి కొంత పరిమితి వుంది. కృష్ణా! మీ నాన్నగారి గుత్తాన్ని కాస్త అదుపులో పెట్టుకోమని చెప్పు. లేకపోతే వ్యవ హారం చెడుతుంది.

కృష్ణ:- ఏమండి, కాస్త శాంతించండి. వారి ఆరోగ్యం యేమీ బాగులేదు. నిన్నటి నుండి బ్లడ్ ప్రెషర్ యెక్కువైంది.

శ్రీ:- ఉబ్బసం, మధుమేహం, కీళ్ళనొప్పులు, ఉష్ణవాతం, శైత్యం ఒక్కటేమిటి-అన్నీ ఉన్నాయి. ఉన్నవాడు మందులు తింటూ మంచంలో పడుండక యీయనగారి కెందుకో ఊరి పెత్తనం? బహిరంగ సభల్లో దేశాభివృద్ధిని గురించి, పట్టణాభివృద్ధినిగురించి గొంతులు చించుకునేటట్లు ఉపన్యాసాలిచ్చేది, చాటున చేరి ప్రతి మంచి పనికి అడ్డుపుల్లలు వేసి పాడు చేసేది. ఛీ, ఛీ. ఏం మనుషులు, ఏం మనస్తత్వాలు. ఇక దేశం బాగుపడాలంటే యెలా బాగుపడుతుంది? ఎప్పుడు బాగుపడుతుంది?

కృష్ణ:- ఇప్పుడేం జరిగిందండీ?

శ్రీ:- ఘన సన్మానం జరిగిందంటే, ఘన సన్మానం. నేను నయాపైసా సంపాదించడం లేదట, దండుగ తిండి తింటున్నానట, ఆయనగారి మీద దుష్ప్రచారం చేసి ఆయనకున్న పరపతిని, పలుకుబడిని దెబ్బ తీస్తున్నానట. అయన అవమానం చాలుగాని బయలుదేరు. దూరంగా ఉండి గౌరవంగా బ్రతుకుదాం.

కృష్ణ:- ఏమండి, ఈ పరిస్థితిలో నాన్నగారిని వదిలి దూరం పోవడం ఏమన్నా బాగుంటుందా. అమ్మె బ్రతికుంటే నాన్నగారి మంచి చెడ్డలన్నీ అమే చూచుకొనేది. ఆయన కెవరున్నారు. మనమేగా!

శ్రీ:- ఆ ఇంగితజ్ఞానం ఆయనకుండొద్దు. కృష్ణా! నిన్ను కోరి, ప్రేమించి పెళ్ళి చేసుకున్నందుకు బాగా సుఖపడుతున్నాను.

కృష్ణ:- (మనస్సు చివుక్కుమంటుంది) అవును, నన్ను చేసుకున్నందు వల్ల మీరేమి సుఖపడటంలేదు. (మన పెళ్ళి జరక్కుంటేనే బాగుండేది. (కన్నీరు కారుస్తుంది)

శ్రీ:- అఁ, అది మాట కృష్ణా! ఈ చిన్నమాటకే నీవు యింతగా గుంజుకొంటున్నావే? మీ నాన్న నన్ను ఇంతింతమాట అన్నాడే, నేనెంత ఇదైపోవాలా, నా వళ్ళు ఎంత యిదిగా మండిపోవాలా?

కృష్ణ:- దీనికంతా కారణం నేనేగా. నన్ను కొట్టి మీ కోపాన్ని చల్లార్చు కోండి.

శ్రీ:- అహా... బాగుంది ... బాగుంది — కృష్ణా! అనవసరంగా గంట గంటకు మీ నాన్నగారిచేత మందు లేందుకు మింగిస్తావ్, ఆ మందు లేవో నీవే మింగితే పోలా?

కృష్ణ:- చాల్లెండి మీ పరిహాసం. నేను మందులు మింగితే మా నాన్న జబ్బు నయమవుతుందా?

శ్రీ:- మరి నిన్ను కొట్టితే మీ నాన్నకు బుద్ధివస్తుందా?

కృష్ణ:- అయితే మా నాన్నగారినే కొడతానంటారా?

శ్రీ:- ఆ మాటెవరన్నారు? ఏమేయ్, కొంపదీసి మమ్మల్నిద్దర్నీ కొట్లాటకు దింపేట్టున్నావ్.

కృష్ణ:- చాల్లెండి...(నవ్వు) మీ కోపం చల్లారిందిగా ... కాఫీ తీసుకోండి. (ఇద్దరూ చిలిపిగా చూచుకొంటారు. పాపయ్య దగ్గుతూ ప్రవేశించి, వారిని తీక్షణంగా చూస్తూ మంచంపై అగ్గిపెట్టె వెతుకుతుంటాడు)

కృష్ణ:- యేం నాన్నా, యేం కావాలి?

పా:- రెండు చుక్కలు విషం కావాలి.

శ్రీ:- నాగుపాము కోరలు పిండండి.

పా:- పాలుపోసి పెంచుతున్నానగా. (విసురుగా లోనికెళతాడు. కృష్ణవేణి తండ్రి వెళ్ళినవైపే తీక్షణంగా చూస్తూ వుంటుంది)

శ్రీ:- కృష్ణా, శాంతించు-శాంతించు, ఆయనగారి ఆరోగ్యం యేమీ బాగు లేదు. ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. ఇవాళగాక పోయినా రేపైనా వెళ్ళవలసినవారే,

కృష్ణ:- అబ్బబ్బ, మీ యిద్దరి మధ్య నేను నలిగి చస్తున్నాను బాబు. (వాకిట్లో బిచ్చగాడి పాట వినిపిస్తుంది)

బిచ్చ:- ఎవరుచేసిన ఖర్మ వారనుభవించక
యేరికైనను తప్పదన్నా

ఏనాడు యేతీరు ఎవరు చెప్పాగలరు
అనుభవించుట తథ్యమన్నా

శ్రీ:- గోవిందా...గోవిందా?

గో:- అయ్యా!

శ్రీ:- బయట బిచ్చగాడురా?

గో:- బిచ్చమెయ్యమంటారా! అమ్మో అమ్మో! అయ్యగారికి తెలిస్తే యింకేమన్నా వుందా? నా వీపు చిట్లిపోదూ?

కృష్ణ:- నోరు మూయరా చవటా, నాన్నగారంటే నీకు చులకనైపోయింది.

గో:- కదుమరె, కదుమరె.

శ్రీ:- ఒరేయ్ గోవిందా...యిందా, యీ అయిదు నయాపైసలు తీసుకెళ్ళి యిచ్చిరా.

గో.- సరేనయ్యా!

కృష్ణ:- కాఫీ తీసుకోండి. చల్లారిపోతున్నాయి.

శ్రీ:- కృష్ణా, యిద్దరం త్రాగుదాం fifty, fifty.
(కాఫీ సాసర్లో సగం పోస్తాడు. ఇద్దరూ చిలిపిగా నవ్వుకొంటూ త్రాగబోతారు. లోపలనుండి పాపయ్య, కృష్ణా, కృష్ణా అని కేకలు)

కృష్ణ:- వస్తున్నా నాన్నా! (అంటూ కాఫీ త్రాగకుండానే పరుగు తీస్తుంది. శ్రీహరి కప్పు క్రింద పెట్టి చికాకుగా సిగరెట్టు కాలుస్తుంటాడు)

గో:- (ప్రవేశించి కాఫీ చూచి) కాఫీ తాగలేదేమయ్యా?

శ్రీ:- చప్పగా చల్లారిపోయినయ్. తీసుకెళ్ళి కుడితి తొట్టిలో పోయి.

గో:- కుడితి తొట్టిలో యెందుకయ్యా, యీ తొట్టి ఖాళీగానే వుందిగా! (అంటూ తన పొట్టను చూపించి కాఫీకప్పు లోనికి తీసుకెళతాడు. శ్రీహరి వాడివంక ఆశ్చర్యంగా చూస్తూ వుంటాడు. కృష్ణవేణి ప్రవేశం)

కృష్ణ:- ఏమండీ, కాఫీ త్రాగరా?

శ్రీ:- ఎందుకూ! ఒకేసారి ఫోంచేస్తే సరిపోతుందిగా?

కృష్ణ:- నేనలా వెళ్ళానని నా మీద కోపమొచ్చిందా?

శ్రీ:- కోపమెందుకు?

(లోపల్నుంచి కృష్ణా, కృష్ణా అని పిలుపు)

కృష్ణ:- అబ్బబ్బ! కృష్ణా, కృష్ణా.

శ్రీ:- విసుగుపడకు. అలా జపిస్తే కాస్త పుణ్యమైనా లభిస్తుంది. ఇంతకూ ఆయన లోపల ఏం చేస్తున్నట్టు?

కృష్ణ:- యేమిటో బీరువాలోని కాగితాలన్నీ వెతుకుతున్నాడు. కృష్ణా అని పిలుస్తాడు. ఏం నాన్నా అంటే యేమీ లేదంటాడు. ఆరోగ్యం సరిగ్గా లేదు కదా, మంచం మీద పడుకొని విశ్రాంతి తీసుకో కూడదూ? ఆ చిత్తు కాగితాలన్నీ కలబెట్టి కూర్చోకపోతే.

శ్రీ:- అవి చిత్తుకాగితాలు కావు కృష్ణా, రికార్డు, పాపయ్యగారి పాపాల చిట్టా. అయినా యిప్పుడు ఆయనగారు ఏమి వెతుకుతున్నట్టు? ఓ, ఈ రోజు కాలేజీ కమిటీ మీటింగు వున్నది. దానికి కావలసిన మందుగుండు సామగ్రి అంతా తయారు చేస్తున్నట్టుంది. మన వూరిలో కాలేజీ పడకుండా చేయడానికి మీ నాన్నగారు పడుతున్న తాపత్రయం అంతా యింతా కాదు.

కృష్ణ:- కాలేజీ అధ్యక్షులు అయనేగా, కాలేజీ పడకూడదని ఆయన కెందు కుంటుంది?

శ్రీ:- ఆ విషయం మీ నాన్నగారినే అడుగు.

కృష్ణ:- నాకు తెలుసులెండి. ఊరిపెద్దలే కలిసి రావడంలేదు. మా నాన్నగా రేం చేస్తారు?

శ్రీ:- అవునవును. ఆయనగారేం చేస్తారు మరి.

(లోపల్నుండి కృష్ణా, కృష్ణా)

కృష్ణ:- వస్తున్నా నాన్నా! (వెళుతుంది)

(శ్రీహరి కృష్ణవేణి వెళ్ళినవైపే చూస్తూ వుంటాడు. బయటనుండి ప్రసాదు ప్రవేశం.)

ప్రసాద్:- హల్లో శ్రీహరీ, ఏమిటలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?

శ్రీ:- ప్రసాదుబాబా! రావయ్యా రా. కూర్చో. ఏమిటి, మరీ కనిపించడమే మానివేశావు?

ప్ర:- ఏం చెయ్యను! బాధ్యతలు అలా వున్నై. నాన్నగారు పోయారు. ఇంటి వ్యవహారం, వ్యాపారం, వ్యవసాయం అన్నీ నేనే చూసు కోవాలి.

శ్రీ:- అవును. మీ నాన్నగారే బ్రతికుంటే యీ పాటికి నీవు ఉన్నత విద్యకై అమెరికాకు వెళ్ళి వుండేవాడివి.

ప్ర:- అవును శ్రీహరీ! ఉన్నతవిద్యకై అమెరికానుండి ఆహ్వానం, నాన్నగారు పోయారని టెలిగ్రాం రెండూ ఒకేసారి చేతికందాయ్. ఆ నాడు నేను...

శ్రీ:- వద్దు ప్రసాద్! చెప్పొద్దు. గతాన్ని తలుచుకొని బాధపడొద్దు. ఆశలు అందరికీ వుంటాయికాని, అవకాశాలు కొంతమందికే లభి స్తాయ్.

ప్ర:- అంతేకాదు. ఆ అవకాశాలు లభించిన కొంతమందిలో నాలాంటి దురదృష్టవంతులు కూడా కొంతమంది వుంటారు బ్రదర్!

శ్రీ:- అదీ నిజమే, అవును, యిప్పుడు నీవు నాకోసం వచ్చావా, లేక మా మామగారి కోసం వచ్చావా?

ప్ర:- మీ యిద్దరికోసం. ఈ రోజు కాలేజీ కమిటీ మీటింగు వుందిగా. మర్చిపోయావా?

శ్రీ:- నేనెందుకు మర్చిపోతాను?

ప్ర:- శ్రీహరీ! యేమైనాగాని, యీ సంవత్సరం కాలేజి నిర్మాణం జరిగి తీరాలి. మా నాన్నగారి ఆశయం నెరవేరాలి.

శ్రీ:- నెరవేరాల్సిందే కాని, మా మామగారు...

ప్ర:- యేం? మీ మామగారు సుముఖంగా వున్నారే!

శ్రీ:- యేమిటేమిటి, సుముఖంగా వున్నారా! wait, wait (అని బయటి వాకిలివైపు వెళ్ళి చూచివస్తాడు)

ప్ర:- యేమిటది?

శ్రీ:- ఆc...ఏమీలేదు. సూర్యుడు యే దిక్కున వుదయించాడాని చూచి వస్తున్నా. తూర్పు దిక్కునే ఉదయించాడు.

ప్ర:- బలేవాడివి శ్రీహరీ, నీవు.

శ్రీ:- అవును బ్రదర్! మా మావగారు సుముఖంగా వున్నారు అంటే సూర్యుడు పడమటి దిక్కున వుదయించాడన్నమాటే.
(పాపయ్య ప్రవేశం)

పా:- ప్రసాద బాబుగారా!

ప్ర:- నమస్కారమండీ!

పా:- నమస్కారం. కూర్చోవయ్యా, కూర్చో (దగ్గు)

ప్ర:- ఆరోగ్యం బాగా లేనట్లుంది.

పా:- ఇంకెక్కడి ఆరోగ్యం? 60 యేండ్లు దాటాయి. ఊరు పొమ్మం టుంది, ఏరు రమ్మంటుంది. అయినా, నే నింకెన్నాళ్ళు బ్రతుకు తాను? కాని ప్రసాదబాబూ, మీ నాన్నగారు చాలా అదృష్టవంతు లయ్యా. మాట్లాడుతూనే కన్నుమూశారు.

శ్రీ:- అలాంటి మంచి చావు మనబోటి పాపాత్ములకు రాదు మామయ్యా!

పా:- అదేనయ్యా, నేను చెప్పేది (దగ్గుతాడు)

ప్ర:- చాల నీరసంగా వున్నారు.

శ్రీ:- నిమ్మరసం త్రాగుతూనే వున్నారు. (పాపయ్య తీక్షణంగా చూస్తాడు) మందులు కూడా గంట గంటకు వాడుతున్నాము. కాని వారికి అన్నిటికంటె విశ్రాంతి చాల అవసరం. సారీ, మీరు మాట్లాడుతూ వుండండి. నేనిప్పుడే వస్తాను. (లోనికెళతాడు)

ప్ర:- పాపయ్యగారూ, ఈ రోజైనా కమిటీ మీటింగులో మనం సరియైన నిర్ణయం తీసికొని కాలేజీ నిర్మాణానికి పూనుకోవాలి.

పా:- దానికోసరమేగదయ్యా నే నింకా బ్రతికే వున్నాను. మీ నాన్న గారిని కాలేజీ నిర్మాణానికి పూనుకొనేటట్లు ప్రోత్సహించింది నేనేగా. కాని వారి ఆశయం నెరవేరకిముందే కన్నుమూశారు.

ప్ర:- అదేనండీ నేనూ చెప్పేది. ఆ కాలేజీ నిర్మాణం జరిగితే నాన్నగారి ఆశయం నెరవేరుతుంది. వారి ఆత్మకు శాంతి లభిస్తుంది.

పా:- అదేనయ్యా నా తాపత్రయంకూడా. కాని ప్రసాదుబాబూ, మన వూరికి కాలేజీవస్తే బాగపడేదెవరు?

ప్ర:- అదేమిటండీ అలా అంటారు? కాలేజీ చదువులు అందుబాటులో లేక ఎంతమంది బాధపడుతున్నారో మీకు మాత్రం తెలియదూ?

పా:- ఆ తెలివి వారికుండొద్దూ? మనమేదో స్వార్థంతో చేస్తున్నామని ప్రచారం మొదలెట్టారు. మనకెందుకొచ్చిన బాధ?

ప్ర:- ఎవరో విమర్శించారని మన ప్రయత్నం మానుకొంటామా?

పా:- మానుకోక చేసేదేముంది? విమర్శ లొచ్చేటప్పటికి విరాళా లిచ్చే వాళ్ళంతా వెనక్కెళ్ళారు. మా పిల్లల్ని పట్నం పంపించి చదివించు కొంటాం, కాలేజీ లేకపోతే మాకొచ్చే యిబ్బందేమీ లేదు అంటు న్నారు. ఇక మీ నాన్నగారిచ్చిన రెండు లక్షల రూపాయలతో కాలేజీ నిర్మాణమెలా జరుగుతుంది?

ప్ర:- పాపయ్యగారూ! పెద్దలు విరాళాలు యివ్వకపోతే మునిగిపోయిందేమీ లేదు. కాలేజీకి కావలసిన ఖర్చంతా నేనే భరించుకొంటాను. ఇక ఆ స్థలాన్ని మంజూరు చేయించడానికి అందరినీ ఒకదారికి తీసుకొని రండి.

పా:- అదే సాధ్యం కావడంలేదు. గ్రామదేవత జాతర అక్కడే జరుగు తుందని...

ప్ర:- జాతరా! అలాంటిది నాకు తెలిసి ఎప్పుడూ జరగలేదే!

పా:- నా చిన్నతనంలో, నేను వీధిబడిలో చదువుకునేటప్పుడు జరిగింది. జాతరంటే మాటలా! ఆ రోజుల్లోనే 10 వేల రూపాయలు ఖర్చు

పెట్టేవాడు. ఈ రోజుల్లో అయితే లక్షకు పైబడుతుంది. ఇకపోతే గ్రామపశువులు చేరటానికి అదే, పిల్లలు ఆడుకోవడానికి అదే, బహిరంగ సభలకు అదేనాయె అంత ముఖ్యమైన స్థలాన్ని కాలేజీ కివ్వడానికి ఎవ్వరూ ఒప్పుకోవడంలేదు. కందకు లేని దురద కత్తిపీట కెందుకయ్యా?

ప్ర:- అయితే మన ప్రయత్నం మానుకోవడమే మంచిదంటారా?

పా.- నన్నేం చెయ్యమంటావ్? (కాస్త ఆలోచించి) ప్రసాద్! ఇంకొక పని చెయ్యరాదూ?

ప్ర:- ఏం చెయ్యమంటారు?

పా:- నీవు కాలేజీకి ఖర్చు పెట్టదల్చుకొన్న డబ్బుతో తిరుపతిలో సలక్షణమైన ఒక సత్రం కట్టించు. ఇటు పేరూ వస్తుంది. అటు పుణ్యమూ వస్తుంది. ఏమంటావ్?

ప్ర:- ఏమిటండి మీరు చెప్పేది? మన డబ్బుతో మన వూరు బాగుపరచుకోవడం మాని, తిరుపతిలో సత్రం కట్టించమంటారా?

పా:- నాకు తోచింది నేను చెప్పాను. అయినా, నాకెందుకొచ్చిన బాధ చెప్పు? ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. నేనింకెన్నాళ్ళు బ్రతుకుతాను?

ప్ర:- మీరలా నిరుత్సాహపడితే యెలా? మీరు కాస్త గట్టిగా ప్రయత్నిస్తే గ్రామ పెద్దలందరూ ఆ స్థలా లివ్వడానికి తప్పక ఒప్పుకుంటారు. (రంగనాథం ప్రవేశం)

రంగ:- అదేం యీలు పడేటట్టు లేదయ్యో !

ప్ర:- నమస్కారమండి రంగనాథంగారూ !

రంగ:- నమస్కారం. పాపయ్యా! అయినా మన వూరోళ్ళందే. యెటు బడితే అటేనయ్యా, ఒట్టి గొర్రె గుంపు. కాలేజీ లేకపోవడంవల్ల కానా యిబ్బందిగా వుండాదని ఒకపక్కంటారు. కాలేజీ కడదామంటే యీలుపడదంటారు. ఏందిది ?

పా:- రంగనాథం! మన వూరివాళ్ళ విషయం నీకు సరిగ్గా తెలియదయ్యా!

రంగ.- యేందీ? నాకు తెలియదా? నాకు తెలియదా? ఆహాఁ...నాకు తెలియదాని, యీ పంగనామాల రంగనాథానికి తెలియంది యీ పెపంచకంలో వుందాని? నాకు తెలియదంటావా? ఇదిగో పెసాదుబాబూ! పెపంచకం తల్లకిందులైనా సరే, కాలేజీ పని జరిగి తీరుతుంది. నేనుండాను పోవయ్యా. నీకేమీ ఫరవాలేదు. మీటింగులో తేల్చేస్తాం పో.

ప్ర:- అదేనండీ నాక్కావల్సింది. (పాపయ్యతో) మీరు మీటింగుకు తప్పక రావాలి.

రంగ:- ఆయనేన్నందయ్యా నువ్వు పిల్చేది. ఉప్పులేని పప్పు, పప్పులేని పెళ్ళి యేం బాగుంటది? పాపయ్య పెసిడెంటైపోయేదే కమిటీకి. ఆయన రాకుండా మీటింగెట్టా జరగుద్దే. వస్తాను పోవయ్యా, నీకా దిగులే వద్దు.

ప్ర:- ఇక నేను శెలవు తీసుకుంటానండి.

పా:- అలాగే, వెళ్ళిరా నాయనా! (ప్రసాద్ వెళ్ళిపోతాడు).

పా:- (కోపంగా) రంగనాథం! తెలిసీతెలియకుండా మాట్లాడవద్దని నీకెన్ని సార్లు చెప్పాను?

రంగ:- నాకు తెలియదా, నాకు తెలియదా. ఆహాఁ నాకు తెలియదాని? నాకు తెలియదంటావా, పాపయ్యా! 40 యేళ్ళనుండి యీ వూరిని జాయింటుగా యేలుతుండమే మనిద్దరమూ. నీ సంగతి నాకు తెలియదా, నా సంగతి నీకు తెలియదా ?

పా.- ఏమిటయ్యా నీకు తెలిసింది? కాలేజీ కట్టి తీరతామని మహా ధైర్యంగా చెప్పేశావే ఏమిటి నీ వుద్దేశం? అప్పటికి నీవు చాలా సమర్థుడవైనట్టు, నేనేమీ చేతగానివాడినైనట్లూనా ?

రంగ:- అయితే నీవేమో కాలేజీకోసం పాకులాడుతున్నట్టు, మేమంతా పడగొట్టున్నట్టా నువు చెప్పేది?

పా:- నేనన్నా నా మాటా?

రంగ:- నేనుమాత్రం ఏమన్నాను?
(రామరాజు ప్రవేశం)

రామ:- అబ్బెబ్బెబ్బె, ఏమిటయ్యా ఇది పసిపిల్లల్లాగా. పూరిపెద్దలుగా వుండి. ఈ మాదిరి తగులాడుకోవడం ఏమీ బాగులేదు.

రంగ:- అయ్యో రామరాజో! మీ మాదిరి మున్సిపాలిటి మీటింగుల్లో కుర్చీలతో కొట్టుకొంటున్నట్లు మేమేం కొట్టుకోవడంలేదు లేవయ్యా.

రామ:- రంగనాథం, మేమేమీ బజారు మనుషులంకాదు. మా కౌన్సిలర్లం దరూ చదువు సంస్కారం ఉన్నవాళ్ళు, తెలిసీ తెలియకుండా మాట్లాడితే మర్యాద చెడుతుంది.

రంగ:- తెలిసీ తెలియకుండా మాట్లాడుతున్నానా నేను. నాకు తెలియదా. నాకు తెలియదా. ఆహాఁ నాకు తెలియదాని. నాకంతా తెలుసు లేవోయీ.

రామ:- ఏమిటయ్యా నీకు తెలిసింది. తెలిస్తే చెప్పరాదూ.

రంగ:- అట్టా అడుగరాదో. మొన్న మీ కౌన్సిలర్ల మీటింగులో ఆ యాని మిదో వార్డు కౌన్సిలర్ ఈరా సోమి నీమీద కుర్చీ ఎత్తుల్లా.

రామ:- ఎవరయ్యా నీకు చెప్పింది.

రంగ:- ఒకరు చెప్పేదేందయ్యా, వూరంతా గబ్బు రేగిపోతేనో.

పాప:- రంగనాథం, నిజానిజాలు తెలుసుకోకుండా యెందుకయ్యా అలా తొందరపడతావు?

రంగ:- నేను తొందరపడ్తున్నానా. నాకు తెలియదా. నాకు తెలియదా, ఆహాఁ నాకు తెలియదాని. నాకు తెలియదంటే.

రామ:- ఆఁ తెలుసు. అబద్ధాలు బుజానవేసుకొని మోసకపోవడం.

రంగ:- అబద్ధాలా ?

పా:- రంగనాథం! నీవు కాసేపు వూరుకోవయ్యా. అసలేం జరిగింది రామరాజూ?

రామ:- ఏముంది పాపయ్యా, మన వూరిలో శానిటేషన్ బాలేగాదని, దోమల బాధ, నల్లుల బాధ విపరీతంగా వుందని వీరాస్వామి విమర్శించాడు. మీ విమర్శలకు ఆధారాలేమైనా ఉన్నవా అని నేనడిగాను. వెంటనే అతను పైకిలేచి తన కుర్చీ పైకెత్తి క్రిందపడేశాడు అంతే. ఇన్ని నల్లులు నేలమీద రాలాయ్. వెంటనే శానిటరీ ఇన్స్పెక్టర్ చర్యతీసు కోవలసిందిగా తీర్మానించాం. అదీ సంగతి.

రంగ:- అదా సంగతి. అయితే నాతో అట్టా చెప్పారే.

పా:- కానివాళ్ళు నూరుచెపుతారు. ఆ మాటలన్నీ నీ వెట్ల నమ్మతావయ్యా. అబ్బెబ్బెబ్బె నీదంతా తెలిసీ తెలియని వ్యవహారం.

రంగ:- ఆ మాటే నే నన్నొద్దనేది. నాకు తెలియదా. నాకు తెలియదా. ఆహా నాకు తెలియదాని. ఈ పంగనామాల రంగనాధానికి అంతా తెలుసు లేవోయీ! సరే సరే, నా కెందుకొచ్చిన సంగతిగానీ పాపయో, ఇప్పుడు మీటింగు వుండాది నువు రాకపోతే నేను బలే ఇబ్బంది పడిపోతాను. కాబట్టానువు మీటింగుకు తప్పకుండా రావాల.

రామ:- ఆయన మీటింగుకు వచ్చేటట్లున్నాడటయ్యా. లేవలేక మంచంలో పడుంటే మీటింగుకు రమ్మని పిలవడానికి నీకు నోరెలా వచ్చిందయ్యా. అబ్బెబ్బెబ్బె.

పా:- రంగనాధం! మీటింగుకొచ్చే పరిస్థితుల్లో ఉన్నానటయ్యా నేను.

రంగ:- రాకపోతే ఎట్టాగయ్యా.

పా:- నేనేం చెప్పేది (దగ్గు) గోవిందా...గోవిందా...

గో:- ఆయ్యా వస్తున్నా! (వస్తాడు) ఏమయ్యా?

పా:- కాస్త ఈ భుజం వత్తరా.

రంగ:- పాపయ్యా! ఏట్నో కాస్త యీలుచేసుకొని నువు రాకపోతే నా పీక పొట్టకుంటారయా వాళ్ళు.

రామ:- ఎవరయ్యా నీ పీక పొట్టుకునేది నాకు తెలియకుండా?

రంగ:- రామరాజూ! నువ్వుకూడా ఉండాల్సినోడివేనయ్యా! మనిషిదగ్గర మనిషిమాట మాట్లాడుతావు.

పా:- రంగనాథం! నేను రాని పోతే యేమయ్యా! ఆ మాత్రం సర్దలేవూ!

రంగ:- ఏందయ్యా, నేను సర్దుకొనేదా. కమిటీ మెంబర్లంతా నా మాటినేటట్లు న్నారా? నీ వేమో ఆరుమాసాల్నుండి మీటింగుకు పోకపోతివి. గ్రామ డబ్బు లక్షా యాభై వేలు ఏమయిందని వాళ్ళడగతా ఉండ్రి. నువ్వేమో ఖర్చయిపోయిందని చెపుతుంటివి. ఆ మాట చెప్పితే, లెక్కలు చూపించమని వాళ్ళడిగితే నేనేం చూపించేది?

రాము:- ఉన్నదే చూపిస్తే సరి. దానికూడా కష్టమైతే ఎలా?

రంగ:- ఏందీ? ఉండేది చూపించమంటా. ఏముందని చూపించమంటావ్. అసలుంటేకదయా చూపించడానికి. లెక్కా పక్కా అంతా అయన దగ్గర్నే ఉండేనే? నేనేం చూపించేది. చూపించాలంటే్న? నాకు తెలి యదా, ఆహా నాకు తెలియదా?

పా:- రంగనాథం! వాళ్ళంతగా లెక్కలు చూపమని గట్టిగా అడిగితే నా దగ్గరలేవు. పాపయ్యగార్ని అడగండి అని చెప్పు. ఆ తర్వాత నేను చూసుకొంటాను.

రంగ:- నువ్వు చూసుకోకేమా. నువు చూసుకోమది. ఇదిగో పాపయో! అదేం యీలు పడదు చెప్తుండా. వాళ్ళతో నాకు బలే టబుల్‌గా ఉంది.

పా:- దానికేం చెయ్యమంటావు?

రంగ:- మీటింగుకొచ్చి లెక్కలు చూపించాల్సిందేకదో!

పా:- నేను రాలేనయ్యా. నా ఆరోగ్యం బాగులేదు. (దగ్గు) రంగనాథం! ఎందుకయ్యా నన్నిలా బాధపెడతావ్—నే నింకెన్నాళ్ళు బ్రతుకుతాను. ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. ఈ ఆఖరు రోజుల్లో నైనా నన్ను కాస్త ప్రశాంతంగా ఉండనీ.

రంగ:- అమ్మా, బలే పాయింటు పట్టినావుకదయా పాయింటా. ఆ వంతన వాడిచేత నువు వళ్ళు పట్టించుకుంటా కూచుంటే నన్నేమో ఆ కమిటీ మెంబర్లచేత వళ్ళు పట్టించుకోమంటా. "ఉలిపికట్టె కెందుకురా ఊరి పెత్తనం" అని నా కెందుకొచ్చిన తగలాటకమయ్యా యిది?

రామ:- రంగనాథం! పాపయ్యను మీటింగుకు నేను తీసుకొస్తాను. నీ కెందుకు నీ వెళ్లు.

పా:- రామరాజు!

రామ:- ఇష్. పాపయ్యా. నువ్వు కాస్త వూరుకో. రంగనాథం, నువ్వుపదా. పాపయ్యను నేను తీసుకొస్తాను.

రంగ:- ఆదిమాట అట్టాచెప్పు. ఇదిగో రామరాజో, మళ్ళా మాటతప్పేవ్. తప్పకుండా తీసుకురావాల. నేను నా పదవికి రాజీనామా గికిపారే స్తాను రాకపోతే.

రామ:- అంత అవసరమేమొచ్చిందయ్యా నీకు!

రంగ:- అయితే ఈయనగారికోసం నా పరపతిని పోగొట్టుకోమంటా, పరపతి పోయినాక తిరుపతి చేరుకోవలసిందేగదా. ఎందు కంతదూరం తెచ్చు కోవాలని.

పా:- సరేలేవయ్యా, నీవేమీ బాధపడనక్కరలేదుగాని నేను వస్తాను పదా.

రంగ:- అబ్బా అబ్బా! ఎన్నాళ్ళకొచ్చిందయ్యా నీ నోటిగుండా మాట. ఆఁ. ఆ మాట మొదట్నే చెప్పుంటే ఎంత బాగుండేది. సరే, నే వస్తా. అయితే అయ్యో రామరాజో, ఆయన్ని కాస్త బద్రంగా తీసుకు రావయో, అసలే మనిషి చాల ఇదిగా ఉండాడో. అయినా వూరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. ఈయన 'కెందుకయ్యా ఇదంతా. వూపికి పొయ్యేటాకా వడుబుకునేటట్టు లేదే వూరి పెత్తనమో.

రామ:- అబ్బెబ్బెబ్బె రంగనాథం! పెంచుకొనిపోతూ వుండేదేరా.

రంగ:- లేదులే పోతుందరా. పాపయ్యో, మరివిపోతా వ్గనేం.

పా:- లేదులే పోవయ్యా.

రంగ:- పోతుండాలేపయో. నేనేంది అందరూ పొయ్యేవాళ్ళె, కాస్త ఎనకా ముందూ చూచుకొని. పదయో రామరాజూ, నేను పోతుండా కాస్త తొరగా రండయో.

రామ:- అలాగే వస్తాం పదవయ్యా (రంగనాధం వెళతాడు)

రామ:- అబ్బ బ్బ బ్బ, వూపిరాడనివ్వలేదయ్యా. ఎలాగో పంపించివేశాం. Happy Now I am. పాపయ్యా, మీటింగుకొస్తారా?

పా:- నేను రాలేనని చెప్పాను కదయ్యా!

రామ:- మరెలా? కాలేజీ విషయం అందరూ చాలా గట్టిగా ఉన్నారు. పైగా కాలేజీ ఖర్చంతా ప్రసాదు వక్కడే భరించుకొంటా నంటున్నాడు. పాపయ్యా, మనకెందుకొచ్చిన బాధ. వొప్పుకొంటే సరిపోతుంది. We will be very happy then afterwards.

పా:- రామరాజూ! నీకు వయసొచ్చేకొలది బుద్ధి సన్నగిల్లుతుంది. అతగాడు సొంతంగా కాలేజీ కట్టిస్తే వూరివాళ్ళంతా అతన్ని దేవుడుగా చూడరూ. తరువాత నీ మున్సిపల్ చైర్మన్ పదవి ఏమౌతుందో ఆలోచించుకో.

రామ:- అదా విషయం. అబ్బా, అది నేను ఆలోచించనేలేదే. నో నో నో, ఇది ఎంతమాత్రం జరగడానికి వీలులేదు. కాలేజీ లేకపోతే పీడా పోయింది. మన పిల్లల్ని కావాలంటే పట్నం పంపించి చదివించుకొంటాం. ఐతే ఎత్తు వేశాడే, నా పదవి కాజెయ్యాలనా అతని ఆలోచన! పాపయ్యా, వెళ్ళొస్తా. సభ్యుల్ని కలుసుకొని మనం బలం పెంచుకోకపోతే చాలా ప్రమాదముంది. అబ్బబ్బబ్బె. యీ రోజుల్లో ఎవర్నీ నమ్మకూడదయ్యా. Hopeless. Hopeless (అంటూ వెళతాడు.)

పా:- ఆయనగారు ఏం చేస్తున్నార్రా లోపల?

గో:- భోంచేస్తున్నాడయ్యా!

పా:- ఆహా, ఓహో (గోవిందు బుజం గట్టిగా వత్తుతాడు)

పా:- అబ్బా! చిన్నగారా నీ దుంపతెగ. ఆ అది అలాగా ఆ, ఆ, ఒరే గోవిందా. ఎంతకాలం ఇలా వంటరిగా ఉంటావ్, దేన్నో ఒకదాన్ని చూచి ముడేసుకోరా.

గో:- పెళ్ళా? నాకెందుకయ్యా పెళ్ళి.

పా:- అందరూ ఎందుక చేసుకుంటున్నట్లో? ఏమిరా చేసుకుంటే? పెళ్ళాన్ని చాకలేనని భయమా?

గో:- నేను చాకేదేమందయ్యా. యిద్దే పడుంటది. నేను మీకు సేవ చేస్తుంటే, అది అమ్మాయిగార్కి సేవ శేస్తుంటదా. అదికాదు నా బాధ. రెయ్యం బొగళ్ళు నేన మీక సేవ శెయ్యన సటపొయ్యనే. అదేం సుఖ దొద్దా.

పా:- నోరుమూయ్రా చవటా.

[శ్రీహరి ప్రవేశం]

శ్రీ:- ఏం మావయ్యా, వెళ్ళి భోజనం శెయ్యరూ. ఈ రోజు మీటింగు వుంది. త్వరగా కానివ్వండి.

పా:- నేను మీటింగుకొచ్చేటట్లున్నానటయ్యా.

శ్రీ:- అయితే నన్నొక్కడ్నే వెళ్ళమంటారా.

పా:- నేను చెప్పలేదే. శ్రీహరి, నీవు మీటింగుకు వెళ్ళకుంటే మంచిది.

శ్రీ:- ఆదేమిటి మామయ్యా, పట్టుబట్టి కమిటీలోకి వేయించింది మీరేగా.

పా:- అవునయ్యా నా జీవితంలో నేను చేసిన పెద్ద తప్పు యిదొక్కటే.

శ్రీ:- ఆహాఁ.. అయితే మీ జీవితంలో ఇది తప్ప మిగతావన్నీ మంచిపనులే చేశారన్నమాట. వెరీగుడ్. వెరీగుడ్. (అంటూ లోని కెళతాడు)

కృష్ణ:- నాన్నా, మీరు భోజనానికి లేవండి. నాకు పూజకు వేళైంది.

పాప:- వస్తున్నానమ్మ (లోనికెళతాడు)
[గోవిందుకూడా లోనికెళ్ళబోతాడు. బయట ద్వారంనుండి దొర స్వామి ప్రవేశం]

దొర:- పాపయ్యగారూ ! పాపయ్యగారూ!

గో:- ఇష్ (అని సైగ చేస్తాడు) అయ్యగారు ఇప్పుడే భోజనానికి కెళు తున్నారు. మీరు పిలిచారంటే ఆయన భోంచేయకుండానే వచ్చి కూచుంటారు. అమ్మాయిగారి పూజకు ఇబ్బందయిపోతాది.

దొర:- పూజలెందుకు?దానివలన ఫలితమేమైన ఉన్నదా. లేదూ. రాయిలకురప్పలకు మొక్కుచూ దేవుడా. దేవుడా అని దేబరించుచూ మనస్సును పాడు

చేసుకొనుచూ ముక్తిని పొందజాలకున్నారు. ఓ దేవా, ఈ మూఢులను యీ పాపమును క్షమించి బుద్ధినొసగి ప్రభువైన ఏసుద్వారా ముక్తిని ప్రసాదింపుము తండ్రీ.

గో:- అయ్యో దొరసామి.

దొర:- స్వామి (కోపంగా) స్వామి, వామి అని పిలవద్దని నేను చెప్పలేదూ. తెల్లదొరల వంశములో పెరిగిన నేను స్వామిని కాజాలనని చెప్ప లేదు. నన్ను దొరా అని పిలవమని చెప్పలేదు.

గో:- కదుమరె. కదుమరె. పొరపాటే. ఇదిగో దొరా. మీకు మీ దేవుడెక్కువైతే మాకు మా దేవుడెక్కువ. మీరు మీ దేవుణ్ని కొలుచుకోండి. మేము మా దేవుణ్ని కొల్చుకుంటాం.

దొర:- దేవుడు ఒక్కడే. దేవుడు ఒక్కడే. పరిశుద్ధ ప్రభువైన యహోవా ఒక్కడే దేవుడు-కాదందువా? కాదందువా?

గో:- కదుమరె. కదుమరె. ఇదిగో దొర, మనిషికి నీతిగాని ముఖ్యము దేవుడి దేంది లేవయా.

దొర:- ఎంతటి నీతిమంతుడైనను. యెంతటి బుద్ధిమంతుడైనను యెహోవాను నమ్మినపుడే మోక్షము కలుగును. వో ప్రభువా, దయా సముద్రుడవై కరుణించి ఈ పాపులను క్షమించుము తండ్రీ.

గో:- దొరా ! నన్నొకసంగతి చెప్పమంటా?

దొర:- యేమిటది చెప్పుమూ.

గో:- మిమ్మల్ని చూస్తుంటే నాకు చిన్నప్పుడు నేర్చుకొన్న పాటొకటి జ్ఞాపకాని కొస్తుంది, పాడమంటా.

దొర:- ఓ...నీవు పాడెదవా. చాల సంతోషము. మాకు పాడువారనిన చాలా ఇష్టము. మా పరిశుద్ధమైన మతమును బోధించుటకు పాడు వారు చాలా అవసరము. పాడుము, పాడుము.

గో:- ఓ పాడతాను వినండి.

ఒకానొకా వూరిలోన ఒకానొక అయ్యవారు
ఒక్కపని చేసినాడు మాదిరి

బల్ చక్కగా నటించినాడు పాదరి
ఆదివారం ప్రొద్దున లేచి అటూ ఇటూ పారజూచి
అరవకుండ పట్టినాడు కోడిని
ఒక గంపక్రింద దాచినాడు దానిని
హడావడిగ గుడికివెళ్ళి చెడాణడా మాటలాడి
చెప్ప మొదలుపెట్టె ప్రసంగము
చెవులు విప్పి ఆలకించిరా సంఘము
దొంగతనము చేయరాదు, దొంగసొత్తు కోరరాదు
దొంగలై మీరుండరాదు సభికులు
అట్టివారి కెపుడు దొరకదు పరలోకము
అయ్యగారి బోధవినగ, అమ్మగారు హడలుయెత్తి
గబగబా ఇంటికొచ్చి కమ్మియున్న తట్టనెత్తి
పొమ్మనంచు నొదిలిపెట్టె కోడిని
దానిబదులు కాచె చింతపండు చారుని
అయ్యగారు ఇంటికొచ్చి భార్యతోడ నిట్లు పలికె
కోడికూర నొండి పెట్టివా, ఓ సఖియా
మినప వడలు చేసిపెట్టివా
అయ్య మీదు బోధవినగ, విజ్ఞానం కలిగె నాకు
గంపకింద కోడి నొదిలిపెట్టిని, దానిబదులు కాస్తి
చింతపండు చారుని
సఖియ నే చెప్పినబోధ, సభికులకే యెరుకగాని
నీకు నేను చెప్పియుంటినా
పిచ్చిదానా, నిన్ను నేను నమ్మమంటినా.

దొర:- (కోపముతో) గోవిందూ! నీకు బుద్ధి వున్నదా?

గో:- బుద్ధా, ఏం బుద్ధయా?

దొర:- అది కాదూ, నీకు బుద్ధి వున్నదా?

గో:- ఆదేనయ్యా ఏం బుద్ధి? నా దగ్గర బుద్ధి గద్ది ఏమీలేదే!

దొర:- అబ్బా, అదికాదు, నీకు బుద్ధి వున్నదా?

[శ్రీహరి ప్రవేశం]

గో:- ఏం బుద్ధయ్యా అంటుంటే?

దొర:- అబ్బా. అదికాదు.

శ్రీ:- దొరా! శాంతించండి ఒరే గోవిందూ! దొర నీమీద చాల కోపంగా ఉన్నారు. నీకు బుద్ధి వున్నదా అంటున్నారు

గో:- అదా సంగతి! నాకెందుకులేదు బుద్ధి?

దొర:- ఉంటే పెద్దలను పరిహాసముచేసి, పాపమును మూటగట్టుకొను చున్నావు ఎందుకు?

గో:- నేనేమీ మూటకట్టుకోవడంలేదు దొరో. ఎనకటికి ఒక ఫాదరీ కథ నేను పాట పాడితే నీకెందుకయ్యా కోపము. గుమ్మడకాయల దొంగంటే భుజాలు తడుముకొన్నట్టు.

దొర:- గోవిందూ. (విసుగుగా) నీకు బుద్ధిలేదు. బుద్ధిలేదు.

గో:- లేకపోతే పోయిందిలేవయా.

శ్రీ:- గోవిందు, నీవు లోపలికిపో. శాంతించు దొరా. నే నొకటి చెపుతాను వింటారా?

దొర:- ఏమిటదీ చెప్పుమూ.

శ్రీ:- ప్రతి మతములోను మంచివాళ్ళున్నారు. చెడ్డవాళ్ళున్నారు. ఇంతెందుకు. మా మతమే తీసుకోండి. ఎందరో స్వాములార్లున్నారు. నిత్యానందస్వామి, సదానందస్వామి, సచ్చిదానందస్వామి, పరమానందస్వామి, ఆవాలస్వామి, మిరియాలస్వామి, జీలకర్రస్వామి. వీరిలో దొంగలూ ఉన్నారు, దొరలూ ఉన్నారు. అలాగే ప్రతి మతంలోనూ ఉంటారు. యేమంటారు ?

దొర:- నీవు చెప్పినది కూడ నిజమే. కాని యీ లోకములోని పాపులను రక్షింపవా డొకడున్నాడ. ఎవరు? చెప్పుమందువా. చెప్పుమందువా? అతడే పరిశుద్ధ యేసుప్రభువు. ఆ రక్షకుని అజ్ఞ ప్రకారం పాపులను పరిశుద్ధ మొనరించుటకు, పాపమును అరికట్టుటకు పాటు

పడుచున్నాము. న్యాయసమ్మతమైన పెళ్ళిళ్ళుచేసి సృష్టిని కాపాడు చున్నాము.

శ్రీ:- న్యాయమైన పెండ్లిండ్లు అంటే?

దొర:- యీ లోకరక్షకుని ఆజ్ఞప్రకారము మేము పెండ్లి భర్తలను, పెండ్లి భార్యలను నిర్ణయించెదము. అదియే న్యాయమైన పెళ్ళి. దేవుని ఆజ్ఞ ప్రకారము జరిగిన పెళ్లి.

శ్రీ:- అలాగా, అయితే నేను కృష్ణా పెళ్లి చేసుకొన్నాము. మా పెళ్లి పెద్దల ఇష్టప్రకారం జరగలేదు. మేమే నిర్ణయించుకొని చేసు కున్నాము. ఇది న్యాయమైన పెండ్లి కాదా?

దొర:- ఎందులకు కాదు? చెప్పమందువా? నిన్ను ఆమెకు పెండ్లి భర్త గను, ఆమెకు నిన్ను పెండ్లి భార్యగను నిర్ణయించి ఇద్దరిని ఒక్క టిగా చేసినదేమి చెప్పమందువా? అదియే ప్రేమ, ఆ ప్రేమే దైవము. కాదందువా, కాదందువా?

శ్రీ:- కాదని నేనెలా అనగలను? మీరు చెప్పినది అక్షరాలా నిజం.

పాప:- (లేవుకొంటూ వస్తాడు) యేం దొరా, చాలా కాలానికి కనపించావు?

దొర:- ఏమిటి పాపయ్యగారూ, నిన్నగాక మొన్న వచ్చితిని ఇంతలోనే చాలాకాల మెట్లయినది. చెప్పుము, చెప్పుము.

పా:- సరేలేవయ్యా, సీతో వాదించే పరిస్థితులలో ఉన్నానా నేను.

దొర:- అవును. మీ ఆరోగ్యము కొరకు ప్రతినిత్యము పరిశుద్ధ ప్రభువైన దేవుని ప్రార్థించుచున్నాను. ఇప్పుడు మీ ఆరోగ్య మెట్లున్నది?

పాప:- ఇంకెక్కడి ఆరోగ్యం? ఊరు పొమ్మంటుంది, ఏరు రమ్మంటుంది. (దగ్గు)

దొర:- దిగులుపడకుము, దిగులుపడకుము. దేవుని తలుచుము, మేలు కలు గును. ఓ లోకరక్షకుడవైన ప్రభువా, యీ నా మిత్రుని ఆరోగ్య వంతునిచేసి కాపాడుము తండ్రి. పాపయ్యగారు, మీతో ఒక ముఖ్య విషయము చెప్పవచ్చితిని. చెప్పమందువా, చెప్పమందువా.

పాప:- ఇష్ (సైగ చేస్తాడు)

శ్రీ:- (అది గమనించి) ఓహో అంతరంగిక విషయాలా. సరె సరె. (అని లోనికెళతాడు)

పా:- ఇక చెప్పనయ్యా, కాస్త మెల్లగా చెప్పు. గోడలకు చెవులుంటాయి.

దొర:- 20 బియ్యపు బస్తాలు, 10 నేతి డబ్బాలు, 8 పాలపొడి టిన్నులు మొత్తము లారీలో పంపినాను. వాటిని డబ్బుచేసి మీ భాగము మీరు తీసుకొని, నా భాగము నాకు పంపుము.

పా:- అలాగే!

దొర:- నేను వెళ్లివచ్చెదను.
[దొర వెళ్ళబోతాడు. ఎదురుగా ఒక వ్యక్తి వచ్చి నిలబడతాడు. సూటు, హ్యాటు, కళ్ళజోడు ఉంటాయి. సిగరెట్టు పొగ దొర ముఖాన్ని కమ్ముతుంది. దొర దగ్గుతూ]

దొర:- ఎవరు మీరు?

శేఖ:- (జవాబివ్వడు. అలాగే ఇంటిని, వ్యక్తులను పరీక్షిస్తుంటాడు)
(దొర భయపడతాడు)

పా:- ఎవరు నీవు? ఏం కావాలి?

శేఖ:- (పాపయ్యవైపు చూచి, మరలా దొరవైపు చూచి) హల్లో, తెల్ల దొరల చల్లదనంలో మెల్లమెల్లగ పైకి వచ్చిన వో నల్లదొరా, నన్ను నీవు గుర్తు పట్టలేదూ?

దొర:- (పరీక్షించి) ఓ శేఖర్ బాబూ. పాపయ్యా, మీ శేఖర్ బాబు, మీ అన్న కుమారుడు, 15 సంవత్సరముల క్రిందట ఇంటిమీద అలిగిపోయిన మీ అన్న కుమారుడు.
[పాపయ్య జేజారై మౌనంగా వుంటాడు]

దొర:- కృష్ణవేణి అమ్మా! కృష్ణవేణి అమ్మ! శ్రీహరి బాబు! శ్రీహరిబాబు (ఇద్దరూ వస్తారు) ఈ వచ్చిన వ్యక్తి ఎవరో తెలుసా? మీ శేఖర్ అన్నయ్య.

కృష్ణ:- అన్నయ్యా! (ఆనందానికి అంతులేదు.)

శేఖ:- కృష్ణా. ఆ. రె రె. రె. పావడాలు పరికిణీలు, చీరలు కట్టేశావే. అ...ఇతనెవరూ?

కృష్ణ:- మీ బావగారు.

శేఖ:- బావగారా ఓ... కంగ్రాచ్యులేషన్స్! మీ పెళ్ళికి నన్ను పిలవనే లేదు.

శ్రీ:- క్షమించండి. మా పెళ్లి పెద్దల ఇష్టప్రకారము జరగలేదు.

శేఖ:- ఓ...లవ్...మారేజ్. వెరీగుడ్. డబుల్ కంగ్రాచ్యులేషన్స్.

శ్రీ.- మీరు మాట్లాడుతూ ఉండండి. మీటింగ్ వుంది. వెళ్లి ఇప్పుడే వచ్చేస్తాను.

శేఖ:- ఓ దానికేం, అలాగే.

[శ్రీహరి వెళతాడు. కృష్ణ కాఫీ తేవడానికి లోపలికి వెళుతుంది]

శేఖ:- బాబాయిగారు... బాబాయిగారు! ఆఫ్టరాల్ ఇంటిపై అలిగిపోయిన నేను 15 ఏండ్ల తర్వాత ఇంటికి తిరిగివస్తే ఇదేనా మీ ఆదరణ. ఎక్స్పెక్ట్ చేయలేదు.

దొర:- మీ బాబాయిగారి ఆరోగ్యమేమీ బాగాలేదు.

శేఖ:- బాబాయిగారికి ఆరోగ్యం బాగాలేదా? నో, నో, నో, బాబాయి శరీరం గట్టి శరీరం (అంటూ పాపయ్యవద్ద కూర్చుని) ఉలిపికట్టె నిప్పులో పడవేసినా చెక్కు చెదరకుండా యెలా బయటకొస్తుందో మా బాబాయి కట్టెకూడా ఎన్ని రోగములు వచ్చినా చెక్కు చెదరకుండా గట్టిగానే వుంటుంది. (అని పాపయ్యను గట్టిగా తట్టుతాడు).

పా:- అబ్బా—ఏమిటిరా ఇది. నన్ను చంపేస్తున్నావ్. ఒరే శేఖర్! ఇన్నాళ్ళకు మేము గుర్తుకొచ్చామట్రా. నామీదెందుకురా నీకింత కక్ష. నే నింకెన్నాళ్ళు బ్రతుకుతాను. ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది.

శేఖ.- మీరేమీ దిగులుపడకండి బాబాయ్. మీరింకా 60 ఏండ్లు గట్టిగా గ్యారంటీగా బ్రతుకుతారు, నేను వచ్చానుగా. మీకేమీ ఫర్వాలేదు. ఎక్స్యూజ్‌మీ అఁ... దొరా ఇప్పుడు తమరేం చేస్తున్నారు?

దొర:- (తెల్లదొర పద్ధతిలో) పిల్లలకు అన్నము పెట్టుచు—

శేఖ:- ఆఫ్ట్రాల్ పిల్లలకు మీరేంటండి అన్నం పెట్టేది. మీ ఆవిడగారు ఏం చేస్తుంటారు? ఎక్స్యూజ్‌మీ. ఆవిడగారు ఉన్నారా లేక—

దొర:- మా పిల్లలు కాదుబాబు హాస్టల్ పిల్లలు. నేను ఒక చిన్న హాస్టల్ నడుపుతున్నాను.

శేఖ:- ఓ...మీరు హాస్టల్ నడుపుతున్నారా? వెరీగుడ్, వెరీగుడ్. రెండు చేతులా సంపాదన. అబ్బా, కొట్టారండి ఛాన్స్, లక్కీఛాన్స్. ఎక్స్యూజ్‌మీ.

దొర:- (కోపంగా) శేఖర్ బాబు, ఇటువంటి పాపపు మాటలు నేను వినజాలను.

శేఖ.- ఆఫ్ట్రాల్ ఈ మాత్రానికే మీకు కోపం రావడం నాకు విచారంగా ఉంది.

దొర:- కోపమురాదా, కోపమురాదా. ఓ దేవా, ఈతని పాపపు మాటను మన్నించి, ఈ బిడ్డను క్షమించుము తండ్రి.

శేఖ:- దొరా, నేను చెప్పేది కాస్త వినిపించుకోండి. హాస్టల్ నడపడమంటే సామాన్యమా! దానికి యెంతో అదృష్టం చేసుకొని వుండాలి. బాబాయ్. గోవిందపల్లెనే ఊర్లో ఒక పెద్ద హాస్టల్ వుంది. అది ఒక వూరే అనుకోండి. విద్యార్థులు 4 వేలకుపైగా వుంటారు. ఆ హాస్టల్ నడిపేవ్యక్తికి మొదట ఏమంత ఆస్తిలేదు. మధ్య తరగతి కుటుంబీకుడు. ఇప్పుడతనికి 5 కార్లు, 500 యెకరాల మాగాణి, రెండు సినిమా హాళ్ళు వున్నవి. ఇక పేరు ప్రఖ్యాతులంటారా. ప్రజలంతా అతనిని అన్నదాతయని, విద్యాదాతయని, దయాసాగరుడని, కరుణానిధి అని పొగడుతూ పూలరథాలపై కూర్చోబెట్టి ఊరేగిస్తున్నారు. ఇంత స్వల్పకాలంలో ఇంతటి శ్రీమంతుడెలా కాగలిగాడా

అని ఆలోచించేవారే లేరు. అటు సిరిసంపదలు, ఇటు పేరు ప్రఖ్యాతులు వచ్చాయంటే యెలా వచ్చాయ్? హాస్టల్ నడపడంవల్లనే. ఆఫ్టరాల్ నే నీ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మీరూ ఆతనిలాగే గొప్పవారు కావాలని ఆ భగవంతుని ప్రార్థిస్తూ ఉంటే నా మీద కోప్పడతారా. ఎక్స్క్యూజ్ మీ.

దొర:- బిడ్డల నోటి కూడు అపహరించడం పాపముకాదా, పాపముకాదా! నే నటువంటి పాపినికాను, అటువంటి పాపపు పనులు చేయజాలను.

శేఖ:- అటులైనా నీవు బాగుపడలేవు. పైకి రాజాలవు తండ్రీ.

దొర:- శేఖర్ బాబు, నాకు కోపము తెప్పింపకుము.

శేఖ:- కోపమెందుకు దొరా. మీ బోటి పెద్దలకు కోపము తగునా దొరా. లోకరక్షకుడైన పరిశుద్ధుడైన క్రీస్తు యెన్నడైనను కోపపడెనా? మూర్ఖులు, పాపులు ఆ పవిత్రమూర్తిని పట్టి, కొట్టి బాధించినను సిలువ అను కొయ్యకు కట్టి చీలలు శరీరమున దిగగొట్టినను, రక్తము ధారలై ప్రవహించినను, ఆ పవిత్రమూర్తి వారిని కోపగించెనా, కోపగించెనా, లేదు. చిరునవ్వుతో మూర్ఖుల తప్పులను మన్నింపుమని దేవుని ప్రార్థించెను. కాదందువా, కాదందువా. ఓ దేవా. యీతని కోపమును తగ్గించి, ఈతని పాపమును మన్నించి, ఈతనికి బుద్ధిని ప్రసాదించుము తండ్రీ.

కృష్ణ:- (ప్రవేశించి నవ్వుతూ) అన్నయ్యా, బాగా నేర్చావే బోధ చేయటం. (అంటూ కాఫీ అందిచ్చింది)

శేఖ:- నేను బోధచేయుచుంటినా, లేదు. ఆ దేవుని ప్రార్థించుచుంటిని చెల్లీ.

పా:- ఒరేయ్ శేఖర్, పెద్దవాళ్ళతోనటరా పరిహాసాలు?

దొర:- పెద్దలను పరిహసించి పాపమును మూటకట్టుకొనుచున్నాడు.

శేఖ:- ఫరవాలేదులే దొరా. ఆ మూట మీ బుజాన పెడతాను. మోసుక పొండి.

పా:- శేఖర్, కాసేపు ఊరుకోరా.

శేఖ:- యేమిటి బాబాయ్ నీవు చెప్పేది, ఆఫ్టరాల్. (అని తట్టుతాడు)

పా.- ఒరేయ్ ఒరేయ్ నేను మామూలు మనిషినట్రా.

శేఖ:- ఎక్స్‌క్యూజ్ మీ.

దొర:- పాపయ్యగారు నేను పోవుచున్నాను. నీవా పనిని చూడు. జ్ఞాపక ముంచుకు కదూ.

పా:- నేనేమంత మతిమరుపు మనిషిని కాదులేవయ్యా, వెళ్ళిరా. (దొర వెళ్ళును)

పా:- ఒరే గోవిందా...గోవిందా.

కృష్ణ:- (శేఖర్ వద్దనుండి కాఫీ కప్పునందుకొంటూ) గోవిందా.

గో:- అమ్మా.

కృష్ణ:- నాన్నగారు పిలుస్తున్నారు.

గో:- పిలిచారా అమ్మా.

కృష్ణ:- ఈ కాఫీకప్పు లోపలపెట్టు.

గో:- సరేనమ్మా.

పా:- ఒరేయ్, నేనెందుకు పిల్చానో కనుక్కోకుండానే పోతున్నావా.

గో:- కదుమరె. కదుమరె.

పా:- ఛీ నోరుముయ్. అది లోపలపెట్టి రంగనాథంగారి ఇంటిదగ్గర మీటింగు జరుగుతూవుంది నీవెళ్ళి గోడచాటునుండి అక్కడ ఏమి జరుగుతుందో తెలుసుకొనిరా.

గో:- అట్టాగే (గోవిందు వెళతాడు)

శేఖ:- మీటింగేమిటి బాబాయ్. బావగారు కూడా అక్కడికే వెళ్ళారు.

పా:- ఈ వూర్లో కాలేజీ కట్టించాలనుకొంటున్నారు.

శేఖ:- వాట్, కాలేజీ కట్టించాలనుకొంటున్నారా. వెరీగుడ్. బాబాయ్, కాలేజీ కోసం ఒక నాటకం ఆడేస్తాం. ఖర్చులు పోను మిగతా పైకం కాలేజీ కిచ్చేస్తాం

పా:- ఒరేయ్, నీవు నాటకాలు మానుకుంటావా లేదా?

శేఖ.- మానేశాను బాబాయ్

కృష్ణ:- ఏమిటి, నాటకాలాడటం మానేశావా నిజంగా.

శేఖ:- అవును కృష్ణా, మా నాటకాలు ప్రేక్షకులు చూడడం యెప్పుడైతే మానేశారో మేము అప్పుడే నాటకాలాడడం కూడా మానేశాం. అందు కేగా ఇక్కడికొచ్చేశాను.

కృష్ణ:- ప్రేక్షకులు మీ నాటకాలెందుకు చూడరు?

శేఖ:- కృష్ణా! మా నాటకాల్లో ఏ ముంటాయమ్మా. అదే రామాంజనేయ యుద్ధమైతే, హనుమంతుడు వచ్చి తన తోక కంటే మూడింతలు. పొడుగున రాగం తీశాడంటే ప్రేక్షకులు వన్స్‌మోర్ అని ఒకటే గోలచేస్తారు. మా నాటకాలు చూచి యేమయ్యో ఒక పాటా. పద్యము లేదు. మీరేమీ మాటలు మాటలు కలుపుకొని గుసగుస లాడు కుంటుంటే మేము నోరుతెరచుకొని చూస్తుండాలా? చాల్‌దాల్లేవయ్యా ఆదేరు నాటకాలు అంటున్నారు. చెల్లాయ్. మనవాళ్ళ స్టాండర్డు పెరగదు. మన దేశం బాగుపడదు. ఎక్స్యూజ్ మి.

కృష్ణ:- అదేమిటన్నయ్యా. మంచినాటకాలాడితే యెందుకు చూడరు. ఇంతకూ మీరేమి నాటకాలాడేరు?

శేఖ:- ఆఫ్ట్రాల్ ఒకటేమిటి, 7ర నాటకాలు ఆడేం. 1. అరదాని సీర, 2. గోడమీదపిల్లి; 2, అంబోతు రంకె: 4. ప్రేమించి పెళ్ళిచేసుకో 5. కాసులుంటే కలదు సుఖం; 6. పాపాల భైరవుడు; 7. డబ్బు కోసం గడ్డితిను...

పా:- ఓరేయ్. ఇవన్నీ నాటకాలేనట్రా!

శేఖ:- అవును బాబాయ్

పా:- అందుకేరా ఎవరూ చూడంది.

కృష్ణ:- అన్నయ్యా! ఏవైనా చారిత్రాత్మక నాటకాలాడకూడదూ. రాణి రుద్రమదేవి, పల్నాటి యుద్ధం.

శేఖ:- కృష్ణా! ఆడాలనే అనుకున్నాం. ఒక గొప్ప నాటకం. పెద్ద నాటకం బొబ్బిలియుద్ధం.

కృష్ణ:- ఆదేరా?

శేఖ:- చెప్పనీ. ఆ నాటకంలోని పాత్రలకు సరిపోయే విగ్రహాల కొరకు గాలించాం. కొందరు దొరికారు. కాని పాపారాయుడు పాత్రకు సరియైనవాడు దొరకలేదు. చాల రోజులు వూరంతా వెతికాము. ఒక రోజున వున్నట్టుండి ఒక వ్యక్తి కనిపించాడు. బాబాయ్, అతనున్నాడు మాడు. నా మీద అరడుగు పొడుగు. యింతంత రెట్ట. ఆఁ... దారాసింగే అనుకో. కనుగుడ్లు యింతింత. అతన్ని చూడగానే నాకు పట్టరాని ఆనందం కలిగింది. వెంటనే అతని దగ్గరకెళ్ళి యేమండీ, మీ పేరేమిటి అన్నాను. అతను ఇలా సీరియస్‌గా చూచాడు. ఎక్స్క్యూజ్ మి మీ పేరు చెప్పండి, యేమీ అనుకోకుండా అన్నాను. వెంటనే అతను (స్త్రీ కంఠంతో) "నా పేరు భీమయ్య. ఏం?" అన్నాడు.

కృష్ణ:- ఆదే కీలగొంతు... (నవ్వు) తర్వాత?

శేఖ:- ఇంకేముంది? ఆ నాటకాలాడాలన్న వుద్దేశమే పోయింది. తరువాత సాంఘిక నాటకా లాడేవాళ్ళం-ఎక్స్క్యూజ్ మి.

పా:- ఒరేయ్ శేఖర్! నాటకాలాడావు కదా, ఎంత సంపాదించావ్?

శేఖ:- సంపాదించడమంటే ఎకూజ్స్‌మీ. పేరా, లేక డబ్బా?

పా:- డబ్బురా!

శేఖ:- After all డబ్బుదేంటి బాబాయ్! ఇవాళ వస్తుంది, రేపు పోతుంది. మనం పేరు సంపాదించాం.

కృష్ణ:- అన్నయ్యా! నాటకాల్లో నీవు యేమి వేషాలు వేశావు? ఆ...హీరో వేషాలే వేసుంటావులే, పున్నమి చంద్రుడిలాంటి ముఖం.

శేఖ:- (నవ్వి) నా ముఖం చూచినవారంతా యిలాగే అనేవారు. కాని అద్దం ముందు నిలబడ్డప్పుడు నా ముఖం నాకే అసహ్యం వేసేది. అందుకని ప్రతి నాటకంలోను నాకు సరిపోయే వేషాన్నే తీసుకొనే వాడ్ని.

పా:- ఆడినమట్టుకు చాలుగాని, యిక వాడి జోలికి పోకు.

కృష్ణ:- అన్నయ్యా! ఇన్నాళ్ళకొచ్చావుకదా, నాకేం తెచ్చావ్?

శేఖ:- కృష్ణా! నిన్ను మరిచిపోతానా. తెచ్చానమ్మా. ఇదిగో! (అని సంచిలోనుండి నెక్లెస్ తీసి యిస్తాడు)

కృష్ణ:- అరెరెరె! చాలా బాగుందే, ఇదేమిటి యింత తేలిగ్గా వుంది? బంగారం కానట్టుందే?

శేఖ:- బంగారం మీదెందుకమ్మా అంత మమకారం? బంగారం వంటికి భారం, దొంగల భయం, మెడకు చిలుము, అబ్బొబ్బొబ్బొ. యిదంటావా తేలిగ్గా, నాజూగ్గా, అందంగా, తళతళ మెరిసిపోతూ వుంటుంది. రంగు గ్యారంటి, దొంగల భయం లేదు. వెలంటావా 75 Paise only. ఎక్స్యూజ్ మి.

కృష్ణ:- పైసలా?

శేఖ:- అవును. ఇది ప్లాస్టిక్ నెక్లెస్.

కృష్ణ:- ప్లాస్టిక్ నెక్లెసా అన్నయ్యా! నాకేం అవసరంలేదుగాని, వెంటనే ఎవరినన్నా పెళ్ళాడి, ఆవిడకు బహూకరించు.

శేఖ:- వాట్! పెళ్ళా? నాకు పెళ్ళేమిటి? పెళ్ళి చేసుకోవడం. పదిమంది పిల్లల్ని కనడం, వారిని భుజానవేసుకొని తిరగడం, ఛఛఛఛ.

పా:- అయితే పెండ్లి చేసుకోవటరా?

శేఖ:- ఎందుకు చేసుకోను? నాకు సరియైన పిల్ల దొరకద్దు?

పా:- పిల్లలకేమిరా కావలసినంతమంది, చూడమంటావా?

శేఖ:- అ:...అ పిల్లలు కాదు బాబాయ్ నాకు కావలసింది. కందుకూరి వీరేశలింగంగారి ఆశయసిద్ధికొరకు నేనొక వితంతువును పెళ్ళాడదల్చాను.

పా:- ఏమిటి. వెధవముండను పెళ్ళాడుతావా?

కృష్ణ:- నీ ఆలోచన చాలా బాగుందన్నయ్యా!

పా:- నీపు బాగానే వుంటుందిలే. (కృష్ణ నోరుమూసుకుంటుంది)

శేఖ:- కాని చెల్లాయ్! ఆ వితంతువు ఎలా వుండాలో తెలుసా? బంగారం బొమ్మలా వుండాలి లక్షలకొలది ఆస్తి వుండాలి. ఆమె తల్లి దండ్రులకు ఆమె ఒకతే సంతానమై వుండాలి. తల్లిదండ్రులు చని పోయి వుండాలి. అటువంటి వితంతువు దొరికితే నేను వివాహ మాడుతాను. టూ బర్డ్స్ యెట్ ఎ షాట్ అని గిరీశం అన్నట్టు అటు ఆమెకు అయిదవతనం, ఇటు మనకు ఐశ్వర్యం, ఎలా వుంది? ఎక్స్యూజ్ మి.

కృష్ణ:- (మూతి ముడుచుకుంటుంది)

శేఖ:- మన ఆలోచన నీకు నచ్చదులే. మా బాబాయ్‌కి చాలా బాగా నచ్చు తుంది. ఏమంటావు బాబాయ్? (తట్టుతాడు)

పా:- అబ్బా, చంపేస్తున్నావురా...అవును. అలాంటి సంబంధ మెక్క డుంది?

శేఖ:- మీరు తలుచుకొంటే దొరక్కపోతుందా?

కృష్ణ:- అన్నయ్యా! మీరు స్నానం చెయ్యరూ?

శేఖ:- ఏమిటి కృష్ణా! మేమింత స్ట్రాంగ్ డిస్కషన్‌లో వుంటే ఆఫ్ట్రాల్ స్నానానికొచ్చిందా తొందర-ఎక్స్యూజ్ మి.

కృష్ణ:- సరే, మీరు చర్చించుకుంటూ వుండండి. నేను పూజ చేసుకోవాలి. (లోనికెళుతుంది)

శేఖ:- ఏం బాబాయ్! అటువంటి సంబంధం వున్నదేమో చూడండి.

పా:- చూస్తానుగాని, నీవు యింటిపట్టునే వుంటావో లేక నాటకాలంటూ దేశంమీద పోతావో అనుమానంగా వుంది.

శేఖ:- నాటకాలు మానేశానని ఎన్నిసార్లు చెప్పాలి? ఎక్స్యూజ్ మి. నేను నా ఆస్తిని స్వాధీనం చేసుకొని యేదైనా వ్యాపారం చేసుకోవాలను కుంటుంటే.

పా:- నీ ఆస్తా...ఎక్కడుంది?

శేఖ:- మీ దగ్గరే. నాన్నగారు పోయేటప్పుడు నన్ను, నా ఆస్తి రెండూ లక్షలకుంటుంది, మీ స్వాధీనం చేశారుగా.

పా:— ఆఁ...చేశాడు. నీవు నాటకాలవాళ్ళతో వూరు వదలిపోయావు. మీ నాన్నగారు చేసిన అప్పులు తీర్చడానికి రెండు లక్షలేమిటి, నా చేతికి 25 వేలు వదిలింది.

శేఖ:— ఏమిటి అప్పులా? ఏం అప్పులు?

పా:— ఎందుకురా అలా అరుస్తావ్? మీ నాన్న త్రాగుడికి, జూదానికి చేసిన...

శేఖ:— నోరుముయ్.

పా:— ఒరేయ్, ఒరేయ్! ఏమిట్రా, పెద్దా చిన్నా లేకుండా నన్ను నోయి మూసుకోమంటావా?

శేఖ:— అవును. మా నాన్న త్రాగుబోతా, జూదగాడా! ఇటువంటి కూతలు కూశావంటే పళ్ళు రాలగొడతాను.

పా:— ఒరేయ్! నీవు చాలా పెద్దవాడివైనావుగాని, నా యింటిలో ఒక్క క్షణం వుండొద్దు, వెళ్ళు వెళ్ళు.

శేఖ:— వెళతానుకాని బాబాయ్, నా ఆస్తిని మర్యాదగా స్వాధీనం చేశావా సరే, లేదా కోర్టుకు లాగి నీ పరువుతీసి నిన్ను ముప్పతిప్పలు పెట్టి నా ఆస్తిని నేను స్వాధీనం చేసుకోకపోతే నేను ఆంధ్ర నట సామ్రాట్ ఛఛ రామయ్యగారి కొడుకునేగాదు.

పా:— అరె పోరా! నీవిలా వస్తావని, అగాయిత్యం చేస్తావని నాకు తెలుసురా. తెలిసే నా పేర నయాపైసా లేకుండా అంతా కృష్ణపేర వేశాను. కోర్టుకు లాగి యేం చేసుకొంటావో చేసుకో పో.

శేఖ:— కృష్ణపేర వేశావా! సరే, ఆవిడ్నే అడుగుతాను. కృష్ణా! (లోని కెళతాడు)

[లోపల సంభాషణ]

శేఖ:— కృష్ణా!

కృష్ణ:— ఏం అన్నయ్యా! యేం కావాలి?

శేఖ:— మీరింత విశ్వాస ఘాతకులనుకోలేదు. నా ఆస్తినంతా కాజేసి కులుకుదామనుకొన్నారా?

కృష్ణ:- అన్నయ్యా! మాటలు జాగ్రత్తగా రానీ. ఎవరికి కావాలి నీ పాడు ఆస్తి?

శేఖ:- నోరుముయ్. నా ఆస్తి నాకు యిస్తావా లేదా?

కృష్ణ:- నాకు తెలియదు. నాన్ననడుగు.

శేఖ:- ఆస్తంతా నీ పేరే వుంటే మీ నాన్న నడగడం దేనికి?

కృష్ణ:- నాకు తెలియదు.

శేఖ:- తెలియదూ?

కృష్ణ:- తెలియదు.

శేఖ:- కృష్ణా! ప్రాణంమీద ఆశవుంటే మర్యాదగా చెప్పు.

కృష్ణ:- నన్ను చంపుతావా? చంపు చూద్దాం.

శేఖ:- కృష్ణా!

కృష్ణ:- నోరుమూసుకొని అవతలకు నడువ్.

శేఖ:- ఏమన్నావ్? (కత్తితో పొడుస్తాడు)

కృష్ణ:- అమ్మా! (అని మూలిగి పడిపోతుంది)

పా:- కృష్ణా! తల్లీ!...నిన్ను చంపేశాడా? (అని లేచి లోపలకు పోతాడు. శేఖర్ రక్తసిక్తమైన కత్తితో ఎదురుగా వచ్చి)

శేఖ:- ఆగు...నిన్నుకూడా నీ కూతురుతోపాటు పరలోకానికి పంపుతాను.

పా:- (అరవబోతాడు)

శేఖ:- అరిచావంటే గొంతు తెగిపోతుంది.

పా:- అరవను. (అని మంచంపై వాలిపోతాడు)

శేఖ:- జాగ్రత్త! దొర వస్తున్నాడు. గుట్టు రట్టు చేశావా, మట్టుబెడతాను. ఖబడ్దార్ బడాచోర్.

దొర:- (లోనికొచ్చి పాపయ్యను కౌగలించుకొని) పాపయ్యగారు! నన్ను రక్షింపుడు,

పా:- దొరా! నన్ను కాపాడు, నన్ను కాపాడు.

దొర:- పరిహాసముకాదు పాపయ్యగారు! పోలీసులు లారీని పట్టుకొన్నారు. నా కోసం వెతుకుతున్నారు.

పా:- పోలీసు లొస్తున్నారా? రాని, రాని. నీ పాపం పండిందిరా. నీకు ఉరిశిక్ష వేయించకపోతే నా పేరు పాపయ్యేకాదు.

దొర:- ఏమిటి? నాకు వురిశిక్ష వేయించుతావా పాపయ్యా! ఈ పాపములో నీకు భాగములేదా, భాగములేదా?

శేఖ:- దొరా! ముందు నీ పాపం పండింది. నీవు చిక్కుకొంటివి. ఈతని పాపం కూడా పండనున్నది. తొందరపడకుము. ఇక్కడ వుండిన నీకు రక్షణలేదు. ఆ పవిత్రమైన గ్రంథము నక్కడపెట్టి నీ పాపమును కడుగుకొనుము. పొమ్ము. పొమ్ము.

దొర:- పాపయ్యా! నన్ను ముంచావ్. ఈ పాపం వూరికే పోదు. పైన దేవుడున్నాడు. చూస్తాడు. వస్తా! (వెళతాడు)

రంగ:- పాపయ్యా! అనుకున్నంతా అయిందయ్యా. మనిద్దర్నీ పదవుల నుండి వూడబెరికేశారు. డబ్బు లెక్కాపక్కా అంతా వప్పజెప్ప మన్నారు. ఎంత అవమానం.

పా:- రంగనాధం! నా కొంప మునిగింది రంగనాధం!

రంగ:- నీ కొంపేందయా! నా కొంపకూడా మునిగుళ్ళా!

గో:- అయ్యా! కథంతా అడ్డం తిరిగిందయ్యా.

పా:- గోవిందూ! అంతా అయిపోయిందిరా. ఈ దుర్మార్గుడు, ఈ పాపాత్ముడు...

గో:- ఏఁటయా! అన్నకొడుకును పట్టుకొని అట్లా తిడతారా?

పా:- వీడు అన్నకొడుకా! కాదు. నా కన్న కూతుర్నే పొట్టబెట్టుకున్న క్రూరకర్ముడు.

శ్రీహరి:- ఏమిటి మామయ్యా!

పా:- నాయనా శ్రీహరీ! వచ్చావా నాయనా! మన కృష్ణవేణిని వీడు హత్య చేశాడు నాయనా!

శ్రీ:- ఏమిటి? చంపేశాడా! కృష్ణా! (అని వెర్రిగా అరుస్తాడు)

కృష్ణ:- ఆ వస్తున్నా...నాన్నా! ప్రసాదం తీసుకోండి. (అందరూ నోరు తెరుస్తారు)

రంగ:- ఆఁ...యేంటి పాపయ్యా! కృష్ణవేణిని చంపేశారని గోల చేశావు?

పా:- అమ్మా! నా తల్లి, నీవు బ్రతికే వున్నావా! నేను కలగనటం లేదు కదా! ఇప్పుడే కదమ్మా శేఖర్ నిన్ను హత్య చేసింది. ఇంతలోకే ఎలా బ్రతికావ్?

కృష్ణ:- ఏమిటి నాన్నా యీ హత్యలూ, చంపుకోవడాలు?

పా:- లేదు నా కృష్ణ చావలేదు. నా బంగారుతల్లి బ్రతికే వుంది.

కృష్ణ:- (భయపడి కృష్ణ నాన్నగారి తలపై చెయ్యిబెట్టి) ఏమండి! నాన్న గారి వళ్ళు కాలిపోతోంది. కలవరింతలు కూడా మొదలైనై. వెంటనే డాక్టరుకు ఫోన్ చెయ్యండి.
(గోవిందు తట్ట తీసుకొని లోనకెళతాడు.)

శ్రీ:- అలాగే.

పా:- ఏమిట్రా, నన్ను పిచ్చివాడ్ని చేసి ఆడిస్తున్నారా?

శ్రీ:- ఏమిటి బావా, యిదంతా?

శేఖ:- ఏమీలేదు బావా! నా ఆస్తంతా కాజేసి కూతురు పేర వేశాడు. నేను లోపల చిన్న "మోనో" యాక్షన్ చేశాను. అంతే. బాబాయ్, ఎలా వుంది నా మోనోయాక్షన్?

రంగ:- మోనోయాక్షనా! యేంటయా అది? జబ్బులో వున్న వాళ్ళతోనా పరిహాసాలు. ఈ దెబ్బతో ఆయన గుండాగి చచ్చుంటే యేం గావాలి?

శేఖ:- నేను చెప్పేది వినవయ్యా రంగనాథం!

రంగ:- ఏంటయ్యా నువ్వు చెప్పేది సింగినాదం!

శేఖ:- మిష్టర్ సింగినాదం!

రంగ:- ఆఁ!

శేఖ:- ఎక్స్యూజ్ మీ రంగనాధం! ఈ మాత్రానికే అయన గుండె ఆగిపోతే నా ఆస్తంతా అమాంతం కాజేస్తే నా గుండె ఏఁ కావాలని ఆలోచించావా? పైగా నన్ను హంతకుడని అవమానిస్తాడా!

శ్రీ:- అవును. ఇది భరించరాని అవమానం. బావా! వెంటనే దావా పడై, స్టాంపు ఖర్చులు నేను పెట్టుకొంటాను.

పా:- శ్రీహరీ! మర్యాదగా చెప్పుతున్నాను. నా వ్యవహారంలో జోక్యం కలుగచేసుకున్నావా, బాగుండదు.

రంగ:- పాపయ్యో! అయ్యగారి యవారం చాలదూరం పోయింది. అసలు నీకు తెలివిలేదు లేవయ్యా. లేకపోతే 30 సంవత్సరాలనుండి ఎదురు లేకుండా యేలుతున్నామే. ఈరోజు మనల్ని తీసేశారు. ఏందీ అన్యాయం, అయో పాపయో! నీ పదవిలోకి ప్రసాదు, నా పదవిలోకి మీ అల్లుడు వచ్చేశారు. రెండు రోజుల్లోపల లెక్కా పక్కా అంతా వప్పజెప్పాలని తీర్మానించారు.

పా:- వాళ్ళెవరు నన్ను లెక్కలడగడానికి? అదేమీ వీలుపడదు. అసలది మీటింగే కాదు. ప్రెసిడెంటు లేకుండా మీటింగేమిటి? అర్థం లేకుండా.

శ్రీ:- మామయ్యా! అదేం లాభంలేదు. ఇప్పటికి జరిగిన అవమానం చాలు. మర్యాదగా లెక్కలు వప్పచెప్పండి.

పా:- నాకు మర్యాద నేర్పుతున్నావా నీవు? ఒరేయ్, నీవు నా అల్లుడివి కాదు. ముందు నా యింటిలోనుంచి బయటికి నడువు.

కృష్ణ:- నాన్నా! మర్యాదగా మాట్లాడండి. ఆయనేమీ యిక్కడ గతిలేక వుండడంలేదు.

పా:- ఏమే, ఏమే! వాడే యెక్కువైనాడా నీకు? అంతేనే అంతే. కని పెంచి పెద్దచేసిన నేను నీకు పనికి రాకుండా పోయానా? ఛీ! నీ ముఖం చూడగూడదు. వెళ్ళు.

కృష్ణ:- వెళతాం! మేమేమీ బ్రతకలేక యిక్కడుండడంలేదు. దిక్కు లేని చావు చస్తావేమోనని కనిపెట్టుకొని వున్నాం. అందుకని అనరాని మాటలని అవమానిస్తారా? ఏమండీ, బయల్దేరండి, వెళదాం. (విసురుగా లోనికెళుతుంది. శ్రీహరి, శేఖర్లు ఆమె ననుసరిస్తారు).

రంగ:- అమ్మా! చూచావయో పాపయ్యా! కన్నతండ్రి కంటే కట్టుకొన్న మొగుడే ఎక్కువైనాడు. అంతేనయో అంతే అసలు నీకు తెలివి లేదు లేవయ్యా. ఊరంతా వొకదారి. ఉలిపికట్టెది ఒక దారనా? మొండిపట్టు పట్టి అందర్నీ విరోధం చేసుకొన్నావు.

పా:- రంగనాధం! ఊరు పొమ్మంటుంది, యేరు రమ్మంటుంది. ఈ అవసాన కాలంలో నాకెందుకయ్యా యీ చింత?

రంగ:- ఎందుకంటే? చేసుకున్నోడికి చేసుకొన్నంత.
[కృష్ణవేణి, శ్రీహరి, శేఖర్లు ప్రవేశిస్తారు]

పా:- యేం? వెళతారా? వెళ్ళండి.

కృష్ణ:- మేమెక్కడికి వెళతాం నాన్నా?

పా:- అవును. ఎక్కడికి వెళతారు? వెళితే యెలా బ్రతుకుతారు?

కృష్ణ:- మాకేం అంత దరిద్రమొచ్చింది? కావలసినంత ఆస్తి పెట్టుకొని

పా:- ఏమిటి! నా ఆస్తితో కులుకుదామనుకొన్నారా? అదేం వీలుపడదు చెపుతున్నా.

శేఖ:- బాబాయ్! ఆఫ్ట్రాల్ నీ ఆస్తేమిటి; నా ఆస్తి కూడా కృష్ణపేర వ్రాశేశావుగా. ఎక్స్యూజ్ మీ

పా:- ఓరి పాపాత్ముడా! దానికంతా చెప్పేశావన్నటా

కృష్ణ:- చెప్పితే యేం? గోవిందా ... గోవిందా!

గో:- ఏమమ్మా?

కృష్ణ:- మీ అయ్యగారి మంచం గోపాల పూజా మందిరం ప్రక్క గదిలో వెయ్. నాన్నా! మీ కికమీదట్నుంచి భోజనం, మందులు అన్నీ అక్కడికే వస్తాయ్. ఊరి పెత్తనంతో పాటు యింటి పెత్తనం

కూడా వొదులుకుని, కృష్ణా, రామా అనుకొంటూ ఆ గదిలో పడుండండి.

పా:- ఏమే, ఏమే! నువ్వేనా మాట్లాడేది?

కృష్ణ:- అవును. నేనే. అన్నయ్యా, గోవిందా! నాన్నగారిని లోపలకు తీసుకుపోండి! (అలాగే అతన్ని ఎత్తుకొనిపోతూ వుంటారు)

పా:- ఒరే శేఖర్!

శేఖ:- ఎక్స్క్యూజ్ మి! ఎక్స్క్యూజ్ మి!

పా:- ఒరే గోవిందా! అన్యాయంరా!

గో:- ఆఁ. కదుమరె. కదుమరె. (అంటూ పాపయ్యను లోనికి తీసుకెళతారు)

కృష్ణ:- ఏమండీ! గ్రామ డబ్బు, కాలేజీ డబ్బు. అంతా లెక్క చూడండి. యిచ్చేస్తాను. రికార్డంతా ఆ బీరువాలో వుంది, స్వాధీనం చేసుకోండి. (తాళపు చేతులు శ్రీహరి కిస్తుంది)

శ్రీ:- అంతేకాదు కృష్ణా! మీ అన్నయ్య ఆస్తికూడా మీ అన్నయ్య కిచ్చేయాలి.

కృష్ణ:- అలాగే! ఏమిటీ రంగనాధంగారు, అలా నోరు తెరచుకొని చూస్తున్నారు?

రంగ:- ఇంకేముందమ్మా! చూడాల్సిందంతా చూసేస్తినే. (అంటూ నెత్తిన గుడ్డ వేసుకొని నీరసంగా నిష్క్రమిస్తాడు.)
[కృష్ణవేణి, శ్రీహరి నవ్వుకుంటూ వుండగా]

— తెర : —



# మనిషి చావకూడదు

రచన :

యన్. ఆర్. నంది

## పాత్రలు

శ్రీనివాసులు
రామచంద్రరావ్
హనుమంతరావ్
సుబ్బరాజు
సీత

ఒకానొక సమయంలో బాగా బ్రతికింది ఆ యిల్లు. యజమాని పడిపోవడంతో అదీ దిగాలు పడిపోయి శిధిలావస్థలో వుందిప్పుడు. ఇంట్లో అలంకరణలు లేవు. ఒకానొకప్పుడు బాగానే వుండి వుండొచ్చు. ప్రస్తుతం మాత్రం ఎదుటి గోడకి పాతకాలం నాటి ఆయిల్ పెయింటింగ్-ఒక నడివయస్సు స్త్రీది-వడిలిపోయిన పూల మాలతో వుంది. కుడివైపు ద్వారం వీధిలోకి, ఎడంవేపు ద్వారం యింటి లోపలి భాగాలకి. ఎదురుగాకనిపించే ద్వారం లోనించి వెనక గదిలో జీర్ణావస్థలో వున్న టేబిల్, కుర్చీ వుంటాయి. ఎడం వేపున మూలగా ఒక మంచం—ముక్కాలి పీట. కుడి వేపున బట్టలు దండెం, ఒక కుర్చీ విద్యుద్దీపాలు వుంటాయిగానీ, అవి ధనిక చిహ్నాలు కావు. కూలిపోయిన శిధిల సంసారానికి ఆనవాలుగా మిగిలి పోయిన పాతకాలపు స్మృతులు.

ఆ యింట్లో మూడు జీవచ్ఛవాలు బ్రతుకుతున్నాయి. మానసికంగా చచ్చిపోయిన ఒకానొకప్పటి శ్రీనివాసులు. ఆర్థికంగా చచ్చిపోతున్న అతని కొడుకు రామచంద్రరావ్, నైతికంగా చచ్చిపోవాల్సిన అతని కోడలు సీత. సత్సాంప్రదాయాలు గల నవ నాగరిక సమాజంలో మనిషి ఏ చావుల కైతే లొంగిపోకూడదో, ఆ చావులకే వాళ్లు ముగ్గురూ లొంగిపోయారు; పోతున్నారు; పోబోయారు.

తెర విడేసరికి మూల మంచం మీద శ్రీనివాసులు దగ్గుకి కిరకిర్లాడి పోతున్నాడు. ఎడం వేపు నించి సీత వచ్చి ఒక చింకి దుప్పటి అతని మీద కప్పింది. శ్రీనివాసులు దగ్గు తగ్గింది. సీత అతని వేపు అసహ్యంగా, కోపంగా చూసి, విసుక్కుని లోపలికి పోయింది. ఆమె వెళ్ళిన వేపే చూస్తున్న ముసలాయన బయట తలుపు తట్టిన చప్పుడు విని ఉలిక్కి పడ్డాడు.)

శ్రీని:- అమ్మా! సీతా! చూడమ్మా, రామచంద్రరావ్ వచ్చినట్టున్నాడు. (లోపలినించి సమాధానం లేదు. తనే లేవబోయాడు)

సీత:- (వస్తూ) మీరు లేవడం ఎందుకు? 'ఇంట్లోవాళ్ళంతా ఎక్కడ చచ్చారు- జబ్బుమనిషే లేచి తలుపులు తియ్యాలా?' అని ఆయనచేత తిట్టించడానికా?

(శ్రీనివాసులు ఉస్సురంటూ కూలబడ్డాడు. సీత తలుపులు తెరిచింది. రామచంద్రరావ్ ఫైల్సుతో లోపలికి వచ్చాడు. చెప్పులు విడుస్తూ ఫైల్సు ఆమె కందించాడు. ఆమె తీసుకుని ఎదుట ద్వారంగుండా లోపలికివెళ్ళి ఫైల్సు టేబిల్‌మీద పెట్టివచ్చింది. ఈలోపున రామచంద్రరావ్ అక్కడేవున్న చెంబుతీసుకుని బయటకి వెళ్ళి కాళ్ళు కడుక్కొని వచ్చాడు. సీత తువాలు అందించింది. రామచంద్రరావ్ ముఖం, చేతులు తుడుచుకున్నాడు.]

రామ:- బుజ్జిగాడింకా ప్రైవేట్‌నించి తిరిగిరాలేదా?

సీత:- లేదు.

రామ:- చంటాళ్ళు నిద్రపోయారా ?

సీత:- వాళ్ళంత త్వరగా నిద్రపోతే యిహనేం? ఇక్కడ నేనొక్కదాన్ని తీరుబడిగా వున్నానుగా-నా ప్రాణం పీకి పాకాన పెట్టడానికి?
(శ్రీనివాసులు దగ్గాడు. రామచంద్రరావ్ అతని దగ్గరకు వెళ్ళాడు)

రామ:- ఎలావుంది నాన్నా, నీవంట్లో యిప్పుడు?

శ్రీని:- పైకి పోవాలని గోల పెడుతున్నాను. వద్దని వారిస్తున్నాడు పైవాడు.

సీత:- ఆయనడిగింది మీ జబ్బు గురించి-వేదాంతం గురించి కాదు,

శ్రీని:- తెలుసునమ్మా. మనిషి నేలమీద బోర్లాపడినప్పుడే వేదాంతం మాట్లాడతాడు.

సీత:- ఉహూఁ! (విసుక్కుంటూ లోపలికి పోయింది)

రామ:- అన్నట్టు చెప్పడం మరిచాను. డాక్టర్ ఈ మందులు రాసిచ్చారు నాన్నా!

శ్రీని:- నన్ను బ్రతికించుకోవాలనా? పిచ్చివాడా? ఆకు పండిపోయింది. మందులకి రాలకుండా వుంటుందా?

రామ:- అదిగో అలా అంటే యిలా అంటావ్. మనసు పాడు చేసుకుంటే జబ్బెలా నయమవుతుంది?

శ్రీని:- నాకింకా మనస్సు వుందనే అనుకుంటున్నావురా? అది మీ అమ్మతో బాటే పోయింది.

రామ:- సర్లే, యిక ఎక్కువగా మాట్లాడకు. కాస్సేపలా నిద్రపో.
(సీత వచ్చింది. రామచంద్రావ్‌కి ఒక కవరు అందించింది)

రామ:- ఏవిఁటి ?

సీత:- ఏమో! సుబ్బరాజుగారిచ్చారు.

రామ:- ఎప్పుడు?

సీత:- మధ్యాహ్నం.

రామ:- అతనెక్కడికీ వెళ్ళలేదా ఈవాళ?

సీత:- ఎందుకెళ్తాడు ? ఇదో ధర్మసత్రం వుందిగా - దిక్కూ మొక్కూ లేనివాళ్ళందరొచ్చినా - నేనో యంత్రాన్ని వున్నానుగా - అందరికీ వండి వార్చి వడ్డించడానికి.

శ్రీని:- తప్పమ్మా! సుబ్బరాజేం దిక్కులేక మనింటికి రాలేదు.

సీత:- కాకపోతే యిదేవిఁటి? ఆతిథ్యమంటే ఒకటి రెండు రోజులుగానీ, నెలల తరబడి నెత్తికెక్కికూచుంటే ఇక్కడ మాత్రం డబ్బులు చెట్లున్నాయా? తేరగా రూపాయలు వస్తున్నాయా?

రామ:- సీతా! ఒకళ్ల గురించి అంత దురుసుగా మాట్లాడేముందు తారతమ్యాలు కూడా ఆలోచించాల్సి వుంటుంది.

సీత:- నాకా యోగ్యత లేదంటారు. ఇంతకూ నేను లేని కుటుంబంనించి వచ్చాననేగా మీ ఎత్తిపొడుపు?

శ్రీని:- ఇప్పుడందరం అదే గొంగళీ బ్రతుకు బ్రతుకుతున్నాం తల్లీ! యోగ్యతలు, సంస్కారం గురించి మాట్లాడితే నీకున్నంత చదువూ, సంస్కారం ఈ యింట్లో ఎవరికున్నాయి చెప్పు?

సీత:- అలాగా, ఈ మాటల్ని ఏవంటారో? ఎత్తిపొడుపు కాదూ? ఛీ, ఛీ.

(సీత విసురుగా లోపలికి పోయింది. శ్రీనివాసులు కొడుకు తల నిమిరాడు)

శ్రీని:- రామూ! నేను జీవితంలో ఏమీ సుఖపడలేకపోయాను. నిన్నూ అలానే ఈ నరకంలో తోసేశాను.

రాము:- ఇప్పుడు నాకేం తక్కువ నాన్నా? చక్కగా వుద్యోగం చేసు కుంటున్నాను: పండంటి సంసారం...

శ్రీని:- ఇదే కదూ నీ పండంటి సంసారం...

రాము:- ఇందులో సీత తప్పు మాత్రం ఏవుంది నాన్నా? తనకి ఎన్నో ఆశలు వుండేవి. కాని పరిస్థితులు తల్లకిందులు కావడంతో పిచ్చిగా ఏదో మాట్లాడుతుంది గానీ, సీత మనసు వెన్నలాంటిది నాన్నా!

శ్రీని:- నా ఉద్దేశం అది కాదు రామూ! సీత ఉద్రేకానికి అసలు కారణం నాకూ తెలుసు. కాని ఆ స్థితినించి మన్ని మనం రక్షించుకోవడం ఎలాగన్నదే నాబాధ.

రాము:- రోజు లెప్పుడూ ఒకేలా వుండవు నాన్నా! ఒకనాటికి కాకపోతే ఒకనాటికేనా మారతాయి.

శ్రీని:- ఆశ. ఆ ఆశతోనే బ్రతుకుతాం. ఆ ఆశ ఏనాటికైనా ఫలిస్తుం దనే జీవితాన్ని ఈడ్చుకుపోతాం. కాని నేను నాశనమై, మిమ్మ ల్నందర్నీ సర్వనాశనం చేశాను రామూ!

రాము:- పోన్లే, ఆ వెనకటి విషయా లెందుకు లే!

శ్రీని:- భరించ లే నంటావ్. కాని నాకు నిష్ప్రయోజనం లేదు. ఇలా పనీ పాటా లేకుండా ఒంటరిగా ఈ ఇక్కట్ల మంచంలో పడుకునుంటే నా మెదళ్ళో మెదిలేవి ఆ భూతాలే రామూ!

[హనుమంతరావ్ బయట నించి వచ్చి తండ్రీ కొడుకుల్ని చూశాడు.]

హను:- ఏవిటి తాతయ్యోయ్! తొడుకుని కావలించుకుని ఆ ముద్దు ముచ్చట్లు?

[ ఎవరూ మాట్లాడ లేదు. ]

హను:- ఆఁ, మావయ్యోయ్! ఇందాక బజార్లో సుబ్బరాజు కనిపించాడు.

రాము:- ఏవన్నా చెప్పాడా?

హను:- విశేషాలు అంత పెద్దగా లేవుగానీ, ఈ భూతలాన్నంతట్నీ ఉద్ధరించే పథకం వేసేట్టు పోజెట్టి ''వెల్ మై బాయ్'' అన్నాడు ఉపోద్ఘాతంలో...

శ్రీని:- సోది మాని సరిగ్గా చెప్పురా.

హను:- సంగ్రహంగా చెప్పాలంటే ఆయన ఘంటసేపు వూదరగొట్టిన లెక్చర్‌లో ఆవగింజంతైనా అంశం లేదు. ఎంతయినా పొలిటికల్ లీడర్ అయ్యే లక్షణాలు మరి!

(హనుమంతరావు సోది వినలేక రామచంద్రరావ్ కవర్ విప్పాడు.)

హను:- ఆ కవరు సుబ్బారాజు యిచ్చిందేనా? చదవడం అనవసరం. అందులో ఏం వుంటుందో నేను చెప్తాను. అందులో టూకీగా రాసుంటాడు. వివరాలు నాకు చెప్పాడు.

శ్రీని:- ఏవిటా వివరాలు?

హను:- వివరాలు కూడా వివరంగా వివరించ నవసరం లేదు తాతయ్యా, అందులో జరగబోయే క్లైమాక్స్ చెప్తాను: వీలైనంత త్వరలో ఈ సుబ్బరాజూ ది గ్రేట్ శ్రీ కృష్ణుడు పుట్టిన కటకటాల గదికి పంపించేస్తాడు.

శ్రీని:- జైలుకా?

(రామచంద్రరావు వుత్తరాన్ని చదివి పక్కకి పారేశాడు.
హనుమంతరావు ఆ వుత్తరాన్ని అందుకుని జేబులో పెట్టుకుంటాడు.)

హను:- ఏవిటి వీల్లేనిది? జైలుకి వెళ్ళడవా? ఆయన సలహా పాటించడవా?

రామ:- రెండూను.

హను:- ఎందుకో?

రామ:- అంతరాత్మను చంపుకోలేను.

హను:- (నవ్వాడు.) నీకో అంతరాత్మ వుందేవిటి మావయ్యా?

శ్రీని:- ఏవిటి రాశాడు అందులో?

హను:- జైల్లోకి పోయేందుకు అయిదు సులభ సూత్రాలు.

శ్రీని:- నువ్వుండరా! రామూ, ఏవిట్రా రాసింది అందులో?

రాము:- ఎప్పుడూ పాడే పాతపాటే.

శ్రీని:- బాకీ తీర్చమంటున్నాడా?

హను:- మహానాయకుడు-అంత 'కర్ట్'గా చెప్పేస్తాడా? డిప్లమసీ తాతయ్యా-డిప్లొరబుల్ డిప్లమసీ! డొంకతిరుగుడుగా చెప్తాడు. త్వరలో ఎమ్మెల్యే అయి మినిష్టర్ కావాలని కలలు కాస్తున్నాడు. ప్రాక్టీస్‌కోసం అందాకా యిలా వుత్తరాలు రాస్తున్నాడు.

రాము:- మన కష్టాలు చూడలేకపోతున్నాడట.

హను:- డిప్లమసీలో ప్రథమసూత్రం : అలా సానుభూతి చూపడం.

రాము:- అందుకు ఆయనో వుపాయం చెప్పాడు.

హను:- మనిషిని తప్పుదారిలోకి మళ్ళించేముందు తన గ్రిప్‌లోకి లాక్కోవాలి. నెంబర్ టు అది.

రాము:- లంచం తీసుకోమంటున్నాడు.

హను:- 'ఫైనల్ బ్లో'. ఇది చెప్పడంలోనే పొలిటిక్స్ రహస్యం దాగివుంది.

శ్రీని:- నువ్వుండరా. అయితే ఆ లంచాలు ఎలా తీసుకోవాలో చెప్పాడా?

హను:- Exactly. పరిష్కారం చూపించకపోతే పొలిటీషియన్ కాలేడు. అఫ్‌కోర్స్ పెర్వర్టెడ్ పొలిటీషియన్నే అనుకో.

శ్రీని:- ఏవిఁటి రామూ నీ వుద్దేశం?

హను:- యు మీన్ ది అవుట్ కమ్? నెట్ రిజల్ట్? జైలు మనకి, డబ్బు అతనికి. ఇదే ఈ ట్వన్టియెత్ సెంచరీ పొలిటికల్ ఫిలాసఫీ తాతయ్యా! నీకేం తెలుసు ఈనాటి డెమోక్రసీ గురించి!

శ్రీని:- ఒరే హనూ! నువ్వు కాసేపు నోరు మూసుకుంటావా?

హను:- ఏవిఁటి తాతయ్యా, నువ్వు మరీ యింత పిచ్చిగా మాట్లాడుతావ్! ఆ సుబ్బరాజు మన కొంప నిలబెట్టేందుకు వచ్చిన దేవతే అనుకుంటున్నావా?

రామ:- అలా ఒని నన్ను ఎప్పుడూ అనుకోలేదురా.

హను.- నా వాక్యం యింకా పూర్తి కాలేదు అంకుల్. నేనూ అక్కడికే వస్తున్నా. పూర్వజన్మలో-అంటే తాతయ్య బాగా బ్రతికిన దినాల్లో -ఈ సుబ్బరాజు తండ్రి-సమ్ ఎక్స్ - యమరాజో వాడి తాతో తాతయ్యకు అప్పిచ్చాడు. చివరికి, చచ్చేముందు ఈ సుబ్బరాజుని వసూలు చేసుకోమని ఫర్మానా జారీచేసి మరీ చచ్చాడు. అది యిప్పుడు మనమున్న పరిస్థితుల్లో చచ్చినా తీర్చలేం. అది సుబ్బ రాజుక్కీ తెలుసు, మనకీ తెలుసు. అందువల్ల లంచాల ఉచ్చులోకి అందర్నీ లాగి ఆ డబ్బు మన చేతికి చిక్కకండానే అడ్డంకొట్టి కథని కంచికి మనల్ని శ్రీకృష్ణుడు పుట్టిన దగ్గరికీ పంపించెయ్యా లని అతని ఎత్తుగడ.

శ్రీని:- అప్పు తీసుకున్నాక తీర్చక తప్పుతుందా?

హను:- అప్పు నువ్వు చేసుకున్నావ్; మామయ్య చెయ్యలేదు.

రామ:- హనూ! ఏవిట్రా నువ్వు మాట్లాడేది? అప్పు ఎవరు చేస్తేమటుకు తీర్చే బాధ్యత నామీద లేదా?

హను:- శ్రీరామ చంద్రు డంతటి వాడివి. నీమీద ఎందుకు లేదంటాను? కాని మామయ్యా, ఒక్క విషయం ఆలోచించు! నీ జీతం యిప్పుడెంత? నెలకి నూటయాభై. అందులోనే మనమందరం బ్రతకాలి. రేపు నీ కొడుకులు పెరిగి చదివి ప్రయోజకులు కావాలి. ఇప్పుడు నువ్వు జైలుకుపోయి, వాళ్ళని మరోతరం మైలురాళ్ళుగా మార్చేస్తావా?

శ్రీని:- వాడెందుకు జైలుకి వెడతాడు? లంచం తీసుకుంటే కదా?

హను:- తీసుకోవాలి.

రామ:- తీసుకోను.

హను:- మరి అప్పుమాట?

(రామచంద్రరావు ఏం చెప్పలేక కూలబడ్డాడు. సీత వచ్చింది)

హను:- అత్తయ్యా!

సీత:- ఏం అల్లుడూ?

హను:- చంపేశావ్! నువ్వు సరిగ్గా మూడ్‌లో వున్నట్లు లేదు. ఆ కాఫీపొడీ, పంచదారా ఎక్కడున్నాయో చెప్పు. రెండు కప్పుల స్ట్రాంగ్ డోస్ పడేస్తే వీళ్ళిద్దరూ తేరుకుంటారు.

సీత:- ఆ పాపంకూడా నాకెందుకు? కాచి తయారుగానే వుంచాను. పట్టు కొస్తా వెళ్ళి.

హను:- లెట్ మి హెల్ప్. నన్ను కూడా కాస్త సాయం చెయ్యనీ. పాపం ఒక్కదానివీ ఎంతకని కష్టపడతావు.

సీత:- నీ సానుభూతికి ధన్యవాదాలు. ఆ వేలితోనే రేపు నా కంట్లో పొడుస్తావు.

హను:- నేనా? ఎంతమాటనేశా వత్తయ్యా!

సీత:- ఏం నువ్వు, మనిషివి కావా? మొదట్లో ఈ కొంపలో నీలానే సానుభూతి చూపించారంతా. రాన్రాను 'ఎవడికోసం చేస్తుంది, వంటింటి కుందేలు' అన్నట్టు బిగుసుక్కూచున్నారు.

(రామచంద్రరావు ఎదుటి గదిలోకి పోయి ఫైల్సు ముందు కూలబడ్డాడు.)

హను:- (టాపిక్ మారుస్తూ) ఈవేళ కూరేమిటి చేస్తున్నా వత్తయ్యా?

సీత:- వెజిటిబుల్ పలావు చేస్తున్నా నల్లుడూ! త్వరగా వడ్డించుక తిందువు గాని.

హను:- ఎందుకు కంగారు పడతావు? వెజిటెబుల్ పలావు కాదు, ఏనుగుల్ని తినే రోజు కూడా వస్తుంది.

సీత:- 'పై జన్మలో రాక్షసులమై పుట్టాక' అని కూడా కలుపు.

హను:- చూస్తావుగా ఏ జన్మలో తింటావో? మరో రెండు నెలలు ఓపికపట్టు. మనం అప్పటికి ఉద్యోగంలో చేరి...

సీత:- ఉద్యోగాలు చేసేవాళ్ళు యింత వెలగబెట్టేస్తున్నారు, నువ్వు చేసి మరింత వెలగబెడతావు.

శ్రీని:- హనూ, నువ్విక లోపలికి పోతావా?

సీత:- అతన్నెందుకు కసరడం? ఆ మాటలన్నది నేను.

హను:- కాని నిన్ననడానికి తాతయ్యకు దమ్ముల్లేవత్తయ్యా! ఇక్కడ నే నొకణ్ణి అలుసుగా వున్నానుగా?

శ్రీని:- ఇక్కడెవరూ ఎవరికీ అలుసుకాదురా హనూ, ఎవరికున్న స్థానం వాళ్ళకుంది. ఆ స్థానం విలువ తెలుసుకుంటే ...

సీత:- ఆ విలువ నాకు తెలీదంటారా అయితే?

శ్రీని:- నిన్నన లేదు సీతమ్మా!

సీత:- మరెవర్ని? ఏం చేత కాకపోయినా ఈ కొంపలో ప్రతివాళ్ళకూ సూటీలు విసరటం మాత్రం తెలుసు.

హను:- కరెక్టు. నీ విషయంలో కూడా సెంట్ పెర్సెంట్ కరక్టే నత్తయ్యా!

రాము:- (లోపలనించి అరిచాడు) హనూ!

హను-: పిలిచావా మావయ్యా?

రాము:- (లోపలి నించే) దయచేసి కాసేపు నన్ను వూపిరి పీల్చుకోనిస్తావా?

హను:- శాంక్షన్డ్. అలానే మావయ్యా... ఏం అత్తయ్యా, మావయ్యకు ఊపిరి సలపటం లేదట. కాస్సేపు వాళ్ళనలా వొదిలేసి మన మెళ్ళి వంటపని చూసుకుందాం?

సీత:- పిల్లిని చంకన బెట్టుకుని కాశీకి వెళ్ళినట్టు నువ్వెందుకు నా వెనకాల?

హను:- తోడు. ఫర్ హెల్ప్. ఎంతయినా మనిషిని చూడూ: పరుల కష్టాల్లో ఆదుకోవడం నా బర్త్రైట్. నడు నడు.

(హనుమంతరావు ఆమెను లోపలికి తీసుకుపోయాడు. రామచంద్రరావు చిరాకుగా బయటికి వచ్చాడు. తండ్రిని చూసి నిట్టూర్పు విడిచాడు. బయటకు వెళ్ళబోయాడు)

శ్రీని:- ఎక్కడికి రామూ?

రాము:- తెలీదు (వెళ్ళిపోయాడు)

హను:- (రెండు కప్పుల్తో వచ్చాడు.) మావయ్యేడీ?

శ్రీని:- వెళ్ళిపోయాడు.

హను:- ఎందుకు ?

శ్రీని:- ఆత్మశాంతికోసం.

(ఒక కప్పు బల్లమీద పెట్టి, తనో కప్పు తాగుతున్నాడు హనుమంతరావు)

హను:- ఎలాగైనా అత్తయ్యది అమృతహస్తం తాతయ్యా, మనిషి చేదుగా మాట్లాడుతుంది గానీ... (బయట చప్పుడైతే బయటకు చూశాడు) ఒహో సుబ్బరాజుగారా ! సుస్వాగతం, రండి రండి.

సుబ్బరాజు:-(వస్తూ) రామచంద్రరావు అంత కంగారుగా వెళ్ళిపోతున్నాడెక్కడికి?

హను:- గోదార్లోకి.

సుబ్బ:- ఆఁ? !

హను:- తాత య్యన్నాడు.

సుబ్బ:- చాల్లేవయ్యా! నీకింకా కుర్రతనం పోలేదు.

హను:- లేకపోతే పొలిటీషియన్నే అవుదును, బై దిబై మాష్టారూ - ఈ మధ్య నాకు పొలిటికల్ సైన్సు మీదికి తెగప్రాణం పోతోంది. థియరీ చదివేశాను. కాస్త ప్రాక్టికల్ ట్రైనింగ్ యిస్తారూ?

సుబ్బ:- నాకేం తెలుసు ?

హను:- ఆఁ ఆఁ. గొప్పవాళ్లు అలానే అంటూంటార్లెండి.

సుబ్బ:- నేను గొప్పవాణ్ణనా నీ ఉద్దేశం ?

హను:- నా ఉద్దేశంకాదు. క్రితం మూడు ఎలక్షన్లకోసూ మీకు ఓటిచ్చిన ఏడు వోటర్లదీను...ఆఁ ఏమంటారు? ఇస్తారా ట్రైనింగ్?

[కోపంగా మారు మాటాడలేక తల పక్కకి తిప్పారు. కాఫీ కప్పు కనిపించింది ]

హను:- కమాన్ కమాన్, కాఫీ కావాలా? తీసుకోండి. [కప్పు అందించాడు]

[తాగి దొక్కున్నంతపని చేశాడు.]

హను:- మీ యింటిదగ్గర మిమ్మల్ని తలచుకుంటున్నట్టున్నారు. బై ది బై ఈ మధ్య మీరేదో కొత్త బిజినెస్ మొదలెట్టారట?

సుబ్బ:- కొత్త బిజినెస్సా?

హను:- ఆఁ...దానికి సరైనమాట దొరకటంలేదు. అందాకా బ్రోకర్‌పని అందాం. మరి కంపెనీపేరు ఏవిఁటి పెట్టారు?

సుబ్బ:- బిజినెస్ ఏవిఁటి? కంపెనీ ఏవిఁటయ్యా?

హను:- పొలిటీషియన్ల పనులు గురించి చిన్నవాణ్ణి, నాకేం తెలుస్తుంది సార్! అయితే నాదో చిన్న సజెషన్. మీ కంపెనీకి 'లంచాల కంపెనీ'అని నామకరణం చేస్తే?

శ్రీని:- హనూ! ఏవిఁటా వెధవ్వాగుడు?

హను:- వెధవ్వాగుడు? అవున్లే, నేను చెబితే వెధవ్వాగుడులానే వుంటుంది. అదే ఏ పొలిటీషియన్ అన్నా చెబితే—

శ్రీని:- సర్లే, ఇహ నువ్వు లోపలికి పోతావా పోవా?

హను:- [సుబ్బరాజు చేతిలోంచి తాగబోతున్న కప్పు లాక్కున్నాడు] కప్పు యిచ్చెయ్యండి.

[హనుమంతరావు వెళ్ళిపోయాడు]

శ్రీని:- వాడిమాట అంతగా పట్టించుకోకు బాబూ! పిచ్చివెధవ! ఏదో వాగుతూ వుంటాడు.

సుబ్బ:- ఫర్వాలేదులెండి...అయితే నా వుత్తరంమీద మీ యింట్లో యింత వరకూ చాలా రగడ జరిగి వుంటుందన్నమాట! అఫ్‌కోర్స్, నా వూహే అనుకోండి.

శ్రీని:- రగడేవుంది బాబూ! అది రామచంద్రరావ్ అంతరాత్మకు విరుద్ధ మంటున్నాడు.

సుబ్బ:- మీ అంతరాత్మ కెలావుంది?

శ్రీని:- నా అంతరాత్మ ఏనాడో చచ్చిపోయింది.

సుబ్బ:- అయితే పేచీయే లేదు. మీరు మాటాడకండా వూరుకోండి. రామ చంద్రరావుని నేను ఒప్పిస్తాను.

శ్రీని:- వద్దు బాబూ !

సుబ్బ:- అయితే, జీవితాంతం ఈ కుళ్ళులో, ఈ దరిద్రాన్ని అనుభవిస్తూ కాలం గడుపుతారా?

శ్రీని:- నుదుటిరాత ఎలావుంటే అలా జరక్క తప్పుతుందా?

సుబ్బ:- నాన్సెన్స్. ఈ నుదుటరాతను ఎవర్రాశారండీ? మనమే రాసుకుంటు న్నాం. మనమే గిరి గీసుకుంటున్నాం. మనమే అందులో పడు తున్నాం. అందులోనుంచి బయటకు రాలేకా, వస్తే ఛస్తామనే భయం వల్లా అందులోనే మగ్గిపోతున్నాం. ఎందుకండీ ఈ పనికిమాలిన వేదాంతాలు?

శ్రీని:- వేదాంతాలు కాదు బాబూ, జీవితాలు! మీ నాన్న నీకు బహుశః చెప్పే వుంటాడు. ఒకానొకప్పుడు యీ శ్రీనివాసులు ఎలాంటివాడో ! చేతికి ఎముక లేదన్నారంతా. అందుకే ఆ చేత్తో గిరి గీసుకోలేక పోయాను. ఆడినమాట తప్ప ననేవారు. అందుకే అలుసై పోయాను. ప్రజ లోకువ కట్టింది. కట్టుకున్న భార్య ఏడ్చేది. ఆనాడు అదో తమాషా జీవితం. భవిష్యత్తు ముందుముందు యింత చీకటైపోతుందనీ, ఇరుకైపోతుందనీ ఊహించగలిగితే నిజవే- నువ్వన్నట్టు నా చుట్టూ పెద్ద గిరే గీసుకుని అందులోకి చీమనైనా రానిచ్చి వుండేవాణ్ణికాను.

సుబ్బ:- అదంతా గతం. అది తవ్వకోకండి ఇప్పుడేం చెయ్యదల్చుకున్నారు?

శ్రీని:- ఏం చెయ్యగలను? చెయ్యగలిగినా-చెయ్యనివ్వరు.

సుబ్బ:- మరి నా బాకీ మాట?...తిలోదకాలు వదులుకోమంటారా?

శ్రీని:- ఎంతమాట బాబూ!

సుబ్బ:- మరి?

హను:- (లోపలినుంచి వచ్చాడు వాళ్ల మాటలు వింటూ వున్నాడు)

శ్రీని:- ఏ తల తాకట్టు పెట్టయినా యిచ్చేస్తాగాని అంత మాటనగలనా?

సుబ్బ:- ఈ యింట్లో ఏ తలకు పాతిక వేలు చేసే విలువుంది?

హను:- మీ తలకి వుంది. అఫ్‌కోర్స్. అది కుక్కలక్కూడా పనికిరాదని గత మూడు ఎలక్షన్లలోనూ తేలిపోయిందనుకోండి!

శ్రీని:- హనూ!

హను:- ఎక్కువగా మాట్లాడకు తాతయ్యా. దగ్గొస్తే డబ్బులేదు.

సుబ్బ:- నా బాకీ విషయం అడుగుతున్నాను.

హను:- ఎక్కణ్ణుంచి వస్తుందండీ? ఇప్పుడు మీరేగా అన్నారు-ఈ కొంపలో ఎవరితలా పాతిక వేలు చెయ్యదని?
(సీత ద్వారం దగ్గిరకొచ్చి నిలబడింది. సుబ్బరాజు సీతను చూశాడు. అది హనూ చూశాడు.)

సుబ్బ:- (సీతను క్రీగంటి చూపుతో చూస్తూ) చేస్తుంది.

హను:- (గ్రహించాడు) అగ్ని పర్వతాన్ని మూర్ఖులు, ఇడియట్స్ తప్పించి మరెవరు కొనుక్కోడానికి సాహసిస్తారు చెప్పండి.

సీత:- హనూ!

హను:- ఓయ్!

సీత:- నువ్వొక లోపలికి దయచేస్తావా?

హను:- సీతమ్మవారి ఆజ్ఞ దశరథ మహారాజుగారిని కూడా కదిపి తీసుక రానియ్ మరి! లే తాతయ్యా, కాస్సేపు పళ్ళు తుడుచుకుని, అనక తీరుబడిగా వేదాంతం మాట్లాడుకుందువుగాని!

శ్రీని:- వస్తాను. నువ్వెళ్ళు.

హను:- సుబ్బరాజుగారి షాక్ ట్రీట్‌మెంట్‌తో నీ మటుకి నీకు నడిచివచ్చేసేటంత బలం వచ్చిందేవిటి?

సుబ్బ:- నేనేం షాక్ యివ్వలేదు.

హను:- జబ్బు మనిషి దగ్గర బాకీ విషయం ఎత్తకం ఏమంటారండి?

సుబ్బ:- అయితే? ఈయన మూడేళ్ళ నించీ మంచం మీదున్నారు. అలా అని నేనిక ఎన్నాళ్ళుండాలని కోవాలి?

హను:- ఆయన మంచం మీంచి లేచి తిరిగేవరకూ.

సుబ్బ:- అది జన్మలో సాధ్యపడదు.

హను:- సుబ్బరాజుగారూ!

సుబ్బ:- ఎందుకలా పొలికేకలు పెడతావ్?

హను:- పొలిటీషియన్ నవుదామని.

శ్రీని:- ఒరే హనూ! నేనిలాగన్నా ఇక్కడ వుండటం నీకిష్టం లేదట్రా?

హను:- లేదు. అందుకే లోపలికి రమ్మంటున్నా.

సీత:- హనూ! నువ్విక లోపలికొచ్చి స్నానాలగదిలో వేణ్ణీళ్ళుపెట్టు. తర్వాత ఆయన్ని తీసుకురావచ్చు. (లోపలికి పోయింది.)

హను:- (రుసరుసలాడుతూ లోపలికి పోయాడు.)

శ్రీని:- నువ్వా కుర్రవెధవని అంతగా పట్టించుకోకు బాబూ!

సుబ్బ:- అబ్బే-ఆ పట్టింపులే వుంటె మూడు నెలలు యిక్కడ వుండగలిగేవాణ్ణా?

శ్రీని:- నీ బాకీ రెండు మూడు మాసాల్లో తీర్చేస్తాను బాబూ!

సుబ్బ:- రామచంద్రరావుని వొప్పిస్తారా?

శ్రీని:- కాదు, ఈ యిల్లు అమ్మేస్తాను.

సుబ్బ:- (హేళనగా) ఈ యిల్లా?

హను:- (వచ్చాడు) ఈ యిల్లా అని యింత పొడుగు సాగదీసి అంటున్నారు- ఈ యింటికేం?

సుబ్బ:- ఏం లేదూ? ఇంద్రభవనంలా వుంది కదూ! భవనం ముందు గార్డెన్, ఎండకూ వానకూ చెక్కు చెదరని పైకప్పు - ఓహ్-తాజ్‌మహల్ కదూ?

హను:- తాజ్‌మహల్ భవంతి కాదు సార్-కరక్ట్ యువర్ సెల్ఫ్- అదో సమాధి. మీకు కావలిస్తే తీసేసుకోండి.

సుబ్బ:- నాకు స... సమాధి చేస్తానంటావా? విన్నారా శ్రీనివాసులుగారూ ఇతని మాటలు?

హను:- ఆయనకు చెప్పడనేది యింకా రాలేదు సార్!

శ్రీ:- హనూ! హనూ! హనూ! నన్ను చంపేస్తేనేగాని నీ కసి తీరదట్రా ?

హను:- ముందు లోపలికిరా, నీళ్ళెట్టి వొళ్ళు తుడుస్తాను.

సుబ్బ:- నా బాకీ మాట తేల్చండి.

హను:- మూణ్ణెల్లు యిక్కడ పడి ఎలానూ మేసేశారు. మరో ఆర్నెల్లు ఓపిక పట్టండి. ఏకంగా నవమాసాలూ నిండిపోతాయి.

శ్రీని:- (లేచాడు) క్షణం ఆగుబాబూ, వచ్చేస్తాను.

సుబ్బ:- నా బాకీ మాట తేల్చెయ్యాలి-ఇప్పుడే ఈ క్షణవేఁ!

హను:- అలా జపిస్తూ ఆ కుర్చీలో కూచోండి-వచ్చేస్తాం యిప్పుడే. (హనమంతరావు నిర్లక్ష్యంగా శ్రీనివాసుల్ని తీసుకుని పోవడంతో సుబ్బరాజు కసిగా నేలమీద తన్నాడు. సీతవచ్చి శ్రీనివాసులు పక్క సర్దుతోంది)

సుబ్బ:- విన్నారుగా అయన సమాధానాలు?

సీత:- విన్నాను.

సుబ్బ:- ఏం చెయ్యాలి అయితే నేనిప్పుడు?

సీత:- ఈ తాజమహల్ తీసేసుకోమన్నారుగా?

సుబ్బ:- ఈ సమాధి నాకేం పనికొస్తుంది-నేనేం చేసుకోను?

సీత:- సమాధులు బ్రతికున్నవాళ్ళకి పనికిరాక పోవచ్చు.

సుబ్బ:- సీతా!

సీత:- అలా అరవకండి. అలా పిలిచే హక్కు నాభర్తకొక్కరికే వుంది.

సుబ్బ:- భర్త...అతనొక భర్త, తమరొక భార్య!

సీత:- సుబ్బరాజుగారూ! మాటలు కాస్త గౌరవంగా రానివ్వండి.

సుబ్బ:- చిత్తం సీతాదేవిగారూ!

సీత:- యిక యిప్పుడు మీకేంకావాలి? అప్పు తీర్చేస్తా మన్నారుగా?

సుబ్బ:- అవసరంలేదు.

సీత:- ఎందుకో?

సుబ్బ:- అప్పుతీరిపోయాక యిక ఈ యింటికొచ్చే అవకాశం నాకుండదు.

సీత:- శాశ్వతంగా ఈ యింటిని పట్టుకుని వేళ్ళాడదామనా?

సుబ్బ:- అవును సీతా! నీకోసం. నిన్ను చూస్తూంటే జాలేస్తుంది. ఎక్కడ వుండవలసినదానవు' ఎక్కడ కొచ్చావు! ఈ కంపు కొంపలో, నిత్యదారిద్ర్యంలో, ఈ పిచ్చివాళ్ళ మధ్య నీకేం సుఖం వుంటుంది?

సీత:- మరెక్కడవుంటాయ్?

సుబ్బ:- నాతో వచ్చేయ్.

సీత:- ఎక్కడికి?

సుబ్బ:- మాయింటికి.

సీత:- నాకు ముగ్గురు పిల్లలున్నారు. వాళ్ళనేం చెయ్యమంటారు?

సుబ్బ:- మధ్యలో వచ్చినవాళ్ళు, మధ్యలోనే పోతారు. నాతో వచ్చేయ్ సీతా!

సీత:- వస్తే హంసలా చూసుకుంటారా?

సుబ్బ:- అంతకంటే ఎక్కువగా చూసుకుంటా. నాకున్న యావదాస్తి నీ పేర రాసేస్తాను. ఆలోచించుకో సీతా! నువ్వు రామచంద్రరావు దగ్గర సుఖపళ్ళేవు. అతనికి నిన్ను సుఖ పెట్టాలనే యింగితం కూడా లేదు. నువ్వు నగరాల్లో పుట్టిపెరిగావు. పెద్దచదువులే చదివావు. కాని వాటికి విలువ నెక్కడ యిస్తున్నారు? ఒక్కనాడైనా ఒక్కసారైనా నిన్ను తీసుకుని అలా సినిమాకిగానీ, షికారుకి గానీ వెళ్ళాడా నీ భర్త? ఎప్పుడూ ఈ నరకమేనా? ఎప్పుడూ ఈ నాలుగ్గోడలేనా నీ జీవితం? నీకు మాత్రం ఆశలు లేవూ? నీకు మాత్రం ప్రపంచాన్ని చూడాలని వుండదూ?

సీత:- మీ అమ్మకూడా అలాంటి ఆశలే వుండేవేమో? కాని మీ నాన్న గారు ఎప్పుడైనా ఆమెను సినిమాలు చూపించి ప్రపంచం తిప్పు కొచ్చారా?

సుబ్బ:- వాళ్ళు పాతకాలపు వాళ్ళు.

సీత:- అయితే నేనిప్పుడు మీతో వచ్చేస్తే నన్ను మనస్ఫూర్తిగా స్వీకరించగలరా?

సుబ్బ:- ప్రమాణంచేసి చెబుతున్నా.

సీత:- సరే, మీ యిష్టం. మీవెనక రావడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు.

సుబ్బ:- [ఆనందంగా] సీతా!

సీత:- అయితే ఒక షరతు.

సుబ్బ:- ఏమిటి?

సీత:- తప్పకండా చేస్తారా?

సుబ్బ:- మళ్ళీ ప్రమాణం చేస్తున్నా! నీకోసం ఏమన్నా చేస్తా.

సీత:- అయితే-మీ తలిదండ్రులకి ఎందరు సంతానం?

సుబ్బ:- ముగ్గురం.

సీత:- ఆ ముగ్గుర్నీ విడిచిపెట్టి, మీ అమ్మను మరో మనిషితో లేచిపోయే ఏర్పాట్లు చేస్తారా?

సుబ్బ:- సీతా!

సీత:- స్కౌండ్రల్! [లెంపకాయ కొట్టింది.] పో యిక్కణ్ణుంచి, త్వరగా పో. ప్రాణంమీద ఆశవుంటే ఆయన రాకముందే పో, గెటవుట్. [సీత రయ్యిన లోపలికిపోయింది. సుబ్బరాజు చెంప తడుము కుంటూ కోపంతో పరాభవంతో ముక్కాలిపీటను తన్నాడు. హను లోపలనించి గబ గబా వచ్చాడు.]

హను:- సుబ్బరాజుగారూ! ఇక్కడ కుక్కవొకటి వుందట. తన్ని తగిలెయ్యమంది అత్తయ్య. [చుట్టూ వెదికి] ఏదీ, ఎక్కడా కనిపించ

దేం చెప్మా ? హనుమంతులవారు వస్తున్నట్టు పసిగట్టి పోయిందేవిఁటి చెప్మా ? ... ... అదిగో, ఎక్కడికి పోతున్నారు సుబ్బాజీ. రండి మాష్టారూ, మీ పని పూర్తి కాకండానే పోతున్నారు ? ? [అడ్డం వచ్చాడు].

సుబ్బ:- నన్ను పోనీ.

హను:- అంత కంగారైతే ఎలాసార్ ? ఆలోచించడానికి మావఁయ్య గోదార్లోకి వెళ్ళాడు. వచ్చాక ఏవంటారో విని పోదురుగాని. లెట్ అజ్ వెయిట్ ఫర్ ఎనదర్ టెన్ మినిట్స్.

సుబ్బ:- అనవసరం.

హను.- ఏం ? మీరు మనస్సు మార్చేసుకున్నారా ?

సుబ్బ:- నా బాకీ అణా పైసల్తోటాటు వసూలుచేసి మరీ వొదిలి పెడతాను.

హను:- సరే, అలానే చేదాం. కాని దబ్బేది ? మావఁయ్య ఆఫీసులో కాన్ఫిడెన్షియల్ క్లార్క్ అని మీకు తెలుసు. ఏదో మీకు తెలిసిన వుపాయం చెప్పారు. కాని వీళ్లందరికీ ఎక్కడో ఒక చిన్న అంతరాత్మ ముక్క మిగిలిపోయిందట. దాని గోలకి భయపడి లంచం తీసుకోనంటున్నారు. నేనిప్పుడు తాతయ్యా వొళ్ళు తుడుస్తూ తెగ ఆలోచించాను- మీ ప్రతిపాదనగురించి. పొలిటీషియన్లు ప్రజాక్షేమాన్నేకదా కాంక్షిస్తారు ? అందువల్ల మీరు మా క్షేమాన్ని ఆలోచించి ఈ లంచం ఉపాయం చెప్పారనిన్నీ మీరే రైటనిన్నీ నిర్ధారణ చేసుకున్నాను.

సుబ్బ:- నేనిక యెలాంటి ప్రతిపాదనా చెయ్యను. నెరవేరినా మీకు దక్కనివ్వను.

హను:- అదేవిఁటి సార్ అంత త్వరగా అచ్చు పొలిటీషియన్లా మారిపోయారు ? ఇంతవరకూ మీరే కదటండీ యిన్ని వుపాయాలు నూరిపోసారు ?

సుబ్బ:- తెలియక చెప్పాను.

హను:- ఇప్పుడు తెలిసొచ్చిందా ? కొంపతీసి కరంట్ షాక్ ఏమన్నా తగ లేదు కదా ?
[రొట్టెల కర్ర తీసుకుని సీత వచ్చింది – 'హనూ' అనుకుంటూ. హనుమంతరావు వెనక్కి తిరిగేలోపున "మిమ్మల్ని సర్వనాశనము చేసి గాని వొదల్ను" అని కోపంగా సుబ్బరాజు అక్కడి నించి వెళ్ళిపోయాడు. హను పక పకా నవ్వాడు.]

హను:- ఏం అత్తయ్యా ! కొంపతీసి సుబ్బరాజుకి ఆ కరెంట్ షాక్‌ని నువ్వే యిచ్చావా ?

సీత:- (కంగారుపడిసర్దుకుంటుంది) సర్లే, అవతల పూజగది శుభ్రం చేశాను. మీ తాతయ్యగారిని పూజకి తీసికెళ్లు.

హను:- నీ పూజ అయిపోయిందా ?

సీత:- లేదు.

హను:- చెయ్యవా ?

సీత:- ఆలోచిద్దాం తర్వాత.

హను:- పూజకూ్కడా ఆలోచనే?

సీత:- అబ్బబ్బబ్బ! నన్ను విసిగించక నీకు చెప్పిన పని చేదూ?

హను:- చిత్తం సీతమ్మవారి ఆజ్ఞ (లోపలికి పోబోయాడు)

సీత:- హనూ...పూజ అయ్యాక ఆయనకు బార్లీ ఇవ్వు.

హను:- నన్ను తయారు చెయ్యమంటావా?

సీత:- లేదులే, తయారు చేసే వుందాన్లే ... హనూ! తర్వాత ఓసారి మాష్టారింటికి వెళ్ళొస్తావా?

హను:- ఎందుకు?

సీత:- బుజ్జిగా డింకా ప్రైవేట్ నించి తిరిగి రాలేదు. బయట బాగా చీకటి పడిపోయింది. వాడు ఒంటరిగా రాగలడో లేదో!

హను:- ఏం, ఎవరన్నా ఎత్తుకుపోతారనా? భయం లేదత్తయ్యా, వాడు సినిమా హీరో అంత బలాఢ్యుడు.

సీత:- నాకెందుకో భయంగా వుంది బాబూ ఈవాళ. మీ మావయ్యంటే ఆయన లోకంలో ఆయనుంటారు, పోనీ నేనే వెళ్ళి తీసుకొద్దామంటే యింట్లో పన్లు.

హను:- (ఆమె దగ్గరగా వచ్చాడు) బుజ్జిగా దంటే నీకంత ప్రేమ ఎందు కత్తయ్యా?

సీత:- మీ అమ్మకు నీమీద అంత ప్రేమ వుండేది ఎందుచేత?

హను:- ప్రేముండేదా? నాకేం తెలుసు? అమ్మపోయినపుడు నేనింకా ఒకటో క్లాసే పాసవలేదు. ఆవిడ ఎలా వుండేదో కూడా నాకిప్పుడు జ్ఞాపకానికిరాదు.

(ఇంతలో లోపలి నించి శ్రీనివాసులు 'హనూ' అని పిలవడంతో మళ్ళీ వస్తానత్తయ్యా అని లోపలికి పోయాడు. సీత గదిలో ఫైల్సు సర్దింది. రామచంద్రరావు వచ్చాడు. సీతను తీక్షణంగా, పిచ్చిగా చూశాడు. ఇన్నాళ్లు ఆమెలో వో నిగూఢ రహస్యం దాగి వున్నట్టు, దాన్ని తెలుసుకోలేక పోయినందుకు బాధపడ్డట్టు వుంటాడు. ఆమెనే చూస్తూ కుర్చీలో కూచున్నాడు.)

సీత:- మీరు లేచి స్నానం చేస్తారా? అందరికీ ఒకేసారి వడ్డిస్తాను.
(ఆమెను రెప్పవాల్చకుండా చూస్తాడు. చూపు అర్థంకాదు సీతకు)

సీత:- అలా వున్నారేం?

రామ:- (లేచి ఆమె దగ్గరకు వచ్చాడు) సీతా! నిన్నో విషయం అడుగుతాను-నిజం చెప్తావా?

సీత:- ఏమిటి?

రామ:- బహుశః యిలాంటి ప్రశ్న నిన్ను అడగాల్సి వస్తుందని నేను కలలోనైనా వూహించలేదు. ఊహించేవుంటే ఎనిమిదేళ్ళక్రితమే పిచ్చివాణ్ణయిపోయి వుండేవాడిని

సీత:- ఏమిటండీ ఆ ప్రశ్న?

రామ:- మనిషి మనిషిని ఎందుకు వంచిస్తాడు సీతా? ఎందుకు నిజాన్ని దాచి కపటనాటకం ఆడాల్సివస్తుంది? ఆ మోసంవల్ల ఎదుటివాళ్ళు సర్వ నాశనమైపోతారన్న బాధన్నా ఎందుకు వాళ్ళకు కలగదు?

సీత:- మీ...మాటలు నాకేం అర్థంకావటం లేదండీ!

రామ:- అర్థమైన క్షణంలో మనం యిద్దరం ఏమైపోతామో తెలీదు. మళ్ళీ తలెత్తుకుని చూసుకోలేం. దూరం కాలేక, కలసి వుండలేక కుళ్ళి కుళ్ళి చస్తాం.

సీత:- ఏవిఁటండీ, యింత వింతగా మాట్లాడుతున్నారు?

రామ:- నేను చెప్పబోయే విషయం మరింత వింతగా వుంటుంది సీతా!

సీత:- అయితే త్వరగా చెప్పండి నన్ను చంపక!

రామ:- సీతా! నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?

సీత:- (షాక్ తగిలింది) ఎనిమిదేండ్లు కాపరం చేశాక అనుమానం ఈవాళ కలిగిందా? ఎందుకు?

రామ:- ఇంతవరకు నేను మోసగింపబడ్డానేమో అని.

సీత:- మిమ్మల్నెవరు మోసం చేశారు?

రామ:- నీ ఆత్మకు తెలీదా?
(అతని వేపు అర్థంకాని చూపు చూసి మాటాడుతూ దగ్గరకు రాబో తుంది)

రామ:- దగ్గరకు రాకు-ఇంకా నీ మాలిన్యాన్ని నాకు అంట నివ్వకు.
(సీత తలమీద పిడుగు పడ్డంతపని అయింది. పిచ్చిగా అతని వేపు చూసింది)

రామ:- అలా చూడకు సీతా! దేవుడు నన్నొట్టి పిరికివాడుగా పుట్టించాడు. నాకు ధైర్యం లేదు. నిలదొక్కుకునే శక్తిలేదు. అలా చూడకు సీతా! నన్ను చంపకు. చెయ్యిదాటిపోకముందే అంతా చెప్పేసెయ్. అంతా వినికూడా నిన్ను క్షమించలేని పిరికివాణ్ణి, నా కొక్కటే దారి నయింది. నన్ను నేను హింసించుకోవడం.

సీత:- ఏమండీ! ఏమండీ! ఏమిటి మీరింత పిచ్చిగా మాట్లాడుతున్నారు? ఏమయింది మీకు?

రామ:- ఏమీ కాలేదు, నాలో ఏ లోపముందో తెలుసుకోవాలనే తపన. అంతే సీతా!

సీత:- ఎవరన్నా మీకు...ఏమన్నా చెప్పారా?

రామ:- నువ్వేలా ఊహించావ్? ఎవరో ఎప్పుడో ఒకప్పుడు చెప్పేస్తారని నీకు ముందునించీ తెలుసుకదూ?

సీత:- ఎవరన్నా ఏమిటి చెప్పడం? ముందునించీ నాకు తెలీడమేమిటి?

రామ:- నీ జీవిత రహస్యం.

సీత:- నా జీవిత రహస్యమేవుంది?

రామ:- ఏమీ లేదా? ఇంకా నన్ను మోసం చెయ్యాలనేనా? వద్దు సీతా! నీ స్వేచ్ఛకు నేను ఎప్పుడూ అడ్డురాలేదు అడ్డురాను. నేనే జన్మలోనో పాపం చేసుకున్నాను. దేవుడు కూడా క్షమించని పాపమై వుంటుంది. దానికి ఈ జన్మలో యింతటి కఠినశిక్ష వేస్తాడని నేనెప్పుడూ వూహించుకోలేదు. ఆర్థికంగా నేను అడుగు జారిన వాణ్ణే కావచ్చు. నీ విషయంలోమాత్రం నేనెప్పుడూ ఏ లోపం చెయ్యలేదు. పల్లెత్తుమాట అనలేదు. మనది పండంటి సంసారం సీతా, దాన్లో చిచ్చుపెట్టకు సీతా!

సీత:- (గాద్గదికంగా) నన్ను చంపకండీ, చిత్రవధ చెయ్యకండీ!

రామ:- చిత్రవధ నీక్కాదు— నాకు. ఈ ముగ్గురిపిల్లల్ని నేనేం చేసుకోను? ఎలా పెంచాలి? రేపొద్దుట వాళ్లు పెరిగి పెద్దవాళ్ళయి 'అమ్మ'ను గురించిన 'నిజం' తెలుసుకుంటే వాళ్ళెంత యమ యాతన పడి పోతారు? వాళ్ళకి ఏమని చెప్పను? ఏమని సముదాయించను? నన్ను వాళ్లు కూడా వట్టి చేతకాని వాణ్ణిగా జమకట్టి లెక్కచెయ్యకండా తిరిగిన్నాడు నేనిక వేరే నరకాన్ని అనుభవించడం ఎందుకు? అమ్మని దిద్దుకోలేని నాన్న అని నా మొహంమీదే చెపపెట్టు పెడితే నేనప్పుడు విషం తాగనా? ఉరివేసుకోనా?

కాల్చుకోనా? నేను అమాయకుణ్ణి కావడమే నేను చేసిన పాపమా? దానికి యింతటి శిక్షా సీతా?

[సీత యింతవరకూ కన్నీళ్ళు కారుస్తూనే వుంటుంది. చివరికి ఆమెలో ఏదో మొండి ధైర్యం వచ్చింది, కన్నీళ్ళు తుడుచుకుని బయటకు వెళ్ళబోయింది.]

రామ:- ఎక్కడికి?

సీత:- సుబ్బరాజుని తీసుకువస్తాను.

రామ:- అతనెందుకు?

సీత:- మీలో కలత రేపింది అతనే!

రామ:- అనుమానాలకు సాక్ష్యం నువ్వే పలుకుతున్నావా?

సీత:- అనుమానాల్ని ఆ మూర్ఖుడే కల్పించివుంటాడు.

రామ:- నిజం ఎవరు చెప్పినా ఒకేలా వుంటుంది.

సీత:- అది నిజంకానప్పుడు?

రామ:- ఎవరన్నా అలాంటి కథలెందుకల్లుతారు?

సీత:- స్వార్థం తీరనపుడు.

రామ:- ఎవరిస్వార్థం?

సీత:- సుబ్బరాజుది. అతడు నన్ను ప్రేమించాడు. నా చిన్నతనంలో కాదు. నేను కాలేజీ చదువు వెలగబెడుతున్నపుడుకాదు. మా ఎదురింటి స్నేహితుల యిళ్ళకు పదేపదే రాకలు సాగించినపుడూ కాదు-ఈ యింటికివచ్చాక. ఈ కొంపలో ఈ మూణ్ణెల్లూ మీరిచ్చిన ఆతిథ్యం స్వీకరించాక. నాకు ముగ్గురు పిల్లలు కలిగిన ఏడాది తర్వాత.

రామ:- ఇంతకు ముందు అతను నీకు తెలీదా?

సీత:- కొన్ని సార్లు చూశాను. ప్రత్యేకమైన దృష్టితో కాదు. వెర్రివాళ్ళనూ, పిచ్చికుక్కల్నీ అలానే చిత్రంగా చూసేదాన్ని. ఆనాడు నే నతని గురించి ఏమీ ఆలోచించలేదు. ఆలోచించాలనే తలంపు ఎందుకలుగు

తుంది? వీధిలో వేలమంది జనం వస్తూ పోతూ వుంటారు. వాళ్ళందరి గురించీ ఆలోచించడం ప్రారంభిస్తే నేనొట్టి పిచ్చిదాన్నయినా కావాలి..

రామ:- నే నడిగిందానికి యింత ఉపన్యాసం అనవసరం.

సీత:- మీ అనుమానానికి యింత ఉపన్యాసం బహుశః ఒక ఇసుక రేణు వేమో! ఇది మామూలు అనుమానం కాదు-మిమ్మల్నీ నన్నూ; కళ్ళు తెరవని ముగ్గురిపాపల్నీ, మన కుటుంబాన్నీ వంశాన్నీ సర్వనాశనం చేసేసే అనుమానం. దీనికి నేనెంత చెప్పుకున్నా ఏదో సంజాయిషీ చెప్పుకున్నట్టే వుంటుంది.

రామ:- నిజమే మరి.

సీత:- అయితే ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పండి. ఎనిమిదేళ్ళు నాతో కాపురం చేసికూడా నా మనస్సు ఎలాంటిదో తెలుసుకోలేక పోయారా?

రామ:- మేడిపండు చూసేందుకు ముద్దుగానే వుంటుంది...నువ్వు నైతి కంగా...పతనమైయ్యావ్!

సీత:- శివశివా!

రామ:- అతన్నెందుకి రాంపిలో తలచడం?

సీత:- నిజం ఆయనకొక్కడికే తెలుసునుగాబట్టి (స్థిరంగా) సరే అయితే! మిమ్మల్నింక నమ్మించలేను. ఇంతకూ మీరేం చెయ్యదల్చుకున్నా రిప్పుడు?

[రామచంద్రరావ్ ఏం చెప్పడు. కూలబడ్డాడు.]

సీత:- [ఇక దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది] దేవుడు నన్ను అడవిలో మ్రానై పుట్టించి వుంటే ఎంత బాగుండి పోయేది? నన్ను నేను నమ్మించుకోలేని అబలను: తప్పులు చెయ్యకపోయినా, చేసే వుంటా నని భ్రమ కలిగించే నా పెళుసరపు మాటలు! బాధని అణచుకోలేని ఉద్రేకం—ఇన్ని 'సద్గుణాంరాశి'ని - నేను నిప్పులాంటి దాన్నంటే ఎవరు నమ్మగలరు? ఎనిమిదేళ్ళు కాపురం చేసిన భర్తకే అర్థంకాని సమస్యను తెచ్చిపెట్టిన నేను, ఉత్తమ యిల్లాలినంటే ఎవరు ఒప్పు

కుంటారు ?...చూడండి మిమ్మల్ని ప్రతిమాలుకోవటం లేదు. ప్రతి మాలుకోనుకూడా ! నన్ను ఏమన్నా చేసెయ్యండి. కాని నేను పతన మైనదాన్ననే ఊహను కలలోనైనా రానివ్వకండి...నేను పతనమై వుంటే యింత బాధపడను, మీకు అర్థంకాలేకపోయాననేదే నన్ను చిత్రవధ చేస్తోంది.

[రామచంద్రరావు చాలాసేపు మాట్లాడడు. సీత అటుతిరిగి కన్నీళ్ళు కారుస్తూనేవుంది. రామచంద్రరావు ఏదో నిర్ణయానికి వచ్చినట్లు నిట్టూర్పు విడిచాడు.]

రామ:- రేపట్నుంచి సుబ్బరాజుని యిక్కడికి రావద్దని చెప్పు.

సీత:- నేను రమ్మన్నానా అతన్ని?

రామ:- ఈ యిల్లు అమ్మి అతని బాకీ తీర్చేద్దాం. తర్వాత మరో చోటుకి దూరంగా పోదాం. ఇక్కడ వుండొద్దు.

సీత:- ఎందుకు ?

రామ:- పరాభవాన్ని భరిస్తూ యిక్కడ నేవుండలేను. నడిరోడ్డుమీద నువ్వూ సుబ్బరాజూ చర్చనీయాంశాలయ్యారు.

సీత:- అందుకని భయపడి పారిపోతారా ?

రామ:- తప్పదు నేను అశక్తుణ్ణి, పిరికివాణ్ణి

సీత:- నాకా పిరికితనం లేదు.

రామ:- కాని, నువ్వు ఆడదానివి సీతా!

సీత:- అదో బలహీనత కాదు, ఆ జన్మ పాపం కూడా కాదు. భయపడే వాళ్ళను మరింత భయపెడుతుంది లోకం.

హను:- (వచ్చాడు) పూజ పూర్తయిందత్తయ్యా బుజ్జిగాణ్ణి! తీసుకరావడానికి నేవెళ్తున్నా (రామచంద్రరావు లోపలికి పోయాడు. హనుమంతరావు బయటకు వెళ్ళబోయాడు )

సీత:- హనూ ! దార్లో సుబ్బరాజు ఎక్కడన్నా తారసపడితే తీసుకొస్తావా ఓసారి ?

హను:- సీతమ్మవారి ఆజ్ఞ.
(హను వెళ్ళాడు. రామచంద్రరావు తండ్రిని తీసికొచ్చి మంచంమీద కూచోబెట్టాడు. సీత అత్తగారి ఫోటో దగ్గర నిలబడి నిట్టూర్పు విడిచింది. మెల్లగా లోపలికి పోయింది).

శ్రీని:- రామూ.

రామ:- ఏం నాన్నా ?

శ్రీని:- మీ బావగారింటికి ఓసారి వెళ్ళొస్తావా ?

రామ:- ఎందుకు ?

శ్రీని:- ఈ యిల్లు అతనికి అమ్మేద్దాం.

రామ:- అక్కడికెళ్ళడం అనవసరం. అయినా ఆయన తీసుకోడు. ఇక్కడే ప్రయత్నంచేద్దాం.

శ్రీని:- (నిట్టూర్పు విడిచాడు) చివరికి ఈ కొంపకూడా మిగల్చకుండా మిమ్మల్ని వీధిపాలు చేస్తున్నాను రామూ! నేను బ్రతికిన రోజుల్లోనూ మిమ్మల్ని చంపేశాను; చచ్చిపోతూ కూడా చంపేస్తున్నాను.

రామ:- ఇప్పుడలా ఆలోచించుకోవడం దేనికినాన్నా! ప్రాప్తం ఎంతుందో అంతే జరుగుతుంది.

శ్రీని:- మీ అమ్మకూడా అచ్చు నీలానే కష్టాలకు చిరునవ్వు నవ్వేది. ప్రాప్త మని సరిపెట్టుకునేది ఆ మహాసాధ్వి. కాని ఆమెను ఒక్కనాడైనా, ఒక్కసారైనా సరిగా చూసిన పాపానపోలేదు. సముద్రమంత కల్లోలాన్ని గుండెల్లో దాచుకుని, ఒక్కనాడూ బయటపడేది కాదు. సరిగ్గా ఆ గుణాలే నీకూ వచ్చాయి.

రామ:- నేనేం మనసులో బాధ పడటంలేదు నాన్నా!

శ్రీని:- అబద్ధం చెప్పడం కూడా నీకు చేతకాదురా. నీ మనసులో వేదని దబాయిస్తున్న బాధ, ముఖంలో కనిపిస్తోంది. నేను గ్రహించ లేదనుకున్నావా? చదువు సంస్కారం వుందనే మురిసిపోయాను కాని, వాటివెనక యింత మురికి వుందని తెలిస్తే నీకీ సంబంధం చేసివుండేవాణ్ణే కాను.

రామ:- ఏమిటి నాన్నా? సీత గురించా నువ్వనేది !

శ్రీని:- ఎవరి గురించి ఏమనుకున్నా, ఇక మనకి మిగిలేది ఆ కన్నీళ్ళు ఒక్కటే బాబూ !

రామ:- తప్పు నాన్నా! సీతమీది అనుమానం పొరపాటు. నువ్వు అక్కణ్ణించి మా మాటలు వినుంటే అవన్నీ తప్పదు ఊహలే. సీతని మనమెవరం అర్థం చేసుకోలేకపోతున్నాం ఆమె అమ్మలాంటి ఉత్తమురాలు.

శ్రీని:- రామూ! పొగరావడానికి నిప్పురవ్వ కొంతైనా వుండాలి.

రామ:- నిప్పే భ్రమ అయినపుడు, పొగసంగతి చర్చించుకోవడం అవివేకం నాన్నా! నేను సీతను అర్థం చేసుకోలేకకాదు, ఆమెనలా నిలదీసి అడిగింది! నాలో బాధ. ఎవరో మన్ని గురించి అనవసరంగా చెప్పుకుంటున్నారనే దుఃఖం.

శ్రీని:- వాళ్ళెందుకలా చెప్పుకోవాలి?

రామ:- అదో సరదా వాళ్ళకు. మాటలొచ్చుగాబట్టి ఏదో వాగాలి మనుషులు. ఆ వాగుడుకి ఒక అంశం కావాలి. అందుకు మన పరిస్థితి అలు సయింది.

శ్రీని:- మనమే ఎందుకు గురికావాలి బాబూ?

రామ:- నోరు లేని కప్పల మీదికి రాళ్ళెందుకు రువ్వుతారు ? ఇదీ అంతే. మనం పతినవాళ్ళం. పడినవాళ్ళనేకదా లేవిడీ చేసేది?...సీత మీద మీకు గౌరవముంది. ప్రేముంది. అన్నిటికీ మించిన నమ్మక వుంది. చాలు, అది పిచ్చనుకో, ఏమన్నా అనుకో. నాపిచ్చి నాకానందం. (హనుమంతరావు వచ్చాడు. పరిస్థితి చూచాడు.)

హను:- అత్తయ్యా! అత్తయ్యా...దశకంఠుణ్ణి తీసుకువచ్చాను.
(సీత లోపలి నించి కోపంగా వచ్చింది. హనుమంతరావు ఆమెను అడ్డాడు.)

హను:- సీతమ్మవారు కాళికా రూపాన్ని దాల్చకూడదు.

సీత:- నువ్వడ్డం తప్పుకో.

హను:- తీసుకొచ్చింది నేను. మధ్య సువ్రతని చెంపవాయగొడితే ఆ పాపం మీకు చుట్టుకుంటుంది. మగాళ్ళం మేముగ్నాంగా.

[ఆమెను ఒక మూలగా నిలబెట్టి బయట నున్న సుబ్బరాజుని పిలిచాడు, "రండి మాష్టారూ" అని. సుబ్బరాజు వచ్చాడు. ఎవరూ మాట్లాడరు. వాతావరణం అగమ్యగోచరంగా వుంది.]

సుబ్బ:- నా కిక్కడ కూచునే టైం లేదు, త్వరగా డబ్బు యిచ్చేస్తే వెళ్ళి పోతాను.

రామ:- (అర్థంకాక) డబ్బేమిటి?

హను:- డబ్బు యిస్తావని తీసుకొచ్చాన్లే (తలుపులు దగ్గరగా వేసాడు) కూచోండి మాష్టారూ! మావయ్యా వారికి - ప్రెసిడెంట్-అంటే ఉచితా సనం చూపించు.

రామ:- ఇప్పుడు డబ్బెక్కడుంది?

హను:- వెధవడబ్బు ! కుక్కని కొడితే రాల్తుంది (అని సుబ్బరాజుని కొట్ట బోయి ఆగాడు) సారీ! ఏం లేదు మావయ్యా, డబ్బిస్తామంటే ఈయన యింటికి వస్తారని అలా చెప్పి తీసుకొచ్చాన్లే.

సుబ్బ:- అబద్ధమా అయితే?

హను:- నిజం చెబితే మీరు పారిపోతారుగా?

సుబ్బ:- ఏమిటా నిజం?

హను:- ఇక్కడ, ఇప్పుడు మీకో చిన్న సన్మానం ఏర్పాటు చేశాం. ఏదత్తయ్యా నువ్వుదాచిన చీపురు కట్టా, మావయ్య పాత చెప్పులూ?

రామ:- హనూ!

శ్రీని:- ఏమిట్రా నువ్వనే మాటలు?

హను:- (సుబ్బరాజు వెళ్ళబోతూవుంటే ఆపాడు) మీరెక్కడికి వెళతారు.- దశకంఠుడు లేని దహనకాండవా?

శ్రీని:- హనూ! అతన్ని విడిచిపెట్టు.

హను:- నేను విడిచిపెట్టేస్తే ఇతను అత్తయ్యను ఈడ్చుకుపోతాడు... నువ్వు దగ్గరకు రాకత్తయ్యా - ఎండర్ వార్నింగ్ నీకిది. ఆయన్ని గౌరవించి తిరిగి పంపించే బాధ్యత నామీద వుంది. (రామచంద్రరావు 'హనూ' అనుకుంటూ దగ్గరకు రాబోయాడు) నువ్వుకూడా ఐధ్యను కలిగించుకోకు మావయ్యా; (శ్రీనిలేచి నిలబడితే) చూశారా, ముసలాయనక్కూడా శక్తి వచ్చేసింది- 'వార్' అనగానే! అందరూ శాంతించాలి. శాంతి! ఈ దశకంఠుడైన సుబ్బరాజుగారు ప్రస్తుతం నా అతిథి.

శ్రీని:- హనూ! ఇది నీ కుర్రతనం చేష్టలా కనిపించదు, చాలా వరకు పోతుంది.

హను:- ఫరవాలేదు. ఎంతవరకూ పోయినా, అది నాలుగురోడ్ల చర్చా వేదిక దగ్గరకే పోతుంది. అక్కడ మనకిప్పుడు ఎలానూ గౌరవం లేదు. చర్చఘాటు మరింత హెచ్చవుతుంది దీంతో.

శ్రీని:- హనూ! నువ్వు తలుపులు తెరుస్తావా - నన్నే వచ్చి తెరవమంటావా?

హను:- తెరచి, ఈ నాల్గుగోడల మధ్యనున్న ఆ కాస్త పరువునీ బయటకు విసిరేస్తావా? (సీత రాబోయింది 'హనూ' అనుకుంటూ) అత్తయ్యా నీకిది ఫైనల్ వార్నింగ్! అక్కణ్నుంచి కదలొద్దు. నీ స్థానం అక్కడే. నేనెంత ఈ చేతకాని శ్రీనివాసులుగారి మనవణ్ణయినా, ఈ పిరికి రామచంద్రరావు మేనల్లుణ్ణయినా వీళ్ళ పిచ్చి 'సుగుణాలు' నాకబ్బలేదు. మా నాన్న మహా కర్కోటకుడు. ఆయన సుపుత్రుణ్ణి నేను. నా సొంత స్వభావాన్ని రెచ్చగొట్టకండి... ఆఁ, సుబ్బరాజుగారూ మిమ్మల్ని రెండు మూడు ప్రశ్నలు మాత్రమే అడుగుతాను. సమాధానాలిచ్చి మీదారిన మీరు వెళ్ళిపోవచ్చు.

సుబ్బ:- నేనేం సమాధానాలు యివ్వను ... ఇవ్వకపోతే ఏం చేస్తావ్?

హను:- ఇక్కడ రెండు జీవచ్ఛవాలూ, ఒక అగ్నిపర్వతం వున్నాయి. ఆ పైన ఎలానూ నా అభ్యాగత మర్యాదలు తప్పవనుకోండి! వెల్

మీరు సమాధానాలు ఇవ్వకపోయినా అడగడం నా విధి ... మీకు ఆ సీతాదేవి ఎప్పట్నుంచి తెలుసు?

సుబ్బ:- నాకేం తెలీదు.

హను:- అయితే, ఆ నాలుగురోడ్ల సెంటర్లో ఈవిడ గురించి ఎందుకలా ప్రచారాలు చేస్తున్నారు ?

సుబ్బ:- నేనేం చెయ్యటంలేదు.

హను:- పొలిటీషియన్‌లా అబద్ధాలాడెయ్యకండి. ఊఁ... చెప్పండి.

శ్రీని:- చెప్పుబాబూ ! ఏవిఁటన్నావు ? ఎందుకు మా పరువు మర్యాదల్ని యిలా రచ్చకీడుస్తావ్ ?

సుబ్బ:- నాకేం తెలీదని చెప్తుంటే మీక్కాదు ? అసలు నేనక్కడ లేను.

హను:- మీరులేరు. కాని మీ పది తలలూ అక్కడున్నాయ్. సరే, మీరు చెప్పకపోతే నేను చెప్తాను. మీ పది తలల్లో ఒక తల "ఆ రామచంద్రరావు భార్య సీత ఓ పెద్ద కథానాయకురాలు తెలుసా అంది. "చెప్పండి విందాం" అంది ఓ మారీచుని కంఠం. సుబ్బరాజుగారి దశ కంఠాల్లో మధ్య కంఠం పకాలున నవ్వింది. ఆ నవ్వు వాళ్ళకర్థమయింది. "మరి చెప్పరేం? ఆ రామచంద్రుడి ముగ్గురి పిల్లల్లో ఎవరుబాబూ మన అంశం ? ' అన్నాడో కుంభకర్ణుడు. "అందరూ అనుకోకూడదా!" అన్నాయి సుబ్బరాజు పది తలలూ. ఏమండీ దశకంఠ సుబ్బరాజూ, ఇవేనా డైలాగులు, తప్పేవఁన్నావుందా ?

[సీత గోడవేపు తిరిగి ఏడ్చింది. "ఖర్మబాబూ ఖర్మ" అని శ్రీనివాసు కూలిపోయాడు. రామచంద్రరావ్ కుర్చీలో కుమిలి పోయాడు]

హను:- అందరూ మూర్ఛపోయారు. సరే, నాకా వీక్‌నెస్ లేదు సుబ్బరాజుగారూ ! ఇప్పటికైనా వొప్పుకుంటారా మీరు పదిమందిలో అంత నీచాతినీచంగా మాట్లాడ్డం ఎంతటి విపరీత పరిణామాలకి దారి తీస్తుందో ! ఒక సంసారం కూలి పోతుంది. ఒక ముసలి గుండె ఆగిపోతుంది. ఒక అగ్నిపర్వతం ఆరిపోతుంది. ఒక గృహ

మేధి ఆత్మహత్య చేసుకుంటాడు. ఇందర్ని హింసించి మీరు బావు కునే దేఁవిటి ? ఏవిఁటి మీకిందులో వచ్చేలాభం ? అది కొందరి పుట్టుక బుద్ధి అనుకోవాలా? తమాషా అనాలా? ఏం మాటదగేం?... మీరిలా మాట్లాడరు.

[హనుమంతరావు ఇంతకు ముందు సీతతెచ్చి వొదిలిపోయిన రాడ్డెల కఱ్ఱ తీస్తాడు. రామచంద్రరావు ఛప్పున వచ్చి పట్టుకుంటాడు]

రామ:- హనూ ! నీకేం మతిగాని పోలేదు కదా ?

హను:- పోయింది మీకు. నన్ను పిడిచి పెట్టు. (విదిలించుకొంటాడు). వాడి అంతు తేల్చనీయ్, అక్కడే ఆగు మావఁయ్యా! నువ్వు అమాయ కుడి వని మీ నాన్న భావం. కాని నువ్వు అనుమానించగలవ్. అవమానించగలవ్. మాటల్తో చిత్రవధ చెయ్యగలవ్. మీ రంతా జీవచ్ఛవాలనుకున్నాను. కారు. తేనె పూసిన వాడికత్తులు. అలు సుగా కనిపిస్తే చాలు అలగ దొక్కేస్తారు. (సీత ఏడ్చింది) నువ్వెంత ఏడ్చినా ఈ రాళ్లు కరగవత్తయ్యా, అపు యిక.

రామ:- సరే ! నువ్విప్పుడాయన్ను ఏం చెయ్యాలని పిల్చుకొచ్చావ్ ?

హను:- నేనేం నిర్ణయిస్తాను ? అతన్నోటంట నిజం కక్కించాలని తీసుకొ చ్చాను. తద్వారా మీ మనసుల్లో వున్న అనుమానాలని తీసెయ్యా లనుకున్నాను

రామ:- మాకో అనుమానాలేం లేవు. ఎవరో ఏదో వాగినంతలో మేం గుడ్డి వాళ్ళమై పోతావాఁ ?

హను:- శ్రీరామ చంద్రుడంతటివాడే చాకలాడి మాటలకి సీతను దూరం చేసు కున్నాడు. ఏవఁయ్యా సుబ్బరాజూ, నేను నీకింకా ఎంతో టైమ్ యివ్వ లేను.

సుబ్బ:- నేనేం తప్పు చెయ్యలేదు

హను:- అయితే, నీకూ సీతాదేవికీ సంబంధం వుందా ?

సీత:- హనూ ! నీకు పుణ్యముంటుంది బాబూ, నన్నింకా చంపకు.

హన :- ఈ యింట్లో వున్న జీవచ్ఛవాలు నిన్ను చంపే చావు కంటే నేనాడే మాటలు శూలాల్లా వున్నాయా అత్తయ్యా ! నిన్ను లోబర్చుకోడానికి ఈ సుబ్బరాజు ఆడిన మాటలు నేనూ తాతయ్యా పక్కనించి విన్నాం. నువ్వు కొట్టిన చెంపపెట్టునీ చూశాం కానీ తాతయ్య నిన్ను నమ్మటం లేదు ఎందుకు ? నువ్వెరిటాకువి నువ్వు బలవడానికి పుట్టావ్ గాని గౌరవాలు పొందటానికి కాదు. (రామచంద్రరావ్ బయటకి పోబో తాడు ) నువ్వెక్కడికి ? నిన్నే ?

రామ:- నేనిక్కడిక వుండలేను.

హను:- ఆత్మహత్య చేసుకుంటావా ? (రామచంద్రరావ్ వెళ్ళబోతూ వుంటే సీత 'ఏవండీ ఏవండీ' అని వెంటపడబోతుంది.) వెళ్ళనీ అత్తయ్యా! వొదిలిచూడు: అతనెక్కడికీ వెళ్ళలేడు. ఆయనకు చావంటే భయం. బతుకంటే పిరికితనం. ఆత్మహత్య చేసుకోడానికి ఎంత గుండె ధైర్యం కావాలో తెలుసా ? (రామచంద్రరావ్ ఆగిపోతాడు)

సీత:- హనూ ! యింతవరకూ వోపిక పట్టాను, నీమాటలు మరీ హద్దు మీరు తున్నాయి. ఇది నా సంసారం. దాంట్లో లక్ష అభిప్రాయ భేదాలు వస్తాయి. వాటిని ఎత్తి దెప్పటానికి నీకేం హక్కులేదు.

హ :- విన్నారా సుబ్బరాజూ, ఆడవాళ్ళకి తన సంసారం మీద ఎలాంటి భావం వుంటుందో ?

సుబ్బ:- నేనేం మూర్ఖుణ్ణి కాదు. ఒకళ్ళ సంసారంలో నిప్పులు పోస్తే నాకొచ్చే దేవిటి ?

హన:- అదేకదా నేనడిగేది ! మరి కోర్టు సెంటర్లో తమరు చేసే ప్రచారం అంతరార్థం ?

సుబ్బ:- నేనేం చెయ్యలేదని లక్షసార్లు చెప్పాను. ఇంతవరకూ నీ యిష్టం వచ్చి నట్లు వాగావ్. సహించాను, అర్థం పర్థం లేని విసుర్లు విసిరావ్. భరిం చాను. నీకు భయపడికాదు, నువ్వేదో నన్ను చేసేస్తావనికాదు.

హను:- మరి ?

సుబ్బు:- నేను పక్కా వ్యాపారిని మీదగ్గర నా డబ్బుంది. దాన్ని నేను సామ దాన దండోపాయాలతో ఎలాగన్నా రాబట్టుకోవాలి.

సీత:- అందుకని మా సంసారాన్ని రచ్చకీడుస్తావా ? చెప్పు : నీకు బాకీ వుంటడమేనా మేము చేసిన అపకారం ? బాకీలున్న వాళ్ళందర్నీ యిలానే అపహాస్యాలు చేస్తారా ?

హను:- పొరపడుతున్నా వత్తయ్యా. ఆయన చేసింది అపహాస్యం కాదు. సుబ్బరాజుది చాలా గట్టి బుర్ర. పెద్దగానే ఉచ్చు పేర్చాడు. లంచం తీసుకోమని యిక్కడ మావయ్యకు చెప్పి అటు తీసుకునే టప్పుడు పోలీసు లొచ్చి మావయ్యను పట్టుకుని తీసుకుపోయే ఏర్పాట్లన్నీ చేశాడు ఈ సుబ్బరాజు. మావయ్యను అలా పోలీసులు లాక్కెళ్ళగానే తాతయ్య గుండె ఆగి చచ్చిపోతాడు. అప్పుడు నువ్వు వొంటరిదానవై పోతావ్. తినటానికి తిండి వుండదు. ఆకలికి తట్టుకోలేవు. ఆ స్థితిలో నిన్ను పూర్తిగా చంపేసి, తన వశం చేసు కోవాలని సుబ్బరాజు ఎత్తుబ.

(సీత యిక భరించలేక లోపలికి వెళ్ళిపోబోతూ ద్వారం దగ్గర ఆగి పోతుంది.)

సుబ్బు:- నోర్ముయ్.

హను:- మరో క్షణంలో ఎవరు నోరు మూసుకోవాల్సి వస్తుందో చూద్దుర్గాని. (సుబ్బరాజు వెళ్ళబోతాడు.) క్షేమంగా వెళ్ళిరండి; మీకోసం పోలీస్ వేన్ సిద్ధంగా వుంది. (సుబ్బరాజు ఆగి హనుమంతరావు వేపు చూస్తాడు) అంత అమాయకంగా చూడకండి సార్! మీరు పొలిటీషియనే కాని పొరపాట్లు చేసి డిపాజిట్లు పోగొట్టుకున్నారు. తమరు లంచాలు తీసుకోమని మావయ్యకు రాసిన ఉత్తరాన్ని పోలీసులకి అందించాను. చాలా జాగ్రత్తగా వుంటారు వాళ్ళు.

సుబ్బు:- స్కౌండ్రల్. (మీది కొచ్చాడు. సీత అడ్డుకుంది.) మిమ్మల్నందర్నీ ఒకేసారి యమలోకానికి పంపించేస్తాను. (పిస్టల్ తీసాడు.) అడుగు ముందుకి వేసారా, ప్రాణాలు దక్కవు!

హను:- (నవ్వాడు.) పొలిటికల్ ఫిలాసఫీకి ఎదురీదుతున్నారు. పొలిటీషియన్లు పిస్తోళ్ళతో హత్యలు చెయ్యబడతారుగానీ, హత్యలు చెయ్యరు. వాళ్ళు చేసే హత్యలు మరోలా వుంటాయి. మర్యాదగా పారెయ్ పిస్తోలుని.

(హనుమంతరావు ముందుకి వెడతాడు. సుబ్బరాజు అరుస్తూనే వెనక్కి ఒక్కొక్క అడుగు వేస్తాడు. సీత 'హనూ' అంటూ హనుమంతరావుని వెనక్కి లాగేస్తుంది.

సీత:- హనూ, నా మాట విను.

హను:- భయం లేదత్తయ్యా. సుబ్బరాజు చేతిలో ఛస్తే మీకీ బాకీ గొడవన్నా తప్పుతుంది.)

శ్రీని:- (లేచి వచ్చాడు) అప్పుచేసింది నేను, నన్ను చంపు. చిన్నవాడైనా హను నిజమే చెప్పాడు. నీవల్లే నేను నా కోడల్ని అనుమానించాను. ఆమె శీలాన్ని నువ్వు నాశనం చెయ్యబోయావ్. నేను పాపాత్ముణ్ణి. నన్ను చంపెయ్. తర్వాత నువ్వు ఛస్తావ్. మనం మంచివాళ్ళమధ్య వుండకూడదు. ఊఁ-కానియ్.

సుబ్బ:- తొందర పడకండి. అందరినీ అక్కడికే పంపించేస్తాను.

(ఈ మధ్యలో హనుమంతరావ్ సుబ్బరాజు మీదికి దూకడం, వెనకనుంచి రామచంద్రరావు వచ్చి అతనిచేతిమీద కొట్టడం, పిస్టల్ పేలడం ఒకేసారి జరిగాయి. గుండు ఎవరికీ తగలదు. రామచంద్రరావు సుబ్బరాజు చేతినీ, హనుమంతరావు నడుంనీ, శ్రీనివాసులు తలనీ పట్టుకుంటారు. సుబ్బరాజు గింజుకుంటాడు. బయటకు లాక్కెళ్ళి పోలీసులకు అప్పచెప్పారు)

శ్రీని:- ఇదిగోనండి ఇన్స్పెక్టర్‌గారూ - ప్రజాసేవకుణ్ణి పట్టి యిచ్చాను. ఇదిగో పిస్టల్. ఆయనకు బాగా వుపాయాలు తెలుసు. పొలిటీషియన్. కళ్ళల్లో కారం కొట్టేస్తాడు. జాగ్రత్త...ఏమండోయ్ ఇన్స్పెక్టర్‌గారూ- ప్రభుత్వంవారు ఎవరెవరికో బిరుదులు యిచ్చేస్తున్నారు. నాపేరుకూడా మర్చిపోవద్దని చెప్పండి.

(హనుమంతరావు ఇటు తిరిగేసరికి రామచంద్రరావు సీత దగ్గర కొచ్చాడు)

రామ:- నన్ను క్షమించు సీతా!
(సీత ఏడుస్తూ అతని కాళ్ళమీద పడింది. శ్రీనివాసులు కళ్ళు తుడుచుకున్నాడు. రామచంద్రరావు తండ్రి దగ్గరకు వెళ్ళాడు. శ్రీనివాసులు అతనికి ముఖం చూపించలేదు ఎదుట గదిలోకిపోయి కుర్చీలో కూలబడ్డాడు. హను రామచంద్రరావు దగ్గరకొచ్చాడు)

హను:- వెల్ అంకుల్, గ్రహణం విడిచిందని సుస్నానాదులు చేద్దామా?

సీత:- హనూ! ఈ కొంపను నిలబెట్టావు బాబూ!

హను:- నా 'తల్లిదండ్రుల్ని' బ్రతికించుకోవడం కూడా గొప్పేనా అమ్మా? అయితే ఒక విషయం. మనది సత్సాంప్రదాయకమైన నవ నాగరిక సమాజం. ఇందులో మనిషి ఏవిధముగా చచ్చినా ఫర్వాలేదు. కాని (రామచంద్రని చూపిస్తూ) ఆర్థికంగా, (శ్రీనివాసుల్ని చూపిస్తూ) మానసికంగా, (సీతను చూపిస్తూ) నైతికంగా మాత్రం చావకూడదు. అలా చచ్చినాడు ఇది దేశమూ కాదు. మనం మనుష్యులమూ కాము. (అందర్లోనూ చిరునవ్వు. బయటినించి బుజ్జిగాడు 'అమ్మా అమ్మా' అని పిలిచాడు. సీత ఛప్పునవెళ్ళి కొడుకుని ఎత్తుకుని ముద్దాడింది.)

[—తెర—]



## పాత్రలు

పూజారి బసవయ్య
సీతాలు
పెద్దయ్య
కరీం మియాఁ
రాజిగాడు
రంగడు
సింహాచలం
ఖాజా
జగ్గూ
ఇంకా ఇద్దరు ముగ్గురు ఖాటసారులు

[పట్నంలో ఒక వేపువున్న శివాలయం. పెద్ద రద్దీగా వున్న ప్రాంతం కాదది. అడపా తడపా మనుష్యులు అటు వస్తూ పోతూ వుంటారు. ఎడమవేపు దేవాలయం ముఖద్వారం తెరిచి వుంటుంది. ఆ ప్రదేశం శుభ్రంగా లేదు. దేవాలయం కాస్త పాడుపడినట్టు కూడా వుంది. కుడిమూలకు ఒక చెత్తకుండీ, చెదురుగా కాగితం ముక్కలూ పడి వున్నాయి. ఫ్రంటు స్టేజిమీద దాదాపు మధ్యకి ఒక కర్ర స్తంభం వుంది. దానికి ఒక మేకు వుంది. చీకటి పడ్డాక అటు మనుష్యుల రద్దీ కాస్త ఎక్కువవుతుంది, పక్కనున్న పల్లెకి అదే నడవాలి కనక,

గుళ్ళో గంటలు మ్రోగుతుండగా తెర తొలగింది. గంటలు ఆగేసరికి కుడివైపునుంచి సీత వచ్చింది. కాస్త అటు ఇటుగా గుడిద్వారం దగ్గరకువచ్చి దేవుడికి దండం పెట్టింది. గుడిలోపల పూజారి బసవయ్య పూజకు అన్నీ సిద్ధం చేస్తున్నాడు.]

**సీత:-** గంటలు వినిపిస్తున్నాయి, బసవయ్య వచ్చేకాడన్నమాటా. పూజారయ్యా!

**బస:-** (వస్తూ) ఏమే సీతాలూ- వచ్చావా (సీతాల్ను చూసి) ఏమిటీవేళ నీ డబ్బా నిండినట్టుందే!

**సీత:-** ఏదోలే బాబూ- ఎవరో నాయకులంట. ఆదేదో వూరు ఎల్తున్నారని స్టేషనంతా మనుషులొస్తే నిండిపోయింది.

**బస:-** సరే! పనిలోపని నీ డబ్బా కూడా నిండి వుంటుంది. బీదరికం యింత అందంగా వుండడంచూసి ముచ్చటపడి ముడుపులు చెల్లించి వుంటారు. ఏం?

**సీత:-** పో! పూజారయ్యా! నేనంటే నీ కెప్పుడూ- ఏళాకోళమే?

**బస:-** (నవ్వుకొని) నిన్ను చూస్తుంటే గుడ్డితనానికే కొత్త అందం వచ్చినట్టుంది- ఆ దేముడు ఎంత చిన్న చూపు చూడకపోతే నీ లాంటి దానికి కళ్లు లేకుండా చేస్తాడా? అడుగుతా నడుగుతాను. ఎప్పుడయినా తటస్థపడితే మొదట నీ గురించే అడుగుతాను. ఆ! ఆ పువ్వులు

ఇలాతే. (వెళ్ళబోయి ఆగి) త్వరగా ఆ లాంతరు సిద్ధం చేయి. (లోపలికి వెళ్ళాడు.)

(సీత Back Stage దగ్గరకు నడిచింది. అక్కడ సగం కూలి పోతున్న ప్రహరీగోడ వుంది. అదీ సగంమేరకే వుంది. ఆ గోడకు ఆనుకొని ఒక సిమెంటు బల్ల వుంది. దాని వెనుకనుంచి ఒక చింకి చాప తీసి కాస్త ఎడంగా కుడివైపు పరచింది. రెండు పింగాణి పళ్ళాల్ని దానిమీద వుంచింది. ఇప్పుడు గోడ వెనుకనుంచి ఒక లాంతరు తీసింది. అది బాగా మసిబారి వుంది. తొందర తొందరగా చిమ్నీ తుడవడం ప్రారంభించింది. తెరచుకొని వున్న ఆమె అంద మయిన కళ్ళు ప్రపంచాన్ని చూడలేవని యీపాటికి అర్థమై ఉండాలి. సీత చిమ్నీ తుడుస్తోంది. ఇప్పుడు బసవయ్య హారతి తీసుకువస్తూ బయటకి వచ్చాడు. ఆ అలికిడికి ఇటు కదలి...)

సీత:- రంగా! రంగా!!...(గ్రహించి) ఓ పూజారయ్యా!

బస:- (నవ్వి) మీ రంగడు ఇంత మెల్లగా వస్తాడటే. గాలి వానలాగరాడూ! వచ్చేడంటే ఈ శివారంతా ఒక్కసారే మేల్కొంటుంది.

సీత:- ఏటోలే పూజారయ్యా! ఆడో దుడుకు మనిషి. ఏం ప్రమాదం తెచ్చుకుంటాడోనని 'పెద్దయ్య' భయం.

బస:- వాడా! వాడికి ఈ భూ ప్రపంచంలో ప్రమాదమూ; వస్తే రావడానికి వీల్లేదు. ఆ! 'కరీంగాడు', 'రాజిగాడూ' ఇంకా రానట్టేనా!

సీత:- చీకటి పడిందిగా-మెల్లగా చేరుకుంటారు.

బస:- ఆ! సీతాలు - అన్నట్టు చెప్పడం మరిచాను. ఈ ఊరికి రేపో డాక్టరు వస్తున్నాడు. ఎలాంటి కళ్లయినా ఇట్టే బాగు చేస్తాడట. ఇప్పటికి కొన్ని వందల మందికి కళ్ళు బాగు చేశాడని పేపర్లో వేశారు గొప్ప హస్తవాసని అందరూ చెప్పుకుంటున్నారు.

సీత:- ఆరొచ్చినా అంత అదృష్టం వుండొద్దా పూజారయ్యా! అంత గొప్ప వైద్యానికి ఎంత డబ్బు కట్టాలో-ఏమో?

బస:- అదీ నిజమే సీతాలూ! లోకమంతా కళ్ళున్న బీదవాళ్లతో నింపి; కళ్ళులేని ధనవంతుల్ని మిమ్మల్ని ... ఈ మూల మరచిపోయాడు ఆ దేముడు

సీత:- (నవ్వి) మేం ధనవంతులు అంటావేంటి పూజారయ్యా!

బస:- (నిట్టూర్చి) మీ కలిమి మీ కర్మంకాదులే. మీ అందరిమధ్యా వున్న ఆప్యాయతలు - అభిమానాలు - వీటికి ఎంత విలువ కడితే మాత్రం సరిపోతుంది!...వెలిగించు...వెలిగించు...ఆ లాంతరు వెలిగించు.
(అటూ లోపలికి వెళ్ళాడు)
(చేతికర్ర చప్పుడు)

సీత:- ఎవరది! ఆ? మా పెద్దయ్య మావే! (ఉత్సాహంగా) మావాఁ! పెద్దయ్య మావాఁ!
(పెద్దయ్య లోపలికి వచ్చాడు. వయస్సు 45 సంII. పైన పంచ బురద కొట్టుకొనివుంది. కాలు కుంటుతున్నాడు. చేతిలో కర్ర వుంది. సీత మాటకు బదులు చెప్పలేదు.)

సీత:- పలకవేం మావా! ఒంట్లో బాగాలేదా?

పెద్దయ్య:-సీతమ్మా! చెరువుగట్టున పడ్డానమ్మా!

సీత:- మావా! (చిమ్నీ ఒక చేతిలో పట్టుకొని ఆత్రుతగా అతడికోసం వెదికింది. క్షణంలో అతని చేయి దొరికింది) చెరువుగట్టు కెందు కెళ్ళావు మావా? రోజూ బస్సుస్టాండులో వుండేవాడివిగా? మంచినీళ్ల కుండ ఏమయింది?

పెద్ద:- పగిలిపోయిందే. అయినా ఇంక దాని ఉపయోగం లేదులే. బస్సు స్టాండులో యివాల్టినుంచి చల్లనీళ్ల మిషను పెట్టారు. ఇక నా మంచినీళ్లు ఎవరు తాగుతారు? నయాపైస ఎవరిస్తారు?

సీత:- పోనీలే మావా! మనలాటోలికి ఒక చోటేంటి-ఒక పేటేంటి...... కాలు ఎలా వుంది మావా?

పెద్ద:- బాగానే వుందిలే...అయినా కాలు విరిగినా పోయేదేముందిలే సీతాలు ...గుడ్డోడ్ని...ఇవాల్టినుంచి కుంటోడ్ని కూడా అవుతాను,

సీత:- ఏంటి మావా? అలా అంటావు? మేమంతా లేవాం! ఇలా కూచో.

పెద్ద:- (బల్లమీద కూర్చొని) అవును సీతా! నువ్వూ, మన రంగడూ, రాజిగాడూ, కరీంగాడూ వుండే నాకేంటే. సెట్టు తెగిన ఎండుటాకు ల్లాంటి వాళ్ళం. ఎగిరెగిరి యీ మూలకు చేరాం. ఇక మనల్ని ఎవరూ వేరు చేయలేరు సీతాలూ! సీతాలూ! ఈ వేళ రెండు రూపాయలు సంపాదించి వుంటాను. కానీ... చెరువులో దబ్బు పోయిందే...

సీత:- పోనీలే మావా! నీ వేదాంతం వుండిగా. నీది పోయిందంటే మరొ హడికి దొరికిందన్నమాట. అయినా నీ దబ్బూ, నా దబ్బు నేనే సంపాదిస్తాను. మావా! ఈ దబ్బులు లెక్కపెట్టు మావా?

పెద్ద:- నాకి లెక్కలు తెలీవు. మన రాజిగాడు సూసుకుంటాడులే. ఆ లాంతరు వెలిగించావా?

సీత:- ఇంకా లేదు.

పెద్ద:- (గుడిలోపలికి వెళ్తూ) వెలిగించు. వెలిగించు: చీకటి పడిపోయింది. పాపం, ఎవరన్నా ఇటొస్తే దీపం వెలుగుండదు. అటుచూస్తే గొయ్యి — ఇటు చూస్తే కాలువ.

సీత:- ఆళ్ళబాధ మనకెందుకు మావా? దీపం పెట్టినా కనిపించదుగా. (దీపం వెలిగిస్తోంది.)

పెద్ద:- అందుకేనే. కనిపించని బాధేంటో మనకి తెలుసు. మనం పుట్టుక తోనే సీకటికి అలవాటు పడిపోయినోళ్ళం. వాళ్ళు వెలుగులో బ్రతుకతున్నోళ్ళు. మనం కాస్త వెలుగు చూపిస్తే వచ్చే జన్మలో నయినా మనకు కాస్త వెలుగుంటదే. మన బ్రతుకులు సీకటయి పోయాయని ఆళ్ళకి తెలీటానికి కసింత వెలుగుండాలే పిచ్చిదానా!

(సీతాలు లాంతరు అక్కడ స్తంభానికి తగిలించింది - ఎవరో అటు నడిచారు.)

పెద్ద:- దారి చూసుకోండి బాబూ! కాలు జారితే తూలి పడతారు. అక్కడ దీపం వుంది ఇటు వెలుగులోకి అడుగు వేయండి, బాబూ!

(సీతాలు ఇప్పుడు మూడు పింగాణీ పళ్ళాల్ని గోడవారనుంచి తీసి చీరతో తుడిచి దాపమీద పెడుతోంది. ఇప్పుడు రాజిగాడు, కరీం పాట వాయిస్తున్నారు. ఇద్దరూ హుషారుగా వున్నారు. ఇద్దరికి కళ్ళు కనిపించవు. కానీ అది బాగా తెలిసిన స్థలం కావడం వల్ల హాయిగా మెసులుతున్నారు. కరీం మెడలో సగం విరిగిన పాత 'హార్మోనియం' వుంది.)

పెద్ద:- సీతా! మనవాళ్ళు వస్తున్నట్టు ఉన్నారు.

సీత:- అవును మావా!

కరీం:- ఒరే రాజిగా! ఇప్పుడే చెబుతున్నాను. పెద్దయ్యకు పంచె.

రాజి:- వూహూ ! సీతాలుకు సీర.

కరీం:- పంచె కొనాల్సిందే !

రాజి:- సీర కొనాల్సిందే!

పెద్ద:- ఏంట్రా ఆ గొడవ? ఏం కరీంభాయ్?

కరీం:- ఏంలేదు భయ్యా! నీకు పంచె కొనాలని నేను అంటే - యీడు, సీతాలుకు సీరా కొనాలంటాడు. పాతిక రూపాయలకి రెండూ ఎలా ఒస్తాయో నువ్వే చెప్పు.

పెద్ద:- ఇంతకీ ఆ డబ్బు ఎక్కడిదిరా ?

రాజి:- అంతా ఓ పెద్ద కతలే మావా? యీవేళ కరీంమియా, నేనూ చౌక్‌లో నిలబడ్డాం.

బస:- (లోపల్నుండి వస్తూ) అయితే రూటు మార్చారన్నమాట

కరీం:- నువ్వా యిను పూజారయ్యా! నేను హార్మోని పెట్టి నొక్కుతున్నాను. రాజిగాడు పాటెత్తుకున్నాడు. వోరెత్తి పోతోంది. హార్మోనీ మెట్లమీద నా చెయ్యి బ్యాక్ డ్యాన్సు చేస్తోంది.

రాజి:- వున్నట్టుండి కరీంమియా 'కంయ్యి' మన్నాడు. ఎవరో చిన్నపిల్ల గొల్లుమంది. అందరూ 'దొంగ' 'దొంగ' అని అరుస్తున్నారు. ఆడు—ఆ దొంగోడు కరీంమియా మీద పడ్డాడు.

కరీం:- నా హార్మోనియం పట్టుకుపోతాడేమోనని ఆడి మెడ పట్టుకున్నాను.

రాజీ:- నేనాడి కాళ్ళు సుట్టేసి పడేశాను.

పెద్ద:- ఊఁ! తర్వాత.

రాజీ:- ఆడి జేబులో ఏదో బంగారం గలగలమంది. నా కర్థమైపోయింది- "ఈడు నెం. 1 కేటుగాడూ" అని. ఇంతలో పోలీసులొచ్చి ఆడ్ని పట్టుకున్నారు.

పెద్ద:- భలే! మీరు మంచిపనే చేశార్రా!

రాజీ:- పోలీసులూ అదేమాట అన్నారు మావా! అందరూ మమ్మల్ని ఎంత మెచ్చుకున్నారూ? అప్పుడు ఏం చేశారో తెలుసా?

బస:- ఏం చేశారూ?

రాజీ:- ఎలా అయినా గొప్పోళ్ళు గొప్పోళ్ళే పూజారయ్యా! కీన్ పాన్ అని అని ఓ కాగితంముక్క మా చేతిలో పెట్టారు.

బస:- కాగితం ముక్కా! (ఆశ్చర్యంగా)

రాజీ:- (నవ్వి) ఒరే కరీంమియా! మన పూజారయ్య నిజంగా పప్పులో కాలేశాడ్రా! అది వుత్తకాగితంముక్కకాదు పూజారయ్యా! అదేం టంటే-చెక్కు.

బస:- ఓహో! చెక్కే!!

కరీం:- మరేంటనుకున్నావు! పారితకరూపాయల చెక్కు. ఒరే రాజీగా-అది మన పూజారయ్యకు చూపించరా-అదెలా వుంటదో చూసి. మన పెద్దన్నకి, సీతక్కి చెప్తాడు.

రాజీ:- ఓ (తీసి ఇస్తూ) ఇదిగో చూసుకో...ఇప్పుడే సెప్పే సీతాయీ-నీకు సీర కావాలా, ఒద్దా?

సీత:- నా కెందుకురా ఆ రంగడు బుష్‌కోటు కావాలంటున్నాడు. ఆడికి కొనితెండి. మన పెద్దయ్య రాత్రివేళ దగ్గుతున్నాడు. మందుతెస్తే బాగుంటుంది,

రాజి:- నువ్వుండే. ఏం పూజారయ్యా మాట్టాడవేం? పాతిక రూపాయల చెక్కు ఎలా వుంటదో కాస్త విపరంగా చెప్పు. మనోళ్ళంతా వింటారు.
[ఈ మాటలు జరుగుతుండగా బసవయ్య చెక్కుకు బదులు దాన్నే కాగితం ముక్కగా అబద్ధ మాడటానికి నిర్ణయించుకుంటాడు.]

బస:- ఒరేయ్! మీ కెవరిచ్చారో కాని-ఇది నిజంగా కాగితం ముక్కేరా!

రాజి:- (ఆశ్చర్యంగా) ఆ! ఏమిటి?!

కరీం:- ఛి త్తెరి-ఇదేదో మోసం - నేన్నమ్మను — పూజారయ్యా! అసలు నువ్వెప్పుడయినా చెక్కు చూశావా?

బస:- ఓరీ పిచ్చి సన్నాసుల్లారా! కళ్ళున్నవాడ్ని నన్నే నమ్మరట్రా? వాడెవడో చెక్కని నమ్మించి మోసం చేశాడ్రా!
(చెక్కు కరీం చేతిలో పెట్టాడు.)

కరీం:- బద్మాష్! (చెక్కును నలిపి నేలపై పారేశాడు.)

బస:- (తెల్లబోయి) ఎవరూ! నేనా!!

పె:- ఒక దొంగని పట్టిచ్చారు. మరో దొంగ చేతుల్లో పడ్డారు.

రాజి:- (అనుమానంగా) అదకుండా ఇచ్చినోడు పిలిచి మోసం చేసాడ్రా! ఒరే ... కరీంమియా! ఇందులో ఏదో మోసం వుందిరా!!

కరీం:- ఛత్! ఈ కళ్ళున్నోళ్ళంతా దొంగసుండా కొడుకులే, గుడ్డోళ్ళని చేసి...గుడ్డోళ్ళనిచేసి.

పె:- అంతా ఏం చేశార్రా! ఎవరో డబ్బుకు గడ్డితినే యదవలు వుంటారని అందరినీ అంటే ఏం లాభం? ఏం పూజారయ్యా?

పూజా:- (క్రిందనున్న చెక్కు తీసికోబోతున్న వాడల్లా తుళ్ళిపడి అంతలో సర్దుకొని) అంతే! అంతే! మంచిమాట చెప్పావు నాకు చిన్న పనుంది నే వస్తా పెద్దయ్యా! ఇంటికి వెళ్తున్నాను. రేపు ఉదయం వస్తా.

పె:- ఆ దీపం కాస్త పెద్దది చేయి బాబూ'

పూజా:- (తల పంకించి) ఆ ! ఈ దీపం విషయం నేను చూసుకుంటాగా. మీరు వచ్చే పోయేవాళ్లకు జాగ్రత్తగా దారి చూపించండి, ఇక్కడ బాగా వెలుగు పడుతోంది. (అంటూ దీపం పట్టుకుపోతాడు )

[ఇప్పుడు 'రంగడు' చాలా వుషారుగా పరుగెత్తి వచ్చాడు. చూడ డానికి అందరికంటే యువకుడిలా వున్నాడు. అందరికంటె గుడ్డితనంవల్ల తక్కువ ఇబ్బంది పడుతున్నాడు. అందరిలోకి హుషారుగా వున్నాడు.]

రంగ:- పెద్దయ్యమావా ! ఒరే రాజిగా, కరీంమియా! మంచి ఛాన్సు-లక్కీ ఛాన్సు-గొప్ప ఛాన్సు, కరీంమియా ! హె ! హె !

(అంటూ సీత వీపు ఛెళ్లున చరిచాడు.)

సీత:- (ముందుకు పడబోయి, ఆపుకొని నవ్వి) నేనురా ! సీతని...

రంగ:- చూసుకోలేదే—దెబ్బ తగిలిందా !

పె:- అసలు సంగతేంటిరా ?

రంగ:- ఏం లేదు మావా ! ఈసారి ఏనుగు నెత్తిమీద చావు దెబ్బ తీద్దా మనుకున్నాను. అనుకొని పోర్టుకేసి వెళ్ళాను-షిప్పుల దగ్గరికి. ఒక దొరసానమ్మ, దొరగారూ అటు వస్తున్నారు. దొరగారు "డార్లింగ్సు, హోటల్సు, ఇండియాన్, నైన్, గియిన్" అంటున్నారు. పసిగట్టే శాను. సమయంచూసి ముందుకు దూకాను. "మై బ్లయిండ్సు దొర సాబ్-మై బ్లయిండ్సు మనీస్" అన్నాను.

రాజి:- (నవ్వి) యదవ బొట్లెరు ఇంగ్లీషూ నువ్వునూ !

రంగ:- అవునురా! ఆ రోజుల్లో, ఆ రోజుల్లో అంతే నేర్చారా. అప్పట్లో మా ఇంటిమీద పిడుగుపడి మా అమ్మ, నాన్న చః పోకపోతే, అప్పుడు నా కళ్లు పోకపోతే-హూ ! నేను ఇంకా గొప్ప చదువులే చదువుకునేవాడ్ని.

రాజి:- సర్లేరా... అక్కడేమయిందో చెప్పురా !

రంగ:- నన్ను చూసి దొర నవ్వి వూరుకున్నాడు. దొరసాని అదకోతిలా అర్థంకాని ఇంగ్లీషులో కిచకిచ లాడింది. ఇద్దరూ ఏదో చెప్ప

కున్నారు. నాకు ఫోటోలు తీశారు. 'మసీన్ దొరా' అన్నాను. దొరగారు నవ్వుకొని నోటు తీశాడు.

రాజి:- ఏంటి! రూపాయి నోటే!

రంగ:- ఓ రెల్లరా—రూపాయి నోటేంటి? నూరు రూపాయిలు నోటురా, ఇదిగో చూడు (తీసి ఇచ్చాడు.)

కరీం:- శభాష్ రంగా! శభాష్!!

రంగ:- పెద్దయ్య మావా! ఇప్పుడే చెబుతున్నా. ఈ డబ్బుతో మనం పూర్తిగా మారిపోవాలి. నీకు రెండు పంచెలు - సీతాలకి పూసల దండ — మనకు రెండు పింగాణి కంచాలు — పెద్ద చాప — కరీంగాడికి ఎర్రటోపి — హార్మోనియం కర్రపెట్టె — రాజిగాడికి చెప్పులు, ఇవన్నీ కొనుకోవాలి.

సీత:- మరి నీకురా?

రంగ:- నాకేం వద్దులేవే! మళ్ళీ సంపాదిస్తాగా — అప్పుడు చూద్దాంలే.

కరీం:- నీకు బుష్‌కోటు కొనాల్సిందే. నువ్వు కొనుక్కోకపోతే నేనూ కొనుక్కోను.

రంగ:- (వెక్కిరిస్తూ) కొనాల్సిందే — ఒరే కరీంమియా! మనకు అవసరమైందేదో అది ముందు కొనుక్కోవాలి ఏం పెద్దయ్య మావా - మాట్లాడవేం?

పె:- నాకీ డబ్బు చూస్తుంటే భయంగా ఉందిరా!

(ఆ నూరు రూపాయిల నోటు తిరిగి రంగడికి ఇచ్చేస్తాడు.)

రంగ:- (నోటు తీసుకుంటూ) చూస్తేకదా మావా!....ఒరే రాజిగా, పదరా అన్నీ కొనుక్కొద్దాం —

సీత:- ఒరే రంగా!

రంగ:- ఏందే! నీకేమయినా కావాలా?

సీత:- నాక్కాదురా రంగా! ఈ డబ్బుతో అందరికీ కావలసిందేదో కొనుక్కుందాం.

రంగ:- అందరికీ కావలసిందా! ఏమిటది? రొట్టెలా? (నవ్వుతూ)

రాజీ:- అవెప్పుడూ తినేవేగా !

సీత:- అవి కాదురా — 'కళ్ళు.'

కరీం:- }
రంగ:- } కళ్ళా !

రాజీ:- కళ్ళు కొందామా ! ఏంటీ ? నీకేమైనా పిచ్చెక్కిందా ఏదే! !

సీత:- కాదు రాజీ ! ఇందాక బసవయ్యగారు చెబుతున్నారు, రేపెవరో కళ్ళ డాక్టరొస్తారట. ఎలాంటి కళ్ళనైనా బాగుచేస్తారట. ఈడబ్బుతో మనం కళ్ళు బాగుచేయించుకుంటే ?

రంగ:- (కోపంగా) ఏంటీ ! ఈ డబ్బుతో కళ్ళు బాగుచేయించుకుంటావా? సీతా ! మనం సుఖంగా, హాయిగా బ్రతకడం నీకిష్టం లేదా ఏమిటి?

పె:- రంగా!

రంగ:- లేకపోతే ఏంటి మావా ! సుఖంగా హాయిగా బ్రతుకుతున్న మనకి కళ్ళెందుకు మావా ! అదో అడ్డంకూడానూ! మనకదేం వద్దు, ఇలాగే బావుంది.

కరీం:- అవును బాయ్ ! రంగడు చెప్పిందే రైటు

రంగ:- ఆ ! పదరా రాజిగా! (వెళ్ళబోతాడు)

రాజీ:- అయినా నూరు రూపాయిలతో అంత పెద్ద వైద్యం ఏటవుద్దే ?

సీత:- మనం ఎప్పటికప్పుడు సింహాచలం దగ్గర డబ్బులు దాసుకుంటున్నాంగా. మరో నిముషంలో ఎలాగూ రాద్దెలు తీసుకొస్తారు. రాంగానే ఇంతవరకూ దాచిన డబ్బు తీసుకుందాం.

రాజీ:- అదంతా ఎంతుంటుందే— ! వందో, రెండొందలేగా !

సీత:- ఆ మొత్తం డబ్బుతో ఒక్కడికి కళ్లురావా పెద్దయ్యా ! మనందరికీ లేని కళ్లు మనలో ఒకడికి వచ్చినా చాలు.

పె:- రాజీ, నువ్వేమంటావ్ ?

రాజీ:- మిగతావాళ్ళంతా ఏటవుతారు సీతా !

సీత:- ఏమీ కారు. మనందరం హాయిగా బ్రతకడానికి రెండు కళ్లు చాలు. నువ్వు మాట్లాడవేం పెద్దయ్యా!

పె:- అవును సీతా!

రంగ:- (కోపంగా) మావా? నువ్వు సీతమాటే సెబుతున్నావా... (ఎవరూ మాట్లాడరు.) సరే...మీలో ఎవరికి కావలిస్తే వాళ్ళే బాగుచేయించు కొండి.

పె:- రంగా!

రంగ:- (నూరు రూపాయిల నోటు కరీంకు యిస్తూ) నా కక్కర్లేదు.

కరీం:- నాకు కావలసినా రావు మావా!

సీత:- కరీం!

కరీం:- అవును సీతాలు! కళ్ళే వుంటే మిమ్మల్ని అందర్నీ కడుపులో పెట్టుకు చూసుకొనేవాడ్ని...కాని...కాని...

రాజి:- ఏంటిరా?

కరీం:- కమ్మరి కొలిమిలో నిప్పురవ్వలుపడి నా కళ్ళు కాలిపోయాయి. ఈ కళ్ళ యింక కనిపించవురా, ఇంక కనిపించవురా!

రాజి:- పోనీ మామా, మన సీతాలుకు బాగుచేయిస్తే!

సీత:- (ఆందోళనతో) వద్దు రాజీ, వద్దు.

పె:- కాదనకు సీతాలు! నువ్వు బాగయితే మా అందర్నీ సాకుతావు. నీ వెనక మేమంతా నడుస్తాం.

సీత:- వద్దు పెద్దయ్యా! మా అయ్య తిరిగిన చెడు తిరుగుళ్ళకి మా అమ్మ ఒళ్లు చెడి చచ్చిపోయింది. ఆళ్ళ పాపానికి యీ ప్రపంచంలో కళ్లు లేకుండానే పడ్డాను. అయినా, కళ్లుండి యీ పాడు ప్రపంచంలో ఎవర్ని చూడాలి-ఏటి చూడాలి? మనకు కావలసింది మగదిక్కురా. ఆడ సాయంకాదు. మా అందర్లోకి పెద్దవాడివి. మమ్మల్ని నీ బిడ్డ ల్లాగ చూసుకుంటావు, నీకే కళ్లు రావాలి పెద్దయ్యా!

పె:- నీకేమయినా పిచ్చెక్కిందా ఏదే సీతా! పెద్దోడ్ని కనుకనే నాకు కళ్లు అక్కర్లేదే బ్రతికినంత కాలం—నాకెందుకే?

రంగ:- (బాధగా) మావా!

పె:- అవును రంగా! ఒంట్లో రక్తం, శక్తి వున్నవాడు బాగుపడాలి. మాలో నువ్వొక్కడివేరా మనిషివి. నీకే కళ్లు రావాలి.

రాజి:- అవున్రా రంగా! నువ్వు డబ్బు సంపాదించావు కనుక నీకే కళ్లు రావాలి.

రంగ:- (కోపంగా) రాజిగా! ఆ మాటన్నావంటే చంపేస్తాను.

రాజి:- నే నేం తప్పుమాటన్నానురా?

రంగ:- లేకపోతే, నేను సంపాదించిన డబ్బు నాదని ఎవరన్నారు నీతో? బుద్ధెరిగినప్పట్నుంచి మీతో వుంటున్నాను. ఇవాళ డబ్బు నాకు దొరికింది కదా అని మిమ్మల్ని వదలి నే నొక్కడ్ని బాగుపడి పోయేదా? నేనూ మనిషినేరా! నాకు మీకంటే 'కళ్లు' ఎక్కువ కాదురా. ఒరేయ్! ఆఖరుసారిగా చెబుతున్నాను. నేను గుడ్డివాడి లాగ మీ అందరిమధ్యా వస్తాను. కాని- బాగుపడి బయట ప్రపంచం లోకి వెళ్ళనురా.

రాజి:- అదికాదురా, మా అందరిలోకి చురుకయిన వాడివి, కొద్దో గొప్పో చదువుకున్నవాడివి. నలుగురిమధ్యా తిరగడం తెలిసినవాడివి. ఈ పెపంచం ఎలా వుంటదో నీకు పదేళ్ళయినా తెలుసు. నాకు పుట్టి నప్పట్నుండీ తెలీదు. మనల్ని ఎవరూ మోసం చేయకుండా చూడు. నా మాట వినరా రంగా! కాదనకురా రంగా!

రంగ:- కానీ, మీకు లేని కళ్లు నాకు రావడం బాధగా వుంటుందిరా.

సీత:- బాధెందుకు రంగా! మనం అయిదుగురం సుఖంగా బ్రతకడానికి రెండు కళ్ళు చాలు.

రాజి:- మేం చూడలేని కళ్ళు నువ్వు చూడగలుగుతావు.

పె:- మనం వెలిగించిన దీపం ఎలా వెలుగుతుందో చెప్తావ్.

సీత:- మనం దండంపెట్టే దేవు డెలా వుంటాడో చెప్తావు!

కరీం:- నీ వల్ల మా అందరి జీవితాలూ మారిపోతాయి రంగా - మారి పోతాయి.

రాజి:- అవునా రంగా!

సీత:- కాదనకు రంగా!

రంగ:- (ఉద్రేకంగా) అవును, మారిపోతాయి. మీది, నాది అందరి జీవితాలు మారిపోవాలి. మార్చేస్తాను-నాకు కళ్ళు కావాలి. నా కళ్ల చూడాలి. నా కళ్ళు చూడాలి. నా కోసం కాకపోయినా-మీకోసం-మీ కోసమయినా నా కళ్ళు చూడాలి.

[లైట్లు ఆరి మళ్ళీ వెలిగాయి]

[కొన్నాళ్ళ తర్వాత...]

(సీత చుట్టుప్రక్కల చీపురుతో తుడుస్తోంది. కరీం సిమ్మెంటు బల్లమీద కూర్చొని హార్మోని పెట్టి బాగు చేస్తున్నాడు.)

కరీం:- బెహెన్!

సీత:- ఏం, కరీం భాయ్?

కరీం:- రంగడికి మనల్ని చూడగానే ఏమనిపిస్తోందో చెప్పు చూద్దాం.

సీత:- ఏమనిపిస్తుంది-నిన్ను చూసి 'మా కరీంమియా ఇలా ఉంటాడా!' అనుకుంటాడు. నన్ను మాత్రం సుళువుగా పోల్చేస్తాడు.

కరీం:- ఎలాగా?

సీత:- ఇక్కడ నే నొక్కతే అవపిల్లని గనుక.

[ఇద్దరూ నవ్వుతున్నారు-క్షణం తర్వాత]

కరీం:- రంగడ్ని తీసుకురావడానికి పెద్దయ్య ఆసుపత్రికి వెళ్ళాడు, ఇంకా రాలేదేం?

సీత:- ఏం, రంగడిని చూడాలని తొందరగా వుందా కరీం?

కరీం:- అవును సీతా! ఆది కళ్ళతో ఈ ప్రపంచం అంతా ఒక్కసారి చూడాలని ఆశగా వుంది.

(ఇంతలో బసవయ్య లాంతరుతో వచ్చాడు. కరీం, సీతాలు తృళ్ళిపడి లేచారు. ఒక్క క్షణం నిశ్శబ్దం. ఇద్దరి ముఖాల్లో ఆతృత తెలుస్తోంది.)

కరీం-సీత:-(ఇద్దరూ ఒక్కసారి) రంగా!

బస:- (నవ్వుకొని, కర్రస్తంభం దగ్గర్నుండి లాంతరు పట్టుకొస్తున్నట్టు నటించి) ఏమిటర్రా? యీ వేళంతా రంగడు గురించి కలవరిస్తు న్నారు! ఊరు వెళ్ళినవాడు రాకుండా పోతాడా? వస్తూనే వుంటాడు. సీతమ్మా! ఇదిగో ఈ లాంతరు వెలిగించు—త్వరగా...(అంటూ లోపలికి పోయాడు. సీత లాంతరు వెలిగించడానికి సిద్ధపడు తోంది.)

కరీం:- ఆడు వూరికి వెళ్ళాడనే అనుకుంటున్నారంతా. ఆడు వస్తేగాని అసలు బయట పడదు (అంటూ బయటకు పోయాడు.)

(సీత లాంతరువత్తి పెద్దది చేసి అగ్గిపుల్లతో వెలిగించబోయింది. ఒత్తి అంటుకొని, ఒక్కసారి భగ్గుమంది. దీపంమీద వంగివున్న ఆమె చీర అంటుకోబోయే సమయంలో రంగడు వచ్చాడు. ఒక్క సారిగా ఆమెవైపు పరిగెత్తి - ఆమె రెక్క పుచ్చుకొని దూరంగా లాగాడు. సీత గాభరా పడింది.)

సీత:- ఎవరది? (అతని చెయ్యి స్పృశించి) ఓహో రంగా! నువ్వా? బాగున్నావా?

రంగ:- నేను సమయానికి రాకపోతే నీకు ఎంత ప్రమాదం జరిగేదో తెలుసా?

(రంగడు పైజామా, లాల్చీలో వున్నాడు. కొంచెం చిరిగి వున్నాయి. అతనికి యీ ప్రపంచమంతా ఆశ్చర్యంగా కనిపిస్తోంది.)

సీత:- నాకేం తెలుసు రంగా! ఏది ప్రమాదమో, ఏది కాదో తెలియ కుండానే ఇన్నాళ్ళు బతికాం, నువ్వొచ్చి మొదటి ప్రమాదంనుంచే నన్ను కాపాడావు. ఏం రంగా, నీ కళ్లు బాగా కనుపిస్తున్నాయా?

రంగ:- ఓ (అంతా కలయచూస్తున్నాడు.)

సీత:- మన చుట్టూవున్న యీ తోట, ఈ గుడి, ఆ చెరువు, కొండలూ ఇవన్నీ ఎలా కనిపిస్తున్నాయి? ఈ ప్రపంచం ఎలా వుంది రంగా!

రంగ:- చాలా విచిత్రముగా వుంది సీతా! ఇదివరకు నా కివన్నీ తెలిసిన విషయాల్లాగే వున్నాయి. తెలియనిది- అతి విచిత్రమైనది ఒకటి చూస్తున్నాను.

సీత:- ఏమిటి రంగా?

రంగ.- నువ్వు!

సీత:- (దిగ్భ్రమతో) నేనా?

రంగ:- అవును సీతా! ఎదుటవున్న మాణిక్యాన్ని ఇన్నాళ్ల తెలుసుకోలేక పోయాను. నువ్వెంత అందంగా వున్నావో తెలుసా!

సీత:- అందమా! అంటే?

రంగ:- అంటే- ఎలా చెప్పడం? కళ్లుంటే కాని, చెప్పినా నీ కర్థం కాదు.-

సీత:- అలాగా! అది సరేగాని- పెద్దయ్య ఏడీ?

రంగ:- అదేమిటి? ఇక్కడ లేడా?

సీత:- నిన్ను తీసుకురావడానికి ఆసుపత్రికి వచ్చాడు. పాపం, యింకా అక్కడే వుండి వుంటాడు. కానీ, నువ్వు గుర్తుపట్టి వుండవు (నవ్వి) చూశావా రంగా! కళ్లు రాగానే నువ్వు ఇన్నాళ్ల కలిసి బ్రతికిన మనుష్యుల్నే గుర్తుపట్టలేక పోయావు. (రంగడు మాట్లాడలేదు-క్షణం విరామం) ఏంరా, ఆకలిగా వుందా?

రంగ:- వూఁ!

సీత:- అయితే వుండు రొట్టెలు పట్టుకొస్తాను. (బల్లచాటున వెదుకుతుంది. రంగడు ఆశ్చర్యంగా అంతా కలయ జూస్తున్నాడు.)

సీత:- (రొట్టెలు పట్టుకొస్తూ రంగడ్ని గుద్దుకొంది.) ఏంరా యింకా ఇక్కడే వున్నావా? అలా అరుగుమీద కూర్చో.

రంగ:- అక్కడా! పరమ ఘోరంగా వుంది సీతా!

సీత:- అలాగా! నాకు కనిపించదుగా, బాగానే వుందనుకున్నాను - వుండు నా చీరతో తుడుస్తాను.

రంగ:- (సీత తుడవబోతే- ఆత్రుతగా ఆపి) వద్దు సీతా! ఆ మురికి నీ చీర కంటుకుంటుంది.

సీత:- (నవ్వి) ఇప్పటికి అంటుకున్న మురికి నాకు కనిపించిందా ఇది కనిపించడానికి- పరవాలేదులే - (తుడవబోయింది)

రంగ:- ఆ హ హా! వద్దు- తుడవకు.

సీత:- (నవ్వి) కనిపించే ప్రపంచంలో ఎన్ని ఆటంకాలు వున్నాయి రంగా సరే, ఇదిగో- ఈ రొట్టెను తిను.

రంగ:- ఏమిటి ? యీ కంచంలో తినేదా !

సీత:- ఏం ?

రంగ:- (చెప్పబోయి అంతలో ఆగి) అబ్బే. ఏం లేదు ... ఏం లేదు—
(కంచం అందుకున్నాడు.)

సీత:- రంగా ! నువ్వెక్కడ ఇదే కంచంలో పదేళ్లు అన్నంతిన్నావు. తెలుసా? రొట్టె ఎలా వుంది ?

రంగ:- ఓ! రొట్టెం— బాగానే వుంది.

సీత:- నిన్నటిది— కాస్త పాసిపోయింది

రంగ:- అయినా బాగానేవుంది.

సీత:- రంగా ! రోజూ గెంతుతూ కేకలెస్తూ వుండేవాడివి. హాయిగా కబుర్లు చెప్పేవాడివి—నవ్వేవాడివి—నవ్వించేవాడివి. ఇప్పుడిలా అయి? పోయావేం ? ఏంరా, నువ్వు చూస్తున్న ప్రపంచం బాగాలేదా భయమేస్తుందా ?

రంగ.- నేను చూడడం బాగానే వుంది. కానీ, చూసే విషయాలే వింతగా వున్నాయి—అంతే.

[ఇప్పుడు పెద్దయ్య వచ్చాడు]

పెద్ద:- (ఆత్రంగా) రంగా! రంగా!!

సీత:- రంగడు వచ్చాడు మావా!

పెద్ద:- రంగా! వచ్చేశావా, (కౌగలించుకోబోయాడు కాని, రంగడు అతని మురికి బట్టలు చూసి, అసహ్యించుకొని దూరంగా జరిగాడు.) ఏంరా! దూరంగా పోతావు.

రంగ:- (తడబడుతూ) అబ్బే! అదేం లేదు మావా? ఇక్కడే వున్నాను. (కరీంగాడు, రాజిగాడు వచ్చారు రంగడు వునికి గ్రహించి ఒక్క సారే 'రంగా' అన్నారు - ఆ పిలుపుకు రంగడు ఇటు తిరిగాడు.)

సీత:- (నవ్వి, రంగడి వైపు తిరిగి) రంగా! (వాళ్ళిద్దరినీ చూస్తూ) ఎవరు? ఎవరో చెప్పుకోవాలి.

పె:- ఎందుకే వాడిని ఆటలాడిస్తావ్?

సీత:- వుండు పెద్దయ్యా— చెప్పు రంగా! (చెయ్యి పట్టుకు తోసింది.) (రంగడు ఇద్దరి దగ్గరకీ వచ్చాడు - ఒక్క క్షణం ఆలోచించి)

రంగ:- (సీతనుద్దేశిస్తూ) నీకు కుడిచేతివైపు వున్నవాడు కరీం—ఎడమ చేతి వైపు వున్నవాడు రాజిగాడు.
(అంటే రాజిగాడ్ని చూసి కరీం అని, కరీంని చూసి రాజిగాడు అనీ అన్నాడు. అందరూ గొల్లుమన్నారు.)

సీత:- (నవ్వుతూ) కళ్లు మూసుకొని చూడరా — తెలుస్తుంది (కరీంను, రాజిగాడ్ని ముందుకు తోసింది)

రంగ:- (కళ్లు మూసుకొని—ఇద్దర్నీ ముట్టుకొన్నాడు) ఆ! అవును— వీడు రాజిగాడు, వీడు కరీం.

రాజి:- (నవ్వుతూ) రంగా! మమ్మల్ని గుర్తు పట్టడానికి మళ్ళీ గుడ్డితనమే అవుసరమయిందిరా నీకు! (అందరూ నవ్వుకున్నారు.)

పె:- ఏంటే, వాడ్ని ఏడిపిస్తావు— వాడికి రొట్టెలు పెట్టావా?

సీత:- ఓ—ఇందాకే పెట్టాను— (రంగడు నేలమీద పడివున్న రొట్టెల్ని చూస్తున్నాడు.)

పె:- అయితే-కరీంకు, రాజిగాడికి కూడా యివ్వు.

రాజి:- ఒరే రంగా ! ఈ డబ్బాలో లెక్క ఎంత వుందో చూడరా ! (ఈలోగా అటు ఎవరో నడిచారు)

పె:- (తలయెత్తి) దారి చూసుకొండి బాబూ - కాలుజారితే జారిపడతారు. అక్కడ దీపం వుంది. ఇటు వెలుగులోకి అడుగువెయ్యండి బాబూ!

బస:- ఏరా రంగా! వచ్చావా? ఆ దేముడుకోసం ఎదురుచూసినట్టు నీకోసం ఎదురుచూస్తున్నారు వీళ్లంతా.

పె:- (నవ్వి) మాకు దేముడు ఎలా వుంటాడో తెలీదు బాబూ ! కానీ వీడికి మేమెలా వుంటామో తెలుసు, మా కష్టాలకి ఇక వాడే దిక్కు. వాడు మాకు దేముడేనయ్యా.

బస:- ఏమిట్రా నీ వేదాంతం ? ఇదిగో ఈ హారతి తీసుకో......ఊఁ! ఎక్కడికెళ్ళావురా ఇన్నాళ్లు ?
(రంగడిని గమనించకుండానే లాంతరు దగ్గిరికి వెళుతూ ఆగాడు. రంగడు ఆశ్చర్యంగా చూస్తున్నాడు తప్ప సమాధానం చెప్పలేదు. లాంతరు బసవయ్య తీస్తుండే గమనించి)

రంగ:- అదేమిటి? ఆ లాంతరెందుకు తీస్తున్నారు?

బస:- (మొదట విస్తుబోయి, అంతలో తేరుకొని) గుడ్డివాడివయినా నీకు మంచి గ్రహింపే.
(ఇంకా రంగడు గుడ్డివాడేనని అభిప్రాయం) నీ లాంతరు ఎక్కడికీ పోదులేరా. వత్తి పెద్దది చేస్తున్నాను. (చేతిలోకి తీసుకొని బయటకు నడుస్తూ) రాత్రంతా ఇక్కడే వుండి, నలుగురికీ దారి చూపిస్తూ వుండు. జాగ్రత్త. నేను వెళ్తున్నా ... (అంటూ లాంతరు పట్టుకొని బయటకు వెళ్ళబోయాడు.)

రంగ:- (కంఠంలో క్రౌర్యం కంటె, ఆశ్చర్యం ఎక్కువ ధ్వనిస్తోంది.) ఏమిటండీ మీరు చేస్తున్న పని?

బస:- (నిర్ఘాంతపోయి — ఇంకా విషయం గ్రహించలేక) ఏమిట్రా నీ దబాయింపు?

రంగ:- (సూటిగా అతని కళ్ళల్లోకి చూసి, చేతిలోవున్న లాంతరు తీసుకొని స్తంభానికి తగిలించాడు)

బస:- (విషయం అర్థమై— స్తంభించిపోయాడు) ఏమిటి? నువ్వు—నువ్వు— చూస్తున్నావా? అయితే ఇన్నాళ్లు...

రంగ:- ఇన్నాళ్లు కాదు-ఇవాల్టినుంచే చూస్తున్నాను, కొత్త కొత్త విషయాల్ని. బసవయ్యగారూ! మా పెద్దయ్య మిమ్మల్నింత నమ్ముతాడు కదా! ఏమిటీ దొంగ పని?

బస:- (ఒక్క క్షణంలో తేరుకుని నవ్వి) రంగా! నువ్వు చూడగలుగు తున్నావు కాబట్టి ఇది దొంగపని అంటున్నావు. ఒక్కసారి కళ్ళు మూసుకుంటే ఇదే దొరపనిలాగ కనిపిస్తుంది. ఇన్నాళ్ళు నువ్వు చూడని ప్రపంచంలో యిదేరా "నీతి" అంటే!

రంగ:- బసవయ్యగారూ!

బస:- నువ్వు యిప్పుడిప్పుడే కళ్ళు విప్పావు. ముందు ముందు నీకే అర్థ మవుతుంది. చూడు రంగా! కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. ఇరవై ఏళ్లబట్టి సేవ చేస్తున్నా, ఈ దేముడు నన్ను కరుణించడం లేదు. గంపెడు సంసారం, రోజులు గడవక ఆఖరికి ఇలా కిరసనాయిలుకి కూడా కక్కుర్తి పడుతున్నాను.

రంగ:- ఏమిటండీ! దేవుడినే నిందిస్తున్నారా?—

బస:- పిచ్చివాడా!—ఎక్కడున్నాడ్రా—దేముడు, కళ్ళు మూసుకుని నమస్కారం పెట్టే నీ మనసులో తప్ప? సరేలే — అదంతా వరో ప్రపంచం-వస్తా-[లాంతరుతో దాటిపోయాడు.]

రంగ:- ఆగు. చేసిన వెధవపని చాలక, యింకా సిగ్గులేక సమర్థించు కొంటావా?- నిన్ను ఏంచేసినా పాపంలేదు. వుండు- ఈ విషయం అందరికీ ఇప్పుడే చెబుతాను.

బస:- రంగా! నన్ను అల్లరి చేయక-నన్ను రక్షించు. చిన్నవాడివయినా నీ చేతులు పట్టుకుంటున్నాను. ఇదిగో, యీ డబ్బులు వుంచుకో. అప్పుడప్పుడు అవసరానికి ఉపకరిస్తుంటూ ఉంటాయి. [అని చేతిలో డబ్బులు వుంచాడు]

రంగ:- [చేతిలో డబ్బులు చూసుకొని నిర్ఘాంత పోయాడు. అతను ఆశ్చర్యం నుండి తేరుకొనేలోగా బసవయ్య దాటేశాడు. ఈలోగా ఎవరో అటు నడిచారు.]

పె.- [తలెత్తి] దారిచూసుకోండి బాబు. కాలు జారితే తూలి పడతారు. అక్కడ దీపం వుంది. ఇటు వెలుగులోకి అడుగెయ్యండి.

(ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.)

రంగా! పూజారయ్య వొత్తి పెంచాడా?

రంగ:- [కాసేపు ఆలోచించి, చేతిలో డబ్బు చూసుకుంటూ, బలహీనంగా...] పాపం... పెంచాడు.

కరీం:- పాపం, బసవయ్య దేవుడిలాంటివాడు.

(కాస్త విరామం)

పె:- రంగా, నిజం చెప్పరా?

రంగ:- (తుళ్ళిపడి) ఆ! నిజమా! ఏమిటది?

పె.- లోకం అంతా మోసం, మోసం అంటారు కదా-మన కళ్ళముందే మోసం జరిగి పోతుందంటారు కదా? అది నిజమేనా?

రంగ:- (ముఖం పాలిపోయి) ఏమో... నాకు తెలీదు.

రాజి:- (వస్తూ-రొట్టె చేతిలో వుంచుకొని) వీడు ఇప్పటికిప్పుడే అన్నీ చూస్తున్నాడు మామా! రేపట్నుంచి చూసుకో. ఈ యెదవ ప్రపంచం గురించి రోజుకో కథ చెప్తాడు. ఏరా రంగా! (రంగడు మాట్లాడడు) డబ్బు లెక్క పెట్టడం అయిపోయిందిరా?

రంగ:- ఊఁ!

కరీం:- (వస్తూ-రొట్టి చేతిలో వుంటుంది) ఆ సింహాచలం ఎప్పుడూ మన లెక్కలు తప్పేనంటాడు. ఈ సారి నీ లెక్క ఎలా తప్పంటాడో చూస్తాంగా రానీ- నీ లెక్క చూసి వాడు రారెత్తిపోవాలి.
(గర్వపడి పోతున్నాడు రంగడిని గురించి)

సీత:- (వస్తూ) ఇంతకీ లెక్కెంత రంగా ?
(రంగడు చెప్పబోయేలోగా 'సింహాచలం' జంగిడలో రొట్టెలు పట్టు కొని వచ్చాడు)

సింహా:- ఆ! ఆ!! ఏంట్రోయ్! అంతా త్వరగా గూటికి చేరుకున్నట్టున్నారు... ఏంటి ? నిన్నటి రొట్టిలు దాచారా... అయితే ఇవాళ బేరం లేదన్న మాట-

రాజి:- ఇవాళ ...

కరీం:- నువ్వుండరా. మనోడ్ని మాట్లాడనీ ...

సింహా:- (గడబిడగా) ఏంరా రంగా ? ఎక్కడికి మాయమయావు ? (పరి హాసంగా) కళ్లురావాలని తపస్సుచేసి వచ్చేవేంరా? (తన హాస్యానికి తనే నవ్వుకున్నాడు. అతని చేతిలో డబ్బులాక్కొని గలగలలాడించి) ఏంటి ? ఈసారి చాలా పోగుచేసినట్లున్నారే ! (చేతిలోకి పావులా కాసుల్ని, అర్ధరూపాయల్ని తీసికొని, కళ్ళెగరజేసి) ఏమిటీ! పైసలేనా! మీతో ఇదే చిక్కు. చూడడానికి బోలెడు డబ్బులాగ వుంటుంది; లెక్కపెడితే సగం తేలదు. (లెక్క వేస్తున్నాడు)

సీత:- నిన్న పాసిపోయిన రొట్టిలు ఇచ్చారు సింహాచలంగారూ !

సింహా:- (తనని తిట్టినంత కోపం తెచ్చుకుని) ఇదిగో సీతాలూ! ఆ మాటే అనొద్దన్నాను. ఊరికి నాలుగు ఆమడల దూరంలో బేరంపెట్టిన మీ దగ్గరికి వచ్చి చెడీ నడచి పోస్తున్నాన-ఏదో ముష్టి బేరానికి.

రాజి:- (కోపంగా) ఏమిటయ్యా! 'ముష్టి' 'ముష్టి' అని పదిసార్లు అంటావు. ఆ ముష్టి డబ్బులతోనే నువ్వు బ్రతుకుతన్నావు.

సింహా:- (కోపంగా) చూశావా పెద్దయ్యా! ఈ రాజిగాడి నీలుగుడు! ఏదో ఆ పరమేశ్వరుడి సమక్షంలో బ్రతుకుతున్నవాళ్ళు కదా అని

మానవ సేవ చేసినట్టు అవుతుందని — బేరం వున్నా రొట్టెలు మిగిల్చి తెస్తుంటే పాసిరొట్టె, బోసి నోటూ అంటారు? ఇదేనా మర్యాద?

పె:- కోప్పడకండి సింహాచలంగారూ! వాళ్ళు చిన్నోళ్ళు.

సింహా:- చిన్నవాళ్ళయితే చిన్నవాళ్ళలాగ మాట్లాడాలి. గుడ్డివాళ్ళకు పెద్ద మాటలేంటి? ఏంరా రంగా!

(రంగడు ఇదంతా మాట్లాడకుండా గమనిస్తున్నాడు. సింహాచలం వేళ్లు చకచకా నాణాల్ని లెక్కపెడుతున్నాయి. ఆ ఊపులోనే రూపాయినోట్లు కోటుజేబులో దాచేశాడు.)

రాజి:- ఇంతకీ యీవేళ ఎంత తేలిందో చెప్పండి?

సింహా:- (వ్యంగ్యంగా) ఆ! ఎటు లెక్కపెట్టినా-నాలుగు రూపాయిల అరవై రెండు పైసలే తేలింది.

కరీం:- అదేంటండీ—బజారులో ఒక్క మా ఆటకే...

సింహా:- (కోపంతో) ఇదిగో కరీం! ఇలా నువ్వు, నా నిజాయితీని శంకించడం యిది రెండోసారి-మళ్ళీ మరోసారి...

రంగ:- (నెమ్మదిగా) మరోసారి లెక్కపెట్టండి సింహాచలంగారూ!

సింహా:- (పట్టుదలగా) నేను లెక్కపెట్టనయ్యా! లెక్కపెట్టవలసిన అవసరం లేదు. నేను కాకపోతే కళ్ళులేని కబోదోడివి రోజూ నువ్వు లెక్కపెడుతున్నావా అంట?

రాజి:- ఏంట్రా కూస్తావ్ మా రంగడ్ని?

పె:- (ఇద్దర్నీ ఆపుతూ) ఒరేయ్-మీరంతా లోపలికి పదండి. అదంతా మన రంగడు చూసుకుంటాడు. ఊ - పదండిరా.

[అందరూ లోపలికి వెళ్ళారు. పావలాలు, అర్ధ రూపాయిలు రహస్యంగా తన జేబులో దాచుకొంటూ వుండగా, రంగడు గబగబా వచ్చి, సింహాచలాన్ని కోటు పట్టుకుని రెండు గజాలు పైకి గాలిలోకి లేవదీసి]

రంగ:- లెక్క ఎంతో ఇప్పుడు సరిగ్గా చెప్పు సింహాచలం!
[సింహాచలం ముఖానికి రంగడి ముఖం ఎదురుగా వుంది. సింహాచలం ఇప్పుడు అసని కళ్ల గమనించి బిక్కచచ్చిపోయాడు.]

సింహా:- రంగా! నువ్వు!...నువ్వు!...(కంఠంలో వణుకు, భయం)

రంగ:- అవును-నేనే-నిజాన్ని ఇప్పుడిప్పుడే సరిగ్గా చూడడం నేర్చుకుంటున్నాన. చెప్పు-ఎంత డబ్బో సరిగ్గా చెప్పు!

సింహా:- ఇందులో పది వున్నాయి. నాలుగని చెప్పాన. మిగతా ఆరులో నాలుగు నాకు-రెండు నీకు, సరేనా?

రంగ:- (కోపంగా) సింహాచలంగారూ! నిన్ను నమ్ముకున్న వాళ్ళను ఇలా మోసం చేస్తావా?

సింహా:- నమ్మిన వాళ్ళను మోసంచేయకపోతే దాన్ని 'మోసం' అని ఎందు కంటారు? ఇదిగో రంగా! గడిచిపోయిందేదో గడిచిపోయింది. మళ్ళీ ఆ కథను ఎందుకు త్రవ్వుతావు?

రంగ:- నోర్మూయి! గడచిపోయింది కాదురా గాడిదా! నువ్వు సరిగ్గా దారికి రాకపోతే – ఆ కథనే కాదు - నిన్ను నిలువునా త్రవ్వి పాతేస్తాను. చేసే వెధవపని ఎలాగూ చేయించావు దాని ఫలితంకూడా పూర్తిగా పొందనీ...

సింహా:- అమ్మో! తిన్నదంతా కక్కమంటే నాకు శక్యమా?

రంగ:- లేకపోతే గొంతుపట్టుకొని నేనే కక్కిస్తాను. (మెడ పట్టుకొని ముందుకు లాగాడు.)

సింహా:- (ఏడుస్తూ) అమ్మో, నీలాంటివాడు కళ్ల తెరవడం ఈ దేశానికి ఎంత ప్రమాదమో ఇప్పుడర్థమౌతోంది.

రంగ:- ఊ! (కొట్టబోయాడు.)

సింహా:- (గభాల్న ఆ చేయి పట్టుకొని ఆ చేతిలో కొన్ని రూపాయల నోట్లు ఉంచాడు. లోపల్నుంచి పెద్దయ్య 'రంగా' అని పిలిచాడు) ఆ పెద్దయ్యా! మీ రంగడితో లెక్కంతా తేల్చేశాను. వాడింక మీ

సంగతి జాగ్రత్తగా చూసుకుంటాడులే! (రంగడికి కన్నుకొట్టి వెళతాడు.)

ఈవేళ ఒక్కసారి ఆ మహాతల్లికి మొక్కుకొని వెడతాను, తల్లీ! ఆపద్బాంధవీ! జగజ్జననీ! (అంటూ లోపలికి వెళ్ళాడు.)

పె:- (వస్తూ-కరీం వెనకాలే ఉంటాడు) కరీంభాయి! అయినా సింహాచలాన్ని అలా కోప్పడడం మంచిదికాదు. అయిదేళ్ళయి మనల్ని కాపాడుతున్నాడు. మన డబ్బు మనకి-రంగడు ఆపరేషనుకి కావాలంటే నిక్కచ్చిగా లెక్కలు కట్టి ఇచ్చాడు. ఇప్పుడు స్వయంగా అతని నిజాయితీ రంగడు చూశాడు, ఏంరా రంగా?

రంగ:- అవును (పెద్దయ్య అంటున్నప్పుడు సీతకూడా లోపలి నుండి వచ్చింది. ఇంతకుపూర్వం రంగడు విసిరిపారేసిన రొట్టె ఆమె కాలి క్రింద పడితే చేతిలోకి తీసింది. రొట్టిని గుర్తించి తుళ్ళిపడింది. ఇది గమనించాడు రంగడు. కాని ఏమీ మాట్లాడలేదు)

సీత:- పెద్దయ్యా! రంగడు ఒంట్లో బాగుండలేదు. ఈ రోజంతా ఆదోలా వున్నాడు.

పెద్ద:- అయితే రేపు మాట్లాడుకుందాం, ఇంక పడుకో పోరా!

రంగ:- (ఏమీ మాట్లాడడు)

సింహా:- (లోపల్నుండి వస్తూ) ఇక్కడా?

పెద్ద:- ఇంకెక్కడ సింహాచలంగారూ!

సింహా:- ఈ మురికి కాలువ ప్రక్కన - ఈ చెత్తకుండీ దగ్గర పడుకోవాలంటే కాస్త తటపటాయిస్తున్నాడు. ఏంరా రంగా, అంతేనా?

కరీం:- (అప్పటికే వచ్చి వుంటాడు) వెళ్ళంగి... మా రంగడు ఇక్కడే పడేళ్ళున్నాడు, ఇదేం వాడికి కొత్తకాదు.

సింహా:- కళ్ళు లేనప్పుడు తెలీక యీ మురికి కూపంలో బ్రతికాడు. మీతో పాటు ఈ రొంపిలో పడివున్నాడు. కానీ, యీవేళ చూస్తూ చూస్తూ ఎవ్వడా భరించేది? ఏంరా రంగా?

సీత:- సింహాచలంగారూ? మీకు సంబంధంలేని విషయాల్లో కల్పించు కోకండి. మా రంగడు సంగతి మీకు తెలీదు.

సింహా:- ఓసి పిచ్చిదానా! కళ్ళులేని రంగడు గురించే మీకు తెలుసు. కళ్ళున్న మనిషి ఎలా ఆలోచిస్తాడో నాకు బాగా తెలుసు. అందులోనూ మీ రంగడా! హూ! వాడికేం ఖర్మ! కావాలనుకుంటే వూళ్ళో ఎంచక్కటి ఇల్లు తీసుకొని మహారాజులాగ వుంటాడు.

రాజి:- ఇదుగో! సింహాచలం! మా రంగడ్ని మా నుంచి వేరుచేయాలని చూశావో, నీ ప్రాణాలు తోడేస్తాను

సింహా:- వేరుకాక నీతో యీ కళ్ళుకాలువ ప్రక్కన బ్రతకమన్నావా? పోరా జెష్టా!

రాజి:- ఏంట్రా కూశావ్?

(మీదికి వస్తే రంగడు ఆపాడు)

రంగ:- ఆగండి! ఏమిటా దురుసుతనం. పెద్దా చిన్నా లేకుండా? అతను చెప్పింది నిజమే.

సీత:- రంగా!...

రంగ:- నీకు తెలీదు సీతా! ఇంతవరకు నేను చూసింది చెప్పలేక, తెలిసింది దాచుకోలేక గిజగిజలాడుతున్నాను. మీరు ఎలాంటి మురికి బ్రతుకు బ్రతుకుతున్నారో మీకు తెలీదు.

సీత:- (దుఃఖంతో) అవును రంగా! నాకు తెలీదు-తెలుసుకోవాలని లేదు.

రంగ:- కానీ నాకు తెలుసు. ఈ దావ, మురికి పట్టిన కంచాలు...

రాజి:- కానీ నువ్వు అందులోనే ఇన్నాళ్ళూ తిన్నావురా!

రంగ:- అది జ్ఞాపకం చేసుకుంటూ బ్రతకడం మరీ ఘోరం!!

రాజి :- హూ! ఘోరం!!

రంగ:- ఘోరంకాక-ఆ చెత్త కుండీ ప్రక్కన, ఈ మురికి కాలువ ప్రక్కన చూస్తూ నిద్రపోలేను. నే నిక్కడ వుండలేను.

(రాజిగాడు అడ్డబోతే ప్రక్కకు తోసేస్తాడు)

రాజి:- ఒరే రంగా, ఎత్తే ఎల్లరా. నువ్వు ఎక్కడయినా బాగా వుంటే మా కంతే చాలు. ఎల్లరా ఎళ్లు. మేం చూడలేని 'గొప్ప' నిజాన్ని తెలుసుకున్నావు. అలాగే ఎల్లరా-ఎల్లు (ఏడుస్తున్నాడు.)

కరీం:- రంగా! ఎల్లిపోతావా! కళ్ళొచ్చాక మాకు దూరమవుతావా రంగా (రంగడ్ని సింహాచలం లాక్కువెళ్ళాడు) రంగా!! (గట్టిగా అరి చాడు.)

సీత:- (గట్టిగా) రంగా!! (పెద్దయ్యతో) రంగడు ఎల్లిపోతున్నాడు మావా, నువ్వు పిలు మావా!

పెద్ద:- ఎందుకే ఏడుస్తావ్ పిచ్చిదానా! వాడు బాగుపడడం నీ కిష్టం లేదా?

సీత:- అదికాదు మావా! ఇన్నాళ్ళూ అయిదుగురం ఒక శరీరంలో ప్రాణా ల్లాగ మసిలాం. ఇవాళ ఒక పేణం లేచిపోతోంది—పిలు మావా!

పెద్ద:- (నవ్వి) ఎక్కడికి పోతాదే? ఆ దెక్కడున్నా మనవాడే-ఆడు మన గురించే ఆలోచిస్తూ వుంటాడు. ఇప్పుదెళ్ళినా మళ్ళీ మన దగ్గరికే వస్తాదే—ఊరుకోయే...

—లైట్లు ఒక్కసారి ఆరి మళ్ళీ వెలిగాయి—

(లైట్లు వెలిగేసరికి నలుగురూ ఒక్కప్రక్క నిలబడి వున్నారు. వాళ్ళముందు రంగడు వున్నాడు. ఇప్పుడు కొంచెం ఖరీదయిన బట్టలు వేసుకున్నాడు)

రంగ:- బాబూ! నే నెక్కడున్నా వాళ్ళ మనిషినే బాబూ! వాళ్ళ బాగే నా బాగు. ధర్మం చేయండి. దానం చేయండి. కంటి చూపుకైనా నోచుకోని యీ నిర్భాగ్యుల్ని కరుణించండి. మన మధ్య పుట్టికూడా మన అదృష్టానికి నోచుకోని ఈ దీనుల ఆర్తిని తీర్చండి. ధర్మం చేయండి. దానం చేయండి.

(చేయి చాచేడు ఎవరో చేతిలో డబ్బులు వేస్తున్నట్లు Mime చేస్తు న్నాడు. అందరికి తలవంచి నమస్కారం చేస్తున్నాడు...)

(ఈ క్రింది డైలాగులన్నీ చెప్పక్కర లేదు. Mime చెయ్యాలి.)
మీ నీడలో బ్రతకవలసిన వాళ్ళం. ఒక్కపైసా యిచ్చి మా ప్రాణాల్ని కాపాడండి. ఒక్క కన్నీటిబొట్టు మాకోసం కార్చండి. మీ జాలితో, మీ అండతో, మీ కాలిదగ్గర బ్రతకవలసిన వాళ్ళం. మీరు కడుపారా అన్నం తినే క్షణాల్లో పట్టెడు అన్నానికి నోచుకో లేని ఈ దీనుల్ని గుర్తు ఉంచుకోండి-కరుణించండి - కాపాడండి - ఒక్కపైసా-ఒక్కపైసా దానం చేయండి.

(చెయ్యి డబ్బుతో నిండాక జేబుల్లో పోసుకుంటున్నట్లు Mime. రంగడు మాట్లాడుతున్నట్లు పెదాలు కదులుతుంటాయి. శబ్దం రాదు. Mime.)

పెద్ద:- వాడి మాటలు వింటుంటే వాడు 'మన రంగడేనా' అనిపిస్తోంది.

రాజి:- మనం సరైన వాడికే కళ్ళు యిచ్చాం.

కరీం:- నలుగుర్నీ ఆకట్టుకోవడం వాడికి బాగా తెలుసు.

రంగ:- ధర్మం చేయండి. దానం చేయండి. కళ్ళులేక, చేయనినేరానికి శిక్షను అనుభవిస్తున్నట్టున్న ఈ దీనుల్ని రక్షించండి. మీముందు మీ సోదర మానవుడు యిలా బాధపడడం ఈ కర్మభూమిలో చూస్తూ సహించ గలరా? మీరు పుట్టిన గడ్డమీదే పుట్టిన గుడ్డివాళ్ళు వీళ్ళు. కానీ పట్టెడు అన్నానికి నోచుకోలేని నిర్భాగ్యులు. వీరికి పట్టెడు అన్నం పెట్టి, అంతా ఆ భగవంతుడి బిడ్డలని నిరూపించండి. ధర్మం చేయండి—దానం చేయండి.

(అంతా వెళ్ళిపోయినట్టు Mime)

దండాలు బాబు - దేవుడు మీకు మేలు చేస్తాడు.

(రంగడు సంతోషంగా నేలమీద పోకెట్ రుమాలు పరచి, జేబుల్లోంచి డబ్బుతీసి లెక్క పెడుతున్నట్టు Mime.)

రాజి:- ఈవేళ సింహాచలానికి పెద్దపనే. మన డబ్బులు లెక్క పెట్టలేక గింజుకు చావాలి—నాయాల.

రంగ:- సింహాచలం ఇంక రాడు.

కరీం:- ఏం?

రంగ:- ఈవేళే కాదు - మరెప్పుడూ రాడు.

పెద్ద:- అదేంరా!

రంగ:- నేనే రావద్దన్నాను.

రాజీ:- ఎందుకని రంగా?

రంగ:- వాడెందుకు మధ్య! వాడు చేసేపని నేనే చేస్తున్నాను.

కరీం:- అవునవును. అదే మంచిపని. పైవాడి చేతిలో మన డబ్బు పెట్టేకన్నా మనవాడి చేతిలోనే డబ్బు ఉంచడం మంచిది.

రంగ:- ఊ! మీరంతా వెళ్ళి ఆ గుడి దగ్గర వుండండి. నేను వెళ్ళి రొట్టి పట్టుకొస్తాను.

పెద్ద:- పదండిరా.

రంగ:- (డబ్బు జేబులో పోసుకుంటూ) ఇవేళ పాతిక రూపాయలు లాభం. ఇదంతా మన మాటల మహిమ-వాళ్ళదేముంది, గుడ్డినాయాళ్ళు.

(వెళ్ళబోయాడు—సీత రావడం చూసి ఆగిపోయాడు. వాళ్ళు లేచి వెళ్తా)

రాజీ:- పెద్దయ్య మావా, నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు, రంగడ్ని చూస్తూంటే నాకేదో అనుమానంగా వుంది.

కరీం:- అవును పెద్దయ్య మావా—

పెద్ద:- ఒరేయ్-నాకని మనం నమ్ముతున్నాం. మనకు తెలియని వెన్నో వాడికి తెలుస్తాయి. ఏది ఎందుకు చేస్తున్నాడో మనకు తెలియాల్సిన పనిలేదు. వాడు మనవాడు-అది మరచిపోకండి. వాడు లేకపోతే మనం గుడ్డివాళ్ళమేనని మరచిపోకండి. పదండి.

[అంతా వెళ్ళారు.]

రంగ:- (ఇప్పటికి డబ్బు లెక్కించడం అయింది.) ఇవాళ పాతిక రూపాయలు లాభం. ఇదంతా మన మహిమ— వాళ్ళదేముంది, గుడ్డి నాయాళ్లు- (బయలుదేరబోతూంటే సీత ఎదురొచ్చింది)

రంగ:- రొట్టెలు తెచ్చావా?

సీత:- ఓ! యివిగో- ఇస్తూ, వాళ్ళంతా ఏరీ?

రంగ:- యిప్పుడే వెళ్ళారు- ఏం.

సీత:- యీవేళ బాగా ఆకలిగా వుందిరా పదరా రంగా, తొరగావెళ్ళి ఈ రొట్టెలు అందరం కలిసి తిందాం

రంగ:- ఛ ఛ!! నీకీ చచ్చు రొట్టె లెందుకే? కావాలంటే ఫ్రూట్‌సలాడ్ ఇప్పిస్తాను.

సీత:- అదేమిట్రా?

రంగ:- అదో తియ్యటి విందులే!

సీత:- అయితే తీసుకురా, అందరం తిందాం.

రంగ:- పిచ్చిదానా! ఇది నీకే స్పెషల్. మధ్యలో ఆ చవటల కెందుకు?

సీత:- రంగా!

రంగ:- సీతా! ఈ కళ్ళు నాకు లేకపోతే ఎంత నష్టపోయేవాణ్ణో నిన్ను చూస్తే అర్థమౌతుంది. ఈ అందం అంతా నాకు తెలియకుండా వృథా అయిపోయేదేగా! అక్కడే నిలబడ్డావేం సీతా! ఇవిగో రొట్టెలు తీసుకో. నే వెళ్ళి నీ కోసం ఫ్రూట్‌సలాడ్ తీసుకొస్తా.

[సీత తీసుకోబోతే చెయ్యి పట్టుకు లాగాడు]

సీత:- రంగా!

రంగ:- కాస్త బ్రతుకు నేర్చుకోయ్ వెర్రిదానా (అని దగ్గరకు తీసుకోబోయాడు- ఆమె విదిలించుకుంది.)

సీత:- ఛీఛీ! బ్రతుకంటే యిదా? (అని తప్పించుకొని వెళ్ళిపోయింది. రంగడు నవ్వుకొంటున్నాడు.)

(లైట్లు ఆరి- మళ్ళీ వెలిగాయి)

(రంగడు ఈసారి మరీ ఖరీదైన దుస్తుల్లో వున్నాడు. చేతిలో వ్యానిటీ స్టిక్. ఇద్దరు వస్తీవాళ్ళు నిలబడి వున్నారు. కుడిప్రక్కన పెద్దయ్య, రాజిగాడు, చిరామికూడా చూస్తున్నారు - నిస్సహాయంగా.

ఇద్దరు గుడ్డివాళ్లు - ముందు - అంటే రోడ్డు ప్రక్కకు నిలబడి వున్నారు. వాళ్లు నిజానికి గుడ్డివాళ్లు కారు.)

ఖాజా:- బాబుల్లారా! అయ్యల్లారా! అన్నంలేక అలమటించి పోతున్న వాళ్ళం. గుడ్డివాళ్ళం. మమ్మల్ని కాపాడండి. రక్షించండి. మీ కాలిక్రింద చెప్పులనుకొని ఆదరించండి. మీ ఎంగిలి కూడయినా తిని బ్రతకనివ్వండి, మీరు త్రొక్కిన నేలమీదయినా నడవనివ్వండి. ధర్మం చేయండి.

జగ్గు:- బాబూ! ధర్మం!! దానం చేయండి!!!

రంగ:- (బెత్తంతో రెండోవాడి వీపుమీద చరిచి) ఏంరా గాడిదా! నోరు పెగలదా! ప్రొద్దుటే రెండు దోసెలు, టీ త్రాగుతావు. సాయంత్రానికి రెండు రూపాయలు పుచ్చుకుంటావు. వూ! (పొడిచి) అదుగో ఎవరో వస్తున్నారు. కళ్లు ముయ్యి-నోరు తెరువు.

జగ్గు:- బాబుల్లారా! అయ్యల్లారా!
(ఇక్కణ్ణుంచి అతని పెదవులు కదులుతున్నాయి. శబ్దం వినిపించదు. Mime- రంగడు సిగరెట్టు వెలిగించి అందరూ ధర్మం చేయడం చూసి సంతోషిస్తున్నాడు.)

రాజి:- ఏంటి మావా? హాయిగా గౌరవంగా ఏదో దొరికినది తింటూ బ్రతుకుతున్నవాళ్ళం కాళ్ళక్రింద చెప్పులకంటే నీచం చేసేశాడు— రంగడు.

కరీం:- ఇంత చేసినా మనం తినేది చల్దికూడే—తాగేది ఆ గంజినీళ్ళే- ఛీఛీ!

రంగ:- (దగ్గరకువచ్చి) ఒరేయి గుడ్డి రాస్కెల్స్! నోరు మూసుక్కూర్చో లేరూ! ఎవరు వస్తున్నారో, ఎవరు పోతున్నారో తెలియకుండా వాగితే వచ్చేబేరాలు కూడా చెడుతాయి. మీ రెలాగూ వాగలేరని మనుష్యుల్ని కిరాయికి యేర్పాటు చేసుకోవలసి వచ్చింది. డబ్బుకు డబ్బు నష్టం- మీకు పెట్టే తిండీ నష్టం.

పెద్ద:- ఇది అన్యాయంరా!

రంగ:- అవును. మిమ్మల్ని కూచోబెట్టి వృత్తపుణ్యానికి మేపుతుండడం కూడా అన్యాయమే.

రాజి.- కానీ, నిన్నీ వేళ ఈ స్థితికి తీసుకొచ్చింది మేమేరా- మేం కళ్ళు ఇవ్వబట్టి...

రంగ:- నోర్ముయ్ ! సిగ్గులేదూ ఆ మాటలు అనడానికి-మీకు లేని శక్తి నాకు వుంది. పెరిగాను— పెద్దవాణ్ణి అయాను. నేను మంచివాడ్ని కనుక మీకు గంజయినా పోస్తున్నాను. ఇదివరకు - తినేరోజు తినేవాళ్ళు, పస్తున్న రోజు ఉండేవాళ్ళు. ఇవేళ రూఢిగా గంజి నీళ్ళ కయినా నోచుకున్నారు. దానికి సంతోషించండి.

పెద్ద:- మా సంగతి పోనీరా. ఇలా నలుగుర్ని మోసం చేయడం అన్యాయం రంగా!

కరీం:- గుడ్డివాళ్ళ పేరు చెప్పుకొని, వాళ్ల తినడం తప్పురా !

రంగ:- (పగలబడి నవ్వి) తప్పా ? ఈ ప్రపంచాన్ని చూస్తే - అలాంటి చచ్చుకబుర్లు చెప్పకుభాయ్ ! ఆ మాటకొస్తే గాంధిగారి పేరు చెప్పుకొని మన దేశంలో ఎందరు బ్రతకడంలేదు ?

పెద్ద:- రంగా ! నువ్వెంత మారిపోయావురా !

రాజి:- నే చెబితే విన్నావుకాదు. హూ! పద మావా! ఈడితో మనకేం పని. (లేదాడు)

కరీం:- నువ్వు ఎప్పటికయినా బాగుపడతావని ఆశగా వుండేది. కానీ నువ్వింక బాగుపడవురా, బాగుపడవు.

(అందరూ బయటకు నడిచి గుడివైపు వెళుతుంటారు. వాళ్ళను చూస్తూ రంగడు నవ్వుతూంటాడు. ఇప్పుడు 'ఖాజా', 'జగ్గూ' దగ్గరికి వచ్చారు.)

జగ్గూ:- Boos ! భక్తులంతా వెళ్ళిపోయినట్టుంది.

రంగ:- ఒరేయ్! జగ్గూ!! ఇక్కడికి మరొకడొచ్చి బిచ్చమెత్తడానికి వీల్లేదు. ఈ గుడిదగ్గర బిచ్చగాళ్ళను మనం కంట్రాక్టు పాడాం. తెలిసిందా!

జాజా:- కానీ బాస్! పక్కవీధిలో కంట్రాక్టరు—ఆ వీధి బిచ్చగాళ్లను మన వాళ్ళ మధ్య కూర్చోపెడుతున్నాడు. మొన్న ఎదిరిస్తే— 'అట్టే మాట్లాడితే మునిసిపాలిటీవాళ్లతో చెప్పి ఈ వూళ్ళో బిచ్చగాళ్ల బెడద లేకుండా చేస్తాను' అన్నాడు.

రంగ:- ఎవర్రా ఆ అన్నది? అలా అనడానికి ఎన్ని గుండెలు! ఇది మన రాజ్యం, ప్రజారాజ్యం. వాళ్ళు బిచ్చగాళ్ళుగానే బ్రతకనివ్వడానికి మనం ఏం చేయడానికైనా సిద్ధమే. వాళ్ళని ముష్టెత్తుకునేటట్టు చేయడమే మన లక్ష్యం. వాళ్ల కనీసపు హక్కుల రక్షణకు-అంటే వాళ్ల నిరాఘాటంగా ముష్టెత్తుకునేటట్టు చేయడానికి అవసరమైతే కిరాయికి మనుష్యుల్ని పెట్టి నిరాహారదీక్షలు చేద్దాం. హర్తాల్ చేద్దాం. బంద్‌లు చేదాం. బస్సులు తగలబెడదాం - రైళ్లను పడగొడదాం. డబ్బుకు గడ్డికరిచే డబ్బారాయిళ్లచేత సమ్మెలు జరిపిద్దాం. మహోద్ధృతంగా ఉద్యమాలు రెచ్చగొడదాం. ఈ వుద్యమాల్లో అమాయకులు చచ్చిపోయినా, తోబుట్టువులకు మానభంగాలు జరిగినా, మన లక్ష్యానికి తిరుగువుండదు—వుండకూడదు, అవసరమైతే అఖిల భారత ముష్టివాళ్ల సంఘం స్థాపిద్దాం. రాజధానికి రాయబారం వెడదాం. ముష్టివాళ్లకు పార్లమెంటులో ఒక రిజర్వుసీటు కావాలందాం. అనాదిగా వాళ్లను పేడ్డివాళ్లగా ముష్టివాళ్లుగా బ్రతికించే మన హక్కుల్ని మనం పరిరక్షించుకుందాం. అంతకీ సాధ్యంకాకపోతే ముష్టివాళ్లకు 'ప్రత్యేక రాష్ట్రం' కావాలందాం. నీతికి వెన్నెముకలేని ఈ దేశంలో నీచానికి పాల్పడే దరిద్రగొట్టు రచయితలకు డబ్బుతో దరపట్టించి ముష్టివాళ్ల రాష్ట్రానికి వెయ్యేళ్ల మూగచరిత్ర వుందని శతకాలు రాయిద్దాం, కవిగోష్ఠులు పెట్టిద్దాం. గొర్రెల్లా అరిపిద్దాం.

(ఆవేశంలో భయంకరంగా నవ్వుతుంటాడు.)

జగ్గా:-
ఖాజా:- } (ఇద్దరూ) ముష్టివాళ్ళ సంఘానికి జై!

ముష్టివాళ్ల సంఘానికి జై!
(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

రంగ:- (జేబులోంచి బ్రాందీసీసా తీసి చూశాడు. సీత గుర్తొచ్చింది. తనలోతాను 'సీతా' అంటూ బయటకు నడిచాడు)

-లైట్లు ఆరి వెలిగాయి-

(సీత చెత్తను కుండీలో పారెయ్యడానికి వెడ్తోంది)

రంగ:- సీతా! సీతా!! ఓ! నువ్విక్కడే వున్నావా? పూలు తెచ్చానే! పెట్టుకో.

సీత:- హు! గుడ్డిదాన్ని-నా కెందుకు పూలు?

రంగ:- (నవ్వి) ఈ పూలు నీకోసం కాదే! నిన్ను చూసి నలుగురూ ఆనందించడానికి. నువ్వు గుడ్డిదానివి. కానీ లోకం కాదుగా. ఊ! పెట్టుకో. (జడలో పెట్టబోయాడు.)

సీత:- (తాగిన వాసన సీతకు తెలుస్తుంది. పూలు నేలకేసి కొట్టి) ఛీ! నువ్వెంత దిగజారిపోయావురా రంగా!

రంగ:- (నవ్వి) యిది దిగజారడమో, ఎగబ్రాకడమో, నీకేం తెలుసే సీతా! నాకు పదేళ్ళు నీ చేత్తో అన్నం పెట్టావు. ఇప్పుడు నీచేత బంగారం తినిపిస్తాను. రా! నాతోరా. (గట్టిగా లాగుతాడు)

సీత:- (దుఃఖంతో ప్రాధేయపడుతూ) రంగా! దేవాలయం ముందు నిలబడి వున్నాం. ఈ పాపపు ఆలోచనలు మంచివి కావు.

రంగ:- దేవాలయమా! (పగలబడి నవ్వుతాడు) సీతా! ఈవేళో, రేపో, ఆ దేముడితోపాటు-ఈ దేవాలయాన్ని కూడా కొనేయబోతున్నాను-తెలుసా?

సీత:- (నిర్ఘాంతపోయి-తనలో) దేముడ్ని కొనేస్తావా?

రంగ:- అవునే - తప్పేం - ఎవరో ఒక దేముడు మన జేబులో వుండాలిగా. దేముడు మనకు శక్తిని, ముక్తినీ ఇచ్చే రోజులు ఆ ప్రహ్లాదుని

కాలంలోనే పోయాయి. ఈరోజు దేముడికి మనం గుర్తిస్తేనే శక్తి. మనం కల్పిస్తేనే శక్తి. లేకపోతే బూజు పట్టిపోయి గబ్బిలాల పంచన గాఢనిద్ర పోవలసిందే! (గట్టిగా కౌగిలించుకుంటాడు. సీత విదిలించుకొని క్రిందపడిపోయింది)

సీత:- రంగా! -గుడ్డిదాన్ని, నిస్సహాయురాల్ని. నీకు పదేళ్ల తోబుట్టువులాగ సేవలు చేశాను. నన్ను అన్యాయం చేయకు-నీకు దండం పెడతాను.

రంగ:- (వికారంగా నవ్వుతూ సీతను మళ్ళీ గట్టిగా పట్టుకొని, ముద్దుపెట్టుకోబోయాడు.)

సీత:- ఛీ! దూరంగా వుండు. (రంగడ్ని తోసింది. దూరంగా తూలిన రంగడు వేగంగా వచ్చి మళ్ళీ ఆమెను గట్టిగా కౌగలించుకోబోయాడు. చాచి చెంపకాయ కొడుతుంది - ఒక్క క్షణం రంగడు బిత్తరపోయాడు. అంతలోనే నవ్వి - ఆమెను పిట్టలా పట్టుకున్నాడు.)

సీత:- ఛీ! వదులు - వదుల్తావా లేదా! మావా, కరీం! రాజిగా!...
(రంగడు గట్టిగా ఆమె నోరు మూశాడు - మెల్లగా ఆమెను సిమెంటు బల్లమీదకు వంచాడు)

రంగ:- బోనలోవున్న పిల్లిపిల్లా! నీ పంజా చిన్నదే. నన్ను మొండివాణ్ణి, బండవాడినీ చేసినకొద్దీ - నిజంగా - నేను పశువులా ప్రవర్తిస్తాను. (సీతను క్రిందకు త్రోశాడు. ఎడం కాలుతో బలంగా రంగడు ఛాతీ మీద తన్నింది. ఆ తాపుకు రంగడు దూరంగా పడిపోయాడు. సీత గాభరాగా దేవాలయంలోకి పరుగెత్తింది.)

రంగ:- (తేరుకొని - తనలో తాను నవ్వుకొని) ఓహో! నీకు దేవాలయం అంటేనే ఇష్టమన్నమాట. సరే, అలాగే కానీ - (ఒక్క క్షణం గుమ్మం ముందు ఆగి) కళ్లులేని ఆ దేముడు మనం చేసేపనికి ఏం సాక్ష్యం ఇస్తాడే!
(నవ్వుతూ లోపలికి వెళ్ళాడు. ఇద్దరూ ఘర్షణ పడుతున్నారు)

సీత:- రంగా! నన్నొదులు - వదులు - నన్నన్యాయం చేయకు - రంగా! నీకు దణ్ణం పెడతాను-రంగా! నన్ను వదులు.

(రంగడు ఆదేపనిగా నవ్వుతూ ఉంటాడు. ఉన్నట్టుండి సీత 'రంగా' అని గట్టిగా అరిచింది. ఆ వెంటనే రంగడి 'సీతా' అంటూ చావుకేక వినిపించింది - ఒక్క క్షణం నిశ్శబ్దం. కడివైపునుంచి పెద్దయ్య, రాజిగాడు, కరీం పరుగున వచ్చారు.)

పెద్ద:- సీతా ! అమ్మా, సీతా!

కరీం:- సీతా !

రాజి:- సీతా, ఎక్కడున్నావ్-ఏం జరిగిందమ్మా?

(ముగ్గురూ ఒక్కసారే అంటారు)

పెద్దయ్య, రాజి, కరీం:- అమ్మా సీతా!

సీత:- (లోపల్నుండి గభాలున వచ్చి) మావా, (అంటూ ఏడుస్తూ ముగ్గుర్ని ఒక్కసారి కౌగలించుకొని, వాళ్ళ కడుపులో తన తల దాచుకొని ఏడుస్తూ వుంటుంది.)

కరీం:- నీకేం భయంలేదు సీతా! మేమున్నాం-ఏం జరిగిందో చెప్పమ్మా!

సీత:- (ఏడుస్తూ) మావా! రంగడు! రంగ...

(చెప్పలేక ఏడుస్తుంది.)

రాజి:- (సీత జుత్తు విడిపోవడం, జాకెట్టు చినిగిపోవడం గమనించి...) ఆ! ఒరే, రంగా! నీ రక్తం తాగుతాను-నీ కళ్లు పీకేస్తాను-ఒరేయ్! (అంటూ కర్రను నేలమీద కొడుతూ ముందుకు వస్తాడు.)

పెద్ద:- రాజీ! తొందరపడకు. (పట్టుకున్నాడు.)

రాజి:- నన్నొదులు మావా! ఈవేళ వాడి రక్తం కళ్ళజూస్తాను. ఆడి కళ్లు పీకేస్తాను.

(నాలుగు అడుగులు వేసేసరికి, రంగడు లోపల్నుంచి బయటకు వచ్చాడు. ఇంతకుముందు జరిగిన ఘర్షణలో త్రిశూలంతో పొడవడం వల్ల, అది రంగడి కళ్ళల్లోకి గుచ్చుకొని కళ్లు పోయాయి. మనిషంతా రక్తంలో మునిగిపోయాడు. ముఖం రక్త సిక్తమయి వుంది.)

రంగ:- (త్రిశూలాన్ని క్రిందపారేసి - క్రింద పడ్డాడు. మెల్లగా లేస్తూ) నీకా శ్రమ అక్కర్లేదు రాజి-సీతే ఆ పని చేసింది.

పెద్ద:- రంగా!

రంగ:- అవును మావా! మీరంతా కలసి ఇచ్చిన కళ్ళను సీత మూసేసింది.

పెద్ద:- అమ్మా సీతా! ఎంతపని చేశావు తల్లీ!

సీత:- నాకేం తెలీదు మావా! నేనేం చేశానో నాకే తెలీదు.

రంగ:- తెలీకపోయినా చెయ్యాల్సిన పనే చేశావు సీతా! మీరిచ్చిన అర్హతను నిలబెట్టుకోలేకపోయాను—మీ శ్రేయస్సును కాపాడలేకపోయాను-అందుకని, మీ అర్హతను మీరు తీసుకొనే హక్కు మీకు వుంది. మీ రిచ్చిన కళ్ళను మీరే తీసుకున్నారు. నేను వస్తాను. మావా! (వెళ్ళబోయాడు.)

రాజి:- ఒరే రంగా, వద్దురా!

సీత:- రంగా! వెళ్ళకురా (ముగ్గురూ ఒక్కసారే)

కరీం:- రంగా!

పెద్ద:- రంగా! నీమీద మాకేం కోపం లేదురా! నా మాట విను. ఎక్కడికి వెళ్ళకురా! ఇక్కడే వుండరా.

రంగ:- వద్దు—వద్దు!...మావా! నన్ను క్షమించే గొప్పతనం మీకుంది. కానీ దాన్ని భరించే శక్తి నాకు లేదు. వద్దు మావా! నన్ను మీ నుంచి దూరంగా వుండనివ్వండి.

(రంగడు అందర్నీ విడిచి వెళుతుండగా-రాజిగాడు హఠాత్తుగా 'రంగా' అని పిలిచాడు. మెల్లగా దగ్గరకు వచ్చి తన చేతికర్ర రంగడికి సహాయంగా వుంటుందని ఇచ్చాడు. రంగడు-రాజిగాడు భోరున ఏడ్చారు.)

పెద్ద:- ఒరే రంగా! దారి చూచుకొని నడవరా! కాలు జారితే తూలిపడతావు-అక్కడ దీపం వుంది. వెలుగులోకి అడుగెయ్యరా!

రంగ:- అలాగే మావా! అలాగే! నీ మాటలు గుర్తుంచుకుంటాను—తప్పకుండా గుర్తుంచుకుంటాను. (అంటూ బయటకు పోతాడు. మిగతా వారందరూ కొయ్యబారిపోయి నిలబడతారు)

(మెల్లగా తెర జారుతుంది)

